శ్రీ రామాయనమః.



శ్రీమద్వాల్మీకిమహర్షిప్రణీత

# శ్రీమద్రామాయణము.

## అయోధ్యాకాండము.

చెదలవాడ * సుందరరామశాస్త్రులచే

వ్రాయఁబడిన ప్రతిపదాంధ్రటీకా తాత్పర్యవిశేషార్థ

సమన్వితమగు

పరమార్థచంద్రికయనువ్యాఖ్యానముతో

వావిళ్ల * రామస్వామిశాస్త్రులవారిచే

పరిష్కరింపఁబడి ప్రతిమాయుతముగ

ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౮౯౦, సం॥

శ్రీః

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యపదవాక్య ప్రమాణ పారావారపారీణ యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురు పరంపరాప్రాప్తషడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకల నిగమాగమ సారహృదయసాంఖ్య త్రయ ప్రతిపాదక వైదికమార్గప్రవర్తక సర్వతంత్ర స్వతంత్రాది రాజధానీ విద్యానగర మహారాజధానీ కర్ణాటక సింహాసనప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజాధిరాజగురు భూమండలాచార్య ఋశ్యశృంగ పురవరాధీశ్వరతుంగభద్రాతీరవాసి శ్రీమద్విద్యాశంకర పాదపద్మారాధక శ్రీమన్నృసింహభారతీస్వామి గురు కరకమలసంజాత శృంగేరి శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీస్వామి చరణారవిందయోః,

అఖిలావగ్రహ నిగ్రహణావ్యగ్ర సమగ్రబలేన, శ్రీమతాఽనుగ్రహేణ, విజయతేతరామయమ్.

శ్రీరస్తు.

ప్రతిపదాంధ్రటీకావిశేషార్థతాత్పర్య ప్రతిమాదిసహిత

శ్రీమద్రామాయణము.

ప్రధానపోషకులు.

శ్రీమన్మహారాజరాజాధిరాజా శ్రీమహారాజా సాహెబు

మెహర్బాన్ దోస్తాన్ ముష్ఫక్ ఖదరదాన్ కరంపమా

య మొగలీషాన్ మీర్జారాజాది హానరేబిల్ హిజ్ హైనస్స్

మన్నెసుల్తాన్ బహదూర్, కె,సి,ఐ,ఇ,

ఇత్యాద్యనేక బిరుదావళీ విరాజమానులగు

## శ్రీమద్రాజాధిరాజమహారాజ

## శ్రీమద్విజయనగరపట్టణాధీశ్వర

## శ్రీమదానందగజపతిమహారాజులుం

## గారు

రూ (౫౦౦) అయిదువందలురూపాయలువిరాళమిప్పించి

మహాసాహాయ్యముచేసి

ఈగ్రంథమునకుప్రధానపోషకత్వము నంగీకరించిరి.

మంగళమస్తు.

## —(*) పోషకులు (*)—

బ్రహ్మశ్రీ, మహారాజరాజశ్రీ

౧ శ్రీబ్రహ్మానందసరస్వతీస్వాములవారు, యోగానందేశ్వరమఠం, ఎడతొర.
౨ శ్రీరంగస్థలం శ్రీపరాశరభట్టరైన శ్రీమాన్ మహామహోపాధ్యాయ శ్రీరంగరాజభట్టర్ అయ్యంగాలుంగారు.
౩ది, హానరేబిల్, పల్లే, చెంచలరావు పంతులుగారు. సి-ఐ-ఇ.
౪ దివాన్ బహాదర్ పతికి, శ్రీనివాసరావుగారు స్మాల్ కాస్ కోర్టున్ జడ్జి.
౫ సి, జి-కుప్పుసామిఅయ్యర్, బి, ఏ, బి, ఎల్, మద్రాస్ ప్రసిడెన్ సిమ్యాజస్ట్రేట్
౬ వెంబాకం, కృష్ణమాచార్యులుగారు, రిజిష్ట్రార్ ఆఫ్ బుక్సు.
౭ చివుకులరామయ్యగారు. పింషన్ తాశీల్ దార్
౮ చివుకుల, సుబ్బయ్యశాస్త్రులుగారు, విజయనగరంమునసఫ్.
౯ రాజా-దిహానరేబిల్, టి, రామరావుగారు, హైకోర్టున్ వకీల్.
౧౦ సి, వి, సుందరశాస్త్రులగ్గారు, బి, ఏ, బి ఎల్, హైకోర్టున్ వకీల్.
౧౧ రాయబహదూర్-పి, అనంతాచార్యులుగారు, బి, ఎల్, హైకోర్టున్ వకీల్
౧౨ తల్లాప్రగడ, సుబ్బారావుగారు-బి, ఏ బి, ఎల్, హైకోర్టున్ వకీల్.
౧౩ శ్రీరాజా, కావలి-వేంకటపెద్దసీతారామయ్యవారు-జాగీదార్ ఆఫ్ తిన్ననూర్.
౧౪ శ్రీరాజా, కావలి-వేంకటచిన్నసీతారామయ్యవారు, జమీందార్ ఆఫ్ విస్సన్నపేట.
౧౫ సాహుకార్, అంబాశంకరదవేజీవారు.
౧౬ మాడభూషి, విద్వాన్ వేంకటాచార్యులువారు.
౧౭ వి, కే, రంగాచార్యులవారు
౧౮ మందపాటిరామకృష్ణయ్యపంతులువారు.
౧౯ నాగరాజువీరరాఘవరావువారు-నెల్లూరురంగనాయకులపేట.
౨౦ ఆడివి, శ్రీరామపంతులవారు, బి, ఎ, గవర్నర్ మెంట్ సెక్రటేరిఆఫీస్ క్లర్కు.
౨౧ జి, సుబ్బరామయ్యవారు, కొంగనపురంముతాశీ వర్ శంకరిదుగ్గం.
౨౨ జక్కరాజు, లక్ష్మీనారాయణప్పగారు, నంజంపేట, పుంగనూరు.
౨౩ కున్నత్తూరు, తిరువేంగడాచార్యులగారు.
౨౪ నేలటూరు, వెంకటలింగాచార్యులు అయ్యంగారు, పడార్ పల్లెశ్రోత్రియదారులు
౨౫ విశ్వనాథయ్యర్ వారు, బిఎ, బిఎల్ హైకోర్టున్ వకీల్.
౨౬ జిడ్డుపూర్ణయ్యవారు, సబ్ రిజిస్ట్రార్, గుంటూరు.
౨౭ ఘూళిపాటీసుబ్బరాయలుఅయ్యవారు-ఘూళిపాటికృష్ణయ్యవారిఅన్నకుమారులు.
౨౮ కోవి. సుందరరామయ్యవారు-సూపరెంటెండింగ్ ఇంజనియర్సఆఫీస్.
౨౯ కుందవరం-సుందరయ్యవారు
౩౦ పిన్నపాకం సుందరాచార్యులువారు
౩౧ రామచంద్రరావుగారు-అంబూరుపేట ముఠాయిజాదారు గారు, శిఆమూరివద్దతు త్రి
౩౨ పానగంటి, వెంకట్రామానాయనివారు కొమ్మాలపేటజాగీర్ దార్ (కట్టు.
౩౩ మోక్షా, వెంకటాద్రిశాస్త్రులవారు.
౩౪ కొప్పరపు, రామరావుగారు-మునసఫ్.
౩౫ సోమేశ్వరతర్వాడిగారు.
౩౬ ముడియంనాగేశ్వరరావుగారు. వకీలు గుత్తి
౩౭ కలిచెలన్, వెంకటరెడ్డివారు, మదనపల్లె
౩౮ తంబళ్లపల్లె, సుబ్బారెడ్డివారు- మదనపల్లె

౩౯ భొజ్జిరెడ్డివారి సీతారామరెడ్డివారు.
౪౦ శ్రీనివాసరంగాచార్యులవారు, దేవస్థానం సంస్కృతపాఠశాల, తిరుపతి
౪౧ జంగంకోట శ్రీనివాసరావు గారు-
౪౨ నాగేశ్వరయ్యర్ వకీలు తిరుత్తిర పూండి
౪౩ జడ్డు నారాయణయ్యవారు సబ్ కలెక్టరాఫీస్ హెడ్ క్లర్కు
౪౪ వ, సామయ్యవారు-రివిన్యూ ఇనిస్పెక్టర్
౪౫ వంకాయల కృష్ణస్వామిసెట్టివారు
౪౬ నాగేశ్వరశాస్త్రిలవారు, మిడిల్ స్కూల్ హెడ్ మాస్టరు, పుంగనూరు.
౪౭ బాహాల శ్రీనివాసయ్యవారు-తాలూకా కచ్చేరిగుమస్తా, వాయిల్ పాడు-

మహారాజరాజశ్రీ

౪౮ కొల్లా వెంకటకన్నయ్యసెట్టివారు-
౪౯ సాహుకార్, కృష్ణదాస్ బాలముకుంద దాసువారు
౫౦ సాహుకారు చతుర్భుజదాసు కుశాల్ దాస్ వారు-
౫౧ సమ్మర్థి రంగయ్యసెట్టిగారు, బి-ఎ, ప్రొఫెసర్ క్రిస్టియన్ కాలేజ్.
౫౨ పి, కృష్ణస్వామిసెట్టివారు; బి; ఎ; బి; ఎల్ హైకోర్టు వకీలు.
౫౩ అజ్జిషణ్ముఖప్పవారు; ఎమ్మెస్సి ఆఫ్ ఇండియా ప్రెస్
౫౪ తెల్లనాకుల మల్లయ్యసెట్టివారు-
౫౫ విడవలపాటి సుబ్బరామయ్యసెట్టివారు-
౫౬ నాళం; అప్పలరాజువారు-
౫౭ శిరంకోటి లింగంవారు-
౫౮ సూరంపల్లి రెడ్డివారు
౫౯ తాటికొండ నంబెరుమాళ్ సెట్టివారు; బి; ఎ
౬౦ పిట్టి; త్యాగరాయసెట్టివారు-బి, ఎ
౬౧ గోనుగుంట్ల; నారాయణవారు-
౬౨ కామిసెట్టి; చిన్నకొండయ్యసెట్టివారు-
౬౩ శ్రీ రేకం మనవాళయ్యవారు-ఏలూరు సబ్ జడ్జి (యజమానులు-
౬౪ మాంబళం-వెంకటస్వామినాయుడువారు - తంజావూరి రామానాయడి సత్రము
౬౫ పి-రంగయ్యనాయుడువారు- హైకోర్టు వకీల్-
౬౬ బి-బాలయ్యనాయుడువారు-హైకోర్టు-
౬౭ వంకాయల కుప్పయ్యసెట్టివారు-
౬౮ రాయబహదూర్ ఆర్కాడు-ధనకోటిమొదలియార్వారు-మేల్పాకం-జమిందారు
౬౯ బండ్ల రామస్వామినాయుడువారు-వేలూరుడిస్ట్రిక్టు మునసబ్-
౭౦ అల్లత్తూరు-నారాయణసెట్టివారు-
౭౧ పుదుచ్చేరి తిరువేంగడస్వామిపిళ్ల వారు-ఆడిటర్-
౭౨ మణ్ణారుపేట-రామస్వామినాయుడువారు-తంజావూరు రామానాయుడిధర్మం
౭౩ యస్-రామస్వామిమొదలారిగారు-హైకోర్టువకీల్- (మానేజర్-
౭౪ యస్-గోపాలస్వామిమొదలారివారు-మిరాదార్-సేలం.
౭౫ ది-హానరబిల్ శ్రీ రాజా గోడె నారాయణగజపతిరాయనింగారు-విశాఖపట్నం.
౭౬ గ్రంధి-రామయ్యసెట్టివారు-
౭౭ దొడ్డి-యోగప్పగారు-పింఛన్ మున్సఫ్-
౭౮ పి; వి; కృష్ణస్వామిసెట్టివారు బి.ఎ అకౌంటెంటు జనరల్ ఆఫీస్.

౪౯ మధుర-రంగరావువారు-
౫౦ ధర్మపురి-వెంకోబరావువారువకీలు-
౫౧ మండి-శ్రీసరాఫువరదప్పశెట్టిగారు-
౫౨ నంబూరు-సుబ్బారావుగారు-
౫౩ పుదుచ్చేరి-లక్ష్మణస్వామిశెట్టిగారు-
౫౪ పి-సాంబయ్యగారు-నందలూరుమునసపు

—(*) చందాదారులు- (*)—

మహారాజరాజశ్రీ.

సీ-వి-సుందరంశాస్త్రులుగారు-
కోపల్లె-కృష్ణరావుగారు-
ముట్లూరుఆదినారాయణయ్యగారు-
ఆమంచెర్ల-సూరయ్యగారు-
నెమలి-మాడభూషిసుబ్రహ్మణ్యయ్యగారు-
కొప్పరపు-రంగరావుగారు-
పువ్వాడ-సూర్యనారాయణరావుగారు-
ఓడుగు-సుబ్బరామయ్యగారు-
పడకల్-కేశవరావుగారు.
మాచవరం-రామకృష్ణయ్యగారు-
వనంగురుస్వామయ్యగారు-
దేవళ్ల-రామస్వామయ్యగారు-
వి-లక్ష్మణరావుగారు-
ఆ-పరశురామయ్యగారు-
ధూళిపాటి-కృష్ణయ్యగారు-
-సీతాపతయ్యగారు-
-వెంకటకన్నయ్యగారు-
పులుగు-వెంకట్రామయ్యగారు-
ధూళిపాటిసుబ్బరామయ్యగారు-
పేరత్తూరు-శ్రీనివాసాచార్యులుగారు-
దిగపిల్లి-తిమ్మరాజుగారు-
నమంచి-వెంకట్రామయ్యగారు-
పడసాల-సుబ్బరామయ్యగారు-
ఏర్-రాఘవయ్యగారు-
డూరు-వెంకటకన్నయ్యగారు-
ద్దంకి-రఘునాథరావుగారు-
ములుకుట్ల-వెంకటప్పయ్యగారు-
మైసూరువెంకట్రావువారు-
రహభట్ల-అణ్ణాజిరావుగారు-
-అనంతాచార్యులగారు-
ాంబట్లు-లక్ష్మీనరసయ్యగారు-
వుకులజానకీరామయ్యవారు-

మహారాజరాజశ్రీ.

గుండ్లపూడి-రామకృష్ణయ్యగారు-
పేరకుర్తి-సుబ్బరావు-
ముంగమూర్-నరసింహపంతులు-
వెంపటి-వెంకటాచలంపంతులు-
వెన్నలగంటి-హనుమంతరావు-
బ్రహ్మసముద్రం-శేషగిరిరావు-
నెమలి-పట్టాభిరామరావు-
ఎ-త్యాగరాజయ్యగారు-
దేశిరాజు-కృష్ణయ్యగారు-
పరికుంటు-వెంకటసుబ్బారావు-
భోగరాజు-రామచంద్రరావు-
గుడిపాటి-వెంకట్రావు-
గుండావఝుల-రామకృష్ణయ్యగారు.
కోరంకి-రామలింగయ్యగారు-
జైడిపాటి-వీరాస్వామయ్యగారు-
మహంకాళి-సుబ్బరాయలుగారు-
యా-అప్పయ్యపంతులు-
నరసరాజువారు-
వడిగెపల్లి-శేషగ్యాగారు
హుల్లూరువాసుదేవప్పగారు-
మలిరెడ్డికోండ్రాయుడుగారు-
బుర్రాశంకరశాస్త్రులుగారు-
గుండు-గురుస్వామయ్యవారు-
గురుజాడశ్రీరామమూర్తివారు-
ఓరుగంటి-లక్ష్మీనారాయణప్పవారు-
నెడామూరువీరరాఘవాచార్యులు-
కూనపరాజు-శేషాద్రిరావువారు-
రోజుకుర్తి-తిరుమలరావుగారు-
రేవూరులక్ష్మీనరుసుపంతులవారు-
కృత్తివెంటి-కృష్ణమూర్తివారు-
శంకవరంవరదాచార్యులవారు-
నాచేరిరామానుజాచార్యులువారు-

### మహారాజ రాజశ్రీ.

సరిపెల్ల గోపాలకృష్ణమ గారు-
శ్రీపాదం నాగయ్య గారు-
వెంకటేశ్వరరావు గారు-
గొల్లాపిన్ని నరసింహయ్య గారు-
పాలపూడి-శివరామయ్యవారు-
అరుణాచలయ్యగారి సుబ్రహ్మణ్య శాస్త్రులువారు-
కప్పగంతుల సావిత్రి పంతులువారు-
హనుమంతు అప్పళ నాయుడు గారు-
సుబ్బారెడ్డి వారు-జూటూరు తాటిపత్రి
వేలూరు నరసింహం గారు-భీమవరం-
వల్లభ శేషయ్యవారు-తహశీల్‌దారు
శిష్టా సూర్యనారాయణ శాస్త్రులువారు
యన్-రాఘవేంద్రరావు పంతులు గారు- పెషా
వర్ తహశీల్దార్ గుత్తి

### మహారాజ రాజశ్రీ

టి-రామచంద్రరావు గారు డిస్ట్రిక్టు మునసఫ్
నెలూరు
పి-భీమరావు గారు-ఆత్మకూరు కర్నూలు
కొమ్మి లక్ష్మీనరసు నాయుడు గారు-
శంకరప్ప గారు కరణం- గుంతకల్లు
డి-శ్యామరావు గారు-తిరుకోవిలూరు
కొప్పలకొండ నరసప్ప రెడ్డి గారు-
ఉదరపి కొండ దొడ్డన నాయుడు గారు
తాకరాజు సుబ్బన్న గారు-
కరణం తిమప్ప గారు-
కరణం కేశవరాజు వారు-
కరణం రంగప్ప వారు-
పరిగె హనుమంతరావు వారు
బెంగుళూరు-పట్టా సాని-
బళ్లారి-రంగాసాని-

శ్రీరామచంద్రశ్శ్రిత పారిజాతః, సమస్తకల్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకో, నిరంతరం మంగళమాతనోతు.





## ఇటీవల చేరిన పోషకులు.



కొట్టెదీనదయాళునాయుఁడుగారు,తాశీల్ దార్ కులిత్తై-
యస్,రాఘవేంద్రరావుగారు- పింఛిన్ తాశీల్ దార్ గుత్తిరైల్వేస్టేషన్-
అత్తియూరు, శ్రీనివాసాచార్యులుగారు-రాయపురం-
ఆతీ,అప్పడుగారుకురుప్పాంజమీందారిలీగల్ యడ్వైజర్, అండ్ సెక్రటేరి; పార్వతీ(పురం.
ఆమంచర్ల,సూరయ్యగారు.రాయపుర-



## ఇటీవల చేరిన చందాదారులు.



మాద్దం- యతిరాజులునాయుఁడుగారు.
కోటంరాజు, కృష్ణారావుపంతులుగారు.
విజయరాఘవులుశెట్టిగారు.
రామానుజులునాయుఁడుగారు.
మధురకవులయ్యగారు.
జి,కుప్పుసామినాయుఁడుగారు.
మాధవరాజుగారు.
అప్పయ్యశెట్టిగారు.
రామయ్యశెట్టిగారు.
చెదలవాడ, వెంకయ్యగారు. చిత్తూరు-
వెలగపూడి రామయ్యగారు-పేటుపురం-అనంతవరం,యాతముక్కల,నెల్లూరు-
మంగిపూడి- రామశాస్త్రిలుగారు-
కోటంరాజు,సుబ్బరావుపంతులుగారు.
టి,చిదంబరరావుగారు.
పూళ్ల,శేషయ్యగారు.

కూనపరాజు, శేషాద్రిరావుగారు.

నడాదూరు, వీరరాఘవాచార్యులుగారు.

యరగుడిపాటి, అప్పయ్యపంతులుగారు-

రోజుకులీన్, తిరుమలరావుగారు.

వడల, కచ్ఛపేశ్వరయ్యగారు-

కంది, వెంకట్రావుపంతులుగారు-

సాళ్వపంతుల, సీతాపతిరావుగారు-

వరగంటి, రామరావుగారు-

ఓరుగంటి, లక్ష్మీనరసుపంతులుగారు.

యన్-వి-బాలకృష్ణమ్మ, డిస్ట్రిక్టుఅండుసన్‌కోర్టున్‌పేటబరంపురంగంజాం-

రాళ్లపల్లి, లక్ష్మీనరసింహయ్యగారు, రివిన్యూయిన్‌స్పెక్టర్-

దుత్తలూరు, చెంచయ్యగారు, కరణం

ఎనమండ్రము, సూరయ్యగారు- మదనపల్లె-

వీరిసహాయముతో
శాలివాహనశకము ౧౮౦౯ వదగుసర్వజిన్నామసంవత్సరము
జ్యేష్ఠశుద్ధపూర్ణిమాభానువారము ప్రారంభమైన శ్రీరా
మాయణమునందు- వికృతినామ సంవత్సరజ్యేష్ఠ
శుద్ధ౧౩ భానువారము అయోధ్యాకాండ
సంపూర్ణంబయ్యె,



శ్రీ

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

## అయోధ్యాకాండ విషయసూచిక.

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య. విషయములు.

| సర్గసంఖ్య. | విషయములు. |
|---|---|
| ,, | రాజస్త్రీలందరుకైకేయిని నిందించుచుబాహువులచే వక్షస్థలంబున మోదుకొనుచువిలపించుట. |
| ౬౭ | మరునాడుప్రాతఃకాలంబునమార్కండేయమౌద్గల్యవామదేవులు మొదలుగాగలదశరథునిఋత్విజులు రాజసభకువచ్చివసిష్ఠునెదుట దేశమునకరాజకతచేఁ గల్గుదోషంబులను సవిస్తరంబుగా నభివర్ణించి భరతునిరావింపుమనిప్రార్థించుట. |
| ౬౮ | వసిష్ఠునిచే పంపఁబడినదూతలుభరతుందోడ్తెచ్చుటకై కేకయ నగరంబునకుంబోవుట. |
| ౬౯ | కేకయనగరంబున భరతుఁడురాత్రికాలంబున దనకుసంభవించిన దుస్స్వప్నమునుప్రాతఃకాలమునందుతనస్నేహితులకుంజెప్పుట. |
| ౭౦ | అప్పుడేదూతలువచ్చివసిష్ఠాజ్ఞనువిన్నవింప భరతుండుమాతులమాతామహులకుంజెప్పివారుతనకొసంగిన నానావిధగజతురగ సేనాధనాదులంగూడి అయోధ్యకుఁబోవుట. |
| ౭౧ | భరతుండు మార్గంబున నానానదీనగరాదుల నతిక్రమించి నిలువక యేడురాత్రులుప్రయాణముచేసి అయోధ్యంబ్రవేశించి అందలిశోకంబునుచూచిక్షుభితమనస్కుండై తండ్రియింటికింబోవుట. |
| ౭౨ | భరతుండు తండ్రియింటందండ్రిని కానక కైకేయియొద్దకుబోయి నమస్కరించి పితృవృత్తాంతంబునడుగనాబిడశరథుమరణంబునురామవివాసనంబునుంజెప్పి రాజ్యంబునంగీకరింపుమనుట. |
| ౭౩ | భరతుండుతండ్రిమరణంబునుఅన్నవనంబునకుబోవుటయునువినిపరమదుఃఖంబునొందికైకేయినినిందించి కౌసల్యకుంగలిగినమహాదుఃఖముందలపోసి దుఃఖాతిశయంబునమూర్ఛిల్లుట. |
| ౭౪ | ... ... ... ... ... |
| ౭౫ | భరతశత్రుఘ్నులుకౌసల్యం జూచుట. |
| | భరతుండు కౌసల్యకుదనయందునమ్మకముగల్గుటకై శపథము గావించుట. |
| ౭౬ | భరతుండు వసిష్ఠునిప్రేరణంబునదశరథునకుసంస్కారముగావించుట |

సర్గసంఖ్య. విషయములు.

సర్గసంఖ్య. విషయములు.

౧౧౯ రాముండు, ఆరాత్రియంతయునత్ర్యాశ్రమంబుననెయుండి, ప్రాతఃకాలంబునలేచి, కాల్యకరణీయంబులందీర్చికొని, ఋషులుచూపిన మార్గంబున, దండకారణ్యంబునకుంబోవుట.

అయోధ్యాకాండవిషయసూచి,

సమాప్తము.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

మంగళమస్తు.



శ్రీరామాయనమః.



శ్రీలక్ష్మణస్వామి. శ్రీరామస్వామి. శ్రీసీతాదేవి.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.

శ్రీరామజయోస్తు.

## శ్రీ రా మా య ణ వై భ వం.

శ్రీమద్బ్రహ్మత దేవబీజమమలం యస్యాబ్ధిరశ్చిన్మయః
కాండైస్సప్తభిరన్వితోఽతివితతో ఋష్యాలవాలోదితః
పత్రైశ్చత్వసహస్రకైస్సువిలస చ్ఛాఖాశతైఃపఞ్చభి
శ్చాత్మప్రాప్తిఫలప్రదోవిజయతే రామాయణస్వర్తరుః. ౧
యఃకర్ణాంజలిసంపుటైరహరహ స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకేర్వదనారవిందగళితం రామాయణాఖ్యంమధు. ౨

జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారంసవిహాయగచ్ఛతిపుమా న్విష్ణోఃపదంశాశ్వతమ్
వాల్మీకి గిరిసంభూతా రామాంభోనిధిసంగతా
శ్రీమద్రామాయణీగంగా పునాతు భువనత్రయం. ౩
ఉమాసంహితాయాం ధర్మరాజంప్రతిబృహస్పత్యుక్తిః.
శ్రీరామప్రాతిపదిక మవశేనాపి సంగృణన్
ముక్తిం ప్రాప్నోతి మనుజః కింపున ర్బుద్ధిపూర్వకం. ౪
రాశబ్దో చ్చారణాదేవ పాతకా దేహపఞ్జరాత్
ర్యాన్త్యాయాన్తి పాపాని మవర్ణా దర్శనాత్పునః. ౫
రాశబ్దో చ్చారణే జాతే వక్త్రాత్పాపం వినచ్ఛతి
మకారశ్రవణే జాతే భస్మీభావం గమిష్యతి. ౬
అత్రైవతృతీయాధ్యాయేఉమాంప్రతిశివోక్తిః.
రామేతి రామచంద్రేతి రామభద్రేతివా మనుం
యావజ్జీవం జపన్మర్త్యో జీవన్ముక్తో నసంశయః. ౭
రామాయణస్య మాహాత్మ్యం వక్తుం వర్షశతైరపి
అశక్యం విస్తరాద్వక్తుం సంక్షేపా ద్వచ్మిసాం ప్రతం. ౮
రామాయణస్య వాక్యంవా పాదంవా పదమేవవా. ౯
భక్త్యైన్తేతు ప్రయుంజానో బ్రహ్మభూయాయ కల్పతే
రామాయణ కథా మేవ మేశృణ్వంతి నరోత్తమాః
విధూతపాపా స్తేయాన్తి బ్రహ్మలోక మనామయం. ౧౦
తత్వసంగ్రహరామాయణే - ఉత్తరకాణ్డే
ఏకవింశత్సర్గే ద్వావింశ శ్లోకః.
సంసార తాపయుక్తానాం జన్తూనాం హతచేతసాం
శ్రీమద్రామాయణాఖ్యాన పీయూషం భేషజంస్మృతం. ౧౧

శ్రీరామాయణాయోధ్యాకాణ్డఫలశ్రుతిః.

ఉమాసంహితాయాం.

పట్టాభిషేక సంభారా న్వసిష్ఠేన ప్రచోదితాన్
శృణ్వ న్మహీపతి ర్భూత్వా స్థిరం రాజ్య మవాప్నుయాత్. ౩౫
తురీయవర్ణకమిదం బ్రహ్మావిష్ణుశివాత్మకం
శృణ్వతాం సర్వపాపఘ్నం సంసారభయ నాశనం. ౩౬
వన వాసస్య సంఖ్యాయె త్యత్ర పంచమ వర్ణకం
గాయత్ర్యా మానవ శ్శ్రుత్వా సూర్యద్వారా త్పరంవ్రజేత్. ౩౭
రాజా సత్యంచ ధర్మశ్చే త్యత్ర షష్ఠాక్షరం బుధః
శ్రుత్వా దేవా న్సమాప్నోతి రాఘవస్య సరూపతాం. ౩౮
నిరీక్ష్య సముహూర్తంత్వి త్యత్ర దేవ్యాస్తు సప్తమం
వర్ణం శ్రుత్వాధూతపాపో రామసాయుజ్య మాప్నుయాత్. ౩౯
రామః కృతార్థం భరతం సమాశ్వాసయ దాత్మవాన్
ఇత్యాది శ్రవణా త్పుంసాం వైరాగ్యం జాయతే భృశం. ౪౦
రఘు నాధస్య మాతుశ్చ భరతస్య సుభాషితం
శృణ్వతాం సర్వకార్యాణి సిధ్యం త్యేవనసంశయః. ౪౧
రఘునాధ ప్రసాదేన రామసాయుజ్య మాప్నుయాత్
అత్రేశ్చ దర్శనం పశ్చా దన సూయాభి దర్శనం. ౪౨
అనసూయా ప్రణామంచ పాతి వ్రత్యస్తుతింతథా
సీతా కల్యాణసంప్రశ్న మంగ రాగస్య చార్పణం. ౪౩
శ్రుత్వాకన్యా సదా భర్త్రా రమతే రుంధతీయథా
సాకేత కాణ్డస్య ఫలం వక్తుంవర్షాయుతైరపి. ౪౪
నశక్యతే మహాదేవి క్వచి త్కించిత్ప్ర వచ్మ్యహం
అయోధ్యా కాణ్డ మఖిలం యేశృణ్వ న్తి నరోత్తమాః. ౪౫
తేసర్వే హరి సాయుజ్యం ప్రాప్నువ న్తి నసంశయః

ఇత్యయోధ్యాకాణ్డఫలశ్రుతిస్సమాప్తా.

శ్రీమదాంజనేయాయనమః.



ఆంజనేయులు

అథాంజనేయస్తోత్రప్రారంభః.

౧ శృణుదేవి ప్రవక్ష్యామి స్తోత్రం సర్వభయాపహమ్
సర్వకామ ప్రదం నౄణాం హనూమత్ స్తోత్రముత్తమమ్
౨ తప్తకాంచన సహాకాశం నానారత్న విభూషితమ్
ఉద్యద్బాలార్క వదనం త్రిణేత్రం కుండలోజ్జ్వలమ్.
౩ మౌఞ్జీకౌపీన సంయుక్తం హేమయజ్ఞోపవీతినమ్
పింగళాక్షం మహాకాయం టఙ్కశైలేన్ద్ర ధారిణమ్.
౪ శిఖానిక్షిప్త వాలాగ్రం మేరుశైలాగ్ర సంస్థితమ్
మూర్తిత్రయాత్మకం పీనం మహావీరం మహాహనుమ్
౫ హనూమంతం వాయుపుత్రం నమామి బ్రహ్మచారిణమ్
త్రిమూర్త్యాత్మక మాత్మస్థం జపాకుసుమ సన్నిభమ్.
౬ నానాభూషణ సంయుక్త మాంజనేయం నమామ్యహమ్
పఞ్చాక్షర స్థితందేవం నీలనీరద సన్నిభం.
౭ పూజితం సర్వదేవైశ్చ రాక్షసాన్తం నమామ్యహం
అచలద్యుతి సహాకాశం సర్వాలఙ్కార భూషితం

౮ షడక్షరస్థితం దేవం నమామి కపినాయకం
తప్తస్వర్ణమయం దేవం హరిద్రాభం సురార్చితం.
౯ సున్దరం సాబ్జనయనం త్రినేత్రం తం నమామ్యహం
అష్టాక్షరాధిపం దేవం హీరవర్ణ సముజ్జ్వలం.
౧౦ నమామి జనతా వంద్యం లఙ్కాప్రాసాదభంజనం
అతసీపుష్ప సఙ్కాశం దశవర్ణాత్మకం విభుం.
౧౧ జటాధరం చతుర్బాహుం నమామి కపినాయకం
ద్వాదశాక్షర మన్త్రస్య నాయకం కున్తధారిణం.
౧౨ అఙ్కుశఞ్చ దధానఞ్చ కపివీరం నమామ్యహం
త్రయోదశాక్షరయుతం సీతాదుఃఖ నివారణం.
౧౩ పీతవర్ణం లసత్కాయం భజే సుగ్రీవమన్త్రిణం
మాలామన్త్రాత్మకం దేవం చిత్రవర్ణం చతుర్భుజం.
౧౪ పాశాఙ్కుశాభయకరం ధృతటఙ్కం నమామ్యహం
సురాసుర గణైస్సర్వై స్సంస్తుతం ప్రణమామ్యహం.
౧౫ ఏవంధ్యాయేన్నరోనిత్యం సర్వపాపైః ప్రముచ్యతే
ప్రయాతి చిన్తితం కార్యం శీఘ్రమేవ నసంశయః.
౧౬ అష్టమ్యాంవా చతుర్దశ్యాం మర్కవారే విశేషతః
సన్ధ్యాపూజాం ప్రకుర్వీత ద్వాదశ్యాఞ్చ విశేషతః.
౧౭ అర్కమూలేన కుర్వీత హనుమత్ప్రతిమాం సుధీః
పూజయేత్తత్ర విద్వాన్యో రక్తవస్త్రేణ వేష్టయేత్.
౧౮ బ్రాహ్మణాన్భోజయేత్పశ్చాత్తత్ప్రీత్యై సర్వకామదాః
యఃకరోతి నరోభక్త్యా పూజాం హనుమతస్సుధీః.
౧౯ నశస్త్రభయమాప్నోతి భయంవాప్యన్తరిక్షజం
అక్షాదిరాక్షస హరం దశకణ్ఠదర్ప
నిర్మూలనం రఘువరాంఘ్రిసరోజభక్తం

సీతావిషహ్యా ఘనదుఃఖ నివారకం తం
వాయోస్సుతం గళిత భాను మహాం నమామి.

౨౦ మాం పశ్యపశ్య హనుమన్ నిజదృష్టిపాతైః
మాంరక్షరక్ష పరితో రిపుదుఃఖపుంజాత్
వశ్యాం కురుత్రిజగతీం వసుధాధిపానాం
మే దేహిదేహి మహతీంవసుధాం శ్రియంచ.

౨౧ ఆపద్భ్యో రక్ష సర్వత్ర ఆంజనేయ నమోస్తుతే
బన్ధనం ఛేదయాజస్రం కపివీర నమోస్తుతే.

౨౨ దుష్టరోగాన్ హనహన రామదూత నమోస్తుతే
ఉచ్చాటయ రిపూన్సర్వా న్మోహనం కురు భూభుజాం.

౨౩ విద్వేషిణో మారయత్వం త్రిమూర్త్యాత్మక సర్వదా
సఞ్జీవపర్వతోద్ధార మనోదుఃఖం నివారయ.

౨౪ ఘోరానుపద్రవాన్ సర్వా న్నాశయాక్షాసురాన్తక
ఏవం స్తుత్వా హనూమన్తం నర శ్శ్రద్ధాసమన్వితః.

౨౫ పుత్ర పౌత్రాదిసహితస్సర్వసౌఖ్య మవాప్నుయాత్.

ఇత్యుమాసంహితాయాం, ఆంజనేయ
స్తోత్రంసమ్పూర్ణం.



శ్రీరామాయనమః.

# శ్రీమద్రామాయణ పారాయణారంభక్రమః.

సద్గురు సకాశాల్లబ్ధోపదేశో వక్ష్యమాణరీత్యా శ్రీరామాయణ పారాయణంకుర్యాత్ - దేశకాలౌసంకీర్త్య;—

అస్యశ్రీరామాయణమహామంత్రస్య; వాల్మీకిర్భగవాన్ ఋషిః; అనుష్టుప్ఛందః; శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రో దేవతా; రాం బీజం; శ్రీం శక్తిః; మం కీలకం; మమ శ్రీసీతాలక్ష్మణభరత శత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్ర ప్రసాదసిద్ధ్యర్థే పారాయణజపేవినియోగః; రాం అంగుష్ఠాభ్యాన్నమః; రీం తర్జనీభ్యాం స్వాహా; రూం మధ్యమాభ్యాంవషట్; రైం అనామికాభ్యాంహుం; రౌం కనిష్ఠికాభ్యాంవౌషట్; రః కరతలకరపృష్ఠాభ్యాంఫట్; రాంహృదయాయనమః; రీం శిరసేస్వాహా; రూం శిఖాయై వషట్; రైం కవచాయహుం; రౌం నేత్రత్రయాయవౌషట్; రః అస్త్రాయఫట్; లోకత్రయేణ దిగ్బంధః.

## ధ్యానం.

కాలాంభోధర కాంతికాంత మనిశం వీరాసనా ధ్యాసినం,
ముద్రాంజ్ఞానమయీందధాన మపరంహస్తాంబుజం జానుని;
సీతాంపార్శ్వగతాంసరోరుహకరాంవిద్యున్నిభాంరాఘవం,
పశ్యంతం మకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగంభజే.

## అథమానసికపూజా.

లం పృథివ్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణేగంధం సమర్పయామి - హం ఆకాశాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణే పుష్పం సమర్పయామి - యం వాయ్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే ధూపమాఘ్రాపయామి - రం అగ్న్యాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణేదీపందర్శయామి - వం అమృతాత్మనే శ్రీరామచంద్ర పరబ్రహ్మణేఅమృతోపహారం సమర్పయామి-

సం సర్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే సర్వోపచారపూజా స్సమర్పయామి - ఇతిమానసికపూజా.

మూలమంత్రః.

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది
పౌరుషేచాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్.

ఇతి యథాశక్తిజపిత్వా, శ్రీరామాయణపారాయణం కుర్యాత్. అనంతరం,పునః, ధ్యానం,మానసికపూజాం, హృదయాదిన్యాసంచ కుర్యాత్ - లోకత్రమేణదిగ్విమోకః.

గుహ్యాతిగుహ్య గోప్తాత్వం గృహాణాస్మత్కృతం జపం
సిద్ధి ర్భవతు మే దేవ త్వత్ప్రసాదా ద్రఘూద్వహ.
ఇతిపారాయణం శ్రీరామచంద్రాయ సమర్పయేత్.

శ్రీరామచంద్రార్పణమస్తు.
















## శ్రీగురుభ్యోనమః

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

---

### దేవతాప్రార్థనా.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః

### వాల్మీకిప్రార్థనా.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్

ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలం.
వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః
శృణ్వన్రామకథానాదం కోనయాతి పరాంగతిం.

ఆంజనేయప్రార్థనా.

అంజనానందనం వీరం జానకీశోకనాశనం
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరం.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం
రామాయణ మహామాలా రత్నం వందేఽ నిలాత్మజం.
మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసానమామి.

శ్రీరామాయణప్రశంసా.

శ్రీమద్బ్రహ్మతదేవబీజమమలం యస్యాబుధైరశ్చిన్మయః,
కాండైస్సప్తభిరన్వితోతివితతో బుష్యాలవాలోదితః;
పత్రైస్సత్త్వసహస్రకైస్సువిలస చ్ఛాఖాశతైః పక్షిభి,
శ్చాత్మప్రాప్తిఫలప్రదోవిజయతే రామాయణస్వస్తరుః.
యఃకర్ణాంజలిసంపుటైరహరహ స్సమ్యక్పిబత్యాదరా,
ద్వాల్మీకేర్వదనారవిందగళితం రామాయణాఖ్యంమధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారంసవిహాయ గచ్ఛతి పుమా న్విష్ణోఃపదంశాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా
శ్రీమద్రామాయణీగంగా పునాతు భువనత్రయం,



శ్రీః

రామాయనమః.

# అయోధ్యాకాండప్రారంభః.



గచ్ఛతా మాతులకులం భరతేన తదాఽనఘః
శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః. ౧

టీక॥ మాతులకులం = మేనమామ యింటినిగూర్చి; గచ్ఛతా = పోవుచున్న; భరతేన=భరతునిచేత; తదా=అప్పుడు; అనఘః = పాపములేనివాఁడును; నిత్యశత్రుఘ్నః=ఎల్లప్పుడును శత్రువులంజంపువాఁడునగు; శత్రుఘ్నః=శత్రుఘ్నుండు; ప్రీతిపురస్కృతః= స్నేహమునేముందిడుకొనఁ బడినవాఁడై; స్నేహముచేఁ బ్రేరేపింపఁ బడినవాఁడై యనుట; నీతః=కొనిపోఁబడినాఁడు.

భరతుండు, మాతులగృహంబునకుఁబోవుచు, నపుడు, నిష్పాపుండునునెల్లప్పుడుంబగతురఁజంపు వాఁడునగు శత్రుఘ్నునిం బిలువఁగా, నతండు, స్నేహంబుగలవాఁడుకావున నతని వెంబడించిపోయెను. అని, తాత్పర్యము.

విశేషార్థములు.—బాలకాండమందు, "ఏతస్మిన్నంతరే విష్ణుం" ఇత్యాదిశ్లోకములచేత, జగత్తునకుం గారణంబగుటచెప్పఁబడినది; "అహంవేద్మి మహాత్మానం" మున్నగుశ్లోకంబులచేత, పురుషసూక్తమందుఁజెప్పఁబడినమహాపురుషత్వముచెప్పఁబడినది; "త్వమనాదిరనిర్దేశ్యః" మొదలయినవానిచేత, నప్రమేయత్వంబువచింపఁబడినది; ఇట్లు, సర్వోత్కృష్టత్వము, చెప్పఁబడినది. "అధికమ్మేనిరేవిష్ణుం" ఇత్యాదులచేత, ఇతరదేవతలకు సర్వోత్కృష్టత్వము లేదనుటయుఁజెప్పఁబడినది. (ఇది, గోవిందరాజులయభిప్రాయము. అప్పయదీక్షితులుమాత్రము, "అధికంమేనిరేవిష్ణుం దేవాస్సర్షిగణాస్తదా" (అప్పుడు, దేవతలును, ఋషులును, శివునికన్నవిష్ణునినధికునింగాఁదలంచిరి) అనుమొదలైనభాగము, అధికకోపసంయుక్తుఁడగు పరశురామునిచేఁజెప్పఁబడినది, కావున, వాల్మీకియ






భిప్రాయముకాదు; మఱియు, రామునిచేవిఱువంబడిన, శైవధనువుకన్న నుదనచేతనుండు వైష్ణవధనువు గొప్పదియనినిరూపించుటకైయును , రామునిసర్వోత్కృష్టత్వము, నజ్ఞానంబునంజేసి, కనుంగొనంజాలక, తనపరాక్రమంబుకన్నరాముని పరాక్రమంబు తక్కువయనితానుదలంచినట్లు,ఎల్లరకుంజెప్పుటకైయును, శైవధనువును మాత్రము వంచి విఱుచుటచేత , రాముండతిపరాక్రమశాలియని యెంతమాత్రము , నొప్పందగదనియును , అట్లు , తనచేతనుండు వైష్ణవధనువును , ఆరోపించెనేని , రాముండు , తానుజేయుద్వంద్వయుద్ధమునందుం బ్రతియోధకాండగును , గాని , లేనిచోండనకుండకుక్కవయినవాండనియును, నిరూపించుటకైయును, రాముండు శైవధనువునువిఱిచినవాండయ్యును, అట్లువైష్ణవధనువునుంగూడనారోపింపంగలండని సంభావించుటకవకాశంబు లేదనియును,ఎంతప్రయాసపడినను, రాముండు, ఈవైష్ణవధనువునారోపింపంజాలండనియును,సయుక్తికంబుగానిర్ణయించుటకైయును, అహంకారియును మత్సరియునగుపరశురామునిచే జెప్పంబడుటంజేసి, యెంతమాత్రమును ప్రమాణంబుకాదు. రామునిసర్వోత్కృష్టత్వాదులంబరశురాముండెఱుంగకచెప్పినాండనుటకు, అతం,డట్లు, మొదటనతివిజృంభితంబుగాందిరస్కరించి, యావలరామునిచేజయింపంబడినవెనుక, రామునింబ్రస్తుతించుటయేహేతువు ; ఇందువలనం, బరశురాముండెప్పటికిందగినట్లప్పటికి"తప్పొఒప్పొ" సమయోచితంబులగుమాటలాడు వాండని తెలియవచ్చుచున్నదగుటంజేసి , యతనికాప్తత్వంబె లేదు మఱియు,రాముండె , యచ్చటచ్చట;శివోత్కర్షణంబు, సూచించుటంజేసిరామాపేక్షనైనను,బరశురాముండప్రామాణికుండనితెల్లంబు,కావున,నతండుచెప్పినందువలననె, యదిప్రమాణంబనిచెప్పనలవికాదు.అని,వచించిరి)

ఇప్పుడయోధ్యా కాండమునందు, "రాముండనిందితంబులగుసమస్తకల్యాణగుణంబులునుగలవాం"డనిచెప్పంబడుచున్నది;లేక;ఇకవక్ష్యమాణంబగు రామాదికుమారులు చేసినధర్మానుష్ఠానంబునకుపయోగకంబులగు , మహాకులమునందుంబుట్టుటయు,గురువునొద్దనస్త్రసంగ్రహంబునేయుటయుం, దాటకాదులంజంపుటయు,శివధనువువిఱుచుటయు,ధర్మపత్నులంబరిగ్రహించుటయు,మొదలుంగాంగలవి బాలకాండంబు




స ౧

నంజెప్పఁబడినవి. అయోధ్యాకాండమునందు,వారలచేననుష్ఠింపఁబడిన, పితృవచనపాలనాదిధర్మములు, చెప్పఁబడుచున్నవి. "బాలకాండమందు,సీతావివాహంబుచెప్పఁబడినదగుటంజేసి, లక్ష్మీయోగంబుఁజెప్పఁబడినది ; ఇప్పుడు భూయోగంబుచెప్పఁబడుచున్నది" యనియునుకొందఱుచెప్పెదరు. పూర్వము,"సర్వోత్కృష్టత్వము చెప్పఁబడినది;ఇప్పుడు, "అందఱకునుసులభుండని చెప్పఁబడుచున్నది" అనిమఱికొందఱు జెప్పుచున్నారు.పూర్వము, లక్ష్మితోఁగూడిన ప్రాప్యుండగువిష్ణువుస్వరూపంబునిరూపింపఁబడినది;ఇప్పుడు, పొందునట్టిజీవుని స్వరూపంబునిరూపింపఁబడుచున్నది.అందు, మొదట, నతిరహస్యంబును, ముఖ్యము నెఱుంగందగినదియును,సులభమార్గంబునగు,భాగవతులయందుంచవలసినభక్తిరీతిని, శత్రుఘ్నుఁడనుష్ఠించినదానిని వర్ణించువ్యాజంబునఁ జెప్పుచున్నాఁడు.— మాతులకులం = మేనమామయింటినిగూర్చి ; (ఈద్వితీయచే, భరతునకు గమ్యస్థానమయినదే, శత్రుఘ్నునకును గమ్యస్థానమనిసూచింపఁబడుటంజేసి, భాగవతుండేదిగోరునో దానినే గోరుటయనునది లక్షణంబుగాఁగలభాగవతపారతంత్ర్యముచెప్పఁబడినది;) గచ్ఛతా=పోవుచున్న, అనివర్తమాన కాలంబుప్రయోగింపఁబడుటవలన, భరతుండుపోవుటయును,శత్రుఘ్నుండుపోవుటయు నేకకాలంబునంగలిగినవగుటంజేసి, భరతుండుపోవునపుడు,అతనిమొలనుండువస్త్రాదులు, ఎంతమాత్రమువ్యవధానములేక,అతనితోఁబోవునట్లు, శత్రుఘ్నుండునుబోయెనని తెలియ వచ్చుటవలన, మొలనుండువస్త్రమునకుంబోలెశత్రుఘ్నునకుం బారతంత్ర్యముండినదని,సూచింపఁబడినది;భరతేన = రాముండునులక్ష్మణుండును వనంబునకుఁబోఁగాదశరథుండు మృతుండు కాఁగా, రాజ్యమునుభరించుటచేతభరతుండనంబడెను, అట్టి భరతునిచేత ; తదా=అప్పుడు.అనఁగా, భరతుండుపోవునప్పుడే,దీనిచేత, తనకనుకూల మయినచంద్రతారాదిబలమునుగూడనపేక్షింపక పోయెనని చెప్పుటచే, శత్రుఘ్నునిభాగవతపారతంత్ర్యమువిశేషితమయినది. అనఘః=పాపములేనివాఁడు ను;ఇచ్చట, పాపమనఁగా,భరతునతిక్రమించిరామునియందుంచుభక్తి, శత్రుఘ్నునకు,భరతునియందలి గౌరవంబుననె రామభక్తియుగల్గుటంజేసి,భరతునివిడిచి రామునియందుఁజేయుభక్తి అ

స ౧

తనకిష్టావహముకాదు , కావుననతనికిఁబాపమే;అట్లు, ఇష్టావహముకానిసుకృతంబును ముముక్షువునకుఁబాపంబుగా వేదంబునందుఁజెప్పఁబడినది; అట్టి పాపములేనివాఁడును,అనుటవలన, రామభక్తికన్న,భరతభక్తియె యతనికధికంబని తెలియుటంజేసి, భాగవతపారతంత్ర్యంబుమఱియువిశేషితం బయినది.నిత్యశత్రుఘ్నః=నిత్యశత్రువులు ఇంద్రియములు,వానింజంపువాఁడును, ఇంద్రియనిగ్రహముగలవాఁడుననుట ; శత్రుఘ్నః=శత్రుఘ్నుండు;ప్రీతిపురస్కృతః=స్నేహమునేముందిడఁబడిన వాఁడై,కనిష్ఠుండు జ్యేష్ఠానువర్తనమును జేయవలయుననువిధిపరతంత్రుండై, పోఁడయ్యె, స్నేహముచేఁ బ్రేరింపఁబడిన వాఁడైయతనివిడిచియుండంజాలక పోయెనుఅనుట;నీతః = కొనిపోఁబడినాఁడు, "శత్రుఘ్నుండుస్వతంత్రుండు గాఁబోలేదు,భరతుండువానింగొని పోయెను,అనుటచే , ఆపారతంత్ర్యమే,విశేషితమగుచున్నది.దీనివలన,"భక్తుండగువాఁడు, శత్రుఘ్నుండుంబోలెభాగవతపారతంత్ర్యముగలిగియుండవలె" నని వ్యంజితమగుచున్నది.

భాగవతుండగుభరతుండు,మాతులగృహంబునకుఁబోవుచు, శత్రుఘ్నునిఁ,దనతోరమ్మనిపిలువఁగా,నతండు,భాగవతపరతంత్రుండు,గావున,భాగవతుండగుభరతుండెచటికిఁబోవునో అచటికిఁబోవువాఁడును, ఎచటనుండునో అచటనుండువాఁడునగుటంజేసి,యతండుపిలిచినప్పుడె, చంద్రతారాబలాదులను గూడసరకుసేయక,యతనివిడిచిసేయు రామభక్తియుఁగూడఁ దనకుఁబాపంబెయనితలంచి, జితేంద్రియుండగుటవలన, మఱేదేనియందునుమమతయుంచక,యాతృణంబె. యతండుకట్టుకొన్న వస్త్రంబుంబోలె, నతిస్నేహపరవశుండై,యతనివెంబడించెను. అని, తాత్పర్యము.(ఇది,గోవిందరాజీయవ్యాఖ్యానంబుననుసరించినది.)

మాతులకులం,గచ్ఛతా, భరతేన,తదా=తండ్రియును రాముండును అనుజ్ఞయొసంగినపిదప;అనఘః = నాతోఁబుట్టువగులక్ష్మణుండు,బలవంతుండగు రామునాశ్రయించెను, నేనునుగొప్పవానినాశ్రయింపవలయుననుకుత్సితబుద్ధి లేనివాఁడును;నిత్యశత్రుఘ్నః=నిత్యశత్రువులుకామక్రోధాదులు, వానింజంపువాఁడును, కామక్రోధాదిరహితుండుననుట.ప్రీతిపురస్కృతః,నీతః = కొనిపోఁబడినాఁడు.వీడులేకున్నట్లైన, మాతులగృహంబునంగల్గు సౌఖ్యంబునాకు

దుఃఖప్రాయంబగునని తలంచి, కొనిపో యెనుఅనుట.

భరతుండు మాతులగృహంబునకుఁ బోవుచు, శత్రుఘ్నుండు లేక మాతుల గృహంబునం గల్గు సౌఖ్యంబు నాకు దుఃఖప్రాయంబగునని తలంచి, యతనిం దన తోఁ గూడ రాఁబిలువఁగా, నతండును గామక్రోధాది రహితుండు గావునఁ, గుత్సిత బుద్ధి యెంతమాత్రమును జేయక, కేవలము భరతునియందలి భక్తిచేతను స్నేహముచేతను, అతనువిడిచియుండంజాలక, యతని వెంటం బోయెను. అని, తాత్పర్యము. (ఇది మహేశ్వరతీర్థీయవ్యాఖ్యాననుననుసరించినది.)

మాతులకులం, గచ్ఛతా, భరతేన, అనఘః = రామునిననువర్తించుటచేల క్ష్మణుండువలె, భరతుననువర్తించుట చే, తండ్రినితల్లి నిఎడఁబాయుటవలనంగ లిగినదుఃఖములేనివాఁడును; నిత్యశత్రుఘ్నః=జితేంద్రియుండును, సమస్తజనులయొక్కయు, నేత్రమానసంబులను ఆకర్షించునట్టి రామునియందును ఆసక్తుండుగాకపోవుటవలన, జితేంద్రియత్వముప్రత్యక్షసిద్ధము. శత్రుఘ్నః, ప్రీతి పురస్కృతః, నీతః.

భరతుండు మాతులగృహంబునకుఁ బోవుచు, శత్రుఘ్నునిం బిలువఁగా, నతండు, భరతునియందలి స్నేహంబున మాతృపితృవియోగంబుంగూడ సరకుసేయక, జితేంద్రియుండు కావున, సమస్తజనుల నేత్రమానసంబుల హరించునట్టి రామునం దును ఆసక్తియుంచక, యతని వెంబడించిపోయెను. అని, తాత్పర్యము. (ఇది, మునిభావప్రకాశికయను వ్యాఖ్యానంబున నుసరించినది.)

• స తత్ర న్యవసద్భ్రాత్రా సహ సత్కారసత్కృతః
మాతులేనాశ్వపతినా పుత్రస్నేహేన లాలితః. ౨

టీక॥ సః=ఆభరతుఁడు; తత్ర=ఆ మేనమామయింటియందు; అశ్వపతినా=గుఱ్ఱములకుఁబ్రభువయిన; మాతులేన= మేనమామయగుయుధాజిత్తుచేత; సత్కారసత్కృతః= సమ్మానములచేఁబూజింపఁబడినవాఁడై; పుత్రస్నేహేన=కొడుకునందలి చెలిమివంటి చెలిమిచేత; లాలితః=బుజ్జగింపఁబడినవాఁడై; భ్రాత్రాసహ= తమ్ముండగు శత్రుఘ్నునితోఁగూడ; న్యవసత్=ఉండెను.

విశేషార్థము.— "సతత్ర న్యవసద్భ్రాత్రాసహ" (ఆభరతుఁడు, అ




చ్చట, శత్రుఘ్నునితోఁగూడనుండెను) అనుటచే, "మాతులగృహంబుననుండుటవలనఁగలిగినసుఖముకన్నను, తమ్ముండగుశత్రుఘ్నునితోఁగూడ నుండుటవలనఁగలిగినసుఖమె,భరతునకెచ్చుగానుండెను" అని,సూచింపఁబడుచున్నది.

ఆభరతుండు, మాతులగృహంబున,అశ్వపతియనుమాతులుండునగు యుధాజిత్తుచే,నానావిధసమ్మానంబుల సమ్మానింపఁబడుచుఁ, బుత్రుండుంబోలె లాలింపఁబడుచుఁ, దమ్ముండగు శత్రుఘ్నునితోఁగూడ, సుఖంబుగానుండెను. అని, తాత్పర్యము.

లేక;సః=ఆశత్రుఘ్నుఁడు; తత్ర= ఆమేనమామయింటియందు; అశ్వపతి నా=గుఱ్ఱములకుఁబ్రభువైన; మాతులే న=మేనమామయగుయుధాజిత్తుచేత; భ్రాత్రాసహ= అన్నయగు భరతునితోఁగూడ;సత్కారసత్కృతః=సమ్మానములచేసమ్మానింపఁబడినవాఁడై; పుత్రస్నేహేన=కొడుకునందలి స్నేహమువంటిస్నేహముచేత; లాలితః=బుజ్జగింపఁబడినవాఁడై(ఇందువలన, "భరతునికన్నశత్రుఘ్నునేయుధాజిత్తు, అధికముగాలాలింపుచుండెను" అని, తోఁచెడిని.)న్యవసత్=ఉండెను.

ఆశత్రుఘ్నుం, డామాతులగృహంబున,అశ్వపతియగు మాతులుండుసేయుసమ్మానంబులనులాలనంబులను, భరతునితోఁగూడననుభవింపుచు, సుఖంబుగానుండెను.అని,తాత్పర్యము.

తత్రాపి నివసంతౌ తౌ తర్ప్యమాణౌ చ కామతః
భ్రాతరౌ స్మరతాం వీరౌ వృద్ధం దశరథ న్నృపమ్. ౩

టీక॥తత్ర = ఆమాతులగృహమందు;నివసంతావపి = ఉండువారయ్యును; కామతః=కోరఁబడుపదార్థంబులచేత;తర్ప్యమాణౌచ=సంతోషపఱుపఁబడుచున్నవారయ్యును;వీరౌ = పరాక్రమంబుగల;ఉత్సాహంబుగలవారయ్యునుట;తౌ=ఆ; భ్రాతరౌ=అన్నదమ్ములయిన భరతశత్రుఘ్నులు; వృద్ధం=ముదుసలియును; నృపం=రాజునగు;దశరథం=దశరథుని; స్మరతాం(అస్మరతాం)=తలంచిరి.

ఆభరతశత్రుఘ్నులు, సమస్తసౌఖ్యంబులకిరవయిన మాతులగృహంబునందుండియు, నచ్చట, మాతులుండు, దాముకోరెడు పదార్థంబులన్నియుఁ దమకొసంగిసంతోషంబు సేయుచున్నను, జాలఁబితృభక్తిగలవారగుటంజేసి, "మనతండ్రిదశరథమహారాజు, వృద్ధుం




డు, రాచకార్యంబుల నేమి, మఱియితర కార్యంబుల నేమి, యెట్లు, నెఱవేర్చుకొనుచుండునో, మనకతని సేవించుటయిట్టి కాలంబునందులభింపదయ్యె" అనితలంచుచుండిరి.

అని, తాత్పర్యము.

రాజాపి తౌ మహాతేజా స్సస్మార ప్రోషితౌ సుతౌ
ఉభౌ భరతశత్రుఘ్నౌ మహేంద్రవరుణోపమౌ. ౪

టీక॥మహాతేజాః=అధికమయినకాంతిగల; రాజాపి = దశరథమహారాజును; ప్రోషితౌ=దేశాంతరము నందుండువారును; మహేంద్రవరుణోపమౌ=దేవేంద్రునితోనువరుణునితోనుం బోలికగలవారునగు; సుతౌ= కొడుకులయిన; తౌ=ఆ; భరతశత్రుఘ్నౌ = భరతశత్రుఘ్నులను; ఉభౌ=ఇద్దఱను; సస్మార=తలంచెను.

లోకోత్తరులగుపుత్రులనొందుటవలనంగలిగినయధికమయినకాంతిగల దశరథమహారాజును, గొడుకులయందతిప్రీతిగలవాఁడగుటంజేసి, రామలక్ష్మణులతోఁగూడియున్నను, దేశాంతరమునందున్న, దేవేంద్రవరుణులకు సరివచ్చుకొడుకుల, భరతశత్రుఘ్నుల, నిద్దఱను, ఏకరీతిగా, స్మరింపుచుండెను.

అని, తాత్పర్యము.

సర్వ ఏవ తు తస్యేష్టా శ్చత్వారః పురుషర్షభాః
స్వశరీరా ద్వినిర్వృత్తా శ్చత్వార ఇవ బాహవః. ౫

టీక॥చత్వారః=నల్వురయిన; పురుషర్షభాః=పురుషశ్రేష్ఠులను రామలక్ష్మణభరతశత్రుఘ్నులు ; సర్వేతు= అందఱును; తస్య=ఆదశరథునకు; స్వశరీరాత్ = తనదేహమునుండి; వినిర్వృత్తాః=బయలువెడలిన; చత్వారః= నాలుగయిన; బాహవఇవ = చేతులువలెను; ఇష్టాఏవ=ప్రియులయ్యే; ఆసన్(అధ్యాహృతము)=ఉండిరి.

ఆదశరథుఁడు, పురుషోత్తములగు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులయందు నల్వురియందును, లోకంబులయందునాలుగుచేతులుగలవాఁడు దనకున్నయన్ని చేతులయందు నేకరీతిగాఁ బ్రీతియుంచునట్లు, ఏకరీతిగాఁ బ్రీతిగలిగియుండెను. అని, తాత్పర్యము.

తేషామపి మహా తేజా రామో రతికరః పితుః
స్వయంభూ రివ భూతానాం బభూవ గుణవ త్తరః. ౭

టీ॥భూతానాం=ప్రాణులలోపల; స్వయంభూరివ=బ్రహ్మదేవుండువలె; తేషామపి=ఆనల్వురిలోను ; గుణవత్తరః=అధికముగాగుణములు గలవాఁడును; మహా తేజాః=అధికమయినకాంతిగలవాఁడునగు; రామః=రాముఁడు ; పితుః=తండ్రియయినదశరథునకు; రతికరః=అధికమయినప్రీతిసేయువాఁడు; బభూవ=ఆయెను.

భూతంబులలోపలబ్రహ్మదేవుండధికగుణవంతుండగునట్లు , రాముండానల్వురిలోపలనుమిక్కిలియుగుణవంతుండు మహాతేజుండుఁగావునఁ, దండ్రియగుదశరథునకునతనియందె యధికంబుగాఁబ్రీతిగలిగియుండెను . అని, తాత్పర్యము. (ఇదిగోవిందరాజీయవ్యాఖ్యానంబుననుసరించినది.)

భూతానాం=దేవతలు మొదలగు ప్రాణులలోపల; గుణవత్తరః(అధ్యాహృతము)=మిక్కిలియును గుణంబులుగల; స్వయంభూరివ=బ్రహ్మదేవుండువలె; తేషామపి=ఆనల్వురిలోపలను;గుణవత్తరః= మిక్కిలియునుగుణంబులుగలవాఁడును;మహాతేజాః= అధికమయినకాంతిగలవాఁడునగు ; రామః=రాముఁడు;పితుః=(బ్రహ్మపక్షమందు) తండ్రియగు విష్ణుదేవునకు (రామపక్షమందు)దశరథునకు - రతికరః=అధికప్రీతిసేయువాఁడు;బభూవ=ఆయెను.

దేవతలు మొదలగుప్రాణులలోపలనధికగుణవంతుండగు బ్రహ్మదేవుండుతనతండ్రియగు విష్ణుదేవునకధిక ప్రీతిసేయునట్లు, ఆనల్వురిలోపలనధికగుణంబులుగలవాఁడును మహాతేజుండునగు రాముండు,తండ్రియగుదశరథున కధికప్రీతిసేయుచుండెను.అని, తాత్పర్యము. (ఇది, మహేశ్వరతీర్థీయ వ్యాఖ్యానముననుసరించినది)పితుః(అధ్యాహృతము)=తండ్రియగువిష్ణునకును; భూతానాం=ప్రాణులకును; గుణవత్తరః(అధ్యాహృతము)=మిక్కిలియును గుణంబులుగల; స్వయంభూరివ=బ్రహ్మదేవుండువలె; గుణవత్తరః=మిక్కిలియునుగుణంబులుగలవాఁడును ; మహాతేజాః=అధికమయినకాంతి గలవాఁడునగు;రామః=రాముఁడు;పితుః = దశరథునకును; తేషామపి=ఆతోఁడఁబుట్టువులకును; రతికరః= మిక్కిలియునుబ్రీతిసేయువాఁడు;బభూవ=ఆయెను.

అధికగుణవంతుండగు బ్రహ్మదేవు౦

స ౧

దు, తనతండ్రియగువిష్ణునకునుసమస్తభూతంబులకును అధికప్రీతిగలిగించునట్లు, అధికగుణవంతుండుమహాతేజుండునగు రాముండు,తనతండ్రియగుదశరథునికిని, దనతమ్ములకును, అధికసంతోషముగలుగఁజేయుచుండెను.అని, తాత్పర్యము.(ఇది, మునిభావప్రకాశికననుసరించినయర్థము).

సహిదేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః
అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః. ౭

టీక॥సనాతనః=శాశ్వతుండగు; విష్ణుః=విష్ణుదేవుండు;ఉదీర్ణస్య=గర్వించినట్టి;రావణస్య= రావణునియొక్క; వధార్థిభిః=చంపుటనుగోరునట్టి ; దేవైః=దేవతలచేత; అర్థితః=కోరఁబడినవాఁడై; మానుషే =మనుష్యసంబంధియగు;లోకే=లోకమందు ; సః=ఆ రాముఁడుగా; జజ్ఞేహి=పుట్టెనుగదా!

శాశ్వతుండగువిష్ణుదేవుండు,వరబలంబునగర్వించియున్న రావణునిజంపుటకొఱకు దేవతలచేఁబ్రార్థింపఁబడి, మనుష్యలోకంబున, రాముఁడుగాఁబుట్టెనుగదా! అని, తాత్పర్యము.

విశేషార్థము.— సహి=వాఁడుగదా!తనకుఁబుట్టుకలేదైనను నానావిధంబులుగాఁబుట్టునని వేదంబు నందును బ్రసిద్ధుండైనవాఁడనుట;సనాతనః= నిత్యుండయిన;విష్ణుః= వ్యాపకుండగు విష్ణుదేవుండు; దేవైః=("దివు, క్రీడావిజిగీషావ్యవహారద్యుతిస్తుతి మోదమదస్వప్నకాంతిగతిషు" అనుధాతువునంబుట్టినది.) క్రీడించుటయేస్వభావముగాఁగలవారు, నీచకార్యప్రవృత్తిగలవారనుట, యెదుటివాని బోరగిలంద్రోయ నిచ్చగొనువారు, వ్యవహారముముఖ్యముగాఁదలంచువారు, పరమార్థబుద్ధిలేని వారునుతమకార్యమునుమాత్రమె చూచువారును (తమకనుకూలముగాఁగృష్ణుండునరకాసురుంజంపిన వెనుక నతండు పారిజాతంబుకోరఁగానతనితోనే యుద్ధముసేసినట్టిస్వకార్యధురంధరు) లననుట.స్తోత్రముచేసిబేలుపుచ్చువారు, సహంకరించియుండువారు, నట్టిదేవతలచేత,"ఇట్టివారిచేతననుటచే, నెట్టివారికేని, విష్ణుండుసులభుండనిసూచింపఁబడుచున్నది.ఉదీర్ణస్య=గర్వించిన, తనకువరంబొసంగినవారని యునుందలంపక యాదేవతలమీఁదనె యుద్ధముసే

యువాఁడనుట; రావణస్య=రావణుని యొక్క—వధార్థిభిః=అర్థిభిః=ఉపాసనలచేమెచ్చినవాఁడుకాదు, ఊరకకోరఁబడినవాఁడై, యిందువలననుసౌలభ్యముసూచింపఁబడుచున్నది. మానుషే లోకే= దేవతలుగూడమనుష్యగంధము నోర్వలేక, రోఁతపడుచు, భూమికియోజనంబునకన్ననుదూరంబుగా నుండి, హవిర్భాగంబుగొనిరెదరు, అట్టి దేవతలును; విష్ణుదేవునకు మనుష్యుల వంటివారులే, అట్టివిష్ణుదేవుండును, మనుష్యలోకంబునందుఁ బుట్టుటం జేసి, సర్వప్రాణులకును అతిసులభుం డద్దేవుండని సూచితమగుచున్నది. జజ్ఞే=రామరూపంబునఁబుట్టెను, నరసింహాదులు వలె నావిర్భవింపలేదు, గర్భవాసంబుచేసిపుట్టెను, యట్టును సాధారణమనుష్యలుగూడఁ పదిమాసంబులే గర్భదుఃఖంబనుభవించువారైనను, ఈవిష్ణువుమాత్రము "తతశ్చ ద్వాదశేమాసే" అని చెప్పఁబడినచొప్పున, పండ్రెండు మాసంబులు గర్భంబుననుండిపుట్టెను. "ఆహాః యెంతభక్తవత్సలత!" యనియాశ్చర్యకరంబగువాత్సల్యమును సూచించుచున్నది.

"సనాతనః విష్ణుః జజ్ఞే" (శాశ్వతుండగువిష్ణుండుపుట్టెను) అనుటచే, తాను శాశ్వతుండైనను సర్వవ్యాపకుండైనను, నశ్వరంబును వ్యాప్యంబునగుమనుష్య శరీరంబు నవలంబించెను, అఁదయాళుతయె వ్యంజితమగుచున్నది.

శాశ్వతుండును సర్వవ్యాపకుండునగువిష్ణుదేవుండు, తన్నుదుర్గుణంబులకిరవైనవారును, స్వకార్యమాత్రధురంధరులునగు దేవతలు, రావణవధంబునకై, కోరిన మాత్రముననే, పరమదయాళువుకావునఁ, దనకన్న నెంతయుఁగనిష్ఠులగు దేవతలకునుగూడ రోఁతగలిగించునట్టిమనుష్యలోకంబునందు, నశ్వరంబును సర్వవిధంబులఁగష్టంబునగు మనుష్యదేహంబవలంబించి, మనుష్యులకన్న నెచ్చుగాఁ బండ్రెండుమాసంబులుగర్భదుఃఖంబుననుభవించి, రామరూపంబునంబుట్టెను; ఆహా! ఎంతభక్తవత్సలుండురమానాథుండు! అట్టి, విష్ణుదేవునియువతారంబగుటం జేసి, రామునియందుసమస్తసద్గుణంబులును, ఒప్పియుండినవి.

అని, తాత్పర్యము.

కౌసల్యా శుశుభే తేన పుత్రేణామిత తేజసా
యథా వరేణ దేవానా మదితి ర్వజ్రపాణినా. ౮

టీక॥ అమిత తేజసా=కొలందిలేనిప రాక్రమంబుగల; తేన=ఆ; పుత్రేణ= కొడుకయినరాముని చేత ; కౌసల్యా= కౌసల్య; దేవానాం=దేవతలలోపల ; వరేణ=శ్రేష్ఠుఁడయిన;వజ్రపాణినా= వజ్రాయుధము చేతి యందుఁగల యిం ద్రుని చేత;అదితిర్యథా=అదితివలె, శు భే=ప్రకాశించెను.

అందఱికొడుకులలోపలను శ్రేష్ఠుం డునుఅప్రమేయంబగు పరాక్రమంబుగ లవాఁడునగు రామునింబుత్రుఁగాఁ బడ సి,కౌసల్య , దేవతాశ్రేష్ఠుండగునింద్రు నింగన్నయదితివోలెఁబ్రకాశించెను.

అని, తాత్పర్యము.

సహి రూపోపపన్నశ్చ వీర్యవా ననసూయకః
భూమా వనుపమ స్సూను గుణైర్ దశరథోపమః. ౯

టీక॥ సః=ఆరాముఁడు;రూపోపప న్నశ్చ=సౌందర్యములోఁగూడిన వాఁడు ను;వీర్యవాన్=పరాక్రమంబుగలవాఁ డు;అనసూయకః = గుణములయందు దోషారోపము సేయనివాఁడును ; గు ణైః=గుణముల చేత; దశరథోపమః= దశరథునితోఁబోలికగలవాఁడును; కా వున నే;భూమౌ=భూమియందు; అను పమః=సరిలేని; సూనుః= కొడుకును గా; ఆసీత్ (అధ్యాహృతము)హి=ఉం డెనుగదా!

ఆరాముండు , సౌందర్యముగలిగి, పరాక్రమశాలియయి , అసూయలేని వాఁడై,గుణంబులదశరథునింబోలుచు , ఇట్లుసమస్త గుణంబులు గలిగియుండు టం జేసి,"ఇట్టికొడుకెవ్వరికినిలేఁ" డని యనందగియుండెను.అని,తాత్పర్యము.

సచ నిత్యం ప్రశాంతాత్మా మృదుపూర్వం తు భాషతే
ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే. ౧౦

టీక॥సః = ఆరాముండు (చకార ముపాదపూరణార్థము) ; పరుషం= నిష్ఠురపుమాటను;ఉచ్యమానోపి = చె ప్పఁబడినవాఁడైనను;ఉత్తరం= బదులు ను;నప్రతిపద్యతే=పొందఁడు, చెప్పఁడ నుట. తు=మఱేమనఁగా;నిత్యం= ఎల్ల ప్పుడును;ప్రశాంతాత్మా=కోపములేని మనసుగలవాఁడై; మృదుపూర్వం=మె

త్తన ముందు గాఁగల్గినట్లుగా ; భాష తే=మాట రాడును.

ఆరాముండు, తనుఁజూచియెవ్వరేని, పరుషముగామాటలాడినను, అతండు దానికి బదులుపరుషంబుగా నెంతమాత్రమును జెప్పఁడు; మఱియు, నెల్లప్పుడునుగోపంబులేని మనంబుగలవాఁడగుటంజేసి , తిన్ననగానే యతనికిం జెప్పును. అని, తాత్పర్యము.

కథంచి దుపకారేణ కృతే నైకేన తుష్యతి
నస్మరత్య పకారాణాం శతమప్యాత్మ వత్తయా. ౧౧

టీక॥ స॥(అధ్యాహృతము)= ఆరాముఁడు; కథంచిత్ =ఎట్లైనను, అనఁగా, "ఎట్లయిననట్లు గానిమ్ము" అనియలక్ష్యముగానైనను, లేక, చేయవలెననునధ్యవసాయముతోఁ గాకపోయినను, లేక, స్వకార్యమునుద్దేశించియయినను, లేక, స్వల్పముగానైనను, లేక, పరిహాసముగానైనను, అనుట; కృతేన=చేయఁబడినః; ఏకేన = ఒకటైన; ఉపకారేణ= ఉపకారముచేతనే; తుష్యతి = సంతోషించును. ఆత్మవత్తయా= మంచిమనస్సు గలవాఁడగుటచేత ; అపకారాణాం=అపకారములయొక్క ; శతమపి=లెక్కలేనివానినైనను; నస్మరతి=తలంపఁడు.

రాముండు, తనకెవ్వండైననేవిధముగానైనను ఒక్కమాటుపకారంబు చేసెనేని, దానికెల్లప్పుడునుసంతోషించియుండును; ఏవ్వఁడుగానియెన్నియపకారములుచేసినను, మంచిమనసుగలవాఁడుగావున , వానినెప్పుడునుస్మరింపఁడు. అ॥ తాత్పర్యము.

శీలవృద్ధై ర్జ్ఞానవృద్ధై ర్వయోవృద్ధైశ్చ సజ్జనైః
కథయ న్నాస్త వైనిత్య మస్త్రయోగ్యాంతరేష్వపి. ౧౨

టీ॥ స॥(అధ్యాహృతము)= ఆరాముఁడు; సజ్జనైః=మంచివారైన; శీలవృద్ధైః= మంచియాచారముచేగొప్పవారగు వారితోను; జ్ఞానవృద్ధైః = జ్ఞానముచేగొప్పవారగువారితోను; వయోవృద్ధైశ్చ= వయసుచేముదుసలులగువారితోను; నిత్యం=ఎల్లప్పుడును; అస్త్రయోగ్యాంతరేష్వపి= అస్త్రాభ్యాసముసేయుకాల

ములందును; కథయన్ = మాటలాడుచు; ఆస్త=ఉండెను"వై" అనునది పాదపూరణార్థము.

ఆ రాముండు,ఎల్లప్పుడును, అస్త్రాభ్యాసము సేయు కాలమువంటి కాలమునందునుసజ్జనులగు సదాచారసంపలు మోక్షముగోరువారలు ముదుసలులు వీరలతోఁగూడ, సదాచారములను గుఱించియు, వేదాంతరహస్యంబులను గుఱించియు, సంప్రదాయములనుగుఱించియు,మాటలాడుచుండును.

అని, తాత్పర్యము.

బుద్ధిమాన్ మధురాభాషీ పూర్వభాషీ ప్రియంవదః
వీర్యవాన్నచ వీర్యేణ మహతా స్వేన విస్మితః. ౧౩

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;బుద్ధిమాన్= ప్రశస్తమగుబుద్ధిగలవాడును;మధురాభాషీ= ఇంపుగా మాటలాడువాఁడును; పూర్వభాషీ= ముందుగామాటలాడువాఁడును; ప్రియంవదః=ఇష్టమునెచెప్పువాఁడును;వీర్యవాన్=పరాక్రమశాలియును; స్వేన=తనదైన;మహతా=గొప్పదగు; వీర్యేణ=పరాక్రమముచేత;నవిస్మితశ్చ= గర్వములేనివాఁడునుగా; ఆసీత్=(అధ్యాహృతము)ఉండెను.

రాముండు,మంచిబుద్ధిగలిగి, మధురంబుగామాటలాడువాఁడై, ఎట్టివానితోనైనను తానెమున్నుమాటలాడుచుఁ బలుకత్యాశ్చర్యంబుగలిగించు పరాక్రమంబుగలవాఁడైనను, ఎంతమాత్రమునుదనపరాక్రమంబునకు గర్వింపకయుండెను.అని, తాత్పర్యము.

నచానృతకథో విద్వాన్ వృద్ధానాం ప్రతిపూజకః
("బ్రాహ్మణప్రతిపూజకః" అనిపాఠాంతరము)
అనురక్తః ప్రజాభిశ్చ ప్రజాశ్చాప్యనురంజతే. ౧౪

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;నానృతకథశ్చ= అబద్ధపుమాటలేనివాఁడును;విద్వాన్=పండితుండును;వృద్ధానాం=పెద్దలయొక్క; ప్రతిపూజకః = ఎదురొనిపూజించువాఁడును;బ్రాహ్మణప్రతిపూజకః (అనిపాఠాంతరము)=బ్రాహ్మణుల నెదుర్కొని పూజించువాఁడును;ప్రజాభిః = జనుల

చేత; అనురక్తశ్చ=ప్రేమయుంచఁ బడినవాఁడును; ప్రాజాశ్చ=జనులను; అనురంజతే. (అనురంజయతి)=సంతసింపఁ జేయుచుండును.

రాముండు, దబ్బఱలాడఁడు, పండితుండు, వృద్ధులకుఁ (బ్రాహ్మణులకు) బూజసేయువాఁడు ; ప్రజలతనియందుఁబ్రేమగల్గియుండిరి ; అతండునుబ్రజలయందనురాగంబుగల్గియుండెను.

అని, తాత్పర్యము.

సానుక్రోశో జితక్రోధో బ్రాహ్మణప్రతిపూజకః
దీనానుకంపీ ధర్మజ్ఞో నిత్యం ప్రగ్రహవాంఛుచిః. ౧౫

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; సానుక్రోశః= దయతోఁగూడినవాఁడును; జితక్రోధః= జయింపఁబడినకోపముగలవాఁడును ; బ్రాహ్మణప్రతిపూజకః= బ్రాహ్మణుల నెదుర్కొని పూజించువాఁడును; దీనానుకంపీ= దరిద్రులయందెచ్చుగాదయగలవాఁడును ; ధర్మజ్ఞః= ధర్మంబుల నెఱింగినవాఁడును; నిత్యం=ఎల్లప్పుడును ; ప్రగ్రహవాన్=దృఢంబగు, నియమంబుగలవాఁడును; శుచిః= పరిశుద్ధుఁడును ; పరధనంబుకోరనివాఁడునను ట.

రాముండు, దయగలవాఁడు ; కోపంబుజయించినవాఁడు; బ్రాహ్మణులంగన్నమాత్రమున నెదుర్కొనిపూజించువాఁడు; దరిద్రులనుచూచినప్పుడె, వారలదానమానాదుల నాదరించువాఁడు; ధర్మంబుల నెఱింగినవాఁడు; ఎప్పుడును, జలనంబులేని నియమంబు గలవాఁడు; పరధనంబుగోరఁడు.

అని, తాత్పర్యము.

కులోచితమతిః క్షాత్రం ధర్మం స్వం బహుమన్యతే
మన్యతే పరయా కీర్త్యా మహత్స్వర్గఫలం తతః. ౧౬

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; కులోచితమతిః=ఇక్ష్వాకువంశంబునకుఁదగినబుద్ధిగలవాఁడు; స్వం=తనదైన; క్షాత్రధర్మం=క్షత్రియులధర్మమును; బహుమన్యతే= అధికమనితలంచును; తతః = తనదగునాక్షత్రధర్మంబువలన; పరయా = అధికమయిన; కీర్త్యా=కీర్తితో; మహత్= గొప్ప

...యిన; స్వర్గఫలం = స్వర్గమనుఫలము; భవతీతి (అధ్యాహృతము)=కలుగును; మన్యతే=తలంచును.

రాముండు, తనకులంబునకుఁదగిన ...దయ, దాక్షిణ్యము శరణాగతసంరక్షణము, మొదలగువానియందాసక్తంబగు బుద్ధిగలవాఁడు; తనక్షత్రియము నే యధికముగా నెంచును; తనక్షత్రధర్మముచక్కఁగాననుష్ఠింపఁబడు నేని దానివలననె, మహాకీర్తియు, స్వర్గంబును, గల్గునని, తలంచును.

అని, తాత్పర్యము.

నాశ్రేయసి రతో విద్వా న్నవిరుద్ధకథారుచిః
ఉత్తరోత్తరయుక్తౌ చ వక్తా వాచస్పతి ర్యథా. ౧౭

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముండు; విద్వాన్=పండితుండు; కావునను; అశ్రేయసి= మంచిదికానిదానియందు; నరతః=ఆసక్తుఁడు కాఁడు. నవిరుద్ధకథారుచిః=ధర్మమునకువిరుద్ధములయిన మాటలయందిష్టముగలవాఁడు కాఁడు. ఉత్తరోత్తరయుక్తౌ=బదులుబదులుగాఁజెప్పయుక్తియందు; వాచస్పతిర్యథా = బృహస్పతివలె; వక్తా చ=చెప్పువాఁడును.

రాముఁడు, పండితుండు కావున, మంచిదికానివానియందాసక్తుండుకాఁడు; ధర్మవిరుద్ధములయినమాటలుచెప్పఁడు; బృహస్పతివలె, బదులుకుబదులుయుక్తులు చెప్పును.

అని, తాత్పర్యము.

అరోగ స్తరుణో వాగ్మీ వపుష్మా న్దేశకాలవిత్
లోకే పురుషసారజ్ఞ స్సాధు రేకో వినిర్మితః. ౧౮

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; అరోగః=వ్యాధిలేనివాఁడు; తరుణః= యౌవనంబుగలవాఁడు; వాగ్మీ=చక్కఁగా మాటలాడువాడు; వపుష్మాన్= మంచి దేహంబు గలవాఁడు; దేశకాలవిత్ = దేశమునుగాలమునెఱింగినవాఁడు; పురుషసారజ్ఞః=పురుషనిమనోనిశ్చయము నెఱింగినవాఁడు; లోకే=జగత్తునందు; ఏకః=ఒకఁడైన; సాధుః=సత్పురుషుఁడు ;ఇతి (అధ్యాహృతము) = అని; వినిర్మితః= నిశ్చయింపఁబడినాఁడు.

రాముండు , వ్యాధివేమియు లేనివాఁడు; మంచియౌవనంబు గలవాఁడు;

చక్కఁగా మాటలాడువాఁడు; దృఢం బగు దేహంబు గలవాఁడు; దేశకాలంబులకుఁ దగినట్టు నడువనేర్చినవాఁడు; చూచినమాత్రముననె పురుషుని హృదయంబు గనుంగొనువాఁడు; లోకంబునందంతయు, అపకారులపైఁ గోపంబులేని సాధు వితం డొకండె యనినిశ్చయింపఁబడెను.

అని, తాత్పర్యము.

స తుశ్రేష్ఠై ర్గుణై ర్యుక్తః ప్రజానాంపార్థివాత్మజః
బహిశ్చర ఇవ ప్రాణో బభూవ గుణతః ప్రియః. ౧౯

టీక॥ శ్రేష్ఠైః= ఉత్తమములయిన; గుణైః=గుణములతో;యుక్తః= కూడినః;సః=ఆ; పార్థివాత్మజస్తు= రాచకొమరుండైనరాముండుమాత్రము;ప్రజానాం=జనులకు;బహిశ్చరః= బైటఁదిరుగుచుండు; ప్రాణఇవ=ప్రాణమువలె;గుణతః=గుణములచేత; ప్రియః=ఇష్టుఁడు;బభూవ=ఆయెను.

ఇట్లుత్తమంబులగు గుణంబులు గలిగియున్న రాముండు, తన గుణంబులచేఁ,బ్రజలకు, బైటనుండు ప్రాణంబుం బోలెఁబ్రియుఁడు గానుండెను.

అని, తాత్పర్యము.

సమ్య గ్విద్యా వ్రతస్నాతో యథావ త్సాంగ వేదవిత్
ఇష్వస్త్రే చ పితుశ్శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః. ౨౦

టీక॥ భరతాగ్రజః=భరతునికన్నయయినరాముండు; సమ్యక్=చక్కఁగా;విద్యావ్రతస్నాతః=విద్యలవలనను వ్రతంబులవలనను స్నానముచేసినవాఁడును, అధ్యయనముచేసి, వ్రతంబులాచరించిసమావర్తనంబు చేసినవాఁడనుట; యథావత్=యథాశాస్త్రముగా; సాంగవేదవిత్ = అంగములతోఁగూడినవేదంబులనెఱింగినవాఁడును; ఇష్వస్త్రే= బాణంబులందునుఅస్త్రంబులందును;పితుః=తండ్రికన్న;శ్రేష్ఠః= ఎచ్చయినవాఁడునుగా; బభూవ = ఆయెను.

భరతునకన్నయగురాముండు, చక్కఁగా వేదంబులనధ్యయనించివ్రతంబులాచరించి స్నాతకమునుచేసికొని; శిక్షావ్యాకరణాది వేదాంగంబులను వేదములను,అర్థంబులతో నెఱింగినవాఁ

స ౧

ద్రై, విలువిద్యయందు నస్త్రింబులం దుఁ దండ్రికన్న నెక్కుడైనవాఁడైయుం డెను.

అని, తాత్పర్యము.

కల్యాణాభిజన స్సాధు రదీన స్సత్యవా గృజుః
వృద్ధై రభివినీతశ్చ ద్విజై ర్ధర్మార్థదర్శిభిః. ౨౧

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముండు; కల్యాణాభిజనః=మంగళంబులకుఁబుట్టిల్లు;లేక, మంగళకరంబైనతలిదండ్రులవంశంబుగలవాఁడు; సాధుః=దోషములేనివాఁడు; అదీనః=దైన్యములేనివాఁడు; సత్యవాక్=సత్యమయినమాటగలవాఁడు; ఋజుః=వక్రబుద్ధిలేనివాఁడు; ధర్మార్థదర్శిభిః=ధర్మంబు నర్థంబునుజూచునట్టి; వృద్ధైః=పెద్దలగు; ద్విజైః=బ్రాహ్మణులచేత; అభివినీతశ్చ=చక్కఁగాశిక్షింపఁబడినవాఁడు.

రాముండు, ఎప్పుడునుమంగళంబులుగలవాఁడు (మంగళములుగలతలిదండ్రులకులంబులు గలవాఁడు); నిర్దోషుండు,ఎట్టియాపదలందును దైన్యంబు నొందనివాఁడు; ఎట్టికష్టములనైనను, సత్యమునేమాటలాడువాఁడు, వక్రబుద్ధిలేనివాఁడు, ధర్మార్థంబులనెఱింగినపెద్దలగుబ్రాహ్మణులచే శిక్షింపఁబడినవాఁడు.

అని, తాత్పర్యము.

ధర్మకామార్థతత్త్వజ్ఞ స్స్మృతిమా న్ప్రతిభానవాన్
లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః. ౨౨

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; ధర్మకామార్థతత్త్వజ్ఞః=ధర్మముయొక్కయుఁ గామము యొక్కయు నర్థముయొక్కయుసిద్ధాంతమునెఱింగినవాఁడు; స్మృతిమాన్=మఱపులేకుండుటగలవాఁడు;ప్రతిభానవాన్=క్రొత్తక్రొత్తగావికాసమునొందుచుండుబుద్ధిగలవాఁడు; లౌకికే=లోకసంబంధియగు;సమయాచారే=సంకేతమువలనఁగాఁదగినయాచారమునందు; కృతకల్పః= చేయఁబడిన న్యాయముగలవాఁడు;విశారదః=పండితుండు.

రాముండు,ధర్మముఁగామము నర్థము, వీనిలో నేదేది యెప్పుడెప్పుడుసేయవలయునో, ఆయా నిర్ణయంబుల నెఱింగినవాఁడు,మఱపులేనివాఁడు; వి

వాదమునందు, క్రొత్తక్రొత్తగావికాసమునొందుచుండు, ప్రతిభయనెడు, బుద్ధివిశేషముగలవాఁడు, లౌకికంబగుసాంకేతికాచారంబువిషయమై, యాన్యాయంబులఁ దెలిసినవాఁడు; పండితుండు. అని, తాత్పర్యము.

నిభృత స్సంవృతాకారో గుప్తమంత్ర స్సహాయవాన్
అమోఘక్రోధహర్షశ్చ త్యాగసంయమకాలవిత్. ౨౩

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; నిభృతః = వినయంబుగలవాఁడు; సంవృతాకారః = మూయఁబడిన బొమ ముడిపాటులోనగుదేహము నందలివికారముగలవాఁడు ; గుప్తమంత్రః=ఎవ్వరికిం దెలియని యాలోచనంబుగలవాఁడు ; సహాయవాన్ = తోడుగలవాఁడు; అమోఘక్రోధహర్షశ్చ = వ్యర్థముకాని కోపంబును సంతోషంబునుగలవాఁడును; త్యాగసంయమకాలవిత్ = ఈవియొక్కయు నార్జించుటయొక్కయుఁ గాలముల నెఱింగినవాఁడును.

రాముండు, వినయముగలవాఁడు; తనమనసునందునభిప్రాయం బెవ్వరికినిం దెలియనట్లుబొమముడి మొదలగు వికారంబులనొందఁడు, అతండు సేయు నాలోచనంబు, ఫలపర్యంతం బెవ్వరికినిం దెలియదు; సహాయవంతుండు, అతనికోపముగాని సంతోషముగానివ్యర్థముకాదు; ఎప్పుడు దానుదానము సేయవలయునో దానార్జించునది యెప్పుడో యట్టికాలవిశేషంబులఁ దెలిసినవాఁడు. అని, తాత్పర్యము.

దృఢభక్తి స్థిరప్రజ్ఞో నాసద్గ్రాహీ న దుర్వచాః
నిస్తంద్రి రప్రమత్తశ్చ స్వదోషపరదోషవిత్. ౨౪

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; దృఢభక్తిః=నిశ్చలమయినభక్తిగలవాఁడు; స్థిరప్రజ్ఞః = మఱపులేని బుద్ధిగలవాఁడు; అసద్గ్రాహీన= మంచిదికానిదానిఁ గ్రహించువాఁడు కాఁడు; లేక, దుష్టులఁ గ్రహించువాఁడు కాఁడు; దుర్వచాఃన= చెడ్డమాటగలవాఁడు కాఁడు; నిస్తంద్రిః=ఆలస్యములేనివాఁడు; అప్రమత్తశ్చ= ఏమఱుపాటులేనివాఁడును; స్వదోషపరదోషవిత్ =తనదో

షమును ఇతరుల దోషము నెఱింగిన వాఁడు.

రాముండు, పెద్దలయందు నిశ్చలంబగు భక్తిగలవాఁడు ; మఱపులేనిబుద్ధి గలవాఁడు; మంచిదికానివానిఁ గాని దుష్టులఁ గాని గ్రహింపఁడు; ఒకరికప్రియంబగు మాటఁ జెప్పఁడు ; ఆలస్యంబును యేమఱుపాటులేనివాఁడు ; లోకంబులోనందఱును పెఱవారిదోషంబులఁ జక్కఁగా నెఱుంగుదురు; ఎవ్వనికిని దన దోషంబు దెలియదు ; ఇతండట్లుకాదు, తనదోషంబు నెదుటివానిదోషంబు నెఱుంగును.

అని, తాత్పర్యము.

శాస్త్రజ్ఞ శ్చ కృతజ్ఞశ్చ పురుషాంతరకోవిదః
యః ప్రగ్రహానుగ్రహయో ర్యథాన్యాయం విచక్షణః ౨౫

టీక॥ యః = ఏ రాముఁడు ; శాస్త్రజ్ఞః = శాస్త్రముల నెఱింగినవాఁడో; కృతజ్ఞశ్చ = తనకుఁ బరునిచేఁ జేయఁబడిన యుపకారము నెచ్చుగా నెఱుంగువాఁడునో, లేక, సిద్ధాంతము నెఱుంగువాఁడునో; పురుషాంతరకోవిదః = పురుషుల తారతమ్యమునందుఁ బండితుండో ; లేక, పురుషుల హృదయమునందుఁ బండితుండో; ప్రగ్రహానుగ్రహయోః = స్వీకరించుటయందు ననుగ్రహించుట యందును; యథాన్యాయం = యథాశాస్త్రముగా; విచక్షణః = పండితుండో; అట్టివాఁడనుట.

రాముండు, శాస్త్రముల నెఱింగినవాఁడు, ఎవ్వఁడేని తనకు స్వల్పోపకారము చేసినను దానినధికముగాఁ దలంచువాఁడు (సిద్ధాంతముల నెఱింగినవాఁడు) ; పురుషుల తారతమ్యము దెలిసినవాఁడు (పురుషుల హృదయంబు నెఱుంగువాఁడు); శాస్త్రంబు దప్పక మిత్రులు మున్నగువారల స్వీకరించుటకును వారి ననుగ్రహించుటయందును బండితుండు.

అని, తాత్పర్యము.

సత్సంగ్రహప్రగ్రహణే స్థానవి న్నిగ్రహస్య చ
ఆయకర్మణ్యు పాయజ్ఞ స్సందృష్టవ్యయకర్మవిత్. ౨౬

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ రాముఁడు సత్సంగ్రహప్రగ్రహణే = పెద్ద

లనుస్వీకరించుటయందును బరిపాలించుటయందును; విచక్షణః (అధ్యాహృతము) = పండితుండు; నిగ్రహస్య = దుష్టులనిగ్రహించుటయందును; స్థానవిత్ = అవకాశము నెఱింగినవాఁడును; ఆయకర్మణి = వచ్చుబడి సేయుటయందు; ఉపాయజ్ఞః = ఉపాయము నెఱింగినవాఁడు; సందృష్టవ్యయకర్మవిత్ = శాస్త్రమునందుఁజూడఁబడిన కర్చుసేయుట నెఱింగినవాఁడు.

రాముండు పెద్దలస్వీకరించి పాలింపసమర్థుఁడు. దుష్టులశిక్షింపనుదగిన కాలము దెలిసినవాఁడు; పుష్పంబులనుం డిమధుకరంబుంబోలె, ప్రజలనుండి, వారలకుఁ గష్టంబు లేనట్లుగాఁ ద్రవ్యంబు గొనసమర్థుఁడు; "వచ్చుబడిలో సగముపాలుగాని నాలవపాలుగాని మూఁడుపాళ్లుగాని కర్చుసేయవచ్చును" అని, శాస్త్రమునందుఁ జెప్పఁబడినరీతిగా, సెలవుసేయును. అని, తాత్పర్యము.

శ్రైష్ఠ్యం శాస్త్రసమూహేషు ప్రాప్తో వ్యామిశ్రకేషుచ
అర్థధర్మౌచసంగృహ్య సుఖతంత్రో నచాలసః. ౨౭

టీక॥ సః (అధ్యాహృతము) = ఆరాముఁడు; శాస్త్రసమూహేషు = న్యాయము వేదాంతము మున్నుగాఁగల శాస్త్రములసమూహములందును; వ్యామిశ్రకేషుచ = సంస్కృతము ప్రాకృతము మున్నగు భాషలు చేరియుండు, కావ్యనాటకాదిగ్రంథములందును; శ్రైష్ఠ్యం = ఎచ్చుగుటను; ప్రాప్తః = పొందినవాఁడు; అర్థధర్మౌచ = అర్థమును ధర్మమును; సంగృహ్య = సంపాదించి; సుఖతంత్రః = సుఖమె ప్రధానముగాఁగలవాఁడు; అలసఃనచ = సోమరి కాఁడు.

రాముండు, న్యాయవైశేషిక వేదాంత వ్యాకరణ మీమాంసాది శాస్త్రంబులందును, కావ్యనాటకాది సంస్కృతప్రాకృతగ్రంథములందును. బండితులగువారలలో శ్రేష్ఠుండనిసుతికెక్కినవాఁడు, అర్థమును ధర్మంబును సంపాదించికొని సుఖంబు సేవించును, సోమరితనమును లేనివాఁడు.

అని, తాత్పర్యము.

వైహారికాణాం శిల్పానాం విజ్ఞాతార్థవిభాగవిత్

ఆరోహే వినయే చైవ యుక్తో వారణవాజినామ్. ౨౮

టీక॥ సః (అధ్యాహృతము) = ఆరాముఁడు; వైహారికాణాం = విహరించుటయే ప్రయోజనముగాఁగల; శిల్పానాం = సంగీతాదివిద్యలయొక్క; విజ్ఞాతా = విశేషములనెఱుంగువాఁడు; అర్థవిభాగవిత్ = ధనముయొక్క పంపకమును దెలిసినవాఁడు, వారణవాజినాం = ఏనుఁగులయొక్కయు గుఱ్ఱములయొక్కయు; ఆరోహే = ఎక్కుటయందును; వినయే చైవ = నానావిధములుగా నడుపుటయందును; లేక, శిక్షించుటయందును; యుక్తః = సమర్థుఁడు.

రాముండు, విహారార్థంబులగు సంగీతాదిశిల్పంబులఁ జక్కఁగా నెఱుంగును; "ధర్మాయ యశసే ర్థాయ ఆత్మనే స్వజనాయ చ, పంచధా విభజన్ విత్తమిహాముత్ర స శోభతే" (ధర్మముకొఱకును గీర్తికొఱకును లౌకికకార్యముకొఱకుఁ, దనకొఱకు, బంధుస్నేహితులకొఱకు, ఇట్లు, అయిదు భాగంబులుగా ధనంబు విభజించువాఁ, డీలోకంబునను బరలోకంబునను బ్రకాశించును) అని చెప్పఁబడినరీతిని, ధనము విభజించు ప్రకారంబు దెలిసినవాఁడు; ఏనుగులను గుఱ్ఱంబులను, ఎక్కి నానావిధంబులుగా నడుపుటయందును శిక్షించుటయందును సమర్థుండు.

అని, తాత్పర్యము.

ధనుర్వేదవిదాం శ్రేష్ఠో లోకే ౽తిరథసమ్మతః
అభియాతా ప్రహర్తా చ సేనానయవిశారదః. ౨౯

టీక॥ సః (అధ్యాహృతము) = ఆరాముఁడు; ధనుర్వేదవిదాం = విలువిద్యనెఱింగినవారిలోపల; శ్రేష్ఠః = ఎక్కుడైనవాఁడు; లోకే = జగత్తునందు; అతిరథసమ్మతః = పెక్కువిలుకాండ్రతోఁబోరెడువారిచేఁ బూజింపఁబడినవాఁడు, అభియాతా = శత్రువులకెదురుగాఁబోవువాఁడు; ప్రహర్తా చ = శత్రువులఁజంపువాఁడును; సేనానయవిశారదః = సేననడుపుటయందుఁ బండితుండు.

రాముండు, ధనుర్వేదంబు దెలిసిన

వారిలోశ్రేష్ఠుండు ; లోకంబునందంతటను బెక్కువిలుకాండ్రతోఁ బోరఁగలయట్టివారి చేతనుం బూజింపఁబడినవాఁడు;లోకంబున నేరాజేని, శత్రువులు తనమీఁదకెత్తివచ్చినప్పుడు వానితో యుద్ధముసేయును , అప్పుడు సేనాముఖంబుననుండఁడు, ఇతండట్లుకాదు, శత్రువులయొద్దకుఁ దానెపోయి సేనాముఖంబుననిలిచియుద్ధముసేసి, శత్రువులంజంపువాఁడు శత్రుసేనతన సేనలోనికిఁజొరనవకాశంబుగలుగకుండునట్లు తనసేనను వ్యూహంబులందీర్ప సమర్థుఁడు.

అని, తాత్పర్యము.

అప్రధృష్యశ్చసంగ్రామే క్రుద్ధైరపి సురాసురైః

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;సంగ్రామే= యుద్ధమునందు; క్రుద్ధైః=కోపమునొందిన; సురాసురైరపి = దేవతలచేతనుఅసురులచేతను;అప్రధృష్యశ్చ = ఎదిరింపఁగూడనివాఁడును.

సురాసురులు; విరోధంబు విడిచి, కోపంబున,వచ్చిరేని,వారును, యుద్ధమునందురాముని నెదిరింపలేరు.

అని, తాత్పర్యము.

ఈయర్ధశ్లోకంబు, వ్యాఖ్యానంబులందుదాహరింపఁబడియున్నను, బరిగణితంబుకాకుండుటంజేసి, యిచ్చోటలెక్కింపఁబడదయ్యె.

అనసూయో జితక్రోధో నదృప్తో నచ మత్సరీ
నచావమంతా భూతానాం నచకాలవశానుగః. ౩౦

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు;అనసూయః = గుణమునందు దోషమునారోపించు గుణములేని వాఁడు;జితక్రోధః=జయింపబడినకోపము గలవాఁడు;నదృప్తః=గర్వించినవాఁడు కాఁడు; మత్సరీన=ఇతురులకుమంచిగలుగుటయందోర్వమిలేనివాఁడు కాఁడు; భూతానాం=ప్రాణులయొక్క; అవమంతాచన= అవమానించు వాఁడును కాఁడు;కాలవశానుగశ్చన= కాలమునకువశ్యుఁడైయుండుటననుసరించు వాఁడునుకాఁడు.

రాముండు,మంచియందుదోషమునారోపింపఁడు;కోపమును దనయధీనము

చేసికొనినవాఁడు;గర్వితుండు కాఁడు; మచ్ఛరము లేనివాఁడు ; ప్రాణులనవమానింపఁడు; అత్యైకాలములంగల్గు కోపరాజసములకులొంగఁడు.

అని, తాత్పర్యము.

ఏవం శ్రేష్ఠగుణైర్యుక్తః ప్రజానాం పార్థివాత్మజః
సమ్మత స్త్రిషు లోకేషు

టీక॥పార్థివాత్మజః=రాచకొమరుండగు రాముండు;ప్రజానాం= జనుల లోపల;ఏవం=ఇట్లు ; శ్రేష్ఠగుణైః= లోకోత్తరంబులగుగుణంబులలో; యుక్తః=కూడినవాఁడు; త్రిషు=మూఁడైన;లోకేషు = లోకములందు; సమ్మతః=పూజింపఁబడినవాఁడు.

రాముండు,జనులలో నెవ్వరియందునుదొరకనియిట్టిలోకోత్తర గుణంబులుగలవాఁడు,ముల్లోకంబులందునుబూజనొందెను.

అని, తాత్పర్యము.

వసుధాయాః క్షమాగుణైః. ౩౧
బుద్ధ్యాబృహస్పతే స్తుల్యో వీర్యే ణాపి శచీపతేః

టీక॥సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; క్షమాగుణైః= ఓర్పుప్రధానముగాఁగల గుణములచేత ; వసుధాయాః=భూమికి ; తుల్యః= సరివచ్చువాఁడు;బుద్ధ్యా = బుద్ధిచేత;బృహస్పతేః=బృహస్పతికి;తుల్యః ( అధ్యాహృతము)=సరివచ్చువాఁడు; వీర్యేణ= పరాక్రమముచేత;శచీపతేః= శచీదేవికి భర్తయగునింద్రునకు; తుల్యః(అధ్యాహృతము)అపి=సరివచ్చువాఁడును.

రాముండు,ఓర్పుమొదలగు వానిచేభూమికిసరియగును;బుద్ధియందు బృహస్పతికిసరివచ్చును; పరాక్రమంబున,దేవేంద్రునకుసమానుండు,

అని, తాత్పర్యము.

తథా సర్వప్రజాకాంతైః ప్రీతిసంజననైః పితుః. ౩౨
గుణైర్విరురుచేరామో దీప్త స్సూర్య ఇవాంశుభిః

టీక॥తథా=అట్లు;సర్వప్రాజాకాంతైః=సమస్తజనులకును ప్రియంబులును;

పితుః=తండ్రికి; ప్రీతిసంజననైః=సంతోషముగలిగించునవియునగు; గుణైః=గుణంబులచే; దీప్తః= ప్రకాశించుచున్న; సూర్యః=సూర్యుఁడు; అంశుభిరివ=కిరణంబులచేతవలె; విరురుచే= ప్రకాశించెను.

అట్లు, స్త్రీలకును బాలురకును యౌవనవంతులకును వృద్ధులకును బామరులకును బండితులకును సంతోషంబుగలిగించునవియుఁ దండ్రియగుదశరథునకుఁ బ్రీతిఁ బుట్టించునవియునగు గుణంబులచేస్వతస్సుందరుండైన యారాముండు స్వతఃప్రకాశవంతుండగు సూర్యుండు తన కిరణంబులచేతంబోలెఁ, బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

తమేవం వ్రతసంపన్న మప్రధృష్యపరాక్రమం. ౩౩
లోకపాలోపమం నాథ మకామయత మేదినీ

టీక॥ మేదినీ=భూమి; ఏవంవ్రతసంపన్నం = ఇట్లుఆశ్రితసంరక్షణమనువ్రతముతోఁగూడినవాఁడును; అప్రధృష్యపరాక్రమం = ఎదిరింపఁగూడనిపరాక్రమంబుగలవాఁడును ; లోకపాలోపమం=దిక్పాలకులతోఁ బోల్కిగలవాఁడునగు, తం=ఆరాముని; నాథం=ప్రభువుగా; అకామయత= కోరెను.

భూమి, యిట్లుఆశ్రితసంరక్షణమందుబద్ధవ్రతుండైఎదురులేనిపరాక్రమంబుగల్గి, దిక్పాలురకు సరివచ్చుచున్నరామునిందనకుఁబ్రభువుకాఁగోరెను.

అని, తాత్పర్యము.

లేక; ఏవం= ఇట్లుబాలకాండమునందుఁజెప్పఁబడినట్లుగా ; వ్రతసంపన్నం = "రామస్తుసీతయాసార్ధం" (రాముఁడుసీతతోఁగూడఁగ్రీడించెను) అని చెప్పినట్లు ; పత్నీవ్రతము , అనఁగా, క్రీడించుటయనువ్రతముతోఁగూడినవాఁడును ; అప్రధృషపరాక్రమం — ఎదిరింపగూడనిపరాక్రమంబు గలవాఁడును; లోకపాలోపమం; (విశేషణోభయపదము) లోకపాల= లోకంబులఁ బాలించువాఁడును ; ఉపమం—సమీపమందులక్ష్మి, యనఁగా, సీతగలవాఁడునగు; తం=అట్లులక్ష్మితోసమస్తభోగంబుల ననుభవించుచున్నరాముని ; మేదినీ=భూమియును; నాథం— పెనిమిటిగా; అకామయత=కోరెను.

బాలకాండము కడపటఁజెప్పబడినట్లుగా, నెల్లప్పుడు, పత్నితోఁగ్రీడించుచు, నెదురులేక శత్రువులంజంపుచు,

లోకంబులం బాలింపఁగలిగి, యెల్లప్పుడు సీతారూపయగు లక్ష్మితోఁగూడి, సమస్తభోగంబుల ననుభవించుచున్న రామునింబూచి, భూమియును, దనకుఁ బెనిమిటిగా, వరించెను.

అని, తాత్పర్యము.

ఏతైస్తుబహుభి ర్యుక్తం గుణై రనుపమై స్సుతమ్. ౩౮
దృష్ట్వా దశరథో రాజా చక్రే చింతాం పరంతపః

టీక॥ అనుపమైః = సరిలేని; బహుభిః = పెక్కులయిన; ఏతైః = ఈ; గుణైః = గుణములతోను; యుక్తం = కూడిన; సుతం = కొడుకయిన రాముని; దృష్ట్వా = చూచి; పరంతపః = శత్రువులఁదాపమునొందఁజేయువాఁడును; రాజా = రాజునగు; దశరథః = దశరథుఁడు; చింతాం = ఆలోచనమును; చక్రే = చేసెను.

ఇట్లెవ్వరియందునగపడని లెక్కలేని గుణంబులతోఁగూడియున్నతన కుమారుండగు రామునింబూచి; శత్రువులసంహరించువాఁడైనదశరథమహారాజు; ఆలోచించెను.

అని, తాత్పర్యము.

అథ రాజ్ఞో బభూవైవం వృద్ధస్య చిరజీవినః. ౩౯
ప్రీతి రేషా కథం రామో రాజా స్యాన్మయి జీవతి

టీక॥ అథ = అటుపిమ్మట; చిరజీవినః = బహుకాలముగా బ్రతుకుచున్నవాఁడును; వృద్ధస్య = ముదుసలియునగు రాజ్ఞః = దశరథమహారాజునకు; ఏవం = ఈప్రకారముగా; "మయి = నేను; జీవతి = బ్రతుకుచుండఁగా; కథం = ఎట్లు; రామః = రాముఁడు; రాజా = రాజు; స్యాత్ = అగును" ఏషా = ఈ; ప్రీతిః = (లక్షణచే) చింత; బభూవ = ల్గినది.

అంత, బహుకాలము బ్రతికి వృద్ధుండగుటంజేసి, దశరథమహారాజు, ఈప్రకారము "నేను బ్రతికియుండఁగా, రాముండెట్లు రాజు కాఁగలఁ"డని, యిట్లు చింతించెను. అని, తాత్పర్యము.

ఏషా హ్యస్య పరాప్రీతి హృది సంపరివర్తతే. ౪౦
కదా నామ సుతం ద్రక్ష్యామ్యభిషిక్తమహం ప్రియం

టీక॥ "అహం—నేను; కదానామ—ఎప్పుడు ("నామ" అనునది వాక్యాలంకారార్థము); అభిషిక్తం— అభిషేకింపఁబడిన; ప్రియం=ఇష్టుఁడైన; సుతం=కొడుకును; ద్రక్ష్యామి—చూడఁగలను; ఏషా=ఈ; పరా=అధికమయిన; ప్రీతిః—చింత; అస్య=ఈదశరథునియొక్క; హృది=మనసునందు; సంపరివర్తతేహి—చక్కఁగానాటుకొన్నదిగదా!

"ఎప్పుడు, నేను రాజ్యమునందభిషిక్తుండగు నా ప్రియకుమారుండయిన రాముంజూడఁగలను." ఇట్లు, దశరథుండు, ఎల్లప్పుడును మనంబునఁ గోరుచుండును. అని, తాత్పర్యము.

వృద్ధికామో హి లోకస్య సర్వభూతానుకంపనః. ౩౭
మత్తః ప్రియతరో లోకే పర్జన్య ఇవ వృష్టిమాన్

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; లోకస్య=జనముయొక్క; వృద్ధికామో హి= వృద్ధిఁగోరువాఁడుగదా! సర్వభూతానుకంపనః—సర్వప్రాణులనుదయతోఁజూచువాఁడు; వృష్టిమాన్=వర్షముగలిగినట్టి; పర్జన్య ఇవ (స్థితః)=మేఘమువలెనున్నవాఁడు; లోకే=జనులవిషయమయి; మత్తః—నాకన్నను; ప్రియతరః = ఎచ్చుగాఁబ్రియుండు.

నాకుమారుండగు, రాముండు, జనులవృద్ధినిఁగోరును; సమస్త ప్రాణులందు నుదయగలవాఁడు; వానఁగురియుచుండు మేఘముఁబోలె జనులసంతాపమును హరించువాఁడు; నాకన్నను, జనులకతండు చాలఁబ్రియుండు. అని, తాత్పర్యము.

యమశక్రసమో వీర్యే బృహస్పతిసమో మతౌ. ౩౮
మహీధరసమో ధృత్యాం మత్తశ్చ గుణవత్తరః

టీక॥ రామః(అధ్యాహృతము)=రాముఁడు; వీర్యే= పరాక్రమమందు; యమశక్రసమః=యమునితోను దేవేంద్రునితోను సమానుఁడు; మతౌ = బుద్ధియందు; బృహస్పతిసమః= బృహస్పతితోసమానుఁడు; ధృత్యాం—ధైర్యమునందు; మహీధరసమః — పర్వతముతోసమానుఁడు; మత్తశ్చ—నాకన్నను; గుణవత్తరః—ఎచ్చుగాగుణంబులుగలవాఁడు.

రాముండు పరాక్రమంబున యమ

దేవేంద్రులవంటివాఁడు; బృహస్పతివలెఁ,జాలబుద్ధిశాలి;ధైర్యంబునఁ,బర్వతమునకు సరివచ్చును;నాకన్నను అధికగుణవంతుండు. అని, తాత్పర్యము.

మహీ మహ మిమాం కృత్స్నా మధి తిష్ఠంత మాత్మజం. ౩౯
అనేన వయసా దృష్ట్వా యథా స్వర్గ మవాప్నుయామ్

టీక॥అహం=నేను; ఇమాం=ఈ; మహీం=భూమిని;కృత్స్నాం= అంతను; అధితిష్ఠంతం = అధిష్ఠించుచున్న, పాలించుచున్నయనుట; ఆత్మజం=కొడుకైన రాముని; అనేన = ఈ; వయసా=వయసుతో; దృష్ట్వా=చూచి;యథా=ఎట్లు;స్వర్గం=స్వర్గమును; అవాప్నుయాం=పొందుదునో; తథాభవేతిశం (అధ్యాహృతము)= అట్లగు నాయేమి.

నాకీవయసునసే, రాముండు, ఈ భూమండలము నంతయుఁ బాలింపఁగా,నతనింజూచి, స్వర్గంబునొందునట్లుఘటిల్లునాయేమి? అని,దశరథుండు, చింతించెను. అని, తాత్పర్యము.

ఇత్యే తై ర్వివిధై స్తైస్తై రన్యపార్థివ దుర్లభైః. ౪౦
శిష్టై రపరిమే యైశ్చ లోకే లోకోత్తరై ర్గుణైః
తం సమీక్ష్య మహారాజో యుక్తం సముదితై శ్శుభైః. ౪౧
నిశ్చిత్య సచివై స్సార్ధం యువరాజ మమన్యత

టీక॥ఇతి=ఇట్లు; వివిధైః= పలుదెఱంగులయినవియును; అన్యపార్థివదుర్లభైః = ఇతరరాజులకుఁ బొందఁగూడనవియునగు;తైఃతైః=ఆయా; ఏతైః= ఇప్పుడు చెప్పఁబడినగుణంబులతోను;అపరిమేయైశ్చ= లెక్కింపరానివియును;లోకే=ప్రపంచమందు; లోకోత్తరైః=శ్రేష్ఠంబులును; శిష్టైః= ఇప్పుడుచెప్పఁగామిగిలిన;సముదితైః=చేరినవియును ; శుభైః = మంగళకరములునగు;గుణైశ్చ= గుణములతోను; యుక్తం=కూడిన; తం=ఆరాముని;సమీక్ష్య=చూచి; మహారాజః=దశరథమహారాజు;సచివైస్సార్ధం= మంత్రులతోఁగూడ;నిశ్చిత్య=ఏర్పాటుచేసి; యువరాజం= యువరాజునుగా; అమన్య

త=తలంచెను.

ఇట్లు, నానావిధంబులును ఇతరరాజదుర్లభంబులునగునీగుణంబులును, మతిలెక్కకురాని, లోకోత్తరంబులును మంగళకరములునగునితరగుణంబులును గలిగియున్న యారాముంజూచి, దశరథమహారాజు, మంత్రులతోనాలోచించి, "రాముండు యువరాజు కాఁగలండు" అని, నిశ్చయించెను.

అని, తాత్పర్యము.

దివ్యంతరిక్షే భూమౌచ ఘోర ముత్పాతజం భయం. ౪౨
సంచచక్షేథ మేధావీ శరీరే చాత్మ నో జరాం

టీక॥ అథ=అటుతర్వాత; మేధావీ= బుద్ధిమంతుండగుదశరథుండు; దివి=స్వర్గమునందును; అంతరిక్షే= ఆకాశమునందును; భూమౌచ=భూమియందును; ఉత్పాతజం= ఉత్పాతములవలనఁగలిగిన; భయం=భయమును; ఆత్మనః=తనయొక్క; శరీరే= దేహమునందు(ఉన్న) జరాం=ముదుసలితనమును; సంచచక్షే=చెప్పెను.

అంత బుద్ధిమంతుండగు, దశరథుండు, "స్వర్గమునందును ఆకాశమునందును భూమియందును నానావిధంబులగు నుత్పాతంబులు భయంకరంబులయినవి జనించుచున్నవి; ఇవి రాజునకుఁగీడు దెల్పునవి ; మఱియు, నాదేహమందు వార్ధకమధికమగుచున్నది; కావున, శీఘ్రింబుగా, రామునకుఁబట్టంబుఁగట్టవలయును" అని, మంత్రులకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

పూర్ణ చంద్రానన స్యాథ శోకాపనుద మాత్మనః. ౪౩
లోకే రామస్య బుబుధే సంప్రియత్వం మహాత్మనః

టీక॥అథ = అటుతర్వాత; సః(అధ్యాహృతము)=ఆదశరథుఁడు; మహాత్మనః=అధికమయినబుద్ధిగలవాఁడును; పూర్ణ చంద్రాననస్య = నిండుచంద్రునివంటిముఖముగలవాఁడునగు; రామస్య=రామునియొక్క; ఆత్మనః=తనకు; శోకాపనుదం=దుఃఖముపోఁగొట్టునట్టి; లోకే = జనముविషయమయి; సంప్రియత్వం=చాలనిష్టుండగుటను; బుబుధే=తెలిసికొనెను.

అంత, "మిక్కిలియును బుద్ధిశాలియునిండుచందురునింబోలు ముఖంబుగ

లవాఁడునగు రాముండు, జనులకుంజా లంబ్రియుండు; దానంజేసి, అతనికిఁబట్ట ముగట్టుటకుజనులొప్పరో యేమోయని తనకుదుఃఖములేదు" అని, యెంచెను. అని, తాత్పర్యము.

ఆత్మనశ్చ ప్రజానాంచ శ్రేయసేచ ప్రియేణచ. ౪౪
ప్రాప్త కాలేన ధర్మాత్మా భక్త్యాత్వరిత వాన్నృపః

టీక॥ధర్మాత్మా = ధర్మబుద్ధిగలః;నృపః = దశరథమహారాజు; ఆత్మనశ్చ=తనయొక్కయు;ప్రజానాంచ= జనులయొక్కయు; శ్రేయసేచ=మంచికొఱకును;ప్రియేణచ=(చతుర్థ్యర్థమందుఁదృతీయ) సంతోషము కొఱకును; ప్రాప్తకాలేన=లభించిన యుక్తకాలముతో; సహితః(అధ్యాహృతము)= కూడినవాఁడై;భక్త్యా=ప్రీతిచేత; త్వరితవాన్=వేగిరపడెను.

ధర్మాత్ముండగు దశరథమహారాజు,తనకునుజనులకును,మంచియునుసంతోషంబునుగలుగుటకై, యుక్తకాలంబునఁ,బ్రీతియుక్తుండై,రామాభిషేకంబునకై,త్వరపడెను.

అని, తాత్పర్యము.

నానానగరవాస్తవ్యాన్ పృథగ్జాన పదానపి. ౪౫
సమానినాయ మేదిన్యాః ప్రధానాన్ పృథివీ పతీన్

టీక॥సః(అధ్యాహృతము)= ఆదశరథుండు;నానానగరవాస్తవ్యాన్=పలు విధంబులయిన పట్టణంబులనుండునట్టిజనంబులను;జానపదానపి=గ్రామసమూహమునందుండు వారలను; మేదిన్యాః=భూమికి;ప్రధానాన్=ముఖ్యులయిన;పృథివీపతీన్ = రాజులను;పృథక్ = వేఱుగా; సమానినాయ=రప్పించెను.

దశరథుండు,నానాపట్టణంబులనుండుజనంబులను గ్రామంబులనుండుజనంబులను,ముఖ్యులగురాజులను, సాధారణులగురాజులను, వేర్వేఱుగాఁబిలిపించెను. అని, తాత్పర్యము.

నతు కేకయ రాజానం జనకం వానరాధిపః. ౪౬
త్వరయా చాన యామాస పశ్చాత్తౌశ్రోష్యతః ప్రియమ్

టీక॥నరాధిపః=మనుష్యులకుఁ బ్రభువయినదశరథుండు;త్వరయాచ=శీఘ్రపాటుచేతను,(చకారముచే)దూరమున నుండువారగుటచేతను, కేకయరాజానం (కేకయరాజం) = కేకయరాజునుగాని; జనకంవా = జనకునిఁగాని;"తౌ=ఆయిద్దఱు;పశ్చాత్=వెనుకను;ప్రియం= ప్రియమగురామాభిషేకవార్తను;శ్రోష్యతః=వినఁగలరు" ఇతిమత్వా(అధ్యాహృతము)= అని,తలంచి;నానయామాస= రప్పింపలేదు.

దశరథమహారాజు,అవకాశము లేకుండుటంజేసియు దూరస్థులగుటం జేసియు, కేకయరాజునుగాని జనకమహారాజునుగాని,"వారలు, కార్యమయినవెనుకనీప్రియవార్తవినంగలరు"అని,తలంచి,పిలిపింపఁడయ్యె.

అని, తాత్పర్యము.

తాన్ వేశ్మ నానాభరణై ర్యథార్హం ప్రతిపూజితాన్. ౪౭
దదర్శాలంకృతో రాజా ప్రజాపతి రివ ప్రజాః

టీ॥ రాజా=దశరథమహారాజు;అలంకృతః=అలంకరింపఁబడినవాఁడై ; వేశ్మనానాభరణైః= ఇండ్లచేతను నానావిధంబులగు సొమ్ములచేతను ; యథార్హం = యథాయోగ్యముగా ; ప్రతిపూజితాన్ = పూజింపఁబడిన ; తాన్= ఆవచ్చినవారలను; ప్రజాః= జనులను; ప్రజాపతిరివ=బ్రహ్మదేవుఁడుబోలె;దదర్శ=చూచెను.

దశరథమహారాజు, అట్లుతనయాజ్ఞచేవచ్చినవారలకు విడుదులుచూపించి,నానావిధంబులగుభూషణంబుల నొసంగి,సత్కారంబుచేసి, యాపిమ్మట బ్రహ్మదేవుండుప్రజలంజూచునట్లువారలంజూచెను.

అని, తాత్పర్యము.

అథోపవిష్టే నృపతౌ తస్మిన్ పరబలార్దనే. ౪౮
తతః ప్రవివిశు శ్శేషా రాజానో లోకసమ్మతాః

టీక॥అథ=అంత; పరబలార్దనే= శత్రుసేనలఁబీడించునట్టి; తస్మిన్=ఆ; నృపతౌ = దశరథమహారాజు; ఉపవిష్టే=కూర్చుండఁగా;తతః= ఆపిమ్మట; శేషాః=మిగిలిన; లోకసమ్మతాః= లోకులకిష్టులయిన; రాజానః=రాజులు;ప్రవివిశుః=లోనికిఁ,జొచ్చిరి.

అంత,శత్రుసైన్యంబులంజకాఁడు

నట్టియాదశరథమహారాజు, కూర్చుండి నవెనుక, జనకుండుఁ గేకయరాజునుంద కఱఁదకిఁ నజనసమ్మతులగు రాజులురా జసభఁ బ్రవేశించిరి. అని, తాత్పర్యము.

అథ రాజవితీర్ణేషు వివిధే ష్వాసనేషుచ. ౪౮
రాజాన మేవాభిముఖా నిషేదుర్నియతా నృపాః

టీక॥ అథ=అంతట; నృపాః=రాజులు; రాజవితీర్ణేషు= దశరథమహారాజు చేనివ్వఁబడిన ; వివిధేషు=నానావిధంబులయిన; ఆసనేషు=సింహాసనంబులందు(చకారంబు పాదపూరణార్థము); రాజానమేవ = దశరథమహారాజును గూర్చియే; అభిముఖాః=ఎదురైనముఖములుగలవారలై ; నియతాః=నియమముగలవారలై ; నిషేదుః=కూర్చుండిరి.

అంత, నారాజులు, దశరథునిచేనిర్దిష్టంబులగు నానావిధంబులయినయాసనంబులందు, అతనికెదురుగా, రాజునొద్దఁగూర్చుండు తెఱంగున, నియమంబుగలిగి, కూర్చుండిరి. అనితాత్పర్యము.

స లబ్ధమానై ర్వినయాన్వితై నృపైః
పురాలయై ర్జానపదైశ్చ మానవైః
ఉపోపవిష్టై ర్నృపతి ర్వృతో బభౌ
సహస్రచక్షు ర్భగవా నివా మరైః. ౫౦౪

టీక॥ లబ్ధమానైః = పొందఁబడినపూజగలవారలును; వినయాన్వితైః= అణఁకువతోఁగూడినవారలును; పురాలయైః = పట్టణంబునందునికిగలవారలును; జానపదైః= గ్రామములనుండువారును; ఉపోపవిష్టైః=దగ్గిఱదగ్గిఱగాఁ గూర్చున్నవారునగు ; నృపైః=రాజులచేతను; మానవైశ్చ=జనులచేతను; వృతః=చుట్టఁబడిన; నృపతిః=దశరథమహారాజు ; అమరైః=దేవతలచే; వృతః (అధ్యాహృతము)= చుట్టఁబడిన; భగవాన్=మాహాత్మ్యముగల; సహస్రచక్షురివ= వేయికండ్లుగలదేవేంద్రునివలె; బభౌ=ప్రకాశించెను.

దశరథుండు, పట్టణంబులనుండియు గ్రామంబులనుండియు, వచ్చిన, రాజులు నుబ్రజలును, దనవలనఁబూజనొంది, తనవచనంబు విననఁగావలయునని , విన

యంబునదగ్గిఱదగ్గిఱగా వచ్చితనచుట్టు నుంగూర్చుండఁగా; వారలనడుమనుం డునప్పుడు, దేవతలనడుమనుండుభగవంతుండగు దేవేంద్రుండుంబోలె బ్రకాశించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ప్రథమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ ప్రథమసర్గ టీక,
ముగిసినది.

---

శ్రీః

## ద్వితీయ సర్గ ప్రారంభః.



తతః పరిషదం సర్వా మామన్త్ర్య వసుధాధిపః
హిత ముద్ధర్షణం చైవ మువాచ ప్రథితం వచః. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; వసుధాధిపః= భూమికిఁబ్రభువైన దశరథుండు పరిషదం=సభను; సర్వాం=అంతను; ఆమంత్ర్య=పిలిచి; ఏవం=ఇట్లు; హితం=

మేలు సేయునదియు; ఉద్ధర్షణం= సంతోషింపఁజేయునదియు; ప్రథితం= ప్రసిద్ధమనఁగు, స్పష్టమయినయర్థముగలదియునగుఅనుట; వచః=మాటను ; ఉవాచ=చెప్పెను.

అంత, దశరథమహారాజు, సభలోనివారలనందఱంజూచి, మేలు సేయునదియు సంతోషముగల్గించునదియు స్పష్టార్థమునగుమాటఁజెప్పెను.

అని, తాత్పర్యము.

దుందుభిస్వనకల్పేన గంభీరేణా సునాదినా
స్వరేణ మహతా రాజా జీమూత ఇవ నాదయన్. ౨
రాజలక్షణయుక్తేన కాంతేనా నుపమేనచ
ఉవాచ రసయుక్తేన స్వరేణ నృపతి ర్నృపాన్. ౩

టీక॥ నృపతిః=మనుష్యులకుఁ బ్రభువైన; రాజా=దశరథమహారాజు ; నృపాన్=రాజులనుగూర్చి; దుందుభిస్వనకల్పేన=భేరీధ్వనితో సమానమయినదియు; గంభీరేణ= భయంకరంబును; అనువాదినా= ప్రతిధ్వని గలిగించునదియు; రాజలక్షణయుక్తేన=రాజలక్షణముతోఁ గూడినదియును ; కాంతేన= మృదువయినదియు; అనుపమేనచ=సరిలేనిదియు; రసయుక్తేన= మాధుర్యముతోఁగూడినదియునగు; స్వరేణ=ధ్వనిచేత; మహతా=అధికమయిన; స్వరేణ=ధ్వనిచేత; నాదయన్=ధ్వనించుచున్న; జీమూతఇవ(స్థితః)= మేఘమువలెనున్నవాఁడై; ఉవాచ=చెప్పెను.

మనుష్యులకుఁబ్రభుండగు దశరథమహారాజు, భేరీధ్వనికిని మేఘ గర్జనంబునకునుసరివచ్చుచుగంభీరంబై, దిక్కులం బ్రతిధ్వనిగలిగించుచు, రాజార్హంబగులక్షణంబుగలిగి, మృదువై, మనోహరంబయిన, స్వరంబున, నాసభలోనిరాజులంజూచి, చెప్పెను.

అని, తాత్పర్యము.

విదితం భవతా మేత ద్యథా మే రాజ్య ముత్తమమ్
పూర్వకై ర్మమ రాజేంద్రై స్సుతవ త్పరిపాలితమ్. ౪

టీక॥ మే=నాయొక్క; ఉత్తమం=శ్రేష్ఠమయిన; రాజ్యం=రాజ్యము ; మ

మ=నాకు; పూర్వకైః = ముందుండిన; రాజేంద్రైః = రాజశ్రేష్ఠులచేత; సుతవత్=కొడుకువలె; యథా=ఎట్లు; పరిపాలితం=రక్షింపఁబడినదో; తత్ (అధ్యాహృతము)=అట్టి; ఏతత్ = ఈవిధము; భవతాం=మీకు; విదితం=తెలిసియున్నది.

ఇప్పుడు, నాదైన యీరాజ్యమును, నాకుమునుపుండినరఘుమహారాజు మున్నగువారలు, పుత్రునింబోలె, రక్షింపుచుండిరనుటమీకుఁదెలిసియేయున్నది.

అని, తాత్పర్యము.

సోఽహ మిక్ష్వాకుభి స్సర్వై ర్నరేంద్రైః పరిపాలితమ్
శ్రేయసా యోక్తుకామోఽస్మి సుఖార్హ మఖిలంజగత్. ౫

టీక॥ సః=అట్టి; అహం = నేను; ఇక్ష్వాకుభిః= ఇక్ష్వాకువంశమునందుఁబుట్టిన; నరేంద్రైః = రాజులచేత; సర్వైః=అందఱచేతను; పరిపాలితం= రక్షింపఁబడినదియును; సుఖార్హం= సుఖమునకుఁదగినదియునగు; అఖిలం= సమస్తమయిన; జగత్=రాజ్యమును; శ్రేయసా = మంచితో; యోక్తుకామః=కూర్పఁగోరువాఁడను; అస్మి=అగుచున్నాను.

ఇక్ష్వాకువంశంబునం బుట్టినరాజులందఱునుసుఖంబుగా రక్షింపుచుండిన సుఖార్హంబగునీరాజ్యంబునకు, నేనిప్పుడు, శ్రేయంబొనగూర్పఁగోరెదను.

అని, తాత్పర్యము.

మయాప్యాచరితం పూర్వైః పంథాన మనుగచ్ఛతా
ప్రజా నిత్య మనిద్రేణ యథాశక్త్యభిరక్షితాః. ౬

టీక॥ పూర్వైః=మునుపటిరాజులచేత; ఆచరితం=అనుష్ఠింపఁబడిన; పంథానం=మార్గమును; అనుగచ్ఛతా= అనుసరించువాఁడను; నిత్యం=ఎల్లప్పుడును; అనిద్రేణ= తూఁగులేనివాఁడనగు, జాగరూకుండననుట; మయాపి=నాచేతను; ప్రజాః=జనులు; యథాశక్తి=శక్తినతిక్రమింపక; అభిరక్షితాః = కాపాడఁబడిరి.

నేనును, మునుపటిరాజులాచరించిన పద్ధతిననుసరింపుచు, నెప్పుడు నేమఱక, జాగరూకుండనై, నాశక్తికొలంది, జనులరక్షించినాఁడను.

అని, తాత్పర్యము.

ఇదం శరీరం కృత్స్నస్య లోకస్య చరతా హితమ్
పాండురస్యాతపత్రస్య చ్ఛాయాయాం జరితం మయా. ౭

టీక॥కృత్స్నస్య=సమస్తమయిన: లోకస్య=జగత్తునకు;హితం = మేలును, చరతా=చేయుచున్న;మయా = నాచేత;ఇదం=ఈ;శరీరం=దేహము; పాండురస్య= తెల్లని;ఆతపత్రస్య = గొడుగుయొక్క;ఛాయాయాం = నీడయందు;జరితం=ముదుసలితనముగలది గాఁజేయఁబడినది.

నేను సమస్తలోకంబునకును, మేలుసేయుచు , సమస్తశత్రువులఁజక్కాడుచు, నెదురులేక,ప్రజలఁబాలింపుచు, శ్వేతచ్ఛత్రంపు నీడయందే సంచరింపుచు,నిట్లువార్ధకంబునొందితిని.

అని. తాత్పర్యము.

ప్రాప్య వర్షసహస్రాణి బహూన్యాయూంషి జీవతః
జీర్ణస్యాస్యశరీరస్య విశ్రాంతి మభిరోచయే. ౮

టీక॥బహూని=అనేకములయిన;వర్షసహస్రాణి = సంవత్సరములయొక్క-వేలు,అఱువదివేల సంవత్సరంబులనుట;ఆయూంషి = జీవితకాలమును, ప్రాప్య=పొంది;జీవతః = బ్రతుకుచున్నదియు; జీర్ణస్య = ముసలితనము నొందినదియునగు;అస్య=ఈ ; శరీరస్య=దేహమునకు; విశ్రాంతిం = ఊఱటను;అభిరోచయే=కోరుచున్నాను.

నేను,అఱువదివేలసంవత్సరములవఱకుజీవించి,యిప్పుడు,వృద్ధుండనైతి ; కావున,నింక శ్రమపడలేను, విశ్రాంతింగోరుచున్నాను.

అని, తాత్పర్యము.

రాజప్రభావజుష్టాం హి దుర్వహా మజితేంద్రియైః
పరిశ్రాంతోస్మి లోకస్యగుర్వీం ధర్మధురం వహన్. ౯

టీక॥అహం (అధ్యాహృతము)= నేను;రాజప్రభావజుష్టాం= రాజుయొక్క,శౌర్యధైర్యాది ప్రభావములచేసేవింపఁబడినదియును;అజితేంద్రియైః = జయింపఁబడనియింద్రియములు గలవారిచేత;దుర్వహాం= మోయనలవిగానిదియును;గుర్వీం=గొప్పదియునగు;లోకస్య=జగత్తుయొక్క; ధర్మధురం=

ధర్మ=మనెడుభారమును ; వహన్=మోయుచు;పరిశ్రాంతః=అలసటనొందినవాఁడను; అస్మిహి = అగుచున్నానుగదా!

శౌర్యాదులుగలవానికి మాత్రంబె చేయసాధ్యమును,జితేంద్రియులుకానివారలకుఁజేయనలవిగానిదియుమిగులఁగష్టంబునగు నీధర్మపరిపాలనంబుసేయుచునలసియున్నాఁడను.

అని, తాత్పర్యము.

సోహం విశ్రమ మిచ్ఛామి పుత్రం కృత్వా ప్రజాహితే
సన్నికృష్టా నిమాన్ సర్వా ననుమాన్య ద్విజర్షభాన్. ౧౦

టీక॥సః=అట్టి;అహం= నేను ; ప్రజాహితే = జనులమేలువిషయమునందు;పుత్రం=కొడుకును;కృత్వా = చేసి ; నియమించియనుట = సన్నికృష్టాన్=సమీపించియున్న; అంతరంగభూతులైనయనుట;ఇమాన్=ఈ; ద్విజర్షభాన్=బ్రాహ్మణశ్రేష్ఠులను ; సర్వాన్=అందఱను;అనుమాన్య = ఒప్పించి;విశ్రమం=ఊఱటను;ఇచ్ఛామి = కోరుచున్నాను.

ఇట్లు,పరిశ్రాంతుఁడనువృద్ధుఁడనగు నేను,ప్రజారక్షణమందు, నాపుత్రుని యమించి, యంతరంగ భూతులయిన బ్రాహ్మణశ్రేష్ఠులగు వసిష్ఠాదులనందఱ సమ్మతిపడునట్లు చేసి,విశ్రాంతి నొందఁగోరుచున్నాను.

అని, తాత్పర్యము.

అనుజాతోహి మాం సర్వై ర్గుణై ర్జ్యేష్ఠో మమాత్మజః
పురందరసమో వీర్యే రామః పరపురంజయః ౧౧

టీక॥వీర్యే = పరాక్రమమునందు; పురందసమః=దేవేంద్రునితోసమానుఁడును;పరపురంజయః = శత్రువులపట్టణంబులజయించువాఁడును; మమ=నాయొక్క; జ్యేష్ఠః=పెద్ద; ఆత్మజః=కొడుకునగు;రామః=రాముఁడు;మాం=నన్ను;సర్వైః=సమస్తములయిన; గుణైః=గుణములచేత; అనుజాతోహి = అనుసరించిపుట్టినాఁడుగదా!

నాపెద్దకొడుకు రాముండు, పరాక్రమంబున దేవేంద్రునకుసరివచ్చు వాఁడు; శత్రువులపట్టణంబులజయించువాఁడు;అన్నిగుణంబులను, నన్నుఁబోలిపుట్టినాఁడు,అని, తాత్పర్యము.

తం చంద్ర మివపుష్యేణ యుక్తం ధర్మభృతాం వరమ్
యౌవరాజ్యే నియోక్తాస్మి ప్రీతః పురుషపుంగవమ్. ౧౨

టీక॥అహం(అధ్యాహృతము)= నేను;ధర్మభృతాం=ధర్మమునుభరించువారిలోపల;వరం=శ్రేష్ఠుడును; పురుషపుంగవం=పురుషశ్రేష్ఠుండును ; పుష్యేణ = పుష్యనక్షత్రముతో , యుక్తం=కూడిన, చంద్రమివ (స్థితం) = చంద్రుండుంబోలె నున్నవాడు నగు; తం=ఆరామునిః;ప్రీతః= సంతోషముగలవాడనై;యౌవరాజ్యే = యువరాజుభారతసమునందు;నియోక్తాస్మి= నియమించెదను.

ధార్మికులలో శ్రేష్ఠుండును పురుషశ్రేష్ఠుండును,పుష్యనక్షత్రముతోఁగూడినచంద్రుండుఁబోలెనతిప్రకాశంబుగలవాఁడునగునారాముని, సంతోషంబున,యువరాజుగాఁజేయఁగోరెదను.

అని, తాత్పర్యము.

అనురూప స్స వై నాథో లక్ష్మీవాన్ లక్ష్మణాగ్రజః
త్రైలోక్యమపి నాథేన యేన స్యా న్నాథవత్తరమ్. ౧౩

టీక॥ యేన=ఏ;నాథేన=ప్రభుండగురామునిచేత;త్రైలోక్యమపి = ముల్లోకంబులును;నాథవత్తరం=అధికముగాఁబ్రభువుగలది; స్యాత్=అగునో;లక్ష్మీవాన్=కాంతిగలవాఁడును; లక్ష్మణాగ్రజః = లక్ష్మణునకన్నయునగు; సః=ఆరాముఁడు; అనురూపః=తగిన; నాథో వై =ప్రభువుగదా!

ఎవ్వండు,ప్రభువైన, ముల్లోకంబులునుఅధికముగా,సనాథములగునో, అట్టి,లక్ష్మీవంతుండును , తమ్ముండగులక్ష్మణునియందధిక ప్రీగతిలవాఁడగుటంజేసియాశ్రితులందఱతటను అత్యధిక ప్రీతిసేయువాఁడనియెన్నందగినవాఁడు నగురాముండు, మీకుందగిననాథుండు.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—సః=ఆరాముఁడు; అనురూపఃనాథః= సహజుండగునాథుండు; ఇతరులుప్రార్థ్యానువర్తులు కావుననౌపాధికులు. అనురూపః=అనుకూలమయిన రూపము గలవాఁడు, సుందరవిగ్రహుండనుట అనురూపః= అనుసరించురూపంబుగలవాఁడు, అన్నిటనువ్యాపించియుండువాఁడు. అనురూ




పః=తనయందను ప్రవిష్టములైనరూపములుగలవాడు, సమస్తశరీరిమయుండు అనురూపః=అనుస్యూతములైననానారూపములుగలవాఁడు, నానావిధములగునవతారములచే నిండియుండు వాఁడు; అనురూపః=ఓః రుద్రస్యరూపమివ రూపం యస్యసః, ఉరూపః= శివునిరూపంబువంటిరూపంబుగలవాఁడు "ఉరూపుఁడు" ననభవతీత్యనురూపః=అతండుకానివాఁడు "అనురూపుఁడు" శివునిశరీరమువంటిశరీరముగలుగనివాఁడు, శివుఁడుఁబోలె, విరూపాక్షుండు కాఁడు మఱి, పుండరీకాక్షుండనుట. వినాథః= పక్షులకునాథుండగుహంసము, తత్సంబంధీవైనాథః = దాని సంబంధముగలవాఁడు, వైనాథుఁడు, హంసవాహనుండగుబ్రహ్మ; సవైనాథః = ఆ బ్రహ్మతోఁ గూడినవాఁడు, నాభికమలంబునబ్రహ్మదేవునిధరించువాఁడనుట. వినాథః= పక్షులకుఁ బ్రభువయినగరుత్మంతుఁడు, తత్సంబంధీవైనాథః=గరుడవాహనుండగువాఁడు, అనురూపుండగు; నాథుఁడగుటకుఁ గారణంబు.— లక్ష్మీవాన్=లక్ష్మీదేవిగలవాఁడు, లక్ష్మీదేవికిఁ బెనిమిటియనుట. లక్ష్మణాగ్రజః=లక్ష్మణునకన్నః సాక్షాద్విష్ణుండెనను, అవతారోపాధిచే, మనుష్యుండగానున్నాఁడనుట; లక్ష్మణశబ్దము ఆశ్రితోపలక్షణము; ఆశ్రితులనుతమ్ముల నన్నవోలెరక్షించువాఁడు, "రాముఁడనురూపుండగునాథుండు" అనుటకుఁగారణాంతరము.— త్రైలోక్యమపి = ముల్లోకంబులును; లేక, "నిత్యము. అనిత్యము, నిత్యానిత్యము" అని మూఁడువిధంబులగు ప్రపంచమును; యేననాథేన — ఏప్రభువుచేత; ఇతనికి నాథత్వమునిత్యమనుట, నాథవత్తరం = అధికముగాఁ బ్రభువుగలదో; "నాథవత్" (ప్రభువుగలది) అనుటచేతనే, ఇంద్రాదివ్యావృత్తి (వారల ప్రభుత్వమనిత్యము కావున) యగుచున్నది. "నాథవత్తరం" (అధికముగాఁ బ్రభువుగలది) అనిచెప్పుట, బ్రహ్మరుద్రవ్యావృత్త్యర్థము. బ్రహ్మరుద్రులనాథత్వము విష్ణునను గ్రహంబునంగలిగినది గదా! అట్లు "యుగకోటిసహస్రాణి విష్ణుమారాధ్య పద్మభూః, పునస్త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవానితిశుశ్రుమః" (బ్రహ్మదేవుండు, పెక్కు-వేలకోట్ల యుగంబులువిష్ణునారాధించిముల్లోకంబులకధిపతియగుటంబొందెను("మహాదేవ స్సర్వమేధే మహాత్మాహుత్వాత్మానం దేవదేవోబభూవ" (మహాదేవుండగు శివుండు, సర్వమేధ [illegible], బలిమాత్ముఁడగు




విష్ణువునారాధించి, దేవదేవుండయ్యె(ను)అని,పురాణంబులు చెప్పుచున్నవి. ఇది, వైష్ణవమతము ననుసరించిన యర్థము.

సః=ఆరాముఁడు;అనురూపః=శివునిరూపంబువంటిరూపంబుగలుగనివాఁడు;శివునకుమాత్రము దక్కువయయిన వాఁడు;శివుండుసర్వేశ్వరుండుకావున, విష్ణుండునుదదాశ్రితుండగుటంజేసి, శివునికన్ననితరులగువారికందఱికిని,విష్ణ్వవతారరూపుండగురాముండధికుండనుట. యేననాథేనత్రైలోక్య మపినాథవత్తరం = ఏనాథునిచే ముల్లోకంబులునుఅధికముగాఁబ్రభువుగలదో,"త్రైలోక్యమపి" (ముల్లోకంబులును) అని, యభావద్యోతకంబగు , అపిశబ్దమును జేర్చుటచే , "శివుండుదక్కనన్యుఁడెవ్వఁడును యథార్థంబుగా త్రైలోక్యనాథుండుకాఁడు,ఈవిష్ణుండుమాత్రము, అతనియనుగ్రహమునంజేసి,త్రైలోక్యనాథత్వమునొందెను;ఇతండు,పరమేశ్వర సంప్రాప్తాను గ్రహపాత్రుండు" అని,సూచింపఁబడినది."నాథవత్తరం"అనుటచే,"త్రైలోక్యము,ఇంద్రాదులచే,నాథవంతమగుచున్నది; ఇతనిచేత,నాథవత్తరమగుచున్నది; శివునిచే,నాథవత్తమ మగుచున్నది,యని, వ్యంజితమగుచున్నది.(ఇదిశైవమతము ననుసరించినయర్థము.)

అనేన శ్రేయసా సద్య స్సంయోజ్యైవ మిమాం మహీమ్
గతక్లేశో భవిష్యామి సుతే తస్మి న్నివేశ్యవై. ౧౪

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;తస్మిన్=ఆ; సుతే=కొడుకైనరాముని యందు;ఇమాం=ఈ ; మహీం=భూమిని;నివేశ్య=ఉంచి("వై" అనునది పాదపూరణార్థము);అనేన = ఈ; శ్రేయసా=మేలుతో;ఏవం= ఇట్లు; సద్యః=ఇప్పుడే; సంయోజ్య=కూర్చి;గతక్లేశః=పోయినదుఃఖముగలవాఁడను; భవిష్యామి=అయ్యెదను.

నేను,ఈరాజ్యభారమును, నాజ్యేష్ఠపుత్రుండగు రామునకప్పగించి, దీనివలననిప్పుడే రాజ్యంబునకు మేలొనగూర్చి,విశ్రాంతుండనయ్యెదను.

అని, తాత్పర్యము.

య దిదం మే నురూపార్థం మయా సాధు సుమంత్రితమ్

భవంతో మేనుమన్యంతాం కథంవా కరవాణ్యహమ్. ౧౫

టీక॥ఇదం=ఇది; మే=నాకు, అనురూపార్థఃయది = తగినప్రయోజనముగలదగునేని; మయా=నాచేత; సాధు=దోషములేనట్లుగా; సుమంత్రితం (యది)=చక్కఁగా నాలోచింపఁబడినదగునేని; భవంతః=మీరు; మే=నాకొఱకు; అనుమన్యంతాం=అనుమతింపుఁడు; కథంవా=ఎట్లు; కరవాణి=చేయుదును.

నేనిప్పుడు, రామునభిషేకింప వలయునని తలంపుగొనుట, వృద్ధుండగు నాకుచితమగునేని, నేనుదీని నిర్దోషంబుగాఁజక్కఁగానాలోచించితినని, మీరుతలంతురేని, మీరలొప్పుకొనుఁడు; నేనుమాత్రమెట్లుచేయఁగలను. అని తాత్పర్యము

యద్య ప్యేషా మమ ప్రీతి ర్హితమన్య ద్విచింత్యతామ్
అన్యా మధ్యస్థ చింతా హి విమర్దాభ్యధికోదయా. ౧౬

టీక॥ఏషా=ఈ, రామునభిషేకించుటయనునది; మమ=నాయొక్క; ప్రీతిర్యద్యపి=కోరికయైనను; అన్యత్=వేఱైన; హితం= మేలు; విచింత్యతాం=ఆలోచింపుఁడు. మధ్యస్థచింతా, మధ్యస్థ=పక్షపాతములేనివారియొక్క, చింతా=ఆలోచన; అన్యా=విలక్షణమయినది; విమర్దాభ్యధికోదయాహి= విచారముచేతమిక్కిలియునధికమయినఫలములుగలదిగదా!

రామునభిషేకింపవలయుననునది నేను గోరినదైనను, వేఱు హితంబు మీకుఁదోఁచునేని దానిం జెప్పుఁడు; నిష్పక్షపాతులగు మధ్యస్థులాలోచించుట దానాలోచించుట కన్న నెచ్చైనది, యుక్తిప్రతియుక్తులచే మఱియు మేలుగూర్చినది. అని, దశరథుండు సభలోనుండువారలతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి బ్రువంతం ముదితాః ప్రత్యనందన్ నృపా నృపమ్
వృష్టిమంతం మహామేఘం నదంత ఇవ బర్హిణః. ౧౭

టీక॥ ఇతి=ఈప్రకారము; బ్రువంతం=చెప్పుచున్న; నృపం = దశరథమహారాజును; నృపాః=సభలోనిరాజులు; వృష్టిమంతం=వానగల ; మహామే

ఘం-గొప్పమేఘంబును; నర్దంతిః= అఱచుచున్న; బర్హిణఇవ=నెమళ్లవలె;ముదితాః= సంతసించినవారలై; ప్రత్యనందన్=ప్రశంసించిరి.

దశరథుండిట్లుచెప్పుటవిని,యాసభలోనిరాజులందఱు,వర్షించుచున్న మేఘంబుఁజూచి,మయూరంబులు,సంతోషంబునం గూయుచుఁ బ్రశంసించు నట్లు,దశరథునింబ్రశంసించిరి.

అని,తాత్పర్యము.

స్నిగ్ధో నునాదీ సంజజ్ఞే తత్ర హర్షసమీరితః
జనౌఘోద్ఘుష్టసన్నాదో విమానం కంపయన్నివ. ౧౮

టీక॥ తత్ర = ఆసభయందు; స్నిగ్ధః=స్నేహంబుతోఁగూడినదియును ; అనునాదీ=ప్రతిధ్వనిగల్గించునదియు ; హర్షసమీరితః= సంతోషంబువలనం బుట్టినదియునగు; జనౌఘోద్ఘుష్టసన్నాదః=జనులచేతనఱచిచెప్పఁబడిన" మంచిది"యనెడుధ్వని;విమానం = విమానాకారమగుకట్టడమును ; కంపయన్నివ=కదల్చుచున్నదివోలె,సంజజ్ఞే= పుట్టెను.

సంతోషంబువలననాసభనుండు జనులు"మంచిది!మంచిది!"అని , గట్టిగానఱవఁగా,నాధ్వని,స్నిగ్ధంబయి, ప్రతిధ్వనిగలుగఁజేయుచు, నచ్చటివిమానమునుగదలించునోయనునట్లు,పెల్లుఁ రేఁగినది. అని,తాత్పర్యము.

తస్య ధర్మార్థవిదుషో భావ మాజ్ఞాయ సర్వశః
బ్రాహ్మణా జనముఖ్యాశ్చ పౌరజానపదై స్సహ. ౧౯
సమేత్య మంత్రయిత్వాతు సమతాగతబుద్ధయః
ఊచుశ్చ మనసా జ్ఞాత్వా వృద్ధం దశరథం నృపమ్. ౨౦

టీక॥ధర్మార్థవిదుషః = ధర్మమునర్థమునెఱింగిన;తస్య = ఆదశరథునియొక్క;భావం= తాత్పర్యమును; సర్వశః=అన్నివిధంబులను;ఆజ్ఞాయ= తెలిసికొని;బ్రాహ్మణాః = వసిష్ఠుండు మున్నగుబ్రాహ్మణులును ; జనముఖ్యాశ్చ=జనులలోపెద్దలగురాజులును; పౌరజానపదైస్సహ =పట్టణంబులనుండువారలతోనుగూడ;సమేత్య=చేరి; మంత్రయిత్వాతు=ఆలోచించిమె ; సమ

తాగతబుద్ధయః; సమతనుబొందినబుద్ధులుగలవారలై, ఐకమత్యమును బొందినవారలై యనుట; మనసాచ=మనసుచేతను; జ్ఞాత్వా=తెలిసికొని; వృద్ధం = ముదుసలియును; నృపం=రాజునగు; దశరథం=దశరథునిగూర్చి; ఊచుః= పలికిరి.

దశరథుండు, ధర్మార్థంబుల నెఱింగి చెప్పినమాట తాత్పర్యంబు నన్నివిధంబులం దెలిసికొని, వసిష్ఠాదిబ్రాహ్మణులును రాజులును బ్రజలతోం జేరియాలోచించి, సైకమత్యంబునొంది, తమతమమనంబులలోం జక్కంగా విచారించి, వృద్ధుండగుదశరథమహారాజుం జూచి; యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

అనేకవర్ష సాహస్రో వృద్ధస్త్వ మసి పార్థివ
స రామం యువరాజాన మభిషించస్వ పార్థివం. ౨౧

టీక॥ పార్థివ = దశరథమహారాజా! త్వం= నీవు ; అనేకవర్షసాహస్రః=పెక్కులయినసంవత్సరములయొక్క వేలుగల; వృద్ధః = ముసలివి; అసి=అగుచున్నావు; సః=అట్టినీవు; రామం=రాముని ; పార్థివం=భూమిపాలింపందగిన; యువరాజానం (యువరాజం)=యువరాజునుగా; అభిషించస్వ=అభిషేకింపుము.

దశరథమహారాజా! నీవు పెక్కువేలసంవత్సరంబులు జీవించి వృద్ధుండవైతివి; కావున, నీవు, రాముని, యౌవరాజ్యమునం, దభిషేకింపుము.

అని, తాత్పర్యము.

ఇచ్ఛామో హి మహాబాహుం రఘువీరం మహాబలం
గజేన మహతా౽యాంతం రామం ఛత్త్రావృతాననం. ౨౨

టీక॥ వయం (అధ్యాహృతము)= మేము; మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడును; రఘువీరం; రఘువంశమునఁ బుట్టినవారిలోఁ జాలపరాక్రమశాలియగువాఁడును; మహాబలం =అధికమయినబలముగలవాఁడును; మహతా=గొప్పదైన; గజేన=ఏనుంగుచేత ; ఆయాంతం=వచ్చుచున్నవాఁడును ; ఛత్త్రావృతాననం = గొడుగుచేఁ గప్పంబడినముఖముగలవాఁడునగు ; రామం=రాముని; ఇచ్ఛామోహి=చూడఁ, గోరుచున్నాముగదా!

మేము, మహాబాహుండును మహాబలుండును రఘువంశంబునఁబుట్టినవారిలోముఖ్యుండునగు రాముండు, గొప్ప యేనుంగు నెక్కి శ్వేతచ్ఛత్రంబునీడను వచ్చుచుండఁగాఁ, జూడఁగోరుచున్నాము.

అని, సభలోనివారలుదశరథునితోఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

విశేషార్థము.—"మికురక్షకుండుదశరథుండుండఁగా, రామాభిషేకమునేలగోరెదరు?" అని యాశంకరాఁగా, "మేము, రక్షణార్థమయి రామాభిషేకమునుగోరలేదు, కుమారుండగు రామునిసౌందర్యంబుఁజూచితిమి, యింకఁ, బట్టాభిషిక్తుండగు రాముని సౌందర్యంబుఁజూడఁగోరెదము" అని, చెప్పుచున్నారు.—"ఇచ్ఛామః" అనిబహువచనము చెప్పుటచే, "అట్లుకోరుటయందందఱమునైకమత్యమునొంది యున్నారము" అని సూచింపఁబడుచున్నది. ఇచ్ఛామః=పట్టాభిషిక్తుండైయుండఁగాఁ జూడఁగోరుచున్నాము. ఇచ్ఛామః; మాకిచ్ఛమాత్రమున్నది కార్యనిర్వాహమునీయధీనముగదా! ఇచ్ఛామః=మేము కోరుచున్నాము "శ్రేయాంసిబహువిఘ్నాని" (మన్నివిచాలవిఘ్నంబులుగలవి) అనియున్నది, ఇట్టిశ్రేయస్సుమాకులభించునోయేమో! ఇచ్ఛామః=అభిషేకమగుఁగాక, కాకపోవుఁగాక, మేమేమిసేయఁగలము; మేమేమో! కోరెదము; సుందరవస్తువుఁ జూడనందఱుగోరుదురుగదా! ఇచ్ఛామః=నీవన్నివిధంబుల రక్షకుండవగుటవలననోటితోఁ జెప్పరాదనియెంచి, యింతకాలము, మనసులోఁగోరుచుంటిమి, ఇప్పుడునీయభిప్రాయంబుదెలియవచ్చుటంజేసి, "కోరుచున్నాము" అని, చెప్పెదము. ఇచ్ఛామః = (బహు వచనమయి నందున ) కొందఱికిచ్ఛయున్నది, కొందఱికిలేదనికాదు, అందఱము కోరు చున్నాము. హి = ఈ కోరికి అందఱియందును బ్రసిద్ధమేకదా! నీవామాటఁ జెప్పినంతనే, సభికుల ప్రశంసాధ్వనీయిల్లంతయునిండినదిగదా! "అకామయతమేదినీ" (భూమి రామునినాథునిఁగాఁగోరెదను) నీవునాథుండవున్నను, ఇప్పుడే, భూమి రామునిఁ గోరలేదా!

మహాబాహుం=నిడుపైన చేతులుగలవాఁడు, అతనిబాహుబలంబున కెంత మాత్ర మీభూమిఁ బాలించుట? "శక్తస్త్రైలోక్యమప్యేకః" (ఒకరుఁడె ముల్లోకంబులునుంబాలింపఁజాలు) అని, చెప్పఁబడియున్నదిగదా! మహాబాహుం "బాహుచ్ఛాయామవష్టభ్య" యనునట్లుబాహుచ్ఛాయయె మ




మ్ములరక్షింపఁజాలు. రఘువీరం— "దీనార్త దానేన రాఘవః" (రాఘవుండు దరిద్రులను దానముచే మన్నించును) అని ప్రసిద్ధుండగు రాఘవుండు. రఘువీరం= రఘువు కన్న ధార్మికుండు. మహాబలం=మనోబలముగలవాఁడు, దృఢమయినమనంబుగలవాఁడు. దృఢవ్రతుండనుట. మహాగజేన=గొప్పగజముచేత, శత్రుంజయమనెడు పట్టపేనుంగుచేత, నీవుపట్టాభిషేక కాలమునందొసంగినకిరీటపట్టబంధాదులు, ఏనుఁగునెక్కి వచ్చినప్పుడు చక్కగా మాకగపడును, రథాదుల నెక్కినైననగపడదు. మహతాగజేన= రాముండుమహాగజమువోలెనడుచువాఁడుకావున, నతండువలెనడువంగలగొప్పయేనుంగయినశత్రుంజయముచేత, ఆయాంతం = మహావీధిలో. ప్రతియింటివాకిటనువచ్చుచున్న; ఆయాంతం=వీధిలోవచ్చుచున్న, "ఏకస్స్వాదునభుంజీత" (ఒకండెమధురపదార్థమునుభుజింపరాదు) అనునట్లు, మేముమాత్రమె కాదు, వీధిలోవచ్చునపుడు, భార్యా పుత్రమిత్రాదులునుజూచెదరు. రామం=సౌందర్యముచేత, జనుల మనసునురంజించునట్టి రాముని. ఛత్రావృతాననం= దృష్టిదోషము లేకుండుటకై, గొడుగుచేఁ గప్పఁబడినముఖముగలవాఁడు. కొంచెముగనుపడుచుఁగొంచెముగపడకుండుటచే, ఎచ్చుగాఁజూడవలయునను కోర్కెనుగలిగించుచుండు ముఖంబుగలవాఁడు. గాలియెండలకు వాడకుండునట్లుఛత్త్రముచేఁగప్పఁబడిన ముఖంబు గలవాఁడు. ఛత్రావృతాననం="ఏకచ్ఛత్రాంమహీంభుఙ్క్తే" అని సాముద్రికమందుఁ జెప్పఁబడినలక్షణంబులుగలదియు, సమస్తరాజులజయించియుండుటందెల్పు శ్వేతచ్ఛత్త్రముచేమిక్కిలియుఁ బ్రకాశమునొందినదియునగుముఖంబుగలవాఁడు. "రఘువీరం" అనుటచేత, ఏనుంగుమీఁదఁగూర్చుండునెడనుండువీర్యవిశేషము సూచింపఁబడుచున్నది. "మహాబలం" అనుటచే, మదవుటేనుంగునైననుదృణంబుగానెంచి దానిపైనెక్కసమర్థుండని సూచితమగుచున్నది. రామం=తనసౌందర్యముచేతను గజము నలంకరించువాఁడు. ఛత్త్రావృతాననం= తనముఖకాంతిమండలముచేతంబోలెఛత్త్రావరణముచేతనుంగలిగిన సౌందర్యంబుగలవాఁడు. ఇట్లు, అభిషేకానంతరముకాఁదగిన "రాముండేనుంగునెక్కుటనుకోరెదము", అని, చెప్పటచే, అభిషేకముచేయవలసినదనివ్యంజితమగుచున్నది.




ఇతి తద్వచనం శ్రుత్వా రాజా తేషాం మనఃప్రియం
అజానన్నివ జిజ్ఞాసు రిదం వచన మబ్రవీత్. ౨౩

టీక॥ఇతి=ఈప్రకారముగా; తద్వచనం=ఆసభలోనివారలమాటను; శ్రుత్వా=విని;రాజా = దశరథమహారాజు; తేషాం = వారలయొక్క;మనఃప్రియం=మనస్సునందలిసంతోషమును; అజానన్నివ = తెలియనివాడువోలె;జిజ్ఞాసుః=తెలియఁగోరినవాఁడై;ఇదం=ఈ;వచనం = మాటను;అబ్రవీత్=చెప్పెను.

ఇట్లాసభలోనివారలు చెప్పినమాట విని,దశరథమహారాజు, వారలమనస్సంతోషంబెఱింగినవాఁడయ్యును, ఎఱుంగనివాఁడునోలెనభినయించి , వారలనోటిమాటలముగనె, యెఱుంగఁగోరి,వారలఁజూచి,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రుత్వైవ వచనం యన్మే రాఘవంపతి మిచ్ఛథ
రాజాన స్సంశయోఽయం మే కిమిదం బ్రూత తత్త్వతః. ౨౪

టీక॥రాజానః=రాజులారా; మే=నాయొక్క;వచనం = మాటను;శ్రుత్వైవ=వినినంతనె! రాఘవం=రామునిఁ;పతిం=ప్రభువునుగా ; ఇచ్ఛథ(ఇతి)యత్ ="కోరుచున్నారలనుటయేదిగలదో;(సః)అయం=ఆయిది; మే= నాకు;సంశయః=సందేహము, సందేహకారణమనుట.ఇదం = ఈరామాభిషేకమునుగోరుట;కిం= ఎందుకు? తత్త్వతః=యథార్థముగా; బ్రూత= చెప్పుఁడు.

రాజులారా! నేనురామాభిషేకము చేసెదనని చెప్పినంతనె, మీరుముందువెనుకనాలోచింపక , "రాముండుప్రభువుకావలయు"ననికోరుచున్నారలు,కావున, నాకుసంశయముగలుగుచున్నది; మీరలెందుకు రామాభిషేకముఁగోరితిరి?యథార్థముగాఁజెప్పుఁడు.

అని,తాత్పర్యము.

కథం ను మయి ధర్మేణ పృథివీ మనుశాసతి
భవంతో ద్రష్టు మిచ్ఛంతి యువరాజం మహాత్మజం. ౨౫

స౨

టీక॥ మయి=నేను; ధర్మేణ = ధర్మముచేత; పృథివీం=భూమిని; అనుశాసతి=పాలింపుచుండఁగా; భవంతః=మీరలు; మమ= నాయొక్క; ఆత్మజం=కొడుకును; యువరాజం=యువరాజునుగా; ద్రష్టుం=చూచుటకు; కథమ్=ఎట్లు("ను" అనునది ప్రశ్నార్థకము): ఇచ్ఛంతి=కోరుచున్నారలు.

నేను ధర్మంబుదప్పక భూమిని పాలింపుచుండఁగా, మీరలు . నాకొడుకు యువరాజుకాఁగాఁ జూడవలయునని యెట్లుకోరుచున్నారలు? మీరట్లుకోరునట్లుగా, నేనేమితప్పుగావించితిని . అని, దశరథుండు , సభలోనివారలతోఁ జెప్పెను.అని, తాత్పర్యము.

తే త మూచు ర్మహాత్మానం పౌరజానపదైస్సహ

టీక॥ తే=ఆరాజులు; పౌరజానపదైస్సహ =పట్టణములనుండువారితోను గ్రామంబులనుండువారలతోను గూడి ; మహాత్మానం= పూజ్యమయినస్వభావముగల; తం=ఆదశరథునిగూర్చి ; ఊచుః=చెప్పిరి.

ఆసభలోని రాజులును పట్టణంబుల గ్రామంబుల నుండుజనులు , మహాత్ముండగుదశరథునితో, నిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

బహవో నృప కల్యాణా గుణాః పుత్రస్య సంతి తే. ౨౬

టీక॥ నృప = దశరథమహారాజా! తే=నీయొక్క; పుత్రస్య=కొడుకయినరామునకు; బహవః=అనేకములయిన కల్యాణాః=మంగళకరంబులగు ; గుణాః=గుణంబులు; సంతి=ఉన్నవి.

దశరథమహారాజా! నీకొడుకైనరామునియందు , పెక్కు గుణంబులుమంగళకరంబులయినవున్నవి.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— నృప = మనుష్యులఁబాలించువాఁడా! అని, సంబోధించుటచే, "నీకును నీకొడుకునకును దారతమ్యమున్నది,నీయందుమనుష్యులఁబాలించుటయనుగుణంబుమాత్రమున్నది, అతనియందుఁబెక్కు కల్యాణగుణంబులున్నవి" అని, సూచింపబడు చున్నది , తేపుత్రస్య—నీకొడుకునకు;"రాముని ప్రశంసించుట వలన , దశరథున

కసూయకల్గునో యేమో” యని “నీకొడుకునకు” అని, చెప్పఁబడినది; రాముండట్లు పెక్కు కల్యాణగుణంబులు గల్గియుండుటెల్ల, నీకుఁబుట్టుటవలననె, యనుట. “గుణాః” అని, బహువచనము ప్రయోగించుటచేతనె, బహుత్వము సిద్ధమయినను, మఱల, “బహవః” (అనేకములయినవి) అని చెప్పుటచేత, “లెక్కపెట్టరాని గుణంబులుగలవాఁ”డని సూచింపఁబడినది. “పుత్రస్య గుణాః” (కొడుకునకు గుణంబులు) అని, జన్మసిద్ధంబులని చెప్పుటచే గుణంబులకు స్వాభావికత్వంబు చెప్పఁబడినది. కల్యాణాః=హేయంబులు కానివి, లేక, శుభంబులయినవి. ఇట్లు, “రాముండు, స్వాభావికాసంఖ్యేయకల్యాణగుణుం”డని సూచితమయినది.

గుణాన్ గుణవతో దేవ దేవకల్పస్య ధీమతః
ప్రియా నానందనాన్ కృత్స్నాన్ ప్రవక్ష్యామోద్య తాన్ శృణు. ౨౭

టీక॥ దేవ=దశరథమహారాజా! గుణవతః=ప్రశస్తంబులగు గుణంబులుగలవాఁడును; దేవల్పస్య=దేవతతో సమానుఁడును; ధీమతః= బుద్ధిశాలియునగు; రామస్య (అధ్యాహృతము)=రాముని యొక్క; ప్రియాన్=ఇష్టములును; ఆనందనాన్=సంతోషము గలిగించునవియునగు; తాన్=ఆ; గుణాన్=గుణంబులను; కృత్స్నాన్=అన్నింటిని; అద్య=ఇప్పుడు; ప్రవక్ష్యామః = చెప్పెదము; శృణు=వినుము.

దశరథమహారాజా! గుణవంతుండును దేవతుల్యుండును బుద్ధిమంతుండునగు రాముని, ప్రియంబులు సంతోషజనకంబులునగు గుణంబులనన్నింటిని జెప్పెదము; వినుము.

విశేషార్థము.—“గుణవతః గుణాన్” (గుణంబులుగల రాముని యొక్క గుణంబులను) అనుటచే, గుణంబులు, ఆరోపింపఁబడినవి కావనియు, స్వాభావికంబులనియు సూచితమయినది. “దేవకల్పస్య” (దేవతాసమానుఁడైన రాముని యొక్క) యనుటచే, ఇట్టి గుణంబులు రామునియందు సంభావితంబులే యని సూచింపఁబడినది. “ధీమతః” (బుద్ధిమంతుండగు రాముని యొక్క) అనుటచే, “బ్రాహ్మణులు వచ్చిరి వసిష్ఠుండును వచ్చె” ననఁగా, వసిష్ఠునకుఁ బ్రాధాన్యమగునట్లు, బుద్ధిజనిత జ్ఞానంబునకుఁ బ్రాధాన్యము సూచింపఁబడినది. “ప్రియాన్, ఆనందనాన్, కృత్స్నాన్” అనుటచే కల్యాణంబులని

యు, నిరతిశయంబులనియు లెక్కలే నివనియు సూచింపఁబడినవి. "అద్య ప్రవక్ష్యామః" ఇప్పుడు చెప్పెదము, అనుటచే, "ఇదివఱకు నీవడుగలేదు, మాకునవకాశంబుగలుగలేదు, కావునఁజెప్పమైతిమి, ఇప్పుడు ప్రసక్తి గల్గుటంజేసి, చెప్పెదము" అని, సూచితమగుచున్నది. ప్రవక్ష్యామః" (మేముచెప్పెదము) అనుటచే, "భగవద్గుణంబులనుపదేశించుటయందునందఱు నధికారులే, తెలిసినవారియొద్దఁ దెలియనివాఁడువినవలసినదే" యని తెల్పఁబడినది. ప్రవక్ష్యామః, శృణు" (చెప్పెదము వినుము) అనుటచే, రామగుణంబుల వినుటవలన, నీవునిరతిశయానందము నందుదువు, కావున, సావధానంబుగా, వినుము" అని, సూచితమయినది.

దివ్యై ర్గుణై శ్శక్రసమో రామ స్సత్యపరాక్రమః
ఇక్ష్వాకుభ్యోపి సర్వేభ్యో హ్యతిరిక్తో విశాంపతే. ౨౮

టీక॥విశాం=జనులకు; పతే = ప్రభుఁడవయినదశరథుఁడా! రామః=రాముఁడు; దివ్యైః= స్వర్గమునందుఁగలిగిన, అమానుషంబులయినయనుట; గుణైః=గుణంబులచేత; శక్రసమః=ఇంద్రునితో సమానుఁడు. సత్యపరాక్రమః = ఎచ్చటనువ్యర్థముకాని పరాక్రమంబుగలవాఁడు. ఇక్ష్వాకుభ్యః= ఇక్ష్వాకువంశమునందుఁబుట్టిన; సర్వేభ్యోపి=అందఱికన్నను; అతిరిక్తః=అధికుఁడు.

మనుష్యులకుఁబ్రభుఁడవయినదశరథుఁడా! రాముఁడమానుషంబులగుశౌర్యాదిగుణంబులచే, దేవేంద్రునకుసరివచ్చును; అమోఘంబగుపరాక్రమంబుగలవాఁడు; ఇక్ష్వాకువంశమునంబుట్టినవారిలోనందఱికన్నను, అధికుఁడు.

అని, తాత్పర్యము.

రామ స్సత్పురుషో లోకే సత్యధర్మపరాయణః
సాక్షా ద్రామా ద్వినిర్వృత్తో ధర్మ శ్చాపి శ్రియాసహ. ౨౯

టీక॥లోకే=ప్రపంచమునందు; రామః=రాముఁడు; సత్పురుషః = మంచివాఁడు. సత్యధర్మపరాయణః = సత్యంబునుధర్మంబునె ముఖ్యమయినగ

తిగాఁగలవాఁడు. రామాత్ = రాముని వలన; ధర్మః = ధర్మము; శ్రియాసహ = సంపదతోఁగూడ; సాక్షాత్ = వ్యవధానములేకనే; వినివృత్తః = కలిగినది.

లోకంబున, రాముండె సత్పురుషుండనందగువాఁడు; సత్యంబునందును ధర్మంబునందును జాలనాసక్తిగలవాఁడు; రామునివలన, ధర్మంబును సంపదయును, ఎంతమాత్రమునెడఁబాయలేక, కలిగినవి. అని, తాత్పర్యము.

ప్రజాసుఖత్వే చన్ద్రస్య వసుధాయాః క్షమాగుణైః
బుద్ధ్యా బృహస్పతేస్తుల్యో వీర్యే సాక్షాచ్ఛచీపతేః. ౩౦

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; ప్రజాసుఖత్వే = జనులకు సుఖము సేయువాఁడగుటయందు; చంద్రస్య = చంద్రునకును; క్షమాగుణైః = ఓర్పు మొదలగు గుణములచేత; వసుధాయాః = భూమికిని; బుద్ధ్యా = బుద్ధిచేత; బృహస్పతేః = బృహస్పతికిని; తుల్యః = సమానుఁడు. వీర్యే = పరాక్రమమునందు; శచీపతేః = శచీదేవికిఁ బెనిమిటియైనయింద్రునకు; సాక్షాత్ = సమానుఁడు.

రాముండు, ప్రజలకుసుఖంబు సేయుటయందుఁజంద్రునివంటివాఁడు; ఓర్పునభూమికిసరివచ్చును; బుద్ధియందు బృహస్పతికిసమానుండు; దేవేంద్రునంతటిపరాక్రమంబుగలవాఁడు.

అని, తాత్పర్యము.

ధర్మజ్ఞస్సత్యసంధశ్చ శీలవాననసూయకః
క్షాన్తస్సాన్త్వయితా శ్లక్ష్ణః కృతజ్ఞో విజితేంద్రియః. ౩౧

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; ధర్మజ్ఞః = ధర్మము నెఱింగినవాఁడు. సత్యసంధశ్చ = దృఢమయినప్రతిజ్ఞ గలవాఁడును. శీలవాన్ = మంచిస్వభావముగలవాఁడు. అనసూయకః = గుణంబులందుదోషారోపణము సేయనివాఁడు. క్షాంతః = ఓర్పుగలవాఁడు. సాంత్వయితా = ఊఱడించువాఁడు; శ్లక్ష్ణః = ప్రియముగామాటలాడువాఁడు. కృతజ్ఞః = చేయఁబడినయుపకారము కొంచెమయినను దానినెచ్చుగానెంచువాఁడు. విజితేంద్రియః =

చక్కగా జయింపఁబడిన యింద్రియము లుగలవాఁడు.

రాముండు, ధర్మములనెఱుంగునుఃసత్యసంధుండు; మంచిస్వభావము గలవాఁడు;అసూయలేనివాఁడు; ఎంతటి యపరాధంబులనైన క్షమించువాఁడు;మఱియుఁగుపితులదుఃఖితులఁ, దీన్నినిమాటలనూఱటనొందించువాఁడు; ప్రియంవదుండు; తనకితరులుకొంచెము పకారముచేసినను దానిసెచ్చుగాఁదలంచువాఁడు;జితేంద్రియుండు.

అని, తాత్పర్యము.

మృదుశ్చ స్థిరచిత్తశ్చ సదా భవ్యో౽నసూయకః

టీక॥ రామః(అధ్యాహృతము)= రాముఁడు;మృదుశ్చ = తిన్ననివాఁడును.స్థిరచిత్తశ్చ= దృఢమయినమనసుగలవాఁడును.సదా = ఎల్లప్పుడును;భవ్యః=మంగళకరుండు.అనసూయకః= గుణంబులందుదోషారోపణముసేయనివాఁడు. ఇదిపైశ్లోకంబునంజెప్పఁబడినను,"అసూయలేకుండుట,ఇతరులకుదుర్లభం" బనియును,"రామునియందా సుగుణంబధికముగానుండినది"యనియును,సూచించుటకై, మఱలఁజెప్పఁబడుటంజేసీ,పునరుక్తదోషంబులేదు.

రాముఁడు,తిన్ననివాఁడు;ఎట్టిసంకటంబులందైనను జాంచల్యంబునొందని మనంబుగలవాఁడు;ఎప్పుడునుమంగళకరాచారము సేయువాఁడు;అసూయలేనివాఁడు, అని, తాత్పర్యము.

ప్రియవాదీచ భూతానాం సత్యవాదీచ రాఘవః. ౩౪.
బహుశ్రుతానాం వృద్ధానాం బ్రాహ్మణానా ముపాసితా

టీక॥ రాఘవః = రఘువంశమునందుఁబుట్టినరాముఁడు ; భూతానాం= ప్రాణులకు=ప్రియవాదీచ= సంతోషము గలిగించుమాటనుజెప్పు వాఁడును. సత్యవాదీచ=సత్యమును జెప్పువాఁడును.బహుశ్రుతానాం = అధికమయిన శాస్త్రాభ్యాసముగలవారును ; వృద్ధానాం=పెద్దలునగు; బ్రాహ్మణానాం= బ్రాహ్మణులయొక్క; ఉపాసితా=సేవించువాఁడు.

రాముండు,ప్రాణులకుఁ బ్రియంబునుసత్యంబునగుమాటనెచెప్పును; బాల

విద్యా పరిశ్రమముగలిగి వృద్ధులయిన బ్రాహ్మణుల సేవించును.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—భూతానాం, సత్యవాదీచ,ప్రియవాదీచ= ప్రాణులకు, సత్యమునే చెప్పువాఁడైనను.ప్రియముసే చెప్పువాఁడును; "సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయాన్నబ్రూయాత్సత్యమప్రియం" (సత్యమును చెప్పవలయును; ప్రియమును చెప్పవలయును; ప్రియముగానిసత్యమును చెప్పరాదు) అని చెప్పఁబడినట్లు,ప్రాణులకుఁబ్రియమగు సత్యమేదియోదానినే చెప్పువాఁడు. చకారముచేత,ప్రియమునైనను అసత్యమును జెప్పఁడని,సూచితమగుచున్నది. రాఘవః=రఘువంశంబునఁబుట్టినవాఁడు,అనుటచే, రఘురాక్షస సంవాదాదులందుఁ బ్రియంబును సత్యంబునగు దానినేమాటలాడుటప్రసిద్ధంబయియున్నదికావున, "అది వారికులధర్మంబె" యని సూచింపఁ బడు చున్నది అట్లు,ప్రియంబును సత్యంబునగు మాటచెప్పుట, అంతఃపుర స్త్రీలతోనుదలిదండ్రులతోను మఱి యితరులగు పెద్దలతోను మాత్రమె కాదు. భూతానాం,ప్రాణిసామాన్యముతోను అట్లు మాటలాడువాఁడనుట"ఇట్టిగుణము, కేవలశాస్త్రాభ్యాసముచేత వచ్చునదికాదనిచెప్పుచున్నాఁడు,—బహుశ్రుతానాం=అధికమయిన శాస్త్రాభ్యాసము గలవారలును,దీనిచేతజ్ఞాన వృద్ధత్వము చెప్పఁబడినది. "బ్రాహ్మణానాంసావిద్యాయావిముక్తయే"(మోక్షోపయోగియగు విద్యయె బ్రాహ్మణులకు విద్యయని చెప్పఁబడు)అనియున్నందున, బ్రహ్మవిద్యానిష్ఠులగువారలని యర్థము. వృద్ధానాం=ఆచారముచేతను వయసుచేతను వృద్ధులగువారలునగు; బ్రాహ్మణానాం=బ్రాహ్మణులయొక్క; ఉపాసితా=వారలనుదనయింటికి రప్పించుకొనువాఁడుకాఁడు , వారలయింటికి దానుబోయి సేవించువాఁడు; బ్రహ్మవిద్యానిష్ఠులునుఆచారసంపన్నులునగుతత్త్రియులున్నను, బ్రాహ్మణులనె, సేవించువాఁడు. లేక;"ఇట్లు, ప్రియంబును సత్యంబునగుమాటచెప్పఁగలిగితిని" అనియేమైననుగర్వంబునొంది యున్నాఁడా! లేదు;తనకుఁగలిగినజ్ఞానవినయాది సంపత్తికిఁ దృప్తిజెందక, యధికజ్ఞాన సంపాదనార్థ మయి, యెల్లప్పుడును,బ్రహ్మనిష్ఠులును ఆచారవయస్సంపన్నులునగు బ్రాహ్మణులయింటికిఁ బోయి,వారల సేవించుచుండును.

తేనాస్యేహాతులా కీర్తి ర్యశస్తేజశ్చ వర్ధతే. ౩౩

టీక॥ తేన = ఆసేవించుటచేత; అస్య = ఈరామునకు; ఇహ = ఈలోకమునందు; అతులా = సరిలేని; కీర్తిః = ఔదార్యాదులవలనఁ గలిగినకీర్తియును; యశః = పరాక్రమాదులవలనఁగలిగిన కీర్తియును; తేజశ్చ = శత్రువులఁదిరస్కరించుసామర్థ్యమును; వర్ధతే = పెరుఁగుచున్నది.

అట్లు, పెద్దల సేవించుటం జేసి, రామునకు, వీర్యశౌర్యౌదార్యాదులవలనఁ గలిగిన కీర్తియును తేజంబును, వృద్ధిఁ బొందుచున్నవి. అని, తాత్పర్యము.

దేవాసురమనుష్యాణాం సర్వాస్త్రేషు విశారదః
సమ్యగ్విద్యావ్రతస్నాతో యథావ త్సాంగవేదవిత్. ౩౪

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; దేవాసురమనుష్యాణాం = దేవతలయొక్కయు నసురులయొక్కయుమనుష్యులయొక్కయు; సర్వాస్త్రేషు = సమస్తములయినయస్త్రములందును; విశారదః = పండితుండు. సమ్యక్ = చక్కఁగా; విద్యావ్రతస్నాతః, విద్యావ్రత = వేదాధ్యయనవ్రతమునుండి, స్నాతః = స్నానకర్మమునుచేసినవాఁడు; యథావత్ = సంప్రదాయప్రకారముగా; సాంగవేదవిత్ = శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, అను అంగములతోఁగూడినవేదముల నెఱింగినవాఁడు.

రాముండు, దేవతలునుఅసురులును మనుష్యులును ఉపయోగపఱచుకొనున యస్త్రంబులనన్నింటినిఁజక్కఁగాఁ దెలిసినవాఁడు; చక్కఁగా, వేదాధ్యయనము చేసి, సమావర్తనము చేసికొనినాఁడు; సంప్రదాయపద్ధతిని, వేదంబులనువేదాంగంబులను, ఎఱుంగును.

అని, తాత్పర్యము.

గాంధర్వేచ భువి శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః
కల్యాణాభిజన స్సాధు రదీనాత్మా మహామతిః. ౩౫

టీక॥ భరతాగ్రజః = భరతునకన్నయయిన, రాముండు; గాంధర్వేచ = గంధర్వవేదమందును, సంగీతమందుననుట; భువి = భూమియందు; శ్రేష్ఠః = మేటి;

బభూవ=ఆయెను. కల్యాణాభిజనః= మంగళకరమయిన వంశముగలవాఁడు. సాధుః=మంచివాఁడు. అదీనాత్మా= ఎట్టికష్టములందును, దైన్యములేనిమనసుగలవాఁడు. మహామతిః=అధికమయినబుద్ధిగలవాఁడు.

భరతునకన్నయగురాముండు, సంగీతమునందు, అందఱికన్నధికుండు; మంచి వంశంబునందుఁ బుట్టినవాఁడు; మంచివాఁడు; ఎట్టికష్టములందును, దైన్యములేనివాఁడు;మహాబుద్ధిశాలి.

అని, తాత్పర్యము.

ద్విజై రభివినీతశ్చ శ్రేష్ఠై ర్ధర్మార్థ నైపుణైః

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; శ్రేష్ఠైః = ఉత్తములును; ధర్మార్థనైపుణైః= ధర్మమునందును అర్థమునందును సమర్థులనగు; ద్విజైః=బ్రాహ్మణులచేత; అభివినీతశ్చ=అన్నివిషయములందునుజక్కఁగా శిక్షింపఁబడినవాఁడును.

ధర్మార్థంబులందు సమర్థులును త్తములునగుబాహ్మణులన్నివిషయంబులందునుం జక్కఁగా రామునకుబోధించియున్నారు. అని, తాత్పర్యము.

యదా వ్రజతి సంగ్రామంగ్రామార్థే నగరస్యవా. ३౬
గత్వా సౌమిత్రి సహితో నావిజిత్య నివర్తతే

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; గ్రామార్థే=గ్రామముయొక్కప్రయోజన నిమిత్తముగానైనను;నగరస్య=పట్టణముయొక్క; అర్థే= (అధ్యాహృతము) వా=ప్రయోజననిమిత్తముగానైనను;యదా= ఎప్పుడు; సంగ్రామం = యుద్ధమును; వ్రజతి= పొందునో;తదా (అధ్యాహృతము)= అప్పుడు; సౌమిత్రిసహితః=లక్ష్మణునితోఁగూడినవాఁడై;గత్వా=పోయి; అవిజిత్య=జయింపక; ననివర్తతే=మఱలఁడు.

రాముండు,గ్రామార్థముగానిపట్టణార్థముగాని , యుద్ధము సంభవించినప్పుడు,లక్ష్మణునింగూడిపోయి , జయంబునొందక,మఱలినదిలేదు.

అని, తాత్పర్యము.

స ౨

సంగ్రామాత్పునరాగమ్య కుంజరేణ రథేనవా. ౩౭
పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; సంగ్రామాత్= యుద్ధమునుండి; పునః=మఱల; కుంజరేణ=ఏనుఁగుచేతఁగాని; రథేనవా= రథముచేతఁగాని; ఆగమ్య=వచ్చి; పౌరాన్= పట్టణముననుండుజనులను; స్వజనవత్=తనవారినివలె; నిత్యం=ఎల్లప్పుడును. కుశలం=క్షేమమును; పరిపృచ్ఛతి= అడుగుచున్నాఁడు.

రాముం,డట్లుయుద్ధంబునజయంబునొంది,మఱల,ఏనుఁగుమీఁద రథంబునఁగానికూర్చుండివచ్చి, పట్టణంబు నందలిజనంబులను, దనబంధువులనుం బోలె, క్షేమంబడుగును, అని, తాత్పర్యము.

పుత్రే ష్వగ్నిషు దారేషు ప్రేష్యశిష్యగణేషుచ. ౩౮
నిఖిలే నానుపూర్వ్యాచ్చ పితా పుత్రా నివౌరసాన్

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; పితా=తండ్రి; ఔరసాన్=తనకుధర్మపత్నియందుఁ బుట్టినకొడుకులనువలె; పౌరాన్= (అధ్యాహృతము)=పట్టణమునందుండు జనులను; పుత్రేషు=కొడుకులందును; అగ్నిషు=అగ్నిహోత్రములందును; దారేషు=భార్యలందును; ప్రేష్యశిష్యగణేషుచ=భృత్యులయొక్కయు శిష్యులయొక్కయు సమూహములందును; నిఖిలేన=సాకల్యముచేతను, ఆనుపూర్వ్యాచ్చ= క్రమమువలనను; కుశలంపరిపృచ్ఛతి(అధ్యాహృతము)—క్షేమము, నడుగుచున్నాఁడు.

యుద్ధంబునజయంబు నొందివచ్చునపుడు,పట్టణమునందుండు జనులనందఱను, తండ్రి,తనధర్మపత్నికిఁబుట్టిన కొడుకులక్షేమంబడుగునట్లు, "మీకొడుకులు క్షేమముగానున్నారా? మీయగ్నిహోత్రములుతప్పక జరగుచున్నవా? మీభార్యలు భృత్యులు శిష్యులు క్షేమముగానున్నారా" అని, క్రమంబుగా నడుగును.

అని, తాత్పర్యము.

శుశ్రూషంతేచ వశ్శిష్యాః కచ్చిత్కర్మసు దంశితాః. ౩౯
ఇతి నః పురుషవ్యాఘ్రస్సదా రామోభిభాషతే

టీక॥ పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండగు; రామః=రాముఁడు; వః=మీయొక్క; శిష్యాః=శిష్యులు; కర్మసు=కార్యములందు; దంశితాః=ఎచ్చరిక గలవారలై; శుశ్రూషంతే చ కచ్చిత్ = సేవనుంజేయుచున్నారా యేమి? (చకారముచేత) అధ్యయనము సేయుచున్నారా యేమి? ఇతి=అని; నః = మమ్ములను గూర్చి; సదా=ఎల్లప్పుడును; అభిభాషతే=పలుకుచుండును.

"మీశిష్యులందఱు కార్యములయం దెచ్చరికగల్గి, మీకు సేవ చేయుచున్నారా యేమి? చక్కగా నధ్యయనము సేయుచున్నారా యేమి" అని, పురుషశ్రేష్ఠుండగు రాముండు, మమ్ముల, నెల్లప్పుడును, అడుగుచుండును.

అని, తాత్పర్యము.

వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః. ౪౦
ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి

టీక॥ రామః (అధ్యాహృతము)=రాముఁడు; మనుష్యాణాం=మనుష్యులయొక్క; వ్యసనేషు = కష్టములందు, భృశం=మిక్కిలియును ; దుఃఖితః=దుఃఖముగలవాఁడు; భవతి= అగుచున్నాఁడు; సర్వేషు=సమస్తము లయిన; ఉత్సవేషు చ=కోరికలు కొనసాగుటలయందు, లేక, పండుగలందు; పితేవ=తండ్రివలె; పరితుష్యతి=సంతోషించుచున్నాఁడు.

రాముఁడు, బంధువులు, మిత్రులు, ధనికులు, దరిద్రులు, మొదలగు భేద మెంతమాత్రము లేక, మనుష్య సామాన్యమునకుఁ గష్టము సంభవించెనేనియుఁ, జాలదుఃఖము నొందును; అట్లు మనుష్యసామాన్యమున కెంతమాత్రం బుత్సవంబు గలిగినను, దండ్రి తనకొడుకుల కుత్సవము గలిగినప్పుడు సంతోషించునట్లు, చాల సంతోషించును. అని, తాత్పర్యము.

సత్యవాదీ మహేష్వాసో వృద్ధసేవీ జితేంద్రియః. ౪౧
స్మితపూర్వాభిభాషీ చ ధర్మం సర్వాత్మనా శ్రితః

టీక॥ రామః (అధ్యాహృతము)=రాముఁడు; సత్యవాదీ= సత్యమునేమా

స౧

టలాడువాఁడు; మహేష్వాసః= గొప్పవిల్లుగలవాఁడు, గొప్పవిలుకాఁడు; వృద్ధసేవీ=పెద్దలసేవించువాఁడు ; జితేంద్రియః=జయింపఁబడినయింద్రియములుగలవాఁడు. స్మితపూర్వాభిభాషీచ=చిఱునగవుముందు గలుగునట్లుగా మాటలాడువాఁడును. సర్వాత్మనా=సమస్తప్రయత్నముచేతను; ధర్మం=ధర్మమును; శ్రితః=పొందినవాఁడు. (చెప్పఁబడినగుణంబులె, మఱలఁజెప్పఁబడుట, "ఆయాగుణంబులు అధికముగా నున్న"వనిసూచించుచున్నది. ఇట్లు, అంతటనుదెలియునది.)

రాముండు, ఎట్టికష్టములందును అబద్ధంబాడఁడు; విలుకాండ్రలో శ్రేష్ఠుఁడు, పెద్దలసేవించువాఁడు; ఇంద్రియనిగ్రహంబుగలవాఁడు; చిఱునగవు గలిగి మాటలాడును; ఎంతటికష్టంబునను, ధర్మంబువిడువఁడు. అని, తాత్పర్యము.

సమ్యగ్యోక్తా శ్రేయసాం చ న విగృహ్య కథారుచిః. ౪౨
ఉత్తరోత్తరయుక్తౌ చ వక్తా వాచస్పతిర్యథా

టీక॥ రామః(అధ్యాహృతము)= రాముఁడు; శ్రేయసాం = మేలులయొక్క; సమ్యక్=చక్కఁగా; యోక్తాచ= కూర్చువాఁడు. విగృహ్య= కలహించి; కథారుచిః = మాటలందాసగలవాఁడు; న=కాఁడు. ఉత్తరోత్తరయుక్తౌ= బదులుకుబదులుచెప్పఁబడుయుక్తియందు; వాచస్పతిర్యథా= బృహస్పతివలె; వక్తాచ=మాటలాడువాఁడును.

రాముండు, ఆశ్రితులకుఁ, జక్కఁగా, మేలుగలిగించువాఁడు ; కలహప్రియుండుకాఁడు ; బృహస్పతియుంబోలె , బదులుకుబదులుయుక్తిచెప్పువాఁడు. అని, తాత్పర్యము.

సుభ్రూరాయతతామ్రాక్షః సాక్షాద్విష్ణురివ స్వయమ్. ౪౩
రామో లోకాభిరామోఽయం శౌర్యవీర్యపరాక్రమైః

టీక॥ సుభ్రూః= మంచికనుబొమ్మలుగలవాఁడును; ఆయతతామ్రాక్షః= దీర్ఘములునెఱ్ఱనివియునగు కండ్లుగలవాఁడును; లోకాభిరామః= లోకంబులరమింపఁజేయువాఁడునగు ; అయం= ఈ; రామః = రాముఁడు; శౌర్యవీర్యప

రాక్రమైః,శౌర్య = మరణమునందుభయములేమిచేతను, వీర్య=తానువికారమునొందక శత్రువుల వికారమునొందించుట చేతను, పరాక్రమైః = శత్రువుల జయింప నుత్సాహముచేతను;స్వయం=తానే; సాక్షాత్=ప్రత్యక్షుండయిన;విష్ణురివ = (స్థితః)విష్ణువై వుండువలెనున్నాఁడు.

మంచికనుబొమలు దీర్ఘంబులునై ఋజువైమొనలుగలవియునగుకండ్లును గలిగి,లోకాభిరాముండైయుండు, నీరాముండు,శౌర్యవీర్యపరాక్రమంబుల,మనుష్యత్వంబునొందినవిష్ణుండనందగియున్నాఁడు. అని, తాత్పర్యము.

ప్రజాపాలనతత్త్వజ్ఞో న రాగోపహతేంద్రియః. ౪౪
శక్తస్త్రైలోక్యమప్యేకో భోక్తుం కిన్ను మహీ మిమామ్

టీక॥ రామః(అధ్యాహృతము)=రాముఁడు; ప్రజాపాలనతత్త్వజ్ఞః=ప్రజలపాలించుటయొక్క సిద్ధాంతము నెఱింగినవాఁడు . రాగోపహతేంద్రియః=రాగముచేతఁ గొట్టఁబడినయింద్రియములుగలవాఁడు; న= కాఁడు; ఏకః = ఒకఁడే; త్రైలోక్యమపి = ముల్లోకములనైనను; భోక్తుం= పాలించుటకు; శక్తః=సమర్థుఁడు. ఇమాం=ఈ;మహీం = భూమిని;భోక్తుంశక్తఇతి(అధ్యాహృతము) కిన్ను= పాలించుటకుసమర్థుండనుటకేమి?

రాముండు, జనులఁబాలింపజక్కఁగాఁదెలిసినవాఁడు; రాగద్వేషములజయించినవాఁడు;ఇతండొకండె,ముల్లోకంబులనుంగూడఁ బాలింపఁగలండు ; ఈభూమినిమాత్రముపాలింపఁజాలునని చెప్పనేల. అని, తాత్పర్యము.

నాస్య క్రోధః ప్రసాదశ్చ నిరర్థోఽస్తి కదాచన. ౪౫
హంత్యేవ నియమాద్వధ్యా నవధ్యే నచ కుప్యతి

టీక॥అస్య = ఈరామునియొక్క; క్రోధః=కోపమును;ప్రసాదశ్చ= అనుగ్రహమును; కదాచన=ఒకానొకప్పుడును;నిరర్థః=ప్రయోజనములేనిది; నాస్తి=కాదు , అయం (అధ్యాహృతము)=ఈరాముఁడు;నియమాత్=నిశ్చయమువలన;వధ్యాన్ = చంపఁదగినవారలను;హంత్యేవ= చంపుచునేయు

న్నాఁడు. అవధ్యే=చంపఁదగనివాని విషయమందు; నకుప్యతిచ=కోపమును జేయఁడు.

ఈరామునికోపముగాని యనుగ్రహముగానియొకప్పుడును నిష్ప్రయోజనంబగుటలేదు; కోపించెనేని, యెవ్వనిమీఁదఁగోపించెనో, యతండప్పుడెయవశ్యంబుదానిఫలంబనుభవించును; అనుగ్రహంబునొందినచో, ననుగ్రహింపఁబడినవాఁడు, తత్క్షణంబెమహాభాగ్యశాలియగును; వధ్యులనవశ్యముచంపును; అవధ్యునిపైఁ గోపంబు గూడఁ జేయఁడు. అని, తాత్పర్యము.

యునక్త్యర్థైః ప్రహృష్టశ్చ తమసౌ యత్రతుష్యతి. ౪౬

టీక॥ అసౌ=ఈరాముఁడు; యత్ర=ఎవ్వనియందు; తుష్యతి=సంతోషించునో; తం=అతనిని; ప్రహృష్టః= సంతోషించినవాఁడై; అర్థైః= కోరఁబడినవానిచేత ; యునక్తి = కూర్చుచున్నాఁడు.

ఈరాముండెవ్వనిపై సంతోషంబునొందునో, అతండుకోరినవానినంతయు, నతనికొసంగును.

అని, తాత్పర్యము.

శాంతైస్సర్వప్రజాకాంతైః ప్రీతిసంజననైర్నృణామ్
గుణైర్విరురుచే రామో దీప్తస్సూర్య ఇవాంశుభిః. ౪౭

టీక॥ రామః= రాముఁడు; శాంతైః=శాంతిప్రధానముగాఁగలవియు; సర్వప్రజాకాంతైః= సమస్తజనులకునుగోరఁబడినవియును; నృణాం=మనుష్యులకు; ప్రీతిసంజననైః=సంతోషముపుట్టించునవియునగు; గుణైః=గుణములచేత; అంశుభిః = కిరణములచేత; దీప్తః = ప్రకాశించునట్టి; సూర్యఇవ=సూర్యుఁడువలె; విరురుచే= ప్రకాశించెను.

రాముండు, శాంతిప్రధానములును సమస్తప్రజలకుఁ గోరఁదగినవియునుమనుష్యులకందఱకును సంతోషంబుగలిగించునవియునగుగుణంబులుగలిగి, కిరణంబులుగలిగినసూర్యుండుంబోలెఁ, బ్రకాశించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

తమేవం గుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్

లోకపాలోపమ న్నాథ మకామయత మేదినీ. ౪౮

టీక॥ మేదినీ=భూమి, (లక్షణచే) భూమియందలిజనసమూహము; ఏవం గుణసంపన్నం= ఇట్టిగుణములతోఁగూడినవాఁడును; సత్యపరాక్రమం= ఎచ్చటను వ్యర్థణముకాని పరాక్రమముగలవాఁడును; లోకపాలోపమం=దిక్పాలురతోఁబోల్కిగలవాఁడునగు; తం=ఆ; రామం=రాముని; నాథం=ప్రభువునుగా; అకామయత=కోరెను.

ఇట్టిగుణంబులుగలిగి సత్యపరాక్రముండై దిక్పాలురకు సాటిసేయందగి యొప్పుచుండురాముని, జనులందఱుఁ, బ్రభువుగాఁ, గోరుచున్నారు.

అని, తాత్పర్యము.

వత్స శ్రేయసి జాతస్తే దిష్ట్యా సౌ తవ రాఘవ
దిష్ట్యా పుత్రగుణై ర్యుక్తో మారీచ ఇవ కాశ్యపః. ౪౯

టీక॥ రాఘవ=దశరథుఁడా! తవ=నీయొక్క; దిష్ట్యా=భాగ్యముచేత; శ్రేయసి=మేలునిమిత్తము; అసౌ = ఈ; వత్సః=బిడ్డఁడు; తే=నీకు; జాతః=పుట్టినాఁడు. దిష్ట్యా=భాగ్యముచేత; మారీచః = మరీచికొడుకైన; కాశ్యపఇవ= కాశ్యపుఁడువలె; పుత్రగుణైః= పున్నామకమయిన నరకమునుండి రక్షింపఁగలుగుటమొదలగు గుణములతో; యుక్తః=కూడినవాఁడు.

దశరథుఁడా! నీభాగ్యమునంజేసి, జనులకుమేలుగలుగుటకై, నీకికొడుకుపుట్టెను; నీభాగ్యముననె, మరీచికొడుకయినకాశ్యపుఁడుంబోలెఁబుత్రునకుండవలసినగుణంబులుగలిగియున్నాఁడు.

అని, తాత్పర్యము.

బల మారోగ్య మాయుశ్చ రామస్య విదితాత్మనః
దేవాసురమనుష్యేషు సగంధర్వోరగేషుచ. ౫౦
ఆశంసతే జన స్సర్వో రాష్ట్రే పురవరే తథా
అభ్యంతరశ్చ బాహ్యశ్చ పౌరజానపదో జనః. ౫౧

టీక॥ సగంధర్వోరగేషుచ= గంధర్వులతోను సర్పములతోను గూడియున్న

ట్టి; దేవాసురమనుష్యేషు=దేవతలయం దునుఅసురులయందును మనుష్యులందు ను;సర్వః=సమస్తమయిన; జనః=జన మును;తథా=అట్లు; రాష్ట్రే=ఇతర దేశమందును;పురవరే=ఇతరపట్టణశ్రే ష్ఠమందును;స్థితః (అధ్యాహృతము)= ఉన్నట్టి; జనః(అధ్యాహృతము)=జన మును; అభ్యంతరశ్చ = అంతఃపురమ నందుండుజనమును; బాహ్యశ్చ=వెలు పలనుండుజనమును;పౌరజానపదః=ప ట్టణములందుండునట్టియు, గ్రామము లందుండునట్టియు;జనః=జనమును;విది తాత్మనః=ప్రసిద్ధమగుస్వభావముగల; రామస్య=రామునకు; బలం = బల మును ; ఆరోగ్యం=రోగములేమిని; ఆయుశ్చ=ఆయుస్సును; ఆశంసతే= ప్రార్థించుచున్నది.

దేవతలు నసురులును ఋషులును గంధర్వులునుసర్పంబులును, ఇతరదేశ ములనుండువారును ఇతరపట్టణములం దుండువారును, అంతఃపురమునందేమి వెలుపలనేమియుండువారును, మనదే శంబుల మనపట్టణంబుల నుండువారు నందఱును,ప్రసిద్ధంబగు స్వభావంబుగ లరామునకు, "బలంబు నారోగ్యంబు నాయుష్యం గలుగవలెను" అని, ప్రా ర్థించుచున్నారు.

అని, తాత్పర్యము.

స్త్రియో వృద్ధాస్తరుణ్యశ్చ సాయం ప్రాతస్సమాహితాః
సర్వాన్ దేవాన్నమస్యంతి రామస్యార్థే యశస్వినః. ౫౨

టీక॥వృద్ధాః=ముదుసలులును;తరు ణ్యశ్చ=యౌవనముగలవారలునగు;స్త్రి యః=ఆండువాండ్రు; సాయం=సాయం కాలమందును;ప్రాతః=ప్రొద్దునను; స మాహితాః=ఎచ్చరికగలవారలై; రా మస్య=రామునియొక్క; అర్థే=ప్ర యోజనవిషయమయి; యశస్వినః= ప్రశస్తమగుకీర్తిగల; దేవాన్=దేవత లను; సర్వాన్=అందఱను; నమస్యం తి=నమస్కరించుచున్నారు.

స్త్రీలునుముదుసలివారును యౌవనము గలవారును,సాయంకాలమందును ప్రా తఃకాలంబు నందును సావధానలై , రామునికై, వరంబుల నొసంగుటవల నంగలిగినకీర్తిగల, దేవతలనందఱను, నమస్కరించెదరు, అని, తాత్పర్యము.

విశేషార్థము.—స్త్రియః=అతి గాంభీర్యముగలవారలగుటంజేసి, తమ

హృదయంబుననుండు నభిప్రాయంబు నెంతమాత్రమును బయలు పఱచనట్టి స్త్రీలును,ఇందువలన,"రామునియంద లిప్రేమఁబట్టఁజాలక,దేవతానమస్కారములుగావించిరి" అని,సూచితమగు చున్నది; వృద్ధాః=ముదుసలులు,లేవ లేనివారలగుటవలన నెంతటి ప్రియకార్యంబునందుననాదరంబు సేయువారలు;తరుణ్యశ్చ=యౌవనముగలవారలును,యౌవనమదోన్మత్తలగుటచే, వివేకశూన్యలయి,యెదుటివారలసరకుగొననివారును,దీనివలన,రామునియందువీరలకుండుప్రేమ, యత్యధికంబనిసూచితమైనది.సాయంప్రాతః=(ఇదిమధ్యాహ్నామునకుపలక్షణము) కాలత్రయంబునందును;సమాహితాః=ఎచ్చరికగలవారలై;యనుటచే,అత్యాసక్తిసూచితమగుచున్నది.రామస్యార్థే=రామునిప్రయోజనవిషయమయి, రామునకుమంగళంబుగల్గుటకై,యనుట,స్వప్రయోజనార్థంబుకాదు . యశస్వినః=ప్రశస్తకీర్తిగల (ఇదిదేవతావిశేషణము) రామునియందు , సమస్తమంగళములునుస్వతస్సిద్ధములు గానే యున్నందున రామునకై తమ్ముఁ బ్రార్థించుటలలో నేదియు నిష్ఫలంబుగా కుండుటంజేసిఁ, దమ్ముఁబ్రార్థించినవానినన్నింటి నొసంగువారనెడు కీర్తి స్థిరంబు గాఁగలవారునగు;దేవాన్=దేవతలను;సర్వాన్=అందఱను ; ఇష్టదేవత, వేదప్రదిపాదితదేవత, ఇట్టినీచమధ్యమాధమభేదముంచక,అనుటచే,నెట్టి దేవతలనైనఁ గొలుచునంతటి, ప్రేమపారవశ్యంబు గలవారలని సూచింపఁబడినది. నమస్యంతి=నమస్కరించెదరు.

•• తేషా మాయాచితం దేవ త్వత్ప్రసాదా త్సమృధ్యతామ్

టీక॥ దేవ=దశరథమహారాజా ! తేషాం = వారలయొక్క; ఆయాచితం=ప్రార్థన; త్వత్ప్రసాదాత్ =నీయనుగ్రహంబువలన;సమృధ్యతాం=సఫలమగుఁగాక.

దశరథమహారాజా ! వారలయభీష్టము, నీయనుగ్రహంబున, నిప్పుడు, సఫలంబగుఁగాక.అని,తాత్పర్యము.

రామ మిందీవరశ్యామం సర్వశత్రునిబర్హణమ్. ౫౩
పశ్యామో యౌవరాజ్యస్థం తవ రాజోత్తమాత్మజమ్

టీక ॥ రాజోత్తమ=రాజశ్రేష్ఠుండవగు దశరథుఁడా! తవ=నీయొక్క;

ఆత్మజం = కొడుకును; ఇందీవరశ్యామం= నల్లకలువవలె నల్లనివాఁడును; సర్వశత్రునిబర్హణం=సమస్తశత్రువులను జంపువాఁడును; యావరాజ్యస్థం= యువరాజుదొరతనమునందుండువాఁడునగు; రామం=రాముని; పశ్యామః = (భవిష్యదర్థమందులట్) చూడఁగలము.

రాజశ్రేష్ఠుండవగుదశరథుఁడా! నల్లకలువయుంబోలెనల్లనిరమణీయమూర్తి-సమస్తశత్రువులం జంపువాఁడునీకుమారుండురాముండు, యువరాజుగానుండఁగాఁ,జూడఁగలము.అని, సంతసమగుచున్నది. అని, తాత్పర్యము.

తం దేవదేవోపమ మాత్మజం తే
సర్వస్య లోకస్య హితే నివిష్టమ్
హితాయ నః క్షిప్ర ముదారజుష్టం
ముదా భిషేక్తుం వరద త్వ మర్హసి. ౫౪

టీక॥ వరద=వరములనొసంగువాఁడవయినదశరథుఁడా!త్వం=నీవు; దేవదేవోపమం=దేవతలకును దేవుఁడయిన విష్ణువుతోఁబోల్కి-గలవాఁడును; సర్వస్య=సమస్తమయిన; లోకస్య=లోకముయొక్క-;హితే=మేలునందు ; నివిష్టం= శ్రద్ధగలవాఁడును ; ఉదారజుష్టం=ఉత్తమగుణములతోఁ గూడినవాడునగు;తం=ఆ; తే=నీయొక్క- ; ఆత్మజం=కొడుకయినరాముని; నః= మాయొక్క-;హితాయ=మేలుకొఱకుఁ;ముదా=సంతోషముతో; క్షిప్రం=శీఘ్రముగా;అభిషేక్తుం = అభిషేకించుటకు;అర్హసి=తగుదువు.

దశరథుఁడా! నీవుకోరినవానినిచ్చువాఁడవు;విష్ణుదేవునకు సరివచ్చువాఁడు సమస్తజనంబునకు మేలుసేయువాఁడును త్తమగుణంబులుగలవాఁడునగు నీపుత్రునిరాముని , మాకుమేలుగల్గుటకై, సంతోషంబున,శీఘ్రంబుగా,యావరాజ్యంబునం,దభిషేకింపుము. అని,సభికులగువారు,దశరథునితోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,ద్వితీయ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండద్వితీయసర్గటీక; ముగిసినది.

---

శ్రీః

## తృతీయసర్గప్రారంభః.



తేషా మంజలిపద్మాని ప్రగృహీతాని సర్వశః
ప్రతిగృహ్య బ్రవీ ద్రాజా తేభ్యః ప్రియహితం వచః. ౧

టీక॥ తేషాం=ఆసభికులయొక్క; సర్వశః=అన్నివిధంబులను; ప్రగృహీతాని = చక్కఁగాఁబట్టుకొనఁబడిన; అంజలిపద్మాని= తామరమొగ్గలవంటి మోడ్పులను; ప్రతిగృహ్య=స్వీకరించి రాజా= దశరథమహారాజు; తేభ్యః = ఆసభికులకొఱకు; ప్రియహితం= సంతోషకరంబును మేలుసేయునదియునగు; వచః=మాటను; అబ్రవీత్ =చెప్పెను.

ఆసభికులు, శిరంబునఁదామరమొగ్గలవంటి చేమోడ్పులంగీలించిచేయు న

మస్కారంబులం బ్రతిగ్రహించి, దశరథమహారాజు,వారలకు, సంతోషంబును మేలునుంగల్గునట్టు ,లిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అహోఽస్మి పరమప్రీతః ప్రభావ శ్చాతులో మమ
యన్మే జ్యేష్ఠం ప్రియం పుత్రం యౌవరాజ్యస్థ మిచ్ఛథ. ౨

టీక॥యత్ = ఏకారణమువలన; యూయం(అధ్యాహృతము)=మీరలు; మే=నాయొక్క; జ్యేష్ఠం=మొదటివాఁడును; ప్రియం=సంతోషముగలిగించువాఁడునగు; పుత్రం=కొడుకైనరాముని; యౌవరాజ్యస్థం=యువరాజుదొరతనమునందున్నవానిఁగా; ఇచ్ఛథ=కోరుచున్నారలో; తత్(అధ్యాహృతము)=ఆకారణమువలన; అహో=ఆశ్చర్యము! అహం(అధ్యాహృతము)=నేను;పరమప్రీతః=మిక్కిలియునుసంతసించినవాఁడను; అస్మి(సంధియామము)= అగుచున్నాను. మమ=నాయొక్క;ప్రభావశ్చ=గొప్పతనమును; అతులః=సరిలేనిది.

మీరలు,నాకుఁబ్రియుండును జ్యేష్ఠపుత్రుండునగు రాముండు యువరాజు కావలెననికోరుచున్నారలు, కావున, ఆశ్చర్యము ! నాకుఁజాలసంతోషమగుచున్నది; ఇట్టిభాగ్యము మఱియెవ్వరికున్నది ? అని,దశరథుఁడుసభికులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి ప్రత్యర్చ్య తాన్ రాజా బ్రాహ్మణా నిద మబ్రవీత్
వసిష్ఠం వామదేవంచ తేషామే వోప శృణ్వతామ్. ౩

టీక ॥ రాజా=దశరథమహారాజు; ఇతి=ఇట్లు; తాన్=ఆ; బ్రాహ్మణాన్=సభికులయిన బ్రాహ్మణులను; ప్రత్యర్చ్య=గౌరవించి; తేషాం=వారలు;ఉపశృణ్వతామేవ=వినుచుండఁగానే;వసిష్ఠం= వసిష్ఠునిగూర్చియు; వామదేవంచ=వామదేవునిగూర్చియు;ఇదం=దీని;అబ్రవీత్=చెప్పెను.

దశరథమహారాజు,సభికులగు బ్రాహ్మణుల, నిట్లు మధురవచనంబులగౌరవించి,వారలువినుచుండఁగానే, వసిష్ఠుని వామదేవునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

చైత్ర శ్శ్రీమా నయం మాసః పుణ్యః పుష్పితకాననః
యౌవరాజ్యాయ రామస్య సర్వమేవోపకల్ప్యతామ్. ౪

టీక॥అయం=ఈ;చైత్రః=చైత్రమనియెడు; మాసః = మాసము; శ్రీమాన్=అన్నిమాసములకునెచ్చైనది. పుణ్యః=పావనమయినది. పుష్పితకాననః=పుష్పించునట్లు చేయఁబడినయడవులుగలది. రామస్య=రామునియొక్క; యౌవరాజ్యాయ=యువరాజుదొరతనముకొఱకు;సర్వమేవ= అన్నియునే; ఉపకల్ప్యతాం= సంపాదింపఁబడుఁగాక.

ఇప్పుడువచ్చియుండు చైత్రమాసము, అన్నిమాసములలోనుత్తమమయినది;ఇదిరమణీయంబును, ఇట్టికార్యములకుఁదగినపుణ్యమాసంబుగాను, ఉన్నది;అడవులలోవృక్షంబులన్నియుఁబుష్పితంబులయియున్నవి;ఇప్పుడె,రామునకు, యౌవరాజ్యాభిషేకము సేయుటకై కావలయువానినన్నింటిని , సంపాదింపుఁడు.అని,దశరథుఁడు,వసిష్ఠవామదేవులతోఁజెప్పెను.అని, తాత్పర్యము.

రాజ్ఞ స్తూపరతే వాక్యే జనఘోషో మహా నభూత్

టీక॥రాజ్ఞః= దశరథమహారాజుయొక్క;వాక్యే=మాట; ఉపరతేతు=ముగియఁగానే;మహాన్= అధికమయిన;జనఘోషః=జనులధ్వని;అభూత్= అయినది.

దశరథమహారాజామాటచెప్పి ముగింపఁగానే,జనులందఱు,"మేముబహుకాలముగాఁగోరుచుండిన రామాభిషేకమును కండ్లారఁ జూచెదముగదా" యనిసంతోషంబునం జాలధ్వని,గావించిరి. అని,తాత్పర్యము.

శనై స్తస్మిన్ ప్రశాంతేచ జనఘోషే జనాధిపః. ౫
వసిష్ఠం మునిశార్దూలం రాజా వచన మబ్రవీత్

టీక॥తస్మిన్=ఆ;జనఘోషే=జనులధ్వని;శనైః = మెల్లఁగా;ప్రశాంతేచ=నిలువఁగానే;జనాధిపః=జనులకుఁబ్రభువయిన;రాజా=దశరథమహారాజు;మునిశార్దూలం =.మునిశ్రేష్ఠుండగు;వసిష్ఠం= (ఇదివామదేవునకునుపల




క్షణము) వసిష్ఠునివామదేవునిఁగూర్చి; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అధ్వనియంతయు, మెల్లమెల్లఁగా, శాంతిఁబొందఁగానే, మనుష్యులకధిపుండగు, దశరథుండు, వసిష్ఠునివామదేవునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అభిషేకాయ రామస్య యత్కర్మ సపరిచ్ఛదమ్. ౬
తదద్య భగవన్ సర్వ మాజ్ఞాపయితు మర్హసి

టీక॥ భగవన్=మాహాత్మ్యముగల వసిష్ఠుఁడా! వామదేవుఁడా! రామస్య=రామునియొక్క; అభిషేకాయ = అభిషేకముకొఱకు, కావలసిన; సపరిచ్ఛదం = ఉపకరణములతోఁగూడిన; కర్మ=క్రియ; యత్=ఏదో; తత్=దానిని; సర్వం=అంతను; అద్య=ఇప్పుడు; ఆజ్ఞాపయితుం=ఆనతిచ్చుటకు; అర్హసి=తగుదువు.

భగవంతులరగు వసిష్ఠవామదేవులారా! రామునియభిషేకంబునకు, ఏకర్మము చేయవలయునో, ఏయుపకరణములు కావలయునో, దానినంతయు, నిప్పుడానతీవలయును. అని, దశరథుఁడు, వసిష్ఠవామదేవులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా భూమిపాలస్య వసిష్ఠో ద్విజసత్తమః. ౭
ఆదిదేశాగ్రతో రాజ్ఞః స్థితాన్ యుక్తాన్ కృతాంజలీన్

టీక॥ భూమిపాలస్య=భూమినిబాలించునట్టిదశరథునియొక్క; తత్ = ఆ మాటను; శ్రుత్వా=విని; ద్విజసత్తమః=బ్రాహ్మణశ్రేష్ఠుండగు; వసిష్ఠః=(వామదేవోపలక్షణము) వసిష్ఠుఁడువామదేవుండును; రాజ్ఞః= దశరథమహారాజుయొక్క; అగ్రతః=ముందట; స్థితాన్=ఉన్నవారలును; కృతాంజలీన్=చేయఁబడినచేమోడ్పులు గలవారలునగు; యుక్తాన్ = కార్యములందు నియోగింపఁబడినవారలను; ఆదిదేశ = ఆజ్ఞాపించెను.

దశరథమహారాజు మాటవిని, బ్రాహ్మణశ్రేష్ఠులు వసిష్ఠుండును వామదేవుండును, దశరథమహారాజుముందటఁ జేతులుమొగిడ్చి నిలుచుండియున్న సుమంత్రాదులంజూచి, యిట్లు, ఆజ్ఞాపించెను. అని, తాత్పర్యము.




సువర్ణాదీని రత్నాని బలీన్ సర్వౌషధీ రపి. ౯
శుక్లమాల్యాంశ్చ లాజాంశ్చ పృథక్చ మధుసర్పిషీ
అహతానిచ వాసాంసి రథం సర్వాయుధాన్యపి. ౯
చతురంగబలంచైవ గజంచ శుభలక్షణమ్
చామరవ్యజనే శ్వేతే ధ్వజం ఛత్రంచ పాండురం. ౧౦
శతంచ శాతకుంభానాం కుంభానా మగ్నివర్చసామ్
హిరణ్యశృంగ మృషభం సమగ్రం వ్యాఘ్రచర్మచ. ౧౧
ఉపస్థాపయత ప్రాత రగ్న్యగారం మహీపతేః

టీక॥ యూయం (అధ్యాహృతము)=మీరలు;సువర్ణాదీని=బంగారు మొదలగువానిని; రత్నాని = మణులను; బలీన్=కానుకలను; సర్వౌషధీరపి=సమస్తములయినమూలికలను; శుక్లమాల్యాంశ్చ=తెల్లని పుష్పమాలికలను;లాజాంశ్చ=పేలాలను; పృథక్=వేర్వేరుగా; మధుసర్పిషీచ = తేనెను నేయిని;అహతాని=నూతనము లయిన;వాసాంసిచ=వస్త్రములను;రథం=రథమును; సర్వాయుధాన్యపి= సమస్తములయినయాయుధములను ; చతురంగబలంచైవ=రథములు, ఏనుఁగులు,గుఱ్ఱములు,పదాతులు, అనునాలుగంగములుగలసేనను; శుభలక్షణం=మంగళకరంబులగులక్షణంబులుగల; గజంచ=ఏనుంగును; శ్వేతే=తెల్లని వయిన;చామరవ్యజనే=చామరంబులనెదువిసనకఱ్ఱలను; ధ్వజం= టెక్కెమును;పాండురం=తెల్లని ; ఛత్రంచ=గొడుగును;శాతకుంభానాం= బంగారువికారములయిన;అగ్నివర్చసాం=నిప్పుయొక్క కాంతివంటి కాంతిగల ; కుంభానాం=పాత్రలయొక్క ; శతం చ=నూఱును;హిరణ్యశృంగం = బంగారుకప్పుగలకొమ్ములుగల ; ఋషభం = ఎద్దును; సమగ్రం=అన్నియవయవములతోఁగూడిన; వ్యాఘ్రచర్మచ=పులితోలును;ప్రాతః = ప్రొద్దున; మహీపతేః=భూమికిఁబ్రభువయిన దశరథునియొక్క;అగ్న్యగారం=అగ్నిహోత్రముండుగృహమును; ఉపస్థాపయత=పొందింపుఁడు.

మీరు,బంగారుమొదలయినవానిని, మణులను,గానుకలను, సమస్తౌషధులను, తెల్లనిపుష్పమాలికలను,పేలాలను

వేర్వేఱుగఁ గిన్నెలనుంచఁబడిన తేనె నేతులను, నూతనవస్త్రంబులను, రథంబును, సమస్తాయుధంబులను, చతురంగసేనను, మంచిలక్షణంబులుగల యేనుంగును, రెండు తెల్లని చామరంబులను ధ్వజంబును, శ్వేతచ్ఛత్రంబును, నిప్పుఁబోలి ప్రకాశించునూఱుబంగారు పాత్రములను, బంగారుకప్పు వేసియుండు కొమ్ములు గల వృషభంబును, సమగ్రంబగు పులితోలును, ఋత్విక్కాలమునకు, దశరథుని, యగ్నిహోత్రగృహమునం జేర్పుఁడు. అని, తాత్పర్యము.

యచ్చాన్య త్కించి దేష్టవ్యం తత్సర్వ ముపకల్ప్యతామ్. ౧౨

టీక॥ అన్యత్=ఇతరమయినది; కించిత్=కొంచెము; యత్=ఏది; ఏష్టవ్యం=అపేక్షింపఁదగినదో; తత్=అది; సర్వంచ=అంతయును; ఉపకల్ప్యతాం=సంపాదింపఁబడుఁగాక.

మఱియితరపదార్థములగు గంధముమొదలయినవి యేవేవి, యపేక్షితములో, వానినన్నిటినిం గూడ, సంపాదింపుఁడు.

అని, తాత్పర్యము.

అంతఃపురస్య ద్వారాణి సర్వస్య నగరస్యచ
చందన స్రగ్భి రర్చ్యంతాం ధూపైశ్చ ఘ్రాణహారిభిః. ౧౩

టీక॥ అంతఃపురస్య=రాజగృహముయొక్కయు; సర్వస్య=సమస్తమయిన; నగరస్యచ = పట్టణముయొక్కయు; ద్వారాణి=దారులు; చందనస్రగ్భిః=శ్రీగంధముచేతను బుష్పమాలికలచేతను; ఘ్రాణహారిభిః=ముక్కులనాకర్షించునట్టి, ముక్కులకుఁదృప్తిగలిగించునట్టి యనుట; ధూపైశ్చ=ధూపములచేతను; అర్చ్యంతాం= పూజింపఁబడుఁగాక.

రాజగృహద్వారములయందుఁబట్టణద్వారంబులందంతటను, శ్రీగంధము చల్లి, పుష్పమాలికలుఁ గట్టి, మంచివాసనగల ధూపంబులు వేయుఁడు.

అని, తాత్పర్యము.

ప్రశస్త మన్నం గుణవ ద్దధిక్షీరోపసేచనమ్
ద్విజానాం శతసాహస్రే యత్ర ప్రకామ మలం భవేత్. ౧౪

టీక॥యత్=ఏది;ద్విజానాం=బ్రాహ్మణులయొక్క; శతసాహస్రే=నూఱువేలవిషయమయ్యును, లెక్కలేనివారివిషయమయ్యుననుట; ప్రకామం= మిక్కిలియును;అలం=చాలినది; భవేత్=అగునో; తత్=అట్టి; ప్రశస్తం=శ్రేష్ఠమును, గుణవత్=వ్యంజనములుగలదియును; దధిక్షీరోపసేచనం=పెరుఁగుయొక్కయుఁబాలయొక్కయు సంస్కారముగలదియునగు; అన్నం=అన్నము; ఉపకల్ప్యతాం (అధ్యాహృతము)= సంపాదింపఁబడుఁగాక.

లెక్కలేనిబ్రాహ్మణులకైనను ఎంతమాత్రముకొంత లేక, చాలునంతటి, ప్రశస్తాన్నంబు,వ్యంజనంబులుగలదియై పెరుఁగుతోనుబాలుతోనుసంస్కరింపఁబడియుండునది,సంపాదింపఁ బడవలయును. అని, తాత్పర్యము.

సత్కృత్య ద్విజముఖ్యానాం శ్వః ప్రభాతే ప్రదీయతామ్
ఘృతం దధిచ లాజాశ్చ దక్షిణాశ్చాపి పుష్కలాః. ౧౫

టీక॥ శ్వః= రేపు; ప్రభాతే = ప్రాతఃకాలమునందు; తత్,అన్నం= (అధ్యాహృతము) ఆయన్నము; ద్విజముఖ్యానాం= బ్రాహ్మణశ్రేష్ఠులకు; సత్కృత్య = పూజచేసి; ప్రదీయతాం=ఇయ్యఁబడుఁగాక. ఘృతం=నేయియున్ను, దధిచ=పెరుఁగును,లాజాశ్చ=పేలాలును; పుష్కలాః=సంపూర్ణములయిన; దక్షిణాశ్చ = దక్షిణలును; ప్రదీయతాం= (అధ్యాహృతము)ఇయ్యఁబడుఁగాక.

రేపు ప్రాతఃకాలంబున, నాయన్నంబును, బ్రాహ్మణశ్రేష్ఠులకుఁ బూజచేసి,యొసంగుఁడు, మఱియు, వారలకు,నేయిపెరుఁగుఁబేలాలుఁబుష్కలంబగుదక్షిణయునొసంగుఁడు.

అని.తాత్పర్యము.

సూర్యే భ్యుదితమాత్రే శ్వో భవితా స్వస్తివాచనమ్
బ్రాహ్మణాశ్చ నిమంత్ర్యంతాం కల్ప్యంతా మాసనానిచ. ౧౬

టీక॥శ్వః=రేపు;సూర్యే = సూర్యుఁడు;అభ్యుదితమాత్రే=ఉదయించినవాఁడుకాఁగానే ; స్వస్తివాచనం=మంగళమునుఁ జెప్పుట;భవితా=కాఁగలదు.బ్రాహ్మణాశ్చ=బ్రాహ్మణులును;నిమంత్ర్యంతాం = పిలువఁ బడుదురు

గాక. ఆసనానిచ=పీఠములును; కల్ప్యం తాం=చేయఁబడుఁగాక.

రేపు, సూర్యోదయముకాఁగానే, స్వస్తివాచనముకాఁగలదు, కావున, బ్రాహ్మణులఁబిలువుఁడు, వారలకాసనంబులనిమిర్పుఁడు. అని, తాత్పర్యము.

ఆబధ్యంతాం పతాకాశ్చ రాజమార్గశ్చ సిచ్యతామ్

టీక॥ పతాకాశ్చ = టెక్కెములును; ఆబధ్యంతాం=కట్టఁబడుఁగాక. రాజమార్గశ్చ=పెద్దత్రోవయును; సిచ్యతాం=తడుపఁబడుఁగాక.

అచ్చటచ్చట, ధ్వజములఁగట్టింపుఁడు; రాజమార్గంబునందునీళ్లుచల్లించి, తడుపునట్లు, చేయుఁడు.

అని, తాత్పర్యము.

సర్వేచ తాళావచరా గణికాశ్చ స్వలంకృతాః. ౧౭
కక్ష్యాం ద్వితీయా మాసాద్య తిష్ఠంతు నృపవేశ్మనః

టీక॥ తాళావచరాః=తాళములచే జీవించునటులు; సర్వేచ= అందఱును, స్వలంకృతాః=చక్కఁగానలంకరింపఁబడిన; గణికాశ్చ=భోగము వాండ్రును; నృపవేశ్మనః=రాజగృహముయొక్క; ద్వితీయాం=రెండవదియగు; కక్ష్యాం= తొట్టికట్టును; ఆసాద్య= పొంది; తిష్ఠంతు=ఉండుదురుగాక.

నటులును, భోగమువాండ్రును, చక్కఁగానలంకరించుకొని, రాజగృహంబు రెండవ తొట్టికట్టుచేరియుండునట్లు, చేయుఁడు. అని, తాత్పర్యము.

దేవాయతనచైత్యేషు సాన్నభక్షా స్సదక్షిణాః. ౧౮
ఉపస్థాపయితవ్యా స్స్యుర్ మాల్యయోగ్యాః పృథక్పృథక్

టీక॥ దేవాయతనచైత్యేషు= దేవాలయములయందును, నాలుగుమార్గములుకలియు దారులందును; సాన్నభక్షాః= అన్నముతోను పిండివంటలతోనుకూడినవారలును; సదక్షిణాః=దక్షిణలతోఁగూడినవారలును; మాల్యయోగ్యాః=పుష్పమాలికలనీయఁ గలవారలును, పుష్పమాలికలతోఁగూడినవారలుననుట; పృథక్ పృథక్ = వేర్వేఱుగా; ఉపస్థాపయితవ్యాః=ఉంచఁబడ

వలసినవారలు; స్యుః=అగుదురు.

దేవాలయములందును, జతుష్పథములందును, గొందఱన్నము పెండివంటలను, గొందఱుదక్షిణలను, బుష్పమాలికలను, సంగ్రహించుకొని యుండి దేవతలకు బ్రాహ్మణులకు నొసంగునట్లు, చేయుఁడు.

అని, తాత్పర్యము.

దీర్ఘాసిబద్ధా యోధాశ్చ సన్నద్ధా మృష్టవాససః. ౧౯
మహారాజాంగణం సర్వే ప్రవిశంతు మహోదయమ్

టీక॥ దీర్ఘాసిబద్ధాః=కట్టఁబడిననిడుపయినకత్తిగల వారలును; సన్నద్ధాః=కవచముతొడిగినవారలును;మృష్టవాససః=ఉతికినవస్త్రంబులుగల వారలునగు; యోధాశ్చ=భటులును; సర్వే=అందఱును; మహోదయం=అధికమయినవృద్ధిగల;మహారాజాంగణం=దశరథమహారాజుముంగిలిని; ప్రవిశంతు=ప్రవేశింతురుగాక.

భటులందఱును, నిడుపయిన కత్తిమొలనుబిగించికొని కవచంబుఁ దొడిగికొని, పరిశుద్ధంబగువస్త్రంబుగట్టుకొని, మహోదయంబగు, రాజగృహంబుముంగిటనుండునట్లు, చేయుఁడు. అనివసిష్ఠవామదేవులుసుమంత్రాదులకాజ్ఞాపించిరి. అని, తాత్పర్యము.

ఏవం వ్యాదిశ్య విప్రౌ తౌ క్రియా స్తత్ర సునిష్ఠితౌ. ౨౦
చక్రతు శ్చైవ యచ్ఛేషం పార్థివాయ నివేద్యచ

టీక॥ సునిష్ఠితౌ=మిక్కిలియుస్థైర్యముగల;తౌ=ఆ; విప్రౌ=బ్రాహ్మణులయిన వసిష్ఠవామదేవులు; తత్ర=అచ్చట; ఏవం=ఇట్లు; క్రియాః=కార్యములను; వ్యాదిశ్య = ఆజ్ఞాపించి; యత్ = ఏది; శేషం=మిగిలినదో; తత్(అధ్యాహృతము) చైవ=దానినిగూడ; పార్థివాయచ=దశరథమహారాజుకొఱకును; నివేద్య=తెలిపి; చక్రతుః=చేసిరి.

స్థైర్యసంపన్నులగు నావసిష్ఠవామదేవు, లిట్లుఅచ్చటఁదాముచేయవలసిన కార్యములను, మంత్రులకాజ్ఞాపించి,మిగిలినవానినింగూడ, దశరథునకునుందెల్పి,నెఱవేర్చిరి.

అని, తాత్పర్యము.

కృత మిత్యేవ చా బ్రూతా మభిగమ్య జగత్పతిం. ౨౧
యథోక్త వచనం ప్రీతౌ హర్షయుక్తౌ ద్విజర్షభౌ

టీక॥ద్విజర్షభౌ=బ్రాహ్మణశ్రేష్ఠులగు వసిష్ఠవామదేవులు; ప్రీతౌ=సంతసించినవారై;హర్షయుక్తౌ = గగుర్పాటుతోఁగూడుకొనినవారై ; జగత్పతిం=భూమికిఁ బ్రభువయిన దశరథుని; అభిగమ్య=పొంది ; యథోక్త వచనం=చెప్పఁబడినమాట నతిక్రమింపక; కృతం= చేయఁబడినది; ఇత్యేవ చ=అనియును ; అబ్రూతాం= చెప్పిరి.

బ్రాహ్మణశ్రేష్ఠులగువసిష్ఠ వామదేవులు, సంతోషించి, గగుర్పాటుతోఁగూడినవారలై, దశరథునిడగ్గఱ, "నీవు చెప్పిన మాటప్రకారము, అంతయుఁ జేయఁబడినది" అని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

తత స్సుమంత్రం ద్యుతిమా న్రాజా వచన మబ్రవీత్. ౨౨
రామః కృతాత్మా భవతా శీఘ్ర మానీ యతా మితి

టీక॥ తతః=అంతట;ద్యుతిమాన్=ప్రశస్తంబగుకాంతిగల; రాజా=దశరథమహారాజు; సుమంత్రం= సుమంత్రునిగూర్చి; "భవతా=నీచేత;కృతాత్మా=శిక్షింపఁబడినబుద్ధిగల; రామః= రాముఁడు;శీఘ్రం=త్వరగా; ఆనీయతాం=తేఁబడుఁగాక" ఇతి=అని; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, రామాభిషేక నిశ్చయంబునంజేసి, ప్రశస్తంబయిన కాంతిగలదశరథమహారాజు, సుమంత్రునింబిలిచి, "నీవుపోయి,విద్యాభ్యాసంబునంబరిశుద్ధంబయిన బుద్ధిగలరాముని వేగదోడ్కొనిరమ్ము" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

స తథేతి ప్రతి జ్ఞాయ సుమంత్రో రాజ శాసనాత్. ౨౩
రామం తత్రా నయాంచక్రే రథేన రథినాం వరం

టీక॥ సః=అ; సుమంత్రః=సుమంత్రుఁడు; తథేతి=అలాగేయని; ప్రతిజ్ఞా

యః=ప్రతిన(జేసి; రాజశాసనాత్=రాజుపనుపువలన; రథినాం=రథికులలో; వరం=శ్రేష్ఠుఁడగు; రామం=రామునిఁ; రథేన=రథముచేత; తత్ర=అచ్చటికి; ఆనయాంచక్రే=తోడ్కొనివచ్చెను.

అసుమంతుఁడు, అలాగేయని చెప్పి, రాజాజ్ఞప్రకారము, రథికులలో శ్రేష్ఠుఁడయిన, రాముని రథముపైనెక్కించుకొని, యచ్చటికిఁ దోడ్కొని, వచ్చెను.

అని, తాత్పర్యము.

అథ తత్ర సమాసీనా స్తదా దశరథ న్నృపం. ౨౮
ప్రాచ్యో దీచ్యాః ప్రతీచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ భూమిపాః
మ్లేచ్ఛా చార్యాశ్చ యేచాన్యే వనే శైలాంతవాసినః. ౨౫
ఉపాసాం చక్రిరే సర్వే తం దేవా ఇవ వాసవమ్

టీక ॥ అథ=అటుతర్వాత, సుమంతుఁడురామునిఁదోడ్కొని వచ్చుటకై పోయినతరువాతననుట; తత్ర=ఆసభయందు; తదా = అప్పుడు; సమాసీనాః=కూర్చుండియున్న; ప్రాచ్యోదీచ్యాః=తూర్పుదేశపురాజులునుత్తరదేశపురాజులును; ప్రతీచ్యాశ్చ=పడమటిరాజులును; దాక్షిణాత్యాః=దక్షిణపుదిక్కునందలి; భూమిపాశ్చ=రాజులును; మ్లేచ్ఛాచార్యాశ్చ= మ్లేచ్ఛరాజులును; అన్యే=ఇతరులయిన; వనే=అడవియందు; శైలాంతవాసినః= పర్వతప్రదేశమునందుండువారలు; యే (సంతి)=ఎవరుగలరో; తే(అధ్యాహృతము)చ=వారును; సర్వే=అందఱును; నృపం = మనుష్యులఁబాలించునట్టి; తం=ఆ; దశరథం=దశరథునిఁ; దేవాః=దేవతలు; వాసవమివ=దేవేంద్రునివలె, ఉపాసాంచక్రిరే=సేవించిరి.

సుమంతుఁడు రామునిం దోడ్తేఁబోయినపిమ్మట, నప్పుడు సభయందున్న, తూర్పుదేశపురాజులు నుత్తరదేశపురాజులుఁ బడమటిదేశపురాజులు దక్షిణదేశపు రాజులు మ్లేచ్ఛరాజులు మఱియునడవియందుఁ బర్వత ప్రదేశమునందుండునాటవికు లనంబడువారలు, వీరలందఱును, దేవతలు దేవేంద్రుని సేవించునట్లు, దశరథ మహారాజును సేవించిరి.

అని, తాత్పర్యము.

తేషా మ్మధ్యే స రాజర్షి ర్మరుతా మివ వాసవః. ౨౮
ప్రాసాదస్థో రథగతం దదర్శా యాంత మాత్మజమ్

టీక॥వాసవః = ఇంద్రుఁడు;మరుతాం(మధ్యే)ఇవ= దేవతలనడుమంబోలె;తేషాం=ఆరాజులయొక్క;మధ్యే= నడుమను; స్థితః(అధ్యాహృతము)=ఉన్న;సః=ఆ;రాజర్షిః=రాజునుఋషియునగుదశరథుండు ; ప్రాసాదస్థః= మేడపైనున్నవాఁడై;రథగతం=రథమునుబొందినవాఁడును; ఆయాంతం=వచ్చుచున్నవాఁడునగు; ఆత్మజం=కొడుకయినరామునిఃదదర్శ=చూచెను.

ఇంద్రుండుదేవతల నడుమనుండునట్లు, ఆరాజులనడుమనుండి తేజరిల్లుచున్నదశరథుండు,మేడపైనుండి, దారిలో రథంబుపైవచ్చుచున్న రామునింజూచెను. అని,తాత్పర్యము.

గంధర్వరాజప్రతిమం లోకే విఖ్యాతపౌరుషమ్. ౨౯
దీర్ఘబాహుం మహాసత్త్వం మత్తమాతంగగామినమ్
చంద్రకాంతాననం రామ మతీవ ప్రియదర్శనమ్. ౩౦
రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్
ఘర్మాభితప్తాః పర్జన్యం హ్లాదయంత మివ ప్రజాః. ౩౧
న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః

టీక॥నరాధిపః= మనుష్యులకుఁబ్రభువైనదశరథుండు;గంధర్వరాజప్రతిమం = గంధర్వరాజుతోఁబోలికగలవాఁడును;లోకే= ప్రపంచమందు;విఖ్యాతపౌరుషం= ప్రసిద్ధినొందినపౌరుషముగలవాఁడును; దీర్ఘబాహుం= నిడుపైనచేతులుగలవాఁడును; మహాసత్త్వం = అధికమయినబలము గలవాఁడును; మత్తమాతంగగామినం = మదపుటేనుంగుంబోలె నడుచువాఁడును; చంద్రకాంతాననం = చంద్రుఁడువలె సుందరమయినముఖంబు గలవాఁడును; అతీవ = మిక్కిలియును; ప్రియదర్శనం = సంతోషముగలిగించుచూచుట గలవాఁడును; రూపౌదార్యగుణైః = సౌందర్యముచేతను ఈవిచేతనుమంచిగుణములచేతను;పుంసాం = పురుషులయొక్కయు;దృష్టిచిత్తాపహారిణం=చూపులనుమనసునుఆకర్షించువాఁడును; ఘర్మాభితప్తాః=ఎండచేఁదాపమునొందిన; ప్రజాః=జనులను;హ్లాదయంతం= సంతోషపఱచునట్టి;పర్జన్యమివ(స్థితం)




మేఘముఁ బోలె నున్న వాఁడును ; సమాయాంతం= వచ్చుచున్నవాఁడున గు; రామం = రాముని; పశ్యమానః= చూచుచున్నవాఁడై; నతతర్ప= తృప్తి పొందఁడయ్యె.

దశరథుండు, భోగానుకూలంబుల గురూపవేషంబుల గంధర్వరాజుంబోలు వాఁడును, లోకంబునం బ్రసిద్ధి వహించి నపరాక్రమంబుగలవాఁడును, మోఁకాలివఱకు వ్రేలుకాఁడు బాహువులుగల వాఁడును, మహాబలుండును, మదపుటేనుంగుంబోలె మదాలసంబుగ నడుచు వాఁడును, చంద్రబింబమువలెసుందరం బగుముఖంబుగలవాఁడును, దనుఁజూచువారల కత్యంతానందంబుగలిగించు వాఁడును, సౌందర్యంబుననౌదార్యంబునసౌశీల్యంబునఁబురుషులనుంగూడ మోహింపఁజేయువాఁడును, ఎండవ్రేటునం గ్రాఁగియుండు జనులకు మేఘంబువలెఁ జల్లఁదనంబుఁ బొరయించు వాఁడును, దన యొద్దకు వచ్చుచున్నవాఁడు నగు రాముని, మేడపైనుండి, యెడతెగక, చూచుచున్నను, ప్రేమరసంబు క్షణక్షణంబును బెరుఁగుచుండుటం జేసి, తృప్తి నొందఁడయ్యె. అని, తాత్పర్యము.

అవతార్య సుమంత్రస్తం రాఘవం స్యందనోత్తమాత్. ౩౦
పితుస్సమీపం గచ్ఛంతం ప్రాంజలిః పృష్ఠతోన్వగాత్

టీ॥ సుమంత్రః= సుమంత్రుఁడు; తం= ఆ; రాఘవం= రాముని ; స్యందనోత్తమాత్ = రథశ్రేష్ఠమునుండి ; అవతార్య= దించి ; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై; పితుః= తండ్రియొక్క; సమీపం= చేరువనుగూర్చి; గచ్ఛంతం= పోవుచున్న; తం (అధ్యాహృతము)= ఆరాముని; పృష్ఠతః= వెనుకనుండి; అన్వగాత్ = వెంబడించెను.

సుమంత్రుండు, అంతనా రాముని, రథంబునుండి హస్తప్రదానాది గౌరవంబులచే, దించి, యారాముండు, దశరథుని యొద్దకుఁ బోవుచుండఁగాఁ, జేతులు మొగిడ్చికొని, యతని, వెనుకను , వెంబడించి, పోయెను.

అని, తాత్పర్యము.

సతం కైలాసశృంగాభం ప్రాసాదం నరపుంగవః. ౩౧
ఆరురోహ నృపం ద్రష్టుం సహానూ తేన రాఘవః




టీక॥ నరపుంగవః=పురుషశ్రేష్ఠుం డగు; సః=ఆ; రాఘవః= రాముఁడు; నృపం=దశరథమహారాజును; ద్రష్టుం= చూచుటకు; సూతేనసహ= సారథియగుసుమంత్రునితోఁగూడ; కైలాసశృంగాభం=కైలాసపర్వతముయొక్క శిఖరముయొక్క కాంతివంటికాంతిగల; తం=ఆ; ప్రాసాదం= రాజగృహమును; ఆరురోహ=ఎక్కెను.

పురుషశ్రేష్ఠుండగునా రాముండు, దశరథుంజూచుటకై, సుమంత్రుండు వెంబడింపఁగాఁ, గైలాసశిఖరంబువలె నత్యున్నతంబై తెల్లఁగానుండు నారాజగృహంబుపైకి, నారోహించెను.

అని, తాత్పర్యము.

స ప్రాంజలి రభిప్రేత్య ప్రణతః పితు రంతికే. ౩౨
నామ స్వం శ్రావయన్ రామో వవందే చరణౌ పితుః

టీక॥ సః=ఆ; రామః=రాముఁడు; ప్రాంజలిః=మంచి చేమోడ్పుగలవాఁడై; అభిప్రేత్య=పోయి; పితుః= తండ్రి యొక్క; అంతికే= సమీపమునందు; ప్రణతః=వంగినవాఁడై; స్వం=తనదైన; నామ=పేరును; శ్రావయన్=వినిపించుచు; పితుః=తండ్రియొక్క; చరణౌ=పాదములను; వవందే = నమస్కరించెను.

ఆరాముండు, చేతులుమొగిడ్చికొని తండ్రిసమీపంబునకుఁ బోయి, నమ్రుండై, "రామవర్మాఽహమస్మిభో" అని, తనపేరు వినిపించుచుఁ, దండ్రిపాదములకు నమస్కారంబు చేసెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా ప్రణతం పార్శ్వే కృతాంజలిపుటం నృపః. ౩౩
గృహ్యాంజలౌ సమాకృష్య సస్వజే ప్రియ మాత్మజం

టీక॥ నృపః=దశరథమహారాజు; ప్రణతం=నమస్కరించినవాఁడును; కృతాంజలిపుటం=చేయఁబడినదొప్పలవంటిచేమోడ్పుగలవాఁడునగు; ప్రియం= సంతోషముగలిగించునట్టి; ఆత్మజం= కొడుకైన; తం=ఆరాముని; పా

శ్వే=ప్రక్కను; దృష్ట్వా=చూచి; అంజలౌ=(ద్వితీయార్థమందుసప్తమి) చేమోడ్పును;గృహ్య (గృహీత్వా)=పట్టుకొని; సమాకృష్య=లాగి; సస్వజే=కౌఁగిలించెను.

దశరథమహారాజు,అట్లుతనకునమస్కరించి,చేతులుమొగిడ్చికొని,తనప్రక్కనున్నప్రియపుత్రుండగు రామునిం జూచి, యతనిచేమోడ్పు పట్టియాకర్షించికొని, కౌఁగిలించెను.

అని, తాత్పర్యము.

తస్మై చాభ్యుదితం దివ్యం మణికాంచన భూషితం
దిదేశ రాజా రుచిరం రామాయ పరమాసనమ్.

టీక॥ రాజా= దశరథమహారాజు; తస్మై=ఆ;రామాయచ= రామునికొఱకును; అభ్యుదితం= పొడవైనదియును;దివ్యం=శ్రేష్ఠమయినదియును; మణికాంచనభూషితం= రత్నములచేతను బంగారముచేతను అలంకరింపఁబడినదియును; రుచిరం= మనోహరమునగు;పరమాసనం= పూజ్యమయినయాసనమును;దిదేశ=ఇచ్చెను.

దశరథమహారాజు,ఆరామునకు , ఉన్నతంబై, దివ్యంబై మణులచేతను బంగారముచేతనుఅలంకరింపఁబడి, మనోహరంబైయుండు,మేలయినయాసనంబొసంగెను. అని, తాత్పర్యము.

తదాసనవరం ప్రాప్య వ్యదీపయత రాఘవః. ౩౪
స్వయైవ ప్రభయా మేరు ముదయే విమలో రవిః

టీక॥ రాఘవః=రాముఁడు; తత్=ఆ;ఆసనవరం=ఆసనశ్రేష్ఠమును; ప్రాప్య=పొంది;స్వయా=తనదైన;ప్రభయైవ=కాంతిచేతనే;ఉదయే=ప్రాతఃకాలమునందు;మేరుం=మేరుపర్వతమును; ప్రాప్య(అధ్యాహృతము)=పొంది; విమలః=స్వచ్ఛుఁడైన;రవిః(ఇవ)= సూర్యుఁడుంబోలె; (అభూతోపమ) వ్యదీపయత=ప్రకాశింపఁజేసెను.

రాముండాయాసనంబునం గూర్చుండి,ఉదయకాలంబునసూర్యుండు మేరుపర్వతంబునొంది, యప్పర్వతంబునుదనకాంతిచేఁబ్రకాశింపఁజేయునట్లు, యయ్యాసనంబునుదనకాంతిచేఁ,బ్రకాశింపఁజేసెను. అని, తాత్పర్యము.

తేన విభ్రాజతా తత్ర సా సభా భివ్యరోచత. ౩౬
విమలగ్రహనక్షత్రా శారదీ ద్యౌ రివేందునా

టీక॥ తత్ర=ఆప్రాసాదమునందు; సా=ఆ; సభా=సభ; విభ్రాజతా=ప్రకాశించుచున్న; తేన=ఆ రాముని చేత; విమలగ్రహనక్షత్రా=స్వచ్ఛములయిన గ్రహములునునక్షత్రములునుగల; శారదీ=శరదృతువునందలి; ద్యౌః= ఆకాశము; ఇందు నేవ=చంద్రుని చేతంబోలె; అభివ్యరోచత=ప్రకాశించెను.

స్వచ్ఛములగుగ్రహంబులునునక్షత్రములునుంగలిగినశరదృతువునందలియాకాశమును జందుఁడు ప్రకాశింపఁజేయునట్లు, ఆప్రాసాదంబునందు, దశరథవసిష్ఠాదులతోఁగూడినయాసభను, రాముండు ప్రకాశింపఁజేసెను.

అని, తాత్పర్యము.

తం పశ్యమానో నృపతి స్తుతోష ప్రియ మాత్మజమ్. ౩౭
అలంకృత మివాత్మాన మాదర్శతలసంస్థితమ్

టీక॥నృపతిః=మనుష్యులకుఁ బ్రభువయినదశరథుఁడు; అలంకృతం=అలంకరింపఁబడినవాఁడును ; ఆదర్శతలసంస్థితం=అద్దమునందుఁ బ్రతిబింబించియున్నవాఁడునగు; ఆత్మానమివ = తన్నువలె; ప్రియం=సంతోషముగలిగించునట్టి; ఆత్మజం=కొడుకైన ; తం= ఆరాముని; పశ్యమానః=చూచుచు; తుతోష=సంతోషించెను.

దశరథమహారాజు, చక్కఁగానలంకరించికొని తన్ను అద్దంబునఁజూచుకొని సంతోషించునట్లు , తన ప్రతి బింబమనందగు ప్రియ. పుత్రుండైన రామునింజూచి, సంతోషించెను.

అని, తాత్పర్యము.

స తం సస్మిత మాభాష్య పుత్రం పుత్రవతాం వరః. ౩౮
ఉవాచే దం వచో రాజా దేవేంద్రమివ కాశ్యపః

టీక॥ పుత్రవతాం=కొడుకులుగలవారిలో; వరః=శ్రేష్ఠుండగు; సః=ఆ; రాజా=దశరథమహారాజు; సస్మితం=చిఱునగవుతోఁగూడునట్లు; ఆభాష్య=

పిలిచి; పుత్త్రం = కొడుకయిన; తం= ఆరామునిగూర్చి; కాశ్యపః—కాశ్యపుఁడు; దేవేంద్రమివ= దేవేంద్రునిగూర్చివలె; ఇదం=ఈ; వచః=మాటను ; ఉవాచ—చెప్పెను.

రామునివంటియుత్తమపుత్త్రుఁడుగలిగినవాఁడగుటచేఁ బుత్త్రవంతులలోనుత్తముండనందగిన,దశరథమహారాజు , చిఱునగవుతో,"రామా!" యనిపిలిచి, కాశ్యపుండుతనపుత్త్రుండగుదేవేంద్రునితోఁజెప్పునట్లు,తనపుత్త్రుండగు,రామునితో,నిట్లని,చెప్పెను.అని, తాత్పర్యము

జ్యేష్ఠాయా మసి మే పత్న్యాం సదృశ్యాం సదృశ స్సుతః. ౩౯
ఉత్పన్న స్త్వం గుణశ్రేష్ఠో మమ రామాత్మజః ప్రియః

టీక॥ రామ=రాముఁడా! త్వం= నీవు; మే—నాయొక్క; జ్యేష్ఠాయాం= పెద్దదియగు; సదృశ్యాం = తగిన; పత్న్యాం=భార్యయందు; ఉత్పన్నః= పుట్టిన; సదృశః=తగిన; సుతః=పుత్త్రుండవు; అసి = అగుచున్నావు. గుణశ్రేష్ఠః = గుణంబులచేఁబెద్దవాఁడవు.మమ—నాకు; ప్రియః = సంతోషముగలిగించు; ఆత్మజః=కుమారుండవు.

రాముఁడా! నీవుయోగ్యురాలయిన నాజ్యేష్ఠపత్నియందుఁబుట్టినయోగ్యుండవగుపుత్త్రుండవు; గుణంబులశ్రేష్ఠుండవు; అట్లు, నాకుఁబ్రియ కుమారుండవు. అని, తాత్పర్యము.

యత స్త్వయా ప్రజా శ్చేమా స్స్వగుణై రనురంజితాః. ౪౦
తస్మా త్త్వం పుష్యయోగేన యౌవరాజ్య మవాప్నుహి

టీక॥ యతః=ఏకారణమువలన; త్వయా=నీచేత; ఇమాః=ఈ; ప్రజాశ్చ= జనులును(చకారముచే) మేమును; స్వగుణైః=నీగుణములచేత; అనురంజితాః= అనురాగముగలవారలుగఁ జేయఁబడినారము; తస్మాత్ = అందువలన; త్వం—నీవు; పుష్యయోగేన—పుష్యనక్షత్రముతోసంబంధముగలదివసముచేత, అట్టి దివసము నందనుట; యౌవరాజ్యం=యువరాజుదొరతనంబును; అవాప్నుహి—పొందుము.

నీవు,గుణంబులచేత, మమ్ములనేమి యీజనంబులనేమి, చాలసంతోషపఱిచినావు,కావున,నీజనులందఱు , నీకు యౌవరాజ్యము కావలెనని చెప్పుచున్నారు; అందువలన, నీవుపుష్యనక్షత్రం

బునాఁడు, యౌవరాజ్యంబునొందుము. అని, తాత్పర్యము.

కామత స్త్వం ప్రకృత్యైవ వినీతో గుణవా నసి. ౪౧
గుణవత్యపితు స్నేహా త్పుత్ర వక్ష్యామి తేహితమ్

టీక॥పుత్ర= కుమారుండవగు రాముఁడా!త్వం=నీవు; ప్రకృత్యైవ = స్వభావముచేతనే; కామతః=మిక్కిలియును; వినీతః=వినయము గలవాఁడవు; గుణవాన్=గుణములుగలవాఁడవు; అసి=అగుచున్నావు. త్వయి (అధ్యాహృతము)=నీవు; గుణవత్యపితు= గుణంబులుగలిగియున్నను; స్నేహాత్=చెలిమివలన; తే=నీకు; హితం=మేలును; వక్ష్యామి=చెప్పెదను.

రాముఁడా!నీవు,స్వభావంబుననె, మిక్కిలియు,వినయంబు గలవాఁడవు, గుణవంతుండవు; అట్లునీవు గుణవంతుఁడవయి యుండుటంజేసి, నేనునీకు పదేశింపవలసినదేమియు లేదు; అయినను,స్నేహంబున, నీకుహితంబుఁ జెప్పెదను,వినుము.

అని, తాత్పర్యము.

భూయో వినయ మాస్థాయ భవ నిత్యం జితేంద్రియః. ౪౨
కామక్రోధ సముత్థాని త్యజేథా వ్యసనానిచ

టీక॥రామ (అధ్యాహృతము) = రాముఁడా!భూయః=ఇంకను ; వినయం=అణఁకువను;ఆస్థాయ= అవలంబించి; నిత్యం=ఎల్లప్పుడును;జితేంద్రియః=జయింపఁబడిన యింద్రియములు గలవాఁడవు; భవ=అగుము . కామక్రోధసముత్థాని=కామమువలనను గోపమువలనను బుట్టిన; వ్యసనానిచ = దోషంబులను;త్యజేథాః= విడువుము.

నీవింకను అధికంబుగా వినయంబు నొంది,యెప్పుడును ఇంద్రియనిగ్రహంబుగలిగి,ప్రవర్తింపుము; "స్త్రీ, జూదము వేట మద్యము" ఇవి మొదలగు కామజంబులయిన వ్యసనంబులను, పరుషముగా మాటలాడుట, క్రూరముగాదండించుట,బొక్కసము సెలవుసేయుట," మొదలగు క్రోధజంబులయిన వ్యసనంబులను,విడువుము.

అని, తాత్పర్యము.

పరోక్షయా వర్తమానో వృత్త్యా ప్రత్యక్షయా తథా. ౪౩
అమాత్యప్రభృతీ స్సర్వాః ప్రకృతీ శ్చానురంజయ

టీక॥ పరోక్షయా= ప్రత్యక్షముకాని; వృత్త్యా=వ్యాపారముచేతను; తథా=అట్లు; ప్రత్యక్షయా =ప్రత్యక్షమయిన; వృత్త్యా (అధ్యాహృతము) = వ్యాపారముచేతను ; వర్తమానః= ఉండువాఁడవు; భవ=అగుము . అమాత్యప్రభృతీః = మంత్రులు మొదలగు; ప్రకృతీః = ప్రజలను ; సర్వాశ్చ= అందఱను ; అనురంజయ = సంతసింపఁజేయుము.

నీవు, చిల్లరపనివాండ్రకు దర్శనం బివ్వక వారికిఁ బరోక్షంబు గానే యుండి, యాజ్ఞల నొసంగుచు , మంత్రులు మొదలగువారలతో నెల్లప్పుడును గూడియుండి, వారలకుఁ బ్రత్యక్షముగనే, కార్యములజరిగించు చుండుము; మఱియు, మంత్రులు సేనాధిపతులు మొదలగు వారలను, ప్రజలను, అందఱను, సంతోషపఱచుచుండుము.

అని, తాత్పర్యము.

లేక ః నీవు పరోక్షంబుగా నుండి, యితర రాజ్యవృత్తాంతంబుల నెఱుంగుచుఁ, బ్రత్యక్షంబుగానుండి, స్వరాజ్యవృత్తాంతముల నెఱుంగుచుండుము. (శేషముసమానము) అని తాత్పర్యము.

కోష్ఠాగారాయుధాగారైః కృత్వాసన్నిచయాన్ బహూన్. ౪౪
తుష్టానురక్త ప్రకృతి ర్యః పాలయతి మేదినీమ్
తస్య నందంతి మిత్రాణి లబ్ధ్వా మృత మివామరాః. ౪౫

టీక॥ యః=ఎవ్వఁడు; కోష్ఠాగారాయుధాగారైః = ధాన్యగృహములతోను, ఆయుధగృహములతోను; బహూన్=అనేకములయిన ; సన్నిచయాన్=మంచికోశములను; కృత్వా= చేసి; తుష్టానురక్తప్రకృతిః=సంతసించినవారును, అనురాగముగలవారునగు ప్రజలుగలవాఁడై; మేదినీం=భూమిని; పాలయతి=రక్షించుచున్నాఁడో ; తస్య=అతనికి, అతనివలనననుట, మిత్రాణి=స్నేహితులు; అమృతం=అమృతమును; లబ్ధ్వా=పొంది; అమరాఇవ=దేవతలువలె; నందంతి=సంతసింతురు.

ధాన్యంబులను, ఆయుధంబులను, ఆయాగృహంబులనింపి, ధనంబులు మెదలగువాని, మెండుగాఁగూర్చి, జనులం దఱుసంతసించి తనమీఁదననురాగంబు గలిగియుండునట్లు, ఎవ్వండు భూమినేలునో; అతనింబొచి, యతనిస్నేహితులు, అమృతంబుఁ బొందిన దేవతలుం బోలె, సంతసింతురు. అని తాత్పర్యము.

తస్మా త్త్వమపి చాత్మానం నియమ్యైవం సమాచర

టీక॥తస్మాత్=అందువలన; త్వమపి=నీవును; ఆత్మానం=మనసును; నియమ్య=గట్టిపఱచుకొని; ఏవం=ఇట్లు; సమాచర=నడువుము.

అట్లగుటంజేసి, నీవును, మనంబుఁజాపలంబునొందనీక, యట్లు, సేయుము. అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా సుహృద స్తస్య రామస్య ప్రియకారిణః. ౪౬
త్వరితా శ్శీఘ్ర మభ్యేత్య కౌసల్యాయై న్యవేదయన్

టీక॥తస్య=ఆ; రామస్య=రాముని యొక్క; ప్రియకారిణః= సంతోషము సేయువారలగు; సుహృదః = స్నేహితులు; తత్=దాని; శ్రుత్వా=విని; త్వరితాః = వేగిరపాటుగలవారలై; శీఘ్రం=వడిగా; అభ్యేత్య=పోయి; కౌసల్యాయై = కౌసల్యకొఱకు; న్యవేదయన్=తెలిపిరి.

ఆరాముని స్నేహితులు, అతనికిఁబ్రియంబు సేయువారలు, అట్లు దశరథుండు "రామునకుయావరాజ్యంబొసంగెద" ననుటనువిని, త్వరితంబుగాఁగౌసల్యకడకుంజని, యాదేవితో, "రాముండు యువరాజుగాఁగలఁడు" అని, దశరథ ప్రయత్నమును, దెలియఁజెప్పిరి. అని, తాత్పర్యము.

సా హిరణ్యంచ గాశ్చైవ రత్నాని వివిధాని చ. ౪౭
వ్యాదిదేశ ప్రియాఖ్యేభ్యః కౌసల్యా ప్రమదోత్తమా

టీక॥ప్రమదోత్తమా = స్త్రీలలో శ్రేష్ఠురాలగు; సా=ఆ; కౌసల్యా=కౌసల్య; ప్రియాఖ్యేభ్యః= ప్రియవార్తఁజెప్పువారలకు; హిరణ్యంచ=బంగారము

నుః గాశ్చైవ=ఆవులను; వివిధాని=ప లు దెఱంగులయిన; రత్నానిచ=మణుల ను; వ్యాదిదేశ=ఇచ్చెను.

స్త్రీలలోనుత్తమురాలయిన యా కౌసల్య, అట్లుతనకు, రామాభిషేకరూ పంబగుప్రియవార్తఁ దెలిపినయారామ మిత్రులకు, బంగారమునుగోవులను నా నావిధమణులను, ఒసంగెను.

అని, తాత్పర్యము.

అథాభివాద్య రాజానం రథ మారుహ్య రాఘవః. ౪౮
యయౌ స్వం ద్యుతిమ ద్వేశ్మ జనౌఘైః ప్రతిపూజితః

టీక॥ అథ = అటుతర్వాత; రాఘ వః=రాముఁడు; రాజానం=దశరథమ హారాజును; అభివాద్య=నమస్కరించి; రథం=రథమును; ఆరుహ్య = ఎక్కి; జ నౌఘైః= జనులయొక్కసమూహము ల చేత; ప్రతిపూజితః=ఎదుర్కొనిపూ జింపఁబడినవాఁడై; స్వం = తనదైన; ద్యుతిమత్=కాంతిగల; వేశ్మ = గృహ మును; యయౌ=పోయెను.

అంత, రాముండు, తండ్రియగుదశ రథమహారాజునకు, నమస్కారము మొన ర్చి, రథంబెక్కి, జనులుగుంపులుగుం పులుగాఁ దన్నెదుర్కొనిపూజింపఁ గాఁ, గాంతిమంతంబగుతనయింటికిం బోయెను. అని, తాత్పర్యము.

తే చాపి పౌరా నృపతే ర్వచ స్త
చ్ఛ్రుత్వా తదా లాభ మివేష్ట మాశు
నరేంద్ర మామంత్ర్య గృహాణి గత్వా
దేవాన్ సమానర్చు రతిప్రహృష్టాః. ౪౯

టీక॥ తే=ఆ; పౌరాశ్చాపి = పట్ట ణంబునందుండు జనులును; నృపతేః= మనుష్యులకుఁ బ్రభువైన దశరథమహా రాజుయొక్క; ఇష్టం= కోరఁబడిన ; లాభమివ(స్థితం) = లాభమువలెను న్నట్టి; తత్=ఆ; వచః=మాటను ; శ్రుత్వా=విని; తదా=అప్పుడు; నరేం ద్రస్య=మనుష్యులకుఁ బ్రభువయినదశ రథుని; ఆమంత్ర్య=వీడ్కొని; ఆశు= శీఘ్రముగా; గృహాణి=ఇండ్లను ; గ

త్వా=పొంది, అతిప్రహృష్టాః= మిక్కిలియు సంతసించినవారలై; దేవాన్=దేవతలను; సమానర్చుః=పూజించిరి.

అంతట, బట్టణవాసిజనులును, తమకు ఇష్టలాభంబునందగియున్న, దశరథుండు చెప్పిన, రామాభిషేక వార్తను విని, యంత, దశరథునియొద్ద సెలవుఁ బొంది, శీఘ్రంబుగాఁ దమయిండ్లు సేరి, సంతోషంబున శ్రీరామాభిషేకముని ర్విఘ్నంబగుటకై, తమతమయిష్ట దేవతలంబూజించిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, తృతీయ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండతృతీయసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

చతుర్థసర్గప్రారంభః.

గతే ష్వథ నృపో భూయః పౌరేషు సహ మంత్రిభిః
మంత్రయిత్వా తత శ్చక్రే నిశ్చయజ్ఞ స్స నిశ్చయమ్. ౧
శ్వఏవ పుష్యో భవితా శ్వోభిషేచ్య స్తు మే సుతః
రామో రాజీవతామ్రాక్షో యౌవరాజ్య ఇతి ప్రభుః. ౨

టీక॥ అథ—అంత; పౌరేషు=పట్టణంబునందుండుజనులు; గతేషు=పోఁగా; నిశ్చయజ్ఞః=ఏపాటుల నెఱింగినవాఁడును; ప్రభుః = సమర్థుఁడును నగు; సః=ఆ; నృపః= దశరథమహారాజు; భూయః=మఱల; మంత్రిభిస్సహ= మంత్రులతోఁగూడ; మంత్రయిత్వా=ఆలోచించి; తతః=అటుపిమ్మట; "శ్వఏవ=రేపే; పుష్యః=పుష్యనక్షత్రము; భవితా=కాఁగలదు. రాజీవతామ్రాక్షః= ఎఱ్ఱదామరపూలువలె నెఱ్ఱనగు కండ్లుగలవాఁడును; మే=నాయొక్క;

సుతః=కుమారుండునగు; రామః=రాముఁడు; శ్వస్తు=రేపే; యావరాజ్యే=యువరాజుదొరతనమునందు; అభిషేచ్యః= అభిషేకింపఁ దగినవాఁడు." ఇతి=అని; నిశ్చయం=ఏర్పాటును; చక్రే=చేసెను.

అంతఁ బౌరులందఱుఁబోయిన పిమ్మటఁ, గార్యంబులనిశ్చయించు పద్ధతులనెఱింగినవాఁడును బ్రభుండునగు దశరథమహారాజు , మఱల మంత్రులతోనాలోచించి "రేపేపుష్యనక్షత్రంబు వచ్చును, గావున, ఎఱ్ఱదామరపువ్వులం బోలురక్తాంతంబులగునేత్రంబులు గల వాని నాకుమారుని రాముని, రేపే, యౌవరాజ్యంబున నభిషేకించునది," యని,నిశ్చయించెను.

అని, తాత్పర్యము.

అథాంతర్గృహం మావిశ్య రాజా దశరథ స్తదా
సూత మామంత్రయామాస రామం పున రిహానయ. ౩

టీక॥అథ=అటుతర్వాత; రాజా=రాజయిన;దశరథః=దశరథుండు; అంతర్గృహం = అంతఃపురమును;ఆవిశ్య = పొంది;తదా=అప్పుడు; "రామం=రాముని; పునః=మఱల; ఇహ=ఇచ్చటికి;ఆనయ=తోడ్తెమ్ము;" ఇతి(అధ్యాహృతము)=అని; సూతం=సారథియగుసుమంత్రుని;ఆమంత్రయామాస=ఆజ్ఞాపించెను.

అంత, దశరథమహారాజంతఃపురంబునకుఁబోయి,సుమంత్రునింజూచి,"నీవు రాముని మఱలనిచ్చటికిఁ దోడ్కొనిరమ్ము" అని,యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ప్రతిగృహ్య స తద్వాక్యం సూతః పున రుపాయయౌ
రామస్య భవనం శీఘ్రం రామ మానయితుం పునః. ౪

టీక ॥ సః=ఆ; సూతః=సుమంత్రుఁడు;తత్=ఆ; వాక్యం=మాటను; ప్రతిగృహ్య=స్వీకరించి;పునః=మఱల; రామం=రాముని; ఆనయితుం (ఆనేతుం)=తోడ్తెచ్చుటకై; పునః= మఱల; రామస్య=రామునియొక్క; భవనం=గృహమును;శీఘ్రం=వడిగా; ఉపాయయౌ=పొందెను.

సుమంతుఁడు, దశరథాజ్ఞను శిరసావహించి, మఱల రాముని దోడ్కొనివచ్చుటకై శీఘ్రంబుగా రాముని గృహంబునకుఁబోయెను. అని తాత్పర్యము

ద్వాస్థై ౯ రావేదితం తస్య రామాయా గమనం పునః
శ్రుత్వైవ చాపి రామ స్తం ప్రాప్తం శంకాన్వితో భవత్. ౫

టీక॥ పునః=మఱల; తస్య=ఆసుమంత్రునియొక్క; ఆగమనం=రాక; ద్వాస్థైః=ద్వారపాలకులచేత; రామాయ=రామునికొఱకు; ఆవేదితం=తెలుపఁబడినది. రామశ్చాపి= రాముఁడును; తం=ఆసుమంత్రునిని; ప్రాప్తం=వచ్చినవానిఁగా; శ్రుత్వైవ=వినినంతనే; శంకాన్వితః=సందేహముతోఁగూడినవాఁడు; అభవత్=ఆయెను.

అంత, ద్వారపాలకు, "సుమంతుఁడువాకిటవచ్చియున్నా"డని, రామునకుఁదెల్పిరి; రాముండును, సుమంతుఁడుమఱలవచ్చుటనువిని, "మఱలవచ్చుటకుఁగారణంబేమొకో" యనిసందేహంబునొందెను.

అని, తాత్పర్యము.

ప్రవేశ్య చైనం త్వరితం రామో వచన మబ్రవీత్

టీక॥ రామః = రాముఁడు; త్వరితం=శీఘ్రముగా; ఏనం=ఈసుమంత్రుని; ప్రవేశ్యచ = ప్రవేశింపఁజేసి; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముండు, సుమంత్రునిశీఘ్రముగా లోనికి వచ్చునట్లుచేసి, యతనింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

య దాగమనకృత్యం తే భూయ స్త ద్బ్రూహ్యశేషతః. ౬

టీక॥ భూయః=మఱల; తే=నీకు; యత్=ఏది; ఆగమనకృత్యం= వచ్చుటకైనకార్యమో; తత్=దానిని; అశేషతః= సాకల్యముగా; బ్రూహి= చెప్పుము.

నీవుమఱల నిచ్చటికేమికార్యముగా వచ్చితివో, దానినంతయుసవివరంబుగాఁజెప్పుము. అని, రాముండుసుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

త మువాచ తత స్సూతో రాజా త్వాం ద్రష్టు మిచ్ఛతి

శ్రుత్వా ప్రమాణ మత్ర త్వం గమనాయే తరాయ వా. ౭

టీక॥ తతః = అటుపిమ్మట; సూతః = సుమంత్రుండు; తం = ఆరామునిగూర్చి; రాజా = దశరథమహారాజు; త్వాం = నిన్ను; ద్రష్టుం = చూచుటకు; ఇచ్ఛతి = కోరుచున్నాఁడు. శ్రుత్వా = (ఈమాటను) విని; అత్ర = ఈవిషయమందు; గమనాయ = పోవుటకొఱకుఁగాని, ఇతరాయవా (ఇతరస్మై వా) = మఱియొక్కదానికొఱకుఁగాని; త్వం = నీవు; ప్రమాణం = ప్రభుండవు.

అంత, సూతుండు, రామునింజూచి, "దశరథమహారాజునినుఁబూడఁగోరుచున్నాఁడు; ఈమాటనువిన్నపైని, దశరథునియొద్దకుఁ బోవుటకుఁ గాని, యూరకుండుటకుఁగాని, నీవప్రభుండవు" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి సూతవచ శ్శ్రుత్వా రామో థ త్వరయాన్వితః
ప్రయయౌ రాజభవనం పున ర్దద్రష్టుం నరేశ్వరమ్. ౮

టీక॥ రామః = రాముఁడు; ఇతి = ఇట్లు; సూతవచః = సుమంత్రునిమాటను; శ్రుత్వా = విని; అథ = అటుతర్వాత; త్వరయా = వేగముతో; అన్వితః = కూడినవాఁడై; పునః = మఱల; నరేశ్వరం = మనుష్యులకుఁబ్రభుండయినదశరథుని; ద్రష్టుం = చూచుటకు; రాజభవనం = రాజగృహంబును; ప్రయయౌ = పొందెను.

రాముం, డిట్లు, సుమంత్రునిమాటవిని, మఱలదశరథమహారాజుంజూచుటకై, వేగంబుగా రాజగృహంబునకుఁ బోయెను. అని, తాత్పర్యము.

తం శ్రుత్వా సమనుప్రాప్తం రామం దశరథో నృపః
ప్రవేశయామాస గృహం వివక్షుః ప్రియ ముత్తమమ్. ౯

టీక॥ నృపః = మనుష్యులఁబాలించునట్టి; దశరథః = దశరథుఁడు; సమనుప్రాప్తం = వచ్చిన; తం = ఆ; రామం = రామునిః; శ్రుత్వా = విని; ఉత్తమం = శ్రేష్ఠమయిన; ప్రియం = సంతోషకరంబగుమాటను; వివక్షుః = చెప్పఁగోరినవాఁడై; గృహం = ఇంటిని; ప్రవేశయామాస = ప్రవేశింపఁజేసెను.

దశరథమహారాజు, రాముండువాకిటవచ్చియుండుటనుద్వారపాలకులవ

లననెఱింగి, ఉత్తమంబగుప్రియవార్తఁ జెప్పుందలఁచి, గృహంబులోనికివచ్చునట్లుచేసెను.

అని, తాత్పర్యము.

ప్రవిశన్నేవ చ శ్రీమా న్రాఘవో భవనం పితుః
దదర్శ పితరం దూరా త్ప్రణిపత్య కృతాంజలిః. ౧౦

టీక ॥ శ్రీమాన్ = అందఱికన్నసధికుండగు; రాఘవః = రాముండు; పితుః = తండ్రియయిన దశరథునియొక్క; భవనం = గృహమును; ప్రవిశన్నేవ = ప్రవేశించుచునే; దూరాత్ = దూరమునుండి; ప్రణిపత్య = నమస్కరించి; కృతాంజలిః = చేయఁబడినచేమోడ్పుగలవాఁడై; పితరం = తండ్రిని; దదర్శ = చూచెను.

శ్రీమంతుండగురాముండు, తండ్రిగృహంబుప్రవేశించుచునే, దూరంబుననుండి, నమస్కారంబుఁజేసి, చేతులుమొగిడ్చికొని, సవినయంబుగఁ దండ్రియగుదశరథమహారాజును, సందర్శించెను.

అని, తాత్పర్యము.

ప్రణమంతం సముత్థాప్య తం పరిష్వజ్య భూమిపః
ప్రదిశ్య చాస్మై రుచిర మాసనం పునరబ్రవీత్. ౧౧

టీక॥ భూమిపః = భూమినిచాలిందునట్టిదశరథుండు; ప్రణమంతం = నమస్కరించుచున్న; తం = ఆరాముని; సముత్థాప్య = ఎత్తి; పరిష్వజ్య = కౌఁగిలించుకొని; అస్మై = ఈరామునకు; రుచిరం = మనోహరమయిన; ఆసనంచ = ఆసనమును; ప్రదిశ్య = ఇచ్చి; పునః = మఱల; అబ్రవీత్ = చెప్పెను.

దశరథమహారాజు, అట్లు నమస్కరించుచున్నరాముని నెత్తి కౌఁగిలించికొని, యతని మనోహరంబగు ఆసనంబు నంగూర్చుండఁజేసి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

రామ వృద్ధోఽస్మి దీర్ఘాయు ర్భుక్తా భోగా మయేప్సితాః
అన్నవద్భిః క్రతుశతై స్తథేష్టం భూరిదక్షిణైః. ౧౨

టీక॥రామ = రాముఁడా! అహం (అధ్యాహృతము)=నేను ; దీర్ఘాయుః= అధికమయినయాయుస్సుగల; వృద్ధః=ముదుసలివాఁడను; అస్మి=అగుచున్నాను. మయా=నాచేత; ఈప్సితాః=కోరఁబడిన; భోగాః=భోగములు; భుక్తాః=అనుభవింపఁబడినవి . తథా=అట్లు; అన్నవద్భిః=ప్రశస్తంబగు నన్నముగలవియు; భూరిదక్షిణైః= అధికమయినదక్షిణగలవియునగు; క్రతుశతైః=యాగములయొక్క నూఱులచేత; ఇష్టం=యజింపఁబడినది.

రాముఁడా! నేను దీర్ఘకాలము బ్రతికి వృద్ధుండనైతి; నేనుగోరిన భోగంబులనన్నింటి ననుభవించినాఁడను; అట్లు; ప్రశస్తంబులయినయన్నప్రదానంబులు నధికదక్షిణలుఁగల పెక్కు నూఱులుయాగంబులు చేసినాఁడను.

అని, తాత్పర్యము.

జాత మిష్ట మపత్యంమే త్వ మద్యానుపమం భువి
దత్త మిష్ట మధీతంచ మయా పురుష సత్తమ. ౧౩

టీక॥పురుషసత్తమ = పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అద్య = ఇప్పుడు; త్వం=నీవు; మే=నాకు; జాతం=పుట్టినవాఁడవును; ఇష్టం= ప్రియుండవును; భువి=భూమియందు; అనుపమం=సరిలేనివాఁడవునగు; అపత్యం=బిడ్డఁడవు. మయా=నాచేత; దత్తం= ఇవ్వఁబడినది. ఇష్టం=యజింపఁబడినది. అధీతంచ=అధ్యయనముచేయఁబడినదియు.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఇప్పుడు, నీవు, నాకుఁబ్రియుండవు, భూమియందుసాటిలేని వాఁడవునగు కుమారుండవై యున్నావు; నేను, పెక్కుదానములు చేసినాఁడను, యాగములు చేసినాఁడను, అట్లధ్యయనంబును జేసినాను. అని, తాత్పర్యము.

అనుభూతాని చేష్టాని మయా వీర సుఖాన్యపి

టీక॥వీర = పరాక్రమశాలివగు రాముఁడా! ఇష్టాని=కోరఁబడిన, లేక, శాస్త్రంబునకిష్టంబులయిన, నిషిద్ధంబులుకాని యనుట; సుఖాన్యపి=సుఖంబులును; మయా=నాచేత; అనుభూతాని చ=అనుభవింపఁబడినవియు.

పరాక్రమశాలివగురాముఁడా! "అనిషిద్ధ సుఖత్యాగీ పశురేవ నసంశయః" (శాస్త్రంబునందునిషిద్ధంబుకానిసుఖంబునువిడుచువాఁడు, పశుప్రాయుఁడేః సందియములేదు) అనిచెప్పఁబడియుండునట్లు, శాస్త్రంబునసిషిద్ధంబులుకానిసుఖంబులను, యథేష్టంబుగాననుభవించినాఁడను. అని, తాత్పర్యము.

దేవర్షిపితృవిప్రాణా మనృణోస్మి తథాత్మనః. ౧౪

అహం (అధ్యాహృతము) = నేను; దేవర్షిపితృవిప్రాణాం = దేవతలకునుఋషులకును బితరులకును బ్రాహ్మణులకును; తథా = అట్లు; ఆత్మనః = శరీరమునకును; అనృణః = అప్పులేనివాఁడను; అస్మి = అగుచున్నాను.

అట్లు, యాగములు చేయుటంజేసి, నాకు దేవతలఋణంబుతీఱినది; అధ్యయనముచేయుటవలన ఋషుల ఋణముదీఱినది; నిన్నుఁగనుటవలనఁబితరులఋణముదీఱినది; నానావిధంబులుగా దానంబులుసేయుటచేబ్రాహ్మణులఋణంబుఁదీఱినది; అట్లు, సమస్తసుఖంబులననుభవించినాను, గావున, శరీరఋణంబునుం దీర్చుకొన్నవాఁడనైతిని. అని, తాత్పర్యము.

న కించి న్మమ కర్తవ్యం తవాన్య త్రాభిషేచనాత్
అతోయ త్వా మహం బ్రూయాం తన్మేత్వం కర్తుమర్హసి. ౧౫

టీక॥ తవ = నీయొక్క; అభిషేచనాత్ అన్యత్ర = అభిషేకించుటఁదక్క; కించిత్ = కొంచెమయినను; మమ = నాకు; కర్తవ్యం = చేయఁబడవలసినది; న = లేదు. అతః = ఇందువలన; అహం = నేను; త్వాం = నిన్నుఁగూర్చి; యత్ = దేని; బ్రూయాం = చెప్పుదునో; త్వం = నీవు; తత్ = దాని; మే = నాకొఱకు; కర్తుం = చేయుటకు; అర్హసి = తగుదువు.

నీకు రాజ్యాభిషేకము సేయుటఁదక్క, నేనుమఱేమియుఁ జేయవలసినది లేదు; కావున, నేనునీకేమిచెప్పెదనో దానిసీవిప్పుడునాకొఱకుఁజేయవలెను. అని, తాత్పర్యము.

అద్య ప్రకృతయ స్సర్వా స్త్వా మిచ్ఛంతి నరాధిపమ్

అద్య త్వాం యువరాజాన మభిషేక్ష్యామి పుత్రక. ౧౬

టీక॥ అద్య=ఇప్పుడు; ప్రకృతయః=జనులు; సర్వాః=అందఱును; త్వాం=నిన్ను; నరాధిపం=మనుష్యులకుఁబ్రభునిఁగా; ఇచ్ఛంతి=కోరుచున్నారు. పుత్రక=చిన్నికొమరుండ వగు రామఁడా! అతః=ఇందువలన; త్వాం=నిన్ను; యువరాజానం(యువరాజం)=యువరాజునుగా; అభిషేక్ష్యామి = అభిషేకించెదను.

చిన్నికొమరుండవగు రామఁడా! ఇప్పుడు, ప్రజలందఱు, "నీవు రాజుకావలె" ననికోరుచున్నారు; కావున, నీకు యావరాజ్యంబొసంగెదను.

అని, తాత్పర్యము.

అపిచా ద్య శుభాన్ రామ స్వప్నే పశ్యామి దారుణాన్
సనిర్ఘాతా దివో ల్కాచ పతతీ హ మహాస్వనా. ౧౭

టీక॥ రామ=రామఁడా! అపిచ=ఇంతియఁగాక; అద్య = ఇప్పుడు; స్వప్నే=స్వప్నమునందు; దారుణాన్=భయంకరంబులయిన; అశుభాన్=అమంగళకరంబులగునుత్పాతంబులను; పశ్యామి=చూచుచున్నాను. ఇహ=ఈదేశమునందు; మహాస్వనా=అధికమయినధ్వనిగలదియు; సనిర్ఘాతా=పిడుగుతోఁగూడినదియునగు; ఉల్కాచ=మంటలేనినిప్పును; దివః(సంధియార్షము)=ఆకాశమునుండి; పతతి=పడుచున్నది.

రామఁడా! ఇదిగాక, నాకు, స్వప్నంబున, భయంకరంబులును, అమంగళకరంబులునగునుత్పాతంబులు, కనుపడుచున్నవి; ఆకాశంబునుండి, పిడుగులతోఁగూడ, మంటలేనియగ్నులు, గొప్పధ్వనితోఁబడుచున్నవి.

అని, తాత్పర్యము.

అవష్టబ్ధంచ మే రామ నక్షత్రం దారుణై ర్గ్రహైః
ఆవేదయంతి దైవజ్ఞా స్సూర్యాంగారకరాహుభిః. ౧౮

టీక॥ రామ=రామఁడా! మే=నాయొక్క; నక్షత్రం=జన్మనక్షత్రము; దారుణైః = భయంకరంబులయిన; సూర్యాంగారకరాహుభిః= సూర్యుఁడునంగారకుఁడు రాహువుననెడు; గ్రహైః= గ్రహములచేత; అవష్టబ్ధం=

స ౪

ఆక్రమింపఁబడినది. ఇతి(అధ్యాహృతము)=అని; దైవజ్ఞాః=జ్యోతిషికులు; ఆవేదయంతి=తెలుపుచున్నారు.

రాముఁడా! "నాజన్మనక్షత్రమును, భయంకరులగుసూర్యుఁడునంగారకుండురాహువునాక్రమించియున్నా"రని, జ్యోతిషికులు, చెప్పుచున్నారు.

అని, తాత్పర్యము.

ప్రాయేణహి నిమిత్తానా మీదృశానాం సముద్భవే
రాజాహి మృత్యు మాప్నోతి ఘోరం వాపద మృచ్ఛతి. ౧౯

టీక॥ ఈదృశానాం=ఇట్టివయిన; నిమిత్తానాం=శకునములయొక్క; సముద్భవే=పుట్టుకగలుగఁగా; ప్రాయేణహి=బాహుళ్యముచేత మాత్రము; రాజా=రాజు; మృత్యుం = మరణమును; ఆప్నోతిహి=పొందుచున్నాఁడుగదా! వా=లేక; ఘోరం= భయంకరమయిన; ఆపదం=విపత్తును; ఋచ్ఛతి=పొందుచున్నాఁడు.

ఇట్టిదుర్నిమిత్తంబులు గలిగి నప్పుడు, ప్రాయికముగా, రాజునకుమరణంబుగలుగును; అట్లుగాదేని, గొప్పయాపద యయినను, సంభవించును.

అని, తాత్పర్యము.

త ద్యావదేవ మే చేతో న విముంచతి రాఘవ
తావ దేవా భిషించస్వ చలాహి ప్రాణినాం మతిః. ౨౦

టీక॥ రాఘవ=రాముఁడా! తత్ =అందువలన; యావదేవ= ఎంతలోపలనే; మే=నాయొక్క; చేతః=మనసు, లేక, ఆలోచన; నవిముంచతి=విడువదో; తావదేవ=అంతలోపలనే ; అభిషించస్వ=అభిషేకించుకొనుము . ప్రాణినాం=జంతువులయొక్క; మతిః= బుద్ధి; చలాహి=స్థైర్యములేనిదికదా!

రాముఁడా! అందువలననే, నాకిప్పుడుగలిగిన, "నిన్నుయౌవరాజ్యమునందభిషేకింపవలె" నని యెడుతలంపు మాఁయుటకుమునుపే, నీవభిషిక్తుండవగుము; అట్లుకాదేని, ప్రాణులబుద్ధి చంచలంబు, కావున, భేదంబుకలుగును.

అని, తాత్పర్యము.

అద్య చంద్రో భ్యుపగతః పుష్యా త్పూర్వం పునర్వసూ

శ్వః పుష్య యోగం నియతం వక్ష్యంతే దైవచింతకాః. ౨౧

టీక॥అద్య=ఈదినమునందు ; చంద్రః=చంద్రుఁడు ; పుష్యాత్=పుష్యనక్షత్రముకన్న ; పూర్వం= ముందుదయిన ; పునర్వసూ=పునర్వసు నక్షత్రమును ; అభ్యుపగతః= పొందినాఁడు, దైవచింతకాః=జ్యోతిషికులు ; నియతం=అభిషేకమునకొఱకు,నిశ్చయింపఁబడిన ; పుష్యయోగం = పుష్యనక్షత్రముతో సంబంధమును;శ్వః=రేపు ; వక్ష్యంతే(ఆషఋము)= చెప్పుచున్నారు.

నేఁడు, చంద్రుండు, పుష్యమునకు ముందు నక్షత్రంబయిన పునర్వసువుం బొందియున్నాఁడు ; మనమభిషేకమునకునిర్ణయించికొనినపుష్యయోగము రేపువచ్చునని, జ్యోతిషికులు చెప్పుచున్నారు.అని, తాత్పర్యము.

తతః పుష్యేభిషించస్వ మన స్త్వరయతీవ మామ్
శ్వ స్త్వాహ మభి షేక్ష్యామి యౌవరాజ్యే పరంతప. ౨౨

టీక॥తతః=అందువలన;పుష్యే=పుష్యనక్షత్రమునందు; అభిషించస్వ=అభిషేకించుకొనుము.మాం=నన్ను;మనః=మనసు;త్వరయతీవ=వేగిరపఱచుచున్నదివోలెనున్నది. పరంతప = శత్రువులఁ దపింపఁజేయు రాముఁడా ! త్వా=నిన్ను; శ్వః=రేపు; యౌవరాజ్యే=యువరాజుదొరతనమునందు;అభిషేక్ష్యామి=అభిషేకించెదను.

కావున,నీవు,పుష్యనక్షత్రంబుననభిక్తుండవగుము, నామనసే నన్ను వేగిరపఱచు చున్నట్లున్నది, శత్రుభంజనుఁడా! రేపు, నీకుయౌవరాజ్యాభిషేకంబు, చేసెదను.
అని, తాత్పర్యము.

తస్మాత్త్వ యాద్య ప్రభృతి నిశేయం నియతాత్మనా
సహ వధ్వో ప వస్తవ్యా దర్భప్రస్తర శాయినా. ౨౩

టీక॥తస్మాత్ = అందువలన;అద్య ప్రభృతి = ఇదిమొదలు; నియతాత్మనా=నిగ్రహింపఁబడిన మనసుగలవాఁడవు;దర్భప్రస్తరశాయినా = దర్భల




తో నేర్పఱుపఁ బడినశయ్యా యందుఁ బరుండువాఁడవునగు; త్వయా=నీచేత; వధ్వాసహ = భార్యతోఁగూడ; ఇయం=ఈ; నిశా = రాత్రి; ఉపవస్త వ్యా=ఉపసింపఁబడవలసినది.

అట్లగుటం జేసి, యిది మొదలు, నీవు, మనంబునిశ్చలంబుఁ జేసికొని, దర్భలపైఁ బరుండి, యుండి, భార్యతోఁగూడ, నీ రాత్రియంతయు, నుపవాసం బుండవలయును. అని, తాత్పర్యము.

సుహృదశ్చా ప్రమత్తాస్త్వాంరక్షంత్వద్య సమంతతః
భవంతి బహు విఘ్నాని కార్యాణ్యేవం విధానిహి. ౨౪

టీక॥సుహృదశ్చ=స్నేహితులును; అప్రమత్తాః=ఏమఱుపాటులేనివారలై; అద్య= ఇప్పుడు; త్వాం=నిన్ను; సమంతతః=అంతటను; రక్షంతు=రక్షింతురుగాక. ఏవంవిధాని=ఇట్టివైన ; కార్యాణి=పనులు; బహువిఘ్నాని= అనేకములగువిఘ్నములుగలవి ; భవంతిహి=అగుచున్నవిగదా!

ఇట్టిగొప్పకార్యములకు, అధికముగా, విఘ్నములుగలుగును, గావున , నీస్నేహితులందఱును, ఎచ్చరికగల్గి, నిన్నిప్పుడు, సర్వవిధంబులను, రక్షింపవలయును. అని, తాత్పర్యము.

విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః
తావదేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతో మమ. ౨౫

టీక॥భరతశ్చ=భరతుఁడును; యావదేవ=ఎంతవఱకునే; ఇతః = ఈ; పురాత్=పట్టణమునుండి; విప్రోషితః=దూరముగానున్నవాఁడో; తావదేవ=అంతవఱకే; తే = నీయొక్క; అభిషేకః=అభిషేకము; ప్రాప్తకాలః=పొందఁబడినకాలముగలదిగా; మే=నాకు, (నాచేననుట)మతః=ఎన్నఁబడినది.

దూరదేశమునకుఁ బోయియున్న భరతుండు, ఈపట్టణంబునకెంతవఱకు రాకుండునో, అంతవఱకే, నీయభిషేకమునకుఁదగినకాలమని నాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతస్థితః




జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః. ౨౮

టీక॥ తే=నీయొక్క; భ్రాతా=తమ్ముండగు; భరతః=భరతుఁడు; సతాం=పెద్దలయొక్క; వృత్తే=ఆచారమునందు; కామం=మిక్కిలియును; స్థితః ఖలు=ఉన్నవాఁడే; జ్యేష్ఠానువర్తీ (ఖలు)=అన్ననను సరించువాఁడే; ధర్మాత్మా (ఖలు)=ధర్మబుద్ధిగలవాఁడే= సానుక్రోశః (ఖలు)= దయగలవాఁడే; జితేంద్రియః (ఖలు)=జయింపఁబడినయింద్రియములుగలవాఁడే.

నీతమ్ముండగు భరతుండు, మిక్కిలియు సజ్జనులయాచారము నందున్నవాఁడే; అన్నయగునిన్ననుసరించి యుండువాఁడే; ధర్మబుద్ధిగలవాఁడే; దయగలవాఁడే; జితేంద్రియుండే, ఇందేమియు సందియంబులేదు.

అని, తాత్పర్యము.

కింతు చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతిః
సతాంతు ధర్మనిత్యానాం కృతశోభి చ రాఘవ. ౨౯

టీక॥ రాఘవ=రాముఁడా! కింతు= అయినను; మనుష్యాణాం=మనుష్యులయొక్క; చిత్తం=మనసు; అనిత్యం= చంచలము; ఇతి=అని; మే = నాయొక్క; మతిః=నిశ్చయము. ధర్మనిత్యానాం=ధర్మమునందుస్థైర్యముగల ; సతాంతు= పెద్దలయొక్కమాత్రము; చిత్తం(అధ్యాహృతము) = మనసు; కృతశోభి=చేయఁబడిన యుపకారము చేశోభించునది; చకారంబుపాదపూరణార్థము.

అట్లయినను, మనుష్యులమనస్సు చంచలంబని నాసిద్ధాంతము; కొంచెమైనను ధర్మముతప్పని పెద్దలుమాత్రము తనకుఁ జేసినయుపకారమును దలంతురే కాని, యెంతమాత్రమును భేదమునొందరు. అని, తాత్పర్యము.

ఉత్తరార్ధమునకుమాత్రముమఱికొన్నివిధంబుల నర్థముఁ వ్రాయుచున్నారు—ధర్మనిత్యానాం; సతాంతు=పెద్దలయొక్కయును; చిత్తం=మనసు; కృతశోభి=ఇతరులచేఁ జేయఁబడినమిత్రభేదాదులచేఁ బ్రకాశించునది. కొంచెమయినను ధర్మము దప్పనిపెద్దలునుగూడ, నితరులుసేయు మిత్రభేదాదులకు లోఁబడుదురు. అని, తాత్పర్యము.

లేక; ధర్మనిత్యానాం; సతాం తు = పెద్దలయొక్కయు; చిత్తం= మనసు;కృతశోభి= చేయఁబడిన దాని చేఁబ్రకాశించునది.

కొంచెమైననుధర్మముదప్పని పెద్దలునుంగూడమిగిలిచేయఁబడినదానికి, సంతోషింతురు, కాని , చేయఁబోవు దానికి సమ్మతింపరు. (అనఁగా ) ఇప్పుడునీకభిషేకంబుజరిగెనేని, భరతుండునుసంతోషించును ; అట్లుజరగకుండునేని,భరతునకుంగూడ , రాజ్యంబునందాసగల్గును. అని,దశరథుండు రామునకుఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యుక్త స్సో భ్యనుజ్ఞాత శ్శ్వో భావిన్య భిషేచనే
వ్రజేతి రామః పితర మభివాద్యా భ్యయా ద్గృహమ్. ౨౧

అభిషేచనే=అభిషేకము; శ్వః= రేపు,భావిని=కాఁగలదగుచుండఁగా; సః=ఆ; రామః=రాముఁడు;ఇతి=ఇట్లు;ఉక్తః=చెప్పఁబడినవాఁడై ; వ్రజేతి=పొమ్మని;అభ్యనుజ్ఞాతః=అనుమతింపఁబడినవాఁడై;పితరం=తండ్రిని;అభివాద్య= నమస్కరించి; గృహం = ఇంటిని; అభ్యయాత్ =పొందెను.

రేపు,అభిషేకము జరగఁ గలదగుచుండఁగా,నిట్లుదశరథుండుచెప్పి యనుమతియివ్వఁగానె,యారాముండు, తండ్రికినమస్కారముచేసి, తనయింటికింబోయెను.

అని, తాత్పర్యము.

ప్రవిశ్యచా త్మనో వేశ్మ రాజ్ఞో ద్దిష్టే భిషేచనే
తత్క్షణేన చనిర్గమ్య మాతు రంతఃపురం యయౌ. ౨౨

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు;ఆత్మనః=తనయొక్క ; వేశ్మ=గృహమును; ప్రవిశ్యచ= చొచ్చియు; రాజ్ఞా=దశరథమహారాజుచేత ; ఉద్దిష్టే=చేయఁదలంపఁబడిన; అభిషేచనే= అభిషేకనిమిత్తమయి; తత్క్షణేన=అక్షణముచేతనే, అక్షణమునందే యనుట;నిర్గమ్యచ=బయలువెడలియు; మాతుః=తల్లియొక్క; అంతఃపురం= అంతఃపురమును;యయౌ= పొందెను.

రాముండు, తనయిల్లుప్రవేశించి, రాజుతనకభిషేకంబుసేయం దలంచు

టంజెప్పటకై తల్లియగుకౌసల్య యింటికింబోయెను. అని, తాత్పర్యము.

తత్ర తాం ప్రవణా మేవ మాతరం క్షౌమవాసినీమ్
వాగ్యతాం దేవతాగారే దదర్శా యాచతీం శ్రియమ్. ౩౦

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; తత్ర=ఆయంతః పురమునందు; దేవతాగారే=దేవతాగృహమునందు; ప్రవణామేవ=ధ్యానాసక్తురాలు గానేయున్నదియును; క్షౌమవాసినీం= పట్టువస్త్రముకట్టుకొని యున్నదియును; వాగ్యతాం=మాటవిషయమైనియమముఁగలదియును, మౌనవ్రతముగలదియుననుట; శ్రియం=రాజ్యలక్ష్మిని; ఆయాచతీం= ప్రార్థించుచున్నదియునునగు; తాం=ఆ; మాతరం= తల్లిని; దదర్శ=చూచెను.

రాముం డచ్చట, దేవతా గృహంబునందు, పట్టువస్త్రంబుధరించి, మౌనంబునొంది, పుత్రార్థంబుగా, రాజ్యలక్ష్మింబ్రార్థించుచున్న, తల్లియయినకౌసల్యంజూచెను.

అని, తాత్పర్యము.

ప్రాగేవ చాగతా తత్ర సుమిత్రా లక్ష్మణ స్తదా
సీతా చానాయితా శ్రుత్వా ప్రియం రామాభిషేచనమ్. ౩౧

టీక॥ ప్రాగేవ=మునుపే, రాముండు వచ్చుటకు మునుపే యనుట; ప్రియం= ఇష్టమయిన; రామాభిషేచనం= రామునియొక్క-యభిషేకమును; శ్రుత్వా=విని; తత్ర=ఆకౌసల్యగృహంబునకు; సుమిత్రాచ=సుమిత్రయును; ఆగతా=వచ్చినది. తదా=ఆసుమిత్రవచ్చినపుడె; లక్ష్మణః=లక్ష్మణుండును; ఆగతః=(అధ్యాహృతము)వచ్చినాఁడు. సీతాచ=సీతయును; ఆనాయితా=తోడ్కొనివచ్చునట్లుచేయఁబడినది.

రాముండువచ్చుటకుమున్నే, "ప్రియంబగు రామాభిషేకంబుజరగంగలదనివిని, సుమిత్రయునాకౌసల్యయొద్దకు వచ్చియుండినది; అప్పుడే లక్ష్మణుండునువచ్చెను; అంతవారలు, దాసీజనంబులంబంపిసీతనుంగూడనచ్చుటకు రప్పించిరి. అని, తాత్పర్యము.

తస్మిన్ కాలేహి కౌసల్యా తస్థా వామీలితేక్షణా

సుమిత్రయా౽న్వాస్యమానా సీతయా లక్ష్మణేనచ. ౩౨

టీక॥ తస్మిన్ = ఆ; కాలే = కాలమునందు; కౌసల్యా = కౌసల్య; సుమిత్రయా = సుమిత్రచేతను; సీతయా = సీతచేతను; లక్ష్మణేనచ = లక్ష్మణునిచేతను; అన్వాస్యమానా = సేవింపఁబడుచున్నదై; ఆమీలితేక్షణా = మూయఁబడినకండ్లుగలదై; తస్థౌహి = ఉండెనుగదా!

అప్పుడు, కౌసల్యాదేవి, తన్నుసుమిత్రయుసీతయు లక్ష్మణుండును సేవించుచుండఁగా, గండ్లుమూసికొని, ధ్యానపరయయియుండెను. అని తాత్పర్యము

శ్రుత్వా పుష్యేణ పుత్రస్య యౌవరాజ్యాభిషేచనమ్
ప్రాణాయామేన పురుషం ధ్యాయమానా జనార్దనమ్. ౩౩

టీక॥ పుత్రస్య = కొడుకైన రామునకు; పుష్యేణ = పుష్యనక్షత్రముచేత, పుష్యనక్షత్రమునందు; యౌవ రాజ్యాభిషేచనం = యువరాజు దొరతనమునందభిషేకించుటను; శ్రుత్వా = విని; కౌసల్యా (అధ్యాహృతము) = కౌసల్యాదేవి; ప్రాణాయామేన = ప్రాణాయామముచేత; పురుషం = పురుషుండగు, పురుష సూక్తమునందుఁ జెప్పఁబడినయనుట; జనార్దనం = నారాయణుని; ధ్యాయమానా (ధ్యాయంతీ) = ధ్యానించుచు; తస్థౌ (అధ్యాహృతము) = ఉండెను.

పుష్యనక్షత్రమునందుఁ, గొడుకునకుయౌవరాజ్యమునందుఁబట్టాభిషేకంబుజరగునని విని, యాకౌసల్యాదేవి కొడుకునకు మంగళాభివృద్ధిగలుగుటకై పురుష సూక్తమునందుఁ బ్రతిపాదితుండగు నారాయణుని ధ్యానింపుచుండెను. అని, తాత్పర్యము.

తథా సన్నియమా మేవ సో౽భిగమ్యాభివాద్యచ
ఉవాచ వచనం రామో హర్షయం స్తా మిదం తదా. ౩౪

టీక॥ సః = ఆ; రామః = రాముఁడు; తథా = అట్లు; సన్నియమామేవ = మంచినియమముగలదయ్యే యుండిన కౌసల్యను; అభిగమ్య = పొంది; అభివాద్య




చ=నమస్కరించియు; తదా=అప్పుడు; తం=ఆకౌసల్యను; హర్షయన్=సంతసింపఁజేయుచు; ఇదం=ఈ; వచనం=మాటను; ఉవాచ=చెప్పెను.

ఆ రాముం డట్లుత్తమం బగు నియమంబవలంబించియున్న తల్లియొద్దకుఁ బోయి, నమస్కరించి, యప్పుడావిడకు సంతోషంబునెఱుపుచు, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అంబ పిత్రా నియుక్తోస్మి ప్రజాపాలనకర్మణి
భవితా శ్వోభిషేకో మే యథా మే శాసనం పితుః. ౩౫

టీక॥ అంబ=అమ్మా! పిత్రా=తండ్రిచేత; అహం(అధ్యాహృతము)=నేను; ప్రజాపాలనకర్మణి=ప్రజల పాలించుటయనెడు కార్యమునందు; నియుక్తః=ఆజ్ఞాపింపఁబడినవాఁడను; అస్మి=అగుచున్నాను. మే=నాయొక్క; పితుః=తండ్రియొక్క; శాసనం=ఆజ్ఞ; యథా=ఎట్లో; తథా(అధ్యాహృతము)=అట్లు; మే=నాకు; అభిషేకః=పట్టాభిషేకము; శ్వః=రేపు; భవితా=కాఁగలదు.

అమ్మా! ప్రజలం బాలింపుమని నన్నుఁ దండ్రియగు దశరథమహారాజాజ్ఞాపించెను; రేపు నాకుఁ బట్టాభిషేకంబు జరగవలయునని, దశరథమహారాజానతిచ్చియున్నాఁడు.

అని, తాత్పర్యము.

సీతయాప్యుపవస్తవ్యా రజనీయం మయాసహ
ఏవ మృత్విగుపాధ్యాయైస్సహ మా ముక్తవాన్ పితా. ౩౬

టీక॥ సీతయాపి=సీతచేతనుగూడ; మయాసహ=నాతోఁగూడ; ఇయం=ఈ; రజనీ=రాత్రి; ఉపవస్తవ్యా=ఉపవసింపఁబడవలసినది. ఏవం=ఇట్లు; పితా=తండ్రియగుదశరథమహారాజు; ఋత్విగుపాధ్యాయైస్సహ=ఋత్విజులతో నుపాధ్యాయులతోఁ గూడ; మాం=నన్నుఁగూర్చి; ఉక్తవాన్=చెప్పినాఁడు.

సీతయును, నాతోఁగూడ, నేటిరాత్రి, యుపవాసంబుండవలయును; అని, దశరథమహారాజును ఋత్విజులును షాధ్యాయులును, నాతోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.




యానియాన్యత్ర యోగ్యాని శ్వోభావి న్యభిషేచనే
తాని మే మంగళాన్యద్య వైదేహ్యాశ్చైవ కారయ. ౩౮

టీక॥అభిషేచనే=పట్టాభిషేకము; శ్వః=రేపు;భావిని; కాఁగలదగుచుండఁగా;అత్ర=ఇప్పుడు;యానియాని=ఏయే మంగళకార్యంబులు;యోగ్యాని=తగినవో; తాని=ఆ;మంగళాని= మంగళకార్యములను;అద్య=ఇప్పుడు; మే=నాకును;వైదేహ్యాశ్చైవ= సీతకును; కారయ=చేయింపుము.

రేపుపట్టాభిషేకము జరగంగలదగుచుండఁగా, నేయేమంగళకార్యములు సేయవలయునో, ఆమంగళకార్యములనన్నింటిని, నాకును,సీతకును,ఇప్పుడు, చేయింపుము.అని, రాముండు, కౌసల్యతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏతచ్ఛ్రుత్వాతు కౌసల్యా చిరకాలాభికాంక్షితమ్
హర్షబాష్పకలం వాక్య మిదం రామ మభాషత. ౩౯

టీక॥కౌసల్యా = కౌసల్య;చిరకాలాభికాంక్షితం = బహుకాలముగాఁ గోరఁబడిన; ఏతత్=ఈపట్టాభిషేకవార్తను;శ్రుత్వాతు = వినినంతనే;రామం = రామునిగూర్చి;హర్షబాష్పకలం = సంతోషముచేఁగలిగినకన్నీరుచే తస్పష్టంబుగానిదియు మధురంబునగు; ఇదం=ఈ;వాక్యం=మాటను; అభాషత=చెప్పెను.

బహుకాలముగాఁ గోరఁబడుచుండునీపట్టాభిషేకవార్తను వినినంతనే, కౌసల్యాదేవి, యానందబాష్పంబులం జేసి,తడఁబడుచు,మధురంబుగా,నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

వత్స రామ చిరంజీవ హతాస్తే పరిపంథినః
జ్ఞాతీ న్మేత్వం శ్రియా యుక్త స్సుమిత్రాయాశ్చ నందయ. ౪౦

టీక॥వత్స=బిడ్డఁడవగు ; రామ= రాముఁడా! చిరం=బహుకాలము; జీవ=బ్రతుకుము; తే=నీయొక్క; పరిపంథినః=శత్రువులు;హతాః= చంపఁబడినవారలు; భవంతు ( అధ్యాహృతము)= అగుదురుగాక;త్వం=నీవు;శ్రియా=రాజ్యలక్ష్మితోఁ;యుక్తః =కూడినవాఁడవై; మే= నాయొక్కయు;

సుమిత్రాయాశ్చ= సుమిత్ర యొక్క యు; జ్ఞాతీన్ = బంధువులను ; నందయ=సంతోషపడునట్లుచేయుము.

బిడ్డఁడవగు రాముఁడా! నీవు బహుకాలము జీవింపుదువు గాక; నీశత్రువులందఱు హతులగుదురు గాక; నీవు రాజ్య లక్ష్మిం గూడి, నా బంధువులకును సుమిత్ర బంధువులకును సంతోషంబు సేయుము.

అని, తాత్పర్యము.

కల్యాణే బత నక్షత్రే మయి జాతోసి పుత్రక
యేన త్వయా దశరథో గుణై రారాధితః పితా. ౪౦

టీక॥ పుత్రక=చిన్నికొమరుండవగు రాముఁడా ! బత=సంతోషము ! కల్యాణే=మంగళకరమయిన; నక్షత్రే=నక్షత్రమునందు; మయి=నాయందు; మయా(అని, పాఠాంతరము)= నాచేత; జాతః=పుట్టినవాఁడవు; అసి=అగుచున్నావు . యేన=ఏకారణముచేత; త్వయా=నీచేత; గుణైః=గుణములచేత; పితా=తండ్రియగు; దశరథః= దశరథుండు; ఆరాధితః=సంతోషింపఁజేయఁబడినాఁడో.

చిన్నికొమరుండవగు రాముఁడా! సంతోషము! నీవు, మంచినక్షత్రమందు నాయందుఁబుట్టినాఁడవు, కావుననే, నీవు, వినయాదిసద్గుణంబులం, దండ్రియగు దశరథునిసంతోషపఱచితివి.

అని, తాత్పర్యము.

అమోఘం బత మే క్షాంతం పురుషే పుష్కరేక్షణే
యేయ మిక్ష్వాకురాజ్యశ్రీః పుత్ర త్వాం సంశ్రయిష్యతి. ౪౧

టీక॥ పుష్కరేక్షణే = తామరపువ్వుంబులంబోలుకండ్లుగల; పురుషే=నారాయణునివిషయమయి; మే=నాయొక్క; క్షాంతం= వ్రతోపవాసాదులసహించుట; అమోఘం=వ్యర్థముకానిది. బత=సంతోషము! పుత్ర=కుమారుఁడవయిన రాముఁడా! యత్ (అధ్యాహృతము)= ఏకారణము వలన; ఇయం=ఈ; ఇక్ష్వాకురాజ్యశ్రీః= ఇక్ష్వాకువంశపురాజుల రాజ్యలక్ష్మి, యా(అస్తి)=ఏదిగలదో; సా=(అధ్యాహృతము)ఆరాజ్యలక్ష్మి; త్వాం=నిన్ను;

సంశ్రయిష్యతి=పొందఁగలదు.

కుమారుండవగు రాముఁడా! ఇక్ష్వాకువంశపు రాజులదైనయీ రాజ్యలక్ష్మి నిన్నిప్పుడు పొందఁగలదు, కావున, నేను, పుండరీకాక్షుండగు నారాయణుని వ్రతోపవాసాదులచే నారాధించినదంతయు, నిప్పుడు, సఫలంబయినది. సంతోషము! అని, కౌసల్యరామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్తో మాత్రేదం రామో భ్రాతర మబ్రవీత్
ప్రాంజలిం ప్రహ్వ మాసీన మభివీక్ష్య స్మయ న్నివ. ౪౨

టీక॥ రామః = రాముఁడు; ఇత్యేవం=ఈప్రకారముగా; మాత్రా=తల్లిచేత; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; ప్రాంజలిం= మంచిచేమోడ్పుగలవాఁడును; ప్రహ్వం=అణఁకువగలవాఁడును; ఆసీనం = కూర్చుండినవాఁడునగు; భ్రాతరం=తమ్ముండయినలక్ష్మణుని; అభివీక్ష్య=చూచి; స్మయన్నివ(స్థితః)=నవ్వుచున్నట్టున్నవాఁడై, చిఱునగవుగలవాఁడైయనుట; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముం, డిట్లు, తల్లి చెప్పిన మాటవిని, తనప్రక్కను, జేతులు మొగిడ్చికొనినమ్రుండై కూర్చుండియున్న తమ్ముని లక్ష్మణునింజూచి, చిఱునగవుతో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

లక్ష్మణేమాం మయా సార్ధం ప్రశాధి త్వం వసుంధరామ్
ద్వితీయం మేంతరాత్మానం త్వా మియం శ్రీ రుపస్థితా. ౪౩

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! త్వం=నీవు; మయాసార్ధం=నాతోఁగూడ; ఇమాం=ఈ; వసుంధరాం=భూమిని; ప్రశాధి=పాలింపుము. ఇయం=ఈ; శ్రీః=లక్ష్మి; మే=నాయొక్క; ద్వితీయం=రెండవదియగు; అంతరాత్మానం= ప్రాణమవగు; త్వాం = నిన్ను; ఉపస్థితా=పొందినది.

లక్ష్మణుఁడా! నీవు నాతోఁగూడ, నీ భూమింబరిపాలింపుము; నీవు, నాకు రెండవప్రాణంబవగుటం జేసి, నిన్నును, ఈరాజ్యలక్ష్మి యాశ్రయించియున్నది.

అని, తాత్పర్యము.

స ౪

సౌమిత్రే భుంక్ష్వ భోగాంస్త్వ మిష్టాన్ రాజ్యఫలానిచ
జీవితంచ హి రాజ్యం చ త్వదర్థ మభికామయే. ౪౪

టీక॥ సౌమిత్రే = లక్ష్మణుఁడా! త్వం=నీవు; ఇష్టాన్=కోరఁబడిన; భోగాన్= భోగ్యంబులగుపదార్థంబులను; రాజ్యఫలానిచ=రాజ్యముచేఁగలిగినఫలంబులను; భుంక్ష్వ=అనుభవింపుము. అహం(అధ్యాహృతము) = నేను; జీవితంచ=ప్రాణమును; రాజ్యంచ=రాజ్యమును; త్వదర్థం=నీకొఱకు; అభికామయే=కోరుచున్నాను.

లక్ష్మణుఁడా! నీవు, కోరినభోగంబులను, మఱియు రాజ్యఫలంబులగు నమూల్యరత్నాభరణాదులను, అనుభవింపుము; ప్రాణంబును గాని రాజ్యంబును గాని, నీకొఱకే నాకుఁగావలసినది. అని, రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా లక్ష్మణం రామో మాతరా వభివాద్యచ
అభ్యనుజ్ఞాప్య సీతాంచ జగామ స్వం నివేశనం. ౪౫

టీక॥ రామః = రాముఁడు; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; ఇతి=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; మాతరౌ=తల్లులగుకౌసల్యానుసుమిత్రను; అభివాద్యచ=నమస్కరించియు; సీతాంచ=సీతను; అభ్యనుజ్ఞాప్య = తల్లులఅనుమతినొందఁజేసి; స్వం=తనదైన; నివేశనం= గృహమును; జగామ=పొందెను.

రాముం, డిట్లులక్ష్మణునితోఁజెప్పి, తల్లులగుకౌసల్యాసుమిత్రలకు నమస్కరించి, వారలచే, సీతకనుజ్ఞయిప్పించి, సీతంగూడి, తనయింటికిఁబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, చతుర్థస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండచతుర్థసర్గటీక,
ముగిసినది.

౩౨

పంచమసర్గప్రారంభః.

సందిశ్య రామం నృపతి శ్శ్వో భావి న్యభిషేచనే
పురోహితం సమాహూయ వసిష్ఠ మిద మబ్రవీత్. ౧

టీక॥ అభిషేచనే=పట్టాభిషేకము; శ్వః=రేపు; భావిని=కాఁగలదగుచుండఁగా; నృపతిః=దశరథమహారాజు; రామం=రాముని; సందిశ్య=ఆజ్ఞాపించి; పురోహితం= పురోహితుండగు; వసిష్ఠం=వసిష్ఠుని; సమాహూయ=పిలిచి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

పట్టాభిషేకము మఱునాఁడు జరుగంగలదిగానుండఁగా, దశరథమహారాజు, రాముని "నీవు, రాత్రియంతయు నియమంబుతో భార్యాసహితంబుగను పవాసంబుండుము" అని, యాజ్ఞాపించి, పురోహితుండగు వసిష్ఠునిం బిలిచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

గచ్ఛోపవాసం కాకుత్స్థం కారయాద్య తపోధన
శ్రీ యశోరాజ్యలాభాయ వధ్వా సహ యతవ్రతం. ౨

టీక॥ తపోధన=తపస్సే ధనముగాఁగల వసిష్ఠుఁడా! త్వం (అధ్యాహృతము)=నీవు; గచ్ఛ=పొమ్ము. అద్య=ఇప్పుడు; యతవ్రతం=నిశ్చితంబగు వ్రతంబుగల; కాకుత్స్థం= రాముని; వధ్వా సహ=భార్యతోఁగూడ; శ్రీయశోరాజ్యలాభాయ= సంపదయొక్కయుఁగీర్తియొక్కయు రాజ్యము యొక్కయుఁ బొందుట కొఱకు ; ఉపవాసం = ఉపవాసమును; కారయ = చేయింపుము.

తపోధనుండవగు వసిష్ఠుఁడా! నీవు పోయి, యిప్పుడు, దృఢవ్రతుండగు రాముండు, భార్యతోఁగూడ, సంపదయు యశంబును రాజ్యంబును లభించుటకై, యుపవాసంబుండునట్లు, చేయుము. అని, దశరథుండు, వసిష్ఠునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తథేతిచ స రాజాన ముక్త్వా వేదవిదాం వరః

స్వయం వసిష్ఠో భగవాన్ యయౌ రామ నివేశనం. ౩
ఉపవాసయితుం రామం మంత్రవ న్మంత్రకోవిదః
బ్రాహ్మం రథవరం యుక్త మాస్థాయ సుదృఢవ్రతః. ౪

టీక॥ వేదవిదాం=వేదముల నెఱింగినవారిలోపల; వరః=శ్రేష్ఠుండును; భగవాన్= మాహాత్మ్యముగలవాఁడును; మంత్రకోవిదః= మంత్రంబులందుఁబండితుండును; సుదృఢవ్రతః=మిక్కిలియు స్థిరంబయిన వ్రతముగల వాఁడునగు; సః=ఆ; వసిష్ఠః=వసిష్ఠుఁడు; తథేతి=అలాగేయని; రాజానం=రాజునుగూర్చి; ఉక్త్వాచ=చెప్పియు; యుక్తం=అయితము చేయఁబడిన; బ్రాహ్మం=బ్రాహ్మణులకు యోగ్యమైన; రథవరం =రథశ్రేష్ఠమును; ఆస్థాయ=అధిష్ఠించి; రామం=రాముని; మంత్రవత్ =మంత్రముగలుగునట్లుగా; ఉపవాసయితుం=ఉవసింపఁజేయుటకు; స్వయం=తానె; రామనివేశనం=రాముని యింటిని ; యయౌ= పొందెను.

వేదవేత్తలలో శ్రేష్ఠుండు భగవంతుండు మంత్రంబులంజక్కఁగా నెఱింగినవాఁడు దృఢవ్రతుండునగు వసిష్ఠుండు దశరథమహారాజుతో “అలాగే” యని చెప్పి, గుఱ్ఱములుగట్టిసిద్ధము చేయఁబడిన, బ్రాహ్మణులారోహింపయోగ్యంబగు రథంబుపైనెక్కి, రామునిచే, సమంత్రకంబుగా, నుపవాసంబు సేయించుటకై, మఱియెవ్వరినింబంపక, తానే, రామునియింటికింబోయెను.

అని, తాత్పర్యము.

స రామభవనం ప్రాప్య పాండురాభ్రఘనప్రభం
తిస్రః కక్ష్యా రథేనైవ వివేశ మునిసత్తమః. ౫

టీక॥మునిసత్తమః=మునిశ్రేష్ఠుండగు; సః=ఆవసిష్ఠుండు; పాండురాభ్రఘనప్రభం=తెల్లని మేఘమువలె దట్టమయిన కాంతిగల; రామభవనం=రామునిగృహంబును; ప్రాప్య=పొంది; తిస్రః=మూఁడైన; కక్ష్యాః=తొట్టికట్లను; రథేనైవ=రథముచేతనే; వివేశ= ప్రవేశించెను.

మునిశ్రేష్ఠుండగునవ్వసిష్ఠుండు, తెల్లని మేఘంబుంబోలె, దట్టముగానుండు తెల్లనికాంతిగలిగియొప్పుచుండు, రామగృహంబుఁజేరి, రథంబుమీఁదనుండియే

ముఁడుతోఁట్టికట్లు, దాఁటెను. అని, తాత్పర్యము.

త మాగత మృషిం రామ స్త్వరన్నివ ససంభ్రమః
మానయిష్య౯ స మానార్హం నిశ్చక్రామ నివేశనాత్. ౬

టీక॥ సః=ఆ; రామః=రాముఁడు; త్వర౯= వేగిరపడుచు; ("ఇవ") అనునది వాక్యాలంకారార్థము.); ససంభ్రమః=తొట్రుపాటుగలవాఁడై; ఆగతం=వచ్చినవాఁడును; మానార్హం=పూజకుయోగ్యుఁడునగు; తం=ఆ; ఋషిం= వసిష్ఠమహర్షిని; మానయిష్య౯=పూజించువాఁడై; నివేశనాత్=ఇంటినుండి; నిశ్చక్రామ=బయలు వెడలెను.

ఆరాముండును, బూజార్హుండగు వసిష్ఠుండు వచ్చుటంజూచి, యతనిం బూజించుటకై, వేగంబునందడఁబడుచు, గృహంబునుండిబయలు వెడలెను.

అని, తాత్పర్యము.

అభ్యేత్య త్వరమాణ శ్చ రథాభ్యాశం మనీషిణః
తతో వతారయామాస పరిగృహ్య రథా త్స్వయం. ౭

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; త్వరమాణః= వేగిరపడుచు; మనీషిణః=పండితుండగు వసిష్ఠుని యొక్క; రథాభ్యాశం= రథముయొక్క సమీపమును గూర్చి; అభ్యేత్య చ=పోయియు; తతః=అంతట; స్వయం=తానె; పరిగృహ్య= పట్టుకొని; రథాత్=రథమునుండి; అవతారయామాస=దించెను.

రాముండు, వేగమున, వసిష్ఠుని రథంబునొద్దకుఁబోయి, యంతఁ, దానె యతనిచేయిఁబట్టుకొని, రథంబునుండి దించెను.

అని, తాత్పర్యము.

స చైనం ప్రశ్రితం దృష్ట్వా సంభాష్యాభి ప్రసాద్య చ
ప్రియార్హం హర్షయ౯ రామ మిత్యువాచ పురోహితః. ౮

టీక॥ పురోహితః= పురోహితుండగు; సచ=ఆవసిష్ఠుండును; ప్రశ్రితం=

వినయము గలవాఁడును ; ప్రియాహః=ప్రియవార్తఁ జెప్పుటకుఁ దగినవాఁడు నగు; ఏనం=ఈ; రామం=రామునిఁ; దృష్ట్వా=చూచి; సంభాష్య=క్షేమంబు నడిగి; సభాజ్య (అని, పాఠాంతరము)=ఆదరించి; అభిప్రసాద్యచ=ప్రసన్నునిఁ జేసి; హర్షయన్=సంతోషపఱచుచు; ఇతి=ఇట్లని ; ఉవాచ=పలికెను.

పురోహితుఁడగు వాసిష్ఠుండు, వినయసంపన్నుండును ప్రియవార్తం జెప్పుటకుం దగినవాఁడునగు నా రాముం జూచి, కుశలంబడిగి, ప్రసన్నునిం జేసి, యతనికి సంతోషంబు నెఱపుచు, నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

ప్రసన్న స్తే పితా రామ యౌవరాజ్య మవాప్స్యసి
ఉపవాసం భవా నద్య కరోతు సహ సీతయా. ౯

టీక॥ రామ=రామఁడా! తే=నీయొక్క; పితా=తండ్రి; ప్రసన్నః= అనుగ్రహించినాఁడు . యౌవరాజ్యం= యువరాజు దొరతనమును; అవాప్స్యసి=పొందఁగలవు. భవాన్=నీవు; అద్య=ఇప్పుడు; సీతయా సహ=సీతతోఁ గూడ; ఉపవాసం= ఉపవాసమును; కరోతు=చేయుము.

రాముఁడా! సీతండ్రికినీయం దనుగ్రహంబుగల్గెను; నీవు యౌవరాజ్యంబు నందభిషిక్తుండ వయ్యెదవు; నీవిపుడు, సీతతోఁగూడనుపవాసంబుండుము.

అని, తాత్పర్యము.

ప్రాత స్త్వా మభిషేక్తాహి యౌవరాజ్యే నరాధిపః
పితా దశరథః ప్రీత్యా యయాతిం నహుషోయథా. ౧౦

టీక॥ నరాధిపః=మనుష్యులకుఁబ్రభువును; పితా=తండ్రియునగు; దశరథః=దశరథుఁడు; ప్రాతః=ప్రొద్దున; నహుషః=నహుషుండు; యయాతింయథా=యయాతినింబోలె; త్వాం = నిన్ను; ప్రీత్యా=ప్రేమచేత; యౌవరాజ్యే = యువరాజు దొరతనము నందు; అభిషేక్తాహి= అభిషేకింపఁగలఁడుగదా!

నీతండ్రియగు దశరథమహారాజు,

ప్రాప్తః కాలమున, నహుషుండుయయాతికింబోలె, నీకుఁబ్రేమంబునయావరాజ్యంబున, నభిషేకంబుసేయ సమకట్టి యున్నాఁడు. అని, వసిష్ఠుండు, రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా స తదా రామ ముపవాసం యతవ్రతమ్
మంత్రవ త్కారయామాస వైదేహ్యా సహితం మునిః. ౧౧

టీక॥ సః=ఆ; మునిః=వసిష్ఠమహాముని; ఇతి=ఇట్లు; ఉక్త్వా = చెప్పి; తదా=అప్పుడు; వైదేహ్యా=సీతతో; సహితం=కూడిన; యతవ్రతం=దృఢంబగువ్రతముగల; రామం=రాముని; ఉపవాసం=ఉపవాసంబును; మంత్రవత్=మంత్రముగలుగునట్లుగా; కారయామాస=చేయించెను.

ఆవసిష్ఠుండిట్లుచెప్పి, యప్పుడు, సీతచేతను, దృఢవ్రతుండగురామునిచేతను, సమంత్రకంబుగా, నుపవాసంబుచేయించెను. అని, తాత్పర్యము.

తతో యథావ ద్రామేణ స రాజ్ఞో గురు రర్చితః
అభ్య నుజ్ఞాప్య కాకుత్స్థం యయౌ రామనివేశనాత్. ౧౨

టీక॥ తతః=అటుపిమ్మట; రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; గురుః=ఆచార్యుఁడయిన; సః=ఆవసిష్ఠుఁడు; రామేణ=రామునిచేత; యథావత్=శాస్త్రపద్ధతిని; అర్చితః=పూజింపఁబడినవాఁడై; కాకుత్స్థం=రాముని; అభ్యనుజ్ఞాప్య=ఒప్పించి; రామనివేశనాత్=రామునిగృహంబునుండి; యయౌ=పోయెను.

అంత, రాజగురుండగు నవ్వసిష్ఠుండు, రామునిచే యథాశాస్త్రంబుగఁ బూజింపఁబడి, రామునిసమ్మతిపఱచి, రామునియిల్లువదలిపోయెను.

అని, తాత్పర్యము.

సుహృద్భి స్తత్ర రామోపి సహాసీనః ప్రియంవదైః
సభాజితో వివేశాథ తా ననుజ్ఞాప్య సర్వశః. ౧౩

టీక॥ తత్ర=ఆగృహంబునందు; రామోపి=రాముండును; ప్రియంవదైః=

ప్రియవార్తాలం జెప్పునట్టి; సుహృద్భిస్సహ = స్నేహితులతోఁగూడ;ఆసీనః=కూర్చున్నవాఁడై;సభాజితః=సంతోషపఱుపఁబడినవాఁడై; అథ=అటుతర్వాత; తాన్=ఆస్నేహితులను; సర్వశః=అన్నివిధంబులను;అనుజ్ఞాప్య=ఒప్పించి;వివేశ=అంతఃపురంబు, ప్రవేశించెను.

అప్పట, రాముండును,ప్రియంవదులగు స్నేహితులతోఁగూడఁ గూర్చుండియుండి,వారలచే సంతోషపఱుపఁబడినవాఁడై,వారలనందఱను అన్నివిధంబులన ఒప్పించి,యంతఃపురంబుఁబ్రవేశించెను.అని, తాత్పర్యము.

హృష్టనారీనరయుతం రామవేశ్మ తదా బభౌ
యథా మత్తద్విజగణం ప్రఫుల్లనలినం సరః. ౧౪

టీక॥తదా=అప్పుడు; హృష్టనారీనరయుతం = సంతసించినస్త్రీలునుబురుషులునుంగలిగిన; రామవేశ్మ=రాముని యిల్లు; మత్తద్విజగణం=మదించినపక్షుల సమూహములుగలదియు; ప్రఫుల్లనలినం=చక్కఁగా వికసించినకమలములుగలదియునగు; సరో యథా=కొలనువలె;బభౌ=ప్రకాశించెను.

అప్పుడు,రామగృహంబునందుండు స్త్రీలునుబురుషులును సంతోషంబునధ్వనులుసేయుచు, వికాసముఁనొందినముఖంబులు గలిగియుండుటంజేసి, యది, మదంబునమధురంబుగాఁ గూయుచుండుపక్షులునువికసించిన కమలంబులుగలిగియొప్పుచుండు కొలంకుంబోలి, ప్రకాశించినది.అని, తాత్పర్యము.

స రాజభవనప్రఖ్యాత్తస్మాద్రామనివేశనాత్
నిర్గత్య దదృశే మార్గం వసిష్ఠో జనసంవృతమ్. ౧౫

టీక॥సః=ఆ;వసిష్ఠః=వసిష్ఠుఁడు ; రాజభవనప్రఖ్యాత్=రాజగృహంబుతోసమానంబయియుండు; తస్మాత్=ఆ; రామనివేశనాత్ = రామునిగృహంబునుండి; నిర్గత్య= బయలువెడలి; జనసంవృతం=జనులచేమూయఁబడిన; మార్గం=దారిని; దదృశే=(దదర్శ)=చూచెను.

ఆవసిష్ఠుండు,రాజగృహంబుం బోలెనతివిశాలసుందరంబయియున్న రామునిగృహంబువెలువడి, మార్గంబంతయు, జనసమ్మర్దంబు గలిగియుం

టంజూచెను. అని, తాత్పర్యము.

బృందబృందై రయోధ్యాయాం రాజమార్గాః స్సమం తతః
("బృంద బృందమయోధ్యాయాం" ఇతిపాఠాంతరం.)
బభూవు రభిసంబాధాః కుతూహలజనై ర్వృతాః. ౧౬

టీక॥ అయోధ్యాయాం = అయోధ యందలి; రాజమార్గాః = గొప్పత్రోవలు; బృందబృందైః = గుంపులను వెంబడించుగుంపులుగల ; బృందబృందం (అని, పాఠాంతరము) = గుంపులు గుంపులుగ; కుతూహలజనైః = రామాభిషేకముఁ జూచు , కోర్కితోఁ గూడినజనులచే; సమంతతః = అంతటను; వృతాః = కప్పఁబడినవై; అభిసంబాధాః = సంమర్దముగలిగినవి ; బభూవుః = అయినవి.

అయోధ్యయందలిరాజ మార్గంబులందు, రామాభిషేకముఁజూడ వచ్చినజనులు, గుంపులుగుంపులుగాఁజేరియుంటంజేసి, యామార్గంబులు, ఇఱుకటముగల్గియుండినవి.

అని, తాత్పర్యము.

జనబృందోర్మిసంఘర్ష హర్షస్వనవత స్తదా
బభూవ రాజమార్గస్య సాగరస్యేవ నిస్వనః. ౧౭

తదా = అప్పుడు; జనబృందోర్మిసంఘర్ష హర్షస్వనవతః, జనబృంద = జనులసమూహములనెడు, ఊర్మి = అలలయొక్క, సంఘర్ష = ఒరయుకచేతను, హర్ష = సంతోషముచేతను, గలిగిన, స్వనవతః = ధ్వనిగల; రాజమార్గస్య = రాజమార్గమునకు; సాగరస్యేవ = సముద్రమునకువలె ; నిస్వనః = ధ్వని; బభూవ = కలిగినది.

అప్పుడు, రాజమార్గంబునందు, గొప్పతరంగంబులంబోలు జనసమూహంబులయొరయికవలనను వారలసంతోషంబులవలనను, గలిగినధ్వని , సముద్రంబునకుం గల్గుధ్వనింబోలి యుండినది. అని, తాత్పర్యము.

సిక్తసమ్మృష్టరథ్యా హి తదహ ర్వనమాలినీ
ఆసీ దయోధ్యా నగరీ సముచ్ఛ్రితగృహధ్వజా. ౧౮

టీక॥ అయోధ్యా=అయోధ్యయనెడు; నగరీ=పట్టణము; తత్=ఆ; అహః=పగలు; సిక్తసమ్మృష్టరథ్యా=తడుపఁబడి నవియును అలంకరింపఁబడినవియునగు గొప్పతోవలు గలదిగాను; వనమాలినీ=అలంకారార్థము గట్టఁబడిన, యరఁటిచెట్లు పోఁకచెట్లు మొదలగువానివనములపఙ్క్తులు గలదిగాను; సముచ్ఛ్రితగృహధ్వజా=ఎత్తఁబడినగృహంబులందు టెక్కెములు గలదిగాను, గృహంబులందెత్తఁబడిన టెక్కెములు గలదిగాను; ఆసీత్ హి=ఆయెను గదా!

ఆపగటియందు, అయోధ్యాపట్టణమునందలి రాజమార్గంబులన్నియుఁ, దడుపఁబడి యలంకరింపఁబడినవి; అచ్చటచ్చట, నరఁటిచెట్లును బోఁకచెట్లును, అలంకారార్థంబుగాఁ గట్టఁబడినవి; ప్రతిగృహంబున, ధ్వజంబులెత్తఁబడినవి.

అని, తాత్పర్యము.

తదా హ్యయోధ్యానిలయ స్సస్త్రీబాలాబలో జనః
రామాభిషేక మాకాంక్ష న్నాకాంక్ష న్నుదయం రవేః. ౧౯

టీక॥ తదా=అప్పుడు; అయోధ్యానిలయః=అయోధ్యయందు వసించెడు; సస్త్రీబాలాబలః=స్త్రీలతోను బాలురతోను బలములేని వృద్ధులతోను గూడిన; జనః=జనము; రామాభిషేకం=రాముని యభిషేకమును; ఆకాంక్షన్=కోరుచు; రవేః=సూర్యునియొక్క; ఉదయం=పొడుచుటను; ఆకాంక్షన్ హి=కోరెను గదా!

అప్పుడయోధ్యయందుండు స్త్రీలు బాలురు వృద్ధులు మొదలగు జనులందఱును రామాభిషేకంబుఁ జూడఁగోరి "సూర్యోదయం బెప్పు డెప్పుడగునో" యని యితరవ్యాపారంబులు లేక, కోరుచుండెను.

అని, తాత్పర్యము.

ప్రజాలంకారభూతం చ జనస్యానందవర్ధనమ్
ఉత్సుకోఽభూజ్జనో ద్రష్టుం తమయోధ్యామహోత్సవమ్. ౨౦

టీక॥ జనః=జనము; ప్రజాలంకారభూతం చ=ప్రజలకలంకారరూపమయినదియు; జనస్య=జనమునకు; ఆనందవర్ధనం=సంతోషమును వృద్ధిఁబొం

దఁజేయునదియునగు; తం=ఆ; అయో ధ్యామహోత్సవం=అయోధ్యయం దలి రామాభిషేకోత్సవమును; ద్ర ష్టుం=చూచుటకు; ఉత్సుకః=ఉత్సా హముగలది; అభూత్=అయినది.

ప్రజలకలంకారము గల్గించునది యును జనులకధిక సంతోషము సేయున దియునగు, అయోధ్యయందు జరుగఁ బోవు శ్రీరామాభిషేకముఁ జూడ, జనులం దఱు, నిచ్చఁగొనిరి. అని, తాత్పర్యము.

ఏవం తం జనసంబాధం రాజమార్గం పురోహితః
వ్యూహన్నివ జనౌఘం తం శనై రాజకులం యయౌ. ౨౧

టీక॥ పురోహితః=వసిష్ఠమహాము ని; ఏవం=ఇట్లు; జనసంబాధం=జనస మ్మర్దముగల; తం=ఆ; రాజమార్గం= పెద్దత్రోవను; పశ్యన్=(అధ్యాహృ తము) చూచుచు; తం=ఆ; జనౌఘం= జనులసమూహమును; వ్యూహన్నివ= విభజించువాఁడుపోలె; శనైః=మెల్లఁ గా; రాజకులం=రాజగృహమును; య యౌ=పొందెను.

వసిష్ఠుండిట్లుజనులచే నిండియుండు రాజమార్గంబుఁజూచుచు, నాజనస మూహములను, అచ్చటచ్చట, వ్యూహ ములుగాఁబన్నువాఁడుంబోలె, మెల్లఁ గా, రాజగృహంబునకుఁబోయెను. అని, తాత్పర్యము.

సితాభ్రశిఖరప్రఖ్యం ప్రాసాద మధిరుహ్య సః
సమీయాయ నరేంద్రేణ శక్రేణేవ బృహస్పతిః. ౨౨.

టీక॥ సః=ఆవసిష్ఠుఁడు; సితాభ్ర శిఖరప్రఖ్యం=తెల్లనిమబ్బుతోను, శిఖ రముతోను సమానమయిన; ప్రాసా దం=మేడను; అధిరుహ్య=ఎక్కి; నరేం ద్రేణ=రాజుతో; బృహస్పతిః=బృహ స్పతి; శక్రేణేవ=దేవేంద్రునితోడంబో లె; సమీయాయ=చేరెను.

ఆవసిష్ఠుండు, తెల్లని మేఘంబును దె ల్లని పర్వత శిఖరంబునుంబోలెయున్న యారాజగృహంబుపైకిఁబోయి, దేవ గురుండగుబృహస్పతి దేవేంద్రునొద్ద కుంబోవునటుల, దశరథమహారాజునొ ద్దకుఁబోయెను. అని, తాత్పర్యము.

త మాగత మభిప్రేక్ష్య హిత్వా రాజా సనం నృపః
పప్రచ్ఛ సచ తస్మై త త్కృత మిత్య భ్యవేదయత్. ౨౩

టీక॥నృపః=మనుష్యులఁబాలించున ట్టి;రాజా = దశరథమహారాజు;ఆగతం=వచ్చిన;తం=ఆవసిష్ఠుని; అభిప్రేక్ష్య=చూచి;ఆసనం=సింహాసనమును;హిత్వా=విడిచి;పప్రచ్ఛ=అడిగెను.స చ= ఆవసిష్ఠుఁడును; తస్మై=ఆదశరథ మహారాజుకొఱకు; "తత్=ఆరాముని చేనుపవాసము సేయించుట; కృతం=చేయఁబడినది." ఇతి= అని;అభ్యవేదయత్=తెలిపెను.

దశరథమహారాజు, తనయొద్దకువచ్చినవసిష్ఠుంజూచి,సింహాసనంబునుండి లేచి, "రామునిచేనుపవాసముచేయించినావా?" యనియడిగెను;అందుకు,ఆవసిష్ఠుండును, "రామునిచేనుపవాసము చేయించినాను" అని,దశరథునకుబదులుచెప్పెను. అని, తాత్పర్యము.

తేన చైవ తదా తుల్యం సహాసీనా స్సభాసదః
ఆసనేభ్య స్సము త్తస్థుః పూజయంతః పురోహితమ్. ౨౪

టీక॥తదా=అప్పుడు;సహాసీనాః=కూడఁగూర్చుండియుండిన;సభాసదః=సభికులు;పురోహితం=వసిష్ఠుని;పూజయంతః=పూజించువారలై;తేన=ఆదశరథమహారాజుతో;తుల్యంచైవ=సరిగానే; ఆసనేభ్యః=ఆసనంబులనుండి;సముత్తస్థుః=లేచిరి.

అప్పుడు, దశరథునితోఁగూడఁగూర్చుండియుండిన సభికులును, బురోహితుండగువసిష్ఠునింబూజించుటకై, దశరథుండులేచునపుడే, యాసనంబులనుండి, లేచిరి. అని, తాత్పర్యము.

గురుణా త్వభ్యనుజ్ఞాతో మనుజౌఘం విసృజ్య తమ్
వివేశాం తఃపురం రాజా సింహో గిరిగుహామివ. ౨౫

టీక॥ రాజా=దశరథమహారాజు; గురుణా=గురుండగువసిష్ఠునిచేత; అభ్యనుజ్ఞాతస్తు= అనుమతింపఁబడినవాఁడైయే;తం=ఆ; మనుజౌఘం=సభికులగుమనుష్యులసమూహమును;విసృజ్య=విడిచి;అంతఃపురం= అంతపురమున్న;

సింహః=సింహము; గిరిగుహామివ=పర్వతమునందలిగుహనుంబోలె; వివేశ=చొచ్చెను.

దశరథమహారాజు, వసిష్ఠుననుమతినొంది, సభికులనందఱవీడ్కొని, సింహంబు పర్వతంబునందలి గుహం బ్రవేశించునట్లు, అంతఃపురంబుఁ బ్రవేశించెను. అని, తాత్పర్యము.

తదగ్ర్యవేషప్రమదాజనాకులమ్
మహేంద్రవేశ్మప్రతిమం నివేశనమ్
విదీపయం శ్చారు వివేశ పార్థివ
శ్శశీవ తారాగణసంకులం నభః. ౨౯

టీక॥ పార్థివః=దశరథమహారాజు; అగ్ర్యవేషప్రమదాజనాకులం=శ్రేష్ఠములైనవేషములుగల స్త్రీజనములచేఁగలఁతనొందియుండునదియును; మహేంద్రవేశ్మప్రతిమం=దేవేంద్రునియింటితోఁబోల్కిగలదియును; చారు=సుందరమునగు; తత్=ఆ; నివేశనం=గృహమును; శశీ=చంద్రుఁడు; తారాగణసంకులం=నక్షత్రములసమూహముచే వ్యాపింపఁబడిన; నభఇవ=ఆకాశమువలె; విదీపయన్=మిక్కిలియుఁ బ్రకాశింపఁజేయుచు; వివేశ=ప్రవేశించెను.

దశరథమహారాజు, చక్కఁగానలంకరించికొనియుండు స్త్రీలచేనిండి దేవేంద్రునిగృహంబుతో సాటియగుచుండు తనగృహంబును, చంద్రుండు నక్షత్రములచేనిండియున్న యాకాశంబునుం బోలెఁ, బ్రకాశించునట్లు సేయుచుఁ, బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, పంచమస్సర్గః.
ఇతి, స్వస్త్యాథర్ణము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ పంచమసర్గటీక, ముగిసినది.

(శ్రీ)

షష్ఠసర్గప్రారంభః.

గతే పురోహితే రామ స్స్నాతో నియతమానసః
సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్. ౧

టీక॥పురోహితే = వసిష్ఠుండు;గతే=పోఁగానే;రామః = రాముఁడు; స్నాతః=స్నానముచేసినవాఁడై;నియతమానసః=నియమంబుగలమనస్సుగలవాఁడై;విశాలాక్ష్యా= వెడల్పులయిన కండ్లుగల; పత్న్యాసహ=భార్యయగుసీతతోఁగూడ;నారాయణం = నారాయణుని;ఉపాగమత్ = ఉపాసించెను.

పురోహితుఁడగు వసిష్ఠుండు పోఁగానే, రాముండు,స్నానంబుచేసి, మనస్సునిశ్చలంబుచేసికొని, విశాలంబులగు నేత్రంబులుగలభార్యతోఁగూడ,నారాయణునుపాసించెను. అని తాత్పర్యము.

విశేషార్థము.—"విశాలనేత్రంబులుగలభార్యతోఁగూడ"ననుటచే, మనోనిగ్రహంబుసూచితమగు చున్నది.

ప్రగృహ్య శిరసా పాత్రీం హవిషో విధివ త్తదా
మహతే దైవతా యాజ్యం జుహావ జ్వలితానలే. ౨

టీక॥తదా = అప్పుడు;రామః(అధ్యాహృతము)=రాముఁడు;విధివత్=యథాశాస్త్రముగా; హవిషః=హవిస్సుయొక్క;పాత్రీం =పాత్రమును;శిరసా=శిరస్సుచేత;ప్రగృహ్య=గ్రహించి; జ్వలితానలే = మండినయగ్నియందు; మహతే=పూజ్యుఁడైన; దైవతాయ=దేవతయగునారాయణునికొఱకు; ఆజ్యం=నేతిని;జుహావ = హోమముచేసెను.

రాముం,డప్పుడు, యథాశాస్త్రంబుగా, హవిఃపాత్రంబును, శిరసాగ్రహించి,మండినయగ్ని హోత్రమునందు, దేవతలలోనుత్తముండగు నారాయణునికొఱకు, కాజ్యహోమముచేసెను. అని, తాత్పర్యము.

శేషంచ హవిష స్తస్య ప్రాశ్యా శాస్యాత్మనః ప్రియమ్

ధ్యాయన్నారాయణం దేవం స్వాస్తీర్ణే కుశసంస్తరే. ౩
వాగ్యతస్సహ వైదేహ్యా భూత్వా నియతమానసః
శ్రీమత్యాయతనే విష్ణోశ్శిశ్యే నరవరాత్మజః. ౪

టీక॥ నరవరాత్మజః=రాచకొమరుండగు రాముండు; తస్య=ఆ; హవిషః=హవిస్సుయొక్క; శేషంచ=మిగతను; ప్రాశ్య=భక్షించి; ఆత్మనః=తనకు; ప్రియం=ఇష్టమగు దానిని; ఆకాంక్ష్య=కోరుకొని; దేవం= సృష్టిస్థితిసంహారములచేఁగ్రీడించుచునట్టి; నారాయణం=నారాయణునిని; ధ్యాయన్=ధ్యానింపుచు; విష్ణోః= విష్ణుదేవునియొక్క; శ్రీమతి=అన్నిటికన్న నతిశయించినదగు; ఆయతనే= ఆలయమునందు; స్వాస్తీర్ణే=తనచేతఁబఱుపుకొనఁబడిన; కుశసంస్తరే= దర్భలచేఁ జేయఁబడినశయనమందు; వైదేహ్యాసహ=సీతతోఁగూడ; వాగ్యతః=మాటవిషయమయి నియమముగలవాఁడును; నియతమానసః=నియమింపఁబడిన మనస్సుగలవాఁడును; భూత్వా=అయి; శిశ్యే=పరుండెను.

రాచకొమరుండగు రాముండు, హోమము సేయఁగామిగిలిన హవిస్సునుభుజించి, తనకుఁబ్రియంబుగోరుకొని, నారాయణుని ధ్యానించుచు, శ్రీమంతంబగు నానారాయణ దేవాలయంబునందుఁ, దానె దర్భలంబఱచుకొని, యందు, సీతతోఁగూడ, మౌనంబునొంది మనసు నిశ్చలంబుఁ జేసికొని, శయనించెను. అని, తాత్పర్యము.

విశేషార్థము,— "వైదేహ్యాసహశిశ్యే" (సీతతోఁగూడఁబరుండెను) అనుటచే, జితేంద్రియత్వంబు సూచింపఁబడినది. "నరవరాత్మజః" (రాచకొమరుండు) అనుటచే, "తాను నారాయణావతారంబయ్యును, క్షత్రియుండుకావున, "విప్రాణాం దైవతం శంభుః క్షత్రియాణాం జనార్దనః" (బ్రాహ్మణులకు శివుండు దేవుఁడు; క్షత్రియులకు నారాయణుండు దేవుండు) అనిచెప్పఁబడిన క్షత్రియధర్మంబుననుసరించువాఁడని సూచితమయినది.

ఏకయామావశిష్టాయాం రాత్ర్యాం ప్రతివిబుధ్య సః
అలంకారవిధిం కృత్స్నం కారయామాస వేశ్మనః. ౫

స ౬

టీక॥సః = ఆరాముఁడు; ఏకయామావశిష్టాయాం=ఒకజాముమిగిలినదిగాఁగల; రాత్ర్యాం=రాత్రియందు; ప్రతివిబుధ్య=మేల్కని; వేశ్మనః=ఇంటికి; కృత్స్నం=సమస్తమైన; అలంకారవిధిం=అలంకారకార్యమును; కారయామాస=చేయించెను.

ఆరాముఁడు, ఒకజాము రాత్రియుండఁగానే, నిద్రలేచి, గృహంబునకంతయునలంకారంబుఁజేయించెను. అని, తాత్పర్యము.

తత్ర శృణ్వన్ సుఖా వాచ స్సూతమాగధవందినామ్
పూర్వాం సంధ్యా ముపాసీనో జజాప యతమానసః. ౬

టీక॥ రామః(అధ్యాహృతము)=రాముఁడు; సూతమాగధవందినాం, సూత=పౌరాణికులయొక్కయు, మాగధ= వంశావళింగీర్తించువారలయొక్కయు, వందినాం=స్తుతిపాఠకులయొక్కయు; సుఖాః=సుఖంబుగలిగించునట్టి; వాచః=మాటలను; శృణ్వన్ = వినుచు; పూర్వాం = మొదటిదైన; సంధ్యాం=ప్రాతస్సంధ్యను; ఉపాసీనః=ఉపాసించినవాఁడై; యతమానసః=నియమంబుగలమనస్సుగలవాఁడై; జజాప=గాయత్రిని, జపించెను.

రాముం,డచ్చట, సూతమాగధవందిజనంబులసుఖకరంబులగుమాటలవినుచుఁ, బ్రాతస్సంధ్యనుపాసించి, మనోనిగ్రహంబుగలిగి, గాయత్రీజపము చేసెను. అని, తాత్పర్యము.

తుష్టావ ప్రణతశ్చైవ శిరసా మధుసూదనమ్
విమలక్షౌమసంవీతో వాచయామాసచ ద్విజాన్. ౭

టీక॥రామః (అధ్యాహృతము)=రాముఁడు; మధుసూదనం=మధువను రాక్షసుంజంపినవిష్ణుని; తుష్టావ=స్తుతించెను. శిరసా=తలచేత; ప్రణతశ్చైవ=నమస్కరించెను. విమలక్షౌమసంవీతః = తెల్లనిపట్టుబట్టచేఁగప్పఁబడినవాఁడై; ద్విజాన్=బ్రాహ్మణులను; వాచయామాస=పుణ్యాహమునుం జెప్పించెను.

రాముండు,విష్ణుదేవునిఁబ్రస్తుతించి

సాష్టాంగంబుగనమస్కరించెను; అంత, మజ్జలస్నానంబుచేసి, తెల్లనివస్త్రంబట్టగట్టుకొని, బ్రాహ్మణులచేఁ, బుణ్యాహవాచనంబుచేయించెను.

అని, తాత్పర్యము.

తేషాం పుణ్యాహఘోషో థ గంభీరమధుర స్తదా
అయోధ్యాం పూరయామాస తూర్యఘోషానునాదితః. ౮

టీక॥అథ=అటుతర్వాత; తదా=అప్పుడు; గంభీరమధురః=గొప్పదియు నుమనోహరంబునగు; తేషాం=ఆబ్రాహ్మణులయొక్క; పుణ్యాహఘోషః=పుణ్యాహధ్వని;తూర్యఘోషానునాదితః= వాద్యములధ్వనిచేననుసరించిధ్వనింపఁబడినదై;అయోధ్యాం = అయోధ్యాపట్టణమును;పూరయామాస=నించెను.

అంత,నప్పుడు, ఆబ్రాహ్మణులుపుణ్యాహంబుచెప్పఁగా, మధురంబగునాగొప్పధ్వని,వాద్యధ్వనింగూడి, యయోధ్యయంతయు,నిండినది.

అని, తాత్పర్యము.

కృతోపవాసం తు తదా వైదేహ్యాసహ రాఘవమ్
అయోధ్యానిలయ శ్ర్శుత్వా సర్వః ప్రముదితో జనః. ౯

టీక॥తదా=అప్పుడు;అయోధ్యానిలయః = అయోధ్యయందున్నట్టి;జనః=జనము;సర్వః=అంతయు; రాఘవం=రామునిని;వైదేహ్యాసహ = సీతతోఁగూడ;కృతోపవాసం= చేయఁబడినయుపవాసముగలవానిఁగా; శ్రుత్వా తు=వినిసంతనె; ప్రముదితః=సంతసించినది.

అప్పుడు, అయోధ్యనుండుజనులందఱు, రాముండునుసీతయుయథావిధిగనుపవాసంబునల్పిన వృత్తాంతంబువిని, చాలసంతసించిరి.

అని, తాత్పర్యము.

తతః పౌరజన స్సర్వ శ్ర్శుత్వా రామాభిషేచనమ్
ప్రభాతాం రజనీం దృష్ట్వా చక్రే శోభయితుం పురీమ్. ౧౦

టీక॥ తతః = అటుపిమ్మట; పౌరజనః = పట్టణమునందుండుజనము;

స ౬

సర్వః=అంతయు; రామాభిషేచనం=రామునభిషేకమును; ప్రసత్వా=విని; ప్రభాతాం=తెల్లవాఱిన; రజనీం=రాత్రిని; దృష్ట్వా=చూచి; పురీం = పట్టణమును, శోభయితుం=అలంకరించుటకు; చక్రే=చేసినది.

అంతట, పట్టణంబునందుండు జనులందఱును, రామాభిషేకంబు జరిగెడునని విన్నవారు గావునఁ, దెల్లవాఱుటం జూచి, పట్టణంబు నలంకరించుటకై, యరఁటి చెట్లుగట్టుట మొదలగు కార్యంబులం జేసిరి. అని, తాత్పర్యము.

సితాభ్రశిఖరాభేషు దేవతాయతనేషుచ
చతుష్పథేషు రథ్యాసు చైత్యేష్వట్టాలకేషుచ. ౧౧
నానాపణ్యసమృద్ధేషు వణిజామాపణేషుచ
కుటుంబినాం సమృద్ధేషు శ్రీమత్సు భవనేషుచ. ౧౨
సభాసుచైవ సర్వాసు వృక్షేష్వాలక్షితేషుచ
ధ్వజాస్సముచ్ఛ్రితాశ్చిత్రాః పతాకాశ్చాభవంస్తదా. ౧౩

టీక॥ తదా=అప్పుడు; సితాభ్రశిఖరాభేషు=తెల్లనిమబ్బుతోను బర్వతశిఖరముతోను సమానములయిన; దేవతాయతనేషుచ= దేవాలయములందును; చతుష్పథేషు=నాలుగు దారులుకలియు స్థలములందును; రథ్యాసు=రాజమార్గంబులందును; చైత్యేషు= బౌద్ధాలయములందును; అట్టాలకేషుచ=ప్రాకారములమీఁద యుద్ధార్థముగా నిర్మింపఁబడిన నాలుగు స్తంభములమంటపములందును; నానాపణ్య సమృద్ధేషు=పలు దెఱంగులగు విక్రయింపఁదగిన వానిచేనిండిన; వణిజాం= వైశ్యులయొక్క; ఆపణేషుచ=అంగళ్లయందును; కుటుంబినాం=గృహస్థులయొక్క; సమృద్ధేషు=వృద్ధిగలవియును; శ్రీమత్సు=సంపదగలవియునగు; భవనేషుచ=ఇండ్లయందును; సర్వాసు = సమస్తములయిన; సభాసుచైవ= సభలయందును; ఆలక్షితేషు=అంతటను జూడఁబడిన, ఉన్నతములయినయట్టి; వృక్షేషుచ= చెట్లయందును; ధ్వజాః=గుఱుతులుగల జెండాలును; చిత్రాః=నానావిధములయిన రంగులుగల; పతాకాశ్చ=పట్టెజెండాలును; సముచ్ఛ్రితాః = ఎత్తఁబడినవి; అభవన్=అయినవి.

అప్పుడు, తెల్లని మేఘంబును దెల్లని పర్వతశిఖరంబునుం బోలి యొప్పుచుండు

దేవాలయంబులందును, జదుకంబులం బులునగుగృహంబులందును, సమస్తసభాస్థలంబులందును, ఉన్నతంబులగువృదును, రాజమార్గంబులందును బౌద్ధాలయంబులందును, అట్టాలకమందిరంబులందును, నానావిధంబులగువస్తువులచే సమృద్ధంబులయియుండు వైశ్యాలయంగళ్లయందును, శ్రీమంతంబులుసమృద్ధంక్షంబులందును, రాజచిహ్నంబులుగల టెక్కెంబులను, మఱియుఁబలుదెఱంగులగురంగులుగలపట్టిటెక్కెంబులను, ఎత్తిరి. అని, తాత్పర్యము.

నటనర్తక సంఘూనాం గాయకానాంచ గాయతామ్
మనఃకర్ణసుఖా వాచ శ్శుశ్రువుశ్చ తత స్తతః. ౧౪

టీక॥ జనాః (అధ్యాహృతము)=జనులు; తత స్తతః=అంతనంత; నటనర్తకసంఘూనాం, నట= అభినయముసేయువారలయొక్కయు, నర్తక=నాట్యముసేయువారలయొక్కయు, సంఘూనాం = సమూహములయొక్కయు; గాయతాం=పాడుచున్న; గాయకానాంచ=గానము సేయువారల యొక్కయు; మనఃకర్ణసుఖాః=మనసునకును జెవులకును సుఖము గలిగించునట్టి; వాచశ్చ=మాటలను, పాటలనను టః; శుశ్రువుః=వినిరి.

అంతంతకు, నటులునర్తకులును మనోహరంబుగాఁబాడుచు, నభినయంబులునాట్యంబులుఁ జేసిరి; గాయకులు మనోహరంబుగాఁ బాడిరి, ఆధ్వని, చెవులకు శ్రవణమాత్రంబునసంతోషంబు సేయుచుసంతమునసునకునాహ్లాదంబు నెఱపుచు, జనులకువినవచ్చెను.

అని, తాత్పర్యము.

రామాభిషేక యుక్తాశ్చ కథా శ్చక్రు మిథో జనాః
రామాభిషేకే సంప్రాప్తే చత్వరేషు గృహేషుచ. ౧౫

టీక॥ రామాభిషేకే = రామునిపట్టాభిషేకము; సంప్రాప్తే=రాఁగా; చత్వరేషు=ముంగిళ్లయందును; గృహేషుచ=ఇండ్లయందును; జనాః=జనులు; మిథః=పరస్పరము; రామాభిషేకయుక్తాః= రామునిపట్టాభిషేకముతో సంబంధించిన; కథాశ్చ=మాటలను; చక్రుః=చేసికొనిరి.

రామునిపట్టాభిషేకము సమీపింపఁగానే, జనులు,ముంగిళ్లయందును గృహంబు లోపలనుం జేరి, రామునిపట్టాభిషేకంబుఁగుఱించినమాటలనే, పరస్పరము చెప్పుకొనుచుండిరి.

అని, తాత్పర్యము.

బాలా అపి క్రీడమానా గృహద్వారేషు సంఘశః
రామాభిషవసంయుక్తా శ్చక్రురేవం మిథః కథాః. ౧౬

టీక॥ ఏవం=ఇట్లు; గృహద్వారేషు= ఇండ్లవాకిళ్లయందు; సంఘశః=గుంపులుగా; క్రీడమానాః=ఆడుకొనుచున్నట్టి; బాలా అపి=పిల్లవాండ్రును; మిథః=పరస్పరము; రామాభిషవసంయుక్తాః=రాముని పట్టాభిషేకముతో సంబంధించిన; కథాః = మాటలను; చక్రుః=చెప్పుకొనిరి.

గృహంబుల వాకిళ్లయం దాడుకొనుచుండుపిల్లవాండ్రునుంగూడ, రామునిపట్టాభిషేకంబుగుఱించినమాటలనే, పరస్పరము, చెప్పుకొనుచుండిరి.

అని, తాత్పర్యము.

కృతపుష్పోప హారశ్చ ధూపగంధాధివాసితః
రాజమార్గః కృత శ్శ్రీమాన్ పౌరై రామాభిషేచనే. ౧౭

టీక॥ రామాభిషేచనే=రామునిపట్టాభిషేకమునిమిత్తమయి; పౌరైః=పట్టణంబునందుండుజనులచేత; రాజమార్గః=పెద్దత్రోవ; కృతపుష్పోపహారశ్చ = చేయఁబడినపుష్పములయొక్క చల్లుటగలది గాను; ధూపగంధాధివాసితః = పొగలగంధముచే వాసనగొట్టునట్లు చేయఁబడినది గాను; శ్రీమాన్ =కాంతిగలది గాను; కృతః=చేయఁబడినది.

రామునిపట్టాభిషేకమునిమిత్తమై, యయోధ్యనుండుజనులు, రాజమార్గంబులనంతటను బుష్పంబులంజల్లి, సుగంధిధూపంబులు వేసి, యలంకరించి, శ్రీమంతంబులగునట్లు చేసిరి. అని తాత్పర్యము.

ప్రకాశ కరణార్థంచ నిశాగమన శంకయా
దీపవృక్షాం స్తథా చక్రు రనురథ్యాసు సర్వశః. ౧౮




టీక॥పౌరాః = పట్టణంబునందుండుజనులు; నిశాగమనశంకయా = రాత్రియొక్కవచ్చుటనుగుఱించినసంశయముచేత ; ప్రకాశకరణార్థంచ=వెలుతురుచేయుటకొఱకును; అనురథ్యాసు=(అనురథ్యం) ప్రతిరాజమార్గంబునందును; సర్వశః=అన్నివిధంబులను;దీపవృక్షాన్ తథా=వృక్షంబులువలెనుండుదీపస్తంభంబులను;చక్రుః=చేసిరి.

అయోధ్యనుండుజనులు, రామాభిషేకము ముగియుటకుమున్నె, రాత్రివచ్చునని సంశయించి, వెల్తురు గల్గుటకై, ప్రతిరాజమార్గంబునందును, నానావిధంబులగు, దీపస్తంభంబులను, వృక్షాకారంబుగా, నిర్మించిరి.

అని, తాత్పర్యము.

అలంకారంపురస్యైవం కృత్వా తత్పురవాసినః
ఆకాంక్షమాణా రామస్య యౌవరాజ్యాభిషేచనమ్. ౧౯

టీక॥తత్పురవాసినః= ఆపట్టణమునందుండువారలు; ఏవం=ఇట్లు; పురస్య=పట్టణంబునకు; అలంకారం= అలంకారమును;కృత్వా=చేసి ; రామస్య = రామునియొక్క ; యౌవరాజ్యాభిషేచనం=యువరాజు దొరతనమునందభిషేకించుటను ; ఆకాంక్షమాణాః=కోరుచు; ఆసన్ (అధ్యాహృతము)=ఉండిరి.

అయోధ్యనుండువారలు, ఆపట్టణంబునకిట్లలంకారంబు గావించి, రాముని యౌవరాజ్యపట్టాభిషేకమునకు నిశ్చితంబగుముహూర్తంబునెదురు సూచుచుండిరి. అని, తాత్పర్యము.

సమేత్య సంఘశస్సర్వే చత్వరేషు సభాసుచ
కథయంతో మిథస్తత్ర ప్రశశంసు జనాధిపమ్. ౨౦

టీక॥పౌరాః (అధ్యాహృతము)=పట్టణంబునందుండుజనులు;సర్వే=అందఱును ; చత్వరేషు=ముంగిళ్లయందును; సభాసుచ= కొలువుకూటంబులందును; సంఘశః=గుంపులుగుంపులుగా; సమేత్య=చేరి;తత్ర=అచ్చట; మిథః= పరస్పరము;కథయంతః= మాటలాడుకొనుచు; జనాధిపం=జనులకు ప్రభుండయినదశరథుని;ప్రశశంసుః=పొగడిరి

పట్టణవాసిజనులందఱును,ముంగిళ్ల




యందుఁగొలువుకూటంబులందు గుంపులుగుంపులుగాఁజేరి, యచ్చట, నొకరితో నొకరుమాటలాడుకొనుచు, దశరథుఁ, నిట్లని, ప్రశంసించిరి. అని, తాత్పర్యము.

అహో మహాత్మా రాజాయ మిక్ష్వాకు కులనందనః
జ్ఞాత్వా యో వృద్ధ మాత్మానం రామం రాజ్యే భిషేక్ష్యతి. ౨౧

టీక॥యః=ఎవ్వఁడు ; ఆత్మానం= తన్ను; వృద్ధం=ముదుసలినిగా ; జ్ఞాత్వా=ఎఱింగి; రామం=రాముని;రాజ్యే=దొరతనమునందు;అభిషేక్ష్యతి=అభిషేకింపఁగలఁడో; సః(అధ్యాహృతము)= అట్టి; అయం=ఈ; ఇక్ష్వాకుకులనందనః=ఇక్ష్వాకువంశమునుసంతసింపఁజేయునట్టి; రాజా= దశరథ మహారాజు; మహాత్మా=అధికమయిన బుద్ధిగలవాఁడు.అహో=ఆశ్చర్యము!

ఇక్ష్వాకువంశంబును సంతోషింపఁజేయునట్టి యీదశరథమహారాజు, తాను వృద్ధుండగుట నెఱింగి, రాజ్యంబునందు రామునభిషేకింపఁదలంచినాఁడు, కావున, నితండు, మిక్కిలియు బుద్ధిశాలి. ఆశ్చర్యము! అని, తాత్పర్యము.

సర్వే హ్యనుగృహీతాస్స్మయ న్నోరామో మహీపతిః
చిరాయ భవితా గోప్తా దృష్టలోకపరావరః. ౨౨

టీక॥యత్=ఏకారణంబువలన; దృష్టలోకపర్యావరః= చూడఁబడినలోకంబునందలిమెచ్చుతక్కువలుగలిగిన; రామః=రాముఁడు; చిరాయ=బహుకాలమునకు;నః=మనకు; మహీపతిః=రాజును;గోప్తా=రక్షకుండును;భవితా=కాఁగలఁడో;తత్(అధ్యాహృతము)= ఆకారణమువలన; వయం(అధ్యాహృతము)=మనము;సర్వేపి= అందఱమును;అనుగృహీతాః = పరమేశ్వరునిచేత, అనుగ్రహింపఁబడినవారము; స్మ (స్మః)=అగుచున్నాము.

మనము బహుకాలముగాఁ గోరునట్లు, మనకు , లోకంబునందలిమెచ్చుతక్కువలనన్నిటి నెఱింగిన రాముండు రాజును రక్షకుండునుగాఁగలఁడు, కావున మనముపరమేశ్వరునిచే ననుగ్రహింపఁబడినవారమగుచున్నాము.

అని, తాత్పర్యము.

స ౬

అనుద్ధతమనా విద్వాన్ ధర్మాత్మా భ్రాతృవత్సలః
యథాచ భ్రాతృషు స్నిగ్ధ స్తథా స్మాస్వపి రాఘవః. ౨౩

టీక॥ రాఘవః=రాముఁడు; అనుద్ధతమనాః= గర్వములేనిమనసుగలవాఁడు. విద్వాన్ = పండితుండు. ధర్మాత్మా=ధర్మబుద్ధిగలవాఁడు. భ్రాతృవత్సలః= తమ్ములందుఁబ్రేమగలవాఁడు. యథా= ఎట్లు; భ్రాతృషు= తమ్ములందు; స్నిగ్ధః=స్నేహముగలవాఁడో; తథా=అట్లు; అస్మాస్వపి = మనయందును; స్నిగ్ధః (అధ్యాహృతము) చ= స్నేహముగలవాఁడును.

రాముండు, గర్వములేనివాఁడు; పండితుండు; ధర్మబుద్ధిగలవాఁడు; తమ్ములందుఁజాలఁబ్రేమగలవాఁడు; తమ్ములందెట్లుప్రేమయుంచునో, అట్లేప్రేమను మనయందునుంచియున్నాఁడు.

అని, తాత్పర్యము.

చిరం జీవతు ధర్మాత్మా రాజా దశరథోఽనఘః
యత్ప్రసాదే నాభిషిక్తం రామం ద్రక్ష్యామహే వయమ్. ౨౪

టీక॥ వయం=మనము; యత్ప్రసాదేన= ఎవ్వనియనుగ్రహముచేత; అభిషిక్తం=అభిషేకింపఁబడిన; రామం=రాముని; ద్రక్ష్యామహే (ద్రక్ష్యామః)= చూడఁగలమో; సః (అధ్యాహృతము) అట్టి; అనఘః= పాపములేనివాఁడును; ధర్మాత్మా= ధర్మబుద్ధిగలవాఁడును; రాజా= రాజయిన; దశరథః=దశరథుఁడు; చిరం = బహుకాలము; జీవతు=బ్రతుకుఁగాక.

మనమెవ్వనియనుగ్రహంబునంజేసి, పట్టాభిషిక్తుండగు రాముంజూడఁబోవుచున్నామో; ధర్మాత్ముండుఁబాపరహితుండునగు నాదశరథుండు, బహుకాలము, జీవించియుండుఁగాక. అని, పౌరులుదశరథునిం బ్రశంసించిరి.

అని, తాత్పర్యము.

ఏవంవిధం కథయతాం పౌరాణాం శుశ్రువు స్తదా
దిగ్భ్యోఽపి శ్రుతవృత్తాంతాః ప్రాప్తా జానపదా జనాః. ౨౫

టీక॥ శ్రుతవృత్తాంతాః= వినఁబడిన రామాభిషేకవృత్తాంతము గలవార

లును, కావుననే; దిగ్భ్యః=దిక్కులనుండి; ప్రాప్తాః=వచ్చినవారలు నగు; జానపదాః=గ్రామంబులనుండు; జనాః అపి=జనులును; తదా=అప్పుడు; ఏవంవిధం=ఈప్రకారముగా; కథయతాం=చెప్పుకొనుచుండు; పౌరాణాం=పట్టణంబునందుండు వారలయొక్క; వాక్యాని (అధ్యాహృతము)=మాటలను; శుశ్రువుః=వినిరి.

అప్పుడు, రామాభిషేక వృత్తాంతము వినిని, నానాప్రదేశంబులనుండి వచ్చిన జానపదులగు జనులును, ఈప్రకారముగా నాపౌరులు మాటలాడుకొనుచుండగా, నామాటల నాలకించిరి.

అని, తాత్పర్యము.

తే తు దిగ్భ్యః పురీం ప్రాప్తా ద్రష్టుం రామాభిషేచనమ్
రామస్య పూరయామాసుః పురీం జానపదా జనాః. ౨౬

టీక॥ రామాభిషేచనం=రామునిపట్టాభిషేకమును; ద్రష్టుం=చూచుటకు; దిగ్భ్యః=దిక్కులనుండి; పురీం=పట్టణమును; ప్రాప్తాః=పొందిన; తే=ఆ; జానపదాః = గ్రామంబులనుండు; జనాః తు=జనులును; రామస్య=రామునియొక్క; పురీం= పట్టణమయిన యయోధ్యను; పూరయామాసుః=నించిరి.

అట్లు, రామాభిషేకవృత్తాంతము విని, రామునిపట్టాభిషేకంబు జూచుటకై, నానాప్రదేశంబులనుండి, అయోధ్యకువచ్చియున్న యాగ్రామవాసిజనులు, రామునిపట్టణంబగు నయోధ్యను నిండియుండిరి. అని, తాత్పర్యము.

జనౌఘైస్తై ర్విసర్పద్భి శ్శుశ్రువే తత్ర నిస్స్వనః
పర్వసూదీర్ణవేగస్య సాగరస్యేవ నిస్స్వనః. ౨౭

టీక॥ తత్ర=ఆయయోధ్యయందు, విసర్పద్భిః=వ్యాపించుచున్న; తైః=ఆ; జనౌఘైః=జనుల సమూహముచేత; ఉత్పాదితః= (అధ్యాహృతము)= కలిగింపఁబడిన; నిస్స్వనః=ధ్వని; పర్వసు=పూర్ణిమలందు; ఉదీర్ణవేగస్య=అధికమయిన వేగముగల; సాగరస్య=సముద్రముయొక్క; నిస్స్వనః ఇవ=ధ్వనివలె; శుశ్రువే = వినంబడినది.

ఆయయోధ్యయందు, అట్లు, నానాప్రదేశంబులందుండివచ్చుచుండు జనస

స ౬

మూహంబులవలనంగలిగినధ్వని, పూర్ణములందు, అధికవేగమునొందియుండ, సముద్రమందలి, ధ్వనియుంబోలె, నుండెనది. అని, తాత్పర్యము.

తత స్తదింద్రక్షయసన్నిభం పురమ్
దిదృక్షుభి ర్జానపదై రుపాగతైః
సమంతత స్సస్వన మాకులం బభౌ
సముద్ర యాదోభి రివార్ణవోదకం. ౨౮

టీక॥ తతః=అంతట; ఇంద్రక్షయసన్నిభం=దేవేంద్రునిగృహంబుతో సమానమయినదియు; దిదృక్షుభిః=రామాభిషేకముఁ జూడఁగోరువారును; ఉపాగతైః=వచ్చియుండువారునగు; జానపదైః=గ్రామంబులనుండు జనులచేత; సమంతతః=అంతటను; సస్వనం=ధ్వనితోఁగూడినదియును; ఆకులం=కలఁతనొందినదియునగు; తత్=ఆ; పురం=పట్టణము; సముద్రయాదోభిః=సముద్రమునందలి జలజంతువులచేత; సస్వనం, ఆకులం (అధ్యాహృతము)= ధ్వనితోఁగూడినదియు, కలఁతనొందినదియునగు; అర్ణవోదకమివ=సముద్రమునందలిజలమువలె; బభౌ=ప్రకాశించెను.

అంత, దేవేంద్రునిభవనంబుతో సాటియగునాయయోధ్యాపట్టణము, రామాభిషేకముఁజూడఁగోరివచ్చియున్న గ్రామవాసులగుజనులు సేయు ధ్వనులచేతను, వారలుగుంపుగుంపుగాఁ దిఱుగులాడుటంగల్గినకలఁతచేతను, జలజంతువులచే రొదగల్గి కలఁతపడియుండు సముద్రజలంబుంబోలి, ప్రకాశించినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, షష్ఠస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ షష్ఠసర్గటీక.
ముగిసినది.

౹౫౭

సప్తమసర్గప్రారంభః.

జ్ఞాతిదాసీ యతోజాతా కైకేయ్యాస్తు సహోషితా
ప్రాసాదం చంద్రసంకాశ మారురోహ యదృచ్ఛయా. ౧

టీక॥ యతోజాతా=ఎచ్చటనోపుట్టినదియును; సహోషితా=కూడనున్నదియునగు; కైకేయ్యాః=కైకేయియొక్క; జ్ఞాతిదాసీతు=బంధువులయినపుట్టింటివారిచేహరణంబుగానివ్వఁబడినదాసియగుమంథరయనునది మాత్రము; చంద్రసంకాశం= చంద్రునితోసమానమయిన; ప్రాసాదం= మేడను; యదృచ్ఛయా=స్వేచ్ఛచేత; ఆరురోహ=ఎక్కెను.

ఎచ్చటనోపుట్టికైకేయిపుట్టింటివారుకైకేయికిహరణంబివ్వఁగా వచ్చికైకేయితోఁగూడనున్నమంథరయనుదాసి,సున్నము పూయఁబడియుంటంజేసి చంద్రునింబోలెఁదెల్లఁగానున్నమేడపైస్వేచ్ఛచేనెక్కెను.అని తాత్పర్యము.

విశేషార్థము.—"యతోజాతా" (ఎచ్చటనోపుట్టినది) అని, చెప్పుటచే, "రామునిపట్టాభిషేకంబుచెఱిచి, రాముని వనవాసంబుసేయునట్లు చేసిన యీమంథరదేశగోత్రంబులుదాహరింపందగినవికా"వనిసూచింపఁబడినది.ఆయభిప్రాయంబుననే,"మంథర" యని పేరును, జెప్పంబడదయ్యె; దేవతలు, రామునిచే రావణునిఁ జంపించుటకై, పంపఁబడినది,కావున,దేవరహస్యంబు వెల్లడియగునని దానికులాదులంజెప్పలేదనికొందఱందురు.

సిక్తరాజపథాం కృత్స్నాం ప్రకీర్ణకుసుమోత్కరాం
అయోధ్యాం మంథరా తస్మాత్ప్రాసాదా దన్వవైక్షత. ౨

టీక॥మంథరా=మంథర;తస్మాత్=ఆ;ప్రాసాదాత్=మేడనుండి; సిక్తరాజపథాం=తడుపఁబడినరాజమార్గంబులుగలదియు; ప్రకీర్ణకుసుమోత్కరాం= చల్లఁబడినపూలసమూహములుగలదియునగు;అయోధ్యాం = అయోధ్యను;కృత్స్నాం=అంతను;అన్వవైక్షత=చూచెను.

మంధర, యామేడపైనిలుచుండి, తదుపంబడిన రాజమార్గంబులతోనొప్పుచు, అంతటఁజల్లఁబడినపూలచేఁదావులుగుబాళించుచుండు, నయోధ్యాపట్టణంబునంతయుఁ, జూచెను.

అని, తాత్పర్యము.

పతాకాభి ర్వరార్హాభి ర్ధ్వజైశ్చ సమలంకృతాం
వృతాం ఛందపథైశ్చాపి శిరస్స్నాతజనై ర్వృతామ్. ౩
మాల్యమోదకహస్తైశ్చ ద్విజేంద్రై రభినాదితాం
శుక్లదేవగృహద్వారాం సర్వవాదిత్రనిస్స్వనామ్. ౪
సంప్రహృష్టజనాకీర్ణాం బ్రహ్మఘోషాభినాదితాం
ప్రహృష్టవరహస్త్యశ్వాం సంప్రణదితగోవృషామ్. ౫
ప్రహృష్టముదితైః పౌరై రుచ్ఛ్రితధ్వజమాలినీం
అయోధ్యాం మంధరా తస్మా త్ప్రాసాదా దన్వవైక్షత. ౬

టీక॥మంధరా=మంధర; తస్మాత్=ఆ; ప్రాసాదాత్=మేడనుండి, వరార్హాభిః = శ్రేష్ఠములయిన; పతకాభిః=రాజచిహ్నంబులుగలటెక్కెంబులచేతను; ధ్వజైశ్చ=సాధారణంబులగు టెక్కెంబులచేతను; సమలంకృతాం= చక్కఁగానలంకరింపఁబడినదియును; ఛందపథైశ్చాపి=స్వేచ్ఛగాఁబోవుటకై యేర్పఱుపఁబడిన యడ్డదారులచేతను; వృతాం=చుట్టఁబడినదియును; శిరస్స్నాతజనైః=తలకుస్నానముచేసినజనులచేత; వృతాం=చుట్టఁబడినదియు; మాల్యమోదకహస్తైః=పుష్పమాలికలునుకుడుములును చేతులందుఁగల; ద్విజేంద్రైశ్చ= బ్రాహ్మణశ్రేష్ఠులచేతను; అభినాదితాం=అంతటనుధ్వనింపఁజేయఁబడినదియును; శుక్లదేవగృహద్వారాం = తెల్లనిదేవాలయములవాకిళ్లుగలదియును; సర్వవాదిత్రనిస్స్వనాం= సమస్తములయినవాద్యములధ్వనులుగలదియును; సంప్రహృష్టజనాకీర్ణాం=మిక్కిలియు సంతసించినజనులచేవ్యాపింపఁబడినదియు; బ్రహ్మఘోషాభినాదితాం= వేదపారాయణధ్వనిచే ధ్వనింపఁజేయఁబడినదియును; ప్రహృష్టవరహస్త్యశ్వాం= మిక్కిలియు గగుర్పాటునొందినశ్రేష్ఠములయినయేనుఁగులును గుఱ్ఱములును గలదియును;

సంప్రణదితగోవృషాం=అధికముగా ధ్వనించుచుండు నాఁబోతులుగలదియు ను; ప్రహృష్టముదితైః= గగుర్పాటు నొందినవారునుసంతసించినవారునగు; పౌరైః=పట్టణమునందుండుజనులచేత; ఉచ్ఛ్రితధ్వజమాలినీం =ఎత్తఁబడినపె క్కేముల యొక్క పఙ్క్తిగలదియు న గు;అయోధ్యాం = అయోధ్యాపట్టణ మును;అన్వవైక్షత=చూచెను.

రాజచిహ్నంబులు వ్రాసినపెక్కెము లచేతను సాధారణధ్వజంబులచేత నుఅలంకరింపఁబడి, జనులుయథేచ్ఛం బుగా సంచరించుటకై నిర్మింపఁబడిన యడ్డత్రోవలతో నొప్పుచుఁ, దలకుస్నా నముచేసిపరిశుద్ధులయియుండు జనుల తోఁగూడి, రామునకుఁగానుకలుసమ ర్పించుటకై పుష్పమాలికలుఁ గుడుము లుఁజేతులంబట్టుకొని తిరుగుచుండుబ్రా హ్మణశ్రేష్ఠుల సంతోషధ్వనులచేనిండిన దై, సున్నముపూయఁబడియుంటంజేసి, తెల్లఁగానుండు దేవాలయ ద్వారంబు లుగలదై, మేల్లవాద్యంబులువాయిం పఁబడుటవలన,వానిధ్వనులచేనాదితం బై, మిక్కిలియు సంతోషంబునొంది యున్నజనులుగలిగి, యచ్చటచ్చటబ్రా హ్మణులు సేయు వేదపారాయణంబు లంగల్గినధ్వనులచేవ్యాపింపఁబడి, రా మునియభిషేకంబుగుఱించి మృగాదు లునుగూడ సంతోషంబునొందుటంజేసి గగుర్పాటునొందిన మేలయినయేనుం గులునుగుఱ్ఱంబులునుసంతోషాతిశయం బున అంకెలువేయుచుండునాఁబోతు లునుంగలిగి, సంతోషవిశేషంబునగగు ర్పాటు నొందిన పౌరజనులచేనెత్తిక ట్టఁబడినధ్వజంబులనలరారుచున్న, య యోధ్యాపట్టణంబునంతయును, మంథ ర,యామేడపైనిలుచుండి,చూచెను.

అని, తాత్పర్యము.

ప్రహర్షోత్ఫుల్లనయనాం పాండురక్షౌమవాసినీమ్
అవిదూరే స్థితాం దృష్ట్వా ధాత్రీం పప్రచ్ఛ మంథరా. ౭

టీక॥ మంథరా=మంథర ; ప్రహ ర్షోత్ఫుల్లనయనాం= సంతోషముచే వికసించియుండుకండ్లు గలదియును ; పాండురక్షౌమవాసినీం= తెల్లనిపట్టు బట్టనుకట్టకొన్నదియును ; అవిదూ రే=దూరముకానిస్థలమందు , సమీప మునందనుట; స్థితాం= ఉన్నదియున గు;ధాత్రీం=దాదిని; దృష్ట్వా=చూచి; పప్రచ్ఛ=అడిగెను.

సంతోష విశేషంబున వికాసంబు

నొందియున్నకండ్లుగలిగి, తెల్లనిపట్టు చీరకట్టుకొని,తనకుసమీపంబుననేయు న్నదాదినిజూచి, మంధర,యిట్లనియడి గెను. అని తాత్పర్యము.

విశేషార్థము.—"సంతోషంబు నవికాసంబునొందినకండ్లుగలది" అనున దిమొదలగు విశేషణములచే "దాది" రా మునిదాదియని తెలియవచ్చుచున్నది.

ఉత్తమేనా భిసంయుక్తా హర్షేణా ర్థపరా సతీ
రామమాతా ధనం కిన్ను జనేభ్య స్సంప్రయచ్ఛతి. ౮

టీక॥ రామమాతా=రామునితల్లి యయినకౌసల్య ; ఉత్తమేన=మిక్కిలి యునధికమయిన ; హర్షేణ=సంతో షముతో ; అభిసంయుక్తా=కూడినదై ; అర్థపరాసతీ(అపి)=ధనమందాసక్తి గలదయ్యును; జనేభ్యః = జనులకొఱ కు; ధనం= ద్రవ్యమును; సంప్రయచ్ఛ తి=ఇచ్చుచున్నది. కిన్ను=ఎందుకు?

రామునితల్లియగుకౌసల్య, స్వభా వంబున , ధనసంగ్రహంబుసేయునది కావుననెవ్వరికినేమియునివ్వనిదియయి నను, ఇప్పుడుఅధికముగాసంతోషము నొంది, జనులకుధనమునిచ్చుచున్నది ; ఇందుకేమికారణము,

అని తాత్పర్యము.

విశేషార్థము.—"అర్థపరా"(ధ నమునందాసక్తిగలది) అని , కౌసల్య యందుమంధరకుంగల్గియుండు ద్వేషం బున, మంధరచేఁజెప్పఁబడినది. "కౌ సల్య" యని పేరుదాహరింపక "రామ మాతా" (రామునితల్లి)యనిచెప్పుట చే,కౌసల్యపేరుచెప్పుటకుఁగూడ మన సు రాకుండునంతటి, ద్వేషంబుకౌసల్య పై, మంధరకుం గల్గియుండినది" అని సూచింపఁబడినది.

అతిమాత్రప్రహర్షోఽయం కిం జనస్య చ శంస మే

టీక॥ జనస్యచ=జనమునకును;అయం= ఈ ; అతిమాత్రప్రహర్షః =అధికమ యినసంతోషము; కిం(జాతః)=ఎందు వలనఁగలిగినది? మే=నాకు ; శంస= చెప్పుము.

జనులకింతయధికమయిన సంతోషం బెందువలనఁగలిగినది? నాకుజెప్పుము. అని, తాత్పర్యము.

కారయిష్యతి కిం వాపి సంప్రహృష్టో మహీపతిః. ౯

టీక॥ మహీపతిః= భూమికిఁబ్రభువయిన దశరథుఁడు; సంప్రహృష్టః = ఎచ్చుగాసంతసించినవాఁడై;కింవాపి= దేనినైనను; కారయిష్యతి (కిం)= చేయఁబోవుచున్నాఁడా?

లేక,భూమికిం బ్రభువయినదశరథమహారాజు,సంతోషంబునొంది, యే కార్యమునైనఁ జేయఁ బోవుచున్నాఁడా? దీనినవిస్తరంబుగా నాకుఁ జెప్పుము. అనియడిగెను. అని తాత్పర్యము.

విదీర్యమాణా హర్షేణ ధాత్రీతు పరయా ముదా
ఆచచక్షేథ కుబ్జాయై భూయసీం రాఘవశ్రియమ్. ౧౦

టీక ॥ అథ=అటుపిమ్మట; ధాత్రీతు=దాదియును; హర్షేణ=సంతోషముచేత;విదీర్యమాణా=పగులునట్లు చేయఁబడుచున్నదై; భూయసీం = అధికమయిన; రాఘవశ్రియం=రామునియందుంచఁబడులక్ష్మిని; కుబ్జాయై= గూనిదైనమంథరకొఱకు ; పరయా = అధికమయిన;ముదా=సంతోషముచే; ఆచచక్షే=చెప్పెను.

అంతనా దాది, లోపలసంతోషంబతిశయించియుండుటవలననవయవంబు లుబ్బటంజేసిపగుల్పఁబడుచున్నదోయని మెన్నందగి యొప్పుచు,గూనిదైనమంథరకై కేయి పక్షమునందుండునదగుటవలన, దానికి రామాభిషేకవార్తఁ జెప్పఁదగనిదైనను, సంతోషాతిశయంబున మనంబెఱుంగక, యట్టి,రామాభిషేకవార్తను,ఇట్లని, చెప్పెను.

అని తాత్పర్యము.

శ్వః పుష్యేణ జితక్రోధం యౌవరాజ్యేన రాఘవమ్
రాజా దశరథో రామ మభిషేచయి తాఽనఘమ్. ౧౧

టీక॥ రాజా = రాజయిన; దశరథః=దశరథుఁడు;పుష్యేణ=పుష్యనక్షత్రముతో;యుక్తే(అధ్యాహృతము)=కూడిన;శ్వః=రేపు;జితక్రోధం = జయింపఁబడినకోపంబుగలవాఁడును; అనఘం= పాపములేనివాఁడును; రాఘ

వం=రఘువంశమునందుఁబుట్టినవాఁడు నగు; రామం= రామునిని; యౌవరాజ్యేన=యువరాజుదొరతనముచేత; అభిషేచయితా=అభిషేకింపఁగలఁడు.

దశరథమహారాజు, రేపు పుష్యనక్షత్రంబునఁ, గోపంబును స్వాధీనపఱచుకొనినవాఁడును పాపము సేయనివాఁడునగు రాముని, యువరాజుదొరతనమునందు, అభిషేకింపఁబోవుచున్నాఁడు. అని, దాది, మంధరకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ధాత్ర్యాస్తు వచనం శ్రుత్వా కుబ్జా క్షిప్ర మమర్షితా
కైలాసశిఖరాకారా త్ప్రాసాదా దవరోహత. ౧౨

టీక ॥ కుబ్జా = గూనిదైనమంధర; ధాత్ర్యాః = దాదియొక్క; వచనం = మాటను; శ్రుత్వాతు = విన్నంతనె; అమర్షితా = కోపము నొందినదై; కైలాసశిఖరాకారాత్= కైలాసపర్వతపుశిఖరముయొక్క యాకారమువంటియాకారముగల; ప్రాసాదాత్ =మేడనుండి; క్షిప్రం=శీఘ్రముగా; అవరోహత (అవారోహత్)= దిగెను.

గూనిదైనమంధర, దాది చెప్పినమాటవిని, యాక్షణమే యధికమయినకోపంబునొంది, తెల్లఁగా నత్యున్నతంబై యుంటంజేసి కైలాసపర్వత శిఖరంబుంబోలెఁజూపట్టుచున్న యామేడపైనుండి, వేగంబుగా, దిగెను.

అని, తాత్పర్యము.

సా దహ్యమానా కోపేన మంధరా పాపదర్శినీ
శయానా మేత్య కైకేయీ మిదం వచన మబ్రవీత్. ౧౩

టీక॥ పాపదర్శినీ=పాపముగలిగించుకార్యమునే చూచునదియైన, పాపముగలిగించు కార్యమునేచేయఁ గోరునదియయినయనుట; సా=ఆ; మంధరా=మంధర; కోపేన=కోపముచేత; దహ్యమానా= కాల్పఁబడుచున్నదై; శయానాం = పరుండియున్న; కైకేయీం=కైకేయిని; ఏత్య=పొంది; ఇదం=ఈ; వచనం= మాటను; అబ్రవీత్ =చెప్పెను.

పాపముగలిగించుకార్యములనే చేయఁగోరుస్వభావముగలయామంధర,

కోపంబున నెఱ్ఱగా నుండుముఖంబు మెఱగియొప్పచుఁ, బరుండియున్న కైకేయి దలగు నవయవంబులుగల్గుటం జేసి, దహింపఁబడుచున్నదోయని యెన్నందగియొప్పచుఁ, బరుండియున్న కైకేయి కడకుఁబోయి, యాకైకేయింజూచియిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

ఉత్తిష్ఠ మూఢే కిం శేషే భయం త్వా మభివర్తతే
ఉపప్లుత మఘౌఘేన కి మాత్మానం నబుధ్యసే. ౧౪

టీక॥ మూఢే=తెలివిలేనిదానా! ఉత్తిష్ఠ=లెమ్ము; కిం=ఎందుకు; శేషే=పరుండియున్నావు? భయం=వెఱపు; త్వాం=నిన్నుఁగూర్చి; అభివర్తతే=వచ్చుచున్నది. అఘౌఘేన=దుఃఖములసమూహముచేత; ఉపప్లుతం=కొట్టఁబడిన; ఆత్మానం=నిన్ను; కిం=ఎందువలన; నబుధ్యసే=తెలిసికొనవు?

తెలివిలేనిదానా! లెమ్ము; ఏలపరుండియున్నావు? నీకిప్పుడు గొప్పభయంబు రాఁబోవుచున్నది; నీకింకఁ బెక్కుదుఃఖంబులు కలుగఁబోవుటను దెలిసికొనక యేలయూరకున్నావు?

అని, తాత్పర్యము.



అనిష్టే సుభగాకారే సౌభాగ్యేన వికత్థసే
చలం హి తవ సౌభాగ్యం నద్యాః స్రోత ఇవోష్ణగే. ౧౫

టీక॥ అనిష్టే = పెనిమిటికిఁ బ్రియురాలవు కానిదానవును; సుభగాకారే= భాగ్యంబుగలిగినట్లుండు నాకారముగల దానవునగు కైకేయీ! సౌభాగ్యేన= భాగ్యముగలుగుటచేత; వికత్థసే=పొగడుకొనుచున్నావు. తవ=నీయొక్క; సౌభాగ్యం= భాగ్యముగలిగియుండుట; ఉష్ణగే=ఎండకాలమునందు; నద్యాః=ఏటియొక్క; స్రోత ఇవ=ప్రవాహమువలె; చలంహి=కదలునదిగదా! నశింపఁబోవుచున్నదిగదాయనుట.

నీవు యథార్థంబుగా నీ పెనిమిటికి ప్రియవు; పైకి భాగ్యంబుగల దానిభంగి నగపడుచున్నావు; మఱియు, "నాకే భాగ్యంబుగలదు" అనినిన్ను నీవె పొగడుకొనుచుంటివి; ఇప్పుడు, ఎండకాలమునందు, ఏటిప్రవాహముంబోలె, నీభాగ్యంబంతయు, నాశమునొందఁబోవుచున్నది. అని, మంథర కైకేయితోఁ జెప్పినది. అని, తాత్పర్యము.

ఏవ ముక్తా తు కైకేయీ రుష్టయా పరుషం వచః
కుబ్జయా పాపదర్శిన్యా విషాద మగమ త్పరమ్. ౧౬

టీక॥ కైకేయీతు=కైకేయియును; రుష్టయా=కోపించునదియును; పాపదర్శిన్యా = పాపముగలిగించు కార్యములనే చూచుచున్నదియునగు; కుబ్జయా=గూనిదైనమంథరచేత; ఏవం=ఇట్లు; పరుషం=కఠినమయిన; వచః=మాటను; ఉక్తా=చెప్పఁబడినదై; పరం=అధికమయిన; విషాదం=దుఃఖమును; అగమత్=పొందెను.

కైకేయి, యిట్లు కోపంబునొందినదియుఁ బాపంబులనె చేయఁగోరు స్వభావంబుగలదియునగు మంథర చెప్పిన పరుషంబగు మాటను విని, యధికమయిన దుఃఖంబునొందెను. అని, తాత్పర్యము.

కైకేయీ త్వ బ్రవీ త్కుబ్జాం కచ్చి త్క్షేమం న మంథరే
విషణ్ణవదనాం హి త్వాం లక్షయే భృశదుఃఖితామ్. ౧౭

టీక॥ "మంథరే=మంథరా! మే(అధ్యాహృతము)=నాకు; క్షేమం = మేలు; నకచ్చిత్=లేదా యేమి? త్వాం=నిన్ను; విషణ్ణవదనాం=దుఃఖమునొందిన ముఖముగలదానిఁగాను ; భృశదుఃఖితాం=మిక్కిలియును దుఃఖమునొందిన




దానిఁగాను; లక్షయేహి= చూచుచున్నానుగదా!" ఇతి ( అధ్యాహృతము)= అని;" కైకేయీతు=కైకేయియు;కుబ్జాం=గూనిదైన మంధరనుగూర్చి;అబ్రవీత్ =పలికెను.

"మంధరా! నాకు క్షేమంబులేదా యేమి? నీమొగంబునదుఃఖచిహ్నంబులగుపడుటచే, నీవుమిగులదుఃఖమునొందినావని తలంచుచున్నాను" అనికైకేయి గూనిదైనమంధరతోఁజెప్పెను.

అని తాత్పర్యము.

మంధరా తు వచశ్శ్రుత్వా కైకేయ్యా మధురాక్షరమ్
ఉవాచ క్రోధసంయుక్తా వాక్యం వాక్యవిశారదా. ౧౮

టీక॥ వాక్యవిశారదా = మాటలయందుఁబండితురాలును;క్రోధసంయుక్తా= కోపముతోఁగూడినదియునగు ; మంధరా=మంధర;కైకేయ్యాః =కైకేయియొక్క; మధురాక్షరం=మనోహరంబులైనయక్షరంబులుగల;వచః=మాటను;శ్రుత్వాతు=వినినంతనె;వాక్యం=మాటను;ఉవాచ=చెప్పెను.

ఎప్పటికేదగునట్లప్పటికిమాటలు చెప్ప సమర్థురాలగుమంధర, కోపంబునొందినదై మధురంబగు కైకేయిమాటనువిని, యాకైకేయింబూచి, యిట్లని చెప్పెను. అని తాత్పర్యము.

సా విషణ్ణతరా భూత్వా కుబ్జా తస్యా హితైషిణీ
విషాదయంతీ ప్రోవాచ భేదయంతీ చ రాఘవమ్. ౧౯

టీక॥తస్యాః=ఆకైకేయియొక్క; హితైషిణీ= మేలుకోరునట్టి;సా=ఆ; కుబ్జా=గూనిదైనమంధర;విషణ్ణతరా= మునుపటికన్నను దుఃఖము నొందినది ; భూత్వా=అయి;విషాదయంతీ = దుఃఖించునట్లుచేయునదియై; రాఘవం= రాముని; భేదయంతీచ= వేఱుపఱచునదియయ్యెను; ప్రోవాచ= పలికెను.

అట్లుకైకేయి మేలుకోరునట్టి యీ మంధర, మునుపటికన్నను అధికముగా దుఃఖమునొంది, కైకేయికి, దుఃఖము గలిగించుటకు , రామునిపైవిరోధముగలిగించుటకును, ఇట్లని, చెప్పెను.

అని తాత్పర్యము.




అక్షయ్యం సుమహ ద్దేవి ప్రవృత్తం త్వద్వినాశనమ్

టీక॥ దీవి=రాణీ! అక్షయ్యం= నాశము లేనిదియును ప్రతిక్రియ లేనిదియును; సుమహత్= మిక్కిలియు గొప్పదియునగు; త్వద్వినాశనం= నీయొక్క చెఱుపుట; ప్రవృత్తం=నడచినది.

రాణివగు కైకేయీ! ప్రతిక్రియలేనట్లుగా సమూలముగా, నిన్నుఁ జెఱచుటకై యత్నము చేయఁబడినది.

అని తాత్పర్యము.

రామం దశరథో రాజా యౌవరాజ్యే భిషేక్ష్యతి. ౨౦

టీక॥ రాజా=రాజయిన; దశరథః= దశరథుఁడు; రామం= రాముని; యౌవరాజ్యే = యువరాజు దొరతనమునందు; అభిషేక్ష్యతి= అభిషేకింపఁబోవుచున్నాఁడు.

దశరథమహారాజు, రామునికి యౌవరాజ్యంబునఁ, బట్టాభిషేకము సేయఁబోవుచున్నాఁడు. అని తాత్పర్యము.

సా స్మ్య గాధే భయే మగ్నా దుఃఖశోకసమన్వితా
దహ్యమానా నలే నేవ త్వద్ధితార్థ మిహా గతా. ౨౧

టీక॥ సా=అట్టి, నీకు మేలు సేయఁగోరునట్టియనుట; అహం (అధ్యాహృతము)= నేను; అగాధే= మిక్కిలిలోఁతుగల, మిక్కిలియధికమయినయనుట; భయే=భయమునందు; మగ్నా=మునింగినదాననై; దుఃఖశోకసమన్వితా = మనోవ్యథతోను ఏడ్పుతోను గూడినదాననై; అనలేన=నిప్పుచేత; దహ్యమానేవ(స్థితా)=కాల్పఁబడుచున్నట్లున్నదాననై; త్వద్ధితార్థం=నీమేలుకొఱకు; ఇహ=ఇచ్చటికి; ఆగతా=వచ్చినదానను; అస్మి=అగుచున్నాను.

నేనెల్లప్పుడును నీమేలుఁ గోరుదానను గావున, నిట్లుజరగఁబోవుటను విన్నంతనే మహాభయంబునొంది, యతిదుఃఖంబునం జేసి రోదనంబు సేయుచు, నిప్పుచే దహింపఁబడుచున్నట్లు బాధపడుచు, నీకిప్పుడు రాఁబోవు కీడుఁబోఁగొట్టుటకై యిచ్చటికి వచ్చితిని.

అని తాత్పర్యము.

తవ దుఃఖేన కైకేయి మమ దుఃఖం మహ ద్భవేత్

త్వద్వృద్ధౌ మమ వృద్ధిశ్చ భవేదత్ర న సంశయః. ౨౨

టీక॥ కైకేయి=కైకేయీ! తవ=నీయొక్క; దుఃఖేన=దుఃఖముచేత; మమ=నాకు; మహత్=అధికమయిన; దుఃఖం=దుఃఖము; భవేత్=కలుగును; త్వద్వృద్ధౌ=నీకభ్యుదయముకాఁగా; మమ=నాకును; వృద్ధిః=అభ్యుదయము; భవేత్=కలుగును. అత్ర=ఈవిషయమునందు; సంశయః=సందేహము; న=లేదు.

కైకేయీ! నీకుదుఃఖముగలిగినచో నాకునుదుఃఖంబుగలుగును; నీకుమేలుకలుగునేని, నాకునుమేలుకలుగును; యీ విషయంబునందు సందేహంబులేదు. అని తాత్పర్యము.

నరాధిపకులే జాతా మహిషీ త్వం మహీపతేః
ఉగ్రత్వం రాజధర్మాణాం కథం దేవి నబుధ్యసే. ౨౩

టీక॥ దేవి=రాణివగుకైకేయీ! త్వం=నీవు; నరాధిపకులే=మనుష్యులకుఁబ్రభువులయినవారి వంశమునందు; జాతా=పుట్టినదానవు; మహీపతేః=భూమికిఁ బ్రభువైన దశరథునకు; మహిషీ=ఉత్తమభార్యవు; రాజధర్మాణాం=రాచకార్యములయొక్క; ఉగ్రత్వం=క్రౌర్యమును; కథం=ఎట్లు; నబుధ్యసే=ఎఱుఁగవు.

రాణివగుకైకేయీ! నీవురాజులగు వారివంశంబునంబుట్టితివి; మహారాజుండగు దశరథునకుత్తమ భార్యవుగానున్నావు; అయినను, రాజులనడతలు క్రూరంబులనుట నీకేల తెలియదు? ఇదిచిత్రముగానున్నది. అని తాత్పర్యము.

ధర్మవాదీ శఠో భర్తా శ్లక్ష్ణవాదీ చ దారుణః
శుద్ధభావేన జానీషే తేనైవ మతిసంధితా. ౨౪

టీక॥ భర్తా=పెనిమిటియగుదశరథుండు; ధర్మవాదీ=ధర్మములఁజెప్పువాఁడు; (యథార్థముగా) శఠః=రహస్యముగాఁ జెఱుపుసేయువాఁడు. శ్లక్ష్ణవాదీ=మధురముగామాటలాడువాఁడు; (యథార్థముగా) దారుణశ్చ=క్రూరుండును. త్వం(అధ్యాహృతము)=నీవు; శుద్ధభావేన=కపటములేని




మనసు చే; జానీషే = తెలిసికొనుచున్నావు. తేన = ఆదశరథునిచేత; ఏవం = ఇట్లు; అతిసంధితా = మోసపుచ్చఁబడితివి.

నీ పెనిమిటియగు దశరథుండు, నోటధర్మంబులం జెప్పుచుండును, స్వభావంబున, రహస్యముగాఁ గీడు సేయువాఁడు; పైకిబహుప్రియంబుగా మాటలాడును, స్వభావంబునబహుక్రూరుండు; నీవు కపటములేనిదానవు, కావున, నతండ భినయించువానిని సత్యంబుగా నమ్ముచున్నావు; నిన్నతండట్లు మోసపుచ్చుచున్నాఁడు. అని, తాత్పర్యము.

ఉపస్థితః ప్రయుంజాన స్త్వయి సాంత్వ మనర్థకమ్
"ఉపస్థితం ప్రయుంజానః" అని పాఠాంతరము.
అర్థే నైవాద్య తే భర్తా కౌసల్యాం యోజయిష్యతి. ౨౫

టీక॥ తే = నీయొక్క; భర్తా = పెనిమిటి; ఉపస్థితః = సమీపించినవాఁడై; త్వయి = నీయందు; అనర్థకం = ప్రయోజనములేని; సాంత్వం = మంచిమాటను; ప్రయుంజానః = ప్రయోగించుచు; అద్య = ఇప్పుడు; అర్థేన = ప్రయోజనముతో; కౌసల్యామేవ = కౌసల్యనే; యోజయిష్యతి = కూర్పఁబోవుచున్నాఁడు.

నీ పెనిమిటియగు దశరథుండు, నీయెదుటికివచ్చినప్పుడు, ప్రయోజనంబులేని మంచిమాటలు చెప్పి, నిన్నుబ్బించుచుండి, యిప్పుడు, కౌసల్యకే గొప్పఫలంబు సమకూరునట్లు చేయఁబోవుచున్నాఁడు. అని, తాత్పర్యము.

పాఠాంతరపక్షమందు.—తే; భర్తా; త్వయి = నీయందు; ఉపస్థితం = సమీపించినదియును, ఆ కాలమునకుఁదగినదియుననుట; అనర్థకం = ప్రయోజనములేనిదియునగు; సాంత్వం = మంచిమాటను; ప్రయుంజానః = ప్రయోగించుచు; అద్య; అర్థేన; కౌసల్యామేవ; యోజయిష్యతి.

నీ పెనిమిటియగు దశరథుండు, ఆయాకాలంబునకుఁదగిన, మంచిమాటలు చెప్పి, నిన్నుబ్బించుచుండి, యిప్పుడు, కౌసల్యకు, గొప్పఫలంబుసమకూరునట్లుసేయఁబోవుచున్నాఁడు.
అని, తాత్పర్యము.

అపవాహ్య స దుష్టాత్మా భరతం తవ బంధుషు
కాల్యే స్థాపయితా రామం రాజ్యే నిహతకంటకే. ౨౬




టీక॥ దుష్టాత్మా = దుష్టబుద్ధిగల, సః=ఆదశరథుండు; తవ=నీయొక్క ; బంధుషు=బంధువులందు; భరతం=భరతుని; అపవాహ్య=పాఱఁదోలి; కాల్యే= ప్రాతఃకాలంబునందు; నిహతకంటకే = కొట్టఁబడినకష్టములు (అనగా)శత్రువులుగల; రాజ్యే= దొరతనమునందు; రామం=రామునిఁ; స్థాపయితా=ప్రతిష్ఠింపఁబోవుచున్నాఁడు.

దుష్టాత్ముండగునాదశరథుండు, నీ పుట్టింటికిభరతుంబాఱఁదోలియితండు లేనిసమయంబుచూచి, రేపుప్రాతః కాలంబున, నెంతమాత్రంబును శత్రువులు లేకుండుటం జేసి బహుసుఖప్రదంబైన రాజ్యంబునందు, రామునకుఁ , బట్టాభిషేకము సేయఁబోవుచున్నాఁడు.

అని తాత్పర్యము.

శత్రుః పతి ప్రవాదేన మాత్రేవ హితకామ్యయా
ఆశీవిష ఇవాంకేన బాలేపరి హృతస్త్వయా. ౨౮
("పరిధృతస్త్వయా" అని పాఠాంతరము.)

టీక॥బాలే=చిన్నదానా! రాఁబోవుననర్థమును దెలిసికొనలేని దానా యనుట; పతిప్రవాదేన=పెనిమిటియనుకపటముతో; యుక్తః(అధ్యాహృతము)=కూడిన; శత్రుః=శత్రువయినదశరథుఁడు; త్వయా=నీచేత; మాత్రేవ=తల్లిచేతనువలె;హితకామ్యయా=మేలుపొందనిచ్ఛచేత; ఆశీవిషఇవ=సర్పమువలె;అంకేన=తొడచేత; అపరిహృతః=విడువఁబడఁడయ్యె, ధరింపఁబడెననుట. (పాఠాంతరపక్షమందు) అంకేన=తొడచేత; పరిధృతః=ధరింపఁబడినాఁడు.

ఎట్లుసర్పమును బోషించు నట్టి చిన్నది తెలివిలేక సర్పములోపల విషంబు గలదని యెఱుంగక తనకు మేలుగల్గుటకయి, యాసర్పమును తొడపయినుంచుకొని బుజ్జగించునో, అట్లునీవు,నీపెనిమిటియగుదశరథుండు,నీకుయథార్థంబుగాశత్రువుండని యెఱుంగక, ప్రియుండనితలంచి,తొడపైనుపలాలించుచున్నావు;ఎట్లు,తొడపైనానావిధంబుల నుపలాలింపఁబడుచున్న సర్పంబు, తనకుమేలుకోరుచుఁదన్నుఁ బోషించుచున్నదానిం,గఱచునో, ఆవిధంబున, నీపెనిమిటియును దన్నునమ్మియుపలాలించుచున్ననీకుఁ, గీడు సేయును; కావున,సర్పంబును విడుచునట్లు, అతని

విడువవలయును. అని, తాత్పర్యము.

యథా హి కుర్యా త్సర్పో వా శత్రు ర్వా ప్రత్యుపేక్షితః
రాజ్ఞా దశరథే నాద్య సపుత్రా త్వం తథా కృతా. ౨౮

టీక॥ సర్పోవా = పాముగాని; శత్రుర్వా = శత్రువుగాని; ప్రత్యుపేక్షితః = ఉపేక్షింపఁబడినవాఁడై; యథా = ఎట్లు; కుర్యాత్ = చేయునో ("హి" అనునది పాదపూరణార్థము); తథా = అట్లు; అద్య = ఇప్పుడు; రాజ్ఞా = రాజయిన; దశరథేన = దశరథునిచేత; సపుత్రా = కొడుకుతోఁగూడిన; త్వం = నీవు; కృతా = చేయఁబడినావు.

పాముగాని శత్రువుగాని, చంపఁబడక యుపేక్షింపఁబడునేని, యెట్లు సేయునో, అట్లే, యిప్పుడు, దశరథుఁడు, నీకు నునీకొమరునకును, జేసినాఁడు.

అని, తాత్పర్యము.

పాపే నానృతసాంత్వేన బాలే నిత్యసుఖోచితే
రామం స్థాపయ తా రాజ్యే సానుబంధా హతా హ్యసి. ౨౯

టీక॥ నిత్యసుఖోచితే = ఎల్లప్పుడు నుసుఖమునకుఁదగిన దానవు; బాలే = చిన్నదానవువగు కైకేయి! సానుబంధా = పుత్రమిత్రాదిపరివారముతోఁగూడిన; త్వం (అధ్యాహృతము) = నీవు; పాపేన = పాపముసేయువాఁడును; అనృతసాంత్వేన = దబ్బఱలయినమంచి మాటలుగలవాఁడును; రామం = రాముని; రాజ్యే = దొరతనమునందు; స్థాపయతా = ఉంచువాఁడునగు; దశరథేన (అధ్యాహృతము) = దశరథునిచేత; హతా = కొట్టఁబడినదానవు; అసిహి = అగుచున్నావుగదా!

కైకేయీ! నీవెల్లప్పుడును సుఖం బనుభవింపఁదగిన దానవు, ఏమియుం దెలియనిచిన్నదానవు; పాపుడగు నీదశరథుండు, ఇన్నినాళ్లు, దబ్బఱలయినప్రియవచనంబులచేనిన్ను మోసపుచ్చుచుండి యిప్పుడు రాముని రాజ్యంబున నభిషేకించి, నిన్నునునీకొడుకునునీ జనంబులను, జెఱుపందలంచినాఁడు.

అని తాత్పర్యము.

సా ప్రాప్తకాలం కైకేయి క్షిప్రం కురు హితం తవ

త్రాయస్వ పుత్ర మాత్మానం మాంచ విస్మయదర్శనే. ౩౦

టీక॥ విస్మయదర్శనే=ఆశ్చర్యముగ లిగించునట్టికండ్లుగల; కైకేయి=కైకేయీ! సా=అట్టి; త్వం(అధ్యాహృతము)=నీవు; ప్రాప్తకాలం=పొందఁబడినయవసరముగల; హితం= మేలును; తవ=నీకు; క్షిప్రం=శీఘ్రముగా; కురు (కురుష్వ)=చేసికొనుము; పుత్రం=కొడుకును; ఆత్మానం=నిన్నును; మాంచ=నన్నును; త్రాయస్వ = రక్షించుకొనుము.

చూపరులకాశ్చర్యంబు గలిగించునట్టి, సుందరంబులయినకండ్లుగలకైకేయీ! అట్టిదుఃఖంబునకుఁ బాత్రురాలవుకాఁబోయెదవు, కావున, నీవిప్పుడే, యిప్పటికిఁదగినట్లు, నీకు మేలుగావించుకొనుము; నిన్నును, నీకొడుకును, నన్నునురక్షించుకొనుము. అని, మంధరకైకేయికిఁజెప్పెను. అని, తాత్పర్యము.

మంధరాయా వచశ్శ్రుత్వా శయానా సా శుభాననా
ఉత్తస్థౌ హర్షసంపూర్ణా చంద్రలేఖేవ శారదీ. ౩౧

టీక॥ శుభాననా=మంగళకరంబగు ముఖంబుగలదియును; శయానా= పరుండియున్నదియునగు; సా=ఆకైక; మంధరాయాః= మంధరయొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; హర్షసంపూర్ణా=సంతోషముతో నిండినదై; శారదీ=శరదృతువునందలి; చంద్రలేఖేవ=చంద్రునిరేఖవలె; ఉత్తస్థౌ=లేచెను.

మంధర చెప్పినమాటవిని, పరుండియున్న,సుందరముఖంబుగలయాకైక, యధికముగా సంతోషమునొంది, శరత్కాలమునందలి చంద్రరేఖయుంబోలె, వెలుంగుచు, శయనంబునుండి, లేచెను.

అని, తాత్పర్యము.

అతీవ సా తు సంహృష్టా కైకేయీ విస్మయాన్వితా
ఏక మాభరణం తస్యై కుబ్జాయై ప్రదదౌ శుభమ్. ౩౨

టీక॥ సా=ఆ; కైకేయీతు=కైకేయిమాత్రము; అతీవ=మిక్కిలియును; సంహృష్టా = సంతసించినదై; విస్మయాన్వితా=ఆశ్చర్యముతోఁగూడినదై;

తస్యై=ఆ;కుబ్జాయై=గూనిదైన, మంథరకొఱకు;ఏకం=ఒకటైన; శుభం=మంగళకరంబగు;ఆభరణం= సొమ్మును;ప్రదదౌ=ఇచ్చెను.

ఆకైకేయి, మిగుల సంతోషము నొంది, యట్టిసంతోషంబాకస్మికంబు గాఁదనకుఁగల్గుటనుగుఱించి యాశ్చర్య పడుచు, నామంథరకు,ఒకమంచియాభరణమునిచ్చెను. అని, తాత్పర్యము.

దత్త్వా త్వాభరణం తస్యై కుబ్జాయై ప్రమదోత్తమా
కైకేయీ మంథరాం దృష్ట్వా పునరేవాబ్రవీదిదమ్. ౩౩

టీక॥ప్రమదోత్తమా = స్త్రీలలో శ్రేష్ఠురాలయిన;కైకేయీ=కైకేయి; తస్యై=ఆ;కుబ్జాయై=గూనిదైనమంథరకొఱకు;ఆభరణం=సొమ్మును; దత్త్వాతు=ఇచ్చినంతనే;మంథరాం=మంథరను;దృష్ట్వా=చూచి;పునరేవ=ఇంకను; ఇదం=ఈమాటను;అబ్రవీత్ = పలికెను.

స్త్రీలలోనుత్తమురాలయినయాకైకేయి, అట్లామంథరకు,ఆభరణంబిచ్చి,యంత, నామంథరంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇదంతు మంథరే మహ్య మాఖ్యాసి పరమం ప్రియమ్
ఏతన్మే ప్రియ మాఖ్యాతుః కింవా భూయః కరోమితే. ౩౪
("ప్రియమాఖ్యాతం" అనిపాఠాంతరము.)

టీక॥మంథరే=మంథరా!మహ్యం=నాకొఱకు;ఇదం=ఈ;పరమం=మిక్కిలియునధికమయిన;ప్రియం= సంతోషకరంబగుమాటను;ఆఖ్యాసి= చెప్పుచున్నావు. మే = నాకు;ఏతత్=ఈ; ప్రియం=సంతోషవార్తను ; ఆఖ్యాతుః (ఆఖ్యాత్ర్యాః)=చెప్పుచున్న; తే= నీకు;భూయః=ఇంకను;కింవా=దేనిని;కరోమి=చేయుదును? (పాఠాంతరపక్షమందు)=మే=నాకు;ఏతత్=ఈ;ప్రియం=సంతోషవార్త; ఆఖ్యాతం=చెప్పఁబడినది.భూయఃకింవాకరోమితే=ఇంకనునీకుదేనినిచేయుదును.

మంథరా! నీవునాకిట్టిపరమసంతోషంబు గలిగించువార్తఁ జెప్పుచున్నావు; ఇట్టిసంతోషవార్తఁజెప్పిన నీకు దీనికన్ననింకనేమిచేయుదును?

అనితాత్పర్యము.

రామేవా భరతేవాహం విశేషం నోపలక్షయే
తస్మాత్తుష్టాస్మి యద్రాజా రామం రాజ్యే భిషేక్ష్యతి. ౩౫

టీక॥అహం=నేను;రామేవా=రామునియందుఁగాని;భరతేవా=భరతునియందుఁగాని;విశేషం=భేదమును; నోపలక్షయే=చూడను. రాజా=దశరథమహారాజు;రామం = రాముని; రాజ్యే= దొరతనమందు;అభిషేక్ష్యతి(ఇతి)యత్(అస్తి) = అభిషేకింపఁబోవుచున్నాఁ డనునది యేదిగలదో; తస్మాత్=అందువలన; తుష్టా=సంతసించినదానను;అస్మి=అగుచున్నాను.

రాముఁడుగానిభరతుఁడుగాని,నాకిర్వురునొకటియే; నాకే భేదమునులేదు; దశరథుండు, రాజ్యంబునందు రామునకుఁబట్టాభిషేకంబు సేయింపఁబోవుచున్నాఁడనివినుటంజేసి, మిగులసంతోషించితిని.అని, తాత్పర్యము.

న మే పరం కించి దిత స్త్వయా పునః
ప్రియం ప్రియార్హే సువచం వచః పరమ్
తథా హ్యవోచ స్త్వ మతః ప్రియోత్తరం
పరం వరం తే ప్రదదామి తం వృణు. ౩౬

టీక॥ప్రియార్హే=సంతోషమునకుఁదగినమంథరా! మే= నాకొఱకు;ఇతః=దీనికన్నను; పరం=ఇతరమయినదియు;ప్రియం=సంతోషకరంబును; పరం=ఉత్కృష్టమునగు; కించిత్=ఒకానొక;వచః=మాట; త్వయా=నీచేత; పునః=మఱల;నసువచం= చెప్పనలవిగాదు.తథా=అట్లు;త్వం=నీవు; అవోచోహి=చెప్పితివిగదా!అతః=అందువలన;ప్రియోత్తరం=సంతోషముగలిగించువానిలోనుత్తమంబగు; పరం=వేఱయిన;వరం=కోరఁదగినవస్తువును;తే=నీకొఱకు; ప్రదదామి = ఇచ్చెదను. తం=దాని;వృణు(వృణీష్వ)= కోరుకొనుము.

మంథరా! నీవుసంతోషమునకుఁదగినదానవు; ఈరామాభిషేక వార్తకన్నను, ఇతరమయినయింతటిప్రియవార్తనునాకింకనీవుచెప్పలేవు;అట్టి, ప్రియవార్తనునీవిప్పుడుచెప్పితివిగావున, నీ

కు, అన్నిటికన్న నెచ్చుగా, సంతోషంబు గలిగించువస్తువునిచ్చెదను; దానిఁగోరుకొనుము. అని, కైకేయి, మంథరకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, సప్తమ స్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ సప్తమసర్గ టీక, ముగిసినది.



శ్రీ.

అష్టమసర్గప్రారంభః.

మంథరా త్వభ్యసూయైనా ముత్సృజ్యా భరణం చ తత్
ఉవాచేదం తతో వాక్యం కోపదుఃఖసమన్వితా. ౧

టీ॥ మంథరాతు= మంథరమాత్రము; ఏనాం=ఈకైకనుగూర్చి; అభ్యసూయ=అసూయచేసి; తత్=ఆ; ఆభరణంచ=సొమ్మును; ఉత్సృజ్య=విసర్జించి; తతః=అటుపిమ్మట; కోపదుఃఖసమన్వితా=కోపముతోను దుఃఖముతోనుగూడినదై; ఇదం=ఈ; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

ఇట్లుచెప్పిన కైకేయిమీఁద, మంథర, యెంత మేలుబోధించినను వినలేదని, యసూయనొంది, యదియిచ్చిన యాభరణమునువిసర్జించి, తానుహితము చెప్పఁగావినలేదనికోపమునుఅనర్థము రాఁబోవుచున్నదనిదుఃఖమునుం బొంది, కైకేయింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

హర్షం కిమిద మస్థానే కృతవత్యసి బాలిశే
శోకసాగరమధ్యస్థ మాత్మానం నావ బుధ్యసే. ౨

టీక॥ బాలిశే=మూఢురాలా! అస్థానే=అకాలమునందు; హర్షం=సంతోషమును; కృతవతీ = చేసినదానవు; అసి=అగుచున్నావు. ఇదం = ఇది; కిం=ఏమి? శోకసాగరమధ్యస్థం= దుఃఖమనెడుసముద్రమునడుమనున్న; ఆత్మానం=నిన్ను; నావబుధ్యసే= తెలిసికొనకున్నావు.

మూఢురాలా! దుఃఖముఁబొందవలసినకాలమునందు సంతోషమునొందుచున్నావేమి? నీకిప్పుడు సముద్రమువంటి దుఃఖమువచ్చుటకు సిద్ధముగా నుండఁగా, దానినెఱుంగకున్నావు.

అని, తాత్పర్యము.

మనసా ప్రహసామి త్వం దేవి దుఃఖార్దితా సతీ
యచ్ఛోచితవ్యే హృష్టాసి ప్రాప్యేదం వ్యసనం మహత్. ౩

టీక॥ దేవి=రాణీ! ఇదం=ఈ; మహత్=గొప్పదగు; వ్యసనం=దుఃఖమును; ప్రాప్య=పొంది; శోచితవ్యే=దుఃఖింపవలసియుండఁగా; యత్=ఏకారణమువలన; హృష్టా = సంతసించినదానవు; అసి=అగుచున్నావో; తతః (అధ్యాహృతము)=అందువలన; అహం(అధ్యాహృతము)=నేను; దుఃఖార్దితా సతీ=దుఃఖముచేఁ బీడింపఁ బడినదాననై; త్వం=నిన్నుగూర్చి; మనసా=మనసుచేత; ప్రహసామి=నవ్వుచున్నాను.

రాణివగుకైకేయీ! ఇట్టిగొప్పదుఃఖమునుబొందియును దుఃఖింప వలసియుండఁగా, నీవుసంతోషించుచున్నావు, కావున, నిట్టినిన్నుఁజూడఁగా, నాకు, మనంబున, నవ్వువచ్చుచున్నది.

అని, తాత్పర్యము.

శోచామి దుర్మతిత్వం తే కాహి ప్రాజ్ఞా ప్రహర్షయేత్
అరేస్సపత్నీ పుత్రస్య వృద్ధిం మృత్యోరివాగతామ్. ౪

టీక ॥ తే=నీయొక్క; దుర్మతిత్వం=దుష్టవిషయమయినబుద్ధిగలుగుటనుగుఱించి; శోచామి= దుఃఖించుచున్నాను. మృత్యోరివ(స్థితస్య)=మృత్యువుఁబోలెనున్నట్టి; అరేః=శత్రువయిన; సపత్నీపుత్రస్య=చవతికొడుకునకు; ఆగతాం=వచ్చిన; వృద్ధిం=అభ్యుదయమును; ప్రాజ్ఞా=పండితురాలగు; కా

స ౮




హి=ఎవ్వతె; ప్రహర్షయేత్= సంతోషముగాఁజేసికొనును?

నీకిట్టిదుర్బుద్ధిగలుగుటఁ జూడఁగా నాకుదుఃఖముగలుగుచున్నది; మృత్యువంటిశత్రువయిన చవతికొడుకునకు వృద్ధిగలుగుటవలనఁ, దెలివిగలిగినస్త్రీ యెవ్వతెసంతోషించును.

అని, తాత్పర్యము.

భరతాదేవ రామస్య రాజ్యసాధారణాద్భయమ్
తద్విచింత్య విషణ్ణాస్మి భయం భీతాద్ధి జాయతే. ౫

టీక॥ రామస్య=రామునకు; రాజ్యసాధారణాత్= దొరతనముసమానముగాఁగల; భరతాదేవ=భరతునివలననే; భయం=వెఱపు. తత్=దాని; విచింత్య=ఆలోచించి; విషణ్ణా=దుఃఖముగలదానను; అస్మి=అగుచున్నాను. భయం=భయము; భీతాత్=భయపడినవానివలన; జాయతేహి=పుట్టుచున్నది గదా!

భరతునకుమాత్రమే రామునితో సమానముగా రాజ్యముఁ బొందుటకుం దగినయధికారంబున్నది; కావున, రామునకుభరతునివలన మాత్రమేభయంబుగలుగును; ఎవ్వఁడెవ్వనివలనభయపడునో, అతనికివానివలన భయంబవశ్యముమనుష్యులవలనభయపడుసర్పాదులవలనమనుష్యులకుఁగల్గునట్లు, సంభవించును; కాఁబట్టి, భరతునివలనరామునకు భయంబుగల్గుటనుగుఱించియాలోచింపఁగా, నాకుమిక్కిలియుదుఃఖంబగుచున్నది. అని, తాత్పర్యము.

లక్ష్మణోహి మహేష్వాసో రామం సర్వాత్మనా గతః
శత్రుఘ్నశ్చాపి భరతం కాకుత్స్థం లక్ష్మణో యథా. ౬

టీ॥ మహేష్వాసః=గొప్పవిల్లుగల, మిక్కిలియుఁబరాక్రమశాలియగుననుట; లక్ష్మణః=లక్ష్మణుండు; రామం=రామునిఁ; సర్వాత్మనా=సర్వప్రయత్నముచేతను; గతోహి=పొందినాఁడుగదా! శత్రుఘ్నశ్చాపి=శత్రుఘ్నుఁడును; కాకుత్స్థం=రాముని; లక్ష్మణోయథా=లక్ష్మణుండువలె; భరతం= భరతుని; సర్వాత్మనా(అధ్యాహృతము)=సర్వప్రయత్నముచేతను; గతః (అధ్యాహృత




ము)=పొందినాఁడు.

లక్ష్మణశత్రుఘ్నులును, రాజ్యముఁ బొందుట కధికారము గలవారలయ్యును, మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండుమనోవాక్కాయకర్మణంబులరాముని నాశ్రయించియున్నాఁడు; అట్లుశత్రుఘ్నుండు, లక్ష్మణుండు రాము నాశ్రయించినట్లు, భరతునాశ్రయించినాఁడు; కావున, వారలు రామభరతులప్రాపుననుందురే కాని, స్వతంత్రముగా రాజ్యంబున పేక్షింపరు; అందువలన రామునకులక్ష్మణునివలనను భరతునకుశత్రుఘ్నునివలనను భయంబుగలుగదు.

అని, తాత్పర్యము.

ప్రత్యాసన్నక్రమే ణాపి భరత స్యైవ భామిని
రాజ్యక్రమో విప్రకృష్ట స్తయో స్తావ త్కనీయసోః. ౭

టీక॥ భామిని=స్త్రీవగు కైకేయీ! ప్రత్యాసన్నక్రమేణాపి= జన్మమునం దుఁగలిగిన, సామీప్యముయొక్క వరుస చేతనుగూడ; భరతస్యైవ = భరతునకే; రాజ్యక్రమః = రాజ్యప్రాప్తియొక్క వరుస; సన్నిహితః (అధ్యాహృతము)=సమీపించినది. కనీయసోః= చిన్నవాండ్రయిన ; తయోస్తావత్=లక్ష్మణశత్రుఘ్నులకుమాత్రము; విప్రకృష్టః=దూరముగానున్నది.

కైకేయీ! జన్మక్రమముచేతను గూడ, భరతుండులక్ష్మణశత్రుఘ్నుల కన్ననుముందుపుట్టినవాఁడు కావున, భరతునికే, రాజ్యప్రాప్తియందధికారము, సన్నిహితముగానున్నది ; లక్ష్మణశత్రుఘ్నులుభరతుని కన్నను వెనుకఁబుట్టినవాండ్రుకావున, వారలకు, రాజ్యప్రాప్తియందధికారము సన్నిహితము గాదు; అట్లగుటం జేసి, రామునికివెనుక భరతుండె రాజ్యాధికారి, కావున, రామువలనభరతునకెభయముగలుగును.

అని, తాత్పర్యము.

విదుషః క్షత్రచారిత్రే ప్రాజ్ఞస్య ప్రాప్తకారిణః
భయాత్ప్రవేపే రామస్య చింతయంతీ తవాత్మజమ్. ౮

టీక॥ విదుషః=బుద్ధిశాలియును; క్షత్రచారిత్రే=రాజనీతియందు; ప్రాజ్ఞస్య=పండితుండును; ప్రాప్తకారిణః=పొందఁబడినదానిఁ జేయువాఁడునగు;

రామస్య=(పంచమ్యర్థమందు షష్ఠి) రామునివలన;భయాత్ = భయమువలన;తవ=నీయొక్క;ఆత్మజం= కొడుకైనభరతునిఁ చింతయంతీ= తలంచుచు; ప్రవేపే=వడంకుచున్నాను.

రాముండు, బుద్ధిశాలి, రాజనీతిచక్కఁగాఁదెలిసినవాఁడు, ఏకాలంబున దీనిఁజేయవలయునో దానిందప్పకయప్పుడెచేయనేర్చినవాఁడు; నీకొడుకుభరతుండట్టి సమర్థుఁడుకాఁడు; కావున, రామునివలననీకొడుకునకుభయంబుగలుగునని కొడుకుం దలంచుకొనునప్పుడెల్ల, మిక్కిలియు భయమునొందుచున్నాను.అని, తాత్పర్యము.

సుభగా ఖలు కౌసల్యా యస్యాః పుత్రోఽభిషేక్ష్యతే
యౌవరాజ్యేన మహతా శ్వః పుష్యేణ ద్విజోత్తమైః. ౯

టీక॥యస్యాః=ఎవ్వతెయొక్క;పుత్రః=కొడుకు;శ్వః=రేపు;పుష్యే=పుష్యనక్షత్రమునందు;ద్విజోత్తమైః=బ్రాహ్మణశ్రేష్ఠులచేత;మహతా= గొప్పదగు;యౌవరాజ్యేన= యువరాజుదొరతనముచేత; అభిషేక్ష్యతే=అభిషేకింపఁబడఁగలఁడో; సా (అధ్యాహృతము)=ఆ;కౌసల్యా = కౌసల్య; సుభగాఖలు= మంచిభాగ్యముగలదిగదా!

కౌసల్యకొడుకునకు,పుష్యనక్షత్రంబున,బ్రాహ్మణోత్తములు, పూజ్యంబగుయౌవరాజ్యంబునఁ,బట్టాభిషేకముసేయఁబోవుచున్నారు;కావున, నాకౌసల్య,మహాభాగ్యముగలదిగదా!

అని, తాత్పర్యము.

ప్రాప్తాం సుమహతీం ప్రీతిం ప్రతీతాం తాం హతద్విషమ్
ఉపస్థాస్యసి కౌసల్యాం దాసీవ త్వం కృతాంజలిః. ౧౦

టీక॥సుమహతీం=మిక్కిలియు గొప్పదియగు;ప్రీతిం=సంతోషమును;ప్రాప్తాం=పొందినదియును;ప్రతీతాం=ప్రసిద్ధినొందినదియును; హతద్విషం=కొట్టఁబడిన శత్రువులు గలదియునగు ; తాం=ఆ; కౌసల్యాం = కౌసల్యను; త్వం=నీవు; దాసీవత్=పనికత్తెవలె ; కృతాంజలిః=చేయఁబడినచేమోడ్పు గలదానవై;ఉపస్థాస్యసి= సేవింపఁగలవు.

అట్లుతనకొడుకు రాముండుపట్టాభిషిక్తుండగుటం జేసి, మహాసంతోషంబునొందిలోకంబునందుఁ బ్రసిద్ధమైెచవతులు మొదలగుశత్రువులనడంగంద్రొక్కి వైభవంబునంగెలంగుచుండు కౌసల్యకు,నీవు,దాసియట్లచేతులు మొగిడ్చికొని, సేవసేయవలసియున్నది.

అని, తాత్పర్యము.

ఏవంచే త్త్వం సహాస్మాభి స్తస్యాః ప్రేష్యా భవిష్యసి
పుత్రశ్చ తవ రామస్య ప్రేష్యభావం గమిష్యతి. ౧౧

టీక॥ఏవంచేత్=ఇట్లగునేని;త్వం=నీవు; అస్మాభిస్సహ=మాతోఁగూడ; తస్యాః=ఆకౌసల్యకు;ప్రేష్యా=భృత్యురాలవు; భవిష్యసి=కాఁగలవు.తవ=నీయొక్క;పుత్రశ్చ=కొడుకయిన భరతుండును;రామస్య=రామునకు;ప్రేష్యభావం=భృత్యుండగుటను;గమిష్యతి=పొందఁగలఁడు.

ఇట్లు రాముండుపట్టాభిషిక్తుం డగునేని,నీవును మేమును,ఆకౌసల్యకు, భృత్యల మగుదుము; నీకొడుకు భరతుండును, రామునకుభృత్యుండగును.

అని, తాత్పర్యము.

హృష్టాః ఖలు భవిష్యంతి రామస్య పరమాః స్త్రియః
అప్రహృష్టా భవిష్యంతి స్నుషా స్తే భరతక్షయే. ౧౨

టీక॥ రామస్య=రామునియొక్క; పరమాః = ఉత్తమలయిన ; స్త్రియః=స్త్రీలు; హృష్టాః=సంతసించినవారలు;భవిష్యంతిఖలు= కాఁగలరుకదా! తే=నీయొక్క; స్నుషాః=కోడండ్రు;భరతక్షయే = భరతునిగృహమునందు; లేక, భరతునినాశముకలుగఁగా, భరతునకుదారిద్ర్యముకలుగఁగానను; అప్రహృష్టాః=సంతోషములేనివారలు;భవిష్యంతి=కాఁగలరు.

అట్లు, రాముండుపట్టాభిషిక్తుండగునేనియుత్తమలగు రామునిస్త్రీలందఱు,నానందంబునొంది,యుందురు;భరతుండుదరిద్రుండగును,గావున,భరతునిభార్యలందఱు,సంతోషములేక,యుందురు.అని,మంథరచెప్పినది.అని, తాత్పర్యము.

విచారము.— "రామస్యపరమాః స్త్రియః" అనుచోటనుండు,"స్త్రియః",

అనుశబ్దమునకు, "స్నుషాః"అనుదాని సాహచర్యంబువలన, భార్యలనియేయర్థము.

ఇట్లు,రామునకుబహుభార్యలుండిరని యేర్పడు చున్నది. కావున నేసుందర కాండంబున, "పితుర్నిదేశం సమయే న కృత్వా వనాన్నివృత్త శ్చరిత వ్రతశ్చ, స్త్రీభిశ్చనున్యేవిపులేక్షణాభి స్త్వం రంస్యసేవీత భయఃకృతార్థః" (నీవు, తండ్రిపనుపును, జతుర్దశవత్సరంబులంజేసి,వ్రతంబుముగించుకొని,వనంబు నుండివెడలి, భయంబులేనివాఁడవై,కృతార్థుండవై,విశాలంబులగు కండ్లుగల స్త్రీలతోఁగ్రీడింపఁగలవు). అని, సీతచే, రామునిగూర్చిచెప్పఁబడినది; అట్లు,యుద్ధకాండంబున, దర్భశయన వర్ణనంబునందు, "భుజైఃపరమనారీణామభిమృష్టమనేకదా" (ఉత్తమస్త్రీలభుజములచేబహువిధంబులఁదడవంబడినవి, అనఁగా,కౌఁగిలింపఁబడినది)అని, రాముని దక్షిణబాహువునకు, విశేషణముగాఁజెప్పఁబడినది. భార్యలు గానివారలు, తమభుజంబులచే బరుషునిభుజంబునుగౌఁగిలింపరుగదా! ఉత్తరకాండంబున"మాతరశ్చైవసర్వామేకుమారాస్త్రీస్సగణానిచ, అగ్రతో భరతం కృత్వా గచ్ఛంత్వగ్రే సమాధినా" (నాతల్లులందఱును,కొడుకులును స్త్రీసమూహంబులును, భరతుని ముందిడికొని,జాగ్రత్తగా, ముందుపోదురు గాక)అని,రామునిచేఁజెప్పఁబడినది.ఇచ్చటను,సీతకన్ననితరభార్యలు లేకున్నచో, నాకొడుకులనుటయు, నాస్త్రీసమూహంబులనుటయు, సంగతముకానేరదు. మఱియు, సీతయరణ్యమునకుఁబంపఁబడియుండఁగా, నితరభార్యలులేనిచో, రామున కశ్వమేధయాగము సేయుటయందే యధికారముండియుండదు; అట్లు రాముండశ్వమేధయాగంబు సేసినట్లగపడుటంజేసి, యర్థాపత్తియను ప్రమాణంబుచేతనుంగూడ, రామునకితరభార్యలుండినట్లుసిద్ధంబగుచున్నది. సీతయందలిస్నేహబహుమానంబులవలననె, అశ్వమేధయాగమునందు, సీతాప్రతిమకల్పింపఁబడినది;కాని, దానివలన, నధికారసంపత్తిగలుగదు. ఇతరరాజులకుండునట్లుభోగమునకు మాత్రముపయోగించుభార్యలులేకుండుటవలన రామునకేకదారవ్రతంబు సంగతంబగుచున్నది; సీతయందధికప్రేమగలుగుటవలన, సీతావియోగదుఃఖంబెచ్చుగా ననుభవిం

చుటంజేసి, భృగుశాపపాలనంబును,గ లుగుచున్నది. అనికొందఱు, చెప్పుచు న్నారు.

రాముం డేకపత్నీవ్రతంబుగలవాఁ డనుటసర్వసిద్ధము; ఇతరభార్యలుండు లేని,యదిసంభవింపదు.సీతాప్రతిమచే తనే, యాగాధికారముగల్గుటంజేసి, యశ్వమేధము సేయుట కనుపపత్తియు లేదు.అట్లు,ఉత్తరకాండంబున"కాంచ నీంమమపత్నీంచ దీక్షాహేఁ యజ్ఞక ర్మణి,అగ్రతోభరతఃకృత్వా గచ్ఛత్వ గ్రేమహామతిః" (బంగారముతోఁ జే యఁబడినదియును,యాగమునందుదీక్ష కుయోగ్యయునగు,ప్రతిమారూప య యిననాభార్యను,మహాబుద్ధిశాలియగు భరతుండుమున్నిడుకొని ముందుపోవుఁ గాక)అని,భార్యాప్రతిమ, దీక్షార్హ్యమ నిచెప్పఁబడినది;మఱియు"నసీతాయాః పరంభార్యాంవవ్రేసరఘునందనః, య జ్ఞేయజ్ఞేచపత్న్యర్థేఁకాంచనీ జానకీ భవత్" రాముండు,సీతకన్నను మఱి యొకభార్యనుబెండ్లాడలేదు;ప్రతియా గంబునందును,అతనికి , భార్యార్థేఁ బు,సీతాప్రతిమ,బంగారుతోఁ జేయఁబ డియుండినది.)అని,యితరభార్యలులేన ట్లును, కాంచనమయంబగు సీతాప్రతిమచేత నేయాగదీక్షవహించినట్లును, జెప్పఁబడినది"భార్యలేక నెయాగము సే యుటకధికారములేదు,భార్యాప్రతిమ చేఁజేయుసట్లువిధిలేదు,రాముఁడుయా గముచేసియున్నాఁడు,కావునరాముని కుసీతకన్ననితరభార్యలుండిరి" అను న ర్థాపత్తి, "రాముండుసీత కన్ననిత రభార్యనుబెండ్లాడలేదు, అతఁడుయా గంబు సేయునప్పుడెల్ల, యాగాధికార సిద్ధ్యర్థేఁము, కాంచనమయంబగు సీ తాప్రతిమనే యుంచుకొనుచుండెను" అనునర్థేఁము దెల్పు విరుద్ధవచనముండు నపుడు,ప్రవర్తిఁంపదు.మఱియు, "భా ర్యసమీపంబున లేనప్పుడు, రాముండు కాంచనమయంబగుభార్యాప్రతిమను , బత్న్యర్థముంచుకొని, యాగముచేసె ను,అనిదెల్పుచుండు, ప్రత్యక్షశ్రుతి వి రుద్ధములుకాని"కాంచనీంధమఁపత్నీం చ"అనునదిమొదలగు వచనములచేత, భార్య, సమీపంబున లేనప్పుడుగాని, యాగంబున కనుకూల గాకుండునప్పు డు , భార్యాప్రతిమను బత్నీస్థానంబు ననుంచుకొని,యెవ్వఁడేని, శ్రౌతస్మార్త కర్మఁంబులఁ జేయునది" అను , వి ధియనుమానింపఁబడుచున్నది. అట్లు, "దూరభార్యోననుకూలభార్యశ్చదర్భ పుంజీశైర్భార్యా ప్రతినిధింవిధాయ పార్వణంకుర్యాత్" (దూరంబునభా

ర్యగలవాఁడుకాని యనుకూలగానిభార్యగలవాఁడుగాని, దర్భలచేత భార్యాప్రతిమంజేసి, పార్వణంబుసేయునది) అని, హేమాద్రియందు,స్మృతియనున్నది. అప్పుడు, భార్యసమర్థగానియప్పుడుసేయునట్లు, పత్నిచేయవలసినకర్మంబుల, యజమానుండుగానియధ్వర్యుండుగాని చేయునది. పత్నిమృతినొందలేదుకావున నగ్నినశింపలేదు. దోషంబుచేవిడువఁబడిన భార్యయందుస్నేహ బహుమానంబులుంచుటయు నిందనీయంబయగుటం జేసి, "స్నేహ బహుమానార్థముగా, సీతాప్రతిమకల్పింపఁబడినది" అనిచెప్పుటసరికాదు. "మాతరశ్చైవసర్వామేకుమారాస్త్రీగణానిచ" అనుచోట, మేమాతరస్సర్వాశ్చైవ=నాతల్లులందఱును; కుమారాః=కొడుకులు, భరతాదులకొడుకులనుట; స్త్రీగణానిచ = స్త్రీసమూహంబులును, భరతాదులస్త్రీసమూహంబులనుట. "మే" (నాయొక్క) యనునది, "మాతరః" అనుదానితోమాత్రమెయన్వయించును, ఇట్లర్థముచేయనప్పుడు, "రామునకితరభార్యలున్నా"రని యెంతమాత్రముసిద్ధింపదు. అట్లు "రామస్య పరమాస్త్రియః, పరమనారీణాం, స్త్రీభిశ్చమన్యే" ఇత్యాదిస్థలంబులందు, "స్త్రియః, నారీణాం, స్త్రీభిః" అనుశబ్దములకు, వేఱర్థములనూహించుకొనునది. "రామస్యపరమాస్త్రియః" అనుచోట, పరిచారికాదులని యర్థము. "పరమనారీణాం" అనునదికవివచనముగావున, నచ్చట రాజ్యలక్ష్మియు, భూమియు, సీతయు, నని, యర్థముకల్పించి, బహువచనంబుఁబూరించుకొనునది. "స్త్రీభిశ్చమన్యే" యనునది, సుందరకాండంబున, సీత, రామునివిడిచియుండునప్పుడు, దుఃఖంబునఁ, "దాను నశించిపోయిన పిమ్మట రాముండితరస్త్రీలంబెండ్లాడిసుఖించు" నను సంభావనచేఁజెప్పినది; కావుననదియు, నుక్తపక్షబాధకముకాదు. ఇట్లువిరుద్ధంబుగాఁగనుపడుస్థలంబుల, సంప్రదాయసిద్ధాంతానుగుణముగాఁగల్పింపఁబడినయర్థంబులచే, విరోధపరిహారంబగుచున్నది. అనిమఱికొందఱు, వచించుచున్నారు.

తాం దృష్ట్వా పరమప్రీతాం బ్రువంతీం మంధరాం తతః
రామస్యైవ గుణాన్ దేవీ కైకేయీ ప్రశశంస హ. ౧౩

టీక॥ తతః=అటుపిమ్మట; పరం=మిక్కిలియును; అప్రీతాం=దుఃఖమునొం

దీనదియును; బ్రువంతీం= చెప్పుచున్న దియునగు; తాం=ఆ ; మంథరాం= మంథరను; దృష్ట్వా=చూచి ; దేవీ= రాణియగు; కైకేయీ= కైకేయి; రామస్య=రామునియొక్క; గుణానేవ=గుణములనే; ప్రశశంస= కొనియాడెను. "హ" అనునది పాదపూరణార్థకము.

అంత,నట్లుమిగులదుఃఖంబునొంది, నీతులుచెప్పుచున్నమంథరంజూచి, రాణియగు కైకేయి, దానిమాటలంజెవులనిడక, రామునిగుణంబులనె కొనియాడనారంభించెను.అని,తాత్పర్యము.

ధర్మజ్ఞో గురుభి ర్దాంతః కృతజ్ఞ స్సత్య వా క్ఛుచిః
రామో రాజ్ఞ స్సుతో జ్యేష్ఠో యౌవరాజ్య మతోఽర్హతి. ౧౪

టీక॥ రామః=రాముఁడు ; ధర్మజ్ఞః=ధర్మంబులనెఱింగినవాఁడు; గురుభిః=పెద్దలచేత; దాంతః= ఇంద్రియనిగ్రహముగలవాఁడుగాఁజేయఁబడినవాడు; కృతజ్ఞః=ఇతరునిచేఁదనకుఁజేయఁబడినయల్పోపకారమునైనుఎచ్చుగానెఱుంగువాఁడు; సత్యవాక్= సత్యమైనదియెమాటగాఁగలవాఁడు. శుచిః=పరిశుద్ధుఁడు, రాజ్ఞః=దశరథమహారాజునకు; జ్యేష్ఠః=మొదటివాఁడైన; సుతః= కొడుకు; అతః= ఈకారణమువలన; యౌవరాజ్యం=యువరాజు దొరతనమును; అర్హతి=పొందఁదగును.

రాముండు,ధర్మజ్ఞుండు,గురువులచేఁ నింద్రియనిగ్రహముగలుగునట్లు శిక్షింపఁబడినవాఁడు; తనకితరులుకొంచెము పకారముచేసినను దానినెచ్చుగాఁదలంచువాఁడు; దబ్బఱలనెంతమాత్రంబాడఁడు; పరిశుద్ధుండు; మఱియు,దశరథమహారాజునకు , జ్యేష్ఠకుమారుండు,కావున, నతండె, యౌవరాజ్యంబునకుఁ దగినవాఁడు, అని,తాత్పర్యము.

భ్రాతౄ న్భృత్యాంశ్చ దీర్ఘాయుః పితృవ త్పాలయిష్యతి
సంతప్యసే కథం కుబ్జే శ్రుత్వా రామాభిషేచనమ్. ౧౫

టీక॥ దీర్ఘాయుః= అధికమయిన యాయుస్సుగల రాముండు; భ్రాతౄన్=తోడఁబుట్టువులను; భృత్యాంశ్చ=నౌకరులను; పితృవత్=తండ్రినిం

బోలె; పాలయిష్యతి=కాపాడఁగలఁడు. కుబ్జే=గూనిదానవగుమంధరా! రామాభిషేచనం= రాముని యభిషేకించుటను; శ్రుత్వా=విని; కథం=ఎట్లు; సంతప్యసే=దుఃఖించుచున్నావు.

మంధరా! దీర్ఘాయుండగురాముండు, తమ్ములనుభృత్యులను దండ్రినింబోలె, శ్రద్ధతోఁ గాపాడును; అట్టిరామునకుఁ బట్టాభిషేకమగునని, విన్నందున, సంతోషంబుగలుగక, నీకెట్లుదుఃఖంబుగలిగినది.

అని, తాత్పర్యము.

భరతశ్చాపి రామస్య ధ్రువం వర్షశతాత్పరమ్
పితృపైతామహం రాజ్య మవాప్తా పురుషర్షభః. ౧౬

టీక॥ పురుషర్షభః = పురుషశ్రేష్ఠుండగుభరతుండును; వర్షశతాత్= సంవత్సరములయొక్క-నూఱుకన్నను; పరం=వెనుకను; రామస్య= రామునియొక్క; పితృపైతామహం=తండ్రితాతలనుండివచ్చిన; రాజ్యం=దొరతనమును; అవాప్తా=పొందఁగలఁడు; ధ్రువం=నిశ్చయము.

రాముండునూఱేండ్లురాజ్యముఁబాలించినవెనుకఁ, బురుషశ్రేష్ఠుండగుభరతుండును, పితృపైతామహంబగురాజ్యంబు నొందఁగలఁడు; ఇదినిశ్చయము.

అని, తాత్పర్యము.

సా త్వ మభ్యుదయే ప్రాప్తే వర్తమానే చ మంధరే
భవిష్యతిచ కల్యాణే కిమర్థం పరితప్యసే. ౧౭

టీక॥ మంధరే=మంధరా! సా=అట్టి; త్వం=నీవు; వర్తమానే=జరఁగఁబోవునట్టి; అభ్యుదయే=రామాభిషేకరూపమయినమంగళము; ప్రాప్తేచ=వచ్చినదగుచుండఁగాను; కల్యాణే= భరతాభిషేకరూపమయినమంగళము; భవిష్యతిచ=కాఁగలదగుచుండఁగాను; కిమర్థం=ఎందుకొఱకు; పరితప్యసే=దుఃఖించుచున్నావు.

మంధరా! ఇప్పుడు రామాభిషేకరూపంబగు మంగళంబు సమీపించియున్నది; ఇంక, భరతాభిషేకరూపమంగళము, రాఁగలదు; అట్లుమంగళపరంపరగల్గుచుండఁగా, నీవేలదుఃఖించెదవు?

అని, తాత్పర్యము.

యథా మే భరతో మాన్య స్తథా భూయోఽపి రాఘవః
కౌసల్యాతో ఽతిరిక్తంచ సోఽను శుశ్రూషతే హి మామ్. ౧౮

టీక॥ మే=నాకు; యథా=ఎట్లు; భరతః=భరతుండు; మాన్యః=బహుమానింపఁదగినవాఁడో; తథా= అట్లు; భూయోఽపి=అధికముగాను; రాఘవః=రాముండు; మాన్యః(అధ్యాహృతము)=బహుమానింపఁదగినవాఁడు. సః=ఆరాముఁడు; మాం=నన్ను; కౌసల్యాతః=కౌసల్యకన్నను; అతిరిక్తంచ=ఎచ్చుగాను; అనుశుశ్రూషతే హి= సేవించుచున్నాఁడుగదా!

రాముండు, కౌసల్యకుఁజేయుశుశ్రూషకన్న నెచ్చుగా, నాకు శుశ్రూష సేయుచున్నాఁడు; కావున, నేనుభరతుని యందెంత బహుమానంబుంచవలయునో, అంతకన్న నెచ్చుగా, రామునిపై నేనుబహుమానంబుంచవలయును.

అని, తాత్పర్యము.

రాజ్యం యదిహి రామస్య భరతస్యాపి తత్తదా
మన్యతేహి యథాత్మానం తథా భ్రాతౄంస్తు రాఘవః. ౧౯

టీక॥ రాజ్యం=దొరతనము ; రామస్య=రామునకు; ఆగచ్ఛతి ; (అధ్యాహృతము) యది=వచ్చునేని; తదా=అప్పుడు; తత్=ఆదొరతనము ; భరతస్యాపి=భరతునకును; ఆగతమేవ (అధ్యాహృతము) హి=వచ్చినదే కదా; రాఘవః=రాముఁడు ; ఆత్మానం=తన్ను; యథా=ఎట్లో; తథా=అట్లు; భ్రాతౄంస్తు=తమ్ములను ; మన్యతే హి=తలంచుచున్నాఁడుగదా!

రాముండు, తన్నెట్లు చూచుకొనునో; యట్లె, భేదంబులేక, తమ్ములనుం జూచుకొనువాఁడు; కావున, రామునకు రాజ్యంబువచ్చునేని, యప్పుడు, భరతునకును, రాజ్యంబువచ్చినట్టే, యగుచున్నది. అని, కైకేయి, మంధరకుఁ, జెప్పెను.

అని, తాత్పర్యము.

కైకేయీ వచనం శ్రుత్వా మంథరా భృశ దుఃఖితా
దీర్ఘ ముష్ణంచ నిశ్శ్వస్య కైకేయీ మిద మబ్రవీత్. ౨౦

టీక॥మంథరా=మంథర; కైకేయీ వచనం = కైకేయియొక్క-మాటను; శ్రుత్వా=విని; భృశదుఃఖితా = మిక్కిలియుదుఃఖమునొందినదై;దీర్ఘం=నిడుపుగాను;ఉష్ణంచ=వేడిగాను; నిశ్శ్వస్య = నిట్టూర్పుల విడిచి, కైకేయీం=కైకేయినిగూర్చి; ఇదం=ఈ మాటను;అబ్రవీత్=చెప్పెను.

మంథర, కైకేయి చెప్పినమాటను విని,యినుమడిగా దుఃఖంబునొంది, యధికముగా వేడి నిట్టూర్పులనిగుడించుచుఁ,గైకేయింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అనర్థదర్శినీ మౌర్ఖ్యా న్నాత్మాన మవబుధ్యసే
శోక వ్యసన విస్తీర్ణే మజ్జంతీ దుఃఖ సాగరే. ౨౧

టీక॥అనర్థదర్శినీ= ప్రయోజనమునుజూడనిదానవైన; త్వం (అధ్యాహృతము)=నీవు;మౌర్ఖ్యాత్ = అజ్ఞానమువలన;శోకవ్యసనవిస్తీర్ణే;శోక= భరతునకు రాజ్యములేకుండుటం గల్గినదుఃఖముచేతను;వ్యసన= శత్రువయినచవతికొడుకునకు రాజ్యంబు వచ్చుటవలనంగలుగునాపదలచేతను , విస్తీర్ణే=విశాలమయిన; శోకసాగరే= చవతికిసేవసేయుటవలనంగలిగిన దుఃఖంబనెడు సముద్రమునందు ; మజ్జంతీ= మునుంగుచున్నదానవై ; ఆత్మానం=నిన్ను;నావబుధ్యసే= తెలిసికొనకున్నావు.

నీకు,మంచిచెడ్డలు తెలియవు ; భరతునకు రాజ్యము లేకుండుటం గల్గుదుఃఖము,చవతికొడుకునకు రాజ్యంబు వచ్చుటంగల్గునాపద,చవతికి సేవ సేయుటయనెడుదుఃఖము, ఇవియన్నియు నీకు సంభవించుటకు సిద్ధములుగా నుండఁగా,నీవజ్ఞానంబున,దీనిందెలిసి కొనకుండుటయే గాక,నిన్నునీవె తెలిసికొన లేకున్నావు.

అని, తాత్పర్యము.

భవితా రాఘవో రాజా రాఘవస్యా ను య స్సుతః
రాజ వంశాత్తు కైకేయి భరతః పరిహాస్యతే. ౨౨

టీక॥ రాఘవః=రాముఁడు ; రాజా=రాజుగా; భవితా= కాఁగలఁడు

డు. రాఘవస్య=రామునకు; అను= వెనుక; యః=ఎవ్వఁడు; సుతః=కొడుకో; సః అధ్యాహృతము)= వాఁడు; రాజాభవితా ( అధ్యాహృతము)= రాజు గాఁగలఁడు, కైకేయి = కైకేయీ! భరతః=భరతుఁడు; రాజవంశాత్=రాజులవంశమునుండియె; పరిహాస్యతే= వెడలఁగొట్టఁబడును.

కైకేయీ! ఇప్పుడు రాముండు రాజగునేని, రామునియనంతరము, అతనికొడుకైనవాఁడె, రాజగును; భరతుండుగాని, యతనికొడుకులుగాని, యింకెప్పటికిని, రాజుగాఁజాలరు; కావున, రాజవంశంబున, భరతునిపేరే యుండదు. అని, తాత్పర్యము.

న హి రాజ్ఞ స్సుతా స్సర్వే రాజ్యే తిష్ఠంతి భామిని
స్థాప్యమానేషు సర్వేషు సుమహా ననయో భవేత్. ౨౩

టీక॥ భామిని= స్త్రీవగు కైకేయీ! రాజ్ఞః=రాజుయొక్క; సుతాః=కొడుకులు; సర్వే=అందఱును; రాజ్యే=దొరతనమునందు; నతిష్ఠంతిహి=ఉండరుగదా! సర్వేషు=కొడుకులందఱును; స్థాప్యమానేషు= ప్రతిష్ఠింపఁబడఁగా; సుమహాన్=మిక్కిలియు గొప్పదైన; అనయః=నీతిలేకుండుట; భవేత్=కలుగును.

కైకేయీ! రాజుకొడుకులకందఱకును. రాజ్యంబురాదు; అట్లందఱును రాజ్యంబున రాజులుగాఁజేయఁబడుదురేని, నీతిచెడి రాజ్యంబున కుపద్రవంబు గల్గును. అని, తాత్పర్యము.

తస్మా జ్జ్యేష్ఠేహి కైకేయి రాజ్యతంత్రాణి పార్థివాః
స్థాపయం త్యనవద్యాంగి గుణవ త్స్వితరేష్వపి. ౨౪

టీక॥ అనవద్యాంగి=నిందింపరానియవయవములుగల; కైకేయి=కైకేయీ! తస్మాత్=అందువలన; పార్థివాః=రాజులు; ఇతరేషు=ఇతరులయినకొడుకులు; గుణవత్సు అపి=మంచిగుణంబులు గలవారుగానుండినను; జ్యేష్ఠే= పెద్దకొడుకునందు; రాజ్యతంత్రాణి = రాచకార్యములను; స్థాపయంతిహి=ఉంచుచున్నారుగదా!

సుందరములయిన యవయవములు

గల కైకేయీ! అట్లు, కొడుకులందఱును రాజులౌదు రేని, రాజ్యంబున కుపద్రవంబు సంభవించును గావున, రాజులందఱును, దమకు గుణవంతులగు వేఱుకొడుకు లున్నను, జ్యేష్ఠునికే, రాచకార్యంబుల, నప్పగించుచున్నారు.

అని, తాత్పర్యము.

అసౌ వత్యంతనిర్భగ్న స్తవ పుత్రో భవిష్యతి
అనాథవ త్సుఖేభ్యశ్చ రాజవంశాచ్చ వత్సలే. ౨౫

టీక॥ వత్సలే = దయగలిగిన కైకేయీ! తవ = నీయొక్క; అసౌ = ఈ; పుత్రః = కొడుకైన భరతుండు; అనాథవత్ = నాథుఁడు లేనివాఁడువలె; సుఖేభ్యశ్చ = సుఖంబులవలనను; రాజవంశాచ్చ = రాజులవంశంబువలనను; అత్యంతనిర్భగ్నః = మిక్కిలియును భంగము నొందినవాఁడు; భవిష్యతి = కాఁగలఁడు.

కైకేయీ! నీవు సాధారణులపై నేదయగలదానవు, నీకొడుకునకు రాఁబోవు ననర్థంబుం బర్యాలోచించిదయయుంచుము; నీకొడుకునకు, అనాథునకుంబోలె, నెంతమాత్రమును సుఖంబు లేక, రాజవంశానుక్రమణికయందును గణనంబు లేక, దురవస్థకలుగఁబోవుచున్నది.

అని, తాత్పర్యము.

సాహం త్వదర్థే సంప్రాప్తా త్వంతు మాం నావబుధ్యసే
సపత్నివృద్ధౌ యా మే త్వం ప్రదేయం దాతు మిచ్ఛసి. ౨౬

టీక॥ సా = అట్టి; అహం = నేను; త్వదర్థం = నీకొఱకు; సంప్రాప్తా = వచ్చినాను. యా (త్వం) = ఏనీవు; సపత్ని వృద్ధౌ (సపత్నీవృద్ధౌ) = చవతియభ్యుదయంబునందు; మే = నాకు; ప్రదేయం = ఇవ్వఁదగినదాని; దాతుం = ఇచ్చుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావో, సా (అధ్యాహృతము) = అట్టి; త్వంతు = నీవు మాత్రము; మాం = నన్ను; నావబుధ్యసే = తెలిసికొనకున్నావు.

అట్లు నీపై నెనరుంచి నేను నీకు హితంబుగలుగఁ జేయుటకై, నీయొద్దకు వచ్చితిని; చవతి కభ్యుదయంబుగలుగు నప్పుడు నాకు బహుమానంబొసంగు నంతటి తెలివిలేని దానవగు నీవు మాత్రము నన్నుఁ దెలిసికొనలేదు. అని, తాత్పర్యము.

ధ్రువంతు భరతం రామః ప్రాప్య రాజ్య మకంటకమ్
దేశాంతరం వా నయితా లోకాంతర మథాపివా. ౨౭

టీక ॥ రామః= రాముఁడు; అకంటకం= శత్రువులులేని; రాజ్యం= దొరతనమును; ప్రాప్య = పొంది; భరతం = భరతుని; దేశాంతరం వా = మఱియొక్క దేశమునైనను; అథాపివా = లేనిచో; లోకాంతరం=వేఱులోకమునైనను; నయితా= పొందింపఁగలఁడు. ఇదం(అధ్యాహృతము)తు=ఇదిమాత్రము; ధ్రువం=నిశ్చయము.

రాముండు, శత్రువు లెంతమాత్రమునులేనిరాజ్యంబునొంది, భరతునిదేశాంతరమునకైనను వెడలఁగొట్టును; లేక,చంపివేయును;ఇది,మాత్రము, నిశ్చయము. అని,తాత్పర్యము.

బాలఏవ హి మాతుల్యం భరతో నాయిత స్త్వయా
సన్నికర్షాచ్చ సౌహార్దం జాయతే స్థావ రేష్వపి. ౨౮

టీక॥భరతః = భరతుఁడు;బాలఏవ= పిన్నవాఁడయియుండఁగానే; త్వయా=నీచేత; మాతుల్యం=మేనమామగృహమును; నాయితః=పొందింపఁబడెను. సన్నికర్షాచ్చ=మిక్కిలియుసమీపంబుననుండుటవలననుగూడ; స్థావరేష్వపి=వృక్షాదులయందును; సౌహార్దం=స్నేహము; జాయతే=కలుగుచున్నది.

భరతుండు, పిన్నవాఁడుగానుండునప్పుడె, నీవతని, మేనమామయింటికిఁ బంపితివి;ఎల్లప్పుడునుదగ్గిఱనుండుటవలన, వృక్షాదులయందునుగూడఁ జెలిమి యెచ్చుగాఁగలుగుచున్నది; అట్లుండ, భరతునియందు, దశరథునికిఁబ్రేమగలుగునని చెప్పనేల? అట్టియుపాయంబును నీవచెఱిపితివి.

అని, తాత్పర్యము.

భరతస్యా నువశగ శ్శత్రుఘ్నోపి సమం గతః
లక్ష్మణో హి యథా రామం తథా సౌ భరతం గతః. ౨౯

టీక॥ భరతస్య=భరతునియొక్క; అనువశగః = అనుసరించియధీనతను




పొందియున్న; శత్రుఘ్నోపి = శత్రుఘ్నుఁడును; సమం=కూడ; గతః = పోయినాఁడు. లక్ష్మణః=లక్ష్మణుండు; రామం=రామునిఁ; యథా=ఎట్లో; తథా= అట్లు; అసౌ = ఈశత్రుఘ్నుండు; భరతం=భరతుని; గతో హి= పొందిననాఁడుగదా!

భరతునకువిధేయుండుగానుఁడుశత్రుఘ్నుండును, భరతునితోఁగూడఁబోయినాఁడు; లక్ష్మణుండు రామునాశ్రయించియున్నట్లతండు, భరతునాశ్రయించినవాఁడు; కావున, నతండున్నను, ఇప్పుడు, భరతునకనుకూలమయినప్రయత్నము సేయును.

అని, తాత్పర్యము.

శ్రూయతేహి ద్రుమః కశ్చి చ్ఛేత్తవ్యో వనజీవిభిః
సన్నికర్షా దిషీకాభి ర్మోచితః పరమా ద్భయాత్. ౩౦

టీక॥ వనజీవిభిః= అడవిచేఁబ్రతుకువారిచే; ఛేత్తవ్యః=నఱుకఁబడవలసిన; కశ్చిత్= ఒకానొక; ద్రుమః=చెట్టు; ఇషీకాభిః=ముండ్లుపొదలుతీఁగెలు మొదలగువానిచేత; సన్నికర్షాత్=మిక్కిలియుసన్నిధానమువలన; పరమాత్= అధికమయిన; భయాత్ =భయమునుండి; మోచితః=విడువఁబడినది. ఇతి= (అధ్యాహృతము) అని; శ్రూయతే హి=వినఁబడుచున్నదిగదా!

"అడవిలోఁ గట్టెలునఱుకుకొని జీవించువారలు, ఒకచెట్టునునఱుకరాఁగా, దానిచుట్టునుండు, ముండ్లు, తీఁగెలు, పొదలు మొదలగునవి, సహవాసంబునం జేసి, దానికిఁ గలిగినభయంబుఁబోఁగొట్టిదానిరక్షించినవి" అని, వినియున్నావుగదా! అట్లు, భరతుండచ్చటనుండు నేని, సహవాసంబున, నతనియందును, దశరథునకును. ప్రేమగలిగియుండును.

అని, తాత్పర్యము.

గోప్తా హి రామం సౌమిత్రి ర్లక్ష్మణం చాపి రాఘవః
అశ్వినోరివ సౌభ్రాత్రం తయో ర్లోకేషు విశ్రుతమ్. ౩౧

టీక॥ సౌమిత్రిః=లక్ష్మణుండు; రామం=రామునిఁ; గోప్తా హి=రక్షింపఁగలఁడుగదా! రాఘవశ్చాపి=రాముండును; లక్ష్మణం=లక్ష్మణునిఁ; గోప్తా=




(అధ్యాహృతము)రక్షింపగలఁడు. తయోః=ఆరామలక్ష్మణులకు; అశ్వినో రివ=అశ్వినీదేవతలకుంబోలె = సౌభ్రాత్రం=మంచితోఁబుట్టువుఁదనము;లోకేషు = లోకంబులందు;విశ్రుతం=ప్రసిద్ధినొందినది.

లక్ష్మణుండు, రామునిరక్షించును ; అట్లు రాముండులక్ష్మణునిరక్షించును అశ్వినీదేవతల కిర్వురకును గలుగునట్లు వారలకిర్వురకుఁ, దోడంబుట్టువులగుట చేఁగలిగినస్నేహము, అధికముగానుండుట, లోకమందంతయుఁ బ్రసిద్ధంబై యున్నది. అనితాత్పర్యము.

తస్మా న్న లక్ష్మణే రామః పాపం కించి త్కరిష్యతి
రామస్తు భరతే పాపం కుర్యాదితి న సంశయః. ౩౨

టీక॥తస్మాత్=అందువలన;రామః=రాముఁడు;లక్ష్మణే=లక్ష్మణునియందు; కించిత్=కొంచమైనను; పాపం=చెఱుపును;నకరిష్యతి=చేయఁడు. రామః=రాముఁడు;భరతేతు = భరతునియందుమాత్రము; కుర్యాత్ = చేయును. ఇతి=ఈవిషయమునందు;సంశయః = సందేహము;న=లేదు.

అట్లగుటంజేసి,రాముండు లక్ష్మణునకేమియుఁ గీడుసేయఁడు; రాముండు , భరతునకుమాత్రముగీడుసేయును ; ఈవిషయంబునందు సందేహము లేదు. అని, తాత్పర్యము.

తస్మా ద్రాజగృహాదేవ వనం గచ్ఛతు తే సుతః
ఏతద్ధి రోచతే మహ్యం భృశంచాపి హితంతవ. ౩౩

టీక॥తస్మాత్=అందువలన; తే=నీయొక్క;సుతః=కొడుకు; రాజగృహాదేవ= కేకయరాజుయొక్కయింటినుండియే;వనం=అడవిని;గచ్ఛతు = పొందుఁగాక.ఏతత్=ఇది;మహ్యం = నాకొఱకు; రోచతేహి=ఇష్టముగానున్నదిగదా!తవచాపి=నీకును; భృశం=మిక్కిలియు;హితం=మేలయినది.

నీకొడుకుభరతుండిచ్చటికి వచ్చునేని,పట్టాభిషిక్తుండగురాముండు,అతనిం జంపును; కావున,భరతుండు, కేకయరాజుగృహంబునుండియె యడవికిఁబోవునట్లు సేయుము;అట్లయినచోఁబ్రాణహానిగలుగదు; ఇదినాకుసరిగాఁదోచు

స ౮

చున్నది; అట్లు సేయుదువేని, నీకొడుకు ప్రతికియయిననుండును, గావున, నీకును మేలుగలుగును.

అని, తాత్పర్యము.

ఏవం తే జ్ఞాతిపక్షస్య శ్రేయశ్చైవ భవిష్యతి
యది చేద్భరతో ధర్మాత్పిత్ర్యం రాజ్యమవాప్స్యతి. ౩౪

టీక॥ భరతః = భరతుండు; ధర్మాత్ = ధర్మమువలన; పిత్ర్యం = తండ్రిదైన; రాజ్యం = దొరతనమును; అవాప్స్యతియది = పొందునేని; ఏవంచేత్ = ఇట్లగునేని; తే = నీయొక్క; జ్ఞాతిపక్షస్య = బంధువులపక్షమునకు; శ్రేయశ్చ = మేలును; భవిష్యతి = కాఁగలదు.

భరతుండు ధర్మంబునఁ బిత్ర్యంబగు రాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుండగునేని, నీబంధువులకును మేలుగలుగును.

అని, తాత్పర్యము.

స తే సుఖోచితో బాలో రామస్య సహజో రిపుః
సమృద్ధార్థస్య నష్టార్థో జీవిష్యతి కథం వశే. ౩౫

టీక॥ తే = నీయొక్క; సుఖోచితః = సుఖంబునకుఁదగిన; సః = ఆ; బాలః = పిన్నవాఁడైన, భరతుండు; రామస్య = రామునకు; సహజః = కూడఁబుట్టిన; రిపుః = శత్రువు. నష్టార్థః = నశించినప్రయోజనముగలభరతుండు; సమృద్ధార్థస్య = సంపూర్ణమైన ప్రయోజనముగల రామునియొక్క; వశే = అధీనతయందు; కథం = ఎట్లు; జీవిష్యతి = బ్రతుకఁగలఁడు.

సుఖంబనుభవింపఁదగిన నీకొడుకు భరతుండు, రామునకుఁ, జవతితల్లికొడుకు, గావున, సహజశత్రువు; అట్లుండఁగా, భరతుండు, రాజ్యంబులేకుండుటవలన నెంతమాత్రము సహాయసంపత్తిలేకుండి, పట్టాభిషిక్తుండైసార్వాధికారంబులం బొల్చుచుండు రాముని వశంబునం జిక్కి, యెట్లు, జీవింపఁగలఁడు? ఎన్నివిధంబుల, నాలోచించినను, రాముండు భరతు నెట్లయినఁజంపివేయు, ననుట, సిద్ధము. అని, తాత్పర్యము.

అభిద్రుతమివారణ్యే సింహేన గజయూథపమ్
ప్రచ్ఛాద్యమానం రామేణ భరతం త్రాతుమర్హసి. ౩౬




టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; అరణ్యే=అడవియందు; సింహేన=సింహముచేత; అభిద్రుతం=తఱుమఁబడిన; గజయూథపమివ = ఏనుఁగులసమూహంబులఁబాలించుదానింబోలె,గజశ్రేష్ఠమునుంబోలెననుట; రామేణ=రామునిచేత; ప్రచ్ఛాద్యమానం=ఆక్రమింపఁబడుచున్న; భరతం=భరతుని ; త్రాతుం=రక్షించుటకు; అర్హసి=తగుదువు.

అడవియందు సింహంబుచేఁ దఱుమఁబడిచావునకు సిద్ధంబై యుండుగజంబునుంబోలె, రామునివశంబునంజిక్కిదిక్కులేకచావంబోవు నీకొడుకుభరతుని,రక్షించుకొనుము. అని, తాత్పర్యము.

దర్పాన్నిరాకృతా పూర్వం త్వయా సౌభాగ్యవత్తయా
రామమాతా సపత్నీ తే కథం వైరం న యాతయేత్. ౩౭

టీక॥త్వయా=నీచేత; సౌభాగ్యవత్తయా= మంచిభాగ్యముగలుగుటచేత; పూర్వం= మునువు; దర్పాత్=గర్వమువలన; నిరాకృతా = తిరస్కరింపఁబడిన; తే=నీయొక్క; సపత్నీ=చవతియగు; రామమాతా= రామునితల్లియయినకౌసల్య; కథం=ఎట్లు; వైరం=పగను; నయాతయేత్=తీర్చుకొనకుండును.

పూర్వము,నీవు, పెనిమిటికినేనందఱికన్నను బ్రియురాలనుగా నున్నానని, గర్వించి,నీచవతియగు కౌసల్యను, నానావిధంబుల నవమానించియున్నావు; ఇప్పుడు, తనకొడుకురాజుకాఁగానే, కౌసల్య, యీపగను దీర్చుకొనకుండునా? అవశ్యమునిన్నుఁదనకుఁబనికత్తెనుగాఁజేసికొని, నానావిధంబులంగాఱియపెట్టును. అని, తాత్పర్యము.

యదా హి రామః పృథివీ మవాప్స్యతి
ప్రభూతరత్నాకరశైలపత్తనామ్
తదా గమిష్య స్యశుభం పరాభవం
సహైవ దీనా భరతేన భామిని. ౩౮

టీక॥భామిని=(స్త్రీ)వగుకైకేయీ! యదా=ఎప్పుడు; రామః=రాముఁడు; ప్రభూతరత్నాకరశైలపత్తనాం=అధికములైనమణులగనులుగల పర్వతంబులునుబట్టణములునుగల; పృథివీం=భూమిని; అవాప్స్యతి=పొందునో; తదా=అ




ప్పుడు; త్వం (అధ్యాహృతము)=నీవు; దీనా=దరిద్రురాలవై; భరతేనసహ=భరతునితోఁగూడనే; అశుభం=అమంగళకరంబగు; పరాభవం=అవమానంబును; గమిష్యసిహి=పొందుదువుగదా! కైకేయీ! రాముం, డెప్పుడు, విస్తారము గానుణులగనులుగల పర్వతముల తోనుబట్టణములతోనుంగూడినభూమికి రాజగునో; అప్పుడె, నీకొడుకును నీవును దారిద్ర్యింబునొంది, యమంగళకరంబగుటంజేసి నోటంజెప్పరాని, యవమానంబునొందెదరు. అని, తాత్పర్యము.

యదా హి రామః పృథివీ మవాప్స్యతి
ధ్రువం ప్రణష్టో భరతో భవిష్యతి
అతో హి సంచింతయ రాజ్యమాత్మజే
పరస్య చైవాద్య వివాసకారణమ్. ౩౯

టీక॥ యదా=ఎప్పుడు; రామః=రాముఁడు; పృథివీం=భూమిని; అవాప్స్యతి=పొందునో; తదా (అధ్యాహృతము)=అప్పుడు; భరతః = భరతుండు; ప్రణష్టః = నాశమునొందినవాఁడు, భవిష్యతిహి=కాఁగలఁడు గదా! ధ్రువం= నిశ్చయము. అతోహి=ఇందువలననే; ఆత్మజే= కొడుకునందు; రాజ్యం=దొరతనమును, దొరతనము గలుగుటకుఁగారణమనుటు; పరస్య=శత్రువయిన రామునకు; వివాసకారణం=ఊరువెడలఁగొట్టించుట యొక్క కారణమును; అద్యచైవ=ఇప్పుడే; సంచింతయ=చక్కఁగానాలోచింపుము.

రాముండెప్పుడు భూమికిరాజగునో, అప్పుడెభరతుండు నాశంబునొందును; కావున, నీకొడుకు భరతునకు రాజ్యంబువచ్చునట్లును, రామునిఁ, బట్టణంబు వెడలఁగొట్టించునట్లును, దగిన యుక్తుల, నిప్పుడె, యాలోచించుకొనుము. అని, మంథర కైకేయికిఁ జెప్పినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, అష్టమ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టమసర్గటీక, ముగిసినది.



శ్రీ

## నవమసర్గప్రారంభః.

ఏవ ముక్తాతు కైకేయీ కోపేన జ్వలితాననా
దీర్ఘ ముష్ణం వినిశ్వస్య మంధరా మిద మబ్రవీత్. ౧

టీక॥ కైకేయీతు=కైకేయియును; ఏవం=ఇట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; కోపేన=కోపముచేత; జ్వలితాననా=మండినముఖముగలదై; దీర్ఘం=నిడుపుగాను; ఉష్ణం=వేఁడిగాను; వినిశ్వస్య=నిట్టూర్పులువుచ్చి; మంధరాం=మంధరనుగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

కైకేయి, మంధర చెప్పినమాటవిని, కోపంబున నెఱ్ఱగానుండుటంజేసి మండుచున్నట్లుదోఁచుచుండుముఖంబుగలదై, అధికముగా వేఁడినిట్టూర్పులు నిగుడించి, మంధరంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అద్య రామ మితః క్షిప్రం వనం ప్రస్థాపయా మ్యహం
యౌవరాజ్యేచ భరతం క్షిప్ర మే వాభిషేచయే. ౨

టీక॥ అహం=నేను; అద్య=ఇప్పుడు; క్షిప్రం=శీఘ్రముగా; రామం=రాముని; ఇతః=ఇటనుండి; వనం=అడవినిగూర్చి; ప్రస్థాపయామి=పోవునట్లుచేసెదను. భరతంచ=భరతుని; యౌవరాజ్యే=యువరాజుదొరతనమునందు; క్షిప్రమేవ=శీఘ్రముగానె; అభిషేచయే=అభిషేకించెదను.

నేఁ, ఈక్షణంబుననె, రామునిచ్చటనుండియడవికిఁబోవునట్లుచేసెదను; శీఘ్రముగానే, భరతుని, యువరాజుదొరతనంబునఁ, బట్టాభిషిక్తునిఁగాఁ జేసెదను. అని, తాత్పర్యము.

ఇదం త్విదానీం సంపశ్య కే నోపాయేన మంథరే
భరతః ప్రాప్నుయా ద్రాజ్యం నతు రామః కథంచన. ౩

టీక॥ మంథరే=మంథరా! కేన=ఏ; ఉపాయేన=ఉపాయముచేత; భరతః=భరతుఁడు; రాజ్యం=దొరతనమును; ప్రాప్నుయాత్=పొందునుః రామస్తు=రాముఁడుమాత్రము; కథంచన=ఎట్లైనను; న(ప్రాప్నుయాత్)=పొందఁడు. ఇదంతు=దీనిమాత్రము; ఇదానీం=ఇప్పుడు; సంపశ్య=చక్కఁగాఁజూడుము.

మంథరా! యేయుపాయంబున, భరతుండు రాజ్యంబునొందును; రామునకు రాజ్యంబులేకుండునుః దీనినిమాత్రమిప్పుడునీవుచక్కఁగా నాలోచింపుము. అని కైకేయి మంథరతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా తయా దేవ్యా మంథరా పాపదర్శినీ
రామార్థ ముపహింసంతీ కైకేయీ మిద మబ్రవీత్. ౪

టీక॥ పాపదర్శినీ= పాపములనే చూచునట్టి, పాపములనే చేయఁదలఁచునట్టియనుట ; మంథరా=మంథర; ఏవం=ఇట్లు; తయా=ఆ; దేవ్యా=రాణియగుకైకేయిచేత; ఉక్తా=చెప్పఁబడినదై; రామార్థం= రామునిప్రయోజనమును; ఉపహింసంతీ= చెఱుపునదియై; కైకేయీం=కైకేయినిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

పాపములనే చేయదలంచునట్టిమంథర, రాణియగుకైకేయిచెప్పినమాటనువిని, రామునిపట్టాభిషేకముఁజెఱుపుటకై, కైకేయింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

హంతే దానీం ప్రవక్ష్యామి కైకేయి శ్రూయతాంచ మే
యథా తే భరతో రాజ్యం పుత్రః ప్రాప్స్యతి కేవలమ్. ౫

టీక॥ హంత = సంతోషము! యథా=ఎట్లు; తే=నీయొక్క; పుత్రః= కొడుకైన; భరతః కేవలం = భరతుండుమాత్రము; రాజ్యం = దొరతనమును; ప్రాప్స్యతి=పొందునో, తథా (అధ్యాహృతము)=అట్లు; ఇదానీం = ఇప్పుడు; ప్రవక్ష్యామి=చెప్పెదను. కైకేయి=కైకేయీ! మే= (పంచమ్యర్థమందుషష్ఠి) నావలన; శ్రూయతాం= వినఁబడుఁగాక. "చ" అనునది పాద

పూరణార్థము.

కైకేయీ! సంతోషము! నీకొడుకు భరతుండు మాత్రము రాజ్యంబునొందు నట్లుపాయంబు నిప్పుడు, చెప్పెదను; నామాటవినుము.

అని, తాత్పర్యము.

కిం నస్మరసి కైకేయి స్మరంతీవా నిగూహసే
యదుచ్యమాన మాత్మార్థం మత్తస్త్వం శ్రోతుమిచ్ఛసి. ౬

టీక॥ కైకేయి=కైకా! యత్=ఏ కారణమువలన; త్వం (అధ్యాహృతము)= నీవు; మయా (అధ్యాహృతము)=నాచేత; ఉచ్యమానం= చెప్పఁబడుచున్న; ఆత్మార్థం = నీప్రయోజనమును, నీకుఁబ్రయోజనముఁగలిగించును పాయమునను టః మత్తః = నావలన; శ్రోతుం=వినుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావో; తత్ (అధ్యాహృతము)= ఆ కారణమువలన; నస్మరసికిం=స్మరింపవా? స్మరంతీ=స్మరించు దానవై; నిగూహసేవా=దాఁచెదవా?

కైకేయీ! నీకుఁబ్రయోజనము గలుగును పాయమును, నేనచెప్పఁగా, వినవలయునని కోరుచున్నావు; ఇందు కేమి కారణము? నీవా యుపాయమును మఱచితివా? యేమి? లేక, జ్ఞప్తియుండినను, నేఁజెప్పఁగా వినవలెనని, చెప్పక దాఁచియున్నావా?

అని, తాత్పర్యము.

మయోచ్యమానం యదితే శ్రోతుం ఛందో విలాసిని
శ్రూయతా మభిధాస్యామి శ్రుత్వా చాపి విమృశ్యతామ్. ౭

టీక॥ విలాసిని=సౌందర్యముగల కైకేయీ! తే=నీకు; మయా=నాచేత; ఉచ్యమానం = చెప్పఁబడుదాని; శ్రోతుం=వినుటకు; ఛందః=కోరిక; అస్తి (అధ్యాహృతము) యది=ఉండునేని; అభిధాస్యామి = చెప్పెదను; శ్రూయతాం=వినఁబడుఁగాక. శ్రుత్వాచాపి= వినియును; విమృశ్యతాం=ఆలోచింపఁబడుఁగాక.

సౌందర్యశాలినివగు కైకేయీ! నేను, జెప్పఁగా, నాయుపాయమును వినవలయునని నీకుఁగోరికయుండునేని, యిప్పుడె చెప్పెదను; వినుము; అట్లువిని, నేఁజెప్పునది, యుక్తముకాదో, చక్కఁగానాలోచింపుము. అని, మంథర, కైకేయితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

శ్రుత్వైవం వచనం తస్యా మంధరా యాస్తు కైకయీ
కించి దుత్థాయ శయనా త్స్వాస్తీర్ణా దిద మబ్రవీత్. ౮

టీక॥ కైకయీ=కైకేయి; ఏవం=ఇట్లు; తస్యాః=ఆ; మంధరాయాః=మంధరయొక్క; వచనం = మాటను; శ్రుత్వాతు=వినినంతనె; స్వాస్తీర్ణాత్=చక్కఁగాఁబఱుపఁబడిన; శయనాత్=పాన్పునుండి; కించిత్=కొంచెము; ఉత్థాయ=లేచి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

ఈప్రకారము, ఆమంథర చెప్పఁగా, నామాటవిని, కైకేయి, సుఖంబుగానుండునట్లు చక్కఁగాఁగల్పింపఁబడిన పాన్పునుండి, యాదరాతిశయంబునం గొంచెములేచి, మంథరంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కథయ త్వం మమోపాయం కేనోపాయేన మంధరే
భరతః ప్రాప్నుయా ద్రాజ్యం నతు రామః కథంచన. ౯

టీక॥ మంధరే=మంధరా! త్వం=నీవు; మమ=నాకు; ఉపాయం=వెరువును; కథయ=చెప్పుము. కేన=ఏ; ఉపాయేన=వెరువుచేత; భరతః=భరతుండు; రాజ్యం=దొరతనమును; ప్రాప్నుయాత్=పొందును? రామస్తు=రాముఁడుమాత్రము; కథంచన=ఎట్లయినను; న(ప్రాప్నుయాత్) = పొందనేరఁడు?

మంధరా! ఏమిచేసిన, భరతుండు రాజ్యంబునొందును? రామునకు రాజ్యంబు రాకుండును? నీవు నాకాయుపాయంబుఁజెప్పుము. అని, కైక, మంధరతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తా తయా దేవ్యా మంధరా పాపదర్శినీ
రామార్థ ముపహింసంతీ కుబ్జా వచన మబ్రవీత్. ౧౦

టీక॥ పాపదర్శినీ= పాపములనే చూచునదియు, పాపములనే చేయఁదలంచునదియుననుట; కుబ్జా= గూనిదియనగు; మంధరా=మంధర; దేవ్యా=రాణియగు; తయా=ఆకైకేయిచేత; ఏవం=ఇట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; రా

మార్థం=రాముని యొక్క ప్రయోజనమును; ఉపహింసంతీ= చెఱుపునదియై; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

ఎల్లప్పుడును బాపంబులనే చేయఁదలంచునది యెగూనిదిన్మైయుండు నామంధర, యిట్లు రాణియగు కైకేయి చెప్పిన మాటవిని, రామునకుఁబట్టాభిషేకంబు జరగకుండునట్లు సేయుటకై, యాకైకేయింజూచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

తవ దైవాసురే యుద్ధే సహ రాజర్షిభిః పతిః
అగచ్ఛ త్త్వాముపాదాయ దేవరాజస్య సాహ్యాకృత్. ౧౧
దిశ మాస్థాయ వై దేవి దక్షిణాం దండకాన్ ప్రతి
వైజయంత మితి ఖ్యాతం పురం యత్ర తిమిధ్వజః. ౧౨

టీక॥ దేవి=రాణివగు కైకేయీ! దైవాసురే=దేవతలును అసురులును జేయునట్టి; యుద్ధే=యుద్ధమునందు; తవ=నీయొక్క; పతిః= పెనిమిటియగు దశరథుండు; దేవరాజస్య= దేవతలకుఁబ్రభువైన యింద్రునకు; సాహ్యాకృత్=తోడ్పాటు సేయువాఁడై; రాజర్షిభిస్సహ=రాజులును ఋషులునగు వారితోఁగూడ; త్వాం=నిన్ను; ఉపాదాయ=తీసికొని; దండకాన్ ప్రతి=దండకారణ్యముఁగూర్చి; గత్వా (అధ్యాహృతము)= పోయి; దక్షిణాం=దక్షిణపు; దిశం=దిక్కును; ఆస్థాయ=పొంది; ("వై" అనునది పాదపూరణార్థము, యత్ర=ఎచ్చట; తిమిధ్వజః=తిమియనెడు పెద్దచేపయె కేతువుగాఁగల శంబరాసురుండు; అస్తి (అధ్యాహృతము)=ఉన్నాఁడో; తత్ (అధ్యాహృతము) = అట్టి; వైజయంతమితి=వైజయంతంబని; ఖ్యాతం=పేర్కొనఁబడిన; పురం=పట్టణమును; అగచ్ఛత్=పొందెను.

రాణివగు కైకేయీ! పూర్వము దేవాసురయుద్ధమునందు, నీ పెనిమిటి దశరథుండు, దేవేంద్రునకు సాహాయ్యము సేయుటకై, తనక్రిందిరాజులతోఁ గూడ, నిన్నుఁబిలుచుకొని, దక్షిణపు దిక్కునందు, దండకారణ్యంబుఁజేరి, యచ్చట, తిమిధ్వజుండగు శంబరాసురుని రాజధానియగు వైజయంతంబను పట్టణంబునకుఁబోయెను. అని, తాత్పర్యము.




స శంబర ఇతి ఖ్యాత శ్శతమాయో మహాసురః
దదౌ శక్రస్య సంగ్రామం దేవసంఘై రనిర్జితః. ౧౩

టీక॥శతమాయః= నూఱుమాయలుగల; శంబరఇతి=శంబరుండని; ఖ్యాతః=పేరొందనంబడిన;సః=ఆ;మహాసురః=గొప్పయసురుఁడు; దేవసంఘైః=దేవతలసమూహములచేత ; అనిర్జితః=జయింపఁబడనివాఁడై; శక్రస్య=దేవేంద్రునకు;సంగ్రామం=యుద్ధమును;దదౌ=ఇచ్చెను.

నూఱువిధంబులగుమాయలుచేయం జాలిన, శంబరుండను నామహాసురుండు, దేవతలనందఱను, జయించి , దేవేంద్రునితోయుద్ధంబుఁజేసెను.

అని, తాత్పర్యము.

తస్మి న్మహతి సంగ్రామే పురుషాన్ క్షతవిక్షతాన్
రాత్రౌ ప్రసుప్తాన్ ఘ్నంతిస్మ తరసాఽసాద్య రాక్షసాః. ౧౪

టీక॥మహతి=గొప్పదైన;తస్మిన్=ఆ;సంగ్రామే=యుద్ధమునందు; రాక్షసాః=అసురులు; క్షతవిక్షతాన్=బాణంబులచే గాయములు దగిలినవారలును,ఖడ్గములచేనానావిధంబులుగా గాయంబులు దగిలిన వారలును; ప్రసుప్తాన్=చక్కఁగానిద్రించిన వారలును; పురుషాన్= పురుషులను రాత్రౌ=రాత్రియందు; ఆసాద్య= పొంది; తరసా=బలముచేత; ఘ్నంతిస్మ= చంపిరి.

అమ్మహాయుద్ధంబున, మధ్యాహ్నకాలంబునయుద్ధంబుఁజేసి, దేహంబంతయునానావిధంబులగు గాయంబులు దగిలి, పరుండి నిద్రించుచున్న పురుషులకడకు, రాత్రికాలంబునంబోయి, యసురులు,బలంబున,వారలంజంపిరి.

అని, తాత్పర్యము.

తత్రాకరో న్మహాయుద్ధం రాజా దశరథ స్తదా
అసురైశ్చ మహాబాహు శ్శస్త్రైశ్చ శకలీకృతః. ౧౫

టీక॥తత్ర=అచ్చట; తదా=అప్పుడు;రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; మహాయుద్ధం=గొప్పయుద్ధమును; అకరోత్=చేసెను. మహాబాహుః= గొప్పభుజములుగలదశరథుండు;అసురైశ్చ=అసురులచేతను;శస్త్రై

శ్చ=ఆయుధములచేతను; శకలీకృతః= తునకలుగాఁజేయఁబడినాఁడు.

అప్పటనారాత్రికాలమునందు, దశరథమహారాజు, ఆయసురులతో మహాయుద్ధంబుచేసి, తుదకు, వారలచే, నానావిధాయుధంబుల దేహంబంతయుఁ దునకలగునట్లు, కొట్టఁబడినాఁడు.

అని, తాత్పర్యము.

అపవాహ్య త్వయా దేవి సంగ్రామా న్నష్టచేతనః
తత్రాపి విక్షత శ్శస్త్రైః పతి స్తే రక్షిత స్త్వయా. ౧౮

టీక॥ దేవి=రాణివగుకైకేయీ! నష్టచేతనః=నశించిన తెలివిగల; తే=నీయొక్క; పతిః=పెనిమిటియగుదశరథుఁడు; త్వయా=నీచేత; సంగ్రామాత్=యుద్ధమునుండి; అపవాహ్య=తప్పఁదీసికొనిపోయి; రక్షితః(అధ్యాహృతము)=కాపాడఁబడినాఁడు. తత్రాపి=అస్థలంబునందును; శస్త్రైః=ఆయుధములచే; విక్షతః=మిక్కిలియు గాయములనొందిన; తే(అధ్యాహృతము)=నీయొక్క; పతిః=పెనిమిటి; త్వయా=నీచేత; రక్షితః=కాపాడఁబడినాఁడు.

రాణివగు, కైకేయీ! అప్పుడుసారథ్యంబుసేయుచున్న నీవట్లుయుద్ధంబున మూర్ఛలియున్ననీపెనిమిటి దశరథుని యుద్ధభూమివిడిచి యవ్వలకుం గొనిపోయి శీతోపచారంబులందనిపి, కాపాడితివి; నీవుగొనిపోయియున్నయారహస్యస్థలంబునకుంగూడనాయసురులు వచ్చి, దశరథుని నానావిధాయుధంబులం బ్రహరింపఁగా నీవప్పుడుగూడ, మఱియొక్కచోటికింగొనిపోయి, మఱలఁ, గాపాడితివి.

అని, తాత్పర్యము,

తుష్టేన తేన దత్తౌ తే ద్వౌ వరౌ శుభదర్శనే

టీక॥ శుభదర్శనే=మంగళకరంబగుకండ్లుగలకైకేయీ! తుష్టేన=సంతసించిన; తేన=ఆదశరథునిచేత; తే=నీకొఱకు; ద్వౌ=రెండు; వరౌ=వరంబులు; దత్తౌ=ఇయ్యఁబడినవి.

మంగళకరంబులగు కండ్లుగలకైకేయీ; ఆదశరథుండు, నీవు రెండుమార్లు జేసినయుపకారంబునకు సాహసంబునకునుసంతసించి, నీకురెండువరంబులిచ్చెను.

అని, తాత్పర్యము.

స త్వయోక్తః పతి ర్దేవి యదేచ్ఛేయం తదా వరౌ. ౧౭
గృహ్ణీయా మితి త త్తేన తథే త్యుక్తం మహాత్మనా

టీక॥ దేవి = రాణివగుకైకేయీ! "యదా=ఎప్పుడు;ఇచ్ఛేయం= కోరుదునో;తదా=అప్పుడు; వరౌ=వరంబులను;గృహ్ణీయాం= తీసికొనియెదను?" ఇతి=అని;త్వయా=నీచేత;సః=ఆదశరథుఁడు;ఉక్తః=చెప్పఁబడినాఁడు.మహాత్మనా = పూజ్యమయినస్వభావముగల; తేన=ఆదశరథునిచేత;తత్=ఆమాట;తథేతి=ఆలాగేయని;ఉక్తం=చెప్పఁబడినది.

రాణివగుకైకేయీ! "నేనుగోరునప్పుడడిగెదను; అప్పుడునాకీవరంబులనిమ్ము" అని,నీవప్పుడు,దశరథునితోఁజెప్పితివి; సత్యవాదియగునాదశరథుండును, నీవుచెప్పినట్లొప్పుకొనెను.

అని, తాత్పర్యము.

అనభిజ్ఞా హ్యహం దేవి త్వయైవ కథితా పురా. ౧౮
కథై షా తవతు స్నేహా న్మనసా ధార్యతే మయా

టీక॥ దేవి=రాణివగుకైకేయీ!అహం=నేను;అనభిజ్ఞాహి=తెలియనిదాననుగదా!ఏషా=ఈ; కథా=వృత్తాంతము;త్వయైవ=నీచేతనే; పురా=మును; కథితా = చెప్పఁబడినది, మయా=నాచేత;తవ = నీయొక్క;స్నేహాత్తు=స్నేహంబువలననే; మనసా= మనసుచేత; ధార్యతే=ధరింపఁబడుచున్నది.

రాణివగుకైకేయీ ! నేనీవృత్తాంతముఁజరిగినదిచూడలేదు; మున్నొకప్పుడు,నీవేనాకీవృత్తాంతమును జెప్పితివి;నీయందుండుస్నేహంబువలన, "ఇదినీకుఁ జాలనుపయోగపడు"ననితలంచి,మఱవక,మనంబుననుంచుకొనియున్నాను.

అని, తాత్పర్యము.

రామాభిషేకసంభారా న్నిగృహ్య వినివర్తయ. ౧౯

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; రామాభిషేకసంభారాన్= రామునియభిషేకముకొఱకైన ప్రయత్నములను;నిగృహ్య=బలాత్కారముచేసి;వినివర్తయ=నిలుపుము.

నీవు, నీపెనిమిటైదశరథునిబలాత్కా

రించి, రామునిబట్టాభిషిక్తునింజేయుట కై యిప్పుడుజరగుచుండుప్రయత్నంబులను,నిలువునట్లుచేయుము.

అని, తాత్పర్యము.

తౌ వరౌ యాచ భర్తారం భరతస్యాభిషేచనమ్
ప్రవ్రాజనంతు రామస్య త్వం వర్షాణి చతుర్దశ. ౨౦

టీక॥త్వం=నీవు;భరతస్య= భరతునియొక్క; అభిషేచనం= అభిషేకించుటను; చతుర్దశ = పదునాలుగు; వర్షాణిచ=సంవత్సరంబులను; రామస్య=రామునియొక్క ; ప్రవ్రాజనంతు=ఊరువెడలఁగొట్టుటను; తౌ=ఆ; వరౌ=వరంబులను; భర్తారం=పెనిమిటయగుదశరథుని,యాచ= అడుగుము.

నీవా రెండువరంబులకును,భరతునకుఁబట్టాభిషేకముసేయుటయుఁ, బదునాలుగుసంవత్సరంబులు రాము నడవినుండునట్లుసేయుటయుఁ, గావలెనని, నీపెనిమిటి దశరథు నడుగుము.

అని, త్పార్యము.

చతుర్దశ హి వర్షాణి రామే ప్రవ్రాజితే వనమ్
ప్రజాభావగతస్నేహ స్థిరః పుత్రో భవిష్యతి. ౨౧

టీక॥రామే=రాముఁడు; చతుర్దశ=పదునాలుగు;వర్షాణి= సంవత్సరంబులు; వనం=అడవినిగూర్చి; ప్రవ్రాజితే=ఊరువెడలఁగొట్టఁబడుచుండఁగా;పుత్రః=కొడుకైనభరతుండు ; ప్రజాభావగతస్నేహః= జనులహృదయముఁబొందినస్నేహంబుగలవాఁడై; స్థిరః=నిలుకడైనవాఁడు ; భవిష్యతి= కాఁగలఁడు.

రాముండు,పదునాలుగు సంవత్సరంబులడవిలోనుండునట్లు , చేయుదువేని, యాకాలంబులోనీకొడుకభరతుని పైఁ బ్రజలకు దృఢానురాగంబుగలిగి, యాపైరాముండువచ్చి, రాజ్యంబునకై,యెంతప్రయత్నంబుచేసినను, అతనిప్రయత్నంబుసాగక, భరతునకురాజ్యంబుస్థిరంబుగా,నుండును.

అని, తాత్పర్యము.

క్రోధాగారం ప్రవిశ్యాద్య క్రుద్ధేవాశ్వపతే స్సుతే

శేష్వా నంతహీ౽తాయాం త్వం భూమౌ మలినవాసినీ. ౨౨

టీక॥ అశ్వపతేః=గుఱ్ఱంబులకధిపతియయిన కేకయరాజుయొక్క, యశ్వపతియను బిరుదుగల కేకయరాజుయొక్కయనుట; సుతే=కొమాతెఽవగు కైకేయీ! త్వం = నీవు; అద్య=ఇప్పుడు; క్రోధాగారం=కోపగృహమును, (స్త్రీ) లుకోపంబువచ్చినపుడుండుగృహమునుట; ప్రవిశ్య=చొచ్చి; క్రుద్ధేవ=కోపంబునొందినదివోలె; మలినవాసినీ=మురికిబట్టకట్టుకొన్నదానవై; అనంతహీ౽తాయాం=పఱపఁబడని; భూమౌ=నేలయందు; శేష్వ=పరుండుము.

అశ్వపతియగు కేకయరాజుకొమాతెఽయయినకైకేయీ! నీవిప్పుడు, కోపంబువచ్చినప్పుడుండు గృహంబునకుఁబోయి, కోపంబునొందినట్లు, మురికిబట్టలఁగట్టుకొని, యాస్తరణములేనినేలపైఁ, బరుండియుండుము.

అని, తాత్పర్యము.

మా స్మైనం ప్రత్యుదీక్షేథా మా చైన మభిభాషథాః
రుదంతీ చాపి తం దృష్ట్వా జగత్యాం శోకలాలసా. ౨౩

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; ఏనం = ఈదశరథుని; మా ప్రత్యుదీక్షేథాః = చూడకుము("స్మ" అనునది పాదపూరణార్థము). ఏనం= ఈదశరథుని గూర్చి; మాభిభాషథాశ్చ= (అభిభాషేథాశ్చ) మాటలను ఆడకుము. తం=ఆదశరథుని; దృష్ట్వా=చూచి; జగత్యాం=నేలయందు; శోకలాలసా=దుఃఖముచేతఁజపలురాలవై; రుదంతీ చాపి = ఏడ్చుచున్నదానవునయి; భవ (అధ్యాహృతము)=ఉండుము.

దశరథుండు నీయొద్దకువచ్చినపుడు, నీవతనిందలయెత్తి చూడకుము; అతనితో మాటలాడకుము; నేలపైఁబడి, యతనిఁజూచి, యతిదుఃఖంబున, నేడ్చుచుండుము. అని, తాత్పర్యము.

దయితా త్వం సదా భర్తు౽ రత్ర మే నాస్తి సంశయః
త్వత్కృతే స మహారాజో విశే దపి హుతాశనమ్. ౨౪

టీక॥ త్వం=నీవు; సదా=ఎల్లప్పుడును; భర్తుః = పెనిమిటికి; దయితా=

ప్రియురాలవు; అత్ర = ఈవిషయంబునందు; మే=నాకు; సంశయః=సందేహము; నాస్తి=లేదు. త్వత్కృతే=నీకొఱకు; సః=ఆ; మహారాజః=పూజ్యుండగు రాజయినదశరథుండు; హుతాశనమపి=నిప్పునుగూడ; విశేత్=చొచ్చును.

నీపెనిమిటియగుదశరథునకు, నీమీఁదనెప్పుడును బ్రీతియెచ్చుగాఁగలదు; ఈవిషయంబునందు నాకుసందేహంబులేదు; నీవుకోరుదువేని, యతండు, నిప్పులోఁగూడదుముకును.

అని, తాత్పర్యము.

న త్వాం క్రోధయితుం శక్తో న క్రుద్ధాం ప్రత్యుదీక్షితుమ్
తవ ప్రియార్థం రాజా హి ప్రాణానపి పరిత్యజేత్. ౨౫

టీక॥ రాజా=దశరథమహారాజు; త్వాం=నిన్ను; క్రోధయితుం= కోపింపఁజేయుటకు; నశక్తః=చాలినవాఁడు కాఁడు. క్రుద్ధాం=కోపించిన; త్వాం=(అధ్యాహృతము) నిన్ను; ప్రత్యుదీక్షితుం=చూచుటకు; నశక్తః= (అధ్యాహృతము) చాలినవాఁడుకాఁడు; తవ= నీయొక్క; ప్రియార్థం=సంతోషముకొఱకు; ప్రాణానపి=ప్రాణములనుగూడ; పరిత్యజేత్=విడుచును.

దశరథమహారాజు, నీకుఁగోపంబు గలుగునట్లుఁజేయభయముపడును; నీవు కోపించియున్నప్పుడు, నిన్నుఁదలయెత్తిచూడఁజాలఁడు; నీవుకోరుదువేని, నీకుసంతోషంబుగలుగుటకై, ప్రాణంబులనుంగూడవిడుచును. అని తాత్పర్యము.

నహ్యతిక్రమితుం శక్త స్తవ వాక్యం మహీపతిః
మందస్వభావే బుద్ధ్యస్వ సౌభాగ్యబల మాత్మనః. ౨౬

టీక॥ మహీపతిః= భూమికిఁ బ్రభువైనదశరథుఁడు; తవ=నీయొక్క; వాక్యం=మాటను; అతిక్రమితుం=దాఁటుటకు; నశక్తోహి= చాలినవాఁడుకాఁడుగదా! మందస్వభావే= మూఢమయినస్వభావముగలదానా ! ఆత్మనః=నీయొక్క; సౌభాగ్యబలం= సౌందర్యముచేతఁగలిగినబలంబును ; బుద్ధ్యస్వ= తెలిసికొనుము.

భూమికిఁబ్రభువయినదశరథుండు, నీమాటనతిక్రమింపఁజాలఁడు; నీవు తెలివిలేనిదానవు; ఇప్పుడు, నీసౌందర్యబలం

చెంతటిదో, తెలిసికొనుము. అని, తాత్పర్యము.

మణిముక్తం సువర్ణాని రత్నాని వివిధాని చ
దద్యాద్దశరథో రాజా మా స్మ తేషు మనః కృథాః. ౨౭

టీక ॥ రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; మణిముక్తం=మణులనుముత్తెములను ; సువర్ణాని=బంగారునాణెములను; వివిధాని=నానావిధములయిన; రత్నానిచ = శ్రేష్ఠపదార్థములను; దద్యాత్= ఇచ్చును. తేషు=వానియందు; మనః = మనసును; మాకృథాః=చేయకుము. "స్మ" అనునది పాదపూరణార్థము.

దశరథమహారాజు, రత్నములనుముత్తెములను బంగారునాణెములను, నీకిచ్చును; నీవు, వానియందుమాత్రము కొంచెమైననుమనంబుంచకుము.

అని, తాత్పర్యము.

యౌ తౌ దైవాసురే యుద్ధే వరౌ దశరథో దదాత్
తౌ స్మారయ మహాభాగే సో ర్థో మా త్వా మతిక్రమేత్. ౨౮

టీక॥ మహాభాగే=పూజ్యమగునదృష్టముగలకైకేయీ! దైవాసురే=దేవతలచేత నసురులచేతను జేయఁబడిన ; యుద్ధే=యుద్ధమునందు; యౌ= ఏ; తౌ=ఆ; వరౌ=వరంబులను; దశరథః=దశరథుఁడు; అదదాత్ = ఇచ్చెనో; తౌ = ఆ వరంబులను; స్మారయ = స్మరించునట్లుచేయుము. సః = ఆ; అర్థః= ప్రయోజనము; త్వాం=నిన్ను; మాతిక్రమేత్= దాఁటకుండుఁగాక.

పూజ్యంబగు నదృష్టముగల కైకేయీ! దేవాసురులుచేయుయుద్ధంబున, దశరథుండునీకేవరంబులనిచ్చెనో, నీవావరంబులతనికిజ్ఞప్తికివచ్చునట్లు చేయుము; నీప్రయోజనము, చెడకుండునట్లు, ప్రయత్నింపుము.

అని, తాత్పర్యము.

యదా తు తే వరం దద్యా త్స్వయ ముత్థాప్య రాఘవః
వ్యవస్థాప్య మహారాజం త మిమం వృణుయా వరమ్. ౨౯




టీక॥ యదాతు=ఎప్పుడైతే! రాఘవః= రఘువంశంబునఁబుట్టినదశరథుఁడు; స్వయం=తానే; ఉత్థాప్య=లేపి; తే=నీకొఱకు; వరం=వరంబును; దద్యాత్=ఇచ్చునో; తదా(అధ్యాహృతము)=అప్పుడు; మహారాజం=దశరథమహారాజును; వ్యవస్థాప్య=నిలువఁ దొ్రక్కి-; తం=ఆ; ఇమం=ఈ; వరం= వరమును; వృణుయాః=కోరుము.

దశరథుండెప్పుడు, తానె, నిన్నులేపికూచుండఁబెట్టి, వరంబిచ్చెదనని, చెప్పునో, అప్పుడు, అతని, సత్యంబున నిలువఁదొ్రక్కి, యీవరంబడుగుము.

అని, తాత్పర్యము.

రామం ప్రవ్రాజయారణ్యే నవ వర్షాణి పంచచ
భరతః క్రియతాం రాజా పృథివ్యాః పార్థివర్షభః. ౩౦

టీక॥ నవ=తొమ్మిదియును; పంచచ=అయిదునగు, పదునాలుగయినయనుట; వర్షాణి=సంవత్సరంబులు; రామం=రాముని; అరణ్యే=అడవియందు; ప్రవ్రాజయ = ఊరువిడిచియుండునట్లు చేయుము. భరతః= భరతుఁడు; పృథివ్యాః=భూమికి; రాజా=ప్రభువుగాను; పార్థివర్షభః=రాజశ్రేష్ఠుండుగాను; క్రియతాం = చేయఁబడుఁగాక.

రాముండు, పదునాలుగు సంవత్సరంబు లూరువిడిచి, యరణ్యంబుననుండునట్లు, చేయుము. భరతుండు, భూమికిరాజుగా రాజులలో మేటిగానుండునట్లుచేయుము. అని, యీవరంబునడుగుము. అని, తాత్పర్యము.

చతుర్దశ హి వర్షాణి రామే ప్రవ్రాజితే వనమ్
రూఢశ్చ కృతమూలశ్చ శేషం స్థాస్యతి తే సుతః. ౩౧

టీక॥ రామే=రాముఁడు; చతుర్దశ=పదునాలుగు; వర్షాణి=ఏండ్లను; వనం=అడవిని; ప్రవ్రాజితే= ఊరువిడిచిపోవునట్టు చేయఁబడఁగా; తే = నీయొక్క-; సుతః=కొడుకు; రూఢశ్చ=నాటుకొనినవాఁడై; కృతమూలశ్చ= చేయఁబడిన మూలబలముగలవాఁడై, తనయధీనముగాఁ జేయఁబడిన మూలబలముగలవాఁడైయనట; శేషం=మిగతకాలమును; స్థాస్యతి=ఉండఁగలఁడు.




రాముండు, పదునాలుగుసంవత్సరంబులు,అడవినుండునట్లు, చేయుదువేని,యింతలో,నీకొడుకు,భరతుండు,ప్రజల,యనురాగంబునొంది, మూలబలంబుతనయధీనంబుగాఁ జేసికొనియుండును; కావున, రాముండుమఱల వచ్చినను,రాజ్యంబతనికిఁదక్కదు;అట్లు,మిగతకాలంబును,నీకొడుకే రాజుగానుండఁగలఁడు.అని, తాత్పర్యము.

రామప్రవ్రాజనం చైవ దేవి యాచస్వ తం వరమ్

టీక॥దేవి = రాణివగుకైకేయీ! తం=ఆ; వరం=భరతాభిషేకరూపమయినవరమును; రామప్రవ్రాజనం చైవ= రామునియొక్క-యడవికిఁ బంపుటను;యాచస్వ=అడుగుకొనుము.

రాణివగుకైకేయీ! అట్లగుటంజేసి, నీవుభరతాభిషేకముఁగోరుకొనునప్పుడు,దానితోఁగూడ,విడువక, రామునడవికిఁబంపవలె,నని,యును, దశరథునడుగుకొనుము. అని, తాత్పర్యము.

ఏవం సిధ్యంతి పుత్రస్య సర్వార్థా స్తవ భామిని. ౩౨

టీక॥ భామిని=స్త్రీవగుకైకేయీ! ఏవం=ఇట్లు;తవ = నీయొక్క;పుత్రస్య=కొడుకునకు; సర్వార్థాః=సమస్తకార్యములును;సిధ్యంతి=సమకూరుచున్నవి

కైకేయీ! నీవిప్పుడునేనుజెప్పినప్రకారముచేయుదువేని,నీకొడుకుభరతునకు,నెల్లప్రయోజనంబులును, సమకూరును.

అని, తాత్పర్యము.

ఏవం ప్రవ్రాజిత శ్చైవ రామో ౽రామో భవిష్యతి
భరతశ్చ హతామిత్ర స్తవ రాజా భవిష్యతి. ౩౩

టీక॥ఏవం=ఇట్లు; ప్రవ్రాజితః=అడవికిఁబొందునట్లుచేయఁబడిన;రామశ్చైవ=రాముఁడును;అరామః = రాముఁడుగానివాఁడు, ప్రజలకుసంతోషముసేయఁజాలనివాఁడనుట; లేక;రామః(అనిపదవిభాగము)=రాముఁడుగా,సహాయసంపత్తిలేక ఒకఁడుగానేయనుట; భవిష్యతి=కాఁగలఁడు.తవ = నీయొ

కు; పుత్రః(అధ్యాహృతము)= కొడు కైన; భరతశ్చ=భరతుండును; హతామిత్రః= కొట్టఁబడినశత్రువులుగలవాఁడై; రాజా=రాజుగా; భవిష్యతి=కాఁగలఁడు.

ఈప్రకారముగా రాముండు, పదునాలుగు సంవత్సరంబు లడవినుండినపిమ్మట, బహుకాలముచాలదూరంబుననుండుటవలనభరతుండును జనులనందఱం జక్కఁగాసంతోషపఱచుచుండుట వలనను, జనులకు రామునిపైనను రాగం బెంత మాత్రమునుండదు (పక్షాంతరమందు; ఈప్రకారముగా రాముండు పదునాలుగుసంవత్సరంబులడవినుండి, యాపిమ్మట,నిచ్చటికివచ్చినప్పటికిని, రాజైనభరతునిభయంబున, అతనికెవ్వరును సాహాయ్యంబు సేయువారలుండరు; కావున,నతండేకాకిగా సేయుండును.);నీకొడుకు భరతుండు, శత్రువులజయించి, యెప్పటికిని,రాజుగానుండఁగలఁడు.

అని,తాత్పర్యము.

యేన కాలేన రామశ్చ వనాత్ప్రత్యాగమిష్యతి
తేన కాలేన పుత్రస్తే కృతమూలో భవిష్యతి. ౨౮
సంగృహీతమనుష్యశ్చ సుహృద్భిస్సార్థ మాత్మవాన్.

టీక॥ రామశ్చ=రాముండును; యేన=ఏ; కాలేన=కాలముచేత;వనాత్=అడవినుండి; ప్రత్యాగమిష్యతి =రాఁగలఁడో; తేన=ఆ; కాలేన=కాలముచేత; ఆత్మవాన్=మంచిబుద్ధి గలవాఁడగు; తే=నీయొక్క; పుత్రః= కొడుకు; సంగృహీతమనుష్యశ్చ= తనకువశ్యులుగాఁజేయఁబడినమనుష్యులు గలవాఁడునై; సుహృద్భిస్సార్థం=స్నేహితులతోఁగూడ; కృతమూలః= చేయఁబడిన వేళ్లుగలవాఁడు, కదలింపఁగూడనివాఁడనుట; భవిష్యతి=కాఁగలఁడు.

రాముండిచ్చటికి వచ్చునంతకు, ఈ పదునాలుగేండ్లలోపల, నీకొడుకుభరతుండు,బుద్ధిమంతుండు కావున, జనులఁదనకు వశ్యులఁగాఁజేసికొని, స్నేహితులసంపాదించి, యెంతమాత్రముగదలింపఁ గూడనివాఁడై,స్థిరుండై యుండును. అని,తాత్పర్యము.

ప్రాప్తకాలంతు తే మన్యే రాజానం వీతసాధ్వసా. ౩౫

రామాభిషేకసంభారా న్నిగృహ్య వినివర్తయ

టీక॥త్వం (అధ్యాహృతము)= నీవు;వీతసాధ్వసా=విడువఁబడిన భయముగలదానవై; రాజానం= దశరథమహారాజును; నిగృహ్య=బలాత్కరించి; రామాభిషేకసంభారాన్=రాముని పట్టాభిషేకము కొఱకైన ప్రయత్నములను;వినివర్తయ=నిలువుము. ఏతత్(అధ్యాహృతము)=ఇది; తే=నీకు; ప్రాప్తకాలంతు=పొందఁబడినకాలము గలదానిఁగా; మన్యే = తలంచుచున్నాను.

నీవు,భయంబువిడిచి, దశరథమహారాజునునిర్బంధించి, రామునకుఁబట్టాభిషేకము సేయుటకై సేయుప్రయత్నంబులు,నిలిచిపోవునట్లు,చేయుము; దానికిదిసరియయినకాలమని, నాకుఁదోఁచుచున్నది.అని, మంధరకైకేయికిఁజెప్పినది.అని, తాత్పర్యము.

అనర్థ మర్థరూపేణ గ్రాహితా సా తత స్తయా. ౩౬
హృష్టా ప్రతీతా కైకేయీ మంధరా మిద మబ్రవీత్

టీక॥సా=ఆ ; కైకేయీ=కైకేయి;తయా=ఆమంధరచేత; అనర్థం=ప్రతికూలమయినయర్థమును; అర్థరూపేణ=అనుకూలమయిన యర్థముయొక్కరూపముచేత; గ్రాహితా=తెలిసికొనునట్లుచేయఁబడినదై; తథా=(అధ్యాహృతము)అట్లు;ప్రతీతా=తెలిసికొన్నదై; హృష్టా=సంతసించినదై; తతః= అటుపిమ్మట; మంధరాం=మంధరనుగూర్చి;ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

కైకేయి, తనకే ప్రతికూలముగానుండుదాని ననుకూలంబుగా దోఁచునట్లు,మంధరచే బోధింపఁబడినదై, మోహంబుననట్లెతనకుఁబ్రతికూలంబులగు రామవివాసన భరతాభిషేకములను,దనకనుకూలంబులుగాఁదలంచి,సంతోషంబునొంది, మంధరంజూచి,యిట్లని,చెప్పెను.అని, తాత్పర్యము.

సాహి వాక్యేన కుబ్జాయాః కిశోరీవో త్పథం గతా. ౩౭
కైకేయీ విస్మయం ప్రాప్తా పరం పరమ దర్శనా

టీక॥ పరమదర్శనా=ఉత్కృష్టమగుచూచుటగలదియగు; సా=ఆ; కైకేయీ=కైకకు; కుబ్జాయాః = గూనిదైన మంధరయొక్క; వాక్యేన=మాటచేత; పరం=అధికమయిన; విస్మయం=ఆశ్చర్యమును; ప్రాప్తా = పొందినదై; ఉత్పథం = కానిత్రోవను; ప్రాప్తా= పొందిన; కిశోరీవ (స్థితా)హి = ఆఁడుగుఱ్ఱముఁబోలెనుండినదిగదా!

ఆకైకేయి, యథార్థస్థితినిజక్కఁగానెఱుంగంజాలినదయ్యు, నామంధర మాటలకునాశ్చర్యంబునొంది, బెదరువలన దారితప్పిన యాఁడుగుఱ్ఱముంబోలెఁ, బట్టశక్యముగాకుండినది.

అని, తాత్పర్యము.

కుబ్జే త్వాం నాభి జానామి శ్రేష్ఠాం శ్రేష్ఠాభిధాయినీమ్. ౩౮
పృథివ్యా మసి కుబ్జానా ముత్తమా బుద్ధినిశ్చయే

టీక॥ కుబ్జే=గూనిదానవగుమంధరా! త్వాం = నిన్ను; శ్రేష్ఠాభిధాయినీం=ఉత్తమమయినమాటను జెప్పుదానిఁగాను; శ్రేష్ఠాం=ఉత్తమురాలనుగాను; నాభిజానామి=ఎఱుంగను. త్వం(అధ్యాహృతము)=నీవు; బుద్ధినిశ్చయే= బుద్ధిచే నిశ్చయించుటయందు; పృథివ్యాం = భూమియందు; కుబ్జానాం= గూనివారలలోపల; ఉత్తమా =శ్రేష్ఠురాలవు; అసి=అగుచున్నావు.

గూనిదానవగుమంథరా! నీవింతచక్కఁగా మాటలుచెప్పుదాన వనియును, మేలు బోధింపఁ గలదాన వనియును, బూజ్యురాలవనియును, నేనిదివఱకెఱుంగనైతి; గూనివారలెయితరులకన్నను బుద్ధిగలవారలు; నీవు, ఆలోచనయందు, భూమినున్నయాగూని వారలందఱికన్నను సమర్థురాలవు.

అని, తాత్పర్యము.

త్వమేవతు మమార్థేషు నిత్యయుక్తా హితైషిణీ. ౩౯
నాహం సమవబుధ్యేయం కుబ్జే రాజ్ఞశ్చి కీర్షితమ్

టీక॥ త్వమేవతు=నీవుమాత్రమే; మమ=నాయొక్క; అర్థేషు= కార్యములయందు; నిత్యయుక్తా=ఎల్లప్పుడునాసక్తురాలవును; హితైషిణీ= మేలుగోరుదానవును. కుబ్జే=గూనిదానవగుమంథరా! అహం=నేను; రాజ్ఞః=దశరథ




మహారాజుయొక్క; చికీర్షితం=చేయఁదలంపఁబడినదని ; నసమవబుద్ధ్యే=యం=తెలిసికొన లేను.

గూనిదానవగుమంధరా! నీనాకతెవె, నాకార్యములయందుఁజాలనాసక్తి గలదానవు. నాకుమేలుగలుగవలెనని గోరుదానవు; నీవులేక నేను మాత్రమె యయినచో, నిప్పుడు,దశరథమహారాజు రామాభిషేకముచేసినన్నుఁజెఱుపం దలంచుటను, దెలిసికొనలేను.

అని, తాత్పర్యము.

సంతి దుస్సంస్థితాః కుబ్జా వక్రాః పరమదారుణాః. ४०
త్వం పద్మ మివ వాతేన సన్నతా ప్రియదర్శనా

టీక॥దుస్సంస్థితాః=చెడ్డదైనయవయవములకూడికగలవారును;వక్రాః=వంకరలయిన వారును ; పరమదారుణాః= మిక్కిలియుభయంకరులయిన వారునగు; కుబ్జాః= గూనివారు; సంతి= ఉన్నారు. ప్రియదర్శనా= సంతోషంబగుదర్శనంబుగల;త్వం=నీవు; పద్మమివ=తామరపువ్వుంబోలె; వాతేన=గాలిచేత; సన్నతా = వంగినావు.

లోకంబునందు, వికృతంబుగాఁగూడుకొనినయవయవములుగలిగి వంకరలయినవారైచూపరులకు భయంబుఁబుట్టించుచుండుగూని వారలనేకులున్నారు;నీవుమాత్రమట్లుకాదు; నీవు,చూపరులకుఁజాలసంతోషము గలిగించునట్టి సుందరరూపంబుగలదానవు ; వాతంబునఁ , గమలంబువలె వంగియున్నావు; గాలిచేవంగినదయ్యును గమలం బెట్లు సుందరంబుగానేయుండునో, నీవు నట్లుసహజసుందరవగుటంజేసి, వాతోద్రేకంబునవంగిన దానవయ్యు నతిసుందరివిగానేయగపడుచున్నావు.

అని, తాత్పర్యము.

ఉర స్తే భినివిష్టంవై యావత్స్కంధా త్సమున్నతమ్. ४౧
అధస్తా చ్చోదరం శాతం సునాభ మివ లజ్జితమ్

టీక॥ తే=నీయొక్క; ఉరః= ఱొమ్ము; అభినివిష్టం=పట్టుగలదై;("వై" అనునది పాదపూరణార్థము) యావత్స్కంధాత్ =మూఁపులపర్యంతము;




సమున్నతం = పొడవైనది, అధస్తాచ్చ=క్రిందను;సునాభం= మంచిబొడ్డుగల;ఉదరం=కడుపు; లజ్జితమివ=సిగ్గునొందినదివోలె;శాతం=సన్నమైనది.

నీఱొమ్ము, మూఁపులున్నతములుగానున్నవనియసూయచేఁ బట్టుగల్గి, మూఁపులవఱకుఁ బొడవైనది;దానిక్రింద, సుందరంబగు బొడ్డుగల కడుపును, "నాతోఁగూడనుండుఱొమ్ము, అంతపొడవుగానున్నది;నాకంతపొడవగుట కాలేదు;" అనిసిగ్గునొందినదోయనునట్లు సన్నముగానున్నది.

అని, తాత్పర్యము.

పరిపూర్ణంతు జఘనం సుపీనౌచ పయోధరౌ. ౪౨
విమలేందుసమం వక్త్రమహో రాజసి మంథరే

టీక॥జఘనంతు=మొలయును; పరిపూర్ణం=నిండియున్నది. పయోధరౌచ= స్తనములును; సుపీనౌ= మిక్కిలియుబలిసినవి. వక్త్రం=మొగము;విమలేందుసమం=కలంకములేనిచంద్రునితో సరియయినది. మంథరే = మంథరా! రాజసి=ప్రకాశించుచున్నావు.అహో=ఆశ్చర్యము!

నీజఘనము, విశాలమయి యున్నది; నీ స్తనములు బలిసినవిగా నున్నవి; నీముఖంబు,కలంకములేనిచంద్రునకు సాటివచ్చుచున్నది ; నీవుచూపరులకాశ్చర్యంబుగలుగునట్లుప్రకాశించు చున్నావు. అని, తాత్పర్యము.

జఘనం తవ నిర్ఘుష్టం రశనాదామశోభితమ్. ౪౩
జంఘే భృశ ముపన్యస్తే పాదౌ చాప్యాయతా వుభౌ

టీక॥తవ=నీయొక్క;జఘనం=మొల;రశనాదామశోభితం=మొలనూలిసరముచేనలంకరింపఁబడినదై ; నిర్ఘుష్టం=ధ్వనిగలది. తే=నీయొక్క ; జంఘే= పిక్కలు; భృశం = మిక్కిలియు; ఉపన్యస్తే=చక్కఁగానుంచఁబడినవి,సుందరంబైనసన్నివేశముగల వనుట. పాదౌ=పాదములు;ఉభౌ=రెండును;ఆయతౌ=నిడుపైనవి.

నీజఘనంబు మొలనూలిచే నలంకరింపఁబడిధ్వనించుచున్నది ; నీపిక్కలు,సుందరంబులుగానున్నవి. నీపాదంబులు రెండును, నిడుపుగా, సుందరంబులై యున్నవి.అని, తాత్పర్యము.

స ౯

త్వ మాయతాభ్యాం సక్థిభ్యాం మంధరే క్షౌమవాసినీ. ४४
అగ్రతో మమ గచ్ఛంతీ రాజహంసీవ రాజసే

టీక॥మంధరే=మంధరా!త్వం= నీవు; ఆయతాభ్యాం=నిడుపులైన;సక్థిభ్యాం=తొడలతో; యుక్తా (అధ్యాహృతము)=కూడినదానవై; క్షౌమవాసినీ= తెల్లపట్టుబట్టనుగట్టుకొన్నదానవై;మమ=నాయొక్క; అగ్రతః=ముందట;గచ్ఛంతీ=పోవుచు ; రాజహంసీవ=అందురాజహంసపక్షివలె ; రాజసే=ప్రకాశించుచున్నావు.

మంధరా!నీవు,నిడుపులయిన తొడలుగలిగి, తెల్లపట్టుబట్టగట్టుకొని, నా ముందటందిరుగుచు, రాజహంసియుంబోలెఁజూపట్టుచున్నావు.

అని, తాత్పర్యము.

ఆసన్ యా శ్శంబరే మాయా స్సహస్ర మసురాధిపే. ४౫
సర్వా స్త్వయి నివిష్టా స్తా భూయశ్చా న్యా స్సహస్రశః

టీక॥అసురాధిపే=అసురులకుఁబ్రభువయిన; శంబరే= శంబరాసురునియందు;యాః=ఏ; సహస్రం=వెయ్యాయిన;మాయాః=మాయలు; ఆసన్=ఉండినవో; తాః= ఆమాయలు; సర్వాః=అన్నియును; భూయశ్చ=ఇంకను;సహస్రశః=వేనవేలుగా;అన్యాః=ఇతరమాయలును; త్వయి=నీయందు; నివిష్టాః=ఉన్నవి.

అసురుల కధిపుఁడగు శంబరాసురునియందే మాయలు వేయిసంఖ్యగలవియుండినవో,ఆమాయలన్నియును, మఱియునితరమాయలును వేనవేలుగా నీయందున్నవి. అని, తాత్పర్యము.

తవే దం స్థగు యద్దీర్ఘం రథఘోణ మివా యతమ్. ४౬
మతయః క్షత్రవిద్యాశ్చ మాయా శ్చాత్ర వసంతి తే

టీక॥ రథఘోణమివ=ముక్కువలెనుందురథములయొక్క యవయవవిశేషముఁబోలె, చక్రరంధ్రము సమీపమునసుండునున్నత్రప్రదేశముబోలెనను ట;ఆయతం=నిడుపయిన; తవ=నీయొక్క;ఇదం=ఈ; స్థగు=గూను;యత్=

(అస్తి)పెదిగలదో;తత్ర=ఆ;అత్ర=ఈ గూనునందు; తే=నీయొక్క; మత యః=బుద్ధులును; క్షత్రవిద్యాశ్చ=క్షత్రియులయొక్క విద్యలును, రాజనీతులు ననుట; మాయాశ్చ=మాయలును; వసంతి=ఉన్నవి.

రథచక్రముసమీపముననుండునున్న తత్ప్రదేశంబుఁ బోలె, దీర్ఘమై యుండునీగూనులో, నీబుద్ధులు నీవునేర్చియుండురాజనీతులును మాయలును, వసించుచున్నవి. అని, తాత్పర్యము.

అత్ర తే ప్రతిమోక్ష్యామి మాలాం కుబ్జే హిరణ్మయీమ్. ౪౭
అభిషిక్తేచ భరతే రాఘవేచ వనం గతే

టీక ॥ కుబ్జే=గూనిదానవగుమంథరా! భరతే=భరతుండు; అభిషిక్తేచ=అభిషేకింపఁబడఁగానే; రాఘవే=రాముండు; వనం=అడవిని; గతేచ=పొందఁగానే; తే=నీయొక్క; అత్ర=ఈగూనునందు; హిరణ్మయీం=బంగారువికారమయిన; మాలాం=మాలికను; ప్రతిమోక్ష్యామి=స్థాపించెదను.

గూనిదానవగుమంథరా! భరతుననుఁబట్టాభిషేకముకాఁగానే, రాముండడవికిఁబోఁగానే, నీగూనునందు, బంగారుగొలుసువేసెదను.

అని, తాత్పర్యము.

జాత్యేనచ సువర్ణేన సునిష్టప్తేన మంథరే. ౪౮
లబ్ధార్థాచ ప్రతీతాచ లేపయిష్యామి తే స్థగు

టీక॥మంథరే=మంథరా! అహం (అధ్యాహృతము)=నేను; లబ్ధార్థాచ=పొందఁబడిన ప్రయోజనముగలదాననై; ప్రతీతాచ=సంతోషించినదాననై; జాత్యేన=మంచిజాతిలోఁబుట్టినదియును;సునిష్టప్తేన=చక్కఁగాఁగరఁగింపఁబడినదియునగు; సువర్ణేనచ=బంగారముచేతను; తే=నీయొక్క; స్థగు=గూనును; లేపయిష్యామి=పూసెదను,బంగారు కంచుకముతోఁగప్పెదననుట,

మంథరా! నేను, కార్యసిద్ధినొందినప్పుడు, సంతోషించి,మంచిజాతిలోనిదియును చక్కఁగాఁగరఁగింపఁబడినదగు

టచేనుత్తమంబునగు బంగారుతోఁ జేయఁబడినకవచము వేసి, నీగూను, నలంకరించెదను.

అని, తాత్పర్యము.

ముఖే చ తిలకం చిత్రం జాతరూపమయం శుభమ్. ౪౯
కారయిష్యామి తే కుబ్జే శుభా న్యాభరణానిచ

టీక॥ కుబ్జే = గూనిదానవగుమంథరా! తే=నీయొక్క; ముఖే=మొగమునందు; చిత్రం = నానావర్ణములుగలదియును; జాతరూపమయం=బంగారువికారమయినదియును; శుభం=మంగళకరంబయినదియునగు; తిలకంచ=బొట్టును; శుభాని=మంగళకరంబులగు; ఆభరణానిచ = సొమ్ములను; కారయిష్యామి=చేసెదను.

గూనిదానవగుమంథరా! నీముఖంబునకు, బంగారుతోఁజేయఁబడినానావిధమణులుపొదుగఁబడియుండుటచే నానావిధవర్ణంబులుగల సుందరంబగుతిలకంబుఁజేయించెదను; మఱియు, నితరములయిన మంచిసొమ్ములం జేయించి యిచ్చెదను. అని, తాత్పర్యము.

పరిధాయ శుభే వస్త్రే దేవతేవ చరిష్యసి. ౫౦

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; శుభే=మంగళకరంబులగు; వస్త్రే=బట్టలను; పరిధాయ=కట్టుకొని; దేవతేవ=దేవతయుంబోలె; చరిష్యసి=తిరుగఁగలవు.

నీవు, చాలవిలువగలయుత్తమంబులగుబట్టలఁగట్టుకొని, దేవతయుం బోలె వెలుంగుచుఁ, దిరుగుచుండఁగలవు.

అని, తాత్పర్యము.

చంద్ర మాహ్వాయమానేన ముఖేనా ప్రతిమాననా
గమిష్యసి గతిం ముఖ్యాం గర్వయంతీ ద్విషజ్జనమ్. ౫౧

టీక॥ అప్రతిమాననా=సరిలేనిముఖముగల; త్వం (అధ్యాహృతము)=నీవు; చంద్రం=చంద్రునిగూర్చి; ఆహ్వాయమానేన=పోటిసేయుచున్న; ముఖేన=ముఖముచేత; ద్విషజ్జనం=శత్రుజనమును గూర్చి; గర్వయంతీ = గర్వ

ముసేయుచు; ముఖ్యాం= శ్రేష్ఠమయి నః గతిం=నడకను; గమిష్యసి=పొందఁ గలవు.

సరిలేనిముఖంబుగలదానవగునీవు, చంద్రునితోఁబోటి సేయునంతటిసుందరంబయినముఖంబుతో, నాశత్రువులం జూచి,గర్వించుచు,సుందరంబు గాఁదిరుగుచుండఁగలవు. అని, తాత్పర్యము.

తవాపి కుబ్జాః కుబ్జాయాః స్సర్వాభరణభూషితాః
పాదౌ పరిచరిష్యంతి యథైవ త్వం సదా మమ. ౫౨

టీక॥త్వం=నీవు; సదా= ఎల్లప్పుడు;మమ=నాకు;యథా=ఎట్లో ; తథా(అధ్యాహృతము)ఏవ=అట్లే ; తవాపి=నీకును ; సర్వాభరణ భూషితాః=సమస్తములయినసొమ్ములచేన లంకరింపఁబడిన; కుబ్జాః= గూనివారలు; పాదౌ=పాదములను; పరిచరిష్యంతి=సేవింపఁగలరు.

నీవు, నాపాదముల నెల్లప్పుడుసేవించుచుండునట్లుసమస్తములయిన సొమ్ములచే నలంకరింపఁబడినకుబ్జలు, నీపాదములకును,నానావిధంబుగా, సేవసేయఁగలరు. అని, కైకేయిమంథరతోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఇతి ప్రశస్యమానా సా కైకేయీ మిద మబ్రవీత్
శయానాం శయనే శుభ్రే వేద్యా మగ్నిశిఖా మివ. ౫౩

టీక॥సా=ఆమంథర;ఇతి=ఈప్రకారముగా; ప్రశస్యమానా=కొనియాఁడబడుచున్నదై;శుభ్రే=తెల్లనిదైన; శయనే=పాన్పునందు; శయానాం=పరుండియున్నది యును; వేద్యాం=వేదియందు;స్థితాం(అధ్యాహృతము)=ఉన్న;అగ్నిశిఖామివ(స్థితాం)=నిప్పుయొక్క మంటవలె నున్నదియు నగు;కైకేయీం=కైకేయినిగూర్చి;ఇదం= ఈమాటను;అబ్రవీత్=చెప్పెను.

ఆమంథర,కైకేయిచేనీప్రకారముగాఁగొనియాఁడఁబడినదై, తెల్లగానుండుపాన్పునఁబరుండి వేదియందున్న యగ్నిజ్వాలయుంబోలె వెలుంగుచున్నకైకేయింజూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

గతోదకే సేతుబంధో న కల్యాణి విధీయతే

ఉత్తిష్ఠ కురు కల్యాణి రాజాన మనుదర్శయ. ౫౪

టీక॥ కల్యాణి=మంగళకరివగు కైకేయీ! గతోదకే = పోయిననీళ్లుగలస్థలమునందు; సేతుబంధః=కట్టగట్టుట; నవిధీయతే=చేయఁబడదు. కల్యాణి=మంగళకరివగు కైకేయీ! ఉత్తిష్ఠ=లెమ్ము. కురు=చేయుము. రాజానం= దశరథమహారాజును; అనుదర్శయ = ఎదురుచూడుము.

మంగళకరివగు కైకేయీ! నీళ్లంత యుఁబాఱిపోయినపిమ్మట, గట్టగట్టిననేమిప్రయోజనము? అట్లు, రామాభిషేకంబయినపిమ్మట, నీవు వరంబుఁగోరియుఁబ్రయోజనంబులేదు; కావుననిప్పుడీయుపయోగములేనిమాటలం బ్రొద్దుపుచ్చవలదు; లెమ్ము; నేఁజెప్పినట్లుసేయుము; కోపగృహంబునొంది రాజువచ్చుటకెదురుచూచుచుండుము.

అని, తాత్పర్యము.

తథా ప్రోత్సాహితా దేవీ గత్వా మంథరయాసహ
క్రోధాగారం విశాలాక్షీ సౌభాగ్యమదగర్వితా. ౫౫
అనేకశతసాహస్రం ముక్తాహారం వరాంగనా
అవముచ్య వరార్హాణి శుభాన్యాభరణానిచ. ౫౬
తతో హేమోపమా తత్ర కుబ్జా వాక్యవశంగతా
సంవిశ్య భూమౌ కైకేయీ మంథరా మిద మబ్రవీత్. ౫౭

టీక॥ విశాలాక్షీ=పెద్దకండ్లుగలదియును; సౌభాగ్యమదగర్వితా= సౌందర్యముచేఁగలిగినమదముచే గర్వముగలదియును; వరాంగనా=శ్రేష్ఠస్త్రీయునగు; దేవీ=రాణియయిన; కైకేయీ= కైకేయి; తథా= అట్లు; ప్రోత్సాహితా=పురికొలుపఁబడినదై; కుబ్జావాక్యవశం=గూనిదైనమంథరమాటయొక్కయధీనతను; గతా=పొందినదై; మంథరయాసహ=మంథరతోఁగూడ; క్రోధాగారం = కోపగృహమును; గత్వా=పొంది; అనేకశతసాహస్రం=అనేకములయినలక్షలువెలగల; ముక్తాహారం=ముత్యములహారమును; వరార్హాణి=శ్రేష్ఠములును; శుభాని=మంగళకరంబులునగు; ఆభరణానిచ=సొమ్ములను; అవముచ్య=విడిచి; తతః=అంతట; హేమోపమా= బంగారుతోఁబోల్కిగల

దై;తత్ర=ఆకోపగృహమునందు; భూమౌ= నేలయందు; సంవిశ్య=పరుండి; మంధరాం=మంధరనుగూర్చి; ఇదం= ఈమాటను;అబ్రవీత్ =చెప్పెను.

విశాలంబులగు నేత్రంబులుగలిగి, సౌందర్యమదంబునగర్వించి, యుత్తమ స్త్రీయయియుండు, రాణియగుకైకేయి, అట్లుమంధరచేఁబురికొల్పఁబడినదై, గూనిదగుమంధరమాటకులోఁబడి, మంధరతోఁగూడ, నాకోపగృహంబునకుఁబోయి, పెక్కులక్షలువెలగలముక్తాహారమునుమంగళకరంబులునుత్తమంబులునైనయితరభూషణంబులను, దీసివేసి, రత్నఖచితభూషణంబులులేకుండుటంజేసి,యచ్చపుబంగారువలెవెలుంగుచుండుమేనుగలదై, యచ్చటనేలపైఁబరుండి,మంధరంజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇహవా మాంమృతాం కుబ్జే నృపాయా వేదయిష్యసీ

టీక॥కుబ్జే= గూనిదానవగు మంధరా!ఇహవా=ఇచ్చటనే; మాం = నన్ను;మృతాం=చచ్చినదానిఁగా ; నృపాయ=రాజుకొఱకు; ఆవేదయిష్యసి=తెలుపఁగలవు.

గూనిదానవగుమంధరా!ఒకవేళ దశరథుండునాకువరంబుల నొసంగకపోవునేని,యిచ్చటనేనేనుప్రాణంబులు విడుతునుకాని;కార్యసిద్ధినొందక, జీవింపను; అప్పుడు"కైకేయికోపగృహంబునఁజచ్చినది" అని,నీవుదశరథునకుఁజెప్పఁగలవు;(లేక,నాతండ్రియగు కేకయరాజునకుఁజెప్పఁగలవు") అని, తాత్పర్యము.

'వనంతు రాఘవే ప్రాప్తే భరతః ప్రాప్స్యతి క్షితిమ్. ౪౮

టీక॥రాఘవే = రాముఁడు ; వనంతు=అడవిని;ప్రాప్తే= పొందఁగా; భరతః=భరతుఁడు;క్షితిం = భూమిని;ప్రాప్స్యతి=పొందఁగలఁడు.

అట్లుగాదేని,రాముండడవికిఁ బోఁగా, భరతుండు,భూమికిరాజు కావలయును;ఈరెంటిలో నొకటియేదైనను జరగుటనిశ్చయము.

అని,తాత్పర్యము.

న సువర్ణేనమే హ్యర్థో న రత్నైర్నచ భూషణైః

ఏష మే జీవితస్యాంతో రామో యద్యభి షిచ్యతే. ౪౯

టీక॥సువర్ణేన=బంగారముచేత; మే=నాకు;అర్థోనహి= ప్రయోజనములేదుగదా!రత్నైః = మణులచేత;న (అర్థః)= ప్రయోజనము లేదు.భూషణైశ్చ=సొమ్ములచేతను; న (అర్థః)=ప్రయోజనములేదు . రామః=రాముడు; అభిషిచ్యతేయది = అభిషేకింపఁబడునేని;ఏషః=ఇది, మే= నాయొక్క; జీవితస్య=బ్రతుకుటకు; అంతః=తుద.

దశరథుండు, నాకుబంగారమొసంగినను బ్రయోజనములేదు;మణులనిచ్చిననుపయోగంబులేదు ; సొమ్ములనిచ్చినను నేనొప్పను; రామునకు మాత్రము పట్టాభిషేకముజరగునేని , నేను బ్రాణంబుల విడుతును ; ఇదినిశ్చయము.అని, తాత్పర్యము.

అథో పున స్తాం మహిషీం మహీక్షితో
వచోభి రత్యర్థమహాపరాక్రమైః
ఉవాచ కుబ్జా భరతస్య మాతరం
హితం వచో రామ ముపేత్య చాహితమ్. ౬౦

టీక॥ అథ=అటుపిమ్మట ; అత్యర్థమహాపరాక్రమైః=మిక్కిలియనధికమయిన పరాక్రమంబుగల, అతికౄరంబులయినయనుట; వచోభిః= మాటలతో;యుక్తా (అధ్యాహృతము)= కూడిన;కుబ్జా=గూనిదగుమంథర ; మహీక్షితః=రాజగుదశరథుని యొక్క; మహిషీం=ఉత్తమభార్యయగు;తాం= ఆ; భరతస్య=భరతునియొక్క; మాతరం=తల్లియయినకైకేయిని గూర్చి; హితం=మేలుగలిగించునదియును; రామం=రాముని; ఉపేత్య= ఉద్దేశించి; అహితంచ = కీడుగలిగించునదియునగు;వచః=మాటను; పునః=మఱల; ఉవాచ=చెప్పెను.

అంత,నతిక్రూరంబులగు మాటలంజెప్పుగూనిదగు నామంథర, దశరథుని యుత్తమభార్యయు భరతునితల్లియునగునాకైకంజూచి, యాకైకకుమేలునురామునకుఁగీడును గలుగుటకై, ఇట్లని,చెప్పెను.అని, తాత్పర్యము.

ప్రపత్స్యతే రాజ్య మిదం హి రాఘవో
యది ధ్రువం త్వం ససుతాచ తప్స్యసే
అతో హి కల్యాణి యతస్వ త త్తథా
యథా సుత స్తే భరతోభిషేక్ష్యతే.౬౧

టీక॥ రాఘవః=రాముఁడు; ఇదం=ఈ; రాజ్యం=దొరతనమును; ప్రపత్స్యతేయది=పొందునేని; త్వం=నీవు; ససుతాచ = కొడుకుతోఁగూడినదానవైయును; తప్స్యసే = దుఃఖించెదవు. ధ్రువంహి=నిశ్చయముగదా ! కల్యాణి=మంగళకరమగుకైకా! అతః=ఇందువలన; ("హి" అనునది పాదపూరణార్థము) యథా=ఎట్లు; తే=నీయొక్క; సుతః=కొడుకయిన; భరతః=భరతుఁడు; అభిషేక్ష్యతే=అభిషేకింపఁబడునో; తథా=అట్లు; తత్=దానికి; యతస్వ=యత్నింపుము.

కల్యాణివగు కైకేయీ ! రాముండీ రాజ్యంబునొందునేని, నీకొడుకు భరతుండును నీవును దుఃఖించెదరు; ఇదినిశ్చయము, కావున, రామునకుఁ బట్టాభిషేకముగాక, నీకొడుకు భరతునకుఁ బట్టాభిషేకంబగునట్లు, ప్రయత్నింపుము.

అని, తాత్పర్యము.

తథా తివిద్ధా మహిషీతు కుబ్జయా
సమాహతా వాగిషుభి ర్ముహుర్ముహుః
విధాయ హస్తౌ హృదయే తివిస్మితా
శశంస కుబ్జాం కుపితా పునః పునః.౬౨

టీక॥ తథా=అట్లు; కుబ్జయా=గూనిదగుమంథరచేత; వాగిషుభిః=మాటలనుబాణములచేత; ముహుర్ముహుః=మాటిమాటికి; సమాహతా=కొట్టఁబడినదియును; అతివిద్ధా=మిక్కిలియును దుఃఖమునొందినదియునగు; మహిషీ=రాణియగుకైకేయి ("తు" అనునది పాదపూరణార్థము); అతివిస్మితా=మిక్కిలియునాశ్చర్యమునొందినదై; హృదయే=రొమ్మునందు; హస్తౌ = చేతులను; విధాయ=చేసి, ఉంచియనుట; కుపితా=కోపమునొందినదై; పునఃపునః=మాటిమాటికి; కుబ్జాం=గూనిదగుమంథరనుగూర్చి; శశంస=చెప్పెను.

అట్లు, బాణంబులుంబోలెఁగ్రూరంబులయినమాటిమాటికి మంథరచెప్పినమాటలకులోఁబడి, కైకేయి, మిగుల దుఃఖించి, రామునకుఁబట్టాభిషేకము సేయంబూనినదశరథునిపైఁగోపంబుఁబూని, "నాకుబహుప్రియుండుఁబోలె నుండిదశరథుండిట్లు నన్నుఁజెఱుపందలంచెనుగదా!" యని యాశ్చర్యంబు నొంది, ఱొమ్మునంజేతులిడికొని, మంథరంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

యమస్య వా మాం విషయం గతా మితో
నిశామ్య కుబ్జే ప్రతివేదయిష్యసి
వనం గతే వా సుచిరాయ రాఘవే
సమృద్ధకామో భరతో భవిష్యతి. ౬౩

టీక॥ కుబ్జే = గూనిదానవగుమంథరా! ఇతః = ఈకోపగృహమునుండి; యమస్య = యమునియొక్క; విషయం = దేశమును; గతాం = పొందిన; మాం = నన్ను; నిశామ్య వా = చూచియయినను; ప్రతివేదయిష్యసి = తెలుపఁబోవుచున్నావు. సుచిరాయ = బహుకాలము; రాఘవే = రాముఁడు; వనం = అడవిని; గతే = పొందఁగా; భరతః = భరతుఁడు; సమృద్ధకామోహి = సంపూర్ణములయిన కోర్కులు గలవాఁడుగానైనను; భవిష్యతి = కాఁగలఁడు.

గూనిదానవగుమంథరా! నేనీకోపగృహంబునుండియెమృతినొందఁగా, నీవు దానింజూచి, దశరథునకుం దెలుపుటయయినను గాఁగలదు, లేక; రాముండు బహుకాలం బడవిలోనుండఁగా, భరతుండు శాశ్వతంబుగా రాజ్యసుఖంబులుపొంది, పూర్ణకాముండు గానైనను, గాఁగలఁడు; ఈరెంటిలోనొక్కటియేదైనను జరగుటసిద్ధము; వేఱులేదు.

అని, తాత్పర్యము.

అహం హి నైవాస్తరణాని న స్రజో
న చందనం నాంజనపానభోజనమ్
న కించిదిచ్ఛామి న చేహ జీవితం
న చేదితో గచ్ఛతి రాఘవో వనమ్. ౬౪

టీక॥ఇతః = ఇచ్చటనుండి; రాఘవః= రాముండు; వనం=అడవిని; నగచ్ఛతిచేత్ =పొందఁడేని; అహం= నేను; ఆస్తరణాని=పఱపులను; నైవ, ఇచ్ఛామి (అధ్యాహృతము)హి=కోర నేకోరను గదా! స్రజః = పుష్పమాలికలను; న(ఇచ్ఛామి)=కోరను; చందనం=చందనమును; న(ఇచ్ఛామి=కోరను. అంజనపానభోజనం=తలంటుకొనుటను, త్రాగుటను, భుజించుటను; న(ఇచ్ఛామి)=కోరను. కించిత్ =దేనిని; నేచ్ఛామి=కోరను, ఇహ=ఇచ్చట; జీవితంచ=ప్రాణమును గూడ; న(ఇచ్ఛామి)=కోరను.

రాముండిచ్చటనుండి యడవికిఁబోఁడేని, నేనుబఱపులపైఁబరుండను; పుష్పమాలికలధరింపను; చందనముఁబూసికొనను అభ్యంజనముఁజేసికొనను; త్రాఁగను; భోజనంబుఁజేయను; నాకేదియు నక్కఱలేదు; ప్రాణములనుగూడవిడిచెదను. అని, కైకేయిమంధరతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అ థైత దుక్త్వా వచనం సుదారుణం
నిధాయ సర్వాభరణాని భామినీ
అసంవృతా మాస్తరణేన మేదినీం
తదాధిశిశ్యే పతితేవ కిన్నరీ. ౬౫

టీక॥భామినీ= స్త్రీయగు కైకేయి; సుదారుణం=మిక్కిలియుభయంకరమయిన; ఏతత్ =ఈ; వచనం=మాటను; ఉక్త్వా=చెప్పి; అథ=ఆపిమ్మట; సర్వాభరణాని= సమస్తములయినసొమ్ములను; నిధాయ=ఉంచి; తదా=అప్పుడు; పతితా=పడిన; కిన్నరీవ=కిన్నరస్త్రీవలె; ఆస్తరణేన = పఱపుచేత; అసంవృతాం=కప్పఁబడని; మేదినీం=(సప్తమ్యర్థమందుద్వితీయ)భూమియందు; అధిశిశ్యే=పరుండెను.

కైకేయి,యిట్లుభయంకరంబుగా, మంధరయెదుటఁబ్రతిజ్ఞఁజేసి, యంత, తనసొమ్ములన్నియు నేలపైఁదీసివేసి, యాస్తరణములేనిభూమిపైఁ, బుణ్యాంబుతఱిగినపిమ్మట నాకాశంబునుండి నేలపైఁబడుకిన్నరియుంబోలెఁ,బరుండెను.

అని, తాత్పర్యము.

ఉదీర్ణసంరంభతమోవృతాననా

తదావముక్తోత్తమమాల్యభూషణా
నరేంద్రపత్నీ విమనా బభూవ సా
తమోవృతా ద్యౌరివ మగ్నతారకా. ౬౬

టీక॥ తదా=అప్పుడు; ఉదీర్ణసంరంభతమోవృతాననా=అతిశయించినకోపంబనెడుచీఁకటిచేతఁగప్పఁబడిన ముఖముగలదియును; అవముక్తోత్తమమాల్యభూషణా=విడువఁబడిన శ్రేష్ఠములయినపుష్పమాలికలును సొమ్ములును గలదియును; విమనాః=దుఃఖము నొందినమనస్సుగలదియునగు; సా=ఆ; నరేంద్రపత్నీ=మనుష్యులకుఁబ్రభువైన దశరథునిభార్యయయినకైకేయి; తమోవృతా=చీఁకటిచేఁ గప్పఁబడినదియు; మగ్నతారకా= అస్తమయమునుబొందిననక్షత్రములు గలదియునగు; ద్యౌరివ=ఆకాశమువలె; బభూవ=ఉండెను.

అప్పుడు, అతిశయించిన కోపంబనెడుచీఁకటిచేఁగప్పఁబడిన ముఖంబను చంద్రుండుగలిగి, పుష్పమాలికలు సొమ్ములనునుక్షత్రంబులందీసివేసి యున్నయాకైకేయి, యట్లు, నక్షత్రంబు లన్నియునస్తమింపఁగాఁజీఁకటిచే వ్యాపింపఁబడియుండునాకాశంబుఁబోలెఁ, జూపట్టుచుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, నవమ స్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండనవమసర్గటీక, ముగిసినది.



శ్రీ

దశమసర్గప్రారంభః.

విదర్శితా యదా దేవీ కుబ్జయా పాపయా భృశమ్
తదా శేతే స్మ సా భూమౌ దిగ్ధవిద్ధేవ కిన్నరీ. ౧

టీక॥ యదా=ఎప్పుడు; దేవీ=రాణి యగు కైకేయి; పాపయా = పాపముచేయునదియయిన; కుబ్జయా= గూనిదగు మంధరచేత; భృశం = మిక్కిలి యును; విదర్శితా = విపరీతముగాఁ జూపఁబడినదో, విపరీతముగా బోధింపఁబడినదో యనుట; తదా=అప్పుడు; సా=ఆకైకేయి; దిగ్ధవిద్ధా = విషముఁబూసిన బాణముచేఁ గొట్టఁబడిన; కిన్నరీవ=కిన్నరస్త్రీవలె; భూమౌ=నేలయందు; శేతేస్మ=పరుండెను.

రాణియైనకైకేయి, పాపిష్ఠురాలగు మంధర చేసిన,కుత్సితబోధనకులోఁబడి, కిన్నరివిషముపూసినబాణముచేఁగొట్టఁబడి నేలంబడునట్లు, నేలపైఁబరుండెను. అని, తాత్పర్యము.

నిశ్చిత్య మనసా కృత్యం సా సమ్యగితి భామినీ
మంథరాయై శనైస్సర్వ మాచచక్షే విచక్షణా. ౨

టీక॥ విచక్షణా= పండితురాలగు; సా=ఆ; భామినీ=స్త్రీయగుకైకేయి; మనసా=మనసుచేత; కృత్యం=కార్యమును; నిశ్చిత్య=నిశ్చయించి; మంథరాయై=మంథరకొఱకు; శనైః = మెల్లగా; "సర్వం=అంతయును; సమ్యక్=చక్కఁగానున్నది" ఇతి=అని; ఆచచక్షే= చెప్పెను.

పండితురాలగు నాకైకేయి, తన మనంబునఁ జేయవలసిన కార్యంబును, జక్కఁగా నాలోచించి నిశ్చయించి, మంథరంజూచి, మెల్లగా, "నీవుచెప్పిన దంతయుఁజక్కఁగానున్నది" అని, చెప్పినది. అని, తాత్పర్యము.

సా దీనా నిశ్చయం కృత్వా మంథరావాక్యమోహితా
నాగకన్యేవ నిశ్శ్వస్య దీర్ఘ ముష్ణంచ భామినీ. ౩
ముహూర్తం చింతయామాస మార్గమాత్మ సుఖావహమ్

టీక॥సా=ఆ; భామినీ=స్త్రీయగు కైకేయి;దీనా=దుఃఖితురాలై;మంథరావాక్యమోహితా = మంథరయొక్కమాటచేమోహమునొందినదై; నిశ్చయం=ఏర్పాటును; కృత్వా= చేసికొని; నాగకన్యేవ=సర్పకన్యకవలె; దీర్ఘం=నిడుపుగాను; ఉష్ణంచ=వేఁడిగాను;నిశ్శ్వస్య=నిట్టూర్పుఁ విడిచి; ఆత్మసుఖావహం=తనకు సుఖముగలిగించునట్టి; మార్గం=దారిని; ముహూర్తం=కొంచెము సేపు;చింతయామాస=ఆలోచించెను.

ఆకైకేయి, యట్లుదుఃఖితురాలై, మంథరమాటకులోఁబడి, నిశ్చయించి, నాగకన్యయుంబోలె, నధికముగాఁ వేడినిట్టూర్పులునిగుడించి, మఱలఁ, దనకు సుఖంబుగలిగించు దానిని, గుఱించి, యాలోచించెను.

అని, తాత్పర్యము.

సా సుహృచ్చార్థకామా చ తం నిశమ్య సునిశ్చయమ్. ౪
బభూవ పరమప్రీతా సిద్ధిం ప్రాప్యేవ మంథరా

టీక॥సుహృత్ = స్నేహితురాలును; అర్థకామాచ=కార్యమునందుఁగోర్కిగలదియునగు;సా=ఆ ; మంథరా=మంథర;తం=ఆ ; సునిశ్చయం=దృఢమయినయేర్పాటును;నిశమ్య=విని;సిద్ధిం=కార్యసిద్ధిని;ప్రాప్యేవ=పొందినవలె; పరమప్రీతా= మిక్కిలియుసంతసించినది; బభూవ=అయినది.

కైకేయికిస్నేహితురాలును, కైకేయికార్యమందాసక్తురాలునగు నా మంథర, కైకేయిచెప్పిన నిశ్చయప్రకారంబువిని , కార్యసిద్ధినొందినప్పుడు పొందఁదగిన సంతోషమంతటిసంతోషమును,బొందెను. అని, తాత్పర్యము.

అథ సా రుషితా దేవీ సమ్యక్కృత్వా వినిశ్చయమ్. ౫
సంవివేశాబలా భూమౌ నివేశ్య భ్రుకుటిం ముఖే

టీక॥అథ=అటుపిమ్మట;రుషితా=కోపించినదియును;అబలా=స్త్రీయునగు;సా=ఆ;దేవీ=రాణియయిన కైకేయి;వినిశ్చయం=ఏర్పాటును ; సమ్యక్=చక్కఁగా;కృత్వా=చేసి;ముఖే=మొగమునందు; భ్రుకుటిం=బొమముడి

డిని; సన్నివేశ్య=కలుగునట్లు చేసికొని; భూమౌ=నేలయందు; సంవివేశ= పరుండెను.

అంత, నాకైక కోపంబు నొంది, యీప్రకారముగా దృఢమైన నిశ్చయంబుఁజేసి, ముఖంబునఁ బొమముడిధరించి, నేలపైఁబరుండెను. అని, తాత్పర్యము.

తత శ్చిత్రాణి మాల్యాని దివ్యా న్యాభరణానిచ. ౬
అపవిద్ధాని కైకేయ్యా తాని భూమిం ప్రపేదిరే

టీక॥తతః= అటుపిమ్మట ; కైకేయ్యా=కైకేయి చేత;అపవిద్ధాని=పిడువఁబడిన; తాని=ఆ; చిత్రాణి=నానావర్ణములయినః మాల్యాని = పుష్పమాలికలును;దివ్యాని = శ్రేష్ఠములయిన;ఆభరణానిచ=సొమ్ములును ; భూమిం=నేలను;ప్రపేదిరే=పొందినవి.

అంత,నాకైకేయి,దీసివేసిన, నానావర్ణంబులగు పుష్పమాలికలును , శ్రేష్ఠంబులగు నాభరణంబులును, గోపంబుచే వాఁచిపెట్టినందున , నేలపైఁబడియుండినవి. అని, తాత్పర్యము.

తయా తా న్యప విద్ధాని మాల్యా న్యాభరణానిచ. ౭
అశోభయంత వసుధాం నక్షత్రాణి యథా నభః

టీక॥తయా=ఆకైకేయిచేతః అపవిద్ధాని=తీసివేయఁబడిన; తాని= ఆ; మాల్యాని=పుష్పమాలికలును; ఆభరణానిచ=సొమ్ములునుఃనభః= ఆకాశమును;నక్షత్రాణియథా= నక్షత్రంబులుంబోలెఃవసుధాం=భూమిని అశోభయంత=ప్రకాశింపఁజేసినవి.

ఆకైకేయి నేలందీసివేసిన , పుష్పమాలికలును,సొమ్ములును నక్షత్రంబులాకాశంబును బ్రకాశింపఁజేయునట్లు, నేలను,బ్రకాశింపఁజేయుచుండినవి. అని, తాత్పర్యము.

క్రోధాగారే నిపతితా సా బభౌ మలినాంబరా. ౮
ఏక వేణీం దృఢం బద్ధ్వా గతసత్త్వేవ కిన్నరీ

టీక॥ఏక వేణీం=ఒకటిగానుండు జడను; దృఢం=గట్టిగాఃబద్ధ్వా=కట్టిః క్రో

ధాగారే=కోపగృహమునందు; నిపతితా=పడినదియును; మలినాంబరా=మురికివస్త్రములుగలదియునగు; తాం=ఆకైకేయి; గతసత్త్వా=పోయినప్రాణములుగల; కిన్నరీవ=కిన్నరస్త్రీవలెంబ్రభా=ప్రకాశించెను.

తలఁజక్కఁగాదువ్వకొనక వెండ్రుకలంతయునొక్కటిగాఁగట్టిముడి వేసికొని,మురికిబట్టలంగట్టుకొని, కోపగృహంబునంబడియున్నయాకైకేయి,మృతినొందిపడియుండుకిన్నరస్త్రీవలెఁబ్రకాశించుచుండెను. అని, తాత్పర్యము.

ఆజ్ఞాప్య తు మహారాజో రాఘవస్యాభిషేచనమ్. ౯
ఉపస్థాన మనుజ్ఞాప్య ప్రవివేశ నివేశనమ్

టీక। మహారాజఃతు=దశరథమహారాజును; రాఘవస్య= రామునియొక్క; అభిషేచనం=అభిషేకించుటను; ఆజ్ఞాప్య=ఆనతిచ్చి, ఉపస్థానం=సభను, అనుజ్ఞాప్య=అనుమతించునట్లుచేసికొని, నివేశనం=గృహమును,అంతఃపురమునసుట; ప్రవివేశ=ప్రవేశించెను.

అంత, దశరథమహారాజు,రామునకుఁబట్టాభిషేకము సేయునట్లు, లాజ్ఞాపించిసభికుల,ననుమతినొంది, యంతఃపురముఁబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

అద్య రామాభిషేకో వై ప్రసిద్ధ ఇతి జజ్ఞివాన్. ౧౦
ప్రియార్హాం ప్రియ మాఖ్యాతుం వివేశాంతఃపురం వశీ.

టీక వశీ = అన్నియుఁదనవశంబులోఁ గలవాఁడగు దశరథమహారాజు; "అద్యవై=ఇప్పుడే; రామాభిషేకః=రామునియభిషేకించుట; ప్రసిద్ధః=వెల్లడియయినది." ఇతి=అని; జజ్ఞివాన్=తెలిసికొన్నవాఁడై; ప్రియార్హాం=సంతోషవార్తకుఁ దగినట్టికైకేయినిగూర్చి; ప్రియం = సంతోషవార్తను; ఆఖ్యాతుం=చెప్పుటకు; అంతఃపురం=అంతిపురమును; వివేశ=ప్రవేశించెను.

స్వతంత్రుండగునాదశరథమహారాజు,"ఇప్పుడెరామునకుఁబట్టాభిషేకము కాఁబోవుచున్నది" అని, వెల్లడియైనది, కావున,నిదివఱకు, ఈసంతోషవార్తకైకేయికిఁదెలిసియుండదు" అని,తలంచి, యట్టిసంతోషవార్తఁ జెప్పుటకుఁగైకేయితగినదికాఁబట్టి,యాసంతోషవార్తనుకైకేయికిదానెచెప్పుటకై, యంతః

పురంబునకుఁబోయెను. అని, తాత్పర్యము.

స కైకేయ్యా గృహం శ్రేష్ఠం ప్రవివేశ మహాయశాః. ౧౧
పాండురాభ్రమి వాకాశం రాహుయుక్తం నిశాకరః

టీక॥మహాయశాః=అధికమయినకీర్తిగలః సః = ఆదశరథమహారాజు; పాండురాభ్రం= తెల్లనిమేఘంబులుగలదియును; రాహుయుక్తం=రాహువుతోఁగూడినదియునగు; ఆకాశం=ఆకాశమును; నిశాకరఇవ=చంద్రుండువలె; శ్రేష్ఠం = ఉత్తమమయిన; కైకేయ్యాః=కైకేయియొక్క ; గృహం=ఇంటిని; ప్రవివేశ=చొచ్చెను.

అధికమయినకీర్తిగల యాదశరథమహారాజు, తనకుమరణంబు గలిగింపఁబోవునా కైకేయియుండు తెల్లని మేఘమీఁదికిఁబోవుట, చంద్రుండు, తన్ను మ్రింగునట్టి రాహువుతోఁగూడిన, తెల్లమబ్బులుగల, యాకాశంబునకువచ్చునట్లుండెను. అని, తాత్పర్యము.

శుకబర్హిణసంయుక్తం క్రౌంచహంసరుతాయుతమ్. ౧౨
వాదిత్రరవసంఘుష్టం కుబ్జావామనికాయుతమ్
లతాగృహై శ్చిత్రగృహై శ్చంపకాశోకశోభితైః. ౧౩
దాంతరాజతసౌవర్ణవేదికాభి స్సమాయుతమ్
నిత్యపుష్పఫలై ర్వృక్షై ర్వాపీభి శ్చోపశోభితమ్. ౧౪
దాంతరాజతసౌవర్ణై స్సంవృతం పరమాసనైః
వివిధై రన్నపానై శ్చ భక్ష్యైశ్చ వివిధైరపి. ౧౫
ఉపపన్నం మహార్హై శ్చ భూషితై స్త్రిదివోపమమ్
త త్ప్రవిశ్య మహారాజ స్స్వ మంతఃపుర మృద్ధిమత్. ౧౬
న దదర్శ ప్రియాం రాజా కైకేయీం శయనోత్తమే

టీ॥శుకబర్హిణసంయుక్తం= చిలుకలతోను నెమళ్లతోనుగూడినదియును ; క్రౌంచహంస రుతాయుతం= క్రౌంచపక్షుల యొక్కయు హంస పక్షులయొక్కయు ధ్వనులతోఁగూడినదియును; వాదిత్రరవసంఘుష్టం= వాద్య




ములయొక్క-ధ్వనులచే ధ్వనించుచుండు నదియును; కుబ్జావామనికాయుతం= గూనివారలతోను బొట్టి వారలతోను గూడినదియును ; చంపకాశోక శోభితైః=సంపెఁగ చెట్లచేతను అశోకవృక్షముల చేతను అలంకరింపఁబడినవగు; లతాగృహైః = తీఁగెలల్లుటచేఁ జేయఁబడిన యిండ్లతోను ; చిత్రగృహైః= నానావర్ణములు గల యిండ్లతోను ; యుక్తం (అధ్యాహృతము)= కూడినదియును; దాంత రాజత సౌవర్ణ వేదికాభిః=దంతముతోఁ జేయఁబడినవియు వెండితోఁ జేయఁబడినవియు బంగారుతోఁ జేయఁబడినవియునగు తిన్నెలతో, సమాయుతం=కూడినదియును;నిత్యపుష్పఫలైః=ఎల్లప్పుడుఁ బూలును బండ్లును గల; వృక్షైః=చెట్లలచేతను;వాపీభిశ్చ=నడబావుల చేతను;ఉపశోభితం= ప్రకాశింపఁజేయఁబడినదియును; దాంత రాజత సౌవర్ణైః=దంతములతోఁ జేయఁబడినవియును వెండితోఁ జేయఁబడినవియు బంగారముతోఁ జేయఁబడినవియునగు; పరమాసనైః=శ్రేష్ఠములగు పీఠంబుల చేతను ; సంవృతం= చుట్టఁబడినదియును; వివిధైః= నానావిధములయిన;అన్నపానైశ్చ= అన్నములతోను మద్యములతోను ; వివిధైరపి — నానావిధములును(అపిశబ్దము వలన )మంచిరుచిగలవియునగు; భక్ష్యైశ్చ=పిండివంటలతోను;ఉపపన్నం — కూడినదియును;మహార్హైః=ఉత్తమములయిన;భూషితైః= అలంకరింపఁబడిన స్త్రీజనముల చేత;త్రిదివోపమం= స్వర్గముతోఁ బోల్కి గలదియును; ఋద్ధిమత్= సంపదగలదియునగు;తత్=ఆ; స్వం= తనదైన; అంతఃపురం= అంతిపురమును;ప్రవిశ్య= చొచ్చి ; మహారాజః= పూజ్యుఁడైనరాజగు; రాజా=దశరథమహారాజు;శయనోత్తమే = శ్రేష్ఠమయిన పాన్పునందు ; ప్రియాం=సంతోషము గలిగించునట్టి; కైకేయీం= కైకేయిని;నదదర్శ=చూడలేదు.

మధురంబుగాఁ గూయుచుండు చిలుకలు నెమళ్లుఁ గ్రౌంచంబులు హంసలు మొదలగు పక్షులు గల్గి , మంచి నేర్పుతో వాయింపఁ బడుచుండు చతుర్విధ వాద్యంబుల ధ్వనులచే వ్యాపింపఁబడి , స్త్రీలకును బురుషులకును బొందు గలుగఁ జేయుచు నంతఃపురంబునం బరిచారికలయియున్న గూనుగల స్త్రీలు వామనస్త్రీలు మొదలగువారలతోఁ గూడి, సంపెఁగ చెట్లు అశోకవృక్షంబులు మొదలగు వాని చేనలంకరింపఁబడిన లతాగృహంబులుఁ జిత్రగృహంబులుఁ జుట్టును గలిగి,




దంతముతోను వెండితోను బంగారముతోను జేయఁబడినతిన్నెలచే నలంకరింపఁబడి,దోహదములచేనకాలంబునందు నబూలుఁబండ్లుమున్నగునవిగలిగియుండుచెట్లును నడబావులును గలిగి, దంతముతోను వెండితోను బంగారముతోను జేయఁబడిశ్రేష్ఠంబులయిన యాసనంబులతోనొప్పుచు , నానావిధంబులగు సన్నంబులుమద్యంబులుఁబలు తెఱంగులై నరుచ్యంబులగు భక్ష్యంబులునుంగల్గి , చక్కఁగాసొమ్ములచే నలంకరింపఁబడియుండు నుత్తమస్త్రీలుగల్గుటం జేసి యప్సరసలతోఁగూడియుండుస్వర్గంబుతో సాటియగుచు,నిట్లుసంపూర్ణంబగుమన్మథో ద్దీపనసామగ్రితో నొప్పుచుండు,తనయంతఃపురంబుఁబ్రవేశించి, దశరథమహారాజుమన్మథపీడితుండై,అచ్చట,మేలైనపాన్పునందుఁజూడఁగా, నతనికిఁ బ్రియభార్యయగు కైకేయి , యగపడదయ్యె.అని,తాత్పర్యము.

స కామబలసంయుక్తో రత్యర్థం మనుజాధిపః. ౧౭
అపశ్యన్ దయితాం భార్యాం పప్రచ్ఛ విషసాద చ

టీక॥ మనుజాధిపః=మనుష్యులకుఁబ్రభువయిన;సః=ఆదశరథుండు ; కామబలసంయుక్తః= మన్మథోద్రేకముతోఁగూడినవాఁడై;దయితాం=ప్రియురాలయిన;భార్యాం=భార్యను; అపశ్యన్=చూడనివాఁడై; రత్యర్థం=క్రీడకొఱకు;పప్రచ్ఛ=అడిగెను.విషసాద చ=దుఃఖించెను.

మనుష్యులకుఁబ్రభుండైనయాదశరథుండు, అచ్చటనుండు మన్మథోద్దీపనపదార్థములవలన మన్మథోద్రేకంబునొంది,శయనంబునందుఁ దనభార్యలేకుండుటంజూచి, రతికొఱకు, అచ్చటనుండి"కైకేయీ! యెచ్చటనున్నావు" అని యడిగి, బదులు పలుకకుండుటంజేసి, మిక్కిలియు దుఃఖంబు నొందెను.

అని, తాత్పర్యము.

న హి తస్య పురా దేవీ తాం వేళా మత్యవర్తత. ౧౮
న చ రాజా గృహం శూన్యం ప్రవివేశ కదాచన

టీక॥పురా=మున్ను; తస్య=ఆదశరథునియొక్క; దేవీ=భార్యయయినకై

కేయి; తాం=ఆ; వేళాం=సమయము ను; నాత్యవర్తత హి=అతిక్రమింపలేదుగదా! రాజా చ=దశరథమహారాజును; కదాచన=ఒకానొకప్పుడును; శూన్యం=కైకేయి లేని; గృహం=ఇంటిని; నప్రవివేశ=ప్రవేశింపలేదు.

ఇదివఱకెప్పుడును, ఆదశరథుని భార్యయగు కైకేయి, అతండు తనయొద్దకు వచ్చువప్పుడు, చక్కఁగా నలంకారము చేసికొని, సంతోషముతో, నతని నెదుర్కొనకుండినది లేదు; ఆదశరథుండు, కైకేయి లేకుండుటం జేసి శూన్యంబుగా నుండు, నాగృహంబిదివఱకెప్పుడును, ప్రవేశించినది లేదు; కావున, నిప్పుడు విపరీతముగా నుండుటం జూడఁగా, నతనికి, మిగులదుఃఖంబు గలిగినది.

అని, తాత్పర్యము.

తతో గృహగతో రాజా కైకేయీం పర్యపృచ్ఛత. ౧౯
యథాపుర మవిజ్ఞాయ స్వార్థలిప్సు మపండితామ్

టీక॥ తతః=అటుపిమ్మట; రాజా=దశరథమహారాజు; గృహగతః=ఇంటినిబొందినవాఁడై; స్వార్థలిప్సుం=తన ప్రయోజనము నేకోరునదియును; అపండితాం= తెలివిలేనిదియునగు; కైకేయీం=కైకేయిని; అవిజ్ఞాయ= తెలియక; యథాపురం= మునుపటియట్లు; పర్యపృచ్ఛత=అడిగెను.

అంత, దశరథమహారాజు, ఇంటిలోనికిఁబోయి, యిప్పుడు కైకేయి, స్వప్రయోజనమునుగోరునదిగాను, రాఁగలదుఃఖము తెలిసికొనలేనిదిగాను, ఉన్నసంగతిఁ దెలియనివాఁడు కావున, మునుపు కైకేయి లేకున్నప్పు డడుగునట్లు, అక్కడనున్న ప్రతీహారిం జూచి, "కైకేయి యెచ్చటనున్నది" అని, యడిగెను.

అని, తాత్పర్యము.

ప్రతీహారీ త్వథో వాచ సంత్రస్తా తు కృతాంజలిః. ౨౦

టీక॥ అథ=అటుపిమ్మట; ప్రతిహారీ తు= ద్వారపాలకురాలును; సంత్రస్తా= భయపడినదై యే; కృతాంజలిః=చేయఁబడినచేమోడ్పుగలదై; ఉవాచ=పలికెను.

అంత, ద్వారపాలకురాలు, భయం

బుతోఁ జేతులు మొగిడ్చికొని, దశరథునితో నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

దేవ దేవీ భృశం కృద్ధా క్రోధాగార మభిద్రుతా

టీక॥ దేవ=దశరథమహారాజా! దేవీ=రాణియగు కైకేయి; భృశం=మిక్కిలియును; క్రుద్ధా=కోపమునొందినదై; క్రోధాగారం=కోపమువచ్చినప్పుడుండుగృహమునుగూర్చి; అభిద్రుతా=పరువిడినది.

దశరథమహారాజు, రాణియగు కైకేయి, మిగులఁగోపంబువహించి, కోపంబువచ్చునప్పుడుండు గృహంబునకుఁ బోయియున్నది.

అని, తాత్పర్యము.

ప్రతీహార్యా వచ శ్శ్రుత్వా రాజా పరమదుర్మనాః. ౨౧
విషసాద పునర్భూయో లులితవ్యాకులేంద్రియః

టీక॥ ప్రతీహార్యాః=ద్వారపాలకురాలియొక్క; వచః = మాటను; శ్రుత్వా=విని; పరమదుర్మనాః=మిక్కిలియుదుఃఖంబునొందినమనసుగల; రాజా=దశరథమహారాజు; లులితవ్యాకులేంద్రియః = చలించునవియుఁగలఁతనొందినవియునగు నింద్రియములుగలవాఁడై; పునః=ఇంకను; భూయః=అధికముగా; విషసాద=దుఃఖించెను.

కైకేయియచ్చట నగపడకుండుట మాత్రముచేతనే, మిగులదుఃఖమునొందియుండునాదశరథమహారాజు, "కైకేయికోపంబునొంది కోపగృహంబుననున్నది" అని, ద్వారపాలకురాలిమాటవినఁగానే, చలించి కలంతనొందిన యింద్రియములుగలిగి, యింకను, అధికముగాదుఃఖంబునొందెను.

అని, తాత్పర్యము.

తత్ర తాం పతితాం భూమౌ శయానా మతథోచితామ్. ౨౨
ప్రతప్త ఇవ దుఃఖేన సో పశ్య జ్జగతీపతిః

టీక॥ జగతీపతిః=భూమికిఁబ్రభువైన; సః=ఆదశరథుఁడు; తత్ర=ఆకోపగృహమునందు; పతితాం= పడియున్నదియును; భూమౌ= నేలయందు;

శయనాం=పరుండియున్నదియును;అతథోచితాం=అట్లుండదగనిదియునగు; తాం=ఆకైకేయిని; దుఃఖేన=దుఃఖముచేత;ప్రతప్త ఇవ(స్థితః)=తపింపఁబడినట్లున్నవాఁడై;అపశ్యత్=చూచెను.

ఆదశరథమహారాజు, ఆకోపగృహంబునకుఁ బోయి,యచ్చట, నేలమీఁదఁబరుండి యున్న, యట్లు నేలమీఁద బరుండఁదగని సుకుమారశరీర యగు, నా కైకేయిని,మహాదుఃఖంబుతోఁ జూచెను.అని, తాత్పర్యము.

స వృద్ధ స్తరుణీం భార్యాం ప్రాణేభ్యోపి గరీయసీమ్. ౨౩
అపాపః పాపసంకల్పాం దదర్శ ధరణీతలే
లతామివ వినిష్కృత్తాం పతితాం దేవతామివ. ౨౪
కిన్నరీమివ నిర్ధూతాం చ్యుతా మప్సరసం యథా
మాయామివ పరిభ్రష్టాం హరిణీమివ సంయతామ్. ౨౫
"వామీమివ పరిభ్రష్టాం" అని పాఠాంతరము.
కరేణు మివ దిగ్ధేన విద్ధాం మృగయునా వనే

టీక॥అపాపః = పాపముసేయనివాఁడును;వృద్ధః= ముదుసలియునగు; సః = ఆదశరథమహారాజు;తరుణీం= యౌవనముగలదియును; ప్రాణేభ్యోపి=ప్రాణములకన్న;గరీయసీం = ఎక్కువయినదియు; పాపసంకల్పాం= మంచిదికానిరామునడవికిఁబంపుటయందు సంకల్పముగలదియును; వినిష్కృత్తాం = ఛేదింపఁబడిన;లతామివ(స్థితాం) = తీఁగెయుంబోలెనున్నదియును;పతితాం=భూమియందుఁబడిన; దేవతామి(స్థితాం)= దేవతయుంబోలెనున్నదియును;నిర్ధూతాం=పడఁద్రోయఁబడిన;కిన్నరీమివ(స్థితాం)=కిన్నరస్త్రీవలెనున్నదియును; చ్యుతాం=జారిపడిన; అప్సరసం యథా(స్థితాం)= అప్సరసయుంబోలెనున్నదియును; పరిభ్రష్టాం=ఇతరులమోసింపఁజేయుటకై, విడువఁబడిన; మాయామివ (స్థితాం)=మాయయుంబోలెనున్నదియును; (పాఠాంతరపక్షమందు) పరిభ్రష్టాం = క్రిందఁ బడిన;వామీమివ(స్థితాం) = ఆఁడుగుఱ్ఱముఁబోలెనున్నదియు;సంయతాం=కట్టఁబడిన; హరిణీమివ(స్థితాం)=లేడివలెనున్నదియును; వనే=అడవియందు;మృగయునా= వేఁటకానిచేత;దిగ్ధేన= విషముపూసినబాణముచేత;విద్ధాం = కొట్టఁబడిన;కరే

ణుమివ(స్థితాం)= ఆఁడేనుంగువలెను న్నదియునగు;భార్యాం= పెండ్లామైన కైకేయిని; ధరణీతలే=భూతలమునం దు;దదర్శ=చూచెను.

వృద్ధుండును బాపంబెఱుంగుని వాఁడు నగు నాదశరథుండు, యౌవనవతియై, పాపంబగు రామునడవికిఁ బంపుటయం దాసగొని, ఛేదింపఁబడిన తీఁగెయుం బోలెఁ, బుణ్యంబంతయు ననుభవిం చి యయినపిమ్మట నేలంబడిన దేవత భంగిఁ, బడఁద్రోయఁబడినకిన్నరికైవ డి, నాకాశంబునుండి నేలఁ జాఱిన య ప్సరసగతి, నితరుల మోహింపఁ జే యుటకై చేయఁబడినమాయరీతి (పా ఠాంతరపక్షమందు; నేలంబడియుండు నాఁడుగుఱ్ఱంబురీతి) బంధింపఁబడిన లే డిచాడ్పున, నరణ్యంబున వేఁటకాఁ డువిషంబు పూసిన బాణంబుచేఁ గొ ట్టఁగా నేలంగూలినయాఁడేనుఁగువిధం బున, భూమింబడియున్న, తనభార్య యగుకైకేయింజూచెను.

అని, తాత్పర్యము.

మహాగజ మివా రణ్యే స్నేహా త్పరిమమర్శ తామ్. ౨౬

టీక॥ సః(అధ్యాహృతము)=ఆద శరథుఁడు;అరణ్యే=అడవియందు; మ హాగజఇవ = గొప్పయేనుంగువలె ; తాం=ఆకైకేయిని; స్నేహాత్= చెలి మివలన;పరిమమర్శ=తడవెను.

గొప్పదగుపురుషగజంబువచ్చి, య రణ్యంబున,వేఁటకానిచే విషముపూసి నబాణంబునం గొట్టఁబడిపడి యున్న యాఁడేనుంగుందడవునట్లు,ఆదశరథుం డు,కైకేయిని స్నేహంబునందడవెను.

అని, తాత్పర్యము.

పరిమృశ్యచ పాణిభ్యా మభిసంత్ర స్త చేతనః
కామీ కమలపత్రాక్షీ మువాచ వనితా మిదమ్. ౨౭

టీక॥ కామీ=మన్మథోద్రేకముగ లదశరథుండు; పాణిభ్యాం=చేతులచే త;పరిమృశ్యచ=తడవియు; అభిసంత్ర స్తచేతనః=మిక్కిలిభయంబునొం దిన మనసు గలవాఁడై; కమలపత్రా క్షీం=తామరపూఱేకులంబోలుకండ్లు గల;వనితాం=భార్యయయినకైకేయి నిఁగూర్చి; ఉవాచ=పలికెను.

స్వభావంబుననె కామియగుదశర థుఁడు,దామరపూఱేకులుంబోలె, వి

శాలంబులునుసుందరంబులునగునేత్రంబులుగలయాకైకేయిం జూచినంతనె, యినుమడించినమన్మథోద్రేకంబునొంది, కైకేయిని, రెండుచేతులతోనుండడవి, "యేమిచేస్తానో" యనిభయపడుచు, నాకైకేయింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.



న తే౽హ మభి జానామి క్రోధ మాత్మని సంశ్రితమ్

టీక॥ అహం—నేను; ఆత్మని — నాయందు; సంశ్రితం=పొందఁబడిన; తే=నీయొక్క; క్రోధం=కోపమును, కోపమునకుఁ గారణముననుట; నాభిజానామి—ఎఱుంగను.

నీకు నాపైఁగోపమువచ్చుటకుఁ దగినకారణమేమియు నాకుజ్ఞప్తికి రాలేదు. అని, తాత్పర్యము.

దేవి కే నాభిశప్తాసి కేన వాసి విమానితా. ౨౮

టీక॥ దేవీ=రాణివగుకైకేయీ! కేన=ఎవ్వనిచేత; అభిశప్తా—తిట్టఁబడినదానవు? అసీ = అగుచున్నావు. కేనవా=ఎవ్వనిచేతను; విమానితా= అవమానింపఁబడినదానవు; అసి=అగుచున్నావు?

రాణివగుకైకేయీ! నిన్నెవ్వరైనఁ దిట్టినారా యేమి? లేక, యెవ్వరైననవమానించినారా యేమి; నాకుజరగినదంతయుసవిస్తరముగాఁ జెప్పుము. అని, తాత్పర్యము.

య దిదం మమ దుఃఖాయ శేషే కల్యాణి పాంసుషు

టీక॥కల్యాణి=మంగళకరివగుకైకే యీ; త్వం(అధ్యాహృతము) = నీవు; పాంసుషు=దుమ్ములయందు; శేషే(ఇతియత్ అసి) = పరుండియున్నావను నదియేదికలదో; తత్ (అధ్యాహృతము)=అ;ఇదం=ఇది;మమ = నాయొక్క; దుఃఖాయ=దుఃఖముకొఱకు;భవతి(అధ్యాహృతము)= అగుచున్నది.

నీవునాకన్నిమంగళంబులంగలిగించు దానవు, మంగళస్వరూపిణివి; నీవీనేలపై మట్టియందుఁ బరుండియుండుటం, జూడఁగా, నాకుమిగుల దుఃఖంబగుచున్నది.

అని, తాత్పర్యము.

భూమౌ శేషే కిమర్థం త్వం మయి కల్యాణచేతసి. ౨౯
భూతోపహతచిత్తేవ మమ చిత్తప్రమాథినీ

టీక॥కల్యాణచేతసి=మంగళకరంబగు మనసుగలవాఁడనగు, అపకారము సేయనట్టియనుట; మయి = నేనుండఁగా;త్వం=నీవు; మమ=నాయొక్క;చిత్తప్రమాథినీ= మనసునుగలఁతపఱచుదానవై; భూతోపహతచిత్తేవ=పిశాచముచేఁగొట్టఁబడిన మనసుగలిగినదివలె;భూమౌ=నేలయందు;కిమర్థం=ఎందుకొఱకు; శేషే=పరుండియున్నావు?

నీకెంతమాత్రమపకారమురానట్లు చూచుచుమంగళంబులంగలిగించునట్టినేనుండఁగా,నీవిట్లు,నామనసునకుదుఃఖంబుగలుగునట్లు, పిశాచముపట్టినదివలె, నేలంబరుండియున్నావేమి?

అని, తాత్పర్యము.

సంతి మే కుశలా వైద్యా స్త్వభితుష్టాశ్చ సర్వశః. ౩౦
సుఖితాం త్వాం కరిష్యంతి వ్యాధి మాచక్ష్వ భామిని

టీక॥ భామిని=కైకేయీ! మే=నాయొక్క;వైద్యాస్తు=వైద్యులును;కుశలాః=సమర్థులుగాను; సర్వశః=అన్నివిధంబులను; అభితుష్టాశ్చ=సంతోషమునొందినవారుగాను;సంతి=ఉన్నారు. త్వాం=నిన్ను; సుఖితాం = సుఖముగలదానిఁగా; కరిష్యంతి= చేయఁగలరు. వ్యాధిం=రోగమును; ఆచక్ష్వ=చెప్పుము.

కైకేయీ! నీకేదైనవ్యాధియున్నట్టైనదానిం జెప్పుము; నాయొద్దనుండువైద్యులు, ఎట్టివ్యాధినైనఁబోఁగొట్టంజాలుదురు; నావలననానావిధసత్కారంబులంబొందినవారు, కావున, నాయందుఁజాలనెనరుగల్గియున్నవారు; నీవ్యాధినిబోఁగొట్టి, నీకుసుఖంబుగలుగునట్లు, సేయుదురు. అని, తాత్పర్యము.

కస్య వా తే ప్రియం కార్యం కేనవా విప్రియం కృతమ్. ౩౧
(ఇతి గోవిందరాజపాఠః)
("కస్యవావిప్రియంకార్యం" ఇతిమహేశ్వరతీర్థపాఠః)

టీక॥ కస్యవా=(తృతీయార్థమందుషష్ఠి)ఎవ్వనిచేత; తే=నీకొఱకు; ప్రియం=సంతోషము; కార్యం=చేయఁబడినది? (ఇట్లుగోవిందరాజులుచెప్పిరి). కస్యవా=ఎవ్వనికిః విప్రియం=దుఃఖము; కార్యం=చేయఁదగినది? (ఇట్లుమహేశ్వరతీర్థులు). కేనవా=ఎవ్వనిచేత; విప్రియం=దుఃఖము; కృతం=చేయఁబడినది?

నీకెవ్వఁడుసంతోషంబుచేసెను? నీకెవ్వఁడుదుఃఖంబుగలిగించెను? (ఇట్లుగోవిందరాజాభిప్రాయము).

అని, తాత్పర్యము.

నీవిప్పుడెవ్వనికి దుఃఖంబుగలుగఁజేయవలెనని కోరుచున్నావు? ఎవ్వండునీకు దుఃఖంబు గలుగఁజేసెను? (అనిమహేశ్వరతీర్థమతము). అని, తాత్పర్యము.

కః ప్రియం లభతామద్య కోవా సుమహదప్రియమ్,

టీక॥ అద్య=ఇప్పుడు; కః=ఎవ్వఁడు; ప్రియం=సంతోషమును; లభతాం=పొందవలయును? కోవా=ఎవ్వఁడు; సుమహత్=మిక్కిలియధికమయిన; అప్రియం=దుఃఖమును; లభతాం(అధ్యాహృతము)=పొందవలయును?

ఇప్పుడు, నీవెవ్వనికిసంతోషముసేయవలెనని కోరుచున్నావు? ఎవ్వనికిఁజాలదుఃఖముగలుగఁజేయవలెనని కోరుచున్నావు? వారలపేళ్లం జెప్పుము; ఇప్పుడేనీయిష్టప్రకారము వారలనట్లుగావించెదను. అని, తాత్పర్యము.

మారోదీ మాచకార్షీస్త్వం దేవిసంపరిశోషణమ్. ౩౨

టీక॥ దేవి= రాణివగు కైకేయీ! త్వం=నీవు; మారోదీః= ఏడ్వకుము. సంపరిశోషణంచ= దేహమునుగృశింపఁజేయుటను; మాకార్షీః=చేయవలదు.

కైకేయీ! నీవునాదురాణివి;నీవిట్లేడ్వవలదు; దేహంబును గృశించునట్లుచేసికొనవలదు; నీయిష్టమునుజెప్పుము; నేనుదప్పక దానినెఱవేర్చెదను. అని, తాత్పర్యము.

అవధ్యో వధ్యతాం కోవా కోవా వధ్యో విముచ్యతామ్
దరిద్రః కోభవ త్వాఢ్యో ద్రవ్యవా న్వా ప్య కించనః. ౩౩

టీక॥అవధ్యః=చంపఁదగనట్టి; కోవా=ఎవ్వఁడు; వధ్యతాం=చంపఁబడవలయును? వధ్యః=చంపఁదగిన; కోవా=ఎవ్వఁడు; విముచ్యతాం=విడువఁవలయును? దరిద్రః= పేదవాఁడైన; కః=ఎవ్వఁడు; ఆఢ్యః=ధనవంతుఁడు; భవతు=కావలయును? ద్రవ్యవాక్= ధనవంతుండైన; కః=(అధ్యాహృతము)ఎవ్వఁడు; అకించనోపి=దరిద్రుఁడుగాను; భవతు(అధ్యాహృతము)= కావలయును?

నీకిప్పుడెవ్వఁడు చావవలయు ననియున్నది?వానిం జెప్పుము; వాఁడుచంపఁదగనివాఁడైనను వానినీక్షణంబెచంపించెదను; నీకెవ్వని నిప్పుడుకాపాడవలయుననియున్నది?వానింజెప్పుము; వాఁడుచంపవలసిన వాఁడైనను వానివిడిచి పుచ్చెదను; దరిద్రుఁడుగానుండువాఁడెవ్వఁడైనభాగ్యవంతుఁడుగావలయునని నీకుఁ దలంపున్నయెడ, వానిందెల్పుము; వానిధనవంతునిఁగాఁజేసెదను;భాగ్యవంతుండెవ్వఁడేని దరిద్రుండుగావలయునని నీవుకోరునెడ, వానిపేరుసెప్పుము; వాని ధనమంతయుఁ గొల్లపెట్టించి వానిదరిద్రునిగావించెదను. అని, తాత్పర్యము.

అహం చైవ మదీయాశ్చ సర్వే తవ వశానుగాః
నతే కించి దభిప్రాయం వ్యాహంతు మహ ముత్సహే. ౩౪

టీక॥అహంచైవ=నేనును;మదీయాశ్చ=నావారును; సర్వే=అందఱమును; తవ=నీయొక్క;వశానుగాః=లోఁకువననుసరించువారము.అహం = నేను;

తే=నీయొక్క; అభిప్రాయం=కోర్కిని; కించిత్=కొంచెమైనను; వ్యాహంతుం=చెలఫుటకు; నోత్సహే=ప్రయత్నింపను.

నేనును నావారును, మేమందఱము నునీవు చెప్పినట్టువినువారము; నీకుఁగలకోరికెను జెలఫుటకు, నాకెంతమాత్రము, ఇష్టములేదు. అని, తాత్పర్యము.

ఆత్మనో జీవితేనాపి బ్రూహి య న్మన సేచ్ఛసి

టీక॥ఆత్మనః=నాయొక్క; జీవితేనాపి=ప్రాణముచేతనైనను; యత్=దేనిని; మనసా=మనసుచే; ఇచ్ఛసి=కోరుచున్నావో; తత్= (అధ్యాహృతము)దానిని; బ్రూహి=చెప్పుము.

నీవు, నాప్రాణనాశంబునఁగాఁదగిన కార్యమును గోరినను, దానిం జెప్పుము; నాప్రాణములం బోఁగొట్టుకొనియైనను, నీకోరికె, నీడేర్చెదను.

అని, తాత్పర్యము.

బల మాత్మని జానంతీ న మాం శంకితు మర్హసి. ౩౪

టీక॥త్వం (అధ్యాహృతము)= నీవు; ఆత్మని=నీయందు, ఉన్న; బలం=నాప్రేమబలమును; జానాంతీ=ఎఱింగినదానవై; మాం=నన్నుఁగూర్చి; శంకితుం=సందేహించుటకు; నార్హసి=తగవు.

నీయందు నాప్రేమ మెచ్చుగానున్నదని నీకుం దెలియును; కావున, నీవు నాయందు సందేహంబుంచుట సరికాదు.

అని, తాత్పర్యము.

కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే

టీక॥ తవ=నీకు; ప్రీతిం=సంతోషమును; కరిష్యామి=చేసెదను; తే=నీకొఱకు; సుకృతేనాపి= పుణ్యముచేతనుగూడ; శపే=ఒట్టుపెట్టెదను.

నేనుదప్పక నీకోర్కెనెఱవేర్చి నీకు సంతోషంబుచేసెదను; నీవుసందేహింపవలదు; పుణ్యంబుపైనొట్టుపెట్టెదను. అని, తాత్పర్యము.

యావదా వర్తతే చక్రం తావతీ మే వసుంధరా. ౩౬

టీక॥యావత్ = ఎంతవఱకు ; చక్రం=సూర్యునిరథముయొక్క-చక్రము; ఆవర్తతే=తిరుగుచున్నదో; తావత్=అంత; వసుంధరా=భూమి; మే=నాకు; అస్తి(అధ్యాహృతము)=ఉన్నది.

సూర్యుని కాంతి యెంతవఱకున్నదో,ఆభూమియంతయునాది.

అని, తాత్పర్యము.

ప్రాచీనా స్సింధు సౌవీరా స్సౌరాష్ట్రా దక్షిణాపథాః
వంగాంగమగధా మత్స్యా స్సమృద్ధాః కాశికోసలాః. ౩౭

టీక॥ ప్రాచీనాః=తూర్పుదేశములును; సింధుసౌవీరాః=సింధుదేశమునుసౌవీరదేశమును; సౌరాష్ట్రాః=సౌరాష్ట్రదేశమును;దక్షిణాపథాః=దక్షిణపుదిక్కు-నందలిదేశములులును;వంగాంగమగధాః = వంగదేశమునుఅంగదేశమునుమగధదేశమును; మత్స్యాః=మత్స్యదేశమును; కాశికోసలాః=కాశీదేశమును కోసలదేశమును; సమృద్ధాః=నిండినవిగా; సంతి(అధ్యాహృతము)=ఉన్నవి.

అందుఁ,దూర్పుదేశములు, సింధుదేశము,సౌవీరదేశము, సౌరాష్ట్రదేశము,దాక్షిణాత్యదేశములు, వంగదేశము,నంగదేశము, మగధదేశము, మత్స్యదేశముఁ, గాశిదేశముఁ, గోసలదేశము,మొదలగుదేశములన్నియు, నన్నిటను,నిండియున్నవి.

అని, తాత్పర్యము.

తత్ర జాతం బహుద్రవ్యం ధనధాన్య మజావికమ్

టీక॥ తత్ర=ఆదేశములందు; ధనధాన్యం=ధనమునుధాన్యములును; అజావికం=సాలువులును, మొదలయిన; బహు= అధికమయిన; ద్రవ్యం=వస్తువు;జాతం=కల్గినది.

ఆదేశములందు, ధనముధాన్యము సాలువులుమొదలగు సమస్తద్రవ్యంబులునుగలుగుచున్నవి-అని, తాత్పర్యము.

తతో వృణీష్వ కైకేయి యద్యత్త్వం మనసేచ్ఛసి. ౩౮

టీక॥కైకేయి=కైకేయీ!త్వం=నీవు;తతః=వానియందు;యద్యత్=దేనిదే

నిని; మనసా=మనసుచేత; ఇచ్ఛసి= కోరుచున్నావో; తత్ (అధ్యాహృతము)= దానిని; వృణీష్వ=కోరుకొనుము.

కైకేయీ! ఆద్రవ్యములందునీకేదేది గావలయునో వానినన్నింటి నడుగుము; ఇచ్చెదను. అని, తాత్పర్యము.

కిమాయాసేన తే భీరు ఉత్తిష్ఠోత్తిష్ఠ శోభనే

టీక॥ భీరు=భయపడుదానా! తే= నీకు; ఆయాసేన=శ్రమముచేత; కిం= ఏమిప్రయోజనము? శోభనే=మంగళకరివగుదానా! ఉత్తిష్ఠ=లెమ్ము; ఉత్తిష్ఠ=లెమ్ము.

కైకేయీ! నీకుఁజాలభయపడు స్వభావంబున్నది; ఇట్లునేలంబరుండి శ్రమపడుటవలన నేమియుఁ బ్రయోజనంబు లేదు; నీవుమంగళస్వరూపిణివి; ఇట్లునేలం బరుండి యుండందగదు; లెమ్ము, లెమ్ము.

అని, తాత్పర్యము.

తత్త్వం మే బ్రూహి కైకేయి యత స్తే భయ మాగతమ్. ౩౯
త త్తే వ్యపనయిష్యామి నీహార మివ రశ్మివాన్

టీక॥ కైకేయి=కైకేయీ! యతః= దేనివలన; తే=నీకు; భయం=వెఱపు; ఆగతం=వచ్చినదో; తత్ = దాని; త్వం=నీవు; మే=నాకొఱకు; బ్రూహి=చెప్పుము. తే=నీకొఱకు; తత్= దానిని; రశ్మివాన్ = సూర్యుఁడు; నీహారమివ= మంచునుంబోలె; వ్యపనయిష్యామి=పోఁగొట్టెదను.

కైకేయీ! నీకిప్పుడు దేనివలనభయంబుగల్గినదో దానినాకుం జెప్పుము; సూర్యుండుమంచునుబోఁగొట్టునట్లు, దానినేఁబోఁగొట్టెదను. అని, దశరథుఁడు కైకేయితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తథోక్తా సా సమాశ్వస్తా వక్తుకామా తదప్రియమ్. ౪౦
పరిపీడయితుం భూయో భర్తార ముపచక్రమే

టీక॥ సా=ఆకైకేయి; తథా= అట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; సమాశ్వస్తా=ఊఱడింపఁబడినదై; తత్=ఆ; అప్రియం=ప్రియముగానిమాటను; వ

స్తుకామా=చెప్పఁగోరినదై; భర్తారం=పెనిమిటిని; భూయః=ఇంకను; పరిపీడయితుం=దుఃఖింపఁజేయుటకు; ఉపచక్రమే=ఆరంభించినది.

కైకేయి,దశరథునిచే నట్టులాశ్వాసింపఁబడి, అప్రియంబగురాముని వనమునకుఁబంపుమనువార్తఁజెప్పఁదలఁచి, శపథములుసేయించియింకను దశరథుని దుఃఖపఱుప, నారంభించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, దశమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ దశమసర్గ టీక,
ముగిసినది.

---

శ్రీః

ఏకాదశసర్గప్రారంభః.

తం మన్మథ శరైర్విద్ధం కామవేగవశానుగమ్
ఉవాచ పృథివీపాలం కైకేయీ దారుణం వచః. ౧

టీక॥ కైకేయీ=కైకేయి; మన్మథశరైః=మన్మథబాణములచేత; విద్ధం=కొట్టఁబడినవాఁడును; కామవేగవశానుగం=మన్మథునివేగముయొక్క యధీనతను వెంబడించువాఁడును;పృథివీపాలం = భూమినిబాలించువాఁడునగు; తం=ఆదశరథునిగూర్చి; దారుణం=భయంకరమయిన;వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

మన్మథబాణంబులఁగొట్టఁబడి మన్మథాధీనుండైయుండు నాదశరథమహారాజుంజూచి, కైకేయి,రామునివనమునకుఁ బంపుటకై ప్రతిజ్ఞచేయించుటకుఁగాఁజెప్పఁబడునదిగావున నతిభయంకరంబయిన,మాటంజెప్పెను.

అని,తాత్పర్యము.



నాస్మి విప్రకృతా దేవ కేనచి న్నావమానితా
అభిప్రాయస్తు మే కశ్చి త్త మిచ్ఛామి త్వయా కృతమ్. ౨

టీక॥ దేవ=పెనిమిటివగు దశరథుఁడా! అహం (అధ్యాహృతము)=నేను; విప్రకృతా=రోగముగలదానను; నాస్మి=కాను. కేనచిత్=ఒకానొకనిచేతను; అవమానితా=అవమానింపఁబడినదానను; న=కాను. మే=నాకు; కశ్చిత్=ఒకానొక; అభిప్రాయః=కోరికి; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది. తం=దానిని; త్వయా=నీచేత; కృతం=చేయఁబడినదానిఁగా; ఇచ్ఛామి=కోరుచున్నాను.

పెనిమిటివగుదశథుఁడా! నాకేరోగమును లేదు; నన్నెవ్వఁడు నవమానింపలేదు; నాకొకకోర్కి యున్నది; దానినీవు నెఱవేఱుపవలయును.

అని, తాత్పర్యము.

ప్రతిజ్ఞాం ప్రతిజానీష్వ యది త్వం కర్తు మిచ్ఛసి

టీక॥ త్వం=నీవు; కర్తుం=చేయుటకు; ఇచ్ఛసియది=చేయఁగోరుదువేని; ప్రతిజ్ఞాం=ప్రతినను; ప్రతిజానీష్వ=చేయుము.

నీవుదానినెఱవేర్పఁగోరుదువేని, "నేనునీకోరికనునెఱవేర్చెదను" అని

దృఢముగా శపథము సేయుము. అని, తాత్పర్యము.

అథ త ద్వ్యాహరిష్యామి య దభిప్రార్థితం మయా. ౩

టీక॥అథ=అటుపిమ్మట; మయా=నాచేత;యత్=ఏది; అభిప్రార్థితం=కోరఁబడినదో;తత్=దానిని;వ్యాహరిష్యామి=చెప్పెదను.

నీవట్లు ప్రతిజ్ఞ చేసినపిమ్మట, నేనుగోరినదానిం జెప్పెదను.అని,కైకేయి,దశరథునితోఁ జెప్పెను. అని,తాత్పర్యము.

తా మువాచ మహాతేజాః కైకేయీ మీష దుత్స్మితః
కామీ హస్తేన సంగృహ్య మూర్ధజేషు శుచిస్మితామ్. ౪

టీక॥మహాతేజాః = అధికమయిన కాంతిగలవాఁడును; కామీ=కాముకుండునగుదశరథుండు;ఈషత్ = కొంచెము;ఉత్స్మితః = పుట్టినచిఱునగవుగలవాఁడై; శుచిస్మితాం=తెల్లనిచిఱునగవుగల;తాం = ఆ;కైకేయీం=కైకేయిని; మూర్ధజేషు=తలవెండ్రుకలందు;హస్తేన=చేతిచేత; సంగృహ్య=పట్టుకొని;ఉవాచ=పలికెను,

మహాతేజుండును గాముకుండునగు దశరథుండు; "తనకోరిక నెఱవేర్చుటకే యీకైక తనయందు బహుప్రేమగల నన్నుశపథము సేయుమనుచున్నది" అని,చిఱునగవునొంది, తెల్లగాసుందరంబుగానుండు చిఱునగవుగలయాకైకను దనకభిముఖయగుటకై, తలవెండ్రుకలయందుఁ జేతంబట్టుకొని,యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

అవలిప్తే న జానాసి త్వత్తః ప్రియతమా మమ
మనుజో మనుజవ్యాఘ్రా ద్రామా దన్యో న విద్యతే. ౫

టీక॥అవలిప్తే=మూఢురాలా;"మమ=నాకు; స్త్రీణాంమధ్యే(అధ్యాహృతము)=స్త్రీలలోపల; త్వత్తః=నీకన్నను; ప్రియతమా=అధికముగాఁబ్రియురాలయినది; నవిద్యతే (అధ్యాహము) = లేదు.పురుషాణాంమధ్యే(అధ్యాహృతము)= పురుషులలోపల;మనుజవ్యాఘ్రాత్= పురుషశ్రేష్ఠుండైన;

రామాత్=రామునికన్న; ప్రియతమః (అధ్యాహృతము)=అధికప్రియుండగు; అన్యః; మఱియొక్క; మనుజః=పురుషుండు; నవిద్యతే=లేఁడు." ఇతి(అధ్యాహృతము)=అని; నజానాసి=ఎఱుంగవు.

"నాకుస్త్రీలలోనీకన్నఁ బ్రియురాలయినదిమఱియెవ్వతెయులేదు; పురుషులలోఁ బురుషశ్రేష్ఠుండగు రామునికన్నఁ బ్రియుండగు పురుషుండు మఱియెవ్వండునులేఁడు." అని, మూఢురాలవు, కావున, నీకుఁదెలియలేదు.

అని, తాత్పర్యము.

తేనాఽజయ్యేన ముఖ్యేన రాఘవేణ మహాత్మనా
శపే తే జీవనార్హేణ బ్రూహి యన్మనసేచ్ఛసి. ౮

టీక ॥ అజయ్యేన=శత్రువులకుజయింపఁగూడనివాఁడును; ముఖ్యేన=శ్రేష్ఠుండును; మహాత్మనా=పూజ్యమయినస్వభావముగలవాఁడును; జీవనార్హేణ=ప్రాణముకన్నను బూజింపఁదగినవాఁడునగు, తేన=ఆ; రాఘవేణ=రాముని చేత; తే=నీకొఱకు; శపే=ప్రతిజ్ఞ సేయుచున్నాను. మనసా=మనసుచేత; యత్=దేనిని; ఇచ్ఛసి=కోరుచున్నావో; తత్(అధ్యాహృతము)=దాని; బ్రూహి=చెప్పుము.

శత్రువులకుజయింపఁగూడనివాఁడై శ్రేష్ఠుండై మహాత్ముండై నాప్రాణములకన్నదధికుండైయుండు నా రాముఁడు సాక్షిగా బాసఁజేసెదను; నీవుకోరిన దానిం జెప్పుము. అని, తాత్పర్యము.

యం ముహూర్తమపశ్యంస్తు న జీవేయమహం ధ్రువమ్
తేన రామేణ కైకేయి శపే తే వచనక్రియామ్. ౯

టీక॥ కైకేయి=కైకేయీ! యం=ఎవ్వనిని; ముహూర్తంతు=స్వల్పకాలమైనను; అహం=నేను; అపశ్యన్=చూడనివాఁడనై; ధ్రువం=నిశ్చయముగా; నజీవేయం=బ్రతుకనో; తేన=ఆ; రామేణ=రాముని చేత; తే=నీయొక్క; వచనక్రియాం=మాటచేయుటను గుఱించి; శపే=ప్రతిజ్ఞ చేసెదను.

కైకేయీ! ఎవ్వనిగొంచెము సేపు చూడకున్నను నేను బ్రతుకఁజాలనో, అట్టి రాముఁడు సాక్షిగా, నీవు చెప్పినట్లు చేసెదనని, ప్రతిజ్ఞఁజేసెదను.

అని, తాత్పర్యము.

ఆత్మనా వాత్మజై శ్చాన్యై ర్వృణేయం మనుజర్షభమ్
తేన రామేణ కైకేయి శపే తే వచన క్రియామ్. ౮

టీక॥ కైకేయి=కైకేయీ! ఆత్మనా వా=నాచేతను; ఆత్మజైః=కొడుకులచేతను; అన్యైశ్చ=ఇతరులచేతను; మనుజర్షభం = పురుష శ్రేష్ఠుండగు; యం=ఏరామునిఁ; వృణే=కోరుదునో; తేన=ఆ; రామేణ=రామునిచేత; తే=నీయొక్క ; వచనక్రియాం=మాటచేయుటనుగుఱించి; శపే = ప్రతిజ్ఞ చేసెదను.

కైకేయీ! నన్నుఁజెలువుకొని యైనను, భరతుండు మొదలగుకొడుకులఁబోఁ గొట్టుకొనియయినను, మఱియితరులగుబంధువులుమున్నగు వారలవిడిచియయినను, ఎవ్వనినేఁగోరుచుందునో; అట్టి రాముండుసాక్షిగా, నీకార్యముచేసెదనని, ప్రతిజ్ఞఁజేసెదను.

అని, తాత్పర్యము.

భద్రే హృదయ మ ప్యేత దనుమృశ్యో ద్ధరస్వ మే

టీక॥ భద్రే=మంగళకరివగు కైకేయీ! మే=నాయొక్క; ఏతత్ =ఇట్టి; హృదయమపి=మనసునైనను; అనుమృశ్య=విచారించి; ఉద్ధరస్వ=కాపాడుము.

మంగళస్వరూపిణివగు కైకేయీ! నీవు దేనినోకోరియిట్లు నేలంబడియుండుటంబూడఁజాలక యిట్లుపరితపించుచుదుఃఖితంబై "నాప్రాణంబులకన్ననధికుండగు రాముండుసాక్షిగానీకార్యంబుచేసెదను" అనిప్రతిజ్ఞఁజేయునంతనీమీఁదఁప్రేమమోహంబులుగల్గియుండు నామనసునుజూచియయినను, నీకోరికనుజెప్పి, నన్నిప్పుడుగాపాడుము.

అని, తాత్పర్యము.

ఏత త్సమీక్ష్య కైకేయి బ్రూహి య త్సాధు మన్యసే. ౯

టీక॥ కైకేయి=కైకేయీ! ఏతత్=దీనిఁ; సమీక్ష్య=విచారించి; యత్=దేనిఁ; మన్యసే=తలంచుచున్నావో; తత్=(అధ్యాహృతము) దానిఁ; సాధు=చక్కఁగా; బ్రూహి=చెప్పుము.

నేనిప్పుడుచేసిన బాసలంబర్యా

లోచించి, నీవుదేనిఁ గోరుచున్నావో దానిసందేహంబువిడిచి చక్కఁగానా కుఁజెప్పుము.

అని, తాత్పర్యము.

బల మాత్మని జానంతీ న మాం శంకితు మర్హసి

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు;ఆత్మని=నీయందు,ఉన్న;బలం=నా ప్రేమబలమును; జానంతీ=ఎఱుంగుచున్నదానవై;మాం=నన్నుఁగూర్చి; శంకితుం=సందేహించుటకు; నార్హసి=తగవు.

నీయందునాకెచ్చుగాఁ బ్రేమయున్నదనినీకుఁజెలియును; నీవునాయందు సందేహంబుంచుటసరికాదు.

అని, తాత్పర్యము.

కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే. ౧౦

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను;తవ=నీకు;ప్రీతిం=సంతోషమును; కరిష్యామి=చేసెదను. తే=నీకొఱకు; సుకృతేనాపి=పుణ్యముచేతనుగూడ; శపే=బాసచేసెదను.

నేనుదప్పకనీవుకోరిన కార్యంబునెఱవేర్చినీకు సంతోషంబుగావించెదను; నాపుణ్యంబు సాక్షిగాబాసచేసెదను. అని,దశరథుఁడు,కైకేయితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సా తదర్థమనా దేవీ త మభిప్రాయ మాగతమ్
నిర్మాధ్యస్థ్యాచ్చ హర్షాచ్చ బభాషే దుర్వచం వచః. ౧౧

టీక॥తదర్థమనాః=ఆ,రామునడవికిఁబంపిభరతునకు రాజ్యాభిషేకంబుసేయుట,యనెడుప్రయోజనంబునందు మనసుగల; దేవీ=రాణియగు; సా=ఆ కైకేయి;తం=అట్టి;అభిప్రాయం=అభిప్రాయమును; ఆగతం=పొందినదశరథునింగూర్చి; నిర్మాధ్యస్థ్యాచ్చ=మాధ్యస్థ్యములేకుండుటవలనను, పక్షపాతమువలనను అనుట ; హర్షాచ్చ=సంతోషమువలనను; దుర్వచం=చెప్పఁగూడని;వచః=మాటను; బభాషే=చెప్పెను.

ఆకైకేయి,యెట్లయినరామునడవికిఁబంపి భరతునకు రాజ్యంబు వచ్చు

నట్లుగావలయునను కోర్కి-గలదిగావున, భరతునియందుఁ బక్షపాతంబున, దశరథుండు తనకనుకూలుండయ్యెనని, సంతసించి, యట్లు బాసచేసి తనకార్యంబు నెఱవేర్చుటకొప్పుకొన్నదశరథునింజూచి, శత్రువుతోనైనను జెప్పఁగూడనట్టి కఠినంబైన, యీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

తేన వాక్యేన సంహృష్టా త మభిప్రాయ మాగతమ్
వ్యాజహార మహాఘోర మభ్యాగత మివాంతకమ్. ౧౨

టీక॥ కైకేయీ = (అధ్యాహృతము) కైకేయి ; తేన= ఆ ; వాక్యేన = మాటచేత ; సంహృష్టా = సంతసించినదై; తం=అట్టి; అభిప్రాయం = అభిప్రాయమును ; ఆగతం=పొందినదశరథునిగూర్చిఁ; మహాఘోరం=మిక్కిలియుభయంకరమును; అభ్యాగతం=ఎదుటికివచ్చిన; అంతకమివ(స్థితం)= మృత్యువువలె నున్నదియునగు; వాక్యం (అధ్యాహృతము) మాటను;వ్యాజహార=చెప్పెను.

కైకేయి,దశరథుండుచెప్పినమాట వినిసంతోషించి, తనకనుకూలంబుగానభిప్రాయముపడినదశరథునింజూచి,మరణాంతంబగు భయంబు గలిగించునదిగావున, నెదుటనుండుమృత్యువనం దగియుండు, మాటం,జెప్పెను.

అని, తాత్పర్యము.

యథా క్రమేణ శపసి వరం మమ దదాసిచ
తచ్ఛృణ్వంతు త్రయస్త్రింశ ద్దేవా స్సాగ్ని పురోగమాః. ౧౩

టీక॥యథా= ఎట్లు;త్వం (అధ్యాహృతము)=నీవు; క్రమేణ=క్రమముచేత;శపసి =శపథముసేయుచున్నావో; మమ=నాకు; వరం = వరమును; దదాసి = ఇచ్చుచున్నావో; తత్ = దాని; సాగ్నిపురోగమాః = అగ్నిహోత్రుఁడు ముందు నడుచువాఁడుగాగల; త్రయస్త్రింశద్దేవాః=ముప్పదిమూఁడు (లక్షణచే) కోట్లదేవతలును;శృణ్వంతు=విందురుగాక.

నీవు,నీప్రియపుత్రుండును బుణ్యంబునుసాక్షిగాఁ గ్రమంబునశపథంబుచేసి, నాకు వరంబొసంగుటను, అగ్నిహోత్రుఁడుమున్నుగాఁగలముప్పదిమూఁడుకోట్లదేవతలును,విందురుగాక.

అని, తాత్పర్యము.

చంద్రాదిత్యౌ నభశ్చైవ గ్రహా రాత్ర్యహనీ దిశః
జగచ్చ పృథివీ చేయం సగంధర్వా సరాక్షసా. ౧౪
నిశాచరాణి భూతాని గృహేషు గృహదేవతాః
యాని చాన్యాని భూతాని జానీయు ర్భాషితం తవ. ౧౫

టీక॥ చంద్రాదిత్యౌ=చంద్రుండును సూర్యుండును; నభశ్చైవ=ఆకాశమును; గ్రహాః=అంగారకాదిగ్రహంబులును; రాత్ర్యహనీ=రేయుంబవలును; దిశః=దిక్కులును; జగచ్చ=లోకమును, స్వర్గలోకము మొదలగునదియనుట; సగంధర్వా = గంధర్వులతోఁగూడినదియు; సరాక్షసా =రాక్షసులతోఁగూడినదియునగు; ఇయం=ఈ; పృథివీచ = భూమియును; నిశాచరాణి= రాత్రియందుఁదిరుగునట్టి. భూతాని=భూతములును, దేవయోనివిశేషంబులనుట; గృహేషు=ఇండ్లయందు; స్థితాః =(అధ్యాహృతము) ఉన్న; గృహదేవతాః= ఇలువేల్పులును; అన్యాని= ఇతరములైన; భూతాని=భూతములు; యాని(సంతి)=ఏవియున్నవో; తాని (అధ్యాహృతము) చ=అవియును; తవ= నీయొక్క; భాషితం=మాటను; జానీయుః=ఎఱుంగుదురుగాక.

చంద్రసూర్యులును, ఇతరగ్రహంబులును, ఆకాశంబును, రేయుంబవలును, దిక్కులును, స్వర్గలోకము మొదలగు లోకంబులును, ప్రత్యక్ష దేవతయగు భూమియును, గంధర్వులును, రాక్షసులును, రాత్రియందు సంచరించు భూతంబులును, గృహంబులందున్న యిలువేల్పులును, మఱియు నితరభూతంబులును, నీ విప్పుడు చెప్పినదానికి, సాక్షులుగానుందురుగాక. అని, తాత్పర్యము.

సత్యసంధో మహాతేజా ధర్మజ్ఞ స్సుసమాహితః
వరం మమ దదాత్యేష తన్మే శృణ్వంతు దేవతాః. ౧౬

టీక॥ సత్యసంధః=దబ్బఱకాని ప్రతిజ్ఞ గలవాఁడును; మహాతేజాః=అధికమయిన పరాక్రమంబుగలవాఁడును; ధర్మజ్ఞః= ధర్మంబుల నెఱింగినవాఁడును; సుసమాహితః=మిక్కిలియు నెచ్చరికగలవాఁడునగు; ఏషః=ఈదశరథమహారాజు; మమ=నాకు; వరం=వరమును; దదాతి = ఇచ్చుచున్నాఁడు. తత్=

దానిని; దేవతాః=దేవతలు; మే=నా కొఱకు; శృణ్వంతు=విందురుగాక.

ఎప్పుడునసృతంబాడనివాఁడుమహాపరాక్రమశాలి ధర్మంబుల నెఱింగినవాఁడునెచ్చరికగలవాఁడునగునీదశరథమహారాజు, నాకిప్పుడువరం బిచ్చుచున్నాఁడు; దీనికిదేవతలందఱుసాక్షులుగానుందురుగాక. అని, తాత్పర్యము.

ఇతి దేవీ మహేష్వాసం పరిగృహ్యా భిశస్యచ
తతః పర మువాచేదం వరదం కామమోహితమ్. ౧౭

టీక॥ఇతి=ఇట్లు; దేవీ=రాణియగు కైకేయి;మహేష్వాసం=గొప్పవిల్లుగలదశరథుని;పరిగృహ్యా=పట్టుకొని,తనమతము నొప్పుకొనునట్లు చేసికొనియనుట;అభిశస్యచ=ఉబ్బించియును;తతః పరం=అటువెనుకను; వరదం=వరము నిచ్చువాఁడును; కామమోహితం=మన్మథునిచే మోహింపఁజేయఁబడినవాఁడునగు దశరథమహారాజునుగూర్చి; ఇదం=ఈమాటను;ఉవాచ=చెప్పెను.

ఇట్లుకైకేయి, మహాధనుర్ధరుండగుదశరథునిఁ,దనమతమునందునిలిపి, తనకార్యము నెఱవేఱుటకైయుబ్బించి, మన్మథమోహితుండై వరంబిచ్చుటకునిశ్చయించియున్న యాదశరథుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

స్మర రాజన్ పురా వృత్తం తస్మిన్ దైవాసురే రణే

టీక॥రాజన్=దశరథమహారాజా! పురా=మునుపు; దైవాసురే=దేవతలునసురులునుజేసినట్టి;తస్మిన్=ఆ;రణే=యుద్ధమునందు; వృత్తం=జరగినసమాచారమును;స్మర= జ్ఞప్తికిఁదెచ్చుకొనుము.

దశరథమహారాజా!పూర్వముదేవతలకునసురులకు జరగినయుద్ధమునందు నడచిన వృత్తాంతమును జ్ఞప్తికిఁదెచ్చుకొనుము. అని, తాత్పర్యము.

తత్ర చాచ్యావయ చ్ఛత్రు స్తవ జీవిత మంతరా. ౧౮

టీక॥తత్రచ=ఆయుద్ధమందును; శత్రుః=ఎదిరియయినశంబరాసురుండు; తవ=నీయొక్క;జీవితమంతరా=ప్రాణమునుదక్క; త్వాం(అధ్యాహృతము)=

నిన్ను; అచ్యావయత్=పడద్రోసెను.

ఆయుద్ధమునందు, శంబరాసురుండు, నీప్రాణములనుం బోఁగొట్టుటదక్కఁదక్కిన యన్నికష్టములను నీకుఁగలుగఁజేసెను. అని, తాత్పర్యము.

లేక; తత్రచ; అంతరా=నడుమను; రాత్రియుద్ధమునందనుట; శత్రుః=శంబరాసురుండు; తవ=నీయొక్క; జీవితం=ప్రాణమును; అచ్యావయత్ = కదలించెను.

ఆయుద్ధమునందు, రాత్రికాలంబున, శంబరాసురుండు, నిన్నుమూర్ఛపోవునట్లుచేసి, ప్రాణములుపోవునంతటిశ్రమమునునీకుఁగలుగఁజేసెను.

అని, తాత్పర్యము.

తత్ర చాపి మయా దేవ యత్త్వం సమభిరక్షితః
జాగ్రత్యా యతమానాయా స్తతో మే ప్రాదదా వరౌ. ౧౯

టీక॥ దేవ=పెనిమిటివగుదశరథుఁడా! యత్=ఎందువలన; తత్రచాపి=ఆరాత్రికాలమునందును; త్వం=నీవు; మయా=నాచేత; సమభిరక్షితః=కాపాడఁబడితివో; తతః=అందువలన; యతమానాయాః=నిన్నురక్షించువిషయమై ప్రయత్నించుచున్నదానను; జాగ్రత్యాః = మేల్కొనుచున్నదాననగు; మే=నాకు; వరౌ=వరములను; ప్రాదదాః=ఇచ్చినావు.

భర్తవగు దశరథుఁడా! శంబరాసురుఁడు నిన్ను మూర్ఛపోవునట్లుచేసినప్పుడు, నేనురాత్రియంతయు మేల్కొనియుండి, బహుప్రయత్నంబున, నిన్నుఁజావకుండఁగాపాడినాను; అందువలన, నీవునాకప్పుడు, రెండువరంబులిచ్చినావు.

అని, తాత్పర్యము.

తౌతు దత్తౌ వరౌ దేవ నిక్షేపౌ మృగయా మ్యహమ్
తవైవ పృథివీ పాల సకాశే సత్య సంగర. ౨౦

టీక॥సత్యసంగర=దబ్బఱకానిప్రతిజ్ఞగలవాఁడవు; పృథివీపాల=భూమిఁబాలించువాఁడవు; దేవ=పెనిమిటివగుదశరథుఁడా! దత్తౌ=ఇవ్వఁబడినవియును; తవ=నీయొక్క; సకాశేఏవ=సమీపమునందే; నిక్షేపౌ=ఇల్లడగానున్నవియునగు; తౌ=ఆ; వరౌతు=వరములనే; అహం=నేను; మృగయామి=వెద

కుచున్నాను,కోరుచున్నాననుట.

నీవునాకప్పుడిచ్చినవరంబులను రెంటిని నీయొద్దనే యుల్లడగానుంచియుంటిని;సాధారణంబుగానే, రాజునొద్దఁ బ్రజలు, నిక్షేపంబుంచుకొన్నట్టయిన, రాజుదాని జాగ్రతతోఁ గాపాడియిచ్చును;అందును, నీవుదబ్బఱమాటాడనివాఁడవు,మఱినాకుభర్తవు; అట్టినీవు, నేనునీయొద్దదాఁచినని క్షేపమును,నాకక్కఱకువచ్చునపుడుసిద్ధముగనిత్తువనినమ్మినీయొద్దనుంచితిని;నేనిప్పుడావరంబులనేకోరుచున్నాను; గాని, నాకేమియుఁగ్రొత్తగానీవీనక్కఱలేదు.

అని,తాత్పర్యము.

తత్ప్రతిశ్రుత్య ధర్మేణ నచేద్దాస్యసి మే వరమ్
అద్యైవ హి ప్రహాస్యామి జీవితం త్వద్విమానితా. ౨౧

టీక॥ తత్=అందువలన; ప్రతిశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి; ధర్మేణ=ధర్మముచేత; మే=నాకు; వరం=(జాత్యేకవచనము) వరములను;నదాస్యసిచేత్=ఈయవేని;త్వద్విమానితా=నీచేతనవమానింపఁబడిన; అహం ( అధ్యాహృతము)=నేను;అద్యైవహి=ఇప్పుడె; జీవితం=ప్రాణమును;ప్రహాస్యామి=విడిచెదను.

అట్లుమఱవు నేనునీకుమహోపకారముచేసినప్పుడు,నీవునాకిచ్చినవరంబులనేనేనడుగుచున్నాను,గావుననిట్లు"వరంబులనిచ్చెద"నని ప్రతిజ్ఞచేసి,ధర్మబుద్ధిచే,నావరంబులనాకీయకుందువేని, నీచేనిట్టులవమానంబునొంది, నేనుజీవింపఁజాలను; ఇప్పుడునీయెదుటనె, ప్రాణంబులనువిడిచెదను,అని,కైకేయి, దశరథునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

వాఙ్మాత్రేణ తదా రాజా కైకేయ్యా స్వవశే కృతః
ప్రచస్కంద వినాశాయ పాశం మృగ ఇవాత్మనః. ౨౨

టీక॥తదా=అప్పుడు; రాజా=దశరథమహారాజు; కైకేయ్యా=కైకేయిచేత;వాఙ్మాత్రేణ=మాటమాత్రముచేత;స్వవశే=తనలోఁకువయందు; కృతః=చేయఁబడినవాఁడై, ఉంచఁబడినవాఁడైయనుట; వాఙ్మాత్రేణ (అధ్యాహృతము)= గానరూపమయినమాటమాత్రముచేత;పాశం=వలను;మృగఇవ= జింకవలె;పాశం (అధ్యాహృతము)=ధర్మపాశమును; ఆత్మనః =

తనయొక్క; వినాశాయ= చేటుకొ ఱకు; ప్రచస్కంద= పొందెను.

బోయవాఁడు గానంబు సేయఁగానే, దానికిలోఁబడి, జింకదనచెఱవు కొఱకుఁ దానేవలలోఁ జిక్కుకొనునట్లు, అప్పుడు, కైకేయి, ముందుదనకిచ్చియుండినవరంబులిమ్మనియడిగిన మాటకే దశరథుండు, "అట్లేయిచ్చెదనని యొప్పుకొని, తనకు వినాశంబుగల్గుననియాలోచింపక, ధర్మపాశంబునం, జిక్కుకొనెను. అని, తాత్పర్యము.

తతః పర మువా చేదం వరదం కామమోహితమ్

టీక॥ కైకేయీ (అధ్యాహృతము)=కైకేయి; తతః=అటుపిమ్మట; కామమోహితం= మన్మథునిచే మోహింపఁజేయఁబడిన వాఁడును; వరదం=వరంబులనిచ్చువాఁడునగు దశరథమహారాజునుగూర్చి; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

అటుపిమ్మటఁ, గైకేయి, మన్మథమోహితుండై, తనకువరంబులీయనిశ్చయించియున్నదశరథుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

వరౌ యౌ మే త్వయా దేవ తదా దత్తౌ మహీపతే. ౨౩
తౌ తావ దహ మద్యైవ వక్ష్యామి శృణు మే వచః

టీక॥మహీపతే=భూమికిఁ బ్రభుండవయిన; దేవ=పెనిమిటివగుదశరథమహారాజా! తదా=అప్పుడు; మే=నాకు; త్వయా=నీచేత; యౌ=ఏ; వరౌ=వరములు; దత్తౌ=ఇయఁబడినవో; తౌ తావత్=ఆవరంబులనన్నింటిని గూర్చి; అహం=నేను; అద్యైవ=ఇప్పుడె; వక్ష్యామి=చెప్పెదను. మే= నాయొక్క; వచః=మాటను; శృణు=వినుము.

నాపెనిమిటివగుదశరథ మహారాజా! ఆరాత్రియుద్ధంబుననీవునాకిచ్చినవరంబులను రెంటెని, విభజించి, నాకీయవలసినరీతిని, " జెప్పెదను; నామాటవినుము. అని, తాత్పర్యము.

అభిషేకసమారంభో రాఘవస్యోపకల్పితః. ౨౪
అనే నైవాభిషేకేణ భరతో మేభిషిచ్యతామ్

టీక॥ రాఘవస్య=రామునకు; యః (అధ్యాహృతము)=ఏ; అభిషేకసమారంభః=అభిషేకముసేయుటకైన సామగ్రి; ఉపకల్పితః=చేయఁబడినదో; తేన (అధ్యాహృతము)= ఆ; అనేన= ఈ; అభిషేకేనైవ = అభిషేకముచేతనె, అభిషేకసామగ్రిచేతనేయనుట; భరతః=భరతుఁడు; మే=నాకొఱకు; అభిషిచ్యతాం=అభిషేకింపఁబడుఁగాక.

ఇప్పుడు రామునకుఁబట్టాభిషేకము సేయుటకై, యేయేసామగ్రులు, సంపాదింపఁబడియున్నవో, ఆసామగ్రులతోనే, నాకుఁగా, భరతునకుఁబట్టాభిషేకముసేయవలయును; ఇదియొకవరము. అని, తాత్పర్యము.

యో ద్వితీయో వరో దేవ దత్తః ప్రీతేన మే త్వయా. ౨౭
తదా దైవాసురే యుద్ధే తస్య కాలో య మాగతః

టీక॥ దేవ=పెనిమిటివగు దశరథుఁడా! తదా=అప్పుడు; దైవాసురే=దేవతలు నసురులునుజేసినట్టి; యుద్ధే=యుద్ధమునందు; ప్రీతేన=సంతోషించినట్టి; త్వయా= నీచేత; మే=నాకు; యః= ఏ; ద్వితీయః=రెండవదైన; వరః=వరము; దత్తః=ఇయ్యఁబడినదో; తస్య=ఆవరంబునకు; అయం=ఈ; కాలః=సమయము; ఆగతః=వచ్చినది.

పెనిమిటివగుదశరథమహారాజా! ఆదేవాసురయుద్ధంబునందు, నీవు నాయందుసంతోషంబు నొంది, నాకిచ్చిన రెండవవరంబునకును, ఇప్పుడే, సమయంబువచ్చియున్నది.

అని, తాత్పర్యము.

నవ పంచచ వర్షాణి దండకారణ్య మాశ్రితః. ౨౮
చీరాజినజటాధారీ రామో భవతు తాపసః

టీక॥ రామః=రాముఁడు; నవ=తొమ్మిదియును; పంచచ=ఐదును, పదునాలుగనుట; వర్షాణి=సంవత్సరంబులు; దండకారణ్యం=దండకయనునడవిని; ఆశ్రితః=పొందినవాఁడై; చీరాజినజటాధారీ=నారచీరలను తోలునుజటలనుధరించువాఁడై; తాపసః= ఋషిగా; భవతు=ఉండుఁగాక.

రాముండు, పదునాలుగు సంవత్సరంబులు, దండకారణ్యంబున, నారచీరెలుఁ గృష్ణాజినంబును జటలనుధరించుకొని, తాపసుండుగా, నుండవలయును; ఇది రెండవవరము.

అని, తాత్పర్యము.

భరతో భజతా మద్య యౌవరాజ్య మకంటకమ్. ౨౭

టీక॥అద్య=ఇప్పుడు; భరతః=భరతుఁడు; అకంటకం=శత్రువులు లేనందువలన, కష్టములేనట్టి; యౌవరాజ్యం=యువరాజుదొరతనమును; భజతాం=పొందుఁగాక.

ఇప్పుడు, భరతుండు, శత్రువులెంతమాత్రము లేకుండుటంజేసి కష్టములేక, బహుసుఖంబుగానుండు, యౌవరాజ్యంబునొందవలయును.

అని, తాత్పర్యము.

ఏష మే పరమః కామో దత్తమేవ వరం వృణే

టీక॥ఏషః=ఇది; మే=నాయొక్క; పరమః=ముఖ్యమయిన; కామః=కోరికి. అహం (అధ్యాహృతము)=నేను; దత్తం=ఇవ్వఁబడిన; వరమేవ=వరమునే; వృణే=కోరుచున్నాను.

"భరతుండు, యువరాజు కావలయును; రాముండుపదునాలుగుసంవత్సరంబులరణ్యంబునఁ దాపసుండుగా నుండవలయును" ఇదినాదుముఖ్యమయినకోరిక; నీకు మున్ను నేను జేసిన మహోపకారంబునకుబదులుగానీవిచ్చిన వరంబులనేయడుగుచున్నాను; గాని, నిన్నిప్పుడన్యాయంబుగా నిర్బంధింపలేదు. అని, తాత్పర్యము.

అద్యచైవహి పశ్యేయం ప్రయాంతం రాఘవం వనమ్. ౨౮

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; అద్యచైవహి=ఇప్పుడే; వనం=అడవినిగూర్చి; ప్రయాంతం=పోవుచున్న; రాఘవం=రాముని; పశ్యేయం=మాడవలయును.

ఇప్పుడె, రాముండడవికిఁబోవుచుండఁగా నేను, జూడవలయును.

అని, తాత్పర్యము.

స రాజరాజో భవ సత్యసంగరః
కులంచ శీలం చ హి రక్ష జన్మచ
పరత్ర వాసే హి వదం త్యనుత్తమమ్
తపోధనా స్సత్యవచో హితం నృణామ్. ౨౯

టీక॥ రాజరాజః—రాజులకును రాజవు; సః=ప్రసిద్ధుండవగు; త్వం(అధ్యాహృతము)=నీవు; సత్యసంగరః= దబ్బఱకాని ప్రతిజ్ఞ గలవాఁడవు; భవ=అగుము. కులంచ=వంశమును; శీలంచ=సదాచారమును; ("హి" అనునది పాదపూరణార్థము); జన్మచ= పుట్టుకను; రక్ష=కాపాడుకొనుము. తపోధనాః=తపస్సే ధనముగాఁగలఋషులు; సత్యవచః = సత్యమగుమాటను; నృణాం=మనుష్యులకు; పరత్రవాసే=పరలోకనివాసవిషయమయి; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేని; హితం= మేలుగలిగించుదానిఁగా; వదంతిహి= చెప్పుచున్నారుగదా!

నీవు రాజులకును రాజవు; మఱిసత్యసంధుండవని కీర్తి నొందినవాఁడవు; నీవు దబ్బఱలాడరాదు; ఇప్పుడును, నీప్రతిజ్ఞనుసత్యముఁజేసికొమ్ము; అట్లు, నీప్రతిజ్ఞ నుసత్యముఁగావించుకొని, నీకులమునునీయాచార సంపత్తిని నీజన్మమునురక్షించుకొనుము; స్వర్గలోకప్రాప్తివిషయమయి, మనుష్యులకుసత్యవచనముకన్న నధికముగా మేలుగల్గించునదివఱేమియులేదని, తపోధనులగు పెద్దలు చెప్పుట, నీకును దెలియును. అని, కైకేయి, దశరథునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ఏకాదశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకాదశసర్గ టీక, ముగిసినది.

౩౨.

## ద్వాదశసర్గప్రారంభః.

తత శ్ర్శుత్వా మహారాజః కైకేయ్యా దారుణం వచః
చింతా మభిసమాపేదే ముహూర్తం ప్రతతాపచ. ౧

టీక॥మహారాజః = పూజ్యుఁడగు రాజయినదశరథుండు; కైకేయ్యాః= కైకేయియొక్క; దారుణం=భయంకరంబయిన; వచః=మాటను; శ్రుత్వా= విని; తతః=అటుపిమ్మట; చింతాం=దుఃఖమును; అభిసమాపేదే=పొందెను. ముహూర్తం=కొంచెముసేపు; ప్రతతాపచ=మూర్ఛిల్లెను.

దశరథమహారాజు, కైకేయిచెప్పిన భయంకరంబగుమాటనువిని, యంత, మిగులదుఃఖంబునొంది, కొంతసేపుమూర్ఛనొందెను. అని, తాత్పర్యము.

కిన్ను మే యదివా స్వప్న శ్చిత్తమోహోపివా మమ
అనుభూతోపసర్గోవా మనసో వా ప్యుపద్రవః. ౨

టీక॥మే=నాకు; స్వప్నోయదివాకిన్ను — కలయామేమి? మమ=నాకు; చిత్తమోహోపివా= మనసుయొక్కభ్రమమా? అనుభూతోపసర్గోవా — అనుభవింపఁబడినవానియొక్కస్మరణమా ? మనసః=మనసునకు; ఉపద్రవోపివా =రోగమా?

ఇట్టిమాటలుకైకేయియాడుటపారమార్థికముగాఁదోఁచలేదు; ఇప్పుడునాకు స్వప్నముగల్గినదా ? చిత్తభ్రాంతియేమైనం గలిగెనా? పూర్వజన్మంబునను భవించినదిస్మృతికివచ్చుచున్నదా?లేక, నామనసునకురోగమేమైన వచ్చెనా? నాకిపుడు వీనిలోనేమిసంభవించెను? అని,దశరథుఁడుచింతించెను.

అని, తాత్పర్యము.

ఇతి సంచింత్య తద్రాజా నాధ్యగచ్ఛత్తదా సుఖమ్

టీక॥రాజా=దశరథమహారాజు;ఇతి=ఇట్లు; సంచింత్య=చింతించి; తత్ =

అట్లుచింతించుటవలన;తదా = అప్పుడు;సుఖం=సుఖమును;నాధ్యగచ్ఛత్ = పొందలేదు.

దశరథమహారాజీప్రకారము, చింతింపుచు, దానం జేసి, యెంతమాత్రంబును,సుఖంబునొందదయ్యె.

అని, తాత్పర్యము.

ప్రతిలభ్య చిరా త్సంజ్ఞాం కైకేయీ వాక్యతాడితః. ౩
వ్యథితో విక్లబశ్చైవ వ్యాఘ్రీం దృష్ట్వా యథా మృగః
అసంవృతాయా మాసీనో జగత్యాం దీర్ఘ ముచ్ఛ్వసన్. ౪
మండలే పన్నగో రుద్ధో మంత్రై రివ మహావిషః
అహో ధిగితి సామర్షో వాచ ముక్త్వా నరాధిపః. ౫
మోహ మాపేదివా న్భూయ శ్శోకోపహతచేతనః

టీక॥ కైకేయీవాక్యతాడితః=కైకేయిమాటచేతఁగొట్టఁబడిన; నరాధిపః= మనుష్యులకుఁబ్రభువైనదశరథుండు;చిరాత్= బహుకాలమునకు; సంజ్ఞాం=తెల్విని;ప్రతిలభ్య=పొంది; వ్యాఘ్రీం=ఆఁడుపులిని; దృష్ట్వా=చూచి; మృగః=జింక;యథా=ఎట్లో;తథా(అధ్యాహృతము)=అట్లు; వ్యథితః=దుఃఖమునొందినవాఁడై; విక్లబశ్చైవ=అవయవముల స్వాధీనతదప్పినవాఁడునై; అసంవృతాయాం=ఆస్తరణములేని; జగత్యాం=భూమియందు; ఆసీనః=కూర్చున్నవాఁడై; దీర్ఘం=అధికముగా; ఉచ్ఛ్వసన్=నిట్టూర్పువిడుచుచు,కావునన్, మండలే = యంత్రమండలమునందు;మంత్రైః = మంత్రములచేత;రుద్ధః=అడ్డగింపఁబడిన; మహావిషః=అధికమయినవిషముగల; పన్నగఇవ (స్థితః)=సర్పమువలెనున్నవాఁడై; సామర్షః=కోపముతోఁగూడినవాఁడై;"అహో=ఆశ్చర్యము! ధిక్=మండిపోవుఁగాక." ఇతి=అనెడు;వాచం = మాటను;ఉక్త్వా = చెప్పి;శోకోపహతచేతనః=దుఃఖముచేఁ గొట్టఁబడినతెలివిగలవాఁడై; భూయః=మఱల;మోహం=మూర్ఛను;ఆపేదివాన్ = పొందినాఁడు.

అట్లుకైకేయిమాటలంగలిగిన దుఃఖాతిశయంబునమూర్ఛవోయినదశరథమహారాజు, అంత బహుకాలంబునకు

మూర్ఛఁజేటి, కట్టైదుటఁబెద్దపులింగని సజింకయుంబోలె, దుఃఖితుండై వెలవెలఁబోవుచు, నాస్తరణంబులేని నేలపైఁగూర్చుండి, దీర్ఘంబుగ నూర్పులువుచ్చుచు, నట్లు మాంత్రికునిచే యంత్రమండలంబున మంత్రబలంబునఁగట్టువడి కదలలేక నిట్టూర్పులువుచ్చుచుండు మహావిషంబగుసర్పంబు కయివడిఁజూపట్టుచుఁ, గోపంబున, "ఇట్లు చెప్పట యాశ్చర్యముగానున్నది! ఈకైకేయి మండిపోవుఁగాక" అనిచెపి, దుఃఖంబున,మఱల,మూర్ఛనొందెను.

అని,తాత్పర్యము.

చిరేణ తు నృప స్సంజ్ఞాం ప్రతిలభ్య సుదుఃఖితః. ౬
కైకేయీ మబ్రవీ త్క్రుద్ధః ప్రదహన్నివ చక్షుషా

టీక॥ నృపః=మనుష్యులఁబాలించు నట్టి దశరథమహారాజు; చిరేణ= బహుకాలంబునకు; సంజ్ఞాం=తెలివిని; ప్రతిలభ్యతు=పొందినంతనే; సుదుఃఖితః= మిక్కిలియుదుఃఖమునొందినవాఁడై;క్రుద్ధః=కోపంబునొందినవాఁడై;చక్షుషా= కంటిచే; ప్రదహన్నివ (స్థితః)=కాల్చువాఁడువలె నున్నవాఁడై; కైకేయీం = కైకేయినిగూర్చి;అబ్రవీత్=పలికెను.

దశరథమహారా, జంతబహుకాలంబునకుమూర్ఛఁదేఱి, మిక్కిలియుదుఃఖితుండై, కోపంబుననెట్లునై నిప్పుంబోలి యున్నకంటం "గైకేయినిగాల్చునో" యనియెన్నందగియొప్పుచుఁ, గైకేయితోనిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

నృశంసే దుష్టచారిత్రే కులస్యాస్య వినాశని. ౭
కిం కృతం తవ రామేణ పాపం పాపే మయాపి వా

టీక॥నృశంసే=క్రూరురాలా!దుష్టచారిత్రే= చెడ్డనడతలుగలదానా! అస్య=ఈ;కులస్య=వంశముయొక్క; వినాశని=చెఱుపుదానా! పాపే=పాపముసేయుదానా!తవ=నీకు;రామేణ= రామునిచేతఁగాని; మయాపివా=నాచేతనుగాని;కిం = ఏమి;పాపం=అపరాధము;కృతం=చేయఁబడినది?

కైకేయీ! నీవుబహుక్రూరురాలవు; చెడునడతలుగలదానవు; మాకులం

బును నశింపఁజేయుటకుఁ బుట్టినదాన వు; పాపిష్ఠురాలవు, నీకు, రాముండుగాని, నేనుగాని, యేమియపరాధంబుగా వించితిమి? అని, తాత్పర్యము.

యదా తే జననీతుల్యాం వృత్తిం వహతి రాఘవః. ౮
తస్యైవ త్వ మనర్థాయ కిన్నిమిత్త మిహోద్యతా

టీక ॥ యదా=ఎప్పుడు; రాఘవః=రాముఁడు; తే=నీకు; జననీతుల్యాం= తల్లికిసరియయిన; వృత్తిం= వ్యాపారమును, శుశ్రూషననుట; వహతి = భరించుచున్నాఁడో, చేయుచున్నాఁడోయనుట; తదైవ(అధ్యాహృతము)=అప్పుడే; తస్యైవ = అట్టిరామునకే; త్వం=నీవు; అనర్థాయ=అపాయముకొఱకు; ఇహ=ఇప్పుడు; కిం నిమిత్తం=ఎందుకొఱకు; ఉద్యతా=ప్రయత్నించినావు.

రాముండు, నీకుఁ, తల్లికింబోలె శుశ్రూషలు సేయుచున్నాఁడు; అట్లుండినప్పుడే, ఆరామునకే, అనర్థంబుగలుగుటకై, నీవేల యిట్లుప్రయత్నపడుచున్నావు? అని, తాత్పర్యము.

త్వం మయాత్మవినాశార్థం భవనం స్వం ప్రవేశితా. ౯
అవిజ్ఞానా న్నృపసుతా వ్యాళీ తీక్ష్ణవిషా యథా

టీక॥ త్వం=నీవు; మయా=నాచేత; అవిజ్ఞానాత్=అజ్ఞానమువలన; నృపసుతా(ఇతి)=రాచకొమార్తెవని; మత్వా(అధ్యాహృతము)=తలఁచి; తీక్ష్ణవిషా=అతివేగమయినవిషముగల; వ్యాళీయథా=దుష్టసర్పమువలె; ఆత్మవినాశార్థం=నాచేటుకొఱకు; స్వం=నాదైన; భవనం=ఇంటిని; ప్రవేశితా=ప్రవేశింపఁజేయఁబడినావు.

నేను, నిన్నజ్ఞానంబున రాచకొమార్తెవనితలంచి, అతివేగమైన విషముగల దుష్టసర్పమునింటికిం దెచ్చుకొనునట్లు, నేనునశించిపోవుటకైయే, నా యింటికిఁదెచ్చుకొంటిని.

అని, తాత్పర్యము.

జీవలోకో యదా సర్వో రామస్యాహ గుణస్తవమ్. ౧౦
అపరాధం క ముద్దిశ్య త్యక్ష్యామీష్ట మహం సుతమ్

టీక॥ యదా=ఎప్పుడు; జీవలోకః= ప్రాణిసమూహము; సర్వః=అంతయు ను; రామస్య=రామునియొక్క; గుణ స్తవం= గుణములస్తోత్రమును; ఆహ=చె ప్పుచున్నదో ; తదా (అధ్యాహృత ము)=అప్పుడు; అహం=నేను; కం=ఏ; అపరాధం=తప్పును; ఉద్దిశ్య=ఉద్దేశిం చి; ఇష్టం=ప్రియుఁడైన; సుతం=కొడు కును; త్యక్ష్యామి=విడువఁగలను.

పశువులు, పక్షులు మొదలుకొని ప్రాణముగలజంతుజాలంబంతయు, రాముని గుణంబులం, గొనియాడుచుండఁగా, నేనతండేమితప్పు చేసినాఁడని, నాకుఁ బ్రియపుత్రుండగు నా రాముని విడువవచ్చును? అని, తాత్పర్యము.

కౌసల్యాంవా సుమిత్రాంవా త్యజేయ మపివా శ్రియమ్. ౧౧
జీవితంవా త్మనో రామం న త్వేవ పితృవత్సలమ్

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను; కౌసల్యాంవా=కౌసల్యనైనను; సుమిత్రాంవా=సుమిత్రనైనను; శ్రియమపివా=రాజ్యలక్ష్మినైనను; ఆత్మనః=నాయొక్క; జీవితంవా=ప్రాణమునైనను; త్యజేయం=విడుతును. పితృవత్సలం= తండ్రియందతిప్రీతిగల; రామంతు=రామునిమాత్రము; నైవ(త్యజేయం)= విడువ నేవిడువను.

నేను, గౌసల్యనైననుసుమిత్రనైనను రాజ్యమునైనను నాప్రాణమునైనను, విడువఁగలను; గాని, తండ్రినగు నాయందతిప్రీతిభక్తులుగల రామునిమాత్రము, నేనువిడుచుటయే లేదు.

అని, తాత్పర్యము.

పరా భవతి మే ప్రీతి దృష్ట్వా తనయ మగ్రజమ్. ౧౨
అపశ్యతస్తు మే రామం నష్టా భవతి చేతనా

టీక॥ మే=నాకు; అగ్రజం= మొదటఁబుట్టిన; తనయం=కొడుకైన రాముని; దృష్ట్వా=చూచి; పరా=అధికమయిన; ప్రీతిః=సంతోషము; భవతి=కలుగుచున్నది. మే=నేను; రామం=రాముని; అపశ్యతస్తు=చూడకుండఁగానే; చేతనా=ప్రాణము; నష్టా=నశించినది; భవతి=అగుచున్నది.

నాకు, నాజ్యేష్ఠపుత్రుండగు రాముని జూడఁగానే, బహుసంతోషముగలుగుచున్నది; నే నతనిం జూడకుందు నేని, నాప్రాణముపోవును.

అని, తాత్పర్యము.

తిష్ఠే ల్లోకో వినా సూర్యం సస్యం వా సలిలం వినా. ౧౩
నతు రామం వినా దేహే తిష్ఠేత్తు మమ జీవితమ్

టీక॥లోకః=లోకము; సూర్యంవినా=సూర్యునివిడిచి; తిష్ఠేత్=ఉండును; సస్యంవా=పైరును;సలిలంవినా=నీటినివిడిచి; తిష్ఠేత్=(అధ్యాహృతము)ఉండును; మమ=నాయొక్క;జీవితంతు=ప్రాణముమాత్రము;రామంవినాతు=రామునివిడిచి మాత్రము; దేహే=దేహమునందు; నతిష్ఠేత్=ఉండదు.

ఒకవేళ, లోకంబైననుసూర్యునివిడిచియుండును;పైరైననునీళ్లువిడిచియుండును; నేనురాముని విడుతునేని నా ప్రాణంబుమాత్రం బొకక్షణంబైనను, నాదేహంబున,నుండదు.

అని, తాత్పర్యము.

త దలం త్యజ్యతా మేష నిశ్చయః పాపనిశ్చయే. ౧౪

టీక॥తత్=అందువలన;అలం=చాలును. పాపనిశ్చయే=పాపముసేయవలయునని యెడు నిశ్చయముగల కైకేయీ!ఏషః=ఈ; నిశ్చయః= ఏపాటు; త్యజ్యతాం= విడువఁబడుఁగాక.

కైకేయీ!నీకిప్పుడుపాపబుద్ధి గలిగియున్నది;ఇదినాకుఁబ్రాణహాని గల్గించునది, కావున,నింతవఱకుఁజాలును; దీనివిడువుము. అని, తాత్పర్యము.

అపి తే చరణౌ మూర్ధ్నా స్పృశామ్యేష ప్రసీద మే

టీక॥ఏషః=ఈ;అహం(అధ్యాహృతము)=నేను; తే=నీయొక్క ; చరణౌ అపి=పాదములనైనను;మూర్ధ్నా=తలచే; స్పృశామి=తాఁకెదను. మే=నాకొఱకు;ప్రసీద=ప్రసన్నవగుము.

నీపాదంబులకైనను దలసోఁకు న

ట్లునమస్కారముఁజేసెదను; నామీఁదఁగోపింపవలదు. అని, తాత్పర్యము.

టీక॥ఏషః=ఈ; అహం=నేను; తే=నీయొక్క; చరణౌ=పాదములను; మూర్ధ్నా=తలచే; అపిస్పృశామి= తాఁకుదునా? మే=నాకొఱకు; ప్రసీద=ప్రసన్నవగుము.

నేనునీకుభర్తను, గావున, సంశయించుచున్నాను; నీపాదంబులకు నమస్కారంబుఁజేయుదునా? యేమి? కోపంబువిడువుము. అని, తాత్పర్యము.

కి మిదం చింతితం పాపే త్వయా పరమదారుణమ్. ౧౫

టీక॥పాపే= పాపముసేయు స్వభావంబుగలకైకేయీ! త్వయా=నీచేత; పరమదారుణం = మిక్కిలియుభయంకరంబగు; ఇదం=ఇది; కిం=ఎందుకు; చింతితం=ఆలోచింపఁబడినది?

పాపిష్ఠురాలగుకైకేయీ! అతిభయంకరంబగునీయాలోచనను, నీవేలచేసినావు? అని, తాత్పర్యము.

అథ జిజ్ఞాససే మాం త్వం భరతస్య ప్రియా ప్రియే

టీక॥త్వం=నీవు; భరతస్య= భరతునియొక్క; ప్రియా ప్రియే=ఇష్టానిష్టవిషయమందు; మాం=నన్ను; అథజిజ్ఞాససే=తెలిసికొనఁ గోరుచున్నావా యేమి?

భరతునియందునాకుఁ బ్రీతికలదో లేదో" అని, యేమైనఁ, దెలిసికొనఁగోరియిట్లుచెప్పినావా? యేమి?

అని, తాత్పర్యము.

అస్తు యత్తత్త్వయా పూర్వం వ్యాహృతం రాఘవం ప్రతి. ౧౬
స మే జ్యేష్ఠ స్సుత శ్శ్రీమా న్ధర్మజ్యేష్ఠ ఇతీవ మే
తత్త్వయా ప్రియవాదిన్యా సేవార్థం కథితం భవేత్. ౧౭

టీక॥అస్తు=అగుఁగాక ; భరతునియందునాకుఁ బ్రీతియున్నదా లేదా? యనితెలియఁగోరుటయే యగుఁ గాకయనుట. తత్=అందువలన; పూర్వం=మునుపు; రాఘవంప్రతి = రామునిగూర్చి; త్వయా=నీచేత; మే=నా

కొఱకు; సః=ఆ రాముఁడు; మే=నాకు; జ్యేష్ఠః=మొదటివాఁడైన; సుతః=కొడుకు; శ్రీమాన్=అందఱికన్న నెచ్చయినవాఁడు; ధర్మజ్యేష్ఠః=ధర్మముచేతను బెద్దవాఁడు" ఇతి=అని; యత్=ఏది; వ్యాహృతం=చెప్పఁబడినదో; తత్=అది; ప్రియవాదిన్యా=సంతోషకరంబులగుమాటలం జెప్పునట్టి; త్వయా=నీచేత; సేవార్థం=నామనసు సంతోషపెట్టుటకొఱకు, లేక, నేను జేయు సేవకొఱకు నేను నీయందవిచ్చిన్నము గాఁ బ్రీతిగల్గియుండుటకొఱకనుట; రాముండు సేయుశుశ్రూషకొఱకు; కథితం=చెప్పఁబడినది; భవేత్=అగును.

నాకుభరతునియందుఁ బ్రీతియున్నదా? లేదా? యని తెలియఁగోరినట్లయినుఁ గాక; అట్లయిన, రామునియందు నీకుఁ బ్రీతిదఱిగియుండుటకుఁ గారణంబు లేదు, కావున, నీవుభరతునకు రాజ్యం బిమ్మనియడుగుదువుగాని, యిట్లు, రాముని వనంబునకంపుమనియడుగఁజాలవు; అయితే, మున్ను, నీవు, నాతో, "రాముండు" నాకుజ్యేష్ఠపుత్రుండు, అతండందఱికన్నన్నధికుండు, ధర్మజ్యేష్ఠుండు. అని రామునిగూర్చి చెప్పియున్నావే; యామాటలన్నియు, నీవు, ప్రియవాదినివికావున, నామనసునకు సంతోషంబుగలిగించుటకుఁగాని, నేను నీయం దెప్పటికిని బ్రీతిగలిగియుండునట్లు, లేక, గావించుకొనుటకుఁగాని, రామునిచేశుశ్రూషలు సేయించుటకొనుటకుఁగాని, చెప్పియుండువు; గాని, పరమార్థంబుగాఁ జెప్పలేదు. అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా శోక సంతప్తా సంతాపయసి మాం భృశమ్
ఆవిష్టాసి గృహం శూన్యం సా త్వం పర వశం గతా. ౧౮

("ఆవిష్టా సిగ్రహైశ్శూన్యైః" ఇతి. గోవిందరాజమతే పాఠాంతరం)
("ఆవిష్టా సిగ్రహంశూన్యం" ఇతి. మహేశ్వరతీర్థమతం)
("ఆవిష్టాసిగ్రహంశూన్యే" ఇతిమహేశ్వరతీర్థమతే, పాఠాంతరం)

టీక॥ తత్=అందువలన; సా=అట్టి; త్వం=నీవు; శ్రుత్వా=రామాభిషేకవార్తనువిని; శోకసంతప్తా=దుఃఖముచేఁ దపింపఁ జేయఁ బడినదానవై; మాం=నన్ను; భృశం=మిక్కిలియు; సంతాపయసి=తపింపఁజేయుచున్నావు; పరవశం=ఇతరులలోఁబడువనుట; గతా=పొందినదానవై; శూన్యం=ఏమి

యు లేని;గృహం=కోపగృహమును; ఆవిష్టా=ప్రవేశించిన దానవు; అసి=అగుచున్నావు.

అందువలననే, నీవు, రామాభిషేకవార్త చెవికిసోఁకినంతనే, దుఃఖంబునొంది, యతినిర్బంధంబున,నన్నునుదుఃఖించునట్లుసేయుచున్నావు;మఱియు, నితరులబోధనకులోఁబడి, శూన్యంబగు కోపగృహంబుననున్నావు.

అని, తాత్పర్యము.

పాఠాంతరములు.—శూన్యైః=కంటికగపడని;గ్రహైః=పిశాచములచేత;అవిష్టా=ఆవేశింపఁబడినదానవై;పరవశం=ఇతరులలోఁకువను; స్వాధీనత తప్పుటనుట,గతా=పొందినదానవు; అసి=అగుచున్నావు.

అందువలననే, నీవు, రామాభిషేకవార్త చెవికి సోఁకినంతనే, దుఃఖంబునొంది,యతినిర్బంధంబున, నన్నునుదుఃఖించునట్లుచేయుచున్నావు; లేక, యొకవేళ, నీకుఁబిశాచంబులుసోఁకుటవలన, చిత్త స్వాధీనతదప్పి, యిట్లుచెప్పుచున్నావో యేమో! అని, తాత్పర్యము.

శూన్యం=కంటికగపడని;గ్రహం=పిశాచమును;ఆవిష్టా = పొందినదానవై;(శేషము-పై).

తాత్పర్యము, సమానము.

శూన్యే=తెలివిలేనికైకేయీ!

ఇతరము,సమానము.

ఇక్ష్వాకూణాం కులే దేవి సంప్రాప్తస్సుమహా నయమ్
అనయో నయసంపన్నే యత్ర తే వికృతా మతిః. ౧౯

టీక॥ నయసంపన్నే=నీతితోఁగూడిన! దేవి=రాణివగుకైకేయీ! యత్ర=ఏవంశమునందు; తే=నీయొక్క;మతిః=బుద్ధి;వికృతా = విపరీతమయినదో;తత్ర(అధ్యాహృతము)=అట్టి;ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశస్థులయొక్క;కులే=వంశమునందు; సుమహాన్=మిక్కిలియుగొప్పదైన; అయం = ఈ;అనయః=అనర్థము; సంప్రాప్తః=సంభవించినది.

నీవుపూర్వము మిగులధర్మబుద్ధిగలదానవు;అట్టినీకిప్పుడు, ఇట్టివిపరీతబుద్ధిగలిగినది,గావున, నీయిక్ష్వాకువంశమునకు, గొప్పయనర్థముసంభవించినది.

అని, తాత్పర్యము.

నహి కించి దయుక్తంవా విప్రియం వా పురా మమ
అకరో స్త్వం విశాలాక్షి తేన నశ్రద్దధామ్యహమ్. ౨౦

టీక॥ విశాలాక్షి=వెడల్పులయినకండ్లుగలకైకేయీ! త్వం= నీవు; పురా= మునుపు; మమ=నాకు; కించిత్=కొంచెమయినను; అయుక్తంవా = ఉచితముగానిదానినిగాని; విప్రియంవా=సంతోషకరముగానిదానినిగాని; నాకరోహి= చేసినదానవుకావుగదా! తేన=అందుచేత; అహం=నేను; నశ్రద్దధామి = నమ్మను.

విశాలములగు కండ్లుగలకైకేయీ! నీవింతకుమున్ను, నాయందుంజాలభక్తిప్రీతులుగలిగియుంటివి; నాకుంగొంచెమయినను అయుక్తమయినదానినిగాని ప్రియముకానిదానినిగాని, చేసియుండలేదు; కావున, నీవిట్లు, నాకుబహుదుఃఖముగలిగించుమాటలంజెప్పట, సత్యం, బని, నేను, నమ్మంజాలను.

అని, తాత్పర్యము.

నను తే రాఘవ స్తుల్యో భరతేన మహాత్మనా
బహుశో హి సుబాలే త్వం కథాః కథయసే మమ. ౨౧

టీక॥ తే=నీకు; రాఘవః=రాముండు; మహాత్మనా=పూజ్యస్వభావంబుగల; భరతేన=భరతునితో ; తుల్యోనను=సమానుండుగదా! సుబాలే=మంగళస్వరూపిణివగుచిన్నదానా! త్వం= నీవు; బహుశః=పలుమాఱులు ; మమ=నాకు; కథాః=మాటలను; కథయసేహి=చెప్పుచుంటవిగదా!

నీకు, రాముండు , మహాత్ముండగు భరతునితోసమానుండేకదా ! చిన్నదానవుకావున, నీకుంగుటిల బుద్ధిలేకయుండునప్పుడు, నీవుపలుమాఱులు, నాతో, "నాకు రాముండును భరతుండును సమానులే" యనిచెప్పుచుంటివి గదా. అని, తాత్పర్యము.

తస్య ధర్మాత్మనో దేవి వనవాసం యశస్వి నః
కథం రోచయసే భీరు నవ వర్షాణి పంచచ. ౨౨

టీక॥ భీరు=ధర్మభీతిగల ; దేవి=రాణివగుకైకేయీ! ధర్మాత్మనః=

ధర్మబుద్ధిగలవాఁడును; యశస్వినః= ప్రశస్తమగుకీర్తి గలవాఁడునగు; తస్య=అట్టిరామునకు; నవ=తొమ్మిది యును; పంచచ=ఐదును; వర్షాణి= సంవత్సరంబులును; వనవాసం= అడవియందునికిని; కథం=ఎట్లు; రోచయసే=కోరుచున్నావు?

రాణివగుకైకేయీ! నీకున్నధర్మభీతియిప్పుడెక్కడికిఁబోయినది? ధర్మాత్ముండైజగంబుల గొప్పకీర్తిగలిగినవాఁడై, యిదివఱకునీకును ప్రీతి పాత్రుండై, యుండు, నారాముండు, పదునాలుగు సంవత్సరంబులు, అరణ్యంబున నుండవలయు, నని నీకెట్లు, కోరికపుట్టినది?

అని, తాత్పర్యము.

అత్యంతసుకుమారస్య తస్య ధర్మే ధృతాత్మనః
కథం రోచయసే వాస మరణ్యే భృశ దారుణే. ౨౩

టీక॥ అత్యంతసుకుమారస్య = మిక్కిలియుఁగోమలమయిన దేహముగలవాఁడును; ధర్మే= ధర్మమునందు; ధృతాత్మనః = ధరింపఁబడినబుద్ధిగలవాఁడునగు; తస్య=అట్టిరామునకు; భృశదారుణే=మిక్కిలియు భయంకరంబయిన; అరణ్యే=అడవియందు; వాసం= ఉనికిని; కథం=ఎట్లు; రోచయసే=కోరుచున్నావు.

అతిసుకుమారదేహంబుగలవాఁడును, ఒక తప్పైనను జేయక, ధర్మంబునందె బుద్ధిని దృఢంబుగాఁ జేర్చియున్నవాఁడునగునట్టిరాముండు, అతిభయంకరంబగునరణ్యంబున, వాసంబు సేయవలయు, నని, నీవెట్లు కోరినావు?

అని, తాత్పర్యము.

రోచయ స్యభిరామస్య రామస్య శుభలోచనే
తవ శుశ్రూషమాణస్య కిమర్థం విప్రవాసనమ్. ౨౪

టీక॥ శుభలోచనే=మంగళకరంబగు కండ్లుగలకైకేయీ! తవ=నీకు; శుశ్రూషమాణస్య= సేవ సేయుచున్నవాఁడును; అభిరామస్య=సుందరుండునగు; రామస్య = రామునియొక్క; విప్రవాసనం=అడవినుండునట్లు సేయుటను; కిమర్థం=ఎందుకొఱకు; రోచయసి=కోరుచున్నావు?

మంగళకరంబులగుకంకణ్ములుగల కైకేయీ! రాముఁడు, నీకెల్లప్పుడును శుశ్రూష సేయుచున్నాఁడు, అట్టి సర్వాంగసుందరుండగు, రాముని నడవికిఁ బంపవలెనని, యెందుకుఁగోరుచున్నావు?

అని, తాత్పర్యము.

రామోహి భరతాద్భూయ స్తవ శుశ్రూషతే సదా
విశేషం త్వయి తస్మాత్తు భరతస్య న లక్షయే. ౨౫

టీక॥ రామః = రాముఁడు; భరతాత్ = భరతునికన్న; భూయః = అధికముగా; తవ = నీకు; సదా = ఎల్లప్పుడు; శుశ్రూషతేహి = సేవచేయుచున్నాఁడుగదా! తస్మాత్తు = అందువలనమాత్రము; త్వయి = నీవిషయమై; భరతస్య = భరతునకు; విశేషం = ఆధిక్యమును; నలక్షయే = చూడను.

నీకు భరతునకన్న నెచ్చుగా రాముఁడు శుశ్రూష సేయుచున్నాఁడుగదా! అందువలన, నీవిషయమై రామునికన్న భరతునియందేమియు నతిశయము నాకగపడలేదు.

అని, తాత్పర్యము.

శుశ్రూషాం గౌరవం చైవ ప్రమాణం వచనక్రియామ్
కస్తే భూయస్తరం కుర్యా దన్యత్ర మనుజర్షభాత్. ౨౬

టీక॥ తే = నీకు; శుశ్రూషాం = సేవను; గౌరవంచైవ = బహుమానంబును; ప్రమాణం = పూజను; వచనక్రియాం = చెప్పినదాని చేయుటను; మనుజర్షభాదన్యత్ర = పురుషశ్రేష్ఠుండగు రాముని దక్క; కః = ఎవ్వఁడు; భూయస్తరం = మిక్కిలియు నధికముగా; కుర్యాత్ = చేయును?

నీకు, సేవచేయుచు, నీయందు బహుమానంబుంచి నిన్నుఁ బూజించుచు, నీవు చెప్పిన కార్యంబులు సేయుచుండువాఁడు, రాముండు దక్క మఱియొక్కఁడెవ్వఁడున్నాఁడు?

అని, తాత్పర్యము.

బహూనాం స్త్రీసహస్రాణాం బహూనాం చోపజీవినామ్

పరివాదో ౽పవాదోవా రాఘవే నోపపద్యతే. ౨౭

టీక॥బహూనాం=అనేకములయిన; స్త్రీసహస్రాణాం=స్త్రీలయొక్క వేల నడుమను;బహూనాం = అనేకులయి న; ఉపజీవినాంచ=భృత్యులనడుమను; పరివాదః=తప్పుగాని;అపవాదోవా= లేనితప్పును మోపుటగాని; రాఘవే= రామునియందు;నోపపద్యతే=లేదు.

పెక్కువేలమంది స్త్రీలున్నారు, అనేకులు భృత్యులున్నారు; వీరలనడుమ, నొక్క స్త్రీయయినను, ఒకభృత్యుఁడై నను, రామునిపైనున్నతప్పుచెప్పుటను గాని, లేక, యసూయచే లేనితప్పుమో పుటనుంగాని,యిదివఱకు నేనువినలేదు. అని, తాత్పర్యము.

సాంత్వయన్ సర్వభూతాని రామ శ్శుద్ధేన చేతసా
గృహ్ణాతి మనుజవ్యాఘ్రః ప్రియై ర్విషయవాసినః. ౨౮

టీక॥మనుజవ్యాఘ్రః = పురుషశ్రే ష్ఠుండగు రాముండు; శుద్ధేన=దోషము లేని;చేతసా=మనసుతో; సర్వభూతా ని=సమస్తప్రాణులను; సాంత్వయన్= అనునయించుచు;ప్రియైః=సంతోషము కలిగించువానిచేత; విషయవాసినః=దే శమునందుండుజనులను; గృహ్ణాతి=సం గ్రహించుచున్నాఁడు.

పురుషశ్రేష్ఠుండగు రాముండు, కప టము మొదలగు దోషంబులులేనిదగుట చేఁబరిశుద్ధమగుహృదయంబుగలిగి, స మస్తప్రాణులను, తిన్ననిమాటలనోదా ర్చుచు, దేశంబుననుండుజనుల, కందఱ కు,కోరినవానినిచ్చుటమొదలగుకార్యం బులచే, సంతోషంబుగల్గించుచున్నాఁ డు;కావున,జనులందఱు, రామునియం దు,బహుప్రీతిగలిగియున్నారు. అని, తాత్పర్యము.

సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః
గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్. ౨౯

టీక॥ వీరః=దయావీరుండును దా నవీరుండును ధర్మవీరుండును బరాక్ర మవీరుండునగు; రాఘవః = రాముఁ డు సత్యేన=సత్యముచేత; లోకాన్= లోకములను;జయతి = లోఁగొనుచు న్నాఁడు.దీనాన్=దరిద్రులను; దానే న=ఈవిచేత; జయతి (అధ్యాహృత ము) = లోఁగొనుచున్నాఁడు . గు

రూః=గురువులను; శుశ్రూషయా= సేవచే; జయతి (అధ్యాహృతము)= లోఁగొనుచున్నాఁడు. శాత్రవాః= శత్రువులను; యుధి=యుద్ధమునందు; ధనుషా=వింటిచేత; జయతి (అధ్యాహృతము)=లోఁగొనుచున్నాఁడు.

రాముండు, "దయావీరుండు, దానవీరుండు, ధర్మవీరుండు, పరాక్రమవీరుం" డనిచతుర్విధంబగువీరత్వంబుగలవాఁడు కావున, సత్యవ్రతముచే, స్వర్గాదిలోకంబులనన్నియుస్వాధీనములుగాఁ జేసికొనుచున్నాఁడు; ధనంబొసంగిదరిద్రులను, వశీకరించుకొనుచున్నాఁడు; శుశ్రూషచేసి, గురువులను, దనకురహస్యంబుల, నుపదేశించువారలఁగాఁ, జేసికొనుచున్నాఁడు; ధనుర్ధరుండైయుద్ధంబునందు, శత్రువుల జయించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

సత్యం దానం తప స్త్యాగో మిత్రతా శౌచ మార్జవమ్
విద్యాచ గురుశుశ్రూషా ధ్రువా ణ్యేతాని రాఘవే. ౩౦

టీక॥సత్యం=సత్యమును; దానం= పరలోకమునకై, సేయుదానమును; తపః=తపస్సును; త్యాగః= జనులకుసంతోషముగల్గుటకై చేయునట్టియీవియును; మిత్రతా=అందఱకును, స్నేహితుండగుటయు; శౌచం=శుద్ధియును; ఆర్జవం=కపటములేకుండుటయు; విద్యాచ=విద్యయును; గురు శుశ్రూషా=గురుసేవయును; ఏతాని=ఇవి; రాఘవే=రామునియందు; ధ్రువాణి= నిత్యములు

సత్యవ్రతమును, పరలోకముగల్గుటకై సేయుగోదానాదిదానములును, దపంబును, బరప్రీత్యర్థముగాఁ జేయునీవియును, అందఱకును స్నేహితుండు గానుండుటయు, బాహ్యాభ్యంతర శుద్ధియును, కపటములేకుండుటయు, విద్యయు, గురువులకుఁబరిచర్యలు సేయుటయు, నీగుణంబులు, రామునియం, దొకప్పుడును దప్పక, వర్తించుచున్నవి. అని, తాత్పర్యము.

తస్మి న్నార్జవసంపన్నే దేవి దేవోపమే కథమ్
పాప మాశంససే రామే మహర్షిసమతేజసి. ౩౧

టీ॥దేవి=రాణివగుకైకేయీ! ఆర్జవసంపన్నే=కపటములేకుండుటతోఁగూ

స ౧౨

డినవాఁడును;దేవోపమే= దేవతతోఁబోలికగలవాఁడును;మహర్షిసమతేజసి=పూజ్యుఁడైనఋషితోసరియయిన ప్రభావముగలవాఁడునగు;తస్మిన్=అట్టి;రామే=రామునియందు; పాపం=చెడుగును;కథం=ఎట్లు;ఆశంసే=కోరుచున్నావు?

రాణివగుకైకేయీ!కపటములేకుండుటయను గుణంబెట్టివారియందునుండుటరుదు;అట్టి;యుత్తమగుణంబుగల్గి దేవతతోసాటియగుచు, మహర్షియుంబోలెఁదపస్వియయియున్నరామునింగూడ,నడపికొంబంపుమని, యెట్లు,కోరెదవు? అని, తాత్పర్యము.

న స్మరామ్య ప్రియం వాక్యం లోకస్య ప్రియవాదినః
స కథం త్వత్కృతే రామం వక్ష్యామి ప్రియ మప్రియమ్. ౩౨

టీక॥అహం (అధ్యాహృతము)=నేను;లోకస్య=ప్రపంచమునకు;ప్రియవాదినః=సంతోషకరంబగు మాటలఁజెప్పునట్టిరామునివిషయమై ; అప్రియం=సంతోషకరంబుకాని,దుఃఖంబు గల్గించునట్టియనుట; వాక్యం=మాటను;నస్మరామి=తలంపను. సః=అట్టి; అహం(అధ్యాహృతము)=నేను ; త్వత్కృతే=నీకొఱకు;ప్రియం=సంతోషముగల్గించునట్టి;రామం=రామునిగూర్చిన;అప్రియం=దుఃఖవార్తను ; కథం=ఎట్లు;వక్ష్యామి=చెప్పఁగలను.

ప్రపంచంబునకంతయుఁ బ్రియవార్తలాడునట్టిరామునివిషయమయియప్రియంబును నేనుమనసునంగూడఁదలంపను;అట్టినేను, ప్రియుండగు రామునితో,"నీవువనంబునకుఁబొమ్ము" అని , యతిక్రూరురాలవగునీకుఁగా, నెట్లుచెప్పఁగలను?అని,తాత్పర్యము.

క్షమా యస్మిన్ దమ స్త్యాగ స్సత్యం ధర్మః కృతజ్ఞతా
అప్యహింసా చ భూతానాం త మృతే కా గతి ర్మమ. ౩౩

టీక॥యస్మిన్=ఎవ్వనియందు; క్షమా=ఓర్పును; దమః= ఇంద్రియనిగ్రహంబును; త్యాగః= ఈవియును; సత్యం=సత్యంబును;ధర్మః=ధర్మమును; కృతజ్ఞతా=తనకితరులుకొంచెముపకారముచేసినను దానినధికముగానె

ఉంగుటయును; భూతానాంచ=ప్రాణులకును; అహింసాపి=హింససేయకుండుటయు; సంతి (అధ్యాహృతము)=ఉన్నవో; తమ్ృతే = అట్టిరాముని విడిచి; మమ=నాకు; కా=ఏమి; గతిః=గతి?

ఎవ్వనియందు, ఓర్పును, ఇంద్రియనిగ్రహంబును, ఈవియును, సత్యంబును, ధర్మంబును, కృతజ్ఞతయుఁ, బ్రాణిమాత్రంబునకు హింససేయకుండుటయు, నీగుణంబులెల్లప్పుడునువర్తించుచున్నవో, అట్టిరాముండుడక్క నాకుమ ఱేమిగతియున్నది?

అని, తాత్పర్యము.

మమ వృద్ధస్య కైకేయి గతాంతస్య తపస్వినః
దీనం లాలప్యమానస్య కారుణ్యం కర్తుమర్హసి. ౩౪

టీక॥ కైకేయి = కైకేయీ! వృద్ధస్య=ముదుసలివాఁడను; గతాంతస్య=పొందఁబడినమరణసమయముగలవాఁడను; తపస్వినః=కరుణింపఁదగినయవస్థగలవాఁడను; దీనం=భయముగల్గినట్లుగా; లాలప్యమానస్య=మాటిమాటికేడ్చుచున్నవాఁడనగు; మమ=నావిషయమయి; కారుణ్యం=దయను; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

కైకేయీ! నేనుముసలివాఁడను, అందును నేఁడో రేపో చావఁబోవువాఁడను, కరుణింపఁదగినవాఁడను, దిక్కులేకబహుభయంబున మాటిమాటికిరోదనంబు సేయుచున్నవాఁడను; నాపైదయయుంచుము.

అని, తాత్పర్యము.

పృథివ్యాం సాగరాంతాయాం యత్కించి దధిగమ్యతే
తత్సర్వం తవ దాస్యామి మాచ త్వాం మన్యు రావిశేత్. ౩౫

టీక॥ సాగరాంతాయాం=సముద్రమేతుదగాఁగల; పృథివ్యాం = భూమియందు; యత్ కించిత్ =ఎంతమాత్రము; అధిగమ్యతే = పొందఁబడుచున్నదో; తత్ =దాని; సర్వం=అంతను; తవ=నీకు; దాస్యామి=ఇచ్చెదను. మన్యుశ్చ=రామునిపైఁగోపమును; త్వాం=నిన్ను; మావిశేత్ =పొందకుండుఁగాక.

సమస్తభూమండలంబునను, ఎంతమాత్రంబు, నాకువచ్చుచున్నదో, దాని

నుతయు,నీకిచ్చెదను;రామునిపైఁగోపంబువిడువుము. అని, తాత్పర్యము.

అంజలిం కుర్మి కైకేయి పాదౌచాపి స్పృశామి తే
శరణం భవ రామస్య మాధర్మో మా మిహ స్పృశేత్. ౩౬

టీక॥ కైకేయి = కైకేయీ! అంజలిం=చేమోడ్పును; కుర్మి(కరోమి)= చేయుచున్నాను. తే = నీయొక్క; పాదౌచాపి= పాదములనుగూడ; స్పృశామి=తాఁకెదను. రామస్య = రామునకు; శరణం = రక్షకురాలవు; భవ=అగుము. అధర్మః=అధర్మము; ఇహ= ఈరామాభిషేకవిషయమందు; మాం= నన్ను; మాస్పృశేత్ = తగులకుండుఁగాక.

కైకేయీ! నాచేతులుమొగిడ్చెదను; నీపాదములనుగూడఁబట్టుకొనియెదను;నీవురామునిరక్షింపుము; రామాభిషేకవిషయమందు, నాకధర్మముగలుగకుండునట్లు, సేయుము.అని,దశరథుండుకైకేయితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి దుఃఖాభిసంతప్తం విలపంత మచేతనమ్
ఘూర్ణమానం మహారాజం శోకేన సమభిప్లుతమ్. ౩౭
పారం శోకార్ణవస్యాశు ప్రలపంతం పునఃపునః
ప్రత్యువాచాథ కైకేయీ రౌద్రా రౌద్రతరం వచః. ౩౮

టీక॥ అథ=అటుపిమ్మట; రౌద్రా= భయంకరియగు; కైకేయీ=కైకేయి; ఇతి=ఇట్లు; విలపంతం= ఏడ్చుచున్నవాఁడును; దుఃఖాభిసంతప్తం=దుఃఖముచేతఁదపింపఁజేయఁబడినవాఁడును; అచేతనం=సంజ్ఞలేనివాఁడును; ఘూర్ణమానం= పొరలుచున్నవాఁడును; శోకేన=భవిష్యద్దుఃఖముచేత;సమభిప్లుతం= ముంపఁబడినవాఁడును; పునఃపునః=మాటిమాటికి; ఆశు = శీఘ్రముగా; శోకార్ణవస్య= దుఃఖమనెడుసముద్రముయొక్క; పారం=గట్టునుగూర్చి; ప్రలపంతం= ఏడ్చుచున్నవాఁడునగు; మహారాజం=పూజ్యుఁడైనరాజగుదశరథమహారాజును; రౌద్రతరం= మిక్కిలిభయంకరంబయిన; వచః =

మాటను; ప్రత్యువాచ = బదులుచె ప్పెను.

అంతనిట్లువిలపించుచు, దుఃఖమున, మూర్ఛపోయి, నేలంబొరలుచు, రామ వివాసనంబునంగలుగంబోవు దుఃఖంబు నమునింగి, "నాదుఃఖంబుఁబోఁగొట్టు ము" అని, పలుమాఱులు, ప్రార్థించుచు న్నయాదశరథమహారాజునింజూచి, భయంకరాకారయగు కైకేయి, దయలేక భయంకరంబుగా, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

యది దత్వా వరౌ రాజన్ పునః ప్రత్యనుతప్యసే
ధార్మికత్వం కథం వీర పృథివ్యాం కథయిష్యసి. ౭౯

టీక॥వీర—పరాక్రమశాలివగు; రాజన్=దశరథమహారాజా! వరౌ=వరంబులను; దత్వా=ఇచ్చి; పునః=వెనుకను; ప్రత్యనుతప్యసేయది — అనుతాపమునుబొందుదువేని; పృథివ్యాం= భూమియందు; ధార్మికత్వం= ధర్మము నాచరించువాఁడనగుటను ; కథం=ఎట్లు; కథయిష్యసి—చెప్పుకొందువు?

పరాక్రమశాలివగు దశరథ మహారాజా! నాకువరంబులిచ్చియటువెనుక, "ఇచ్చితినే" యనియనుతాపంబునొందుదువేని, యింక, నీభూమియందు, "నేను ధార్మికుండను" అని, యెట్లు చెప్పుకొనఁగలవు. అని, తాత్పర్యము.

యదా సమేతా బహవ స్త్వయా రాజర్షయ స్సహ
కథయిష్యంతి ధర్మజ్ఞ తత్ర కిం ప్రతివక్ష్యసి. ౮౦

టీక॥ధర్మజ్ఞ=ధర్మముల నెఱింగినదశరథుఁడా! యదా=ఎప్పుడు; రాజర్షయః = రాజులునుఋషులునగు వారలు; బహవః—అనేకులు; త్వయా సహ—నీతోఁగూడ; సమేతాః=చేరిన వారలయి; కథయిష్యంతి = చెప్పుదురో; తత్ర—అప్పుడు; కిం=ఏమిటని; ప్రతివక్ష్యసి=బదులుచెప్పఁగలవు?

అనేకులగురాజర్షులు, నీతోఁజేరినప్పుడు, "నీవుమున్ను కైకేయికిరెండువరంబులిచ్చితివే; వానికిఁగానాబిడ యేమి కోరినదికినీవేమియిచ్చినావు?" అని,యడుగఁగా, నీవేమనిబదులుచెప్పెదవు.

అని, తాత్పర్యము.

యస్యాః ప్రసాదే జీవామి యాచ మా మభ్యపాలయత్
("యస్యాఃప్రయత్నే జీవామి" ఇతిమహేశ్వరతీర్థమతం)
తస్యాః కృతం మయా మిథ్యా కైకేయ్యాఇతి వక్ష్యసి. ౪౧

టీక॥ "యస్యాః = ఎవ్వతెయొక్క; ప్రసాదే = అనుగ్రహముకలుగఁగా; ప్రయత్నే (అని, మహేశ్వర తీర్థమతము) = ప్రయత్నముకలుగఁగా; జీవామి = బ్రతుకుచున్నానో; యాచ = ఎవ్వతెయు; మాం = నన్ను; అభ్యపాలయత్ = కాపాడెనో; తస్యాః = అట్టి; కైకేయ్యాః = కైకేయికి; ప్రతిజ్ఞాతం (అధ్యాహృతము) = ప్రతిజ్ఞ చేయఁబడినవి; మయా = నాచేత; మిథ్యా = దబ్బఱగా; కృతం = చేయఁబడినది." ఇతి = అని; వక్ష్యసి (కిం) = చెప్పుదువా యేమి?

"ఎవ్వతెనాయందనుగ్రహంబుంచి నేనుబ్రతుకుటకై ప్రయత్నంబుచేసి నన్నుఁగాపాడఁగానే నిప్పుడు జీవించియున్నానో, అట్టికైకేయి "కిచ్చెద" నని నేను జెప్పియుండినవరంబులను నేనివ్వలేదు; అని, వారలకు, బదులు చెప్పుదువా యేమి? అని, తాత్పర్యము.

కిల్బిషత్వం నరేంద్రాణాం కరిష్యసి నరాధిప
యో దత్వా వర మద్యైవ పున రన్యాని భాషసే. ౪౨

టీక॥ నరాధిప = మనుష్యులకుఁ బ్రభుండవయినదశరథుఁడా! యః = ఏనీవు; అద్యైవ = ఇప్పుడే; వరం = వరమును; దత్వా = ఇచ్చి; పునః = వెనుకను; అన్యాని = వేఱుమాటలను; భాషసే = పలుకుచున్నావో; సః త్వం = (అధ్యాహృతము) అట్టినీవు; నరేంద్రాణాం = రాజులకు; కిల్బిషత్వం = మాలిన్యమును; కరిష్యసి = చేసెదవు.

నరాధిపుండవగునీవిప్పుడే వరంబుల నిచ్చెదనని చెప్పి, యిప్పుడుమఱల, వేఱు వేఱుమాటలం జెప్పుచున్నావు; కావున, నీవంటిరాజుల కంతయు, నీవలన నపకీర్తికల్గును. అని, తాత్పర్యము.

శైబ్య శ్శ్యేనకపోతీయే స్వమాంసం పక్షిణే దదౌ

టీక॥ శైబ్యః = శైబ్యుండనురాజు; శ్యేనకపోతీయే = డేగకును పావురమున

కునుగలిగినవిరోధమునందు; పక్షిణే=పక్షియగుడేగకొఱకు; స్వమాంసం=తనమాంసమును; దదౌ=ఇచ్చెను.

శైబ్యుండనురాజు, డేగకును పావురంబునకునువిరోధంబుగలిగి, యందుఁ బావురముఁదన్నుశరణువేఁడఁగాఁ, దనదేహంబునందలి మాంసంబుఁగోసి, డేగకిచ్చి, పావురంబును రక్షించెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— మునుపు, ఇంద్రుండునగ్నిదేవుండును, శైబ్యుని యౌదార్యంబుఁ బరీక్షింపఁగోరి, యింద్రుండుడేగయును, అగ్నిపావురమునై, భక్షకభక్ష్య భావంబునొంది, శైబ్యునియొద్దకువచ్చిరి. అప్పుడు, పావురమైన యగ్నియభయంబుగోరి శైబ్యునియంకంబుఁజేరఁగా శైబ్యుండాపావురంబునకభయంబొసంగెను; అంత, డేగ "నాకుభక్ష్యంబుగానిదయీశ్వరునిచేవిహితంబుగానున్నది; ఇప్పుడునాకాఁకలియగుచున్నది; దానినాకిమ్ము" అనియడుగఁగా, "నేను, పావురమునీకివ్వను, దానికిబదులు మాంసంబునిచ్చెదను" అని, శైబ్యుండు చెప్పెను; అంత, నాడేగ, నీదేహమాంసమునేయిమ్ము" అనెను. అందుకు. శైబ్యుండు సంతసించితనదేహమాంసమునుగోసిడేగకిచ్చి, పావురంబునుగాపాడెను. అను, పురాణకథయిందనుసంధేయము.

అలర్క శ్చక్షుషీ దత్వా జగామ గతి ముత్తమామ్. ౪౩

టీక॥ అలర్కః=అలర్కుఁడనురాజర్షి; చక్షుషీ=కండ్లను; దత్వా=ఇచ్చి; ఉత్తమాం=ఉత్కృష్టమయిన; గతిం=ప్రాప్యస్థానమును; జగామ=పొందెను.

అలర్కుండనురాజర్షి, తన్నొకగ్రుడ్డిబ్రాహ్మణుండువరంబడుగఁగా, నిచ్చెదనని చెప్పి, యంతనాబ్రాహ్మణుండు, "నీకండ్లనునాకిమ్ము" అనియడుగఁగానే, సంతోషంబునఁ, దనకండ్లం బెటికి, యాబ్రాహ్మణునకిచ్చి, యుత్తమగతినొందెను. అని, తాత్పర్యము.

సాగర స్సమయం కృత్వా న వేలా మతివర్తతే

టీక॥సాగరః=సముద్రుఁడు; సమయం=ప్రతిజ్ఞను; కృత్వా = చేసి; వే

లాం=చెలియలికట్టను; నాతివర్తతే= అతిక్రమింపదు.

సముద్రుండు, "మునుపువసన్నుం దేవతలు "నీవుచెలియలికట్టను దాటకుము" అని ప్రార్థింపఁగా, "అలాగే" యని ప్రతిజ్ఞ చేసి, యిప్పటికిని, చెలియలికట్టను, దాటకున్నాఁడు.

అని, తాత్పర్యము.

సమయం మాస్మృతం కార్షీః పూర్వవృత్త మనుస్మరన్. ౪౪

టీక॥ త్వం(అధ్యాహృతము)= నీవు; పూర్వవృత్తం = మునుపటివారల యాచారమును; అనుస్మరన్=తలంచుచు; సమయం=ప్రతిజ్ఞను; అస్మృతం=దబ్బఱగా; మాకార్షీః=చేయకుము.

నీవునట్లుమునుపటిరాజు లాచరించినవిధమునుజ్ఞప్తికిఁదెచ్చుకొని, ప్రతిజ్ఞను, అనృతముఁజేసుకొనక, నిర్వహించుకొనుము. అని, తాత్పర్యము.

స త్వం ధర్మం పరిత్యజ్య రామం రాజ్యే భిషిచ్య చ
సహ కౌసల్యయా నిత్యం రంతు మిచ్ఛసి దుర్మతే. ౪౫

టీక॥ దుర్మతే=దుష్టబుద్ధిగల,దశరథుఁడా! సః=అట్టి; త్వం = నీవు; ధర్మం=ధర్మమును; పరిత్యజ్య=విడిచి; రామం=రాముని; రాజ్యే=దొరతనమునందు; అభిషిచ్య చ = అభిషేకించియును; కౌసల్యయాసహ=కౌసల్యతోఁగూడ; నిత్యం=ఎల్లప్పుడును; రంతుం = క్రీడించుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు.

దుష్టబుద్ధిగలదశరథుఁడా! నీవు, ధర్మంబువిడిచి, రాముని రాజ్యంబుననభిషేకించి, యెల్లప్పుడును, సుఖంబుగాఁ, గౌసల్యంగూడి, క్రీడింపుచుండఁగోరియున్నావు.

అని, తాత్పర్యము.

భవత్వ ధర్మో ధర్మోవా సత్యంవా యదివానృతమ్
య త్త్వయా సంశ్రుతం మహ్యం తస్య నాస్తి వ్యతిక్రమః. ౪౬

టీక॥ అధర్మః=అధర్మముగాఁగాని; ధర్మోవా=ధర్మముగాఁగాని; సత్యంవా=మంచిదిగాని; అనృతంయదివా=చెడ్డదిగాని; భవతు=అగుఁగా

కః;యత్=ఏది;త్వయా=నీచేత ; మహ్యం=నాకొఱకు; సంశ్రుతం= ప్రతిజ్ఞ చేయఁబడినదో; తస్య=దానికి ; వ్యతిక్రమః=వేఱుపాటు;నాస్తి=లేదు.

నేనునిన్ను "రామునడవికిఁబంపి భరతునకురాజ్యంబిమ్ము" అని, యడుగుట,ధర్మంబుగాని; యధర్మంబుగాని మంచిదిగాని చెడ్డదిగాని.నీవు,నాకు, "నీవడిగినదిచ్చెద" నని ప్రతిజ్ఞ చేసి యిచ్చియున్నావుగదా, దానికిమాత్రము తిరుగుపాటు లేదు. అని, తాత్పర్యము.

అహం హి విష మద్యైవ పీత్వా బహు తవా గ్రతః
పశ్యత స్తే మరిష్యామి రామో యద్య భిషిచ్యతే. ౪౭

టీక॥రామః=రాముఁడు;అభిషిచ్యతేయది= అభిషేకింపఁబడునేని ; అహం=నేను;అద్యైవ=ఇప్పుడు;తవ=నీయొక్క;అగ్రతః=ముందట; బహు=అధికమైన;విషం=విషమును; పీత్వా=త్రాఁగి;తే=నీవు; పశ్యతః = చూచుచుండఁగా; మరిష్యామిహి= చచ్చెదనుగదా!

రామునకుఁబట్టాభిషేకంబు సేయుదువేని, నేనిప్పుడె,నీయెదుట, నీవుచూచుచుండఁగానే,యధికముగా విషముఁద్రావి, ప్రాణంబులువిడిచెదను.

అని, తాత్పర్యము.

ఏకాహమపి పశ్యేయం యద్య హం రామమాతరమ్
అంజలిం ప్రతిగృహ్ణంతీం శ్రేయోనను మృతి ర్మమ. ౪౮

టీక॥అహం=నేను; ఏకాహమపి=ఒక్కదినమునందైనను;అంజలిం = చేమోడ్పును; ప్రతిగృహ్ణంతీం=స్వీకరించుచున్న; రామమాతరం=రామునితల్లియయిన కౌసల్యను; పశ్యేయంయది=చూడఁగలనేని; మమ=నాకు; మృతిః=చావు;శ్రేయోనను = మంచిదిగదా!

రామునితల్లియగు,కౌసల్యకు, రాముఁడురాజగుటవలన , జనులు నమస్కరించుచుండుటను,ఒక్కదినమైనను;జూచుచు, బ్రతికియుండుటకన్నను,నాకుఁజచ్చుటయే,మంచిది.

అని, తాత్పర్యము.

భరతేనాత్మనాచాహం శపే తే మనుజాధిప
యథా నాన్యేన తుష్యేయ మృతే రామవివాసనాత్. ౪౯

టీక॥ మనుజాధిప= మనుష్యులకుఁ బ్రభుండవయినదశరథుఁడా; యథా= ఎట్లు; అహం (అధ్యాహృతము)= నేను; రామవివాసనాదృతే=రాము నడవికిఁబంపుటను విడిచి; అన్యేన=మఱియొకదానిచేత; నతుష్యేయం=సంతోషింపనో; తథా(అధ్యాహృతము)= అట్లు; అహం=నేను; తే=నీకొఱకు; భరతేన=భరతునిచేతను; ఆత్మనాచ= నాప్రాణముచేతను; శపే = బాసచేసెదను.

దశరథమహారాజా! రామునడవికిఁ బంపుటదక్క మఱేమిచేసినను, నాకు సంతోషంబు గలుగదని, భరతుండును నాప్రాణంబును సాక్షిగాఁ బ్రమాణము సేయుచున్నాను. అని, కైకేయి, దశరథునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతావ దుక్త్వా వచనం కైకేయీ విరరామ హ

టీక॥ కైకేయీ! కైకేయి; ఏతావత్ =ఇంతవఱకు; వచనం= మాటను; ఉక్త్వా=చెప్పి; విరరామ=ఊరకుండెను “హ” అనునది పాదపూరణార్థము.

కైకేయి, దశరథునితో, నింతవఱకు, మాటలు చెప్పి, యంత, నూరకుండెను.

అని, తాత్పర్యము.

విలపంతం చ రాజానం నప్రతివ్యాజహార సా. ౫౦

టీక॥ సా=ఆకైకేయి; విలపంతం= ఏడ్చుచున్న; రాజానంచ=దశరథమహారాజునుగూర్చి; నప్రతివ్యాజహార=బదులు చెప్పలేదు.

ఆకైకేయి, దశరథమహారాజెంత విలపించుచుండినను, అందుకు , బదులే చెప్పినదికాదు.

అని, తాత్పర్యము.

శ్రుత్వాతు రాజా కైకేయ్యా వృతం పరమశోభనమ్

రామస్య చ వనే వాస మైశ్వర్యం భరతస్యచ. ౪౧
నాభ్యభాషత కైకేయీం ముహూర్తం వ్యాకులేంద్రియః

టీక॥ రాజా=దశరథమహారాజు; కైకేయ్యా=కైకేయిచేత; వృతం=కోరఁబడినదియు; పరం=మిక్కిలియును; అశోభనం=అమంగళమునగు; రామస్య=రామునకు; వనే=అడవియందు; వాసంచ=ఉనికిని; భరతస్య=భరతునకు; ఐశ్వర్యంచ=ప్రభుత్వమును; శ్రుత్వాతు = వినినంతనే; వ్యాకులేంద్రియః= కలఁతపడినయింద్రియములుగలవాఁడై; ముహూర్తం=కొంచెముసేపు; కైకేయీం = కైకేయినిగూర్చి; నాభ్యభాషత=పలుకలేదు.

దశరథమహారాజు, కైకేయికోరిన, యమంగళకరమయిన, రాముండడవినుండుటయు, భరతుండు ప్రభుత్వంబునొందుటయును విని, దుఃఖంబున నింద్రియంబులస్వాధీనత దప్పి, కొంచెముసేపు, కైకేయితో నేమియుం బలుకక యూరకుండెను.

అని, తాత్పర్యము.

ప్రైక్షతా నిమిషో దేవీం ప్రియా మప్రియవాదినీమ్. ౪౨

టీక॥ సః(అధ్యాహృతము)= ఆదశరథుఁడు; అనిమిషః = తెప్పపాటులేనివాఁడై, ప్రియాం=ఇష్టురాలును; అప్రియవాదినీం=ఇష్టముకానిమాటను జెప్పునదియునగు; దేవీం = రాణియగు కైకేయిని; ప్రైక్షత=చూచెను.

ఆదశరథుం, డట్లేమియుంబలుకక, తెప్పపాటులేక, యప్రియంబులు వలుకుచుండు తనప్రియభార్యయగు కైకేయిం, గోపంబునఁ, జూచుచుండెను.

అని, తాత్పర్యము.

తాం హి వజ్రసమాం వాచ మాకర్ణ్య హృదయాప్రియామ్
దుఃఖశోకమయీం ఘోరాం రాజా న సుఖితో భవత్. ౪౩

టీక॥ వజ్రసమాం =వజ్రముతోసమానమయినదియును; హృదయాప్రియాం=మనసునకిష్టముగానిదియును; దుఃఖశోకమయీం= భరతునకురాజ్యంబిమ్మ

నుటవలనంగలిగినదుఃఖమును రామునడవికిఁబంపుమనుటవలనఁగలిగిన శోకంబును ప్రచురముగాఁగలదియును; ఘోరాం = భయంకరమయినదియునగు; తాం=ఆ; వచనం = మాటను; ఆకర్ణ్య=విని; రాజా = దశరథమహారాజు; సుఖితః=సుఖంబుగలవాఁడు; నాభవత్ =కాలేదు.

దశరథమహారాజు, వజ్రమునుంబోలెఁగఠినంబై, మనసునకప్రియంబై, భరతునకు రాజ్యంబిమ్మనుటవలనను రామునడవికిఁబంపుమనుటవలనను గలిగిన రెండువిధంబులగుదుఃఖమునుగల్గించుచు భయంకరంబైయున్న, కైకేయిచెప్పినయా మాటవిని, యెంతమాత్రంబును, సుఖంబునొందఁడయ్యె. అని, తాత్పర్యము.

స దేవ్యా వ్యవసాయం చ ఘోరం చ శపథం కృతమ్
ధ్యాత్వా రామేతి నిశ్శ్వస్య ఛిన్న స్తరురివా పతత్. ౫౪

టీక॥ సః=ఆదశరథుఁడు; దేవ్యాః= భార్యయయినకైకేయియొక్క; ఘోరం=భయంకరంబయిన; వ్యవసాయం చ=నిశ్చయంబును; కృతం=చేయఁబడిన; శపథంచ=ప్రతిజ్ఞను; ధ్యాత్వా=తలంచి; రామ=రామా! ఇతి=అని; నిశ్శ్వస్య=నిట్టూర్పువిడిచి; ఛిన్నః=నఱుకఁబడిన; తరురివ= వృక్షమువలె; అపతత్ =పడెను.

ఆదశరథుండు, భయంకరంబగు కైకేయినిశ్చయంబును, దానుజేసినప్రతిజ్ఞను దలంచుకొని, నఱుకఁబడినవృక్షముంబోలె, నేలఁబడెను.

అని, తాత్పర్యము.

నష్టచిత్తో యథోన్మత్తో విపరీతో యథాతురః
హృతతేజా యథా సర్పో బభూవ జగతీపతిః. ౫౫

టీక॥ జగతీపతిః=భూమికిఁబ్రభువైనదశరథుండు; నష్టచిత్తోయథా= నశించినమనసుగలవాఁడువలెను; ఉన్మత్తో (యథా)= పిచ్చిపట్టినవాఁడువలెను; విపరీతో(యథా)= సన్నిపాతాదులచేభేదించిన ప్రకృతిగలవాఁడువలెను; ఆతురోయథా= వ్యాధిగలవాఁడువలెను; హృతతేజాః=మంత్రముచేఁబోఁగొట్టఁబడిన వీర్యముగల; సర్పోయథా=సర్పమువలెను; బభూవ=ఉం

డెను.

అప్పుడు, దశరథమహారాజు, మన సే నశించినవానివలెను, పిచ్చిపట్టినవా నిభంగి, సన్నిపాతముచే భేదించిన ప్రకృతిగలవానికైవడి, వ్యాధితునియట్లు, మంత్రబలంబునంజేసి నిర్వీర్యంబయిన సర్పంబుంబోలెఁ, బొరఁబట్టుచుండెను.

అని, తాత్పర్యము.

దీనయా తు గిరా రాజా ఇతిహోవాచ కైకేయీమ్

టీక॥ రాజా=దశరథమహారాజు; కైకయీం= కైకేయినిఁగూర్చి; దీనయా=దుఃఖముతోఁగూడిన; గిరాతు= మాటచేతనే; ఇతి=ఇట్లని(“హ” అనునది పాదపూరణార్థము); ఉవాచ=పలికెను.

దశరథమహారాజు, కైకేయింజూచి, చాలదుఃఖంబుతో, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అనర్థ మిమ మర్థాభం కేన త్వ ముపదర్శితా. ౫౮

టీక॥ కేన=ఎవ్వనిచేత; త్వం=నీవు; అర్థాభం=ఉపాయమువలెనున్న; ఇమం=ఈ; అనర్థం=అపాయమును; ఉపదర్శితా=బోధింపఁబడినావు?

నీకెవ్వండు, మంచిదివలెనగపడు నీయనర్థంబునుబోధించినాఁడు?

అని, తాత్పర్యము.

భూతోపహతచిత్తేవ బ్రువంతీ మాం నలజ్జసే

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; భూతోపహతచిత్తేవ= పిశాచముచేఁ గొట్టఁబడిన మనసుగలదివలె; మాం= నన్నుగూర్చి; బ్రువంతీ=మాటలాడుచు; నలజ్జసే=సిగ్గుపడవు.

నీవు, పిశాచముపట్టినదానియట్లు, నిర్భయంబుగా, నిట్లు, నాయెదుటనుండి, నాతోఁమాటలాడుచున్నావు; నీకుఁ గొంచెమైనను సిగ్గులేదు.

అని, తాత్పర్యము.

శీలవ్యసన మే తత్తే నాభిజానా మ్యహం పురా. ౫౯

బాలాయా స్తత్త్విదానీం తే లక్షయే విపరీతవత్

టీక॥పురా=మున్ను; బాలాయాః=చిన్నదానవుగానున్న ; తే=నీకు; ఏతత్ =ఇట్టి;శీలవ్యసనం=సద్వృత్తి భ్రంశమును;అహం=నేను ; నాభిజానామి=ఎఱుంగను-తే=నీకు ; ఇదానీం=ఇప్పుడు;తత్తు=దానినే; విపరీతవత్=భేదించినట్లు;లక్షయే= తెలిసికొనుచున్నాను.

మనువునీవుచిన్నదానవుగా నున్నప్పుడు,నీకిట్టిదుస్స్వభావంబుండలేదు ; ఇప్పుడేమో,నీకిట్టిదుర్వృత్తులుగల్గియున్నది. అని, తాత్పర్యము.

కుతో వా తే భయం జాతం యా త్వ మేవంవిధం వరమ్ ౫౮
రాష్ట్రే భరత మాసీనం వృణీషే రాఘవం వనే

టీక॥యా=ఏ;త్వం= నీవు ; భరతం=భరతుని; రాష్ట్రే=రాజ్యమునందు;ఆసీనం = కూర్చుండిన వానిగాను; రాఘవం=రాముని;వనే = అడవియందు;ఆసీనం (అధ్యాహృతము) =కూర్చున్నవానిగాను;ఏవంవిధం= ఇట్టి;వరం=వరమును;వృణీషే=కోరుచున్నావో;తస్యై (అధ్యాహృతము)=అట్టి; తే=నీకు;కుతోవా=దేనివలన; భయం=వెఱపు;జాతం=గలిగినది,

"భరతునకు రాజ్యం బివ్వవలయును;రాముఁ వనంబున కంపుము " అని యిట్టికఠినంబయినవరంబడుగుచున్నావే;నీకు దేనివలననింతభయంబుగల్గినది? అని, తాత్పర్యము.

విరమై తేన భావేన త్వ మేతేనా నృతేన వా. ౫౯
యది భర్తుః ప్రియం కార్యం లోకస్య భరతస్యచ

టీక॥భర్తుః=పెనిమిటిచగు నాకును;లోకస్య=ప్రపంచమునకును; భరతస్యచ=భరతునకును; ప్రియం= సంతోషము; కార్యంయది=చేయఁదగినదగునేని; ఏతేన=ఈ;భావేన= భరతునకు రాజ్యంబుకావలయునను నభిప్రాయంబుచేతగాని;అనృతేన=పాపముగలిగించునట్టి;ఏతేనవా=రామునడవికిఁ బంపవలయు నన్ననీయభిప్రాయంబు చేతఁగాని;విరమ=ప్రవర్తింపవలదు.

భర్తఁనగునాకును బ్రపంచమునకు నుభరతునకును బ్రియంబు సేయఁగోరుదువేని,భరతునకు రాజ్యంబుగావలెనను నభిప్రాయంబునుగాని, పాపజనకంబగు

రామునడవికిఁ బంపవలెనను నభిప్రాయంబునుగాని, యీ రెంటిని, వదలుము.

అని, తాత్పర్యము.

నృశంసే పాప సంకల్పే క్షుద్రే దుష్కృత కారిణి. ౬౦
కిన్ను దుఃఖ మలీకం వా మయి రామేచ పశ్యసి

టీక॥నృశంసే — దయలేనిదానా! పాపసంకల్పే=పాపము సేయవలెనను సంకల్పముగలదానా! క్షుద్రే= కుటిలురాలా! దుష్కృతకారిణి=పాపములు సేయుదానా! మయి = నాయందును; రామేచ=రామునియందును; కిన్ను=ఏమిటిని; దుఃఖం = దుఃఖముగల్గించుదానిఁగాని; అలీకంవా=అపరాధమునుగానిః పశ్యసి=చూచుచున్నావు?

దయలేనిదానా! పాపము సేయవలెనను కోరిక గలదానా! కుటిలబుద్ధిగలదానా! పాపిష్ఠురాలా! నావలననురామునివలనను నీకేమిదుఃఖమువచ్చునని తలంచినావు? రాముండును నేనునునీకేమియపరాధంబుగావించినాము?

అని, తాత్పర్యము.

న కథంచి ద్ఋతే రామా ద్భరతో రాజ్య మావసేత్. ౬౧
రామా దపి హి తం మన్యే ధర్మతో బలవత్తరమ్

టీక॥భరతః = భరతుఁడు; రామా దృతే=రామునివిడిచి; కథంచిత్ =ఎట్లయినను; రాజ్యం=దొరతనంబును; నావసేత్ =పొందఁడు. తం=ఆభరతుఁడు; రామాదపి=రామునికన్న; ధర్మతః= ధర్మముచే; బలవత్తరం=మిక్కిలియు బలవంతునిఁగా, మిక్కిలి ధార్మికునిఁగాననుట; మన్యేహి=తలంచుచున్నానుగదా!

భరతుండు, రామునికన్న నెచ్చుగా ధార్మికుండు; కావున, నీవేమి చేసినను, అతండు రామునివిడిచి, రాజ్యంబునంగీకరింపఁడు. అని, తాత్పర్యము.

కథం ద్రక్ష్యామి రామస్య వనం గచ్ఛేతి భాషితే. ౬౨
ముఖవర్ణం వివర్ణం తం యథైవేందు ముపప్లుతమ్

టీక॥"వనం=అడవిని; గచ్ఛ=పొందుము." ఇతి=అని; భాషితే=పలుకంబడఁగా; వివర్ణం=విపరీతవర్ణముగలదియును; ఉపప్లుతం=రాహువుచే గ్రసింపఁబడిన; తం=ఆ ; ఇందుం యథైవ (స్థితం)= చంద్రుండుం బోలెనుండునట్టి; రామస్య=రామునియొక్క; ముఖవర్ణం=మొగముయొక్కరంగును, ముఖముననుట; కథం=ఎట్లు=; ద్రక్ష్యామి=చూడఁగలను?

"నీవడవికిఁబొ"మ్మని నేను జెప్పఁగానే, వెలవెలంబాఱి రాహుగ్రస్తుండగు చంద్రుంబోలియుండు, రామునిముఖంబును, నేనెట్లుచూడంగలను. అని, తాత్పర్యము.

తాం హి మే సుకృతాం బుద్ధిం సుహృద్భి స్సహ నిశ్చితామ్. ౬౩
కథం ద్రక్ష్యా మ్యపావృత్తాం పరై రివ హతాం చమూమ్

టీ॥సుకృతాం=చక్కఁగాఁజేయఁబడినదియును; సుహృద్భిస్సహ=స్నేహితులతోఁగూడ; నిశ్చితాం=నిశ్చయింపఁబడినదియునగు; తాం=ఆ;("హి" అనునది పాదపూరణార్థము) మే=నాయొక్క; బుద్ధిం=అభిప్రాయమును; అపావృత్తాం=త్రిప్పఁబడిన దానిఁగా; పరైః=శత్రువులచేత; హతాం=కొట్టఁబడిన; చమూమివ=సేననువలె; కథం=ఎట్లు; ద్రక్ష్యామి=చూడఁగలను?

స్నేహితులును మంత్రులును జేరి చక్కఁగానాలోచించి నిశ్చయించిన రామాభిషేకముసేయవలయుననునా యభిప్రాయంబు, ఇప్పుడు, తలక్రిందగుచుండఁగా, శత్రువులచేఁ దనసేన కొట్టఁబడుచుండఁగాఁ, జూచుచుండునట్లు, నేనెట్లుచూచుచుండఁగలను? అని, తాత్పర్యము.

కిం మాం వక్ష్యంతి రాజానో నానాదిగ్భ్య స్సమాగతాః. ౬౪

టీక॥నానాదిగ్భ్యః=పలుదిక్కులనుండి; సమాగతాః=వచ్చిన; రాజానః=రాజులు; మాం=నన్నుఁగూర్చి; కిం=ఏమి ; వక్ష్యంతి=చెప్పుదురు?

రామాభిషేకమునకై పలు దిక్కులనుండి నాచేరావింపఁబడియుండు రాజులు, నన్నుఁబూచి, యేమిచెప్పుదురు? అని, తాత్పర్యము.

బాలో బతాయ మైక్ష్వాక శ్చిరం రాజ్య మకారయత్

టీక॥బాలః=పిన్నవాఁడగు ; అయం=ఈ; ఐక్ష్వాకః= ఇక్ష్వాకువంశమునందుఁబుట్టిన రాముండు; చిరం=బహుకాలము; రాజ్యం=దొరతనమును; అకారయత్(అకరోత్)= చేసెను. ఇతివక్ష్యంతిహి ( అధ్యాహృతము)=అనిచెప్పుదురుగదా! బత= అయ్యో!

"ఇక్ష్వాకువంశంబునఁ బుట్టిన బాలుండగు నీరాముండు బహుకాలంబు రాజ్యమును బాలింపుచుండెనే" యని పరిహసింతురుగదా! అని, తాత్పర్యము.

లేక;బాలః=మూఢుండగు ; అయం=ఈ;ఐక్ష్వాకః=దశరథుఁడు; శేషముసమానము!

"ఈదశరథుఁడు, తెలివిలేనివాఁడు; దైవవశంబుననేమోబహుకాలంబురాజ్యంబుచేసినాఁడు" అని,నన్నుఁబరిహసింతురుగదా!అని, తాత్పర్యము.

యదాతు బహవో వృద్ధా గుణవంతో బహుశ్రుతాః. ౬౫
పరి ప్రక్ష్యంతి కాకుత్థ్సం వక్ష్యామి కి మహం తదా

టీక॥యదాతు=ఎప్పుడు; గుణవంతః=గుణములుగలవారలును;వృద్ధాః=ముసలివాండ్రును;బహుశ్రుతాః=అధికమయిన విద్యగలవారలునగు; బహవః=అనేకులు; కాకుత్థ్సం=రాముని; పరిప్రక్ష్యంతి=అడుగుదురో;తదా=అప్పుడు;అహం=నేను;కిం=ఏమి; వక్ష్యామి=చెప్పెదను?

ఇంక, వృద్ధులునుగుణవంతులునువిద్యావంతులునగు వారలనేకులువచ్చి, "రాముండెక్కడ?" అని, నన్నడుగఁగా, నేనేమివారలకుఁజెప్పఁగలను? అని, తాత్పర్యము.

కైకేయ్యా క్లిశ్య మానేన రామః ప్రవ్రాజితో మయా. ౬౬
యది సత్యం బ్రవీ మ్యేత త్త ద సత్యం భవిష్యతి

టీక ॥ "కైకేయ్యా=కైకేయిచేత; క్లిశ్యమానేన=పీడింపఁబడుచున్న; మ

యా=నా చేత; రామః = రాముండు; ప్రవ్రాజితః=అడవికిఁబంపబడినాఁడు" సత్యం=దబ్బుఅకాని;ఏతత్=దీనిని;బ్రవీమియది=చెప్పుదు నేని;తత్=అది, ఇంతకుమునుపు సభయందు రామునకుఁ బట్టాభిషేకము చేసెదనని చేసిన ప్రతిజ్ఞ;అసత్యం=దబ్బుఅ;భవిష్యతి=కాఁగలదు.

"నేను మున్ను కైకేయికి రెండువరంబు లిచ్చియుంటిని;ఆ రెంటికిని గా, భరతునకభిషేకముసేయుట, రాము నడవికిఁ బంపుట, ఈ రెంటిని, జేయవలయునని' యిప్పుడు, కైకేయి నన్నుఁబీడింపఁగా, రామునడవికిఁబంపినాను" అని, సత్యంబుగా నడిచిన సంగతిని జెప్పుదు నేని, యింతకు మున్ను వసిష్ఠ వామదేవాదిమహర్షులయెదుట సభలో "రామునకు రేపు పట్టాభిషేకము చేసెదను" అని, నేను జేసిన ప్రతిజ్ఞ యసత్యంబగును.

అని, తాత్పర్యము.

కిం మాం వక్ష్యతి కౌసల్యా రాఘవే వన మాస్థితే. ౬౭

టీక॥ రాఘవే=రాముండు; వనం=అడవిని; ఆస్థితే= పొందఁగా; కౌసల్యా=కౌసల్య;మాం=నన్నుఁగూర్చి; కిం=ఏమి;వక్ష్యతి=చెప్పఁగలదు?

నేను రామునడవికిఁబంపఁగా నే, కౌసల్య నన్నుఁజూచి, యేమి చెప్పును?

అని, తాత్పర్యము.

కిం చైనాం ప్రతివక్ష్యామి కృత్వాచా ప్రియ మీదృశమ్

టీక॥ ఈదృశం=ఇట్టి; విప్రియం=కీడును;కృత్వాచ=చేసియును; ఏనాం=ఈకౌసల్యనుగూర్చి;కిం=ఏమి; ప్రతివక్ష్యామి=బదులుచెప్పెదను?

కౌసల్యకిట్టియపకారము చేసి, నేను దానికేమని చెప్పుదును?

అని, తాత్పర్యము.

యదా యదాహి కౌసల్యా దాసీవచ్చ సఖీవచ. ౬౮
భార్యావ ద్భగినీవచ్చ మాతృవ చ్చోపతిష్ఠతి
సతతం ప్రియకామా మే ప్రియపుత్రా ప్రియంవదా. ౬౯
న మయా సత్కృతా దేవి సత్కారార్హా కృతేతవ

టీక॥దేవి = రాణివగు కైకేయీ! మే=నాకు;సతతం=ఎల్లప్పుడు;ప్రియత మా= సంతోషమునుగోరునదియును; ప్రియపుత్రా=ప్రియుఁడైనకొడుకు గలదియు;ప్రియంవదా=సంతోషముగలిగించు మాటలం జెప్పునదియును; సత్కారార్హా= బహుమానంబునకుఁదగినదియునగు; కౌసల్యా=కౌసల్య; యదాయదా= ఎప్పుడెప్పుడు;దాసీవచ్చ=పనికత్తెవలెను;సఖీవచ్చ=చెలికత్తెవలెను; భార్యావత్=పెండ్లామువలెను; భగినీవచ్చ=తోడఁబుట్టినదివలెను; మాతృవచ్చ=తల్లివలెను;ఉపతిష్ఠతి=ఉపచరించుచున్నదో;తదాతదా(అధ్యాహృతము)=అప్పుడప్పుడు;మయా=నాచేత; తవకృతే= నీకుఁగా; నసత్కృతా=సత్కరింపఁబడలేదు.

రాణివగు కైకేయీ! ఎల్లప్పుడును నాకుఁబ్రియంబుగోరుచుఁ బుత్రుండగు రామునియందును జాలఁబ్రీతిగలిగి ప్రియవాక్యములుమాత్రమె వలుకుచు, నావలనసత్కారంబునొందుటకుందగి, నాకుదాసియుంబోలెఁబరిచర్యసేయుచుఁ జెలికత్తెయుంబోలెద్యూతాది వినోదంబులు నెఱపుచు , భార్యయుంబోలెధర్మకార్యంబులఁదోడ్పడుచు , భగినియుంబోలె నేను మఱియొక భార్యనువివాహంబాడునప్పుడు,ఉపలాలనంబు సేయుచుఁ, దల్లియుంబోలెఁబోషణంబు గావింపుచు, నన్ను సేవింపుచున్నకౌసల్యకు, నీకుఁగోపంబు వచ్చునని నీకుఁగానే, నేనెంతమాత్రంబును సత్కారంబుగావింపనైతిని.

అని, తాత్పర్యము.

ఇదానీం త త్తపతి మాం య న్మయా సుకృతం త్వయి। ౭౦
అపథ్యవ్యంజనోపేతం భు క్త మన్న మివా తురమ్

టీక॥మయా=నాచేత;యత్=ఏది; త్వయి=నీయందు; సుకృతం=ఉపకారముచేయఁబడినదో;తత్ = అది;ఇదానీం=ఇప్పుడు;మాం=నన్ను; భుక్తం=భుజింపఁ బడిన ; అపథ్యవ్యంజనోపేతం= పథ్యముగానికూరలతోఁగూడిన; అన్నం=అన్నము; ఆతురమివ=వ్యాధిగలవానివలె; తపతి= తపించునట్లుసేయుచున్నది.

నేనుమునుపు, నీకుఁజేసిన మేలంతయు,నిప్పుడునీ, దుర్గుణంబులగపడఁగానే, వ్యాధిగలవాఁడపథ్యాన్నము దినఁ

గా, నది, వెనుకనతనిబాధించునట్లు, నన్నుబాధించుచున్నది. అని, తాత్పర్యము.

విప్రకారంచ రామస్య సంప్రయాణం వనస్యచ. ౭౧
సుమిత్రా ప్రేక్ష్య వై భీతా కథం మే విశ్వసిష్యతి

టీక॥ రామస్య=రామునివిషయమైన; విప్రకారంచ =తిరుగుపాటును; వనస్య—అడవియొక్క, అడవినిగూర్చియనుట; సంప్రయాణంచ = పోవుటను; ప్రేక్ష్య=చూచి("వై" అనునదిపాదపూరణార్థము); సుమిత్రా = సుమిత్ర; భీతా=భయపడినదై; కథం=ఎట్లు; మే=(ద్వితీయార్థమందుఁజతుర్థి) — నన్ను; విశ్వసిష్యతి=నమ్మును!

నేనట్టిప్రియపుత్రుండగురామునకై నిర్ణయింపఁబడిన యభిషేకమునునిలిపి, మఱి, రామునడవికిఁబంపుటంజూచి, సుమిత్ర, "ఈదశరథుండతిక్రూరుండవ్యవస్థితచిత్తుండు, అట్టిరాము నేయిట్లుచేసినాఁడే; నాకొడుకునేమిసేయునో". యనిభయపడి, నన్నెంతమాత్రంబునున మ్మఁజాలదు.

అని, తాత్పర్యము.

కృపణం బత వైదేహీ శ్రోష్యతి ద్వయ మప్రియమ్. ౭౨
మాం చ పంచత్వ మాపన్నం రామం చ వన మాశ్రితమ్

టీక॥ వైదేహీ=సీత ; మాం=నన్ను; పంచత్వం—చావును; ఆపన్నంచ=పొందినవానిఁగాను; రామం=రాముని; వనం—అడవిని; ఆశ్రితంచ—పొందినవానిఁగాను; అప్రియం—దుఃఖకరంబగు; ద్వయం= రెంటిని; కృపణం = దైన్యముగల్గునట్లుగా; శ్రోష్యతి=వినఁగలదు. బత—అయ్యో!

సీత, యేకకాలంబుననె, నేనుజచ్చుట రాముండడవికిఁబోవుట, యీరెండప్రియంబులును, బహుదుఃఖంబున , వినంగలదు; ఇది, నాకుఁజాలదుఃఖముగా నున్నది. అని, తాత్పర్యము.

వైదేహీ బత మే ప్రాణాన్ శోచంతీ క్షపయిష్యతి. ౭౩
హీనా హిమవతః పార్శ్వే కిన్నరేణేవ కిన్నరీ

టీక॥బత=దుఃఖము! వైదేహీ—సీత; మే=నాకొఱకు ; హిమవతః=హిమ

వత్పర్వతముయొక్క; పార్శ్వే = ప్రక్కయందు; కిన్నరేణ=కిన్నరునిచేత; హీనా=విడువఁబడిన ; కిన్నరీవ=కిన్నరస్త్రీవలె; శోచంతీ = దుఃఖించుచు; ప్రాణాన్=ప్రాణంబులను;త్యక్ష్యతి=విడువఁగలదు.

అయ్యో! హిమవత్పర్వతసమీపంబునఁ గిన్నరునిం బాసిన కిన్నరియుంబోలె, సీత, నానిమిత్తమై దుఃఖించుచుఁ, బ్రాణంబులను,విడుచును.

అని, తాత్పర్యము.

నహి రామ మహం దృష్ట్వా ప్రవసంతం మహావనే. ౨౪
చిరం జీవితు మాశంసే రుదంతీం చాపి మైథిలీమ్

టీక॥అహం=నేను;మహావనే=గొప్పయడవియందు; ప్రవసంతం=ఉన్న; రామం=రాముని; రుదంతీం=ఏడ్చుచున్న;మైథిలీంచాపి= సీతను; దృష్ట్వా=చూచి;చిరం=బహుకాలము;జీవితుం=బ్రతుకుటకు;నాశంసేహి= కోరనుగదా!

రాముండడవినుండుటను , సీతయచ్చట రోదనంబు సేయుచుండుటనుం, జూచుచు, నేను,బహుకాలంబు జీవింపనొల్లను. అని, తాత్పర్యము.

సా నూనం విధవా రాజ్యం సపుత్రా కారయిష్యసి. ౨౫

టీక॥సా=అట్టి;త్వం(అధ్యాహృతము)=నీవు;విధవా= ముండమోపివై; సపుత్రా = కొడుకుతోఁగూడినదానవై; రాజ్యం=దొరతనమును; కారయిష్యసి=చేయఁగలవు.

నీవు, నేనుజచ్చిపోయినవెనుక,ముండమోపివై,నీకొడుకుభరతుంగూడి, రాజ్యంబుసేయుదువు.అని, తాత్పర్యము.

నహి ప్రవ్రాజితే రామే దేవి జీవితు ముత్సహే

టీక॥దేవి = రాణివగుకైకేయీ! రామే=రాముఁడు;ప్రవ్రాజితే=అడవికిఁబోవునట్లుచేయఁబడఁగా;జీవితుం=బ్రతుకుటకు;నోత్సహేహి= కోరనుగదా!

రాణివగుకైకేయీ! రాముండడవి

కిఁబోఁగాఁనే, నేను నిమిషంబయినను జీవింపనొల్లను. అని, తాత్పర్యము.

సతీం త్వా మహ మత్యంతం వ్యవస్యామ్య సతీం సతీమ్. ౭౬
రూపిణీం విషసంయుక్తాం పీత్వేవ మదిరాం నరః

టీక॥ రూపిణీం=మంచిరూపముగల దానవును; సతీం=మంచి దానవు గాను; త్వాం=నిన్ను; అసతీం=దుష్టురాలుగానున్న దానిఁగా; నరః=మనుష్యుఁడు; రూపిణీం (అధ్యాహృతము)=మంచిరూపముగలదియును; విషసంయుక్తాం=విషముతోఁగూడినదియునగు; మందిరాం=సారాయిని; పీత్వేవ=త్రాఁగినవలె; వ్యవస్యామి=నిశ్చయించుచున్నాను.

నీవు మంచిరూపంబుగలిగి పైకిమిగుల యోగ్యురాలవులాగున నగపడుచుంటివి; పైకిఁజూచుటకు రమ్యంబై విషంబు గలిపియుండు సారాయింద్రాగినవెను కఁబురుషుండు దానియందున్న దోషంబెఱుంగునట్లు, నీయందున్న దోషంబిప్పటి కనుభవంబునఁ దెలిసికొంటిని.

అని, తాత్పర్యము.

అనృతై ర్బహుమాం సాంత్వై స్సాంత్వయంతీస్మ భాషసే. ౭౭
గీతశబ్దేన సంరుధ్య లుబ్ధో మృగ మివా వధీః

టీక॥ త్వం=నీవు; అనృతైః=దబ్బఱలయిన; సాంత్వైః=మంచిమాటలచేత; మాం=నన్ను; సాంత్వయంతీ=ఊఱడింపుచు; భాషసేస్మ=మాటలాడుచుంటివి. అద్య (అధ్యాహృతము)=యిప్పుడు; గీతశబ్దేన=గానధ్వనిచేత; సంరుధ్య=అడ్డగించి; మృగం=జింకను; లుబ్ధ ఇవ=బోయవాఁడువలె; మాం (అధ్యాహృతము)=నన్ను; అవధీః=చంపినావు.

నీవు, ఇదివఱకు, కపటంబుగా నన్ను సాంత్వవచనంబులననునయించుచుంటివి; ఇప్పుడు, బోయవాఁడు గానధ్వనిచే జింకను స్వాధీనపఱచుకొనిచంపునట్లు, నన్నుఁ జంపినావు. అని, తాత్పర్యము.

అనార్య ఇతి మా మార్యాః పుత్రవిక్రాయికం ధ్రువమ్. ౭౮
ధిక్కరిష్యంతి రథ్యాసు సురాపం బ్రాహ్మణం యథా

టీక॥ఆర్యాః=పెద్దలు; పుత్రవిక్రాయికం = కొడుకును విక్రయించినట్టి; మాం=నన్ను; రథ్యాసు=రాజవీధులందు; అనార్యః=దుష్టుండు; ఇతి = అని; సురాపం=సారయి ద్రాఁగునట్టి; బ్రాహ్మణంయథా= బ్రాహ్మణునింబోలె; ధిక్కరిష్యంతి=తిరస్కరింతురు.

(శ్రీ)సుఖంబునకై కొడుకునడవికిఁబంపిననన్నుఁజూచి, రాజవీధులందుఁ, బెద్దలందఱు, దుష్టుండని, మద్యపానంబుసేయుబ్రాహ్మణునింబోలె, దూషింతురు. అని, తాత్పర్యము.

అహో దుఃఖ మహో కృచ్ఛ్రం యత్ర వాచః క్షమే తవ. ౭౯
దుఃఖ మేవం విధం ప్రాప్తం పురాకృత మివాశుభమ్

టీక॥అహో=ఆశ్చర్యకరమయిన; దుఃఖం=దుఃఖము! అహో=ఆశ్చర్యకరమయిన; కృచ్ఛ్రం=కృష్టము! యత్ర=ఏవిషయమయి; తవ= నీయొక్క; వాచః=మాటలను; క్షమే=ఓర్చుఁకొనుచున్నానో; తత్=ఆ; ఏవంవిధం=ఈవిధమయిన; దుఃఖం=దుఃఖము; పురాకృతం=పూర్వజన్మమందుఁ జేయఁబడిన; అశుభమివ = అమంగళకార్యమువలె; ప్రాప్తం=పొందఁబడినది.

ఆహా! ఇదియేమిదుఃఖము! ఇదియేమికష్టము! ఇట్టిదినేనెప్పుడు ననుభవింపలేదు; దీనివిషయమైయిప్పుడునీవుచెప్పు, "రాముననడవికిఁబంపు" మనుకఠిన వచనంబును గూడసహించియున్నాను; ఇది, పూర్వజన్మమునందుఁజేసిన పాపంబుల ఫలంబుంబోలె, నెంతమాత్రంబును, ప్రతీకారంబులేక, నాకు, సంభవించినది. అని, తాత్పర్యము.

చిరం ఖలు మయా పాపే త్వం పాపేనాభిరక్షితా. ౮౦
అజ్ఞానా దుపసంపన్నా రజ్జు రుద్బంధినీ యథా

టీక॥పాపే= పాపిష్ఠురాలవగుకైకేయీ! పాపేన=పాపిష్ఠుండనైన; మయా=నాచేత; త్వం=నీవు; అజ్ఞానాత్ =తెలివిలేకుండుటవలన; ఉపసంపన్నా=సమీపమునందుఁ దగులుకొన్న, కంఠమునందుదగులుకొన్నయనుట; ఉద్బంధినీ= ఉరివేసికొనుటకు సాధనమైన; రజ్జుర్యథా=త్రాడువలె; చిరం=

బహుకాలము;అభిరక్షితాఖలు = కాపాడఁబడినావుగదా!

పాపిష్ఠురాలవగుకైకేయీ! నేనజ్ఞానంబున,నిన్ను, మెడకుందగులుకొనియున్నయురివేసికొనుద్రాటినింబోలె, బహుకాలంబుకాపాడితిని; అతాండ్లు, ఆమనుష్యునింజంపునో, అట్లునీవు నునన్నుఁజంపంజూచితివి.

అని, తాత్పర్యము.

రమమాణ స్త్వయా సార్ధం మృత్యుం త్వా నాభిలక్షయే. ౮౧

టీక॥అహం (అధ్యాహృతము)=నేను;త్వయాసార్ధం=నీతోఁగూడ; రమమాణః=క్రీడించుచున్నవాఁడై;త్వాం=నిన్ను;మృత్యుం=మృత్యువునుగా; నాభిలక్షయే=ఎఱుంగను.

నేనిన్నిదినములు,నీతోఁగ్రీడించుచుండియు,నీవునాకుమృత్యువని,యెఱుంగంజాలనైతిని. అని, తాత్పర్యము.

బాలో రహసి హస్తేన కృష్ణసర్ప మివా స్పృశమ్

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;రహసి=ఏకాంతమునందు; బాలః=పిల్లవాఁడు;హస్తేన=చేతిచే;కృష్ణసర్పమివ= తాచుఁబామునుబోలె; త్వాం (అధ్యాహృతము)=నిన్ను;అస్పృశం= తాఁకితిని.

బాలుండజ్ఞానంబుననెవ్వరులేనప్పుడుకృష్ణసర్పంబును జేతంబట్టుకొనునట్లు,నేను, నీహస్తంబుఁబట్టి,నిన్నుఁబెండ్లాడితిని. ఆకృష్ణసర్పంబు బాలునిమరణంబునకుఁగారణంబగునట్లునీవు నాచావునకుఁగారణంబవైతివి.

అని, తాత్పర్యము.

మయా హ్యపితృకః పుత్ర స్స మహాత్మా దురాత్మనా. ౮౨

టీక॥మహాత్మా=పూజ్యమగుస్వభావంబుగల;సః=ఆ;పుత్రః= కొడుకైన రాముండు; దురాత్మనా = దుష్టస్వభావంబుగల; మయా=నాచేత; అపితృకః = తండ్రిలేనివాఁడు; తండ్రిచేయవలసిన రక్షణాదులు లేనివాఁడనుట; అభవత్ (అధ్యాహృతము)హి= అయినాఁడుగదా!

మహాత్ముండగునాకుమారుండురామునకు,దురాత్ముండనగు నేనుదండ్రి

గానుండియుఁ, దండ్రియున్నందు వల నంగలుగుసుఖంబులేకపోయినది.

అని, తాత్పర్యము.

తం తు మాం జీవలోకో యం నూన మాక్రోష్టు మహాతి

టీక॥ అయం=ఈ ; జీవలోకః = ప్రాణిసమూహము; తం=అట్టి; మాం తు=నన్నుఁగూర్చిమాత్రము ; నూనం= నిశ్చయముగా; ఆక్రోష్టుం= తిట్టుటకు; అహాతి=తగును.

జనులందఱు, అట్టి దుర్మార్గుఁడనైన నన్ను, నిశ్చయముగా, దూషింతురు. అని, తాత్పర్యము.

బాలిశో బత కామాత్మా రాజా దశరథో భృశమ్. ౮౬
య స్త్రీకృతే ప్రియం పుత్రం వనం ప్రస్థాపయిష్యతి

టీక॥ యః=ఎవ్వఁడు ; స్త్రీకృతే= స్త్రీకొఱకుఁగా; ప్రియం=సంతోషము గలిగించు; పుత్రం=కొడుకును; వనం=అడవినిగూర్చి; ప్రస్థాపయిష్యతి= పంపఁగలఁడో; సః (అధ్యాహృతము)=అట్టి; రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; భృశం=మిక్కిలియు ; బాలిశః=మూర్ఖుఁడు; కామాత్మా=కామమునందుబుద్ధిగలవాఁడు.

ఈదశరథుండొకస్త్రీకొఱకుఁగాను, ప్రియుండగుతనకొడుకునురాముని, నడవికిఁబంపుచున్నాఁడు; ఇతండు, మిగుల మూర్ఖుఁడు; కేవలకాముకుండు, అని, జనులు, నన్ను, దూషింతురు.

అని, తాత్పర్యము.

వ్రతైశ్చ బ్రహ్మచర్యైశ్చ గురుభి శ్చోపకర్శితః. ౮౭
భోగకాలే మహ త్కృచ్ఛ్రం పునరేవ ప్రపత్స్యతే

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; వ్రతైశ్చ= వ్రతములచేతను; బ్రహ్మచర్యైశ్చ=బ్రహ్మచారి ధర్మములచేతను; గురుభిశ్చ= గురువులచేతను; ఉపకర్శితః = కృశించునట్లుసేయఁబడినాఁడు. పునరేవ = మఱలనే; భోగకాలే= భోగించుకాలమునందు; మహత్=అధికమయిన; కృచ్ఛ్రం= క

బహుకాలము; అభిరక్షితా ఖలు = కాపాడఁబడినావుగదా!

పాపిష్ఠురాలవగుకై కేయీ! నేనజ్ఞానంబున, నిన్ను, మెడకుఁదగులుకొని యున్నయురివేసికొనుత్రాటినింబోలె, బహుకాలంబుకాపాడితిని; ఆత్రాడట్లు, అమనుష్యనింజంపునో, అట్లు నీవు నునన్నుఁజంపంజూచితివి.

అని, తాత్పర్యము.

రమమాణ స్త్వయా సార్థం మృత్యుం త్వా నాభిలక్షయే. ౮౧

టీక॥అహం (అధ్యాహృతము)=నేను; త్వయాసార్థం=నీతోఁగూడ; రమమాణః=క్రీడించుచున్నవాఁడై; త్వాం=నిన్ను; మృత్యుం=మృత్యువునుగా; నాభిలక్షయే=ఎఱుంగను.

నేనిన్నిదినములు, నీతోఁగ్రీడించుచుండియు, నీవునాకుమృత్యువవని, యెఱుంగంజాలనైతిని. అని, తాత్పర్యము.

బాలో రహసి హస్తేన కృష్ణసర్ప మివా స్పృశమ్

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; రహసి=ఏకాంతమునందు; బాలః=పిల్లవాఁడు; హస్తేన=చేతిచే; కృష్ణసర్పమివ= తాచుఁబామునుబోలె; త్వాం (అధ్యాహృతము)=నిన్ను; అస్పృశం=తాఁకితిని.

బాలుండజ్ఞానంబుననెవ్వరులేనప్పుడుకృష్ణసర్పంబును జేతంబట్టుకొనునట్లు, నేను, నీహస్తంబుఁబట్టి, నిన్నుఁబెండ్లాడితిని. ఆకృష్ణసర్పంబు బాలునిమరణంబునకుఁగారణంబగునట్లు నీవు నాచావునకుఁగారణంబవైతివి.

అని, తాత్పర్యము.

మయా హ్యపితృకః పుత్ర స్స మహాత్మా దురాత్మనా. ౮౩

టీక॥మహాత్మా=పూజ్యమగుస్వభావంబుగల; సః=ఆ; పుత్రః= కొడుకైన రాముండు; దురాత్మనా = దుష్టస్వభావంబుగల; మయా=నాచేత; అపితృకః = తండ్రిలేనివాఁడు; తండ్రిచేయవలసిన రక్షణాదులు లేనివాఁడనుట; అభవత్ (అధ్యాహృతము)హి= అయినాఁడుగదా!

'మహాత్ముండగునాకుమారుండు రామునకు, దురాత్ముండనగు నేనుదండ్రిని

గానుండియుఁ, దండ్రియున్నందు వలనంగలుగుసుఖంబులేకపోయినది.

అని, తాత్పర్యము.

తం తు మాం జీవలోకో యం నూన మాక్రోష్టు మర్హతి

టీక॥అయం=ఈ ; జీవలోకః = ప్రాణిసమూహము;తం=అట్టి; మాం తు=నన్నుఁగూర్చియే మాత్రము ; నూనం= నిశ్చయముగా; ఆక్రోష్టుం= తిట్టుటకు; అర్హతి=తగును.

జనులందఱు,అట్టి దుర్మార్గుఁడనైననన్ను,నిశ్చయముగా, దూషింతురు. అని, తాత్పర్యము.

బాలిశో బత కామాత్మా రాజా దశరథో భృశమ్. ౮౩

య స్త్రీకృతే ప్రియం పుత్రం వనం ప్రస్థాపయిష్యతి

టీక॥ యః=ఎవ్వఁడు ; స్త్రీకృతే= స్త్రీకొఱకుగా; ప్రియం=సంతోషము గలిగించు; పుత్రం=కొడుకును; వనం=అడవినిగూర్చి; ప్రస్థాపయిష్యతి= పంపఁగలఁడో;సః (అధ్యాహృతము)=అట్టి;రాజా=రాజయిన;దశరథః=దశరథుఁడు; భృశం=మిక్కిలియు ; బాలిశః=మూర్ఖుఁడు;కామాత్మా=కామమునందుబుద్ధిగలవాఁడు.

ఈదశరథుండొకస్త్రీకొఱకుగాను, ప్రియుండగుతనకొడుకునురాముని, నడవికిఁబంపుచున్నాఁడు; ఇతండు, మిగుల మూర్ఖుఁడు; కేవలకాముకుండు.అని,జనులు,నన్ను,దూషింతురు.

అని, తాత్పర్యము.

వ్రతైశ్చ బ్రహ్మచర్యైశ్చ గురుభి శ్చోపకర్శితః. ౮౪

భోగకాలే మహ త్కృచ్ఛ్రం పున రేవ ప్రపత్స్యతే

టీక॥రామః (అధ్యాహృతము)= రాముఁడు; వ్రతైశ్చ= వ్రతములచేతను;బ్రహ్మచర్యైశ్చ=బ్రహ్మచారి ధర్మములచేతను; గురుభిశ్చ= గురువులచేతను;ఉపకర్శితః = కృశించునట్లుసేయఁబడినాఁడు.పునరేవ = మఱలనే; భోగకాలే= భోగించుకాలమునందు; మహత్=అధికమయిన;కృచ్ఛ్రం= క

ష్టమును; ప్రపత్స్యతే=పొందఁబోవుచున్నాఁడు.

రాముండు, ఇంతవఱకు; వ్రతంబులను, బ్రహ్మాచర్యంబునను గురువులు సేయు శిక్షలవలనను, మిగుల శ్రమపడి, యెంత మాత్రము సుఖింపలేదు, ఇంక సుఖంబను భవించుకాలంబువందును, అతనికి, మఱలనంతకన్న మహాకష్టంబు, వచ్చినది. అని, తాత్పర్యము.

నాలం ద్వితీయం వచనం పుత్రో మాం ప్రతి భాషితుమ్. ౮౫
స వనం ప్రవ్రజే త్యుక్తో బాఢ మిత్యేవ వక్ష్యతి

టీక॥ పుత్రః=కొడుకయిన రాముండు; మాంప్రతి = నన్నుఁగూర్చి; ద్వితీయం=రెండవ; వచనం=మాటను; భాషితుం=చెప్పుటకు; నాలం=సమర్థుఁడు కాఁడు; సః=ఆ రాముండు; "వనం=అడవినిగూర్చి; ప్రవ్రజ=పొమ్ము." ఇతి=అని; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; బాఢం=మంచిది; ఇత్యేవ=అనియే; వక్ష్యతి=చెప్పును.

నాకొడుకు రాముండు, నామాటకు రెండవమాటను జెప్పనేరఁడు; "నీవడవికిఁ బొమ్ము" అని, నేనతనితోఁ జెప్పఁగానే, అందుకతండు "మంచి" దని చెప్పునే గాని, యెంతమాత్రము మాఱువలుకఁడు.

అని, తాత్పర్యము.

యది మే రాఘవః కుర్యా ద్వనం గచ్ఛేతి చోదితః. ౮౬
ప్రతికూలం ప్రియం మే స్యా న్నతు వత్సః కరిష్యతి

టీక॥ రాఘవః=రాముఁడు "వనం=అడవిని; గచ్ఛ=పొందుము." ఇతి=అని; చోదితః = ఆజ్ఞాపింపఁబడినవాఁడై; మే=నాకు; ప్రతికూలం=విరోధమును; కుర్యాద్యది= చేయునేని; తత్ (అధ్యాహృతము)=అట్లు సేయుట; మే=నాకు; ప్రియం=ఇష్టము; స్యాత్=అగును. వత్సః=బిడ్డఁడగు రాముండుమాత్రము; నకరిష్యతి=చేయఁడు.

నేను "వనంబునకుఁబొమ్ము" అని, రామునాజ్ఞాపింపఁగానే, యతండు "నేను బోఁజాలను" అని, చెప్పి నాయాజ్ఞనతిక్రమించునేని, నాకది ప్రియముగా నుండు; రాముండుమాత్రము, అట్లు, ఎన్నటికిని, నాయాజ్ఞనతిక్రమింపఁడు.

అని, తాత్పర్యము.

శుద్ధభావో హి భావం మే న తు జ్ఞాస్యతి రాఘవః. ౧౭

టీక॥శుద్ధభావః=పరిశుద్ధంబగుహృదయముగల; రాఘవః = రాముండు; మే=నాయొక్క;భావంతు= అభిప్రాయమును;నజ్ఞాస్యతిహి= తెలిసికొనలేఁడుగదా!

రాముండెంతమాత్రముకపటములేని పరిశుద్ధంబగు హృదయంబుగలవాఁడు, కావున,నతండు, నేనతండునాయాజ్ఞనతిక్రమించుటనాకిష్టమనితలంచి,యతనివనంబునకుఁబొమ్మనిచెప్పుటను, తెలిసికొనఁజాలఁడు. అని, తాత్పర్యము.

స వనం ప్రవ్రజేత్యుక్తో బాఢ మిత్యేవ వక్ష్యతి

టీక॥సః=ఆరాముండు; "వనం=అడవిని;ప్రవ్రజ=పొందుము"ఇతి=అని;ఉక్తః=చెప్పఁబడినవాఁడై; బాఢం=మంచిది;ఇత్యేవ=అనియే; వక్ష్యతి=చెప్పును.

కావున, రామునింజూచి, నేను, "నీవు, అడవికిఁబొమ్ము" అనియాజ్ఞాపింపఁగానే,అందుకతండు,"మంచిది"అని, చెప్పునే, కాని, వేఱుమాటపలుకఁడు.

అని, తాత్పర్యము.

రాఘవే హి వనం ప్రాప్తే సర్వలోకస్య ధిక్కృతమ్. ౧౮
మృత్యు రక్షమణీయం మాం నయిష్యతి యమక్షయమ్

టీక॥రాఘవే=రాముఁడు; వనం=అడవిని;ప్రాప్తే=పొందఁగానే ; సర్వలోకస్య=(తృతీయార్థమందుషష్ఠి) సమస్తజనముచేత; ధిక్కృతం=నిందింపఁబడినవాఁడను; అక్షమణీయం=క్షమింపఁగూడనివాఁడనగు; మాం=నన్ను; మృత్యుః=మృత్యువు; యమక్షయం= యమునిగృహమును; నయిష్యతి=పొందింపఁగలఁడు.

రాముండడవికిఁబోఁగానే, మృత్యువు,సమస్తజనులచేతను నిందింపఁబడుచున్ననన్ను, మహాపాపిష్ఠుండనగుటచే క్షమింపక,యమలోకంబునకుఁ,గొనిపోవును.అని, తాత్పర్యము.

మృతే మయి గతే రామే వనం మనుజపుంగవే. ౧౯

ఇష్టే మమ జనే శేషే కిం పాపం ప్రతిపత్స్యసే

టీక॥మయి=నేను; మృతే=చావఁగా; మనుజపుంగవే=పురుషశ్రేష్ఠుండగు; రామే=రాముండు; వనం=అడవిని; గతే=పొందఁగా; శేషే=మిగిలిన; మమ=నాయొక్క; ఇష్టే=ప్రియమయిన; జనే= జనమునందు; కిం=ఏమి; పాపం=కష్టమును; ప్రతిపత్స్యసే=చేయఁగలవు?

నేను మృతుండయి, రాముండడవికిఁబోయినపిమ్మట, శేషించియుండు, కౌసల్యమొదలగునాయిష్టజనులకు, మఱేమి కష్టమును, జేయఁగోరుచున్నావు?

అని, తాత్పర్యము.

కౌసల్యాం మాం చ రామంచ పుత్రౌచ యది హాస్యసి. ౯౦
దుఃఖా న్యసహతీ దేవీ మా మే వానుమరిష్యతి

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; కౌసల్యాంచ=కౌసల్యను; మాంచ=నన్నును; రామంచ=రాముని; పుత్రౌ చ = కొడుకులయిన రామలక్ష్మణులను; హాస్యసియది=విడుతువేని; దేవీ=రాణియగుసుమిత్ర; దుఃఖాని= దుఃఖములను; అసహతీ = ఓర్వలేనిదై ; మాం=నన్ను; అనుమరిష్యతి= వెంబడించిచచ్చును.

రాముం డడవికిఁ బోవునేని నేను ప్రాణంబులు విడుతును; నేనుమృతుండయి రాముండడవికిఁ బోయినపిమ్మటఁగౌసల్యయు మృతయగు; రాముని యందతిస్నేహభక్తులుగలలక్ష్మణుండునుజచ్చును; అట్లుశత్రుఘ్నుండునీవృత్తాంతమువిన్నంతనే, ప్రాణంబులువిడుచును; ఇట్లునీవు, కౌసల్యను, నన్నును, రాముని, లక్ష్మణశత్రుఘ్నులను, విడుతువేని సుమిత్రయు, నీదుఃఖంబులసహింపలేక నన్ననుగమించి, ప్రాణంబులువిడువంగలదు. అని, తాత్పర్యము.

కౌసల్యాంచ సుమిత్రాంచ మాంచ పుత్రైస్త్రిభిస్సహ. ౯౧
ప్రక్షిప్య నరకే సా త్వం కైకేయి సుఖితా భవ

టీక॥కైకేయి=కైకేయీ! సా=అట్టి; త్వం=నీవు; కౌసల్యాంచ=కౌసల్య

ను;సుమిత్రాంచ=సుమిత్రను;మాంచ=నన్నును; త్రిభిః = ముగ్గురయిన ; పుత్రైస్సహ=కొడుకులతోఁగూడ; నరకే=దుఃఖమునందు;ప్రక్షిప్య=పడద్రోసి;సుఖితా= సుఖంబునొందినదానవు; భవ=అగుము.

కైకేయీ! అతిక్రూరురాలవగు నీవు, కౌసల్యను సుమిత్రను నన్నును నాకొడుకులు రామలక్ష్మణశత్రుఘ్నులముగ్గురను, దుఃఖంబునొందునట్లు చేసి, నీవుమాత్రము, సుఖంబుగానుండుము.

అని, తాత్పర్యము.

మయా రామేణ చ త్యక్తం శాశ్వతం సత్కృతం గుణైః. ౬౨
ఇక్ష్వాకు కుల మక్షోభ్య మాకులం పాలయిష్యసి

టీక॥మయా = నాచేతను; రామేణచ=రామునిచేతను;త్యక్తం=విడువఁబడినదియును; శాశ్వతం=నిత్యంబును; గుణైః = గుణములచేత;సత్కృతం=పూజింపఁబడినదియును; అక్షోభ్యం=కలఁతనొందఁ జేయఁగూడనిదియునగు; ఇక్ష్వాకుకులం = ఇక్ష్వాకువంశమును; రాజ్యముననుట; ఆకులం=కలఁతనొందునట్లుగా; పాలయిష్యసి=కాపాడఁగలవు.

శాశ్వతంబై గుణంబులచేసుతికెక్కిన దియై, యక్షోభ్యంబై, నాచేతను రామునిచేతనువిడువఁబడి,యుండు,నీయిక్ష్వాకురాజ్యంబు,నిప్పుడు, నీవు, ఆకులంబుగాఁబాలించెదవు.

అని, తాత్పర్యము.

ప్రియం చేద్భరతస్యైత ద్రామ ప్రవ్రాజనం భవేత్. ౬౩
మాస్మ మే భరతః కార్షీ త్ప్రేతకృత్యం గతాయుషః

టీక॥ఏతత్ = ఈ; రామప్రవ్రాజనం=రామునడవికిఁబంపుట;భరతస్య=భరతునకు;ప్రియం = ఇష్టము; భవేచ్చేత్=అగునేని; భరతః=భరతుఁడు; గతాయుషః= పోయినయాయుస్సుగలవానిపోయినయనుట; మే=నాకు; ప్రేతకృత్యం= ప్రేతమునకుఁజేయవలసిన కార్యములను; మాకార్షీత్=చేయఁగూడదు. "స్మ" అనునది పాదపూరణార్థము.

రామునడవికిఁ బంపుటనువిని, భరతుండు సంతోషమునొందునేని, నేనుమ్ర

తుండగునప్పుడు, నాకు, భరతుండు, చరమక్రియలు సేయఁదగఁడు.

అని, తాత్పర్యము.

హంతానార్యే మమామిత్రే సకామా భవ కైకయి. ౯౪

టీక॥హంత=అయ్యో! అనార్యే=దుష్టురాలా! మమ=నాకు; అమిత్రే=శత్రువైనదానా! కైకయి=కైకేయీ! రామే(అధ్యాహృతము) = రామునియందు; సకామా=ఇష్టముగలదానవు; భవ=అగుము.

అయ్యో! దుష్టురాలా! నాకు శత్రువైనదానా! కైకేయీ! రామునియందు దుఁబ్రీతింబుగలదానవగుము.

అని, తాత్పర్యము.

మృతే మయి గతే రామే వనం పురుషపుంగవే
సేదానీం విధవా రాజ్యం సపుత్రా కారయిష్యసి. ౯౫

మయి=నేను; మృతే=చావఁగా; పురుషపుంగవే=పురుషశ్రేష్ఠుండగు; రామే=రాముండు; వనం=అడవిని; గతే=పొందఁగా; ఇదానీం=ఇప్పుడు; సా(త్వం)=అట్టినీవు; విధవా=ముండమోపివై; సపుత్రా=కొడుకుతోఁగూడినదానవై; రాజ్యం=దొరతనమును; కారయిష్యసి=చేయఁగలవు.

నేను మృతుండనయి పురుషశ్రేష్ఠుండగు రాముండు వనంబునకుఁబోయినపిమ్మట, నీవు, ముండమోపివై, నీకొడుకు భరతుంగూడి, దొరతనము సేయుదువు.

అని, తాత్పర్యము.

త్వం రాజపుత్రీవాదేన న్యవసో మమ వేశ్మని
అకీర్తిశ్చాతులా లోకే ధ్రువః పరిభవశ్చ మే. ౯౬
సర్వభూతేషు చావజ్ఞా యథాపాపకృత స్తథా

టీక॥త్వం=నీవు; రాజపుత్రీవాదేన=రాచకొమార్తెయనెడువ్యాజముచేత; మమ=నాయొక్క; వేశ్మని=గృహంబునందు; న్యవసః=ఉంటివి. పాపకృతః=పాపముసేయువానికి; యథా=ఎట్లో; తథా=అట్లు; లోకే=ప్ర

పంచమందు; అతులా=సరిలేని; అకీర్తి శ్చ=అపకీర్తియును; ధ్రువః= నిత్యమయిన; పరిభవశ్చ=తిరస్కారమును; సర్వభూతేషు=సమస్తప్రాణులయందును; అవజ్ఞాంచ=తక్కువయును; మే= నాకు; ఆసన్ (అధ్యాహృతము)= కలిగినవి.

సీవా యస్తంబవు రాచకొమా తేరయనెదురూపంబున నాయింటనుంటివి; అందువలనం, బాపిష్ఠునకుంబోలె నాకు, ఈలోకంబున సాటిలేనియపకీర్తియును, ఎన్నటికిందఱుఁగనితిరస్కారంబును, సమస్తజీవజంతువులయెదుటనల్పత్వంబును, కలిగినవి.

అని, తాత్పర్యము.

కథం రథైర్విభుర్యాత్వా గజాశ్వైశ్చ ముహుర్ముహుః. ౯౭
పద్భ్యాం రామో మహారణ్యే వత్సో మే విచరిష్యతి

టీక॥ మే=నాయొక్క; వత్సః=బిడ్డఁడగు; విభుః=ప్రభువైన; రామః = రాముఁడు; ముహుర్ముహుః=పలుమాఱులు; రథైః = రథములచేతను; గజాశ్వైశ్చ=ఏనుఁగులచేతను గుఱ్ఱములచేతను; యాత్వా=పోయి; మహారణ్యే= పెద్దయడవియందు; పద్భ్యాం= పాదములచేతను; కథం=ఎట్లు; విచరిష్యతి=తిరుగఁగలఁడు?

నాప్రియపుత్రుఁడు ప్రభుండునగు రాముండు, పలుమాఱురథంబులుగజంబులుగుఱ్ఱంబులు మొదలగుదివ్యయానంబులఁదిరుగుచుండి, యిప్పుడు, మహారణ్యంబునందుఁ, బాదంబుల, నెట్లు, తిరుగంగలఁడు? అని, తాత్పర్యము.

యస్య త్వాహారసమయే సూదాః కుండలధారిణః ౯౮
అహం పూర్వాః పచంతిస్మ ప్రశస్తం పానభోజనమ్
స కథన్ను కషాయాణి తిక్తాని కటుకానిచ. ౯౯
భక్షయన్వన్య మాహారం సుతో మే వర్తయిష్యతి

టీక॥యస్య=ఎవ్వనియొక్క; ఆహారసమయే=భోజనసమయమందు; కుండలధారిణః= పోఁగులుధరించిన; సూదాః=వంటవారలు; అహంపూర్వాః=

"నేనుముందు, నేనుముందు" అనుమాటలు గలవారలై; ప్రశస్తం=శ్రేష్ఠమయిన; పానభోజనం=త్రాఁగఁదగినదియు భుజింపఁదగినదియునగునాహారమును; పచంతిస్మ=వండుచుండిరో; సః= అట్టి; మే=నాయొక్క; సుతస్తు = కొడుకైన రాముండును; కథన్ను=ఎట్లు; కషాయాణి=ఒగరుగలవానిని; తిక్తాని= చేఁదుగలవానిని; కటుకానిచ=కారముగలవానిని; వన్యం = అడవియందుఁబుట్టిన; ఆహారం=ఆహారమును; భక్షయన్= తినుచు; వర్తయిష్యతి=జీవింపఁగలఁడు.

ఎవ్వండుభుజింపగోరఁగానే, కుండలంబులచే నలంకృతులగు వంటవాండ్రు, "నేనువంటచేసెదను, నేనువంట చేసెదను" అనిపరువులిడుచుఁ బ్రశస్తంబులైన పానీయభోజనంబులను, వండుచుండిరో, అట్టినాకొడుకు రాముండు, అడవియందుఁ ఒగరు చేదు కారముపీనితోఁగూడిన యాహారంబును భుజింపుచు, నెట్లుజీవింపఁగలఁడు?

అని, తాత్పర్యము.

మహార్హవస్త్ర సంవీతో భూత్వా చిరసుఖోషితః. ౧౦౦
కాషాయ పరిధానస్తు కథం భూమౌ నివత్స్యతి

టీక॥ సః(అధ్యాహృతము)= రాముఁడు; మహార్హవస్త్రసంవీతః = మిక్కిలియుశ్రేష్ఠమయిన వస్త్రముచేఁ గప్పఁబడినవాఁడును; చిరసుఖోషితః= బహుసుఖముగానుండు నాస్తరణముపైనున్నవాఁడును; భూత్వా=అయి; కాషాయపరిధానస్తు = కాషాయవర్ణంబులగు వస్త్రములు గలవాఁడయ్యు; భూమౌ=నేలయందు; కథం= ఎట్లు; నివత్స్యతి= ఉండఁగలఁడు?

రాముండు, అతిశ్లాఘ్యంబులగువస్త్రంబులనుధరించి, యెంతకాలంబుగూర్చుండినను బహుసుఖ్యంబుగా నుండు నాస్తరణంబులపైఁ బరుండియుండి, యింక, వనంబునఁ, గాషాయవస్త్రంబులుగట్టుకొని నేలపైఁ బరుండి, యెట్లుండఁగలఁడు? అని, తాత్పర్యము,

కస్యైతద్దారుణం వాక్య మేవంవిధ మచింతితమ్. ౧౦౧
రామస్యారణ్యగమనం భరతస్యాభిషేచనమ్

టీక॥ రామస్య=రామునకు;అరణ్యగమనం = అడవినిబొందుటయు;భరతస్య—భరతునకు; అభిషేచనం — రాజ్యాభిషేకమును ; ఏవంవిధం = ఈవిధమయిన ; దారుణం = భయంకరంబయిన ; అచింతితం = ఆలోచింపఁబడని ; ఏతత్ = ఈ ; వాక్యం=మాట;కస్య=ఎవ్వనియొక్క;వాక్యం(అధ్యాహృతము)—మాట?

"రాముండడవికిఁబోవుట, భరతుండుపట్టాభిషిక్తుండగుట , యిట్టిదారుణమయిన, యీమాటను , ఎంతమాత్రమునాలోచింపక, వెవ్వఁడునీకుపదేశించినాఁడు? అని, తాత్పర్యము.

ధిగస్తు యోషితో నామ శఠా స్స్వార్థ పరా స్సదా. ౧౨
న బ్రవీమి స్త్రియ స్సర్వా భరతస్యైవ మాతరమ్

టీక॥ శఠాః=తెలియకుండఁగీడుసేయువారలును; సదా = ఎల్లప్పుడు; స్వార్థపరాః = తమకార్యమునందే యాసక్తలును; యోషితః = స్త్రీలను గూర్చి;ధిక్ —మండుట; అస్తు నామ= అగుఁగాక. స్త్రియః= స్త్రీలను; సర్వాః= అందఱనుగూర్చి; న బ్రవీమి= చెప్పను. భరతస్య=భరతునియొక్క; మాతరమేవ=తల్లియగు కైకేయిఁగూర్చియే;బ్రవీమి=చెప్పుచున్నాను.

స్త్రీలందఱు, తెలియకుండునట్లు, కీడుసేయువారలు, ఎల్లప్పుడునుదమకార్యమునందేయాసక్తలు, ఇతరులకార్యమునెంతైననుసరకుసేయరు; స్త్రీలందఱునుండిపోవుదురుగాక; అయితే,పతివ్రతలగుస్త్రీలునున్నారు;కావున , ఈ స్త్రీలనందఱను నేనునిందింపనొల్లను; భరతునితల్లియయిన కైకేయినిమాత్రమే నిందించెదను.

అని, తాత్పర్యము.

అనర్థభావే ఽర్థపరే నృశంసే
మమా సుతాపాయ నివిష్టభావే. ౧౩
కిమప్రియం పశ్యసి మన్నిమిత్తం
హితానుకారి ణ్యథవాపి రామే

టీక॥అనర్థభావే—అనర్థముగలిగించునట్టియభిప్రాయముగలదానా! అ

ర్థపరే=స్వకార్యమునందే యాసక్తురాలా! నృశంసే=క్రూరురాలా! మమ=నాయొక్క; అనుతాపాయ=దుఃఖపడుటకొఱకు;నివిష్టభావే=పొందఁబడినయభిప్రాయముగలదానా! మన్నిమిత్తం=నేనునిమిత్తముగాఁగల; కిం=ఏమి;అప్రియం=కీడును; అథవా=అటుగానిచో; హితానుకారిణి= మేలుసేయునట్టి; రామేపి= రామునియందైనను; కిం అప్రియం(అధ్యాహృతము)=యేమి కీడును; పశ్యసి = చూచుచున్నావు?

ఇతరులకనర్థము గలిగించు నభిప్రాయముగలదానవు, స్వకార్యధురంధరురాలవు,దయలేనిదానవు,నన్నుదుఃఖింపఁజేయుటకై యేయిట్టి దురభిప్రాయంబునవలంబించినదానవు, నేనునీకేమికీడుచేసినాను? లేకలోకమున కంతయు హితముసేయురాముండుగాని నీకేమికీడుగావించినాఁడు?

అని, తాత్పర్యము.

పరిత్యజేయుః పితరో హి పుత్రాన్
భార్యాః పతీంశ్చాపి కృతానురాగాః. ౧౦౮
కృత్స్నం హి సర్వం కుపితం జగత్స్యా
ద్దృష్ట్వైవ రామం వ్యసనే నిమగ్నమ్

టీక॥కృతానురాగాః= చేయఁబడినప్రీతిగల; పితరః = తండ్రులు ; పుత్రాన్=కొడుకులను;కృతానురాగాః(అధ్యాహృతము)= చేయఁబడినప్రీతిగల; భార్యాః=భార్యలు;పతీంశ్చాపి=పెనిమిటులను; పరిత్యజేయుఃహి=విడుతురుగదా!కృత్స్నం=సమస్తమైన; జగత్=ప్రపంచము; సర్వం=అంతయు, స్థావరంబులుగూడననుట ; వ్యసనే=దుఃఖమునందు; నిమగ్నం= మునింగిన; రామం=రాముని;దృష్ట్వైవ=చూచినంతనె; కుపితం=కోపమునొందినది ; స్యాత్ హి=అగునుగదా!

ప్రేమగలవారయినను దండ్రులుకొడుకులనువిడువవచ్చును; అట్లు, పెనిమటులనుభార్యలువిడువవచ్చును ; అయితేనేను, రామునివిడువఁగా, దుఃఖంబునంగుందుచుండు రామునిఁజూచినంతనే,ప్రపంచమునందు, జంగమంబులును స్థావరంబులునుగూడ,అన్నియుఁ, గోపంబునొందును.అని, తాత్పర్యము.

అహంపున ర్దేవకుమారరూప
మలంకృతం తం సుత మాప్రజంతమ్. ౧౦౫
నందామి పశ్య న్నపి దర్శనేన
భవామి దృష్ట్వాచ పున ర్యువేవ

టీక॥ అహంపునః=నేనుమాత్రము; దేవకుమారరూపం= దేవతాపుత్రుని యొక్క సౌందర్యమునంటిసౌందర్యము గలవాఁడును;అలంకృతం=అలంకరింపఁ బడినవాఁడును; ఆప్రజంతం= వచ్చుచున్నవాఁడునగు;తం=ఆ;సుతం=కొడుకైన రామునిని;దర్శనేనాపి= చూపుచేతనైన,మూరదృష్టి చేతనైననునుట;పశ్యన్= చూచుచు; నందామి=సంతోషించుచున్నాను.దృష్ట్వాచ=చూచియు;పునః=మఱల;యువేవ=యౌవనముగలవాఁడువలె;భవామి=అగుచున్నాను.

లోకంబుననితరులకువలె నాయుమాత్రిముపుత్రునియందుసాధారణప్రేమంబె కాదు,విలక్షణంబుగానున్నది; నాకు, దేవకుమారుండుంబోలె సహజసుందరుండై, భూషణంబులనలంకరింపఁబడి, మత్తగజేంద్రగమనంబున, నాయొద్దకు వచ్చుచున్న, రాముని, దవ్వులంజూడఁగానే, బహుసంతోషము గలుగుచున్నది;అంత,నాసమీపమునవచ్చియున్నయతనిం జూచితినేని, నేనతి వృద్ధుండనైనను, నాకప్పుడు, యౌవనంబుగలిగినవానికింబోలె, దేహపుష్టివీర్యోత్సాహంబులుగలుగుచున్నవి.

అని, తాత్పర్యము.

వినాపి సూర్యేణ భవే త్ప్రవృత్తి
రవర్షతా వజ్రధరేణ వాపి. ౧౦౬
రామం తు గచ్ఛంత మిత స్సమీక్ష్య
జీవే న్న కశ్చి త్త్వితి చేతనా మే

టీక॥ సూర్యేణవినాపి=సూర్యుండు లేకున్నను; అవర్షతా= వానకురియనట్టి; వజ్రధరేణవాపి=ఇంద్రునిచేతనైనను;ప్రవృత్తిః=లోకస్థితి; భవేత్=అగును.ఇతః=ఇటనుండి; గచ్ఛంతం=పోవుచున్న;రామం = రామునిని;సమీక్ష్య తు=చూచినమాత్రముననె;కశ్చిత్తు=ఒకానొకఁడుకైనను;నజీవేత్=బ్రతుక

స ౧౨

దు. ఇతి=అని; మే = నాయొక్క; చేతనా=అభిప్రాయము.

సూర్యుండు లేకున్నను, ఇంద్రుండు వానగురియకున్నను, లోకంబులు, చక్కఁగానుండును; గాని, రాముండు, ఇచ్చటనుండి వనంబునకుంబోవుటను జూచు నేని, యొక్కజంతువయినను, జీవింపంజాలదు; అని నాయభిప్రాయము.

అని, తాత్పర్యము.

వినాశకామా మహితా మమిత్రా
మావాసయం మృత్యు మివాత్మన స్త్వామ్. ౧౦౭
చిరం బతాం కేన ధృతాసి సర్పీ
మహావిషా తేన హతో స్మి మోహాత్

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; వినాశకామాం=చేటునుగోరుదానవును; అహితాం= కీడుసేయుదానవును; అమిత్రాం= శత్రువైనదానవును; ఆత్మనః=నాయొక్క; మృత్యుమివ(స్థితాం)=మృత్యువువలెనున్నదానవు నగు; త్వాం=నిన్ను; ఆవాసయం=ఉంచితిని; మహావిషా= అధికమయినవిషముగల; సర్పీ=సర్పజాతివగు; త్వం(అధ్యాహృతము)=నీవు; చిరం=బహుకాలము; అం కేన=తొడచేత; ధృతా= ధరింపఁబడినదానవు; అసి=అగుచున్నావు; బత=అయ్యో! తేన=అందుచేత; మోహాత్=అజ్ఞానమువలన; హతః= చంపఁబడినవాఁడను; అస్మి= అగుచున్నాను.

నాచేటుఁగోరుచు నాకుఁగీడుసేయుదాననై శత్రువై మృత్యువుం బోలె నున్ననిన్ను, నేనింతకాలం బజ్ఞానంబున, నాయింటనుంచుకొంటిని; అతివేగంబగు విషముగల సర్పంబవగు నిన్నుఁదెలియక, బహుకాలము, అంకంబునం జేర్చుకొనియుంటం జేసి, యిప్పుడు, నీచేత, నేనుజంపఁబడినాను.

అని, తాత్పర్యము.

మయాచ రామేణ సలక్ష్మణేన
ప్రశాస్తు హీనో భరత స్త్వయాసహ. ౧౦౮

పురంచ రాష్ట్రంచ నిహత్య బాంధవాన్
మమాహితానాం చ భవాభిహర్షిణీ

టీక॥మయా చ=నాచేతను; సలక్ష్మణేన= లక్ష్మణునితోఁగూడిన; రామేణ చ=రామునిచేతను; హీనః= విడువఁబడిన; భరతః=భరతుండు;త్వయా= సహ=నీతోఁగూడ;పురంచ=పట్టణమును, పట్టణమునను౦డుజనులననుట;రాష్ట్రంచ= రాజ్యంబును; రాజ్యంబుననుండుజనులననుట, బాంధవాన్=బంధువులను; నిహత్య=చంపి;ప్రశాస్తా= దొరతనముసేయుఁగాక.త్వం(అధ్యాహృతము)=నీవును;మమ=నాయొక్క; అహితానాం=శత్రువులవిషయమై;అభిహర్షిణీ = సంతోషముగలదానవు; భవ=అగుము.

నాచేతను, లక్ష్మణునిచేతనురామునిచేతనువిడువఁబడి,భరతుఁడు, నిన్నుఁగూడి,పట్టణంబుననుండుజనులను, రాజ్యంబుననున్నజనులను,బంధువుల, అందఱంజంపి.దొరతనము సేయుఁగాక; నీవును,నాశత్రువులపైఁప్రీతిసంతోషంబులునెఱపుచుండుము. అని, తాత్పర్యము.

నృశంసవృత్తే వ్యసనప్రహారిణి
ప్రసహ్య వాక్యం యదిహాద్య భాషసే. ౧౧౯
న నామ తే కేన ముఖాత్పతంత్యధో
విశీర్యమాణా దశనాస్సహస్రధా

టీక॥ నృశంసవృత్తే=దయలేనివ్యాపారముగలదానా!వ్యసనప్రహారిణి= విపత్కాలమునందుఁగొట్టుదానా! ఇహ=ఇచ్చట;అద్య = ఇప్పుడు; ప్రసహ్య=స్వతంత్రించి;వాక్యం = మాటను;భాషసే యత్ = చెప్పుచున్నావనునదిమేదిగలదో ; తతః (అధ్యాహృతము)=అందువలన;తే=నీయొక్క; ముఖాత్=నోటనుండి; దశనాః=పండ్లు; సహస్రధా = వేయివిధములుగా;విశీర్యమాణాః = రాలుచున్నవై ; కేన నామ=ఏకారణముచేత;అధః=క్రింద;నపతంతి=పడవు?

దయలేనివ్యాపారముగలదానా!ఆపత్కాలమునందుఁప్రహరించుదానా! నీవిప్పుడు,నాయెదుట, భార్యయుండవలసిన క్రమంబు నతిక్రమించి, స్వాతంత్ర్యంబున, నిట్టి, క్రూరవాక్యంబులాడు

చున్నావే; ఎందువలననిప్పుడు, నీనోట నుండిపండ్లన్నియు, వేయిపలెయులు గాఁ బగిలి, నేలంబడవు? అని, తాత్పర్యము.

న కించి దాహ హిత మప్రియం వచో
న వేత్తి రామః పరుషాణి భాషితుమ్. ౧౧
కథ న్ను రామే హ్యభిరామవాదిని
బ్రవీషి దోషాన్ గుణనిత్యసమ్మతే

టీక॥ రామః = రాముఁడు; అహితం=కీడుగల్గించునదియు; అప్రియం = ఇష్టంబుకానిదియునగు; వచః= మాటను; కించిత్ =కొంచమైనను ; దాహ=చెప్పఁడు, పరుషాణి=కఠినములైనమాటలను; భాషితుం=పలుకుటకు; నవేత్తి = ఎఱుంగఁడు అభిరామవాదిని= ప్రియవచనంబులఁ జెప్పువాఁడును; గుణనిత్యసమ్మతే=గుణంబులచే నెల్లప్పుడునుబొగడఁబడినవాఁడునగు; రామేహి= రామునియందును ; కథన్ను=ఎట్లు; దోషాన్=దోషంబులను; బ్రవీషి= చెప్పుచున్నావు?

రాముండు, కొంచెమయినను, హితంబుకానిమాటనుగాని, ప్రియంబుగానిమాటనుగాని, పలుకఁడు, పరుషంబుగామాటలాడుటకే యతనికిఁ దెలియదు, అట్లు సర్వజనులకును బ్రియంబులయిన మాటలాడు వాఁడు నుగుణవంతుండని యందఱిచేతను గొనియాడంబడువాఁడునగు రామునియందు , అరణ్యంబునకుఁ బంపవలసిన,దోషంబు లేమియు న్నవని, చెప్పఁగలవు? అని, తాత్పర్యము.

ప్రతామ్య వా ప్రజ్వల వా ప్రణశ్య వా
సహస్రశో వా స్ఫుటితా మహీం వ్రజ. ౧౧౧
న తే కరిష్యామి వచ స్సుదారుణమ్
మ మాహితం కేకయరాజపాంసని

టీక॥ కేకయరాజపాంసని = కేకయరాజులనుజెఱుపుదానా! త్వం (అధ్యాహృతము)=నీవు; ప్రతామ్యవా= దుఃఖింపుము. ప్రజ్వలవా=మండుము.

ప్రణశ్యవా=నష్టవగుము. సహస్రశః=వేయిపఱియలై; స్ఫుటితా=పగిలినదానవై; మహీం = భూమిని; వ్రజవా=పొందుము.సుదారుణం= మిక్కిలియు భయంకరంబును;మమ = నాకు;అహితం=కీడు సేయునదియునగు; తే=నీయొక్క;వచః=మాటను; నకరిష్యామి=చేయను.

కేకయరాజకులంబున వారలను జెఅపుటకై పుట్టినదానా! నీవు దుఃఖంబు నొందుము;కోపంబునమండిపొమ్ము; పర్వతంబునుండి వేయిపఱియలుగా విఱిగి నేలంబడుము; ఏమైనను జేసికొనుము; నీవేమిచేసినను, బరమదారుణంబును, నాకుఁగీడుగావించునదియుఁగావున, నీవుకోరినదానినేఁ జేయుటలేదు.

అని, తాత్పర్యము.

క్షురోపమాం నిత్య మసత్ప్రియంవదాం
ప్రదుష్టభావాం స్వకులోపఘాతినీమ్. ౧౧౨
నజీవితుం త్వాం విషహేఽమనోరమాం
దిధక్షమాణాం హృదయం సబంధనమ్

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;క్షురోపమాం = మంగలకత్తితోఁబోలిక-గలదానవును; నిత్యం=ఎల్లప్పుడు; అసత్ప్రియంవదాం=అసత్యములయిన ప్రియవాక్యంబులఁ జెప్పుదానవును;ప్రదుష్టభావాం=మిక్కిలియుఁజెడుగుతలంపుగలదానవును;స్వకులోపఘాతినీం=నావంశమును జంపుదానవును; అమనోరమాం = మనసునకుసంతోషముసేయనిదానవును;సబంధనం=మూలముతోఁగూడిన, ప్రాణమేమనసునకు బంధనంబనివేదంబునందుఁజెప్పఁబడినదికావున ప్రాణముతోఁగూడినయనుట; హృదయం = మనసును ; దిధక్షమాణాం=దహింప గోరు దానవునగు ; త్వాం=నిన్ను; జీవితుం=బ్రతుకుటకు; నవిషహే=సహింపను.

మంగలకత్తియుంబోలె నతిక్రూరురాలవై యెప్పుడునుగపటప్రియవాక్యంబులువలుకుచు దుష్టాభిప్రాయంబుగలిగి,నాకులంబునునశింపఁజేయనిశ్చయించి నామనంబునకు దుఃఖంబుసేయుచు నాప్రాణంబును సౌహృదయంబును దహింపఁగోరుచున్ననీవు జీవించి యుండుటం, జూడనొల్లను.

అని, తాత్పర్యము.

న జీవితం మే ఽస్తి పునః కుత స్సుఖమ్
వినాత్మజే నాత్మవతః కుతో రతిః. ౧౧౩
మమాహితం దేవి న కర్తు మర్హసి
స్పృశామి పాదావపి తే ప్రసీద మే

టీక॥ మే=నాకు;జీవితం = ప్రాణమును; నాస్తి=లేదు. పునః=ఇంకను; సుఖం=సౌఖ్యము; కుతః = ఏడది? ఆత్మవతః= ప్రాణముగల ; మే(అధ్యాహృతము)=నాకు ; ఆత్మజేనవినా = కొడుకులేనప్పుడు; రతిః=సంతోషము; కుతః= ఏడది? దేవి = రాణివగు కైకేయీ! మమ=నాకు;హితం=కీడును; కర్తుం=చేయుటకు; నార్హసి= తగవు. తే=నీయొక్క; పాదావపి= చరణములనైనను; స్పృశామి=తాఁకెదను. మే=నాకొఱకు ; ప్రసీద=ప్రసన్నవగుము.

నేనుజీవించియేయుండనేరను;నాఁకికసుఖంబెక్కడిది? ఒకవేళజీవించియున్నను, నాకొడుకురాముండులేనప్పుడు నాకెక్కడిదిసంతోషము?నీవునాకుభార్యవు; కావున, నాకునీవుకీడుసేయరాదు; నీపాదంబులంబట్టుకొనెదను; నాకుఁ బ్రసన్నవగుము. అనిదశరథుండు కైకేయితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

స భూమిపాలో విలప న్ననాథవత్
స్త్రియా గృహీతో హృదయేఽతిమాత్రయా. ౧౧౪
పపాత దేవ్యా శ్చరణౌ ప్రసారితా
వుభా వసంస్పృశ్య యథాతుర స్తథా

టీక॥ భూమిపాలః= భూమినిబాలించునట్టి;సః= ఆదశరథుఁడు;అతిమాత్రయా = స్త్రీమర్యాదనువిడిచినట్టి; స్త్రియా=కైకేయిచేత ; హృదయే= మనసునందు; గృహీతః=గ్రహింపఁబడినవాఁడై;అనాథవత్=నాథుఁడులేనివానియట్లు; విలపన్ = ఏడ్చుచు;దేవ్యాః=కైకేయియొక్క; ప్రసారితౌ= చాఁచఁబడిన;చరణౌ=పాదములను;ఉభావపి = రెంటిని; అసంస్పృశ్య=

తాఁకక; ఆతురః=వ్యాధిగలవాఁడు; యథా=ఎట్లో; తథా = అట్లు; పపాత=పడెను.

భూమినిపాలించునట్టి దశరథుఁడు, స్త్రీమర్యాదనతిక్రమించియున్న కైకేయియధీనమయినమనసుగలవాఁడు, గావున, దాని నిగ్రహింపలేక, అనాథునియట్లు; విలపించుచు, "ఇతండు నమస్కరించునేమో, దానిఁగాకుండఁజేయవలె"నని, కైకేయితలంచి మఱియొకరిపరికరకుఁ బాదంబులం జాఁచుటవలన వానిస్పృశింపక, వ్యాధిగ్రస్తుండు, ఁ న్నట్టుండ దౌర్బల్యంబున, నేలంబడునట్లు, నేలంబడెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అయోధ్యాకాండే, ద్వాదశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, శ్రీపరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ, ద్వాదశసర్గ టీక,

ముగిసినది.



౨౨

త్ర యో ద శ స ర్గ ప్రా రం భః.

అతదర్హం మహారాజం శయాన మతథోచితమ్
యయాతి మివ పుణ్యాంతే దేవలోకాత్పరిచ్యుతమ్. ౧
అనర్థరూపా సిద్ధార్థా హ్యభీతా భయదర్శినీ
పున రాకారయామాస తమేవ వర మంగనా. ౨

టీక ॥ అనర్థరూపా=పాపస్వరూపురాలును; అసిద్ధార్థా—[illegible]డేఱ నిష్ప్రయోజనముగలదియును; అభీతా=భయములేనిదియును; అభయదర్శినీ=దశరథునకున్నభయమునుజూడనిదియును; లేక, భయదర్శినీ(అని, విభాగము)—భయమును బాపునదియును, భయమును గలుగఁ జేయునదియుననుట;

అంగనా=స్త్రీయగు కైకేయి; అతదర్హాం=అట్టిదుఃఖమునకుం దగనివాండును; శయానం=నేలనుబరుండియున్నవాండును; అతథోచితం=అట్లుండందగనివాండును; పుణ్యాంతే=పుణ్యముయొక్క నాశమునందు; దేవలోకాత్=స్వర్గమునుండి; పరిచ్యుతం=నేలంబడిన; యయాతిమివ(స్థితం)=యయాతియుంబోలెనున్నవాండునగు; మహారాజం=దశరథమహారాజును; పునః=మఱల; తం=ఆ; వరమేవ=వరమునుగూర్చియే; ఆకారయామాస=పిలిచెను.

అట్టిదుఃఖంబనుభవింపం దగనివాండును, అట్లు నేలంబరుండియుండందగనివాండును, పుణ్యంబంతయుం దఱిగిన పిమ్మటను భూమికి వచ్చిన యయాతియుంబోలెం బాపట్టుచున్నవాండునగు దశరథమహారాజుంజూచి, పాపిష్ఠురాలై సిద్ధంబుగాని ప్రయోజనంబుంగలదై బరాపవాదమునుండి భయంబుపడక, దశరథునకుం గల్గినయుండు భయంబును గణింపక, దశరథుని వేంపించుచున్న కైకేయి, మఱల, నావరంబులిమ్మని యని చెప్పుటకై మఱల సంబోధించెను.

అని, తాత్పర్యము.

త్వం కత్థసే మహారాజ సత్యవాదీ దృఢవ్రతః
మమ చేమం వరం కస్మాద్విధారయితు మిచ్ఛసి. ౩

టీక॥ మహారాజ=దశరథమహారాజా! త్వం=నీవు; "సత్యవాదీ=సత్యమునేచెప్పువాండను; దృఢవ్రతః=వేఱుపాటులేనివ్రతంబుగలవాండను" ఇతి (అధ్యాహృతము)=అని; కత్థసే=పొగడుకొనుచున్నావు, కస్మాత్=ఎందువలన; మమ=నాయొక్క; ఇమం=ఈ; వరంచ=వరమును; విధారయితుం=గట్టిగాంబట్టుకొనుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు!

దశరథమహారాజా! నీవు, "నేను దబ్బులాడను, పట్టినవ్రతంబువిడువను" అని, నిన్నుం బొగడుకొనుచున్నావే; ఎందువలన, నాకిచ్చెదనని చెప్పిన వరంబు నివ్వకపోల్లక, గట్టిగాంబట్టుకొనియున్నావు? అని, కైకేయి, దశరథునితోం జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు కైకేయ్యా రాజా దశరథ స్తదా
ప్రత్యువాచ తతః క్రుద్ధో ముహూర్తం విహ్వలన్నివ. ౪

టీక॥ తదా=అప్పుడు; రాజా=రాజయిన; దశరథస్తు=దశరథుండును; కైకేయ్యా=కైకేయిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తతః=అంతట; క్రుద్ధః=కోపంబునొందినవాఁడై; ముహూర్తం=కొంచెముసేపు; విహ్వలన్=మూర్ఛనొందుచు, ("ఇవ" అనునదివాక్యాలంకారార్థము); ప్రత్యువాచ=బదులుచెప్పెను.

దశరథమహారాజు, అప్పుడు, కైకేయి చెప్పినమాటవిని, కోపంబునొంది, కొంచెముసేపుమూర్ఛనోయి, యంతఁదెలివొంది, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మృతే మయి గతే రామే వనం మనుజపుంగవే
హంతానార్యే మమామిత్రే సకామా సుఖినీ భవ. ౫

టీక॥ హంత=ఆశ్చర్యము! అనార్యే=దుష్టురాలా! మమ=నాకు; అమిత్రే=శత్రువైనదానా! మయి=నేను; మృతే=చావఁగా; మనుజపుంగవే=మనుష్యశ్రేష్ఠుండగు; రామే=రాముండు; వనం=అడవిని; గతే=పొందఁగా; త్వం (అధ్యాహృతము) నీవు; సకామా=కోరికతోఁగూడినదానవై; సుఖినీ=సుఖముగలదానవు; భవ=అగుము.

ఆశ్చర్యము! ఇట్టిక్రౌర్యము నేనెచ్చటనుజూడలేదు! దుష్టురాలా! నాకు శత్రువైనదానా! నేనుమరణంబునొంది, రాముండువనంబునకుఁబోయిన పిమ్మట, నీవు, నీకోర్కెలీడేర్చుకొని, సుఖంబుగానుండుము.

అని, తాత్పర్యము.

స్వర్గేఽపి ఖలు రామస్య కుశలం దైవతై రహమ్
ప్రత్యాదేశా దభిహితం ధారయిష్యే కథం బత. ౬

టీక॥ అహం=నేను; స్వర్గేఽపిఖలు=స్వర్గమందుఁగూడ; రామస్య=రామునియొక్క; కుశలం=క్షేమమును గూర్చి; దైవతైః=దేవతలచేత; ప్రత్యా

దేశాత్=తిరస్కారమునలన; అభిహితం=చెప్పఁబడినమాటను; కథం=ఎట్లు; ధారయిష్యే=సహింతును? బత=అయ్యో!

నేనుస్వర్గమునకుఁబోయినను, అచ్చట, దేవతలు, రాముని క్షేమంబును గూర్చి, తిరస్కారపూర్వకంబుగాఁజెప్పుమాటలను, నేనెట్లుసహించుచుందును? అచ్చటను, నాకు దుఃఖమే కలుగును; అయ్యో! అని, తాత్పర్యము.

కైకేయ్యాః ప్రియకామేన రామః ప్రవ్రాజితో మయా
యది సత్యం బ్రవీమ్యేత త్తదసత్యం భవిష్యతి. ౭

టీక ॥ కైకేయ్యాః=కైకేయియొక్క; ప్రియకామేన=సంతోషమునుగోరునట్టి; మయా=నాచేత; రామః=రాముఁడు; ప్రవ్రాజితః=అడవికిఁబంపఁబడెను." సత్యం=దబ్బఱకాని; ఏతత్=ఈమాటను; బ్రవీమియది=చెప్పుదునేని; తత్=అది, రామునితోనేను "నీకు రేపురాజ్యంబొసంగెదను" అనిచెప్పినది; అసత్యం=అబద్ధము; భవిష్యతి=కాఁగలదు.

"కైకేయికిమున్నునేను రెండువరంబులిచ్చియుంటిని, ఆవరంబులలో నొకటికిఁగా రాముని నడవికిఁబంపినాను" అని సత్యంబైనయీమాటను, చెప్పుదునేని, యింతకుమున్నునేను రామునితో "నీకు రేపురాజ్యంబిచ్చెదను" అనిచెప్పినమాట, యసత్యమగును.

అని, తాత్పర్యము.

అపుత్త్రేణ మయా పుత్త్రశ్శ్రమేణ మహతా మహాన్
రామో లబ్ధో మహాబాహు స్స కథం త్యజ్యతే మయా. ౮

టీక॥ అపుత్త్రేణ=కొడుకులేనట్టి; మయా=నాచేత; మహతా=అధికమయిన; శ్రమేణ=ప్రయాసముచేత; మహాన్=పూజ్యుఁడయిన, దుర్లభుఁడైనయనుట; పుత్త్రః=కొడుకగు; మహాబాహుః=పెద్దచేతులుగల; రామః=రాముఁడు; లబ్ధః=పొందఁబడినాఁడు. సః=అట్టిరాముఁడు; మయా=నాచేత; కథం=ఎట్లు; త్యజ్యతే=విడువఁబడుచున్నాఁడు?

నేను మున్ను కొడుకులులేకుండి, బహుశ్రమంబులుపడిదుర్లభుండుమహా

బాహుండునగు, రామునిఁ, గొడుకును గాఁబడసినాను; అట్టిరాముని, నేనెట్లు విడువఁగలను?
అని, తాత్పర్యము.

శూరశ్చ కృతవిద్యశ్చ జితక్రోధః క్షమాపరః
కథం కమలపత్రాక్షో మయా రామో వివాస్యతే. ౯

టీక॥శూరశ్చ=యుద్ధమునందు భయముపడనివాఁడును;కృతవిద్యః = నేర్వఁబడినవిద్యలుగలవాఁడును;జితక్రోధః=జయింపఁబడినకోపముగలవాఁడును;క్షమాపరః = ఓర్పునందాసక్తుఁడును; కమలపత్రాక్షః = తామరపూరేకులంబోలుకండ్లుగలవాఁడునగు ; రామః=రాముండు ; కథం=ఎట్లు;మయా=నాచేత; వివాస్యతే= అడవికిఁబంపఁబడును?

యుద్ధమునం దెంతమాత్రముభయంబులేనివాఁడై, సమస్తవిద్యలు నేర్చి, కోపంబునుజయించి, యోర్పుగలిగి, తామరపూరేకులంబోలువిశాలంబులగు నేత్రంబులతో వెలుంగుచుండు, రాముని, నేనెట్లడవికిఁబంపుదును? అని, తాత్పర్యము.

కథ మిందీవరశ్యామం దీర్ఘబాహుం మహాబలమ్
అభిరామ మహం రామం ప్రేషయిష్యామి దండకాన్. ౧౦

టీక॥అహం = నేను;ఇందీవరశ్యామం=నల్లకలువలుంబోలె నల్లనివాఁడును;దీర్ఘబాహుం=నిడుపైనచేతులుగలవాఁడును;మహాబలం=అధికమయినబలముగలవాఁడును; అభిరామం=సుందరుండునగు;రామం=రాముని; కథం=ఏట్లు; దండకాన్= దండకారణ్యమును గూర్చి;ప్రేషయిష్యామి=పంపఁగలను.

నల్లకలువలుంబోలె శ్యామవర్ణంబుగలిగి,దీర్ఘబాహుండై, యధికబలంబుగలవాఁడై, సర్వాంగసుందరుండై, యుండురాముని, నేనెట్లు, దండకారణ్యంబున,కంపుదును?
అని, తాత్పర్యము.

సుఖానా ముచితస్యైవ దుఃఖై రనుచితస్యచ
దుఃఖం నామా నుపశ్యేయం కథం రామస్య ధీమతః. ౧౧

టీక॥సుఖానామేవ = సుఖములకు మాత్రమె; ఉచితస్య=తగినవాఁడును; దుఃఖైః= (షష్ఠ్యర్థమందుఁదృతీయ) దుఃఖములకు;అనుచితస్యచ=తగనివాఁడును;ధీమతః=బుద్ధిమంతుండునగు; రామస్య=రామునియొక్క;దుఃఖం=దుఃఖమును; కథంనామ=ఎట్లు?పశ్యేయం=చూతును?

సుఖంబులనుభవించుటకు మాత్రమె తగినవాఁడును, దుఃఖంబనుభవింపఁదగనివాఁడునుబుద్ధిమంతుండునగు రామునికి దుఃఖంబురాఁగా, దాని, నేనెట్లుచూడఁగలను? అని, తాత్పర్యము.

యది దుఃఖ మకృత్వా ద్య మమ సంక్రమణం భవేత్
అదుఃఖార్హస్య రామస్య తత స్సుఖ మవాప్నుయామ్. ౧౨

టీక॥అద్య=ఇప్పుడు;అదుఃఖార్హస్య=దుఃఖమునకుఁదగినవాఁడుకానట్టి; రామస్య=రామునకు;దుఃఖం = దుఃఖమును; అకృత్వా=చేయక; మమ=నాకు;సంక్రమణం=మరణము; భవేద్యది=అగునేని;తతః = అంతట;సుఖం=సుఖమును; అవాప్నుయాం=పొందుదును.

ఇప్పుడు, దుఃఖమనుభవించుటకెంత మాత్రము దగినవాఁడుకానట్టి రామునకుదుఃఖంబు సేయకయె, నేనుమరణంబునొందుదునేని,యదియె, నాకుసుఖంబు. అని, తాత్పర్యము.

నృశంసే పాపసంకల్పే రామం సత్యపరాక్రమమ్
కిం విప్రియేణ కైకేయి ప్రియం యోజయసే మమ. ౧౩

టీక॥నృశంసే=క్రూరురాలా! పాపసంకల్పే = పాపముసేయవలెననునభిప్రాయముగలదానా! కైకేయి=కైకేయీ! మమ=నాకు;ప్రియం = ఇష్టుండును; సత్యపరాక్రమం=ఎచ్చటనువ్యర్థముకాని పరాక్రమంబుగలవాఁడునగు; రామం=రాముని; కిం=ఎందుకొఱకు; విప్రియేణ=కీడుతో; యోజయసే=చేర్చెదవు?

దయలేనిదానా ! పాపిష్ఠురాలా! కైకేయీ ! నాకుఁబ్రియుండునుసత్యపరాక్రముండునగురామునరణ్యంబునకుఁబోవలయుననియేలకోరుచున్నావు? అని, తాత్పర్యము.

అకీర్తి రతులాలోకే ధ్రువః పరిభవశ్చ మే

టీక॥ మే(అధ్యాహృతము)=నాకు; అతులా=సరిలేని; అకీర్తిః=అపకీర్తి యును; ధ్రువః= నిత్యమయిన; పరిభవశ్చ = అవమానమును; భవిష్యతి=(అధ్యాహృతము)= కాఁగలదు.

ఇందువలన,నాకు,ఇంక నెచ్చటను సాటిలేనియపకీర్తియును, ఇంకనెప్పటికిని దలఁగని,యవమానంబును, గలుగును. అని,దశరథుండు,కైకేయికిం జెప్పెను. అని, తాత్పర్యము.

తథా విలపత స్తస్య పరిభ్రమిత చేతసః. ౧౪
అస్త మభ్యగమ త్సూర్యో రజనీచాభ్య వర్తత

టీక॥పరిభ్రమిత చేతసః=తిరుగుడు నొందినమనసుగల; తస్య=ఆదశరథుఁడు;తథా=అట్లు; విలపతః=ఏడ్చుచుండఁగా;సూర్యః=సూర్యుఁడు;అస్తం=అస్తమయమును;అభ్యగమత్=పొందెను.రజనీచ=రాత్రియును; అభ్యవర్తత=వచ్చినది.

అట్లు,దశరథుండు తిరుగుడు వడిన హృదయంబుతో,విలపించు చుండఁగా, సూర్యుండ స్తమించెను;రాత్రివచ్చినది. అని, తాత్పర్యము.

సా త్రియామా తథార్తస్య చంద్రమండల మండితా. ౧౫
రాజ్ఞో విలపమానస్య న వ్యభాసత శర్వరీ

టీక॥ చంద్రమండలమండితా=చంద్రమండలముచే నలంకరింపబడినదియును; త్రియామా=మూఁడుయామములు గలదియునగు;సా=ఆ; శర్వరీ=రాత్రి; తథా=అట్లు; ఆర్తస్య=దుఃఖితుఁడును; విలపమానస్య=ఏడ్చుచున్నవాఁడునగు;తస్య=ఆ; రాజ్ఞః=రాజైనదశరథునకు;నవ్యభాసత=శోభింపలేదు;సంతోషముగల్గింపలేదనుట.

ఆ రాత్రి,చంద్రమండలముచేనలంకరింపఁబడినదయ్యు,నట్లుదుఃఖితుండయి విలపించుచున్న, యాదశరథమహారాజునకు,ఎంతమాత్రము,సంతోషము గల్గింపలేదు.

అని, తాత్పర్యము.

తథైవోష్ణం వినిశ్శ్వస్య వృద్ధో దశరథో నృపః. ౧౬
విలలా పార్తవ ద్దుఃఖం గగనాసక్తలోచనః

టీక॥ వృద్ధః=ముసలివాఁడగు; నృపః= మనుష్యులఁబాలించునట్టి; దశరథః=దశరథమహారాజు; తథైవ=అలాగే; ఉష్ణం=వేఁడిగా; వినిశ్శ్వస్య=నిట్టూర్పులువుచ్చి; ఆర్తవత్=మహారోగాదులచేఁబీడింపఁబడువాడువలె; గగనాసక్తలోచనః=ఆకాశమునందుసంబంధించినకండ్లుగలవాఁడై; దుఃఖం=వినువారికిదుఃఖముకల్గునట్లుగా; విలలాప=ఏడ్చెను.

వృద్ధుండగు నాదశరథమహారాజు, అలాగే వేఁడిట్టూర్పులువుచ్చి, రోగాదులచేఁబీడింపఁబడినవానివలెనే, నాకాశంబుఁజూచి, వినువారికిదుఃఖముకల్గునట్లుగా, నిట్లని, విలపించెను.

అని, తాత్పర్యము.

నప్రభాతం త్వయేచ్ఛామి నిశే నక్షత్రభూషణే. ౧౭
క్రియతాం మేదయా భద్రే మయాఽయం రచితోఽంజలిః

టీక॥నక్షత్రభూషణే=నక్షత్రములే యాభరణములుగాఁగల; నిశే=రాత్రీ! త్వయా=నీచేత; ప్రభాతం=తెల్లవాఱుటను; నేచ్ఛామి=ఇచ్ఛింపను. మే=నాకొఱకు; దయా=కృపను; క్రియతాం=చేయఁబడుఁగాక. భద్రే=మంగళకరవగురాత్రీ! మయా=నాచేత; అయం=ఈ; అంజలిః=చేమోడ్పు; రచితః=చేయఁబడెను.

నక్షత్రములచే నలంకరింపఁబడిన రాత్రీ! నీవు తెల్లవాఱవలదు; నాయందు దయనుంచుము; ఇదిగో, చేతులుమొగిచ్చి నమస్కరించుచున్నాను.

అని, తాత్పర్యము.

అథవా గమ్యతాం శీఘ్రం నాహ మిచ్ఛామి నిర్ఘృణామ్. ౧౮
నృశంసాం కైకయీం ద్రష్టుం యత్కృతే వ్యసనం మహత్

టీక॥అథవా = అటుగాదేని; శీఘ్రం=శీఘ్రముగా; గమ్యతాం=పోవు

టయగుఁగాక. యత్కృతే=ఎవ్వతెకుఁగా; మహత్=గొప్పదైన; వ్యసనం=దుఃఖము; భవతి (అధ్యాప్యతము)=అగుచున్నదో; తాం=అట్టి; నిఘృణాం=దయలేనిదియు; నృశంసాం=క్రూరురాలునగు; కైకేయీం=కైకేయిని; ద్రష్టుం=చూచుటకు; అహం=నేను; నేచ్ఛామి=ఇచ్ఛింపను.

అటుగాదేని, యీరాత్రి శీఘ్రము గాఁదెల్లవాఱుఁగాక; నాకిట్టిమహాదుఃఖమునుగల్గించునట్టి, నిర్దయురాలును, క్రూరురాలునగుకైకేయింజూడనాకిష్టములేదు. అని, దశరథుండు, విలపించెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా తతో రాజా కైకేయీం సంయతాంజలిః. ౧౯
ప్రసాదయామాస పునః కైకేయీం చేద మబ్రవీత్

టీ॥ రాజా=దశరథమహారాజు; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; తతః=అటుపిమ్మట; సంయతాంజలిః=కట్టఁబడినచేమోడ్పుగలవాఁడై; కైకేయీం=కైకేయిని; పునః=మఱల; ప్రసాదయామాస=వేఁడుకొనెను; కైకేయీం=కైకేయినిగూర్చి; ఇదంచ=ఈమాటను; అబ్రవీత్=పలికెను.

ఇట్లువిలపించి, యంత, దశరథమహారాజుచేతులుమొగిడ్చికొని, మఱలఁ గైకేయినినుసయింపుచుఁ, గైకేయితో నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సాధువృత్తస్య దీనస్య త్వద్గతస్య గతాయుషః. ౨౦
ప్రసాదః క్రియతాం దేవి భద్రే రాజ్ఞో విశేషతః.

టీ॥ భద్రే=మంగళస్వరూపిణివగు; దేవి=రాణివయినకైకేయీ; సాధువృత్తస్య=మంచియాచారముగలవాఁడను; దీనస్య=దుఃఖితుండను; త్వద్గతస్య=నిన్నుఁబొందినవాఁడను; గతాయుషః=పోయినయాయుస్సుగలవాఁడను, అంతయుఁగడచికొంచెముమిగిలియున్న జీవితకాలముగలవాఁడనను టః; విశేషతః=విశేషమువలన; రాజ్ఞః=రాజునగునాకు; ప్రసాదః=అనుగ్రహము; క్రియతాం=చేయుము.

కైకేయీ! నీవుమంగళస్వరూపిణి

యీ! ప్రసీద=ప్రసన్నవగుము. మే=నాయొక్క, (కోపముకైన) మరాజః=రాముడు; త్వద్దత్తం=నీచేనీయ్యఁబడిన; అప్యయం=నాశములేని; రాజ్యం=దొరతనమును; లభతాం=పొందుఁగాక. పరం=అధికమయిన; యశః=కీర్తిని; అవాప్నుహి=పొందుము

నల్లని కడకన్నులుగల కైకేయీ! కోపంబు విడువుము; నీవే వరబలంబున నా వలన రాజ్యంబు గ్రహించి మఱల నక్షయంబగు నారాజ్యంబు రామునకిచ్చి, ముల్లోకంబులను మిక్కుటమైన కీర్తిం బొందుము. అని, తాత్పర్యము.

మమ రామస్య లోకస్య గురూణాం భరతస్యచ. ౨౩
ప్రియ మేత ద్గురు శ్రోణి కురు చారు ముఖేక్షణే

టీక॥ గురుశ్రోణి= పెద్దపిఱుందులు గలదానవు; చారుముఖేక్షణే= సుందరములయినముఖంబును గన్నులుగలదానవగు కైకేయీ! మమ=నాకును; రామస్య=రామునకును; లోకస్య=ప్రపంచమునకును ; గురూణాం=పెద్దలకును; భరతస్యచ=భరతునకును ; ప్రియం=ఇష్టమయిన; ఏతత్=దీనిని; కురు=చేయుము.

పెద్దపిఱుందులుగలదానవు సుందర ముఖంబును సుందరములయిన కన్నులుగలదానవగు కైకేయీ! నీవు వరంబునకై నావలన రాజ్యంబు గ్రహించి మఱలనీవే రామునకిత్తువేని, నాకు రామునకును ప్రపంచమునకును గురువులకును భరతునకును, సంతోషంబగును; ఇట్లుచేయుము. అని, దశరథుండు కైకేయితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

విశుద్ధభావస్య సుదుష్టభావా
తామ్రేక్షణ స్యాశ్రుకలస్య రాజ్ఞః. ౨౪
శ్రుత్వా విచిత్రం కరుణంవిలాపమ్
భర్తుర్నృశంసా న చకార వాక్యమ్

టీక ॥ సుదుష్టభావా=మిక్కిలియుచెడ్డహృదయముగలదియు ; నృశంసా=

క్రూరురాలునగు కైకేయి; విశుద్ధభావస్య = పరిశుద్ధమయినహృదయము గలవాఁడును; తామ్రేక్షణస్య = ఎఱ్ఱనికంట్లుగలవాఁడును; అశ్రుకలస్య = కన్నీళ్లతో నిండినవాఁడునగు; రాజ్ఞః = దశరథమహారాజుయొక్క; విచిత్రం = నానావిధంబును; కరుణం = వినువారికి దయగల్గించునదియునగు; విలాపం = ఏడ్పును; శ్రుత్వా = విని; భర్తుః = పెనిమిటియొక్క; వాక్యం = మాటను; నచకార = చేయలేదు.

మిక్కిలియుదుష్టమయిన హృదయముగలదియును, క్రూరురాలునగు కైకేయి, పరిశుద్ధహృదయుండును, దుఃఖంబుచే నెఱ్ఱనైనకంట్లుగల్గి, కన్నీళ్లతో నిండియుండువాఁడునగు దశరథమహారాజు, నానావిధములుగా వినువారికిని దయగల్గునట్లుగా, నెంతవిలపించినను, అతనిమాటప్రకారము, చేయలేదు.

అని, తాత్పర్యము.

తత స్స రాజా పునరేవ మూర్ఛితః
ప్రియా మదుష్టాం ప్రతికూలభాషిణీమ్. ౨౫
సమీక్ష్య పుత్రస్య వివాసనం ప్రతి
క్షితౌ విసంజ్ఞో నిపపాత దుఃఖితః

టీక॥ తతః = అటుపిమ్మట; సః = ఆ; రాజా = దశరథమహారాజు; అదుష్టాం = పూర్వముదుష్టురాలుకానిదియును; పుత్రస్య = కొడుకైన రామునియొక్క; వివాసనంప్రతి = అడవికిఁ బంపుటనుగూర్చి; ప్రతికూలభాషిణీం = ప్రతికూలముగా మాటలాడుచున్నదియునగు; ప్రియాం = ప్రియురాలిని; సమీక్ష్య = చక్కఁగాఁజూచి; దుఃఖితః = దుఃఖమునొందినవాఁడై; పునరేవ = మఱలనే; మూర్ఛితః = మూర్ఛనొందినవాఁడై; విసంజ్ఞః = తెలివిలేనివాఁడై, క్షితౌ = భూమియందు; నిపపాత = పడెను.

అంత, నాదశరథమహారాజు, పూర్వముతనకుమిగుల ననుకూలయైపతివ్రతగానున్న యాకైకేయి, యిప్పుడు, రామునడవికిఁ బంపుమని యంతప్రతికూలముగామాటలాడుటంజూచి, చేయునదిదోఁచక, దుఃఖమున, మఱల మూర్ఛనొంది, దేహంబుమఱచి నేలంబడెను.

అని, తాత్పర్యము.

ఇతీవ రాజ్ఞో వ్యథితస్య సా నిశా
జగామ ఘోరం శ్వసతో మనస్వినః. ౨౬
విబోధ్యమానః ప్రతిబోధనం తదా
నివారయామాస స రాజ సత్తమః

టీక॥ఇతి=ఇట్లు; ("ఇవ" అనునది వాక్యాలంకారార్థము); మనస్వినః= మంచిమనసుగల; రాజ్ఞః= దశరథుఁడు; వ్యథితస్య = దుఃఖితుండై; ఘోరం = భయంకరముగా; శ్వసతః=నిట్టూర్పులువుచ్చుచుండఁగా; సా= ఆ; నిశా=రాత్రి; జగామ=పోయినది. తదా=అప్పుడు; సః=ఆ ; రాజసత్తమః=రాజశ్రేష్ఠుండగు దశరథుండు;విబోధ్యమానః= మేలుకొలుపఁబడుచున్నవాఁడై; ప్రతిబోధనం=మేలుకొలుపుటను; నివారయామాస= నిలిపెను.

ఇట్లు మంచి మనసుగల దశరథ మహారాజు, దుఃఖితుండై చూపరులకు భయము గల్గునట్లు నిట్టూర్పులు వుచ్చుచుండఁగా నేయా రాత్రి, గడచినది;అంతట ప్రాతఃకాలమునందు, వైతాళిక ప్రభృతుల దశరథుని మేలుకొలుప నారంభింపఁగా నే,దశరథుఁడట్లు మేలుకొలుపనక్కఱ లేదని యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే , త్రయోదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానం బగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ త్రయోదశసర్గటీక,
ముగిసినది.



శ్రీ

చతుర్దశసర్గప్రారంభః.

పుత్రశోకార్దితం పాపా విసంజ్ఞం పతితం భువి
వివేష్టమాన ముద్వీక్ష్య సైక్ష్వాక మిద మబ్రవీత్. ౧

టీక॥ పాపా= పాపము సేయునట్టి; సా=ఆకైకేయి; పుత్రశోకార్దితం=కొడుకునుగుఱించిన దుఃఖముచేఁ బీడింపఁబడినవాఁడును; విసంజ్ఞం=తెలివిలేనివాఁడును; భువి=నేలయందు; పతితం = పడినవాఁడును; వివేష్టమానం= పొరలుచున్న వాఁడునగు ; ఐక్ష్వాకం = ఇక్ష్వాకువంశమునందుఁబుట్టినదశరథుని ; ఉద్వీక్ష్య=చూచి ; ఇదం=ఈమాటను;అబ్రవీత్ =పలికెను.

పాపిష్ఠురాలయినయాకైకేయి,పుత్రదుఃఖమునంబీడింపఁబడినవాఁడై, మైమఱచి నేలంబడిపొరలుచున్నదశరథ మహారాజుంజూచి,యిట్లని,చెప్పెను.

అని,తాత్పర్యము.

పాపం కృత్వైవ కిమిదం మమ సంశ్రుత్య సంశ్రవమ్
శేషే క్షితితలే సన్న. స్థిత్యాం స్థాతుం త్వ మర్హసి. ౨

టీక॥త్వం=నీవు;మమ=నాకు; సంశ్రవం=ప్రతిజ్ఞను;సంశ్రుత్య= ప్రతిజ్ఞచేసి,చేసియనుట;పాపం = పాపమును;కృత్వైవ=చేసియె;సన్నః= దుఃఖమునొందినవాఁడవై ;క్షితితలే=భూతలమునందు; శేషే= పరుండియున్నావు; ఇదం=ఇది;కిం = ఎందుకు ? స్థిత్యాం=మర్యాదయందు;స్థాతుం=ఉండుటకు;అర్హసి=తగుదువు.

నీవునాకువరంబిచ్చెదనని ప్రతిజ్ఞచేసి,ప్రతిజ్ఞతప్పుటచేనధర్మంబు సేయాచరించి, యిట్లుదుఃఖితుండవై నేలంబరుండియున్నావు; దీననేమియుఁ బ్రయోజనంబులేదు; నీవు సత్యంబు పరిపాలించుట యను మర్యాదనవలంబింపుము.

అని,తాత్పర్యము.

ఆహు స్సత్యంహి పరమం ధర్మం ధర్మ విదో జనాః
సత్య మాశ్రిత్య హి మయా త్వంచ ధర్మం ప్రచోదితః. ౩

టీక॥ధర్మవిదః=ధర్మము నెఱింగిన;జనాః=జనులు;సత్యం= సత్యమును; పరమం=ఉత్కృష్టమయిన ; ధర్మం = ధర్మమునుగా; ఆహుహి=చెప్పుచున్నారుగదా ! మయాచ=నాచేతను; సత్యం=సత్యరూపమయిన; ధర్మం=ధర్మమును; ఆశ్రిత్యహి=అవలంబించియే; త్వం = నీవు; ప్రచోదితః=ప్రేరేపింపఁబడినావు.

ధర్మము నెఱింగిన పెద్దలు "సత్యంబే పరమధర్మం" బనిచెప్పుదురుగదా! నేనుసత్యరూపంబగు పరమధర్మము నవలంబించియే, వరం బిమ్మని, నిన్నడిగినాను.

అని, తాత్పర్యము.

సంశ్రుత్య శైబ్య శ్శ్యేనాయ స్వాం తనుం జగతీపతిః
ప్రదాయ పక్షిణే రాజన్ జగామ గతి ముత్తమామ్. ౪

టీక॥ రాజన్ = దశరథమహారాజా! జగతీపతిః= భూమికిప్రభువైన; శైబ్యః=శైబ్యుండనురాజు;సంశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి;పక్షిణే=పక్షియయిన; శ్యేనాయ=డేగకొఱకు;స్వాం=తనదైన;తనుం=దేహమును; ప్రదాయ=ఇచ్చి;ఉత్తమాం=శ్రేష్ఠమయిన; గతిం= స్థానములను;జగామ=పొందెను.

దశరథమహారాజా ! మున్ను శైబ్యుండనురాజు ప్రతిజ్ఞచేసి, దానిప్రకారము , పక్షియయిన డేగకొఱకుఁ దనదేహముఁగోసియిచ్చి , యుత్తమలోకంబుం, బొందెను.

అని, తాత్పర్యము.

తథా హ్యలర్క స్తేజస్వీ బ్రాహ్మణే వేదపారగే
యాచమానే స్వకే నేత్రే ఉద్ధృత్యా౽విమనా దదౌ. ౫

టీక॥ తథా=అట్లు; తేజస్వీ= అధికమయిన ప్రభావముగలట్టి అలర్కః=

అలరుచుండనువాఁడు; వేదపారగే=వేదములయంతము నెఱింగిన ; బ్రాహ్మణే=బ్రాహ్మణుఁడు; స్వకే=తనవైన; నేత్రే=కండ్లను; యాచమానే=అడుగఁగా; అవిమనాః = దుఃఖములేనివాఁడై; ఉద్ధృత్య=పెఱికి;దదౌహి= ఇచ్చెనుగదా!

అట్లు , మహాప్రభావుండగు నలర్కుఁడు, తననేత్రంబుల వేదపారగుండగు నొకబ్రాహ్మణుడు యాచింపఁగా, నెంతమాత్రమును మనంబునదుఃఖంబునొందక , తననేత్రంబులం బెఱికి, ఆబ్రాహ్మణునకిచ్చెను.

అని, తాత్పర్యము.

సరితాంతు పతి స్స్వల్పాం మర్యాదాం సత్య మన్వితః
సత్యానురోధా త్సమయే స్వాం వేలాం నాతివర్తతే. ౬

టీక॥ సరితాంతు=నదులకును; పతిః=ప్రభుండగుసముద్రుండు; సత్యం=సత్యమును; అన్వితః=పొందినవాఁడై; సమయే=వృద్ధికాలమునందు; సత్యానురోధాత్=సత్యముయొక్క యనుసరించుటవలన; స్వల్పాం=మిక్కిలియుఁ జిన్నదియగు; మర్యాదాం=తనకుఁ బొలిమేరయయిన; స్వాం= తనదైన; వేలాం=గట్టును; నాతివర్తతే= అతిక్రమింపఁడు.

నదులకన్నిటికిని బ్రభువయిన సముద్రుండును సత్యంబుననుసరించియె, తనకువృద్ధికలుగు కాలంబులందును,మిక్కిలియుఁ జిన్నదైనచెలియలి కట్టను, దాఁటకున్నాఁడు. అని, తాత్పర్యము.

సత్య మేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః
సత్యమేవా క్షయా వేదా స్సత్యేనైవా ప్యతే పరమ్. ౭

టీక॥ సత్యం=సత్యము; ఏకపదం=ముఖ్యమైనప్రాప్యస్థానంబగు, లేక, ఒకపదమైన, ఓంకారరూపమైనయనుట; బ్రహ్మ=బ్రహ్మము. సత్యే=సత్యమునందు;ధర్మః=ధర్మము;ప్రతిష్ఠితః=స్థాపింపఁబడినది. అక్షయాః=నాశములేని; వేదాః=వేదములు;సత్యమేవ=సత్యమే, సత్యమునే చెప్పుచున్నవనుట. సత్యేనైవ

వ=సత్యముచేతనే;పరం = శ్రేష్ఠప్రయోజనము; ఆప్యతే= పొందఁబడుచున్నది.

సత్యమే, పరమప్రాప్యంబును ఓంకారరూపంబునగు బ్రహ్మము; సత్యమునందే, ధర్మావంశయుఁ బ్రతిష్ఠింపఁబడియున్నది; నిత్యములగు వేదములన్నియు సత్యమేప్రధానమనిచెప్పుచున్నవి; సత్యమున్నచో, పరమ పురుషార్థంబగు మోక్షము నొందవచ్చును. అని, తాత్పర్యము.

సత్యం సమనువర్తస్వ యది ధర్మే ధృతా మతిః
సఫల స్సవరో మేస్తు వరదో హ్యసి సత్తమ. ౮

టీక॥సత్తమ=శ్రేష్ఠుఁడవగుదశరథుఁడా!ధర్మే=ధర్మమునందు; మతిః=బుద్ధి;ధృతాయది=ధరింపఁబడినదగునేని,స్థిరమగునేనియనుట;సత్యం = సత్యమును;సమనువర్తస్వ=అనుసరింపుము. మే=నాయొక్క;సః=ఆ ; వరః=వరము;సఫలః=ఫలముతోఁగూడినది ; అస్తు=అగుఁగాక.వరదః = వరంబులనిచ్చువాఁడవు;అసిహి = అగుచున్నావుగదా!

నీవు,అందఱిలోను శ్రేష్ఠుండవనివినుతికెక్కినవాఁడవు; నీకుధర్మమునందు బుద్ధిస్థిరంబుగానుండునేని,సత్యంబునకన్ననధికంబగునొండు ధర్మంబు లేదు కావున, సత్యంబుననుసరింపుము;నేను గోరినవరంబుసఫలముగాఁ జేయుము; నీవందఱికిని వరంబులనిచ్చువాఁడవు గదా!అని, తాత్పర్యము.

ధర్మస్యేహాభికామార్థం మమ చైవాభిచోదనాత్
ప్రవ్రాజయ సుతం రామం త్రిః ఖలు త్వాం బ్రవీ మ్యహమ్. ౯

టీక॥ఇహ=ఇప్పుడు; ధర్మస్య=ధర్మముయొక్క;అభికామార్థం=కోరుటకొఱకు,సిద్ధించుటకొఱకనుట; మమ=నాయొక్క;అభిచోదనాచ్చైవ = ప్రేరేపించుటవలనను;సుతం=కొడుకైన;రామం=రామునిని;ప్రవ్రాజయ= అడవికిఁబంపుము. అహం=నేను;త్వాం=నిన్నుగూర్చి;త్రిః=మూఁడుమాఱులు;

బ్రవీమిఖలు=చెప్పుచున్నానుగదా! ఇప్పుడు, ధర్మార్థంబుసిద్ధించుట కొఱకును, నేను బ్రేరించుటవలనను, నీకొడుకు సురాముడడవికిఁబంపుము; నేనునీకు ముమ్మాఱులుచెప్పుచున్నాను. అని, తాత్పర్యము.

సమయంచ మమార్యేమం యది త్వం న కరిష్యసి
అగ్రత స్తే పరిత్యక్తా పరిత్యక్ష్యామి జీవితమ్. ౧౩

టీక॥ ఆర్య=పూజ్యుఁడవగు దశరథుఁడా! త్వం=నీవు; మమ = నాయొక్క; ఇమం=ఈ; సమయంచ = ప్రతిజ్ఞను; నకరిష్యసియది=చేయవేని; అహం (అధ్యాహృతము)=నేను ; పరిత్యక్తా=విడువఁబడినదాననై ; తే=నీయొక్క; అగ్రతః=ముందట; జీవితం= ప్రాణమును ; పరిత్యక్ష్యామి = విడిచెదను.

పూజ్యుఁడవగుదశరథుఁడా! నీవు నేనుగోరినట్లు రాముని డవికిఁ బంపకుందువేని, నేను నీచే విడువఁబడిన దాననై, జీవింపఁజాలను; నీయెదుటనే ప్రాణంబులువిడిచెదను. అని, కైకేయి, దశరథునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం ప్రచోదితో రాజా కైకేయ్యా నిర్విశంకయా
నాశక త్పాశ మున్మోక్తుం బలి రింద్రకృతం యథా. ౧౪

టీక॥ రాజా=దశరథమహారాజు; నిర్విశంకయా = భయములేనట్టి; కైకేయ్యా=కైకేయిచేత; ఏవం=ఇట్లు; ప్రచోదితః = ప్రేరింపఁబడినవాఁడై; పాశం=సత్యపాశమును; బలిః=బలిచక్రవర్తి; ఇంద్రకృతంయథా=ఉపేంద్రుండగువామనునిచేఁ జేయఁబడినసత్యపాశమునుంబోలె; ఉన్మోక్తుం = విడుచుటకు; నాశకత్ =చాలఁడయ్యె.

దశరథమహారాజు, ఇట్లు కైకేయినిర్భయంబుగాఁజెప్పినమాటలువిని, బలిచక్రవర్తి వామనునకుమూఁడడుగుల నేల యిచ్చెదనని మొదటఁజెప్పియా పిమ్మట నదివిపరీతమయినను సత్యపాశమును దలించుకొనఁజాలనట్లు, ముందు, కైకేయి, "ఇచ్చెద"నని, ప్రతిజ్ఞచేసినవాఁడు కావున, సత్యపాశమునువిడిపించుకొనఁజాలఁడయ్యె. అని, తాత్పర్యము.

ఉద్భ్రాంతహృదయశ్చాపి వివర్ణవదనోఽభవత్
స ధుర్యో వై పరిస్పందన్ యుగచక్రాంతరం యథా. ౧౨

టీక॥సః=ఆదశరథమహారాజు;యుగచక్రాంతరం=బండికాఁడియొక్కయు చక్రముయొక్కయు మధ్యప్రదేశమును; పరిస్పందన్= పొందుచున్న; ధుర్యః=ఎద్దువలె ("వై"అనునది పాదపూరణార్థము);ఉద్భ్రాంతహృదయః=తిరుగుడుపడిన మనసుగలవాఁడును; వివర్ణవదనశ్చాపి = వెల్లఁబాఱినముఖముగలవాఁడును; అభవత్=ఆయెను.

ఆదశరథుండు,"కైకేయికిచ్చెద"నని చెప్పినసత్యవాక్యంబుదప్పుటకును, ప్రాణకుమారుండగు రాముని వనంబునకుఁ బంపుటకును, జాలక, బండికాఁడికిని చక్రంబునకును నడుమఁగట్టఁబడియుండు వృషభము భంగి, తిరుగుడుపడుచున్న హృదయంబుతోను,దుఃఖంబున వెల్లఁబాఱినముఖంబుతోను,మిన్నకుండెను.

అని, తాత్పర్యము.

విహ్వలాభ్యాం చ నేత్రాభ్యామపశ్యన్నివ భూపతిః
కృచ్ఛ్రాద్ధైర్యేణ సంస్తభ్య కైకేయీమిదమబ్రవీత్. ౧౩

టీక॥విహ్వలాభ్యాం=కలఁకఁబాఱిన;నేత్రాభ్యాంచ = కండ్లచేతను;అపశ్యన్నివ(స్థితః)= చూడనివాఁడువలెనున్న,అంధుండువలెనున్నయనుట;భూపతిః=దశరథమహారాజు;కృచ్ఛ్రాత్=కష్టమువలన;ధైర్యేణ=ధైర్యముచేత;సంస్తభ్య=అడఁచుకొని; కైకేయీం=కైకేయినిగూర్చి;ఇదం=ఈమాటను;అబ్రవీత్=చెప్పెను.

దుఃఖంబునఁ గలంకంబాఱిన కండ్లతోనంధుండుంబోలె నున్నదశరథమహారాజును,కష్టంబున, దుఃఖంబునడఁచుకొని,కైకేయింజూచి,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

యస్తే మంత్రకృతః పాణిరగ్నౌ పాపే మయా ధృతః
తం త్యజామి స్వజం చైవ తవ పుత్రం త్వయా సహ. ౧౪

టీక॥పాపే=పాపిష్ఠురాలవగు కైకేయీ! అగ్నౌ= అగ్నిసమీపమందు

మంత్రకృతః=మంత్రముచేతసంస్కరింపఁబడిన; తే=నీయొక్క; యః=ఏ; పాణిః=హస్తము; మయా=నాచేత; ధృతః = ధరింపఁబడినదో; తం=ఆహస్తమును; త్యజామి=విడుచుచున్నాను, దానిచేఁగల్గిన, భార్యయనెడువ్యవహారమునువిడుచుచున్నాననుట. త్వయాసహ=నీతోఁగూడ; స్వజం=నావలనఁ బుట్టిన; తవ=నీయొక్క; పుత్రంచైవ=కొడుకును గూడ; త్యజామి (అధ్యాహృతము)=విడుచుచున్నాను.

పాపిష్ఠురాలవగుకైకేయీ! నేనగ్నిసమీపంబునమంత్రపురస్సరంబుగాగ్రహించిన నీహస్తంబునిప్పుడువిడిచెదను, ఇంకనీవునాకుభార్యవుకావు, నేనింకనీకుభర్తనుగాను; అట్లునాకుఁబుట్టిననీకొడుకునుగూడ, నీతోఁగూడ, విడిచెదను. అని, తాత్పర్యము.

ప్రయాతా రజనీ దేవి సూర్యస్యోదయనం ప్రతి
అభిషేకం గురుజన స్త్వరయిష్యతి మాం ధ్రువమ్. ౧౫
రామాభిషేక సంభారై స్తదర్థ ముపకల్పితైః

టీక॥ దేవి=రాణివగుకైకేయీ! రజనీ=రాత్రి; ప్రయాతా= కడచినది. సూర్యస్య=సూర్యునియొక్క; ఉదయనం=ఉదయమును; ప్రతి= పొంది; తదర్థం=రామాభిషేకముకొఱకు; ఉపకల్పితైః=సిద్ధములు సేయఁబడిన; రామాభిషేకసంభారైః(సహ)= రామాభిషేకమునకుఁ గావలసిన ద్రవ్యములతోఁగూడ, గురుజనాః=గురుజనములు; అభిషేకం=రామాభిషేకమునుగూర్చి మాం=నన్ను; త్వరయిష్యతి= తొందరపెట్టఁగలదు. ధ్రువం= నిశ్చయము.

కైకేయీ! రాత్రిపోయినది; ఇంక సూర్యోదయమయినపిమ్మటనె, గురువులు రామాభిషేకద్రవ్యంబులతోవచ్చి, రామాభిషేకమునుజేయుమని, నన్నుఁదొందరపెట్టుదురు; ఇదినిశ్చయము, అని, తాత్పర్యము.

రామః కారయితవ్యో మే మృతస్య సలిలక్రియామ్. ౧౬

టీక॥ మృతస్య = చనిపోయిన; మే=నాకు; సలిలక్రియాం = ఉదకక్రియను; రామః=రాముఁడు; కారయితవ్యః=చేయింపఁబడవలసినది.

స ౧౪

రామాభిషేకమువిఘ్నమొందునేని, నాప్రాణంబులుపోవును, కావున, నప్పుడు, నాకు రామునిచేత సేయుత్తరక్రియలుచేయింపవలయును.

అని, తాత్పర్యము.

త్వయా సపుత్రయా నైవ కర్తవ్యా సలిలక్రియా
వ్యాహంతా స్యశుభాచారే యది రామాభిషేచనమ్. ౧౭

టీక॥ అశుభాచారే=అమంగళకరములగునాచారముగలదానా! రామాభిషేచనం=రామునిపట్టాభిషేకమును; వ్యాహంతాసియది=నిలుపుదువేని; సపుత్రయా = కొడుకుతోఁగూడిన;త్వయా=నీచేత;సలిలక్రియా=ఉదకక్రియ; నైవకర్తవ్యా=చేయఁబడనేకూడదు.

అమంగళములుసేయుసట్టికైకేయీ! నీవురామునిపట్టాభిషేకమునకు, విఘ్నముసేయుదువేని,నీవుగాని నీకొడుకుఁగాని,మృతుండనగునాకుసలిలక్రియనెంతమాత్రముచేయఁగూడదు.

అని, తాత్పర్యము.

నచ శక్తో౽స్మ్యహం ద్రష్టుం దృష్ట్వా పూర్వం తథాసుఖమ్
హతహర్షం నిరానందం పున ర్జన మవాఙ్ముఖమ్. ౧౮

టీక॥ అహం=నేను; పూర్వం = మునుపు;తథాసుఖం=అట్టిసుఖముగల; జనం (అధ్యాహృతము)=జనమును ; దృష్ట్వా=చూచి; పునః=మరల; హతహర్షం=కొట్టఁబడిన గగుర్పాటుగలదియును; నిరానందం= సంతోషములేనిదియును; అవాఙ్ముఖం=వంచినముఖముగలదియునగు;జనం=జనమును; ద్రష్టుంచ= చూచుటకును; నశక్తోస్మి= చాలను.

నేను,మునుపు "రామాభిషేకముచేసెద" నని చెప్పినప్పుడు, అట్లుసంతోషమునొందియున్నజనులను జూచి,యిప్పుడు రాముండడవికిఁబోవునని విననందున సంతోషంబులేక దుఃఖంబునందలవంచియుండుజనులం, జూడఁజాలను, అనిదశరథుండు, కైకేయితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తాం తథా బ్రువత స్తస్య భూమిపస్య మహాత్మనః
ప్రభాతా శర్వరీ పుణ్యా చంద్రనక్షత్రశాలినీ. ౧౯

టీక॥ మహాత్మనః= పూజ్యమయినస్వభావంబుగల; తస్య=ఆ; భూమిపస్య= భూమిం బాలించునట్టి దశరథమహారాజు; తాం = ఆకైకేయిని గూర్చి; తథా=అట్లు; బ్రువతః = చెప్పుచుండఁగా; పుణ్యా=పవిత్రయును; చంద్రనక్షత్రశాలినీ = చంద్రునిచేతను నక్షత్రములచేతను బ్రకాశించునట్టిదియునగు; శర్వరీ=రాత్రి; ప్రభాతా=తెల్లవాఱినది.

మహాత్ముండగు నా దశరథమహారాజు, అట్లు కైకేయితోఁ జెప్పుచుండఁగానే, చంద్రునిచేతను నక్షత్రముల చేతను జెన్నొందుచున్న రాత్రిగడచి, తెల్లవాఱినది.

అని, తాత్పర్యము.

తతః పాపసమాచారా కైకేయీ పార్థివం పునః
ఉవాచ పరుషం వాక్యం వాక్యజ్ఞా రోషమూర్ఛితా. ౨౦

టీక॥ తతః=అటుపిమ్మట ; పాపసమాచారా=పాపములైయాచారములు గాఁగలదియు; వాక్యజ్ఞా= మాటల నెఱింగినదియునగు; కైకేయీ= కైకేయి; రోషమూర్ఛితా = కోపముచేతవ్యాపింపఁబడినదై; పునః= మఱల; పార్థివం= దశరథమహారాజునుగూర్చి; పరుషం= క్రూరమయిన ; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

అంతఁ, బాపిష్ఠురాలును మాటలు చెప్ప నేర్చినదియు నగు కైకేయి, మిక్కిలియుఁ గోపంబునొంది, మఱల, దశరథమహారాజుం జూచి, పరుషంబులగు మాటల, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కి మిదం భాషసే రాజన్ వాక్యం గరరుజోపమమ్
("వాక్యమం గరుజోపమం" ఇతి పాఠాంతరం)
అనాయయితు మక్లిష్టం పుత్రం రామ మిహార్హసి. ౨౧

టీక॥ రాజన్ = దశరథమహారాజా! గరరుజోపమం = విషవ్యాధితోc బోలికగల; అంగరుజోపమం (అనిపాఠాంతరము) = దేహమునఁబుట్టినవ్యాధితోcబోల్కిగల, లేక; అంగ=అయ్యా! రుజోపమం= రోగముతోcబోల్కిగల; ఇదం=ఈ; వాక్యం=మాటను; కిం=ఎందుకు; భాషసే=చెప్పుచున్నావు ? ఇహ=ఇచ్చటికి; అక్లిష్టం=మనసునకుదుఃఖములేనట్లుగా; పుత్రం= కొడుకయిన; రామం = రాముని ; ఆనాయయితుం=తోడ్తెప్పించుటకు; అర్హసి=తగుదువు.

దశరథమహారాజా! మహావ్యాధితో సరియయిన యీపరుషంపుమాటనేల పల్కెదవు; దుఃఖంబువిడిచి, నీకొడుకు రామునిచ్చటికిరావింపుము.

అని, తాత్పర్యము.

స్థాప్యరాజ్యే మమసుతం కృత్వా రామం వనేచరమ్
నిస్సపత్నాంచ మాం కృత్వా కృతకృత్యో భవిష్యసి. ౨౨

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; మమ=నాయొక్క; సుతం= కొడుకైనభరతుని; రాజ్యే=దొరతనమునందు; (స్థాపయిత్వా)= నిలిపి; రామం= రాముని; వనేచరం=అడవియందుc దిరుగువానిcగా; కృత్వా=చేసి; మాంచ=నన్నును; నిస్సంపత్నాం =శత్రువులులేనిదానిcగాను; కృత్వా=చేసి ; కృతకృత్యః=చేయcబడినచేయవలసిన పనిగలవాcడవు; భవిష్యసి=కాcగలవు.

నాకొడుకైనభరతునకు రాజ్యంబొసంగి, రామునడవికిcబంపి, నాకుశత్రువులు లేకుండునట్లుచేసి, యిట్లుసత్యవ్రతంబుసాధించినవాcడవుకావునc, గృతకృత్యుండవు కాcగలవు.

అని, తాత్పర్యము.

స నున్న ఇవ తీక్ష్ణేన ప్రతోదేన హయోత్తమః
రాజా ప్రచోదితో ఽభీక్ష్ణం కైకేయీ మిద మబ్రవీత్. ౨౩

టీక॥ తీక్ష్ణేన=చులుకైన; ప్రతోదేన=మునికోలచేత; నున్నః=కొట్టcబడిన; హయోత్తమఇవ= అశ్వశ్రేష్ఠమువలె; రాజా=దశరథమహారాజు ; అభీక్ష్ణం=పలుమాఱు; ప్రచోదితః= ప్రేరేపింపcబడినవాcడై; కైకేయీం= కైకే

యునిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=పలికెను.

ఆదశరథమహారాజు, చుఱుకైనమునికోలచేమేలయినగుఱ్ఱము కొట్టఁబడునట్లు, కైకేయిచేఁబలుమాఱుకఠినోక్తులఁబలుకంబడి, కైకేయింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ధర్మబంధేన బద్ధో స్మి నష్టా చ మమ చేతనా
జ్యేష్ఠం పుత్రం ప్రియం రామం ద్రష్టు మిచ్ఛామి ధార్మికమ్. ౫౪

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; ధర్మబంధేన = ధర్మపాశము చేత; బద్ధః = కట్టఁబడినవాఁడను; అస్మి = అగుచున్నాను. మమ = నాయొక్క; చేతనాచ = బుద్ధియును; నష్టా = నశించినది. ధార్మికం = ధర్మము నాచరించువాఁడును; ప్రియం = ఇష్టుండు నగు; జ్యేష్ఠం = పెద్ద; పుత్రం = కొడుకయిన; రామం = రాముని; ద్రష్టుం = చూచుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

నేను, ధర్మపాశంబుచేబద్ధుండనైతి, నాబుద్ధియును నశించినది; ధార్మికుండును బ్రియుండు నగు, నాజ్యేష్ఠపుత్రుఁడైనరామునిం, జూడఁ గోరుచున్నాను. అని, దశరథుండు, కైకేయితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తతః ప్రభాతాం రజనీ ముదితే చ దివాకరే
పుణ్యే నక్షత్రయోగే చ ముహూర్తే చ సమాహితే. ౫౫
వసిష్ఠో గుణసంపన్న శ్శిష్యైః పరివృత స్తదా
ఉపగృహ్యా శు సంభారా న్ప్రవివేశ పురోత్తమమ్. ౫౬

టీక॥ తతః = అట్లు; రజనీం = రాత్రి; ప్రభాతాం = తెల్లవాఱఁగా; దివాకరే చ = సూర్యుండును; ఉదితే = ఉదయింపఁగానే; పుణ్యే = పవిత్రమయిన; నక్షత్రయోగే = పుష్యనక్షత్రయోగంబును; ముహూర్తే చ = ముహూర్తమును; సమాహితే = సన్నిహితముకాఁగా; తదా = అప్పుడు; గుణసంపన్నః = మంచి

గుణములతోఁగూడిన ; వసిష్ఠః= వసిష్ఠుఁడు; శిష్యైః=శిష్యులచేత ; పరివృతః=చుట్టఁబడినవాఁడై; ఆశు = శీఘ్రముగా; సంభారాన్= అభిషేకద్రవ్యములను; ఉపగృహ్య=తీసికొని; పురోత్తమం = పట్టణశ్రేష్ఠమయినయయోధ్యను; ప్రవివేశ=ప్రవేశించెను , ఊరివెలుపలనుండు సరయూ నదియందు స్నానముచేసుకొని, యూరఁ బ్రవేశించెననుట.

అంతఁదెల్లవాఱఁగానే , సూర్యుం డుదయించిన పిమ్మట పట్టాభిషేకంబునకు నిశ్చయింపఁబడిన పుష్యయోగ ముహూర్తంబు సమీపింపఁగానే,య ప్పుడు, గుణవంతుండగు వసిష్ఠుండు , శిష్యులం గూడిసరయూనదియందుస్నానముచేసినవాఁడై,శీఘ్రముగాఁ, బట్టాభిషేక ద్రవ్యములందీసికొని , యయోధ్యాపట్టణంబులోనికిం బోయెను.

అని, తాత్పర్యము.

సిక్తసమ్మార్జితపథాం పతాకోత్తమభూషితామ్
విచిత్రకుసుమాకీర్ణాం నానాస్రగ్భిర్విరాజితామ్. ౨౭
సంహృష్టమనుజోపేతాం సమృద్ధవిపణాపణామ్
మహోత్సవసమాకీర్ణాం రాఘవార్థే సముత్సుకామ్. ౨౮
చందనాగరుధూపైశ్చ సర్వతః ప్రతిధూపితామ్
తాంపురీం సమతిక్రమ్య పురందరపురోపమామ్. ౨౯
దదర్శాంతఃపురశ్రేష్ఠం నానాద్విజగణాయుతమ్
పౌరజానపదాకీర్ణం బ్రాహ్మణైరుపశోభితమ్. ౩౦
యజ్ఞవిద్భిస్సుసంపూర్ణం సదస్యైః పరమద్విజైః

టీక॥ సః(అధ్యాహృతము)= ఆవసిష్ఠుఁడు;సిక్తసంమార్జితపథాం=తడుపఁబడినదియుఁ జిమ్మఁబడినదియునగు మార్గములుగలదియును; పతాకోత్తమభూషితాం= టెక్కెములలోశ్రేష్ఠములగు వానిచేత నలంకరింపఁబడినదియు; విచిత్రకుసుమాకీర్ణాం=నానావిధములయిన పూలచేవ్యాపింపఁబడినదియు; నానాస్రగ్భిః=నానావిధములైనపుష్పమాలికలచేత;విరాజితాం=ప్రకాశింపఁజేయఁబడినదియును; సంహృష్టమనుజోపేతాం= సంతసించినమను

ష్యలతోఁగూడినదియును; సమృద్ధవిపణాపణాం=నిండినవిక్రయపదార్థములుగలయంగళ్లుగలదియును;మహోత్సవసమాకీర్ణాం= అధికములగువేడుకలచే వ్యాపింపఁబడినదియును; రాఘవార్థే=రామునిప్రయోజనమందు, పట్టాభిషేకమందనుట;సముత్సుకాం = ఉత్సాహముగలదియు, ఉత్సాహముగలజనులు గలదియుననుట; చందనాగరుధూపైః= చందనపుఁ జెక్కలయొక్కయు అగరు చెక్కయొక్కయుఁ బొగలచేత;సర్వతః=అంతటను; ప్రతిధూపితాం=పొగ వేయఁబడినదియును; పురందరపురోపమాం=దేవేంద్రునిపట్టణముతోఁబోలికగలదియునగు;తాం=ఆయయోధ్యను;సమతిక్రమ్య=దాఁటి;నానాద్విజగణాయుతం= నానావిధములయి.న పక్షులసమూహములతోఁ గూడినదియును;పౌరజానపదాకీర్ణం=పట్టణంబులందుండువారలచేతను,గ్రామంబులందుండువారలచేతను వ్యాపింపఁబడినదియును; బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేత; ఉపశోభితం=ప్రకాశింపఁజేయఁబడినదియును;యజ్ఞవిద్భిః=యాగములఁదెలిసినవారలును;సదస్యైః=సభికులునగు;పరమద్విజైః= ఉత్తమబ్రాహ్మణులచేత; సుసంపూర్ణం= చక్కఁగా నిండినదియునగు;శ్రేష్ఠం= ఉత్తమమయిన;అంతఃపురం=అంతఃపురమును;దదర్శ — చూచెను.

ఆసుమంత్రుఁడు, జనులచేఁ బూర్ణంబై యుండుమార్గంబులుగలిగి, యుత్తమధ్వజంబులనలంకరింపఁబడి, నానావిధపుష్పంబులును నానావిధపుష్పమాలికలను దేజరిల్లుచు, సంతోషంబునొందియున్నమనుష్యులతోఁగూడి, విక్రయపదార్థంబులనిండియున్న యంగళ్లతోఁగూడి,మహోత్సవంబులనొప్పుచు, రాముని పట్టాభిషేకము విషయమైబాలసుత్సాహముగలజనులతోఁగూడి, యంతటను చందనాగరు ధూపంబుల గుబాళించుచు, దేవేంద్రునిపట్టణంబుతోసాటియగుచున్నయాయయోధ్యాపట్టణం బతిక్రమించి, నానావిధపక్షులతోనొప్పుచుఁ, బురజనులతోను,గ్రామ్యజనులతోను,బ్రాహ్మణులతోనుమఱియు యాగవేత్తలుసభకులునైనయుత్తమబ్రాహ్మణులతోను, గూడియున్న, దశరథుని యంతఃపురంబుంజూచెను.అని, తాత్పర్యము.

త దంతఃపురమాసాద్య వ్యతిచక్రామ తం జనమ్. ౩౧

వసిష్ఠః పరమప్రీతః పరమర్షి ర్వివేశచ

టీక ॥ పరమర్షిః = ఉత్కృష్టుం డగు ఋషియయిన; వసిష్ఠః = వసిష్ఠుండు; పరమప్రీతః = మిక్కిలియు సంతసించినవాఁడై; తత్ = ఆ; అంతః పురం = అంతఃపురమును; ఆసాద్య = పొంది; తం = ఆ; జనం = జనమును; వ్యతిచక్రామ = దాఁటెను; వివేశచ = ప్రవేశించెను.

మహర్షియగు వసిష్ఠుండు, ఆయంతఃపురంబునొద్దకుఁబోయి, అచ్చటనుండు పౌరులును న్నగజనుల, నతిక్రమించి, లోనికిం బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

స త్వ పశ్య ద్వినిష్క్రాంతం సుమంత్రం నామ సారథిమ్. ౩౨
ద్వారే మనుజ సింహస్య సచివం ప్రియదర్శనమ్

టీక॥ సతు = ఆవసిష్ఠుండును; ద్వారే = వాకిలియందు; వినిష్క్రాంతం = బయలు వెడలినవాఁడును; మనుజసింహస్య = మనుష్యశ్రేష్ఠుండగు దశరథునియొక్క; సచివం = మంత్రియును; ప్రియదర్శనం = సంతోషకరంబగుచూచుట గలవాఁడునగు; సుమంత్రంనామ = సుమంత్రుండనియెడు; సారథిం = సారథిని; అపశ్యత్ = చూచెను.

ఆవసిష్ఠుండ , న్వడె యింటనుండివచ్చి యచ్చటద్వారంబుననున్న, మనుష్యశ్రేష్ఠుండగు దశరథునిమంత్రియుఁ జూపరులకు సంతోషంబుగల్గించు వాఁడునగు, సుమంత్రుండను సారథిం జూచెను. అని, తాత్పర్యము.

త మువాచ మహాతేజా స్సూతపుత్రం విశారదమ్. ౩౩
వసిష్ఠః క్షిప్ర మాచక్ష్వ నృపతే ర్మా మిహాగతమ్.

టీక॥ మహాతేజాః = అధికమయిన ప్రభావముగల; వసిష్ఠః = వసిష్ఠుండు; విశారదం = పండితుండగు; తం = ఆ; సూతపుత్రం = తేరుగడపువాని కొడుకయినసుమంత్రునిగూర్చి; నృపతేః = దశరథమహారాజునకు; మాం = నన్ను; ఇ

హ=ఇచ్చటికి; ఆగతం=వచ్చినవానిఁగా; క్షిప్రం=శీఘ్రముగా; ఆచక్ష్వ=చెప్పుము. ఇతి(అధ్యాహృతము)= అని; ఉవాచ=చెప్పెను.

మహాప్రభావుండగు వసిష్ఠుండు, సారథిపుత్రుండగు నాసుమంత్రుంజూచి, నేనిచ్చటికివచ్చియున్నాను. అనిదశరథమహారాజునకు, శీఘ్రంబుగాఁజెప్పుము. అనిచెప్పెను. అని, తాత్పర్యము.

ఇమే గంగోదక ఘటా స్సాగరేభ్యశ్చ కాంచనాః. ౩౮

టీక॥ కాంచనాః=బంగారువికారములైన; ఇమే = ఈ; గంగోదకఘటాః=గంగానదిజలముతో నిండిన ఘటములు ; ఆహృతాః (అధ్యాహృతము)= తేఁబడినవి. ఇమే , ఉదకఘటాః (అధ్యాహృతము ) = ఈనీళ్లకుండలు;సాగరేభ్యశ్చ=సముద్రింబులనుండియు; ఆహృతాః=(అధ్యాహృతము)తేఁబడినవి.

గంగానది యుదకంబులో నిండియుండు నీకాంచన ఘటంబులును, సముద్రజలంబుతో నిండిన యీబంగారు కలశములును , రామునియభిషేకమునకై తేఁబడినవి. అని, తాత్పర్యము.

ఔదుంబరం భద్రపీఠ మభిషేకార్థ మాగతమ్

టీక॥ ఔదుంబరం= మేడికొయ్యతోఁ జేయఁబడిన; భద్రపీఠం= రాజుకూర్చుండు నాసనము; అభిషేకార్థం= అభిషేకముకొఱకు; ఆహృతం=తేఁబడినది.

మేడికొయ్యతోఁజేసిన రాజయోగ్యంబగుపీఠంబును; రామునిపట్టాభిషేకంబునకై, తేఁబడినది. అని, తాత్పర్యము,

సర్వబీజాని గంధాశ్చ రత్నాని వివిధానిచ. ౩౯

టీక॥ సర్వబీజాని=సమస్తములయినధాన్యములును;గంధాశ్చ= గంధములును; వివిధాని= నానావిధములయిన; రత్నానిచ=మణులును; ఆహృతాని (అధ్యాహృతము)=తేఁబడినవి.

అట్లు, సమస్తధాన్యంబులును నానావిధ గంధములును నానావిధంబులయినమణులును, తేఁబడియున్నవి.

అని, తాత్పర్యము.

క్షౌద్రం దధి ఘృతం లాజా దర్భా స్సుమనసః పయః
అష్టౌచ కన్యా రుచిరా మత్తశ్చ వరవారణః. ౩౬

టీక॥ క్షౌద్రం=తేనెయును; దధి=పెరుఁగును; ఘృతం = నేయియును; లాజాః= పేలాలును;దర్భాః= దర్భలును;సుమనసః=పుష్పలును; పయః=పాలును;రుచిరాః = మనోహరలయిన;కన్యాః=కన్యకలు;అష్టౌచ= ఎనిమిదిమందియును;మత్తః=మదించిన; వరవారణశ్చ= శ్రేష్ఠమయినయేనుంగును; ఏతాని (అధ్యాహృతము)=ఈవస్తువులు;ఆహృతాని (అధ్యాహృతము) = తేఁబడినవి.

తేనెయుఁ బెరుఁగును నేయియును బేలాలును దర్భలును బుష్పలును బాలును,మఱియుమనోహరవేషలగునెనిమిదిమందికన్నియలను , శుభలక్షణంబులతోఁగూడినమత్తగజంబును, దెప్పించియున్నాను. అని, తాత్పర్యము.

చతురశ్వో రథ శ్శ్రీమాన్ నిస్త్రింశో ధను రుత్తమమ్
వాహనం నరసంయుక్తం ఛత్రంచ శశి సన్నిభమ్. ౩౭

టీక॥శ్రీమాన్=కాంతితోఁగూడిన; చతురశ్వః=నాలుగుగుఱ్ఱములుగల; రథః=రథమును;నిస్త్రింశః = కత్తియును;ఉత్తమం=శ్రేష్ఠమయిన; ధనుః=విల్లును;నరసంయుక్తం= మనుష్యులతోఁగూడిన;వాహనం=పల్లకియును; శశిసన్నిభం= చంద్రునితో సమానమయిన; ఛత్రంచ=గొడుగును;ఆహృతాని (అధ్యాహృతము)= తేఁబడినవి.

మఱియుఁ, గాంతి సంపన్నంబయిన,నాలుగుగుఱ్ఱములరథంబును , ఖడ్గంబును,ఉత్తమంబగుధనుస్సును, మోసెడువాండ్రతోఁగూడిన పల్లకియును, జంద్రుండుంబోలెఁదెల్లఁగా నుండు ఛత్రంబును, దేఁబడియున్నవి.

అని;తాత్పర్యము.

విశేషార్థము.—ఈశ్లోకంబున, రెండవయక్షరంబగు "తు"అనుదానిచేత, గాయత్రినాలవయక్షరంబు సంగ్రహింపఁబడినది.నాలవగ్రంథ సహస్రం బా

రంభింపఁబడినది.

శ్వేతేచ వాల వ్యజనే భృంగారుశ్చ హిరణ్మయః
హేమదామపినద్ధశ్చ కకుద్మాన్ పాండురో వృషః. ౩౮

టీక॥ శ్వేతే=తెల్లని; వాలవ్యజనే చ=చామరములును; హిరణ్మయః=బంగారువికారమయిన; భృంగారుశ్చ = గిండిపాత్రమును; హేమదామపినద్ధః=బంగారు పగ్గములతోఁగట్టఁబడినదియును;కకుద్మాన్=గొప్పమూఁపురముగలదియును; పాండురః = తెల్లనిదియునగు;వృషశ్చ= ఎద్దును ; ఆహృతాః (అధ్యాహృతము)= తేఁబడినవి.

తెల్లనిచామరంబులు రెండును, బంగారుగిండిపాత్రయును, బంగారుపగ్గములతోఁగట్టఁబడినదియుఁ బెద్దమూఁపురముగలదియునగు, తెల్లనివృషభమును, దేఁబడియున్నవి.

అని, తాత్పర్యము.

కేసరీచ చతుర్దంష్ట్రో హరిశ్రేష్ఠో మహాబలః

టీక॥ కేసరీ=మంచిమెడయందలివెండ్రుకలుగలదియును; చతుర్దంష్ట్రః=నాలుగుపండ్లుగలదియును;మహాబలః=అధికమయినబలముగలదియునగు;హరిశ్రేష్ఠశ్చ=అశ్వశ్రేష్ఠమును;ఆహృతః(అధ్యాహృతము)=తేఁబడినది.

మెడయందుమేలయినవెండ్రుకలుగలదియు నాలుగుపండ్లు మొలిచినదియు మహాబలంబు నుత్తమంబునగు గుఱ్ఱమును, దేఁబడియున్నది. అని తాత్పర్యము.

సింహాసనం వ్యాఘ్రతను స్సమిద్ధశ్చహుతాశనః. ౩౯

టీక॥ సింహాసనం = సింహాసనంబును;వ్యాఘ్రతనుః = పులితోలును;సమిద్ధః=మండిన;హుతాశనశ్చ = అగ్నిహోత్రమును;ఆహృతాః (అధ్యాహృతము)=తేఁబడినవి.

సింహాసనంబును, పెద్దపులిచర్మంబును, అగ్నిహోత్రంబును,సిద్ధములయియున్నవి. అని, తాత్పర్యము.

సర్వవాదిత్రసంఘాశ్చ వేశ్యాశ్చా లంకృతాః స్త్రియః

టీక॥సర్వవాదిత్రసంఘాశ్చ= సమస్తములయినవాద్యములయొక్క- సమూహములును;ఆహృతాః (అధ్యాహృతము)=తేఁబడినవి. వేశ్యాశ్చ=బోగమువారును; అలంకృతాః=అలంకరింపఁబడిన;స్త్రియః=స్త్రీలును;ఆహృతాః(అధ్యాహృతము)=తేఁబడినారు.

సమస్త వాద్యములును దేఁబడియున్నవి;వేశ్యలును,అలంకృతలయినయితరస్త్రీలును,దేఁబడియున్నారు.

అని, తాత్పర్యము.

ఆచార్యా బ్రాహ్మణా గావః పుణ్యాశ్చ మృగపక్షిణః. ౪౦

టీక॥ఆచార్యాః=ఆచార్యులును;బ్రాహ్మణాః = బ్రాహ్మణులును;ఆహృతాః (అధ్యాహృతము) = తేఁబడినారు. గావః=ఆవులును; పుణ్యాశ్చ=పవిత్రములయిన;మృగపక్షిణశ్చ= మృగములునుపక్షులును ; ఆహృతాః (అధ్యాహృతము)= తేఁబడినవి.

ఆచార్యులును బ్రాహ్మణులును వచ్చియున్నారు; ఆవులును మఱియు నితరములయిన పుణ్యములగుమృగములును బక్షులును దేఁబడియున్నవి.

అని, తాత్పర్యము.

పౌరజానపదశ్రేష్ఠా నైగమాశ్చ గణైస్సహ

టీక॥ పౌరజానపదశ్రేష్ఠాః= పట్టణము నందుండు వారలలో శ్రేష్ఠులును గ్రామంబులనుండు వారలలో శ్రేష్ఠులును; నైగమాశ్చ=వర్తకులును; గణైస్సహ = ఆయాసమూహంబులతోఁగూడ;ఆహృతాః (అధ్యాహృతము)= తేఁబడినారు.

పట్టణవాసులలో గ్రామంబుల నుండుజనులలోను మేటియగువారునువర్తకులును ఆయావీధిలోనుండు సమూహములవారునువచ్చియున్నారు.

అని, తాత్పర్యము.

ఏతే చాన్యేచ బహవో నీయమానాః ప్రియంవదాః. ౪౧

అభిషేకాయ రామస్య సహతిష్ఠంతి పార్థివైః

టీక॥ ఏతేచ=వీరలును ; నీయమానాః=తేఁబడుచున్న ;ప్రియంవదాః=ప్రియమగుమాటనేచెప్పునట్టి; అన్యే=ఇతరులు; బహవశ్చ=అనేకులును;రామస్య = రామునియొక్క; అభిషేకాయ=పట్టాభిషేకముకొఱకు ; పార్థివైస్సహ= రాజులతోఁగూడ;తిష్ఠంతి=ఉన్నారు.

ఇప్పుడు చెప్పఁబడినవారును, ఇంక ప్రియంబగుమాట నుమాత్రమె చెప్పువార నేకులు వచ్చుచున్నవారున, రాజులును,రాముని యభిషేకంబ నీక్షించు చున్నారు. అని, తాత్పర్యము.

త్వరయస్వ మహారాజం యథా సముదితేఽహని. ౪౨
పుష్యే నక్షత్రయోగే చ రామో రాజ్య మవాప్నుయాత్

టీక॥ యథా=ఎట్లు; సముదితే = శ్రేయస్కరమగు;అహని= దినమునందు; పుష్యే=పవిత్రంబగు; నక్షత్రయోగేచ=పుష్యనక్షత్రయోగమునందును; రామః=రాముండు; రాజ్యం= దొరతనమును;అవాప్నుయాత్ = పొందునో ; తథా (అధ్యాహృతము )=అట్లు; మహారాజం= దశరథమహారాజును; త్వరయస్వ= వేగిరపడునట్లుచేయుము.

శ్రేయస్కరంబగు దినంబునందుఁబుణ్యంబగు పుష్యనక్షత్రంబున, రాముండు , పట్టాభిషిక్తుండగునట్లు,దశరథమహారాజును, వేగిరపడునట్లు చేయుము అని,వసిష్ఠుండు సుమంత్రునతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి తస్య వచశ్శ్రుత్వా సూతపుత్రో మహాత్మనః. ౪౩
స్తువన్నృపతిశార్దూలం ప్రవివేశ నివేశనమ్

టీక॥ సూతపుత్రః=సారథికొడుకైనసుమంత్రుండు; మహాత్మనః= అధికమయిన ప్రభావముగల; తస్య = ఆవసిష్ఠునియొక్క; ఇతి=ఇట్లని; వచః =

మాటను; శ్రుత్వా=విని; నృపతిశార్దూలం = రాజశ్రేష్ఠుండగుదశరథుని; స్తువన్=పొగడుచు; నివేశనం= అంతఃపురమును; ప్రవివేశ=చొచ్చెను.

సుమంత్రుండు, మహాత్ముండగు వసిష్ఠుండు చెప్పినమాటవిని, రాజశ్రేష్ఠుం డగుదశరథునిం బొగడుచు, నంతఃపురంబుఁ బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

తం తు పూర్వోదితం వృద్ధం ద్వారస్థా రాజసమ్మతమ్. ౪౪
న శేకు రభిసంరోద్ధుం రాజ్ఞః ప్రియచికీర్షవః

టీక॥ ద్వారస్థాః=వాకిలియందున్నవారలు; రాజ్ఞః= దశరథమహారాజునకు; ప్రియచికీర్షవః = సంతోషముసేయఁగోరువారలై; పూర్వోదితం= మును చెప్పఁబడినవాఁడును; వృద్ధం=ముసలివాఁడును; రాజసమ్మతం= రాజునకిష్టుండునగు; తం= ఆసుమంత్రుని మాత్రము; అభిసంరోద్ధుం=అడ్డగించుటకు; న శేకుః=చాలరైరి.

ద్వారపాలకులు, దశరథునకుఁ బ్రియంబు సేయువారలు, కావున, మున్ను, "ఈసుమంత్రుండు, లోనికివచ్చునపుడు, నీవడ్డగింపవలదు, యథేచ్ఛముగా విడువుండు" అని, దశరథుం డాజ్ఞాపించియుండుటవలన, రాజసమ్మతుండును వృద్ధుండునగు నాసుమంత్రుండు లోనికిం బోవఁగా, నతని, నిరోధింపరైరి.

అని, తాత్పర్యము.

స సమీపస్థితో రాజ్ఞ స్తా మవస్థా మజజ్ఞివాన్. ౪౫
వాగ్భిః పరమతుష్టాభి రభిష్టోతుం ప్రచక్రమే

టీక॥ సః= ఆసుమంత్రుండు; రాజ్ఞః = దశరథమహారాజుయొక్క; తాం= ఆ; అవస్థాం=దశను; అజజ్ఞివాన్=తెలియనివాఁడై; పరమతుష్టాభిః=మిక్కిలియు సంతోషముగల; వాగ్భిః=మాటలచేత; అభిష్టోతుం= పొగడుటకు; ప్రచక్రమే=ఆరంభించెను.

ఆసుమంత్రుండు, రాజసమీపంబునకుఁ బోయి, దశరథమహారాజట్టి దురవస్థం బొందియుండుట నెఱుంగఁడు,

కావున, మిక్కిలియు సంతోషము గల్గించునట్టి వాక్యంబుల, దశరథుం బొగడెను. అని, తాత్పర్యము.

తత స్సూతో యథాకాలం పార్థివస్య నివేశనే. ౪౬
సుమంత్రః ప్రాంజలి ర్భూత్వా తుష్టావ జగతీపతిమ్

టీక॥ తతః=అటుపిమ్మట; సూతః=సారథియగు; సుమంత్రః= సుమంత్రుండు; యథాకాలం=కాలము నతిక్రమింపక; పార్థివస్య=దశరథ మహారాజుయొక్క; నివేశనే = గృహమునందు; ప్రాంజలిః=మంచి చేమోడ్పు గలవాఁడై; జగతీపతిం=భూమికిఁ బ్రభువైన దశరథుని; తుష్టావ=పొగడెను.

అంత, సారథియగు సుమంత్రుండు, దశరథమహారాజుగృహంబునఁ, గాలంబునతిక్రమింపక, చేతులు మొగిడ్చికొని, దశరథమహారాజునిట్లని, ప్రస్తుతించెను. అని, తాత్పర్యము.

యథా నందతి తేజస్వీ సాగరో భాస్కరోదయే. ౪౭
ప్రీతః ప్రీతేన మనసా తథా నందయ న స్స్వతః

టీక॥ యథా=ఎట్లు; తేజస్వీ=ప్రశస్తమయిన కాంతిగల; సాగరః = సముద్రుఁడు; భాస్కరోదయే = చంద్రోదయమందు; ప్రీతః=సంతసించినవాఁడై; ప్రీతేన = సంతోషముతోఁగూడిన; మనసా=మనసుచేత; నందతి=సంతోషించునో; తథా = అట్లు; త్వం(అధ్యాహృతము)=నీవు; స్వతః=నీవలననె; ఆనందఘనః=సంతోషముతో నిండినవాఁడవై; నంద(అధ్యాహృతము)=సంతోషింపుము.

తేజస్వియగు సముద్రుండు, ఎట్లు, చంద్రోదయంబున, సంతోషంబునొందునో, అట్లు, నీవు, నిప్పుడు, సంతోషంబు నొందుము. అని, తాత్పర్యము.

ఇంద్ర మస్యాం తు వేళాయా మభితుష్టావ మాతలిః. ౪౮
సోఽజయ ద్దానవాం స్సర్వాం స్తథా త్వాం బోధయామ్యహమ్

టీక॥ మాతలిః=మాతలి; అస్యాం=ఏ; వేళాయాంతు=కాలమునందే; ఇంద్రం=ఇంద్రుని; అభితుష్టావ = పొగడెను. సః = ఆయింద్రుఁడు; దానవాన్ = రాక్షసులను; సర్వాన్=అందఱను; అజయత్=జయించెను. తథా = అట్లు; అహం=నేను; త్వాం=నిన్ను; బోధయామి=మేలుకొలుపుచున్నాను.

ఏకాలమునందే, మాతలి యింద్రుని బొగడెనా; ఆయింద్రుండు, సమస్తదానవులను, జయించెను; అట్లు, అట్టికాలంబుననె, నేను నిన్ను బొగడి మేలుకొల్పెదను; నీవును, అట్లు, సమస్తశత్రువులను, జయింపఁగలవు. అని, తాత్పర్యము.

వేదా స్సహాంగవిద్యాశ్చ యథా హ్యాత్మభువం విభుమ్. ౪౯
బ్రహ్మాణం బోధయ న్త్యద్య తథా త్వాం బోధయా మ్యహమ్

టీక॥ యథా=ఎట్లు; సహాంగవిద్యాశ్చ=అంగములయిన శిక్షమున్నగువిద్యలతోఁగూడిన; వేదాశ్చ=వేదములును; ఆత్మభువం=తనవలన నేపుట్టినవాఁడును; విభుం=సర్వైశ్వర్యయుతుండును అగు; బ్రహ్మాణం=బ్రహ్మదేవుని; బోధయంతి=బోధించుచున్నవో; తథా=అట్లు; అద్య=ఇప్పుడు; అహం=నేను; త్వాం=నిన్ను; బోధయామి=మేలుకొల్పుచున్నాను.

శిక్షమొదలగు నంగవిద్యలతోఁగూడిన వేదంబులును సర్వేశ్వరుండునగు బ్రహ్మదేవుని, బోధించునట్లు, నేనిప్పుడు, నిన్ను, మేలుకొల్పుచున్నాను.

అని, తాత్పర్యము.

ఆదిత్య స్సహ చంద్రేణ యథా భూతధరాం శుభామ్. ౫౦
బోధయ త్యద్య పృథివీం తథా త్వాం బోధయా మ్యహమ్

టీక॥ యథా=ఎట్లు; ఆదిత్యః=సూర్యుఁడు; చంద్రేణసహ = చంద్రునితోఁగూడ; భూతధరాం=ప్రాణులధరించియున్నదియు; శుభాం=మంగళకరియు నైనదియునగు; పృథివీం = భూమిని; బోధయతి=మేలుకొలుపుచున్నాఁడో తథా=అట్లు; అద్య=ఇప్పుడు; అహం=నేను; త్వాం=నిన్ను; బోధయామి=మేలుకొలుపుచున్నాను.

సూర్యుండును చంద్రుండును , సమ

స్త్రప్రాణులధరించుచున్నదియు మంగళస్వరూపిణియునగుభూమిని, ఉదయాస్తమయంబులమేలుకొల్పునట్లు, నేఁడు,నిన్ను, మేలుకొలుపుచున్నాను.

అని, తాత్పర్యము.

ఉత్తిష్ఠాశు మహారాజ కృతకౌతుకమంగళః. ౫౧
విరాజమానో వపుషా మేరోరివ దివాకరః

టీక॥మహారాజ= దశరథమహారాజా!త్వం(అధ్యాహృతము)= నీవు;కృతకౌతుకమంగళః= చేయఁబడినయుత్సవార్థమయినమంగళాలంకారములుగలవాఁడవై;వపుషా= దేహముచేత;విరాజమానః = ప్రకాశించుచున్నవాఁడవై;మేరోః=మేరుపర్వతమునుండి; దివాకరఇవ=సూర్యుండుంబోలె ; ఆశు=శీఘ్రముగా;ఉత్తిష్ఠ=లెమ్ము.

దశరథమహారాజా!నీవు, ఉత్సవార్థముమంగళాలంకారంబులు చేసికొని,సౌందర్యంబునం బ్రకాశించుచు, మేరుపర్వతమునుంచి, సూర్యుండుదయించునట్లు,శీఘ్రింబున,లెమ్ము.

అని, తాత్పర్యము.

సోమసూర్యౌచ కాకుత్స్థ శివవైశ్రవణావపి. ౫౨
వరుణ శ్చాగ్ని రింద్రశ్చ విజయం ప్రదిశంతు తే

టీక॥కాకుత్స్థ=దశరథుఁడా! సోమసూర్యౌచ=చంద్రుండును సూర్యుండును;శివవైశ్రవణావపి= శివుండును కుబేరుండును; వరుణశ్చ = వరుణుండును; అగ్నిశ్చ= అగ్నిహోత్రుండును;ఇంద్రశ్చ=ఇంద్రుండును; తే=నీకొఱకు;విజయం=గెల్పును;ప్రదిశంతు=ఇత్తురుగాక.

దశరథమహారాజా,నీకుఁ జంద్రుండును సూర్యుండును శివుండును కుబేరుండును వరుణుండును అగ్నిదేవుండును దేవేంద్రుండును,విజయంబు, నొసంగుదురుగాక.

అని, తాత్పర్యము.

గతా భగవతీ రాత్రిః కృతకృత్య మిదం శవ. ౫౩

బుద్ధ్యస్వ నృపశార్దూల కురు కార్య మనంతరమ్

టీక॥ భగవతీ=మాహాత్మ్యముగల; రాత్రిః=రాత్రి; గతా=కడచినది. తవ=నీకు; ఇదం=ఇది; కృతకృత్యం=చేయఁబడినచేయవలసినపనిగలది. నృపశార్దూల=రాజశ్రేష్ఠుండవగు దశరథుఁడా! బుద్ధ్యస్వ=మేలుకొనుము. అనంతరం=అవ్వలిదైన; కార్యం=పనిని; కురు=చేయుము.

భగవతియయినరాత్రిగడచినది; ఈ రాత్రికాలంబునందుఁజేయవలసిన కార్యంబులు నెఱవేర్చినావు; రాజశ్రేష్ఠుండవగుదశరథుఁడా! మేలుకొని, యవ్వలికార్యంబులంజేయుము.

అని, తాత్పర్యము.

ఉదతిష్ఠత రామస్య సమగ్ర మభిషేచనమ్. ౫౪

టీక॥ రామస్య=రామునియొక్క; అభిషేచనం = అభిషేకద్రవ్యము; సమగ్రం=అంతయును; ఉదతిష్ఠత = సిద్ధమయినది.

రామునియభిషేకంబునకుఁగావలసినద్రవ్యములన్నియు సిద్ధములయియున్నవి. అని, తాత్పర్యము.

పౌరజానపదైశ్చాపి నైగమైశ్చ కృతాంజలిః
స్వయం వసిష్ఠో భగవాన్ బ్రాహ్మణైస్సహ తిష్ఠతి. ౫౫

టీక॥ భగవాన్=మాహాత్మ్యముగల; వసిష్ఠః=వసిష్ఠుఁడు; పౌరజానపదైశ్చాపి= పట్టణవాసిజనములచేతను, గ్రామవాసిజనములచేతను; నైగమైశ్చ= వర్తకులచేతను; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; స్వయం= తాను; బ్రాహ్మణైస్సహ= బ్రాహ్మణులతోఁగూడ; తిష్ఠతి=ఉన్నాఁడు.

భగవంతుండగువసిష్ఠుండును, పౌరజనులును గ్రామ్యజనులును వర్తకులును గొలువఁగా, బ్రాహ్మణులతోఁగూడఁ, గాచుకొనియున్నాఁడు.

అని, తాత్పర్యము.

శీఘ్ర మాజ్ఞాప్యతాం రాజన్ రాఘవస్యాభిషేచనమ్

టీక॥ రాజన్=దశరథమహారాజా! రాఘవస్య=రామునియొక్క; అభిషేచనం=పట్టాభిషేకము; క్షిప్రం=శీఘ్రము గా; ఆజ్ఞాప్యతాం=ఆజ్ఞాపింపఁబడుఁ గాక.

దశరథమహారాజా! రామునకుఁ బట్టాభిషేకంబు సేయునట్లు, శీఘ్రంబుగా, నాజ్ఞాపింపుము. అని, తాత్పర్యము.

యథా హ్యపాలాః పశవో యథా సేనా హ్యనాయకా. ౪౬
యథా చంద్రం వినా రాత్రిర్యథా గావో వినా వృషమ్
ఏవం హి భవతా రాష్ట్రం యత్ర రాజా న దృశ్యతే. ౪౭

టీక॥ అపాలాః=పాలించువాఁడు లేని; పశవః = పశువులు; యథా=ఎట్లో; ("హి" అనునది పాదపూరణార్థము) అనాయకా= నడుపువాఁడులేని; సేనా = దండు; ("హి" అనునది పాదపూరణార్థము); యథా=ఎట్లో; చంద్రంవినా=చంద్రునివిడిచి; రాత్రిః=రాత్రి; యథా = ఎట్లో; వృషంవినా=ఆఁబోతునువిడిచి; గావః = ఆవులు; యథా=ఎట్లో; యత్ర=ఏరాజ్యమునందు; రాజా=రాజు; నదృశ్యతే=చూడఁబడఁడో; (తత్) రాష్ట్రం=ఆరాజ్యము; ఏవం=ఇట్లు; భవతా=అగునుగదా!

గొల్లవాఁడులేనిపశువులును, నాయకుండులేనిసేనయును, చంద్రుండులేనిరాత్రియును, ఆఁబోతులేనియావులును కాంతిచెడియుండునట్లు, రాజు, ఏరాజ్యంబున, జనులకగపడకుండునో, ఆరాజ్యంబును, చెడిపోవును; కావున, శీఘ్రంబుగా, రమ్ము. అని, సుమంత్రుండు, దశరథునింబాగడెను.

అని, తాత్పర్యము.

ఇతి తస్య వచశ్శ్రుత్వా సాంత్వపూర్వ మివార్థవత్
అభ్యకీర్యత శోకేన భూయఏవ మహీపతిః. ౪౮

టీక॥ మహీపతిః=భూమికిఁబ్రభువైన దశరథుఁడు; ఇతి=ఇట్లు; తస్య= ఆసుమంత్రునియొక్క; సాంత్వపూర్వం=తిన్ననిమాట ముందు గాఁగలదియును; ("ఇవ" అనునది వాక్యాలంకారార్థకము) అర్థవత్=సార్థకమయినదియు నగు; వచః=మాటను; శ్రుత్వా = విని; భూయఏవ=అధికముగానే; శోకేన=

దుఃఖముచేత; అభ్యాకీర్ణ్యత=వ్యాపింపఁ బడెను.

దశరథమహారాజు, సుమంత్రుండు సామపూర్వకంబుగా సాధు కంబుగాఁజెప్పినమాటనువిని, మనుపటికన్న నధికమయినదుఃఖముఁబొందెను.

అని, తాత్పర్యము.

తతస్స రాజా తం సూతం సన్నహర్ష స్సుతం ప్రతి
శోకరక్తేక్షణ శ్శ్రీమా నస్వాజ్ఞో వాద ధార్మికః. ౫౯

టీక॥ తతః=అటుపిమ్మట; సుతంప్రతి=కొడుకైన రాముని గూర్చి; సన్నహర్షః= నశించిన సంతోషముగలవాఁడును; శ్రీమాన్= కాంతిమంతుండును; ధార్మికః=ధర్మము నాచరించువాఁడునగు; సః=ఆ; రాజా= దశరథమహారాజు; శోకరక్తేక్షణః= దుఃఖముచేనెఱ్ఱనైన కండ్లుగలవాఁడై; సూతం=సారథియగుసుమంత్రునిగూర్చి; ఉవాచ=పలికెను.

అంతఁ బుత్రదుఃఖంబున సంతోషంబు లేకున్న, శ్రీమంతుండు ధార్మికుండునగు దశరథమహారాజు, శోదనంబున నెఱ్ఱనైన నేత్రంబులతో, సారథియగు సుమంత్రునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

వాక్యైస్తు ఖలు మర్మాణి మమ భూయో నికృంతసి

టీక॥ త్వం (అధ్యాహృతము)= నీవు; వాక్యైస్తు= మాటలచేత; భూయః=అధికముగా; మమ= నాయొక్క; మర్మాణి=జీవస్థానములను; నికృంతసిఖలు = తెంచుచున్నావుగదా!

నేనుగైకేయిమాటలచేఁ జాలదుఃఖితుండనైయుండు నప్పుడు, దుఃఖ కాలంబుల ననుచితంబులయిన యీస్తుతి వాక్యంబులుచెప్పుటచే, నాకు, ఇనుమడిదుఃఖంబు గలుగుచున్నది. అనిదశరథుండు, సుమంత్రునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సుమంత్రః కరుణం శ్రుత్వా దృష్ట్వా దీనంచ పార్థివమ్. ౬౦
ప్రగృహీతాంజలిః కించి త్తస్మా ద్దేశా దపాక్రమత్

టీక॥ సుమంత్రః=సుమంత్రుని యొక్క; కరుణం= వినువారికినిదుఃఖము గలిగించునట్టియామాటను; శ్రుత్వా= విని; దీనం=దుఃఖితుండగు; పార్థివం= రాజును; దృష్ట్వాచ=చూచియును; ప్రగృహీతాంజలిః=గ్రహింపఁబడినచే మోడ్పుగలవాఁడై; తస్మాత్ = ఆ; దేశాత్=ప్రదేశమునుండి; కించిత్=కొంచెము; అపాక్రమత్=తొలఁగెను.

సుమంత్రుండు, వినువారికిని దుఃఖము గల్గించునట్టి యాదశరథుని మాటనువిని, దశరథుండు చాల దుఃఖితుండై యుండుటంజూచి భయపడి, చేతులు మొగిచ్చి, కొంతదూరముగా దొలంగిపోయెను. అని, తాత్పర్యము.

యదా వక్తుం స్వయం దైన్యాన్నశశాక మహీపతిః. ౧౫
తదా సుమంత్రం మంత్రజ్ఞా కైకేయీ ప్రత్యువాచ హ

టీ॥ యదా=ఎప్పుడు; మహీపతిః=భూమికిఁబ్రభువైన దశరథుఁడు; దైన్యాత్=దుఃఖంబువలన; స్వయం=తాను; వక్తుం=చెప్పుటకు; నశశాక= శక్తుండు కాకపోయెనో; తదా=అప్పుడు; మంత్రజ్ఞా=ఆలోచనములనెఱింగిన; కైకేయీ=కైకేయి; సుమంత్రం=సుమంత్రునిఁగూర్చి; ప్రత్యువాచహ=బదులుచెప్పెను.

దశరథమహారాజు, దుఃఖంబున "రాముసిందోడ్కొనిరమ్ము" అని తాను చెప్పఁజాలక పోయినందున, ఆలోచనలునేర్చినకైకేయి, సుమంత్రుంజూచి, బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

సుమంత్ర రాజా రజనీం రామహర్ష సముత్సుకః. ౧౬
ప్రజాగరపరిశ్రాంతో నిద్రాయా వశ మేయివాన్

టీక॥ సుమంత్ర=సుమంత్రుఁడా! రాజా=దశరథమహారాజు; రామహర్షసముత్సుకః= రామునిగుఱించినసంతోషంబుచే నుత్సాహము గలవాఁడై; రజనీం=రాత్రియంతయును; ప్రజాగరపరిశ్రాంతః= మేలుకొనుటచే సలసినవాఁడై; నిద్రాయాః= నిదురయొక్క; వశం=అధీనతను; ఏయివాన్ = పొంది యున్నాఁడు.

సుమంత్రుఁడా! దశరథమహారాజు,

రామపట్టాభిషేకంబునుగుఱించిన సంతోషంబునం జేసి , రాత్రియంతయు మేలుకొనియుండి, యలసి, యిప్పుడు, నిద్రకులోఁబడియున్నాఁడు.

అని, తాత్పర్యము.

త ద్గచ్ఛ త్వరితం సూత రాజపుత్రం యశస్వినమ్. ౬౩
రామ మానయ భద్రం తే నా త్ర కార్యా విచారణా

టీక॥సూత=సారథివగు సుమంత్రుఁడా!తత్=అందువలన;త్వరితం=శీఘ్రముగా;గచ్ఛ=పొమ్ము. రాజపుత్రం=రాచకొమారుండును; యశస్వినం = ప్రశస్తమయినకీర్తి గలవాఁడునగు;రామం=రాముని; ఆనయ=తోడ్తెమ్ము. తే=నీకు;భద్రం=మంగళము;అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక.అత్ర=ఈ విషయమందు;విచారణా = ఆలోచనము;నకార్యా=చేయఁదగినదికాదు.

సుమంత్రుఁడా!అట్లుకావున, నీవు శీఘ్రంబుగాఁబోయి, రాజకుమారుండును ప్రశస్తంబగుకీర్తిగలవాఁడు నగు రామునిటకుఁదోడ్కొనిరమ్ము;నీకుమంగళమగుఁగాక;ఈవిషయమునందాలోచింపవలదు.అని,కైకేయి, సుమంత్రునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

స మన్యమానః కల్యాణం హృదయేన ననంద చ. ౬౪

టీక॥సః= ఆసుమంత్రుఁడు; కల్యాణం=మంగళమును; మన్యమానః= తలంచుచున్నవాఁడై; హృదయేన=మనసుచేత;ననందచ=సంతోషించెను.

ఆసుమంత్రుండు, "ఇంకమంగళంబుగు" ననితలంచి,మనంబున సంతోషంబునొందెను. అని, తాత్పర్యము.

నిర్జగామచ సంప్రీత్యా త్వరితో రాజశాసనాత్

టీక॥సః(అధ్యాహృతము)= ఆసుమంత్రుఁడు;రాజశాసనాత్ = రాజాజ్ఞవలన;సంప్రీత్యా= సంతోషముచే; త్వరితః=వేగిరపడినవాఁడై ; నిర్జగామచ=వెడలిపోయెను.

ఆసుమంత్రుఁడు, కైకేయిచెప్పినది

నిష్క్రమ్య జనసంబాధం దదర్శ ద్వారమగ్రతః

టీక॥ సుమంత్రః=సుమంత్రుఁడు; సాగరహ్రదసంకాశాత్= సముద్రమునందలి పెద్దలోతుగల గుంటతో సమానమయిన; శుభాత్= మంగళకరమగు; అంతఃపురాత్ — అంతఃపురమునుండి; నిష్క్రమ్య=వెడలి; అగ్రతః—ముందట; జనసంబాధం — జనులచేనిఱుకయిన; ద్వారం=వాకిలిని; దదర్శ=చూచెను.

సుమంత్రుండు, గొప్పపట్టణంబగు నయోధ్యాపట్టణమునకుంటఁజేసి, సముద్రమునడుమనుండు హ్రదంబుఁబోల్పన నొప్పుచుండు, నంతఃపురంబునండి, వెడలి, ముందట ఎప్పుడు జనులు చేరియుండుటవలన నిఱుకగనుండు, నంతఃపుర ద్వారంబును జూచెను.

అని, తాత్పర్యము.

తతః పురస్తాత్ సహసా వినిర్గతో
మహీపతీన్ ద్వారగతాన్ విలోకయన్. ౬౭
దదర్శ పౌరాన్ వివిధాన్ మహాధనా
నుపస్థితాన్ ద్వార ముపేత్య విష్ఠితాన్

టీక॥ తతః=అటుపిమ్మట; సుమంత్రః (అధ్యాహృతము)= సుమంత్రుండు; సహసా=వేగముగా; వినిర్గతః=వెడలినవాఁడై; ద్వారగతః=ద్వారమునుబొందినవాఁడై; పురస్తాత్=ముందఁ; మహీపతీన్=భూమికిఁబ్రభువులయిన రాజులను; విలోకయన్=చూచుచు; వివిధాన్= పలువిధములుగలవారలును; మహాధనాన్—అధికమైనధనముగలవారలును; ఉపస్థితాన్=సభచేరియున్నవారలును; ద్వారం=వాకిలిని; ఉపేత్య=పొంది; విష్ఠితాన్= ఉన్నవారలునగు; పౌరాన్ = పట్టణమునందుజనులను; దదర్శ=చూచెను.

అంత, నాసుమంత్రుండు, శీఘ్రంబు ననంతఃపురంబు వెడలి, ద్వారంబుఁజేరి, అప్పుటనగ్రప్రదేశమునందున్న రాజులనుజూచి, యంతకానుకలు దీసికొనిగుంపులుచేరి, ద్వారమునందున్న నానావిధంబగుపట్టణవాసి జనులను, జూచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అయోధ్యాకాండే, చతుర్దశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానం బగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ చతుర్దశసర్గటీక, ముగిసినది.



శ్రీః

పంచదశసర్గప్రారంభః.

తేతు తాం రజనీ ముష్య బ్రాహ్మణా వేదపారగాః
ఉపతస్థు రుపస్థానం సహరాజ పురోహితాః. ౧

టీక॥ వేదపారగాః= వేదములయొక్క యంతమునొందిన; తే=ఆ; బ్రాహ్మణాస్తు=బ్రాహ్మణులును; తాం=ఆ; రజనీం=రాత్రియంతయు; ఉష్య (ఉషిత్వా)=ఉండి; సహరాజ పురోహితాః=రాజపురోహితుండగు వసిష్ఠునితోఁగూడినవారలై; ఉపస్థానం= చేరికను, సభను యనుట; ఉపతస్థుః=పొందిరి.

వేదవేత్తలగు నాబ్రాహ్మణులందఱును, నారాత్రియంతయు నచ్చటనుండి, అంత వసిష్ఠునిఁగూడి, సభ గాఁజేరిరి.

అని, తాత్పర్యము.

అమాత్యా బలముఖ్యాశ్చ ముఖ్యా యే నిగమస్య చ .
రాఘవ స్యాభిషేకార్థే ప్రీయమాణాస్తు సంగతాః. ౨

టీక॥ అమాత్యాః=మంత్రులును; బలముఖ్యాశ్చ=సేనలోముఖ్యులయినవారలును; నిగమస్య=పట్టణమునకు; ముఖ్యాః=మేటి యగువారు; యే = ఎవరో; తే (అధ్యాహృతము)=వారును; రాఘవస్య=రామునియొక్క; అభిషేకార్థే=పట్టాభిషేకమునకుఁగాను; ప్రీయమాణాస్తు= సంతోషించుచున్నవారలయ్యు; సంగతాః=చేరినారు.

మఱియు, మంత్రులును సేనలో ముఖ్యాధికారులగువారును పట్టణంబునముఖ్యులయియుండువారును, రాముని

ట్టాభిషేకంబుఁబాదుటకై, సంతోషంబున, నచ్చటికివచ్చిరి. అని, తాత్పర్యము.

ఉదితే విమలే సూర్యే పుష్యే చాభ్యాగతే హని
లగ్నే కర్కటకే ప్రాప్తే జన్మ రామస్య చ స్థితే. ౩
అభిషేకాయ రామస్య ద్విజేంద్రైరుపకల్పితమ్

టీక॥ విమలే=నిర్మలుండగు; సూర్యే=సూర్యుండు; ఉదితే=ఉదయించుచుండగా; అహని=పగటియందు; పుష్యేచ=పుష్యనక్షత్రమును; అభ్యాగతే=రాఁగా; రామస్య = రాముని యొక్క; జన్మ=(సప్తమ్యర్థమందుఁ బ్రథమ) జన్మలగ్నమయిన; కర్కటకే=కర్కటకమను; లగ్నే=లగ్నము; ప్రాప్తే=వచ్చినదిగా; స్థితే=ఉండఁగా; రామస్య = రాముని యొక్క; అభిషేకాయ = పట్టాభిషేకముకొఱకు; ద్విజేంద్రైః=బ్రాహ్మణోత్తములచేత; ద్రవ్యజాతం (అధ్యాహృతము)=ద్రవ్యసమూహము; ఉపకల్పితం=సిద్ధముసేయఁబడినది.

నిర్మలుండగు సూర్యుండుదయించి నపిమ్మట, పుష్యనక్షత్రంబునందు, రాముని జన్మలగ్నంబయిన కర్కటలగ్నంబు రాఁగానే, రామునకుఁబట్టాభిషేకము సేయుటకై, కావలసిన ద్రవ్యంబులన్నియు, బ్రాహ్మణోత్తములు, సిద్ధములు చేసిరి. అని, తాత్పర్యము.

కాంచనా జలకుంభాశ్చ భద్రపీఠం స్వలంకృతమ్. ౪
రథశ్చ సమ్యగాస్తీర్ణో భాస్వతా వ్యాఘ్రచర్మణా

టీక॥ కాంచనాః=బంగారువికారములయిన; జలకుంభాశ్చ = నీళ్లతోనిండిన కలశములును; స్వలంకృతం=చక్కఁగా నలంకరింపఁబడిన; భద్రపీఠం=రాజులు కూర్చుండునాసనంబును; భాస్వతా=ప్రకాశించుచున్నట్టి; వ్యాఘ్రచర్మణా=పులితోలుచేత; సమ్యక్=చక్కఁగా; ఆస్తీర్ణః=పఱుపఁబడిన; రథశ్చ=రథమును; భాంతి(అధ్యాహృతము)=ప్రకాశించుచున్నవి.

నీళ్లతోనిండిన బంగారుకలశంబులును, చక్కఁగా నలంకరింపఁబడిన రా

లు పూర్ణచంద్రుపీఠంబును, ప్రకాశించుచున్నపులితోలుతోఁ గప్పఁబడినరథంబును, సిద్ధములయి ప్రకాశించుచుండనవి. అని, తాత్పర్యము.

గంగాయమునయోః పుణ్యాత్సంగమాదాహృతం జలమ్. ౫
యాశ్చాన్యాస్సరితః పుణ్యా హ్రదాః కూపాస్సరాంసి చ

టీక॥ గంగాయమునయోః = గంగానదియొక్కయు యమునానదియొక్కయు; పుణ్యాత్ = పుణ్యము గలిగించునట్టి; సంగమాత్ = సంగమస్థానమునుండి; అన్యాః = ఇతరములయిన; పుణ్యాః = పవిత్రములగు; సరితః = నదులు; యాః = ఏవో; తాభ్యః (అధ్యాహృతము) చ = వానినుండియు; హ్రదాః = పెద్దలోఁతుగలమడుగులును; కూపాః = బావులును; యే (అధ్యాహృతము) = ఏవో; తేభ్యశ్చ (అధ్యాహృతము) = వానినుండియు; సరాంసి = సరస్సులు; యాః (అధ్యాహృతము) = ఏవో; తేభ్యః (అధ్యాహృతము) చ = వానినుండియును; ఆహృతం = తేఁబడిన; జలం = ఉదకమును; భాతి (అధ్యాహృతము) = ప్రకాశించుచున్నది.

గంగానదియు యమునానదియు సంగమమునొందు పుణ్యస్థలమునుండియు, పవిత్రములయిన యితరనదులనుండియు హ్రదంబులనుండియు, కూపంబులనుండియు, సరస్సులనుండియుఁ, దేఁబడిన, పుణ్యజలంబును, సిద్ధమయి, ప్రకాశించుచుండెను. అని, తాత్పర్యము.

ప్రాగ్వాహాశ్చోర్ధ్వవాహాశ్చ తిర్యగ్వాహాస్సమాహితాః. ౬
తాభ్యశ్చైవాహృతం తోయం సముద్రేభ్యశ్చ సర్వశః

టీక॥ ప్రాగ్వాహాశ్చ = తూర్పుతట్టుగాఁ బాఱునవియు; ఊర్ధ్వవాహాశ్చ = ఊర్ధ్వముఖముగాఁ బాఱునవియును; ప్రాగ్వాహాః = పడమరతట్టుగాఁ బాఱునవియును; తిర్యగ్వాహాః = అడ్డముగాఁ బాఱునవియును; సమాహితాః = పాఱకుండ నిలిచియున్నవియును; యాః (అధ్యాహృతము) = ఏవో; తాభ్యశ్చైవ = వానినుండియును; సర్వశః = సమస్తములయిన; సముద్రేభ్యశ్చ = సముద్రములనుండియు; ఆహృతం = తేఁబడిన; తోయం = జలము; భాతి (అధ్యాహృతము)

ప్రకాశించుచున్నది.

పూర్వతట్టుగాఁబాఱునట్టిగంగాగోదావర్యాదినదులనుండియు,ఊర్ధ్వముఖముగాఁ బ్రవహించునట్టిబ్రహ్మావర్తము బ్రహ్మావర్తము మున్నగువానినుండియును,దక్షిణోత్తరముఖములుగాఁ బ్రవహించుగండకీశోణభద్రమున్నగునదులనుండియు, ఇట్టటుపాఱకనిలిచియుండుపుణ్యసరస్సులనుండియు, తేఁబడినపుణ్యజలమును,సిద్ధమయి ప్రకాశించుచుండినది. అని, తాత్పర్యము.

సలాజాః క్షీరిభి శ్ఛన్నా ఘటాః కాంచనరాజతాః. ౭
పద్మోత్పలయుతా భాంతి పూర్ణాః పరమవారిణా

టీక॥సలాజాః=పేలాలతోఁగూడినవియును;క్షీరిభిః=పాలుగల యశ్వత్థాదిపత్రములచేః ఛన్నాః=మూయఁబడినవియును; కాంచనరాజతాః=బంగారువికారములును.వెండివికారములును; పద్మోత్పలయుతాః= తామరపూలతోను కలువలతోనుగూడినవియును;పరమవారిణా=ఉత్కృష్టమయిన జలముచేః పూర్ణాః=నిండినవియునగు; ఘటాః=ఘటములు;భాంతి=ప్రకాశించుచున్నవి.

పేలాలతోఁగూడి పాలుగలయశ్వత్థాదిపత్రములతోఁగప్పఁబడి, తామరపూలునుగలువలునుంగూడి,పరమజలంబుతోనిండియున్న,బంగారుకలశంబులును,వెండికలశంబులును,ప్రకాశించుచుండినవి. అని, తాత్పర్యము.

క్షౌద్రం దధి ఘృతం లాజా దర్భా స్సుమనసః పయః. ౮

టీక॥క్షౌద్రం=తేనెయును; దధి=పెరుఁగును;ఘృతం=నేయియును; లాజాః=పేలాలును; దర్భాః= దర్భలును; సుమనసః=పుష్పములును ; పయః=పాలును; భాంతి (అధ్యాహృతము)=ప్రకాశించుచున్నవి.

తేనెయును పెరుఁగును పేలాలును దర్భలును,పుష్పంబులును,పాలును,అచ్చట సిద్ధములయి,ప్రకాశించుచుండినవి. అని,తాత్పర్యము.

వేశ్యా శ్చైవ శుభాచారా స్సర్వాభరణ భూషితాః

స ౧౫

టీక॥ శుభాచారాః=మంగళకరములయినయాచారములుగల వారలును, మంచియలంకారములుగలవారలు ననుట; సర్వాభరణభూషితాః=సమస్తములయినయాభరణములచేతనలంకరింపఁబడినవారలునగు; వేశ్యాశ్చైవ= భోగమువారును; భాంతి (లభ్యావ్రాతము)=ప్రకాశించుచున్నారు.

పుష్పములుఁ జందనము మొదలగువానిం దాల్చి సమస్తాభరణంబులను ధరించియుండుభోగమువారును, ప్రకాశించుచుండిరి. అని, తాత్పర్యము.

చంద్రాంశువికచప్రఖ్యం కాంచనం రత్నభూషితమ్. ౯
సజ్జం తిష్ఠతి రామస్య వాలవ్యజన ముత్తమమ్

టీక॥ చంద్రాంశువికచప్రఖ్యం=చంద్రుని కిరణంబులుంబోలె నధికమయిన కాంతిగలదియు; కాంచనం=బంగారువికారమయినదియు, బంగారువికారమయినపిడి గలదియుననుట; రత్నభూషితం= రత్నములచేనలంకరింపఁబడినదియు, రత్నములచేనలంకరింపఁబడినపిడి గలదియుననుట; ఉత్తమం=శ్రేష్ఠమయినదియునగు; రామస్య = రామునియొక్క; వాలవ్యజనం=చామరము; సజ్జం=సిద్ధమై; తిష్ఠతి=ఉన్నది.

చంద్రకిరణంబులుంబోలెడికాంతిగలదియుఁ దెల్లనైనదియు, బంగారముతోఁ జేయఁబడి రత్నములు వాడికియుండుపిడిగలదియునగును త్తమమైనరామునిచామరమును, సిద్ధమైయుండినది. అని, తాత్పర్యము.

చంద్రమండలసంకాశ మాతపత్రంచ పాండురమ్. ౧౦
సజ్జం ద్యుతికరం శ్రీమ దభిషేకపురస్కృతమ్

టీక॥ చంద్రమండలసంకాశం= చంద్రమండలముతో సమానమయినదియును; పాండురం=తెల్లనిదియును; ద్యుతికరం = కాంతిచేయునదియును, అచ్చటిప్రదేశమునుగాంతిగలదానిగాఁజేయునదియునునుట; శ్రీమత్=శ్రేష్ఠమును; అభిషేకపురస్కృతం= పట్టాభిషేకముకొఱకై ముందిడఁబడినదియు నగు; ఆతపత్రంచ=గొడుగును; సజ్జం=సిద్ధమయినది.

ఛంద్రమండలంబుంబోలెం దెల్లనిదై యుత్తమంబై పట్టాభిషేకము కొఱకు గల్పితంబైన, శ్వేతచ్ఛత్రంబును, సిద్ధమయియుండినది. అని, తాత్పర్యము.

పాండుర శ్చ వృష స్సజ్జః పాండురో శ్వశ్చ సుస్థితః. ౧౧

టీక॥ పాండురః = తెల్లనైన; వృష = ఆంబోతును; సజ్జః = సిద్ధమయినది. పాండురః = తెల్లనైన; సుస్థితః = సుందరమగు; అశ్వశ్చ = గుఱ్ఱమును; సజ్జః (అధ్యాహృతము) = సిద్ధమయినది.

తెల్లనియాంబోతును, మఱియును సుందరంబును దెల్లనిదియునగు గుఱ్ఱంబును, సిద్ధములయియుండినవి.

అని, తాత్పర్యము.

ప్రస్రుత శ్చ గజ శ్శ్రీమా నౌపవాహ్యః ప్రతీక్షతే

టీక॥ ప్రస్రుతః = మదజలమును కారుచున్నదియు; శ్రీమాన్ = ఉత్తమమయినదియు; ఔపవాహ్యః = రాజు లెక్కఁదగినదియునగు; గజశ్చ = ఏనుఁగును; ప్రతీక్షతే = ఎదురుసూచుచున్నది.

ఎల్లప్పుడును మదజలమును గార్చుచుండునదియును త్తమంబును రాజు లెక్కఁదగినదియునగు గజంబును సిద్ధమయియుండినది.

అని, తాత్పర్యము.

అష్టౌచ కన్యా మాంగళ్యా స్సర్వాభరణభూషితాః. ౧౨

టీక॥ మాంగళ్యాః = మంగళమునకుఁదగినవారును; సర్వాభరణభూషితాః = సమస్తాభరణముల చేతను అలంకరింపఁబడినవారునగు; అష్టౌ = ఎనిమిది; కన్యాశ్చ = కన్యలును; ప్రతీక్షంతే (అధ్యాహృతము) = ఎదురుచూచుచున్నారు.

మంగళాహ్వలు సమస్తాభరణంబులను దాల్చియుండువారునగు కన్యకలెనిమిమంది, రాముని పట్టాభిషేకంబునకై కనుపెట్టియున్నారు.

అని, తాత్పర్యము.

వాదిత్రాణిచ సర్వాణి వందినశ్చ తథా పరే

టీక॥ సర్వాణి=సమస్తములయిన; వాదిత్రాదీని=వాద్యములును; ప్రతీక్షంతే(అధ్యాహృతము)=ఎదురుచూచుచున్నవి. వందినశ్చ= స్తుతిపాఠకులును; తథా=అట్లు; అపరే = ఇతరులును; ప్రతీక్షంతే(అధ్యాహృతము)=ఎదురుచూచుచున్నారు.

ఏతానివాద్యములన్నియు సిద్ధములయియుంచినవి; అట్లేస్తుతిపాఠకులును, ఇతరసేవకులును, సిద్ధులయి యుండిరి.

అని, తాత్పర్యము.

ఇక్ష్వాకూణాం యథా రాజ్యే సంభ్రియేతాభిషేచనమ్. ౧౩
తథా జాతీయ మాదాయ రాజపుత్త్రాభిషేచనమ్
తే రాజ వచనాత్తత్ర సమవేతా మహీపతిమ్. ౧౪
అపశ్యంతో బ్రువన్ కో ను రాజ్ఞో నః ప్రతివేదయేత్

టీక॥ ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశపురాజులయొక్క; రాజ్యే=దొరతనమునందు; అభిషేచనం=పట్టాభిషేకమునుగూర్చి; యథా=ఎట్లు; వస్తుజాతం(అధ్యాహృతము)= పదార్థసమూహము; సంభ్రియేత=సంపాదింపఁబడునో; తథా=అట్లు; జాతీయం=శ్రేష్ఠమైన రత్నాది వస్తుసమూహమును; ఆదాయ=గ్రహించి; తే=ఆరాజులు; రాజవచనాత్=రాజుమాటవలన; రాజపుత్త్రాభిషేచనం = రాచకొమరుండగు రాముని పట్టాభిషేకమునుద్దేశించి; తత్ర=ఆరాజద్వారమునందు; సమవేతాః = చేరినవారలై=మహీపతిం= భూమికిఁబ్రభువయినదశరథుని; అపశ్యంతః = చూడనివారై; "కో ను=ఎవ్వఁడు; నః= మమ్ములను; రాజ్ఞే=దశరథమహారాజునకు; ప్రతిపాదయేత్= చెప్పును?" ఇతి(అధ్యాహృతము)=అని; అబ్రువన్ = చెప్పిరి.

ఇక్ష్వాకువంశపు రాజులపట్టాభిషేకమునకుఁ గూర్పఁబడు వారలయారాధనముకొఱకు వస్తుసంగ్రహముగావలసియుండు రత్నాదిపదార్థములంగొని, యారాజులు, రాజాజ్ఞవలన, రాముని పట్టాభిషేకంబునకై, రాజద్వారంబునుఁజేరి, దశరథమహారాజగపడకుండుటంజేసి, "మేమువచ్చియున్నామని, దశరథమహారాజునకెవ్వఁడు చెప్పును?" అని, తమలోఁదాము అనుకొనిరి. అని, తాత్పర్యము.

నపశ్యామశ్చ రాజాన ముదితశ్చ దివాకరః. ౧౫

యావద్రాజ్యాభిషేకస్య సజ్జో రామస్య ధీమతః

టీక॥ వయం(అధ్యాహృతము)=మనము; రాజానం=దశరథమహారాజును; నపశ్యామశ్చ=చూడకున్నాము. దివాకరశ్చ=సూర్యుండును; ఉదితః=ఉదయించినాండు. ధీమతః = బుద్ధిమంతుండగు; రామస్య=రామునియొక్క; యావద్రాజ్యాభిషేకస్య= యువరాజ దొరతనమునందభిషేకించుటయు, అభిషేకించుటకుం గావలసిన ద్రవ్యసమూహమనుట; సజ్జః=సిద్ధమయినది.

మనకిదివఱకు దశరథమహారాజగుపడకున్నాండు; సూర్యోదయంబయినది; రామునిపట్టాభిషేకమునకుం గావలసిన ద్రవ్యంబులన్నియు సిద్ధములయియున్నవి. అని, యారాజులతమలోం దామనుకొనిరి. అని, తాత్పర్యము.

ఇతి తేషు బ్రువాణేషు సార్వభౌమాన్ మహీపతీన్. ౧౮
అబ్రవీత్తానిదం సర్వాం త్సుమన్త్రో రాజసత్కృతః

టీక॥ తేషు=ఆరాజులు; ఇతి=ఇట్లు; బ్రువాణేషు=చెప్పుచుండంగా; రాజసత్కృతః=దశరథమహారాజుచే గౌరవింపఁబడిన; సుమన్త్రః = సుమంత్రుండు; సార్వభౌమాన్= చక్రవర్తులయిన; తాన్=ఆ; మహీపతీన్=రాజులను; సర్వాన్=అందఱింగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

ఆరాజులిట్లు చెప్పుకొనుచుండంగా, దశరథునిచే గౌరవింపఁబడుచుండు సుమంత్రుండు, ఆరాజుల నందఱింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రామం రాజ్ఞో నియోగేన త్వరయా ప్రస్థితో స్మ్యహమ్. ౧౯

టీక॥ అహం=నేను; రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; నియోగేన=ఆజ్ఞచేత; రామం=రాముని; ఆనేతుం=(అధ్యాహృతము)తోడ్కొనివచ్చుటకు; త్వరయా= వేగముచేత; ప్రస్థితః=బయలుదేరినవాండను; అస్మి=అగుచున్నాను.

నేను, రాజనియోగంబున, రామునిందోడ్కొనివచ్చుటకు వేగంబుగాం బోవుచున్నాను.

అని, తాత్పర్యము.

౧౪

పూజ్యౌ రాజ్ఞో భవంతస్తు రామస్యచ విశేషతః

టీక॥ భవంతస్తు=మీరును; రాజ్ఞః=దశరథమహారాజునకును; విశేషతః=అధికముగా; రామస్యచ=రామునకును; పూజ్యాః=పూజింపదగినవారలు.

మీరు, దశరథమహారాజునకును విశేషించి రామునకును, గౌరవింపదగినవారలు. అని, తాత్పర్యము.

అయం పృచ్ఛామి వచనాత్సుఖ మాయుష్మతా మహమ్. ౧౫
రాజ్ఞస్సం ప్రతి బుద్ధస్య యచ్చాగమన కారణమ్

టీక॥ అయం=ఈ; అహం=నేను; ఆయుష్మతాం = దీర్ఘాయుస్సుగలమీయొక్క; వచనాత్=మాటవలన; సంప్రతి=ఇప్పుడు; బుద్ధస్య= మేలుకొనిన; రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; సుఖం=సౌఖ్యమును; యత్=ఏది; ఆగమన కారణం=రాకపోవుటకు కారణమో; తత్ (అధ్యాహృతము) చ= దానిని; పృచ్ఛామి=అడుగుచున్నాను.

నేను, మీయాజ్ఞవలన, నిప్పుడు నిద్ర మేల్కొనియుండు దశరథమహారాజు నొద్దకుబోయి, దశరథుసంజూచి, "నేటు సౌఖ్యమునా? ఏవేల, బయిటికి రాలేదు" అని, యడిగెదను. అని, సుమంత్రుండు, ఆ రాజులతో జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వాంతఃపుర ద్వార మాజగామ పురాణవిత్. ౧౬

టీక॥ పురాణవిత్ = పురాతనవృత్తాంతములనెఱింగినసుమంత్రుండు; ఇతి=అని; ఉక్త్వా=చెప్పి; అంతఃపుర ద్వారం= అంతఃపురముయొక్క ద్వారమును; ఆజగామ=పొందెను.

రాజుల పురాతన వృత్తాంతంబుల నెఱింగియుండు నాసుమంత్రుండు, ఆ రాజులకిట్లు చెప్పి, మఱల, నంతఃపుర ద్వారంబునకుబోయెను.

అని, తాత్పర్యము.

సదా సక్తంచ తద్వేశ్మ సుమంత్రః ప్రవివేశహ

టీక॥ సుమంత్రః=సుమంత్రుఁడు; స దా=ఎల్లప్పుడును; అసక్తం=అడ్డములేనిః తత్=ఆః వేశ్మ= అంతఃపురగృహమును; ప్రవివేశ=చొచ్చెను "హి" అనునది పాదపూరణార్థము.

సుమంత్రుండు, తానెప్పుడు దలంచినను, అప్పుడు ప్రవేశింపఁగూడిన, యంతఃపురంబును, బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాం పతేః. ౨౦

టీక॥ సః=ఆసుమంత్రుండు; ప్రవిశ్య=చొచ్చి; విశాంపతేః= మనుష్యులకుఁ బ్రభువైన; అస్య=ఈదశరథమహారాజుయొక్క; వంశం=కులమును; తుష్టావ=పొగడెను.

ఆసుమంత్రుండట్లు ప్రవేశించి, యీ దశరథమహారాజువంశంబును బొగడెను. అని, తాత్పర్యము.

శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత

టీక॥ సుమంత్రః ( అధ్యాహృతము)=సుమంత్రుఁడు; తదా=అప్పుడు; నరేంద్రస్య=మనుష్యులకుఁ బ్రభువైన దశరథమహారాజు యొక్క; శయనీయం=శయనయోగ్యమయిన గృహమును, శయనగృహమననుట ; ఆసాద్య= పొంది; వ్యతిష్ఠత=నిలిచెను.

సుమంత్రుం, డప్పుడు, దశరథమహారాజుశయనగృహంబుఁజేరి, యచ్చట, నిలిచెను. అని, తాత్పర్యము.

సోత్యాసాద్యతు తద్వేశ్మ తిరస్కరణి మంతరా. ౨౧
ఆశీర్భిర్గుణ యుక్తాభి రభితుష్టావ రాఘవమ్

టీక॥ సః=ఆసుమంత్రుఁడు; తత్=ఆ; వేశ్మ=శయనగృహమును; తిరస్కరిణీమంతరా=తెరనువిడిచి ; అత్యాసాద్యతు=మిక్కిలియు దగ్గఱ నేః గుణయుక్తాభిః=గుణములతోఁగూడిన; ఆశీర్భిః= ఆశీర్వచనములచేత; రాఘవం = దశరథుని; అభితుష్టావ=పొగడెను.

ఆసుమంత్రుండు, ఆగృహమునన

స౧౫

రథుండుపరుండియుండు స్థలము దగ్గఱ కుఁబోయి, తెరకుమాత్రమీవల నిలిచి, యాశీర్వచనములుచేయుచు, దశరథు నిం,బొగడెను. అని, తాత్పర్యము.

సోమసూర్యౌచ కాకుత్స్థ శివవైశ్రవణావపి. ౨౨
వరుణశ్చాగ్నిరింద్రశ్చ విజయం ప్రదిశంతు తే

టీక॥ కాకుత్స్థ=దశరథుఁడా! సోమసూర్యౌచ=చంద్రుండును సూర్యుండును; శివవైశ్రవణావపి=శివుండును కుబేరుండును; వరుణశ్చ=వరుణుండును; అగ్నిః= అగ్నిహోత్రుండును; ఇంద్రశ్చ=ఇంద్రుండు; తే = నీకొఱకు; విజయం=గెల్పును; ప్రదిశంతు = ఇత్తురు గాక.

దశరథుఁడా! చంద్రుండును సూర్యుండును శివుండును కుబేరుండును వరుణుండును అగ్నిహోత్రుండును దేవేంద్రుండును, నీకు విజయంబు, నొసంగుదురుగాక. అని, తాత్పర్యము.

గతా భగవతీ రాత్రిః కృతకృత్య మిదం తవ. ౨౩
బుద్ధ్యస్వ నృపశార్దూల కురు కార్య మనంతరమ్.

టీక॥ భగవతీ = మాహాత్మ్యముగల; రాత్రిః=రాత్రి; గతా=కడచినది. ఇదం=ఇది; తవ=నీకు; కృతకృత్యం = చేయఁబడిన చేయవలసినపనులు గలది. నృపశార్దూల=రాజశ్రేష్ఠుండవగుదశరథుఁడా! బుద్ధ్యస్వ=మేలుకొనుము. అనంతరం=అవ్వలిదైన; కార్యం=పనిని; కురు=చేయుము.

రాజశ్రేష్ఠుండవగుదశరథుఁడా! భగవతియగు రాత్రిగడచినది; నీవీ రాత్రికాలంబునం జేయవలసిన కార్యంబులనెల్ల వేటిచినావు; నిద్ర మేలుకొనుము; ఇంకఁ జేయవలసిన కార్యంబులం జేయుము. అని, తాత్పర్యము.

బ్రాహ్మణా బలముఖ్యాశ్చ నైగమాశ్చాగతా నృప. ౨౪
దర్శనం ప్రతికాంక్షంతే ప్రతిబుద్ధ్యస్వ రాఘవ

టీక॥ నృప=మనుష్యులఁ బాలించునట్టి; రాఘవ = దశరథుఁడా! బ్రాహ్మ

తా:— బ్రాహ్మణులును; బలముఖ్యాశ్చ= సేనలో మేటియగువారును; నైగమాశ్చ = పట్టణమునందుండువారును; ఆగతాః=వచ్చినవారలై; దర్శనం= చూచుటను; ప్రతికాంక్షంతే—కోరుచున్నారు. ప్రతిబుధ్యస్వ= మేలుకొనుము.

దశరథమహారాజా! బ్రాహ్మణులును సేనలోముఖ్యులగువారలును, పట్టణమునందు నివసించువారును, వచ్చి, నిన్నుఁ జూడఁగోరుచున్నారు; నిద్రమేల్కొనుము. అని, సుమంత్రుండు, దశరథునిం,బొగడెను. అని, తాత్పర్యము.

స్తువంతం తం తదా సూతం సుమంత్రం మంత్రకోవిదమ్. ౨౫
ప్రతిబుధ్య తతో రాజా ఇదం వచన మబ్రవీత్

టీక॥ తతః=అటుపిమ్మట; రాజా= దశరథమహారాజు; ప్రతిబుధ్య=మేలుకొని; తదా=అప్పుడు; స్తువంతం=పొగడుచున్న; మంత్రకోవిదం= ఆలోచనలయందుఁ బండితుండగు; తం = ఆ; సూతం=సారథియగు సుమంత్రునిగూర్చి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్ =చెప్పెను.

అంతదశరథుండు మేల్కొని,అప్పుడు,ప్రస్తుతించుచున్నవాని మంత్రంబులఁ బండితుండగువానినాసుమంత్రుఁజూచి యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

రామ మానయ సూతేతి యదస్యభిహితో నయా. ౨౬
కిమిదం కారణం యేనమ మమాజ్ఞా ప్రతిహన్యతే

టీక॥ "సూత= సారథివగు సుమంతుఁడా! రామం=రాముని; ఆనయ= తోడ్కొనిరమ్ము" ఇతి = అని; అనయా=ఈకైకేయిచేత; అభిహితః = చెప్పఁబడినవాఁడవు; అసి (ఇతి) యత్—చెప్పఁబడినావనునదియేదిగలదో; సా=అట్టి; ఇయం=ఈ;మమ=నాయొక్క; ఆజ్ఞా=పనుపు; ప్రతిహన్యతే= కొట్టఁబడుచున్నది; ఇదం=ఈ ; కారణం=కారణము; కిం=ఏమి.

"సుమంత్రుఁడా! రామునిఁదోడ్కొనిరమ్ము" అని,యీకైకేయిచేతఁజెప్పఁబడితివే, దానిసేనొప్పకొని యుండుట వలన నదియు నాయాజ్ఞయే, అట్టియాజ్ఞను నీవిట్లుల్లంఘించుటకుఁ గారణంబేమి? అని,తాత్పర్యము.

న చైవ సంప్రసుప్తోఽహ మానయేహాశు రాఘవమ్. ౬౭

టీక॥అహం=నేను; నచైవసంప్రసుప్తః=నిద్రించినవాఁడనే కాను. ఇహ=ఇచ్చటికి; ఆశు=శీఘ్రముగా; రాఘవం=రాముని; ఆనయ=తోడుకొనిరమ్ము.

నేనిప్పుడు నిదురించియుండలేదు; నీవిప్పుడిచ్చటికి శీఘ్రముగా, రామునిం దోడ్కొనిరమ్ము. అని, దశరథుండు, సుమంత్రునకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి రాజా దశరథ స్సూతం తత్రాన్వశాత్పునః

టీక॥ఇతి=ఇట్లు; రాజా=రాజయిన; దశరథః=దశరథుఁడు; తత్ర=అకైకేయికార్యమువిషయమయి; సూతం=సారథియగుసుమంత్రుని; పునః=మఱల; అన్వశాత్=ఆజ్ఞాపించెను.

ఇట్లు, దశరథమహారాజు, అకైకేయికార్యమునిమిత్తమయి, సుమంత్రునకు, మఱలఁదా, నాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

స రాజవచనం శ్రుత్వా శిరసా ప్రతిపూజ్య తమ్. ౬౮
నిర్జగామ నృపావాసా న్మన్యమానః ప్రియం మహత్

టీక॥సః=ఆసుమంత్రుఁడు; రాజవచనం=దశరథమహారాజుమాటను; శ్రుత్వా=విని; తం=ఆదశరథమహారాజును; శిరసా=తలచేత; ప్రతిపూజ్య=పూజించి,నమస్కరించియనుట; మహత్=గొప్పదైన; ప్రియం=సంతోషమును; మన్యమానః=తలంచుచున్నవాఁడై; నృపావాసాత్=రాజగృహమునుండి; నిర్జగామ=బయలువెడలెను.

ఆసుమంత్రుండు, దశరథునాజ్ఞనువిని, దశరథునకునమస్కరించి, "ఇంక రామునకుఁబట్టాభిషేకంబగును," అని, తలంచుచు, రాజగృహంబువెడలెను.

అని, తాత్పర్యము.

ప్రసన్నో రాజమార్గం చ పతాకాధ్వజశోభితమ్. ౬౯
హృష్టః ప్రముదిత స్సూతో జగామాశు విలోకయన్

టీక॥సూతః= సారథియగుసుమంత్రుండు; ప్రసన్నః=నిర్మలంబగుహృదయంబుగలవాఁడై; హృష్టః= గగుర్పాటునొందినవాఁడై; ప్రముదితః=సంతసించినవాఁడై, పతాకాధ్వజశోభితం= రాజచిహ్నములు వ్రాసినబెత్తములచేతను పట్టెబెత్తములచేతను అలంకరింపఁబడిన; రాజమార్గం= రాజమార్గమును; విలోకయన్ చ=చూచుచును; శీఘ్రం=శీఘ్రముగా; జగామ=పోయెను.

సుమంత్రుండు, నిర్మలహృదయుండై, గగుర్పాటునొంది, పరమసంతోషంబున, రాజచిహ్నంబులు వ్రాసినబెత్తంబులను పట్టెబెత్తంబులను, అలంకృతమయియుండు, రాజమార్గము జూచుచు, శీఘ్రంబుగాఁ, బోయెను. అని, తాత్పర్యము.

స సూత స్తత్ర శుశ్రావ రామాధికరణాః కథాః. ౩౦
అభిషేచనసంయుక్తా స్సర్వలోకస్య హృష్టవత్

టీక॥సః=ఆ; సూతః=సుమంత్రుండు; హృష్టవత్=సంతసించినవాఁడై; తత్ర=ఆ రాజమార్గమందు; సర్వలోకస్య=సమస్తజనముయొక్క; రామాధికరణాః= రామునిగుఱించినవియును; అభిషేచనసంయుక్తాః = పట్టాభిషేకముతోఁగూడినవియును, పట్టాభిషేకప్రస్తావముతోఁగూడినవియుననుట(అగు); కథాః=మాటలను; శుశ్రావ=వినెను.

ఆసుమంత్రుండు, సంతోషంబునొంది, యచ్చట, జనులందఱును, రామునిపట్టాభిషేకంబును గుఱించి చెప్పుకొను మాటలను, వినెను. అని, తాత్పర్యము.

తతో దదర్శ రుచిరం కైలాసశిఖరప్రభమ్. ౩౧
రామవేశ్మ సుమంత్రస్తు శక్రవేశ్మసమప్రభమ్

టీక॥తతః= అటుపిమ్మట; సుమంత్రస్తు=సుమంత్రుఁడు; ( "తు" అనునది పాదపూరణార్థము); రుచిరం= మనోహరంబును; కైలాసశిఖరప్రభం=కైలాసపర్వతము శిఖరముయొక్క కాంతివంటి కాంతిగలదియును ; శక్రవేశ్మ

సమప్రభం=ఇంద్రునియింటితో సమానమయినకాంతిగలదియునగు ; రామవేశ్మ=రామునియింటిని ; దదర్శ=చూచెను.

అంతసుమంత్రుండు , మనోహరంబై, కైలాసపర్వత శిఖరంబుంబోలెఁ జూడనగుచు , దేవేంద్రగృహంబునకు సాటివచ్చుచున్న, రామునిగృహంబుం జూచెను. అని, తాత్పర్యము.

మహాకవాటవిహితం వితర్దిశతశోభితమ్. ౩౨
కాంచనప్రతిమైకాగ్రం మణివిద్రుమతోరణమ్
శారదాభ్రఘనప్రఖ్యం దీప్తం మేరుగుహోపమమ్. ౩౩
మణిభి ర్వరమాల్యానాం సుమహద్భి రలంకృతమ్
ముక్తామణిభి రాకీర్ణం చందనాగరుభూషితమ్. ౩౪
గంధాన్ మనోజ్ఞాన్ విసృజ ద్దార్దరం శిఖరం యథా
సారసైశ్చ మయూరైశ్చ వినదద్భి ర్విరాజితమ్. ౩౫
సుకృతేహామృగాకీర్ణం సుకీర్ణం భక్తిభి స్తథా
మనశ్చక్షుశ్చ భూతానా మాదద త్తిగ్మ తేజసా. ౩౬
చంద్రభాస్కర సంకాశం కుబేర భవనోపమమ్
మహేంద్ర ధామ ప్రతిమం నానాపక్షి సమాకులమ్. ౩౭
మేరుశృంగసమం సూతో రామవేశ్మ దదర్శ హ
ఉపస్థితై స్సమాకీర్ణం జనై రంజలికారిభిః. ౩౮
ఉపాదాయ సమాక్రాంతై స్తథా జానపదై ర్జనైః
రామాభిషేకసుముఖై రున్ముఖై స్సమలంకృతమ్. ౩౯
మహామేఘ సమప్రఖ్య ముదగ్రం సువిభూషితమ్
నానారత్న సమాకీర్ణం కుబ్జకైరాతకావృతమ్. ౪౦

టీక॥ సూతః=సుమంత్రుండు; మహాకవాటవిహితం= పెద్దతలుపులతోఁ గూడినదియును; వితర్దిశతశోభితం= తిన్నెలయొక్క నూటిచేతనలంకరింపఁబడినదియును; కాంచనప్రతిమైకాగ్రం= బంగారుబొమ్మలతోఁ గూడిన ముఖ్యము

లంఘనశిఖరములు గలదియును; మణివి
ద్రుమతోరణం=మణులతోను బగడము
లతోను జేయఁబడిన వెలుపలిద్వారము
గలదియును; శారదాభ్రఘనప్రఖ్యం=
శరదృతువునందలి మేఘముయొక్కయు
ధికమయిన కాంతివంటి కాంతిగలదియు
ను; దీప్తం = ప్రకాశించుచున్నదియు
ను; మేరుగుహాసమం= మేరుపర్వత
మునందలిగుహతోఁ బోల్కిగలదియు
ను;వరమాల్యానాం= శ్రేష్ఠములయిన
మాలికలయొక్క, బంగారుపూల మా
లికలయొక్కయనుట; మహద్భిః= గొ
ప్పవైన; మణిభిః=రత్నములచేత ; అ
లంకృతం=అలంకరింపఁబడినదియును ;
ముక్తామణిభిః=ముత్తెములచేతనురత్న
ములచేతను; ఆకీర్ణం=వ్యాపింపఁబడి
నదియు; చందనాగరుభూషితం= చం
దనముచేతను అగరువుచేతను అలంక
రింపఁబడినదియును; మనోజ్ఞాన్= మ
నోహరములయిన; గంధాన్= వాస
నలను; విసృజత్= విడుచుచున్నదియు
ను; కావుననే; దార్దరం=దర్దరప
ర్వతము సంబంధమయిన ; శిఖరంయ
థా (స్థితం)= శిఖరముంబోలె నున్న
దియును; వినదద్భిః= కూయుచున్న ;
సారసైశ్చ=సారసపక్షులచేతను ; మ
యూరైశ్చ = నెమళ్లచేతను; విరాజి
తం=ప్రకాశింపఁజేయఁబడినదియును ;
సుకృతేహామృగాకీర్ణం= చక్కఁగాఁ
జేయఁబడినతోడేళ్ల ప్రతిమలచే వ్యా
పింపఁబడినదియును;తథా=అట్లు; భ
క్తిభిః=వడ్లంగివాండ్రయొక్క సూక్ష్మ
ములయిన చిత్రశిల్పకార్యములచేత;సు
కీర్ణం=చక్కఁగా వ్యాపింపఁబడినది
యును; తీక్ష్ణతేజసా=తీక్ష్ణమయినకాం
తిచేత, అధికమయినకాంతిచేతననుట;
భూతానాం = ప్రాణులయొక్క;మ
నః=మనసును; చక్షుశ్చ=కంటిని; ఆద
దత్ =గ్రహించుచున్నదియును ; చం
ద్రభాస్కరసంకాశం= చంద్రునితోను
సూర్యునితోను సమాన మయినదియు
ను; కుబేరభవనోపమం = కుబేరుని
యింటితోఁ బోల్కి గలదియును; మ
హేంద్రధామప్రతిమం = దేవేంద్రుని
యింటితోఁ బోల్కిగలదియును; నా
నాపక్షిసమాకులం = నానావిధము
లయిన పక్షులతో నిండినదియును; మే
రుశృంగసమం = మేరు పర్వతము
యొక్క శిఖరముతోసమాన మయినది
యును ; ఉపస్థితైః = సమీపమం
దున్నవారును;అంజలికారిభిః= చేమో
డ్పులుచేయువారలునగు;జనైః= జను

లచేత; సమాకీర్ణం = వ్యాపింపఁబడినది యును; తథా = అట్లు; ఉపాదాయ = కానుకలనుదీసికొని; సమాక్రాంతైః = వచ్చినవారును; రామాభిషేక సుముఖైః = రామునిపట్టాభిషేకముచే, సంతోషించినముఖంబుగలవారలును, రాముఁకిపట్టాభిషేకముగాఁగలదనిసంతోషమునొందియున్నవారుననుట; ఉన్ముఖైః = ఉత్సాహముగలవారలునగు; జానపదైః = గ్రామములనుండు; జనైః = జనులచేత; సమలంకృతం = చక్కఁగానలంకరింపఁబడినదియును; మహామేఘసమప్రఖ్యం = గొప్పమేఘముతోసమానమయిన కాంతిగలదియును; ఉదగ్రం = ఉన్నతమయినదియును; సువిభూషితం = చక్కఁగానలంకరింపఁబడినదియును; నానారత్నసమాకీర్ణం = నానావిధములయినమణులచే వ్యాపింపఁ బడినదియును; కుబ్జకైరాతకావృతం = గూనివారలచేతను, స్వల్పమయిన దేహము గలవారలసమూహములచేతనుజుట్టఁబడినదియునగు; రామవేశ్మ = రామునిగృహంబును; దదర్శ = చూచెను. "హ" అనునదిపాదపూరణార్థము.

సుమంత్రుం, డంత, పెద్దతలుపును బెక్కుతిన్నెలునుగలిగి, బంగారుప్రతిమలతోఁగూడినశిఖరంబులతోను, మణులతోఁబవడంబులతోఁజేయఁబడినబహిర్ద్వారంబులతోను, ఒప్పుచు, శరత్కాలమునందలిమేఘంబుంబోలినదై, ప్రదీప్తంబై, మేరుగుహయుంబోలె గంభీరంబై, కట్టఁబడియుండు బంగారుపుష్పంబులమాలికలమధ్య ప్రదేశంబులం గూర్పఁబడినయుత్తమమణులం జేజరిల్లుచు, ముత్తెములతోను రత్నములతోను నిండినదై, చందనాగరుగంధంబులగుబాళించుచు, నట్లుమనోహర వాసనలుగొట్టుచుండుటంజేసి, దర్దుర పర్వతశిఖరంబుంబోలెఁ బొసఁగుచు, మధురంబుగాఁగూఁతలువేయుచుండుసారస పక్షులచేతను నెమళ్ల చేతనుం బ్రకాశించుచు, స్తంభంబులం జక్కఁగా జేయఁబడియుండుతోడేళ్ల ప్రతిమలం గూడినదై, వడ్లంగివారలసూక్ష్మంబులగు చిత్రశిల్పంబులనొప్పుచు, అధికకాంతి గలిగియుంటంజేసి, చూపరులమనంబుల నేత్రంబులనాకర్షించుచుఁ, జంద్రునితోను సూర్యునితోను సాటియగుచుఁ, గుబేరునిగృహంబుతో సమ[illegible]ంబై, దేవేంద్రునిగృహంబుతోఁదుల్యంబై, నానావిధపక్షుల సంపూర్ణంబై, మేరుపర్వత శిఖర సదృశంబై, సమీ

స ౧౫

పంబునకు వచ్చి చేతుల మొగిడ్చికొనియున్నజనులతోఁ గూడి, యట్లుగ్రామముల నుండి కానుకలఁ దీసికొని వచ్చి, రామునకుఁబట్టాభిషేకంబు కాఁగలదని సంతోషంబు నొందిపరమోత్సాహంబుతో నున్న జానపదజనులచే నలంకృతంబై, మహామేఘంబుంబోలుచునదై యున్నతంబై, చక్రాంగానలంకృతంబై నానారత్నంబుల నాకీర్ణంబై, కూనివాండ్రును స్వల్పశరీరము గలవారలును మెండుగాఁగలిగి, యొప్పుచున్న, రామునిగృహంబుం జూచెను.

అని, తాత్పర్యము.

సవాజియుక్తేన రథేన సారథి
ర్నరాకులం రాజకులం విలోకయన్
వరూథినా రామగృహాభిపాతినా
పురస్య సర్వస్య మనాంసి రంజయత్. ౪౧

టీక॥ సః=ఆ; సారథిః=సారథియగుసుమంత్రుఁడు; నరాకులం=మనుష్యులచేనిండుకయున; రాజకులం= రాజగృహమును, రామగృహమునసుట; విలోకయన్=చూచుచు; వరూథినా=మీఁదికప్పుగలదియును; వాజియుక్తేన= గుఱ్ఱములతోఁగూడినదియును; రామగృహాభిపాతినా= రామునియింటికిఁగూర్చిపోవుచున్నదియునగు; రథేన=రథముచేత; సర్వస్య=సమస్తమయిన; పురస్య=పట్టణముయొక్క, పట్టణమునందుండు జనులయొక్క యనుట; మనాంసి=మనసులను; రంజయత్ (అరంజయత్)= సంతోషించునట్లుచేసెను.

ఆసుమంత్రుండు, మనుష్యులు నిండియుండు రామగృహంబును జూచుచు, మీఁదికప్పుతోఁ గూడి గుఱ్ఱములు గట్టియుండు రథంబును, రామగృహంబున కభిముఖంబుగాఁ, దోలుకొని పోవుచు, నాపట్టణంబునందు సమస్తజనులకును, సంతోషంబుగల్గునట్లుచేసెను.

అని, తాత్పర్యము.

తతస్సమాసాద్య మహాధనం మహ
త్ప్రహృష్టరోమా స బభూవ సారథిః

౧౫

మృగైర్మయూరైశ్చ సమాకులోల్బణమ్
గృహం వరార్హస్య శచీపతేరివ. ४०

టీక॥ తతః=అటుపిమ్మట; సః=ఆ; సారథిః= సుమంత్రుండు; మహత్= గొప్పదియును; మహాధనం= అధికమయినధనముగలదియును; మృగైః=మృగములచేతను; మయూరైశ్చ=నెమళ్లచేతను; సమాకులోల్బణం= మిక్కిలియునిఱుకయినదియును ; వరార్హస్య=శ్రేష్ఠుండయిన రామునియొక్క ; గృహం=ఇంటిని; సమాసాద్య= పొంది; శచీపతేః = ఇంద్రునియొక్క; గృహంసమాసాద్య (అధ్యాహృతము) ఇవ=ఇంటినిబొందివలె ; ప్రహృష్టరోమా=మిక్కిలియు గగుర్పాటునొందిన వెండ్రుకలుగలవాఁడు; బభూవ= ఆయెను.

అంత,నాసుమంత్రుండు , గొప్పదియుమిగుల ధనంబుతోఁ గూడినదియునై మృగాశ్వకంబులును మయూరంబులును గలదియునగు నారాముని గృహంబుఁజేరి, దేవేంద్రుని గృహంబుఁజేరినట్లు, అధికసంతోషంబున దేహంబంతయు గగుర్పాటునొందెను.

అని, తాత్పర్యము.

తత స్స కైలాసనిభా స్స్వలంకృతాః
ప్రవిశ్య కక్ష్యా స్త్రిదశాలయోపమాః
ప్రియా న్నరాన్ రామమతే స్థితాన్ బహూ
నపోహ్య శుద్ధాంత ముపస్థితో రథీ. ४३

టీక॥ తతః=అటుపిమ్మట;సః=ఆ;రథీ=సుమంత్రుఁడు;కైలాసనిభాః=కైలాసపర్వతముతో సమానములయినవియును;స్వలంకృతాః=చక్కఁగానలంకరింపఁబడినవియును; త్రిదశాలయోపమాః=దేవతలయిండ్లతోఁబోలికగలవియునగు; కక్ష్యాః=తొట్టికట్లను; ప్రవిశ్య=చొచ్చి; ప్రియాన్=ఇష్టులును;రామమతే=రామునిమతమందు;స్థితాన్=ఉన్నవారలును; బహూన్=అనేకులునగు;నరాన్=మనుష్యులను; అపోహ్య=అతిక్రమించి; శుద్ధాంతం=అంతఃపురమును;ఉపస్థితః= సమీపించినాఁడు.

అంత, నాసుమంత్రుఁడు, కైలాస

పర్వతంబులం బోలెడి యెల్లంగా నున్నతంబులయి దేవతల యిండ్లకు సాటివచ్చుచున్న తొట్టికట్లం బ్రవేశించి, రామునకుం బ్రియులు రాముని మతంబు ననుసరించు వారల ననేకపురుషుల నతిక్రమించి, యంతఃపురంబునొద్దకుం బోయెను.

అని, తాత్పర్యము.

స తత్ర శుశ్రావ చ హర్షయుక్తా
రామాభిషేకార్థకృతా జనానామ్
నరేంద్రసూనో రభిమంగళార్థాః
సర్వస్య లోకస్య గిరః ప్రహృష్టః. ౪౪

టీక॥ తత్ర=అచ్చట; సః=ఆసుమంత్రుండు; ప్రహృష్టః=మిగులసంతసించినవాండై; హర్షయుక్తాః= సంతోషముతోం గూడినవియును; రామాభిషేకార్థకృతాః = రామునిపట్టాభిషేకముకొఱకుం జేయంబడినవియును; నరేంద్రసూనోః=రాజపుత్రుండగు రామునకును; సర్వస్య= సమస్తమయిన; లోకస్య=ప్రపంచమునకును; అభిమంగళార్థాః=అంతటను మంగళము ప్రయోజనముగాం గలదియునగు; జనానాం=జనులయొక్క; గిరః=మాటలను; శుశ్రావ=వినెను.

అచ్చట, నాసుమంత్రుండు, పరమసంతోషంబునొంది, జనులు, సంతోషంబున రామాభిషేకంబుగుఱించియు, రామునకు సమస్తలోకంబునకును మంగళంబు గలుగుటనుగుఱించియుం, జెప్పుచున్న, మాటలనువినెను.

అని, తాత్పర్యము.

మహేంద్రసద్మప్రతిమం తు వేశ్మ
రామస్య రమ్యం మృగపక్షిజుష్టమ్
దదర్శ మేరో రివ శృంగ ముచ్చమ్
విభ్రాజమానం ప్రభయా సుమంత్రః. ౪౫

టీక॥ సుమంత్రః=సుమంత్రుండు; మహేంద్రసద్మప్రతిమం= దేవేంద్రసౌధ

ప్రచ్ఛిన్న మత్యంకుశ మప్రసహ్యమ్
రామోపవాహ్యం రుచిరం దదర్శ
శత్రుం జయం నాగ ముదగ్రకాయమ్. ౪౭

టీ॥ తతః=అటుపిమ్మట; సః (అధ్యాహృతము)=ఆసుమంత్రుండు; మహామేఘమహీధరాభం= గొప్ప మేఘముయొక్కయుఁ గొండ యొక్కయుఁగాంతివంటికాంతిగలదియును; ప్రచ్ఛిన్నం=మదించియున్నదియును; అత్యంకుశం=అంకుశమునతిక్రమించి నదియును; అప్రసహ్యం=సహింపఁగూడనిదియు; రామోపవాహ్యం = రామునకెక్కఁదగినదియును; రుచిరం= మనోహరంబయినదియును; ఉదగ్రకాయం=ఉన్నతమయిన మేనుగలదియునగు; శత్రుంజయం=శత్రుంజయంబను ; నాగం=ఏనుంగును; దదర్శ=చూచెను.

అంతనాసుమంత్రుం,డచ్చట, మహామేఘంబునకును బర్వతంబునకును సరివచ్చునదియై, మదించి, యంకుశమునకు సరకుసేయనిదై యప్రసహ్యంబై , రామునకెక్కఁ దగినదై, మనోహరంబై, యున్నతంబగు మేనుగలిగియొప్పుచుండు , శత్రుంజయంబను, గజంబుం, జూచెను. అని, తాత్పర్యము.

స్వలంకృతాన్ సాశ్వరథాన్ స కుంజరా
న మాత్యముఖ్యాన్ శతశశ్చ వల్లభాన్
వ్యపోహ్య సూత స్సహితాన్ సమంతత
స్సమృద్ధ మంతఃపుర మావివేశ. ౪౮

టీక॥సూతః=సారథియగు సుమంత్రుండు; స్వలంకృతాన్=చక్కఁగా నలంకరింపఁ బడిన వారును ; సాశ్వరథాన్=గుఱ్ఱములతోను రథములతోను గూడినవారలును; సకుంజరాన్= ఏనుంగులతోఁగూడినవారలును ; సహితాన్=ఒక్కటిగాఁగూడుకొనియున్నవారలునగు; అమాత్యముఖ్యాన్= మంత్రులలోశ్రేష్ఠులగువారలను; శతశః= అనేకులయిన; వల్లభాంశ్చ=రాజునకుఁ బ్రియులగువారలను; వ్యపోహ్య= అతిక్రమించి; సమంతతః=అంతటను; స

మృద్ధం=సంసదతోఁగూడియుండు; అంతఃపురం=అంతిపురమును; ఆవివేశ=ప్రవేశించెను.

సారథియగుసుమంత్రుండు, అచ్చట, సర్వాలంకారంబులం దేజరిల్లుచుగుఱ్ఱములతోనురథములతోను గజములతోనుంగూడినవారల, నొకటిగాఁజేరిన వారలనేకుల మంత్రిముఖ్యులనురాజవల్లభులను, దాఁటి, సర్వసంపదలం జెలంగుచుండునంతఃపురంబుం, బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

తదద్రికూటాచలమేఘసన్నిభమ్
మహావిమానోత్తమవేశ్మసంఘవత్
అవార్యమాణః ప్రవివేశ సారథిః
ప్రభూతరత్నం మకరో యథార్ణవమ్. ౪౮

టీక॥ సారథిః=సుమంత్రుండు; అద్రికూటాచలమేఘసన్నిభం= పర్వతశిఖరముతోను కదలకున్న మేఘంబుతోను సమానమయినదియును; మహావిమానోత్తమవేశ్మసంఘవత్ = పెద్దమేడంతస్తులమేడలతోఁ గూడిన యుత్తమగృహంబుల సమూహము గలదియునగు; తత్=ఆయంతఃపురమును; అవార్యమాణః=అడ్డగింపఁబడనివాఁడై; మకరః=పెద్దచేఁప; ప్రభూతరత్నం= అధికములయినమణులుగల; అర్ణవం యథా=సముద్రమునుంబోలె; ప్రవివేశ=ప్రవేశించెను.

సుమంత్రుండు, పర్వతశిఖరంబుతోను, నిశ్చలమగు మేఘంబులతోను సమానంబై ఏడంతస్తులమిద్దెలతోఁగూడినగృహంబులనేకములుగలదైయుండు, నాయంతఃపురంబును, మకరము రత్నాకరంబగుసముద్రంబుఁజొచ్చునట్లు, ఎంతమాత్రమడ్డిలేనివాఁడై, ప్రవేశించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, పంచదశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానం బగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ పంచదశసర్గటీక, ముగిసినది.



శ్రీ

## షోడశసర్గప్రారంభః.

స తదన్తఃపురద్వారం సమతీత్య జనాకులమ్
ప్రవివిక్తాం తతః కక్ష్యా మాససాద పురాణవిత్. ౧
ప్రాసకార్ముకబిభ్రద్భి ర్యువభి ర్మృష్టకుండలైః
అప్రమాదిభి రేకాగ్రై స్స్వనురక్తై రధిష్ఠితామ్. ౨

టీక॥ పురాణవిత్ = పురాతనవృత్తాంతంబులనెఱింగిన; సః = ఆసుమంత్రుండు; జనాకులం=జనులచేనిండిన; తత్ = ఆ; అంతఃపురద్వారం=అంతఃపురముయొక్క-వాకిటిని; సమతీత్య= దాటి; తతః = అటుపిమ్మట; ప్రాసకార్ముకబిభ్రద్భిః= ఈటెలను ధనుస్సులను ధరించుచున్నవారును; యువభిః = యౌవనముగలవారలును; మృష్టకుండలైః =తుడువఁబడినకుండలములు గలవారలును; అప్రమాదిభిః= ఏమఱుపాటులేనివారలును; ఏకాగ్రైః=నిశ్చలబుద్ధులయినవారలును; స్వనురక్తైః=రామునియందు మిక్కిలియనురాగము గలవారలన పురుషైః(అధ్యాహృతము)=పురుషులచేత; అధిష్ఠితాం= అధిష్ఠింపఁబడినదియును; ప్రవివిక్తాం= జనసమ్మర్దములేనిదియు నగు; కక్ష్యాం=తొట్టికట్టును; ఆససాద=పొందెను.

పురాతనరాజవృత్తాంతములనెఱింగినసుమంత్రుండు, జనులచేనిండియుండు నాయంతఃపురద్వారము నతిక్రమించి, యంత, ఈటెలను ధనుస్సులను ధరించి, తుడువఁబడినవగుటంజేసి కాంతియుక్తంబులైన కుండలంబులతో నొప్పుచు, నేమఱుపాటులేక, నిశ్చలబుద్ధులయి, రామునియందనురాగంబుగల్గియుండు, యౌవనపురుషులచే, రక్షింపఁబడుచున్నదియు, జనసమ్మర్దములేనిదియునగు, తొట్టికట్టుం జేరెను. అని, తాత్పర్యము.

తత్ర కాషాయిణో వృద్ధా న్వేత్రపాణీ న్స్వలంకృతా న్
దదర్శ విష్ఠితా న్ద్వారి స్త్ర్యధ్యక్షా న్సుసమాహితా న్. ౩

టీక॥ సః(అధ్యాహృతము)= ఆసుమంత్రుండు; తత్ర=అచ్చట; కాషాయిణః=కాషాయవస్త్రముగలవారలును; వృద్ధా న్=ముసలివారలును; వేత్రపాణీ న్=బెత్తములు చేతులందుఁ గలవారలును; స్వలంకృతా న్=చక్కఁగానలంకరింపఁ బడినవారలును; సుసమాహితా న్= మిక్కిలియు నెచ్చరికగలవారలును; ద్వారి = వాకిలియందు; విష్ఠితా న్ = ఉన్నవారలునగు; స్త్ర్యధ్యక్షా న్=స్త్రీలకధ్యక్షులగువారలను; దదర్శ=చూచెను.

ఆసుమంత్రుండు,అచ్చటఁ, గాషాయవస్త్రము ధరించి, వేత్రములు చేతులందాల్చి,చక్కఁగానలంకరించుకొని, వాకిలియందుఁ గావలియున్నవారల, నంతఃపురస్త్రీలకధ్యక్షులం,జూచెను.

అని, తాత్పర్యము.

తే సమీక్ష్య సమాయాంతం రామప్రియ చికీర్షవః
సహసో త్పతితా స్సర్వే స్వాసనేభ్య స్ససంభ్రమాః. ౪

టీక॥ తే = ఆకావలివాండ్రు; సర్వే=అందఱును; సమాయాంతం= వచ్చుచున్నసుమంత్రుని; సమీక్ష్య= చూచి; రామప్రియచికీర్షవః=రామునకుఁ బ్రియమునుఁజేయఁగోరువారలయి ; ససంభ్రమాః=వేగిరపాటుగలవారలై; సహసా=వేగముగా; స్వాసనేభ్యః=తమయాసనంబులనుండి; ఉత్పతితాః=లేచిరి.

ఆకావలివాండ్రందఱును, రామునకుఁబ్రియంబు సేయువారలుకావున, సుమంత్రుని గాంచినచో రామునకుఁ బ్రియంబగు నని , తలంచి , సుమంత్రుండువచ్చుటంజూచి , వేగంబునఁ,దమయాసనంబులనుండి, లేచిరి.

అని, తాత్పర్యము.

తా నువాచ వినీతాత్మా సూతపుత్రః ప్రదక్షిణః
క్షిప్ర మాఖ్యాత రామాయ సుమంత్రో ద్వారి తిష్ఠతి. ౫

టీక॥ ప్రదక్షిణః = మిక్కిలి యొయుస రథుండగు; సూతపుత్రః = సారథికొడుకైనసుమంత్రుండు; వినీతాత్మా = వినయముతోఁ గూడిన మనసు గలవాఁడై; తాన్ = ఆకావలివాండ్రనుఁగూర్చి; "సుమంత్రః = సుమంత్రుఁడు; ద్వాః = వాకిలియందు; తిష్ఠతి = ఉన్నాఁడు. ఇతి (అధ్యాహృతము) = అని; రామాయ = రామునికొఱకు; క్షిప్రం = శీఘ్రముగా; ఆఖ్యాత = చెప్పుఁడు." ఇతి (అధ్యాహృతము) = అని; ఉవాచ = పలికెను.

సుమంత్రుండు, మిగులసరళుఁడుగావున, వినయంబున, వారలంజూచి, "సుమంత్రుండు వాకిటవచ్చికను పెట్టియున్నాఁడని, శీఘ్రముగా రామునకుఁ జెప్పుఁడు" అని చెప్పెను. అని, తాత్పర్యము.

తే రామ ముపసంగమ్య భర్తుః ప్రియ చికీర్షవః
సహభార్యాయ రామాయ క్షిప్రమే వాభిచక్షిరే. ౮

టీక॥ భర్తుః = ప్రభువైనరామునకు; ప్రియచికీర్షవః = సంతోషంబు సేయఁగోరునట్టి; తే = ఆకావలివాండ్రు; రామం = రాముని; ఉపసంగమ్య = పొంది; క్షిప్రమేవ = శీఘ్రముగానే; సహభార్యాయ = భార్యతోఁగూడిన; రామాయ = రామునికొఱకు; అభిచక్షిరే = చెప్పిరి.

ఆకావలివాండ్రు, తమకునాథుండగు రామునకుఁ బ్రియంబు సేయఁగోరువారలు కావున, శీఘ్రముగానే, రాముని యొద్దకుఁబోయి, భార్యాసహితుండై యున్నరామునితో, సుమంత్రుండు వాకిటవచ్చియున్నాఁడని, విన్నవించిరి. అని, తాత్పర్యము.

ప్రతివేదిత మాజ్ఞాయ సూత మభ్యంతరం పితుః
తత్రైవానాయయామాస రాఘవ ప్రియకామ్యయా. ౯

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; ప్రతివేదితం = కావలివాండ్రచేతఁదెలుపఁబడిన; పితుః = తండ్రికి; అభ్యంతరం = అంతరంగప్రాయుఁడైన, మిగులనాప్తుఁడైన, యనుట; సూతం = సుమంత్రుని; ఆజ్ఞాయ = తెలి

స ౧౬

సికొని; రాఘవప్రియకామ్యయా=దశరథునకుసంతోషంబు సేయనిచ్ఛచేత; తత్రైవ = అచ్చటికే; ఆనాయయామాస=రప్పించెను.

రాముండు కావలివాండ్రవలన, దనత్యంతప్రియుండగు దశరథునకు మిక్కిలియాప్తుండైనసుమంత్రుండు వచ్చియుండుట నెఱింగి, దశరథునకుం బ్రియంబగుటకై, భార్యాసహితుండై యున్న స్థలంబునకే యాసుమంత్రుని, రప్పించెను. అని తాత్పర్యము.

తం వైశ్రవణసంకాశ ముపవిష్టం స్వలంకృతమ్
దదర్శ సూతః పర్యంకే సౌవర్ణే సోత్తరచ్ఛదే. ౮
వరాహరుధిరాభేణ శుచినా చ సుగంధినా
అనులిప్తం పరార్ధ్యేన చందనేన పరంతపమ్. ౯
స్థితయా పార్శ్వతశ్చాపి వాలవ్యజనహస్తయా
ఉపేతం సీతయా భూయ శ్చిత్రయా శశినం యథా. ౧౦

టీక॥ సూతః= సుమంత్రుండు; వైశ్రవణసంకాశం = కుబేరునితో సమానుండైనవాండును; స్వలంకృతం= చక్కంగా నలంకరింపంబడినవాండును; సౌవర్ణే= బంగారువికారమయినదియు; సోత్తరచ్ఛదే=పైనబఱచువస్త్రముతోంగూడినదియునగు; పర్యంకే= పాన్పునందు; ఉపవిష్టః= కూర్చున్నవాండును; వరాహరుధిరాభేణ= పందినెత్తురుకాంతివంటి కాంతి గలదియును; శుచినా=పరిశుద్ధమును ; సుగంధినాచ=మంచివాసనగలదియును; పరార్ధ్యేన=శ్రేష్ఠమునగు; చందనేన=చందనముచేత; అనులిప్తం= పూయంబడినవాండును; పరంతపం=శత్రువులం దపింపంజేయువాండును ; పార్శ్వతశ్చాపి=ప్రక్కను; స్థితయా= ఉన్నదియును; వాలవ్యజనహస్తయా= చామరముచేతియందుం గలదియును ; సీతయా=సీతతో; ఉపేతం=కూడినవాండును; కావుననే; భూయః= అధికముగా; విరాజమానం=ప్రకాశించుచున్నవాండును; చిత్రయా = చిత్రానక్షత్రముతో; ఉపేతం(అధ్యాహృతము)= కూడిన; శశినంయథా(స్థితం)= చంద్రుండుంబోలెనున్నవాండునగుతం=ఆరా

ముని; దదర్శ=చూచెను.

కుబేరునితో సమానుండై చక్కఁగానలంకారంబులు ధరించినవాఁడై, మేలయిన ప్రచ్ఛదపటము పఱచియుండు బంగారుపాన్పునందుఁ గూర్చుండి, పందినెత్తురుంబోలె నెఱ్ఱఁగాఁ బరిశుద్ధంబై మంచివాసన గలిగియుండు శ్రేష్ఠంబగు చందనంబుబూసికొని, ప్రక్కనుచామరంబు చేతందాల్చి వీచుచున్న సీతతోఁ గూడి యుండుటం జేసియినుమడిగాఁ బ్రకాశించుచు, చిత్రనక్షత్రంబుతోఁ గూడిచంద్రుండుంబోలెఁ జూడనగుచున్న, రామునిం, జూచెను. అని, తాత్పర్యము.

తం తపంత మివాదిత్య ముపపన్నం స్వతేజసా
వవందే వరదం వందీ వినయజ్ఞో వినీతవత్. ౧౧

టీక॥ వినయజ్ఞః=వినయంబు నెఱింగిన; వందీ = స్తుతిపాఠకుండగు సుమంత్రుండు; వినీతవత్=వినయంబుగలవాఁడై; తపంతం=తపింపఁ జేయుచున్న; ఆదిత్యమివ(స్థితం)= సూర్యుండుంబోలె నున్నవాఁడును; స్వతేజసా= తనకాంతితోఁ; ఉపపన్నం=కూడినవాఁడును; వరదం=వరంబులనిచ్చువాఁడునగు; తం=ఆ రాముని; వవందే=నమస్కరించెను.

వినయంబుగల యాసుమంత్రుండు, సూర్యుండుంబోలె, దేహకాంతిచే వెలుంగుచున్నవాని, నాశ్రితులకు వరంబులనిచ్చువాని, నారాముని, వినయంబున, నమస్కరించెను. అని, తాత్పర్యము.

ప్రాంజలిస్తు సుఖం పృష్ట్వా విహారశయనాసనే
రాజపుత్ర మువాచేదం సుమంత్రో రాజసత్కృతః. ౧౨

టీక॥ రాజసత్కృతః=దశరథమహారాజుచే గౌరవింపఁ బడినట్టి; సుమంత్రః=సుమంత్రుఁడు; ప్రాంజలిస్తు = మంచిచేమోడ్పుగలవాఁడై యే; విహారశయనాసనే=విహరించుటయందును; పరుండుటయందును; గూర్చుండుటయందును; సుఖం=సౌఖ్యమును; రాజపుత్రం=రాజకొమారుండగు రాముని; పృష్ట్వా=అడిగి; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

దశరథమహారాజుచేగౌరవింపఁ బడునట్టిసుమంత్రుండు, రామునిఁ, "ఏకాంతవిహారాదులందునీకుసుఖమేనా ? అనియడిగి,మఱలనిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కౌసల్యాసుప్రజా రామ పితా త్వాం ద్రష్టు మిచ్ఛతి
మహిష్యా సహ కైకేయ్యా గమ్యతాం తత్ర మాచిరమ్. ౧౩

టీక॥ రామ=రాముఁడా! త్వయా (అధ్యాహృతము)=నీచేత; కౌసల్యా=కౌసల్య; సుప్రజాః=మంచికొడుకు గలది; పితా = తండ్రియగుదశరథుండు; మహిష్యా=రాణియగు; కైకేయ్యాసహ=రాణితోఁగూడి; త్వాం=నిన్ను; ద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛతి= కోరుచున్నాఁడు. తత్ర=అచ్చటికి; మాచిరం=శీఘ్రముగా; గమ్యతాం = పొందఁబడుఁగాక.

రామఁడా! నిన్నుఁగనుటచేసి కౌసల్యాసుపుత్రయయినది ; దశరథుండును కైకేయియును, నిన్నుఁజూడఁ గోరుచున్నారు, అచ్చటికిశీఘ్రముగా రమ్ము. అని, సుమంత్రుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవము క్తస్తు సంహృష్టో నరసింహో మహాద్యుతిః
తత స్సంమానయామాస సీతా మిద మువాచహ. ౧౪

టీక॥ మహాద్యుతిః = అధికమయిన కాంతిగలవాఁడును; నరసింహస్తు=మనుష్యశ్రేష్ఠుండునగు రాముండును ; ఏవం=ఇట్లు ; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; సంహృష్టః=మిక్కిలియుసంతోషమునొందినవాఁడై; తతః=అంత; సుమంత్రం (అధ్యాహృతము)= సుమంత్రునిన్ ; సమ్మానయామాస = పూజించెను; సీతాం=సీతనుగూర్చి ; ఇదం= ఈమాటను; ఉవాచ=చెప్పెను "హ" అననిది పాదపూరణార్థము.

అధికమయిన కాంతిగలవాఁడు పురుషశ్రేష్ఠుండునగు రాముండు , సుమంత్రునిమాటవిని, పరమసంతోషంబునొంది, యతని, గౌరవించి, యంత, సీతంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

దేవి దేవశ్చ దేవీచ సమాగమ్య మదంతరే
మంత్రయేతే ధ్రువం కించి దభిషేచన సంహితమ్. ౧౫

టీక॥ దేవి=రాణివగుసీతా! దేవశ్చ=ప్రభుండగుదశరథుండును, దేవీచ=రాణియగుకైకేయియును; సమాగమ్య=చేరి;మదంతరే = నాకొఱకు; అభిషేచనసంహితం=పట్టాభిషేకసంబంధియగు;కించిత్ = ఏదోఒకదానిని; ధ్రువం=నిశ్చయముగా ; మంత్రయేతే=ఆలోచించుచున్నారు.

సీతా!దశరథుండును కైకేయియును,జేరి,నావిషయమయిపట్టాభిషేకమునుగుఱించియేమో యాలోచించుచున్నారు; ఇదినిశ్చయము.

అని, తాత్పర్యము.

లక్షయిత్వా హ్యభిప్రాయం ప్రియకామా సుదక్షిణా
సంచోదయతి రాజానం మదర్థం మదిరేక్షణే, ౧౬

టీక॥ మదిరేక్షణే= మదముగప్పినకండ్లుగలసీతా! ప్రియకామా= దశరథమహారాజునకుఁ బ్రియంబు గోరునదియు; సుదక్షిణా = మిక్కిలియుసమర్థురాలు నగు కైకేయి ; అభిప్రాయం=దశరథునియభిప్రాయమును; లక్షయిత్వా=తెలిసికొని; మదర్థం = నాకొఱకు, రాజానం= దశరథమహారాజును; సంచోదయతిహి=ప్రేరేపించుచున్నదిగదా!

మదముగప్పినకండ్లుగలసీతా!కైకేయి, దశరథునిఁ బ్రియంబు గోరునదియుమిగుల సమర్థురాలును గావున, దశరథుని యభిప్రాయంబెఱింగి, నాకుఁబట్టాభిషేకంబు సేయుటకై, దశరథునిం బ్రేరేపించుచున్నది.

అని, తాత్పర్యము.

సా ప్రహృష్టా మహారాజం హితకామానువర్తినీ
జననీ చార్థకామా మే కేకయాధిపతేస్సుతా. ౧౭

టీక॥ జననీచ=తల్లియును;హితకామా=మేలుగోరునదియును;మహారాజం=దశర

థమహారాజును; అనువర్తినీ= అనుసరించుచున్నదియును; కేకయాధిపతేః= కేకయరాజుయొక్క; సుతా= కొమార్తె యనగు; సా= ఆకైకేయి; ప్రహృష్టా= సంతసించినదై; మే= నాయొక్క; అర్థకామా= ప్రయోజనమునుగోరునది; భవతి (అధ్యాహృతము) = అగుచున్నది.

కైకేయి, నాకుఁదల్లియు, లోకంబునకు మేలుగోరునదియును, దశరథమహారాజుననువర్తించునదియు నగుటం జేసి, సంతోషంబున నాకుఁ బట్టాభిషేకంబు కావలెనని కోరును.

అని, తాత్పర్యము.

దిష్ట్యాఖలు మహారాజో మహిష్యా ప్రియయాసహ
సుమంత్రం ప్రాహిణో ద్దూత మర్థకామకరంమమ. ౧౮

టీక॥ దిష్ట్యాఖలు= నాభాగ్యముచేతగదా! మహారాజః = దశరథమహారాజు; ప్రియయా= ప్రియురాలైన; మహిష్యాసహ= భార్యతోఁగూడ; మమ= నాయొక్క; అర్థకామకరం = ప్రయోజనమునుగోర్కియును జేయునట్టి; సుమంత్రం = సుమంత్రుని; దూతం = రాయబారిగా; ప్రాహిణోత్ = పంపెను.

దశరథమహారాజు, ప్రియభార్య యగుకైకేయింగూడి, నాప్రయోజనమునుగోరునట్టి, సుమంత్రుని, నాయొద్దకుదూతనుగాబంపెనే; ఇదిభాగ్యముగదా! అని, తాత్పర్యము.

యాదృశీ పరిషత్తత్ర తాదృశో దూతఆగతః

టీక॥ తత్ర= అచ్చట; యాదృశీ= ఎట్టి; పరిషత్= సభయో; తాదృశః = అట్టి; దూతః= రాయబారి; ఆగతః= వచ్చినాఁడు.

అచ్చట, ఎట్టిసభ చేరియున్నరో, అట్టిమాతవచ్చినాఁడు; నాకుఁదల్లియుఁదండ్రియునగు వారచ్చటఁ జేరి యున్నారు, కావున, అట్లునాకాప్తుఁడైన దూతను బంపినారు.

అని, తాత్పర్యము.

ధ్రువ మద్యైవ మాంరాజా యౌవరాజ్యే భిషేక్ష్యతి. ౧౯

టీక॥ రాజా=దశరథమహారాజు; మాం=నన్ను; అద్యైవ = ఇప్పుడె; యౌవరాజ్యే= యువరాజు వౌరతనమునందు; అభిషేక్ష్యతి=అభిషేకింపఁగలఁడు; ధ్రువం=నిశ్చయము.

దశరథమహారాజు, నాకిప్పుడె, పట్టాభిషేకము సేయగలడు ; ఇదినిశ్చయము. అని, తాత్పర్యము.

హంత శీఘ్రమితో గత్వా ద్రక్ష్యామి చ మహీపతిమ్

టీక॥హంత=సంతోషము! అహం (అధ్యాహృతము)=నేను; ఇతః=ఇచ్చటినుండి; శీఘ్రం=వేగముగా; గత్వా= పోయి; మహీపతించ=దశరథమహారాజును(చకారముచే)కైకేయినిఁ; ద్రక్ష్యామి=చూచెదను.

సంతోషము! ఇప్పుడు, శీఘ్రంబుగా నిచ్చటనుండిపోయి, దశరథమహారాజును గైకేయినిం జూచెదను.

అని, తాత్పర్యము.

సహ త్వం పరివారేణ సుఖ మాస్స్వ రమస్వచ. ౨౦

టీక॥ త్వం=నీవు; పరివారేణసహ= పరిజనముతోఁగూడ; సుఖం = సుఖముగా; ఆస్స్వ=ఉండుము. రమస్వచ=క్రీడింపుచుండుము.

నీవు పరిజనములఁగూడి, సుఖంబుగఁ గ్రీడింపుచుండుము. అని, రాముండు సీతతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

పతిసమ్మానితా సీతా భర్తార మసితేక్షణా

ఆద్వార మనువవ్రాజ మంగళా న్యభిదధ్యుషీ. ౨౧

టీక॥అసితేక్షణా=నల్లనికన్నులుగల; సీతా=సీత; పతిసమ్మానితా= పెనిమిటిచేతగౌరవింపఁబడినదై; మంగళాని= మంగళములను; అభిదధ్యుషీ=ధ్యానించుచు; భర్తారం = పెనిమిటిని; ఆద్వారం=వాకిలివఱకు; అనువవ్రాజ=వెంబడించెను.

నల్లనికన్నులుగలసీత, యిట్లునరోత్తములంబెనిమిటిచే గౌరవింపఁబడినదై, పెనిమిటికిమంగళంబులు గలుగవలెనని కోరుచు, వాకిలివఱకు, పెనిమిటినివెంబడించెను. అని, తాత్పర్యము.

రాజ్యం ద్విజాతిభి ర్జుష్టం రాజసూయాభిషేచనమ్
కర్తు మర్హతి తే రాజా వాసవస్యేవ లోకకృత్. ౨౨

టీక॥ రాజా = దశరథమహారాజు; లోకకృత్ = లోకంబులు చేయునట్టిబ్రహ్మదేవుఁడు; వాసవస్యేవ = ఇంద్రునకుంబోలె; తే = నీకు; రాజసూయాభిషేచనం = రాజసూయయాగమునందభిషేకమునుగల్గించునట్టి; రాజ్యం = దొరతనమును; ద్విజాతిభిః = బ్రాహ్మణులచేత; జుష్టం = సేవింపఁబడునట్లుగా; కర్తుం = చేయుటకు; అర్హతి = తగును.

బ్రహ్మదేవుండింద్రునకుంబోలె, రాజసూయయాగమునందు యోగ్యతనుగల్గించునట్టి, రాజ్యంబును, బ్రాహ్మణద్వారముగా, దశరథమహారాజునకిచ్చును.

అని, తాత్పర్యము.

దీక్షితం వ్రతసంపన్నం వరాజినధరం శుచిమ్
కురంగశృంగపాణిం చ పశ్యంతీ త్వాం భజామ్యహమ్. ౨౩

టీక॥ అహం = నేను; దీక్షితం = యాగదీక్షితుండవును; వ్రతసంపన్నం = వ్రతముతోఁ గూడినవాఁడవును; వరాజినధరం = శ్రేష్ఠమయినకృష్ణాజినమును దాల్చువాఁడవును; శుచిం = పరిశుద్ధుండవును; కురంగశృంగపాణిం = జింకకొమ్ము చేతియందుఁ గలవాఁడవునగు; త్వాం = నిన్ను; పశ్యంతీ = చూచుచు; భజామి = పొందుచున్నాను.

అటుపిమ్మట, నీవు, రాజసూయయాగదీక్షవహింపఁగా, వ్రతసంపన్నుండవై, కృష్ణాజినధరుండవై, పరిశుద్ధుండవై, జింకకొమ్ము చేతం దాల్చియున్న, నిన్నుఁ జూచుచుండఁగోరెదను.

అని, తాత్పర్యము.

పూర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః
వరుణః పశ్చిమామాశాం ధనేశ స్తూత్తరాం దిశమ్. ౨౪

టీక॥ తే = నీకొఱకు; వజ్రధరః = వజ్రమును దాల్చునట్టి దేవేంద్రుఁడు; పూర్వాం = తూర్పు; దిశం = దిక్కును; పాతు (అధ్యాహృతము) = రక్షించుఁగా

క.యమః=యముఁడు; దక్షిణాం= దక్షిణపుదిక్కును; పాతు=రక్షించుగాక! వరుణః=వరుణుండు;పశ్చిమాం=పడమటి; ఆశాం=దిక్కును; పాతు=(అధ్యాహృతము) రక్షించుఁగాక. ధనేశస్తు= ధనంబునకధిపతియయిన కుబేరుండును; ఉత్తరాం=ఉత్తరపు; దిశం=దిక్కును;పాతు (అధ్యాహృతము)=రక్షించుఁగాక.

నిన్నుఁ,దూర్పుదిక్కునందు దేవేంద్రుండును,దక్షిణపు దిక్కునందు యముండును, బడమటిదిక్కునందు వరుణుండును,ఉత్తరపుదిక్కునందు కుబేరుండును, రక్షింతురుగాఁక.ఇట్లు సీత రామునకుమంగళంబుగలగవలెనని తలంచినది. అని, తాత్పర్యము.

అథ సీతా మనుజ్ఞాప్య కృతకౌతుకమంగళః
నిశ్చక్రామ సుమంత్రేణ సహరామో నివేశనాత్. ౨౫

టీక॥అథ=అటుపిమ్మట;కృతకౌతుకమంగళః=ధరింపఁబడిన ఉత్సవార్థమయినమంగళాలంకారముగల ; రామః=రాముఁడు;సీతాం=సీతను; అనుజ్ఞాప్య=ఒప్పించి ; సుమంత్రేణసహ=సుమంత్రునితోఁగూడ;నివేశనాత్ = ఇంటినుండి;నిశ్చక్రామ=బయలు వెడలెను.

అంత,పట్టాభిషేకమునకుఁగావలసిన మంగళాలంకారముల వెలుంగుచుండు రాముండు,సీతనొప్పించి ; సుమంత్రుంగూడి,తనగృహంబు వెడలెను. అని,తాత్పర్యము.

పర్వతాదివ నిష్క్రమ్య సింహో గిరిగుహాశయః
లక్ష్మణం ద్వారిసోపశ్యత్ప్రహ్వాంజలిపుటం స్థితమ్. ౨౬

టీక॥సః=ఆరాముఁడు; గిరిగుహాశయః=పర్వతగుహయందునికిగల; సింహః=సింహము;పర్వతాదివ = పర్వతంబునుండివలె, నిష్క్రమ్య = వెడలి; ద్వారి=వాకిలియందు; ప్రహ్వాంజలిపుటం=నమ్రముందునుదొప్పవంటి చేమో డ్పుగలవాఁడై;స్థితం=ఉన్నట్టి ; లక్ష్మణం=లక్ష్మణుని; అపశ్యత్=చూచెను.

పర్వతగుహయందుండు సింహంబు పర్వతంబునుండి వెడలునట్లు, రాముండు గృహంబునుండి వెడలి,వాకిటనమ్రుండై చేతులు మొగిడ్చికొని యున్నలక్ష్మణుం

జూచెను. అని, తాత్పర్యము.

అథమధ్యమకక్ష్యాయాం సమాగమ్య సుహృజ్జనైః
ససర్వా నర్థినోదృష్ట్వా సమేత్య ప్రతినంద్యచ. ౨౭
తతః పావకసంకాశ మారురోహ రథోత్తమమ్
వైయాఘ్రం పురుషవ్యాఘ్రో రాజతం రాజనందనః. ౨౮

టీక॥ అథ = అటుపిమ్మట; పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుండును; రాజనందనః = రాచకొమరుండునగు; సః = ఆరాముఁడు; మధ్యమకక్ష్యాయాం = నడిమితొట్టికట్టునందు; సుహృజ్జనైః = స్నేహితులగువారలతో; సమాగమ్య = చేరి; అర్థినః = పట్టాభిషేకమునుగోరువారలను; సర్వాన్ = అందఱను; దృష్ట్వా = చూచి; సమేత్య = సమీపమునకుఁబోయి; ప్రతినంద్యచ = అభినందించి; తతః = అంతట; పావకసంకాశం = నిప్పుతో సమానమయినదియును; వైయాఘ్రం = పులితోలుచేఁ గప్పఁబడినదియును; రాజతం = వెండివికారమునగు; రథోత్తమం = రథశ్రేష్ఠమును; ఆరురోహ = ఎక్కెను.

అంతఁబురుషశ్రేష్ఠుండును రాజకుమారుండునగు రాముండు, నడిమితొట్టికట్టునఁదన స్నేహితులం జేరి, తనపట్టాభిషేకముఁజూడఁగోరివచ్చిన జనులనందఱంజూచి, వారియొద్దకుఁబోయి, వారలమంచిమాటలనభినందించి. యంత, బులితోలుతోఁ గప్పఁబడి యుండుటంజేసి యగ్నిహోత్రముంబోలె వెలుంగుచున్నదియు వెండితోఁ జేయఁబడినదియునగు శ్రేష్ఠమయినరథంబు, నెక్కెను.

అని, తాత్పర్యము.

మేఘనాదమసంబాధం మణిహేమవిభూషితమ్
ముష్ణంత మివ చక్షూంషి ప్రభయా సూర్యవర్చసమ్. ౨౯
కరేణుశిశుకల్పైశ్చ యుక్తం పరమవాజిభిః
హరియుక్తం సహస్రాక్షో రథమింద్ర ఇవాశుగమ్. ౩౦
ప్రయయాతూర్ణ మాస్థాయ రాఘవో జ్వలితశ్రియా

టీక॥ రాఘవః=రాముఁడు; మేఘనాదం=మేఘముయొక్క ధ్వనివంటిధ్వనిగలదియును; అసంబాధం=ఇఱుకులేనిదియును; మణిహేమవిభూషితం=రత్నములచేతనుబంగారముచేతను అలంకరింపఁబడినదియును;ప్రభయా=కాంతిచేత; చక్షూంషి=నేత్రములను; ముష్ణంతమివ(స్థితం)=దొంగిలించుచున్నదివలెనున్నదియును;సూర్యవర్చసం=సూర్యునియొక్క కాంతివంటి కాంతిగలదియును;కరేణుశిశుకల్పైః= ఆఁడేనుఁగుపిల్లలతోసమానములైన; పరమవాజిభిః=శ్రేష్ఠములగుగుఱ్ఱములతో;యుక్తం చ=కూడినదియునగు;రథం=రథమును; సహస్రాక్షః=వేయికండ్లుగల;ఇంద్రః=ఇంద్రుండు; ఆశుగం=శీఘ్రముగాఁబోవునదియును;హరియుక్తం= గుఱ్ఱములతోఁగూడినదియునగు; రథం (అధ్యాహృతము)ఇవ=రథమునుంబోలె; తూర్ణం=శీఘ్రముగా; ఆస్థాయ=అధిష్ఠించి;శ్రియా=కాంతిచేత;జ్వలితః = ప్రకాశించుచున్నవాఁడై;ప్రయయౌ= పోయెను.

రాముండు, మేఘంబునకుంబోలెమహాధ్వనిగలదైవిశాలంబై, మణులచేతను బంగారముచేతను అలంకృతంబై, కాంతిచేఁజూపరుల నేత్రంబుల నాకర్షించుచు, సూర్యుండుంబోలె వెలుంగుచు, నేనుఁగుపిల్లలంబోలుశ్రేష్ఠాశ్వంబులతోఁగూడినదియునగు రథంబును, ఇంద్రుండెక్కునట్లు , ఎక్కి, కాంతిచే వెలుంగుచుఁ,శీఘ్రంబుగాఁబోయెను.

అని, తాత్పర్యము.

సపర్జన్యఇవా కాశే స్వనవా నభినాదయన్. ౩౧
నికేతా న్నిర్యయౌ శ్రీమా న్మహేంద్రా దివచంద్రమాః

టీక॥ శ్రీమాన్=కాంతిగల; సః=ఆరాముండు; ఆకాశే=ఆకాశమునందు; స్వనవాన్=ధ్వనిగల; పర్జన్యఇవ=మేఘముంబోలె;దిశః(అధ్యాహృతము)=దిక్కులను;అభినాదయన్=ధ్వనింపఁజేయుచు; మహేంద్రాత్=మహేంద్రపర్వతమునుండి;చంద్రమాఇవ=చంద్రుండుంబోలె; నికేతాత్=గృహమునుండి; నిర్యయౌ=బయలువెడలెను.

కాంతిసంపన్నుండగు నారాముండు, ఆకాశంబున మహాధ్వనిగలమేఘంబుంబోలె,రథశబ్దంబునదిక్కుల, ధ్వనిం

ప్రకాశేయుచు, మహేంద్రపర్వతంబునుం డిచంద్రుండు వెడలునట్లు, గృహంబునుం డి, వెడలెను.

అని, తాత్పర్యము.

ఛత్రచామరపాణిస్తు లక్ష్మణో రాఘవానుజః. ౩౨
జుగోప భ్రాతరం భ్రాతా రథ మాస్థాయ పృష్ఠతః

టీక॥ రాఘవానుజః=రామునకుఁదమ్ముండును; భ్రాతా= సహోదరుండునగు; లక్ష్మణః=లక్ష్మణుండు; ఛత్రచామరపాణిస్తు= గొడుగునుచామరమునుచేతులఁగలవాఁడై; పృష్ఠతః=వెనుకను; రథం=రథమును; ఆస్థాయ=అధిష్ఠించి; భ్రాతరం=అన్నయగు రాముని; జుగోప=రక్షించెను.

రామునితమ్ముండగు లక్ష్మణుండు, ఒకచేతనుఛత్రంబును మఱియొకచేతను జామరంబునుదాల్చి, రథంబువెనుకటిభాగంబుననిల్చి, యన్నయగురామునకు, ఎండమొదలగునవితగులకుండునట్లు, రక్షించుచుండెను. అని, తాత్పర్యము.

తతో హలహలాశబ్దస్తుములస్సమజాయత. ౩౩
తస్య నిష్క్రమమాణస్య జనౌఘస్య సమంతతః

టీక॥ తతః=అటుపిమ్మట; తస్య=ఆరాముఁడు; నిష్క్రమమాణస్య= బయలుదేఱుచుండఁగా; సమంతతః=అంతటను; జనౌఘస్య= జనసమూహముయొక్క; తుములః= దొమ్మియయిన; హలహలాశబ్దః=కలకలశబ్దము; సమజాయత=కలిగినది.

అంత, రాముండుబయలుదేఱునప్పుడు, తుములంబుగా, జనులు, కలకలశబ్దంబుగావించిరి. అని, తాత్పర్యము.

తతో హయనరాముఖ్యా నాగాశ్చ గిరిసన్నిభాః. ౩౪
అను జగ్ముస్తదా రామం శతశోథ సహస్రశః

టీక॥ తతః = అటుపిమ్మట; ముఖ్యాః=శ్రేష్ఠులయిన; హయనరాః = గుఱ్ఱముసెక్కినమనుష్యులును; గిరిసన్నిభాః=పర్వతముతో సమానములయిన

నాగాశ్చ=ఏనుంగులును, వానినెక్కిన వారుననుట;తదా=అప్పుడు; శతశః= నూరునూరులుగాను; అథ=ఇంకను;సహస్రశః=వేనవేలుగాను;రామం=రాముని;అనుజగ్ముః=వెంబడించిరి.

అంత,నప్పుడు, కొందఱుగుఱ్ఱముల నెక్కియును, గొందఱేనుంగుల నెక్కియు,నిట్లువేనవేలుగా, రామునివెంట, నేగిరి. అని, తాత్పర్యము.

అగ్రతశ్చాస్య సన్నద్ధా శ్చందనాగరు రూషితాః. ౩౫
ఖడ్గచాప ధరాశ్శూరా జగ్మురాశంసవోజనాః

టీక॥ అస్య=ఈరామునియొక్క;అగ్రతశ్చ=ముందటను;సన్నద్ధాః=కవచములు దొడిగినవారును; చందనాగరు రూషితాః=చందనముచేతనుఅగరుగంధముచేతనుపూయఁబడినవారును; ఖడ్గచాపధరాః= కత్తులనుధనుస్సులనుధరించినవారును; శూరాః=యుద్ధమునందు భయపడనివారును; ఆశంసవః=రాముని శ్రేయస్సునుగోరువారునగు; జనాః= జనులు;జగ్ముః=వెళ్లిరి.

ఆరామునిముందటను, గవచంబులు దొడిగిచందనాగరువుల మేననలందికొని,ఖడ్గంబులను ధనుస్సులనుధరించినవారలుశూరులురాముని మంగళంబుగోరువారలు,నడిచిరి.అని, తాత్పర్యము.

తతోవాదిత్ర శబ్దాశ్చ స్తుతిశబ్దాశ్చ వందినామ్. ౩౬
సింహ నాదాశ్చ శూరాణాం తదా శుశ్రువిరేపథి

టీక॥తతః=అంత;తదా=అప్పుడు; పథి = మార్గమునందు;వాదిత్రశబ్దాశ్చ=వాద్యధ్వనులును;వందినాం=స్తుతిపాఠకులయొక్క;స్తుతిశబ్దాశ్చ=స్తోత్రధ్వనులును;శూరాణాం=యుద్ధమునందుభయపడనివారలయొక్క;సింహనాదాశ్చ=బొబ్బలును; శుశ్రువిరే=వినఁబడినవి.

అంత,నప్పుడు,మార్గంబున, వాద్యధ్వనులును , స్తుతిపాఠకులు సేయు స్తోత్రశబ్దములును, శూరులు సేయుసింహనాదంబులును,వినంబడినవి.

అని, తాత్పర్యము.

హర్మ్యవాతాయనస్థాభి ర్భూషితాభి స్సమంతతః. ౩౭
కీర్యమాణస్స పుష్పౌఘై ర్యయౌ స్త్రీభి రరిందమః

టీక॥ అరిందమః = శత్రువులనణఁగఁ ద్రొక్కునట్టి; సః = ఆ రాముడు; హర్మ్యవాతాయనస్థాభిః = మేడలమీఁదికిటికీలసుండువారును; సమంతతః = అంతటను; భూషితాభిః = అలంకరింపఁబడినవారునగు; స్త్రీభిః = స్త్రీలచేత; పుష్పౌఘైః = పూలసమూహములచేత; కీర్యమాణః = వెదచల్లఁబడినవాఁడై; యయౌ = వెళ్లెను.

శత్రువులనడంగఁ ద్రొక్కఁజాలిన యారాముండు, అప్పుడు దేహమంతయుఁ జక్కఁగానలంకరించికొని, మేడలయందలికిటికీలనుండు, స్త్రీలుచల్లుపూలవానలంబరఁగ్రహించుచు, వెళ్లెను.

అని, తాత్పర్యము.

రామం సర్వానవద్యాంగ్యో రామపిప్రీషయా తతః. ౩౮
వచోభిరగ్ర్యై ర్హర్మ్యస్థాః క్షితిస్థాశ్చ వవందిరే

టీక॥ తతః = అటుపిమ్మట; హర్మ్యస్థాః = మేడలయందున్నవారును; క్షితిస్థాశ్చ = భూమియందున్నవారును; సర్వానవద్యాంగ్యః = సమస్తములయిన నిందింపరానియవయవములుగల స్త్రీలు; రామపిప్రీషయా = రామునిసంతోషింపఁజేయునిచ్ఛచేత; అగ్ర్యైః = శ్రేష్ఠములయిన; వచోభిః = మాటలచేత; రామం = రామునిని; వవందిరే = పొగడిరి.

అంత, నుత్తమస్త్రీలు, కొందఱు మేడలపైనుండియుఁ గొందఱు భూమిపైనుండియు, రామునకుసంతోషంబు సేయఁగోరి, రామునిఇట్లని యుత్తమ వాక్యంబులం బ్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

నూనం నందతి తేమాతా కౌసల్యా మాతృనందన. ౩౯

టీక॥ మాతృనందన = తల్లిని సంతోషముపెట్టునట్టిరాముఁడా! తే = నీయొక్క; మాతా = తల్లియయిన; కౌసల్యా = కౌసల్య; నూనం = నిశ్చయముగ;

నందతి=సంతోషించుచున్నది.

నీవుతల్లికిసంతోషంబు గలుగఁ జేయువాఁడవు; ఇప్పుడునిన్నుఁజూచి, నీతల్లి కౌసల్యనిశ్చయముగాసంతోషించుచున్నది. అని, తాత్పర్యము.

పశ్యంతి సిద్ధయా త్రం త్వాం పిత్ర్యం రాజ్య ముపస్థితమ్

టీక॥సిద్ధయాత్రం=సఫలమయినపోవుటగలవాఁడవుము;పిత్ర్యం= తండ్రిదైన;రాజ్యం=దొరతనమును;ఉపస్థితం=పొందినవాఁడవునగు;త్వాం = నిన్ను; జనాః(అధ్యాహృతము)=జనులు ; పశ్యంతి=చూతురు.

నీగమనముసఫలంబగను ; అట్లుపిత్ర్యంబగురాజ్యంబును బొందియున్న నిన్నుజనులుచూడఁగలరు. అని, రాముసంస్తుతించిరి.

అని, తాత్పర్యము.

సర్వసీమంతినీభ్య శ్చ సీతాం సీమంతినీం వరామ్. ౪౦
అమన్యంత హి తా నార్యో రామస్య హృదయ ప్రియామ్

టీక॥తాః=ఆ;నార్యః=స్త్రీలు;రామస్య=రామునకు;హృదయప్రియాం=మనసునకుఁబ్రియురాలగు;సీతాం= సీతను;సర్వసీమంతినీభ్యశ్చ= సమస్తస్త్రీలకన్నను;వరాం=శ్రేష్ఠమయిన; సీమంతినీం=స్త్రీనిగా;అమన్యంతహి= తలంచిరిగదా!

ఆస్త్రీలు, రామునకుమనః ప్రియురాలగుసీతనుసమస్తస్త్రీలకన్ననుఉత్తమురాలనుగాఁదలంచియుండిరి.

అని, తాత్పర్యము.

తయా సుచరితం దేవ్యా పురా నూనం మహత్తపః. ౪౧
రోహిణీవ శశాంకేన రామసంయోగ మాపయా

టీక॥యా=ఎవ్వతె;శశాంకేన=చంద్రునితో;రోహిణీవ= రోహిణియుంబోలె; రామసంయోగం=రామునితోసంబంధమును; ఆప=పొందెనో ; త

యా=అట్టి; దేవ్యా=సీతాదేవిచేత; పు రా=మునుపు; మహాత్=అధికమయిన; తపః=తపస్సు; నూనం= నిశ్చయముగా; సుచరితం = చక్కఁగాఁజేయఁబడినది.

రోహిణీదేవిచంద్రునిం గూడినట్లు, సీతాదేవి రామునింగూడినది, ఈసీత, పూర్వజన్మంబున, గొప్ప తపస్సు చేసియుండును; ఇది నిశ్చయము! అని, ఆస్త్రీలు, సీతనుపొగడిరి. అని, తాత్పర్యము.

ఇతి ప్రాసాద శృంగేషు ప్రమదాభి ర్నరోత్తమః, ౪౨
శుశ్రావ రాజ మార్గస్థః ప్రియావాచ ఉదాహృతాః

టీక॥ రాజమార్గస్థః= రాజమార్గమునందున్న; నరోత్తమః=పురుషోత్తముండగు రాముండు; ఇతి=ఇట్లు; ప్రాసాదశృంగేషు=మేడల శిఖరములందు; ప్రమదాభిః=స్త్రీలచేత ; ఉదాహృతాః=చెప్పఁబడిన; ప్రియాః = సంతోషకరంబయిన; వాచః=మాటలను; శుశ్రావ=వినెను.

రాజమార్గంబున నున్న రాముండు, ఇట్లు, మేడలపైనుండి; యాస్త్రీలు చెప్పిన ప్రియవచనంబుల వినెను.

అని, తాత్పర్యము.

స రాఘవ స్తత్ర కథాప్రపంచాన్
శుశ్రావ లోకస్య సమాగతస్య. ౪౩
ఆత్మాధికారా వివిధాశ్చ వాచః
ప్రహృష్టరూపస్య పురోజనస్య

టీక॥ సః=ఆ; రాఘవః = రాముఁడు; తత్ర=అచ్చట; సమాగతస్య=వచ్చినట్టి; లోకస్య=జనముయొక్క; కథాప్రపంచాన్ = కథలయొక్క విస్తారములను; పురః=పట్టణముయొక్క; ప్రహృష్టరూపస్య=సంతోషముగొనిన దేహముగల; జనస్య= జనముయొక్క; ఆత్మాధికారాః=తన్ను గురించినవియును; వివిధాః=నానావిధములునగు; వాచశ్చ= మాటలను; శుశ్రావ=వినెను.

ఆ రాముండు, గ్రామంబులనుండి వచ్చియున్న జనులు చెప్పుకొను మాటలను, ఆపట్టణమందలి జనులు, సంతోషముఁబొంది చెప్పుకొను మాటలను, వినెను.

అని, తాత్పర్యము.

ఏషశ్రియం గచ్ఛతి రాఘవోద్య
రాజప్రసాదా ద్విపులాంగమిష్యన్. ౪౪
యే తేవయంసర్వ సమృద్ధకామా
యేషామయంనో భవతా ప్రశస్తా

టీక॥ఏషః=ఈ; రాఘవః=రాముఁడు;అద్య=ఇప్పుడు;రాజప్రసాదాత్=దశరథమహారాజుయొక్క యనుగ్రహమువలన;విపులాం = భూమిని; గమిష్యన్=పొందఁగలవాఁడై;శ్రియం=రాజలక్ష్మిని;గచ్ఛతి=పొందఁగలఁడు. యేషాం=ఏ;నః=మాకు;అయం= ఈరాముఁడు;ప్రశాస్తా = రక్షకుఁడు; భవితా=కాఁగలఁడో; తే (అధ్యాహృతము)=అట్టి;ఏ తే=ఈ; వయం=మేము; సర్వసమృద్ధకామాః=అన్నిటను సమృద్ధములయిన కోరికలుగలవారము.

ఈరాముండు, దశరథమహారాజానుగ్రహంబువలన, నిప్పుడుభూమికధిపతియయి,రాజలక్ష్మింబొందఁగలఁడు;మనకిట్టిరాముఁడురక్షకుండు కాఁగలఁడు, కావున,మనకోర్కెలన్నియు నీడేఱఁగలవు.అని, తాత్పర్యము.

లాభోజనస్యాస్య యదేషసర్వం
ప్రపత్స్యతేరాజ్యమిదం చిరాయ. ౪౫
నహ్యాప్రియం కించనజాతుకశ్చి
త్పశ్యేన్నదుఃఖం మనుజాధిపేస్మిన్

టీక॥ఏషః = ఈరాముఁడు;చిరాయ=బహుకాలమునకు;ఇదం=ఈ;రాజ్యం=దొరతనమును;సర్వం= అంతను; ప్రపత్స్యసే(ఇతి)యత్ =పొందఁగలఁడనునదియేదిగలదో; సః (అధ్యాహృతము)=అది;అస్య=ఈ;జనస్య= జనమునకు;లాభః=లాభము.అస్మిన్ =ఈరాముఁడు;మనుజాధిపే= మనుష్యులకధిపతియగుచుండఁగా; కశ్చిత్ =ఒకానొకఁడును;జాతు=ఒకానొకప్పుడును; కించ

న=కొంచెమయినను; అప్రియం=అనిష్టమును; నపశ్యేద్ధి=చూడఁడుగదా! దుఃఖం=దుఃఖమును; న(పశ్యేద్ధి)= చూడఁడుగదా!

ఈరాముఁడు, బహుకాలమునకుఁగా, నీరాజ్యమునకంతయునధిపతియగుట, యాజనులభాగ్యమే; ఇతఁడురాజుగానుండఁగా, నొకానొకఁడును, ఒకానొకప్పుడును, కొంచెమైననుఅప్రియంబునుగానిదుఃఖంబునుగాని, పొందఁడు.

అని, తాత్పర్యము.

సఘోషవద్భిశ్చ హయైస్సమతంగజైః
పురస్సరైస్స్వస్తికసూతమాగధైః. ౮౬
మహీయమానః ప్రవరైశ్చ వాదకై
రభిష్టుతో వైశ్రవణో యథాయయౌ

టీక॥ సః = ఆరాముఁడు; ఘోషవద్భిః=ధ్వనులుగల; హయైః= గుఱ్ఱములతోను; మతంగజైశ్చ= ఏనుఁగులతోను; పురస్సరైః=ముందునడుచునట్టి; స్వస్తికసూతమాగధైః= స్తుతిపాఠకులచేతను, బ్రాహ్మణస్త్రీయందుక్షత్రియునకుఁ బుట్టినసూతులచేతనుక్షత్రియస్త్రీయందువైశ్యునకుఁబుట్టినమాగధులచేతను; ప్రవరైః=శ్రేష్ఠులగు; వాదకైశ్చ=వాద్యములువాయించువారలచేతను; మహీయమానః = పూజింపఁబడుచున్నవాఁడై; అభిష్టుతః=పొగడఁబడినవాఁడై; వైశ్రవణోయథా = కుబేరుండుంబోలె; యయౌ=పోయెను.

ఆరాముండు, కేకలువేయుచుండు గుఱ్ఱములతోను గజంబులతోనుంగూడి, స్తుతిపాఠకులును సూతులునుమాగధులును, బహుగౌరవంబునంబొగడుచు, ముందునడుచుచుండఁగాఁ, గుబేరుండుంబోలె వెలుంగుచుఁ, బోయెను.

అని, తాత్పర్యము.

కరేణు మాతంగరథాశ్వ సంకులమ్
మహాజనౌఘ ప్రతిపూర్ణ చత్వరమ్. ౮౭
ప్రభూతరత్నం బహుపణ్య సంచయమ్
దదర్శ రామో రుచిరం మహాపథమ్

టీక॥ రామః=రాముఁడు; కరేణు మాతంగరథాశ్వసంకులం= ఆఁడేనుంగులచేతను మగయేనుంగులచేతనురథంబులచేతనుగుఱ్ఱంబులచేతనునిండినదియును;మహాజనౌఘప్రతిపూర్ణచత్వరం= గొప్పజనసమూహముచేనిండిన మధ్యప్రదేశములుగలదియును ; ప్రభూతరత్నం = అధికములయినమణులుగలదియును;బహుపణ్యసంచయం= అనేకములయినవిక్రియపదార్థములసమూహములుగలదియును;రుచిరం= మనోహరంబునగు;మహాపథం = రాజమార్గమును; దదర్శ=చూచెను.

ఆఁడేనుంగులతోను మగయేనుంగులతోను రథంబులతోను గుఱ్ఱంబులతోను నిండి,యచ్చటచ్చట గుంపులు గూడియుండు జనులతో నొప్పుచున్న మధ్యప్రదేశంబులుగలిగి, యలంకారార్థంబు వెదచల్లఁబడిన మణిసమూహంబులచేఁ బ్రకాశించుచు, విక్రయార్థంబై పర్తకులుంచుకొనియుండు ననేక పదార్థంబుల నొప్పుచు మనోహరంబయియున్న, రాజమార్గంబును రాముండు, చూచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, షోడశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అయోధ్యాకాండషోడశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ
సప్తదశసర్గప్రారంభః.

స రామో రథ మాస్థాయ సంప్రహృష్టసుహృజ్జనః
పతాకాధ్వజసంపన్నం మహార్హాగరుధూపితమ్. ౧
అపశ్య న్నగరం శ్రీమా న్నానాజన సమాకులమ్

స ౧౭

టీక॥ శ్రీమాన్ = ప్రశస్తమయిన కాంతిగల; సః=ఆ; రామః=రాముఁడు; రథం=రథమును; ఆస్థాయ=ఎక్కి; సంప్రహృష్టసుహృజ్జనః= మిక్కిలియు సంతసించిన స్నేహితులుగలవాఁడై ; పతాకాధ్వజసంపన్నం=రాజచిహ్నములు వ్రాసియుండు టెక్కెములతోను వట్టిటెక్కెములతోనుగూడినదియును; మహార్హాగరుధూపితం= శ్రేష్ఠమయినయగురుచెక్కతోఁబొగగలుగునట్లుచేయఁబడినదియును; నానాజనసమాకులం= నానాదేశములనుండు జనులచే నిండియున్నదియునగు; నగరం=అయోధ్యాపట్టణమును; అపశ్యత్=చూచెను.

పట్టాభిషేకంబునకుం దగునట్టి అలంకారంబులు ధరించి వెలుఁగుచుండు రాముండు, తన స్నేహితులు సంతోషంబునొందఁగా, రథంబునందుండి, నానావిధధ్వజంబులతో నొప్పుచు శ్రేష్ఠమయి నయగరుధూపంబు వేయఁబడియుంటం జేసివాసనలు గుబాళించుచు నానాదేశములనుండి పట్టాభిషేకోత్సవముంజూచుటకై వచ్చినజనులతో నిండియుండు, నయోధ్యాపట్టణముం, జూచెను. అని, తాత్పర్యము.

స గృహై రభ్రసంకాశైః పాండురై రుపశోభితమ్. ౨
రాజమార్గం యయౌ రామో మధ్యే నాగరుధూపితమ్

టీక॥ సః=ఆ; రామః=రాముఁడు; అభ్రసంకాశైః=మేఘములతోసమానములయినవియును; పాండురైః= తెల్లనివియునగు; గృహైః=ఇండ్లచేత; ఉపశోభితం = ప్రకాశింపఁజేయఁబడినదియును; మధ్యేన=నడుముచేత, నడుమునందనుట; అగరుధూపితం= అగరుధూపముగలదియునగు; రాజమార్గం = రాజమార్గమును; యయౌ=పొందెను.

ఆరాముండు, మేఘంబులం బోలె నుండు తెల్లనిగృహంబులతో నొప్పుచు నడుమ నగరుధూపంబు వేయఁబడుటం జేసి సువాసనగలిగియుండు, రాజమార్గంబుఁ బ్రవేశించెను. అని, తాత్పర్యము.

చందనానాంచ ముఖ్యానా మగరూణాంచ సంచయైః. ౩
ఉత్తమానాంచ గంధానాం క్షౌమకోశాంబరస్య చ
అవిద్ధాభిశ్చ ముక్తాభి రుత్తమైః స్ఫాటికై రపి. ౪

శోభమాన మసంబాధైస్తం రాజపథముత్తమమ్
సంవృతం వివిధైః పణ్యై ర్భక్ష్యై రుచ్చావచైరపి. ౫

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ రాముఁడు; ముఖ్యానాం= శ్రేష్ఠములయిన; చందనానాం=శ్రీగంధములయొక్కయు; అగరూణాంచ = అగరుచెక్కలయొక్కయు; ఉత్తమానాం= శ్రేష్ఠములయిన; గంధానాంచ= ఇతరగంధద్రవ్యములయొక్కయు; క్షౌమకోశాంబరస్యచ= తెల్లపట్టుబట్టలయొక్కయు పట్టుబట్టలయొక్కయు; సంచయైః=సమూహములచేతను; అవిద్ధాభిః=రంధ్రములు వేయఁబడని; ముక్తాభిశ్చ = ముత్తెములచేతను ; ఉత్తమైః = శ్రేష్ఠములయినవియును; అసంబాధైః = దోషములేనివియునగు ; స్ఫాటికైరపి= స్ఫటికమణులచేతను; శోభమానం=ప్రకాశించుచున్నదియును; వివిధైః= నానావిధములయిన; పణ్యైః=విక్రయింపఁదగినపదార్థములచేతను ; ఉచ్చావచైః=నానావిధములయిన; భక్ష్యైరపి = పిండివంటలచేతను ; సంవృతం = కప్పఁబడినదియును;ఉత్తమం= శ్రేష్ఠమునగు; తం=ఆ; రాజపథం= రాజమార్గమును; యయౌ (అధ్యాహృతము)=పొందెను.

ఉత్తమంబులగుచందనపుఁజెక్కలును అగరుచెక్కలునుఇతరగంధద్రవ్యంబులును తెల్లపట్టు మొదలగు పట్టుబట్టలును రంధ్రములు వేయక నూతనములుగనుండు ముత్తెములును నిర్దోషంబులును శ్రేష్ఠంబులునగు స్ఫటికమణులును నానావిధంబులగు పిండివంటలును, అట్లునానావిధంబులగు విక్రయ పదార్థంబులుగలిగి యొప్పుచుండు, నారాజమార్గంబును, రాముండు ప్రవేశించెను. అని, తాత్పర్యము.

దదర్శ తం రాజపథం దివి దేవపథం యథా

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; దివి=స్వర్గమునందు, ఉన్నః దేవపథంయథా (స్థితం) = దేవమార్గమునుంబోలెనున్న; తం=ఆ; రాజపథం=రాజమార్గమును; దదర్శ = చూచెను.

ఆరాముండు , స్వర్గంబుననుండు దేవమార్గముంబోలెనొప్పుచున్నయా రాజమార్గంబుం, జూచెను.

అని, తాత్పర్యము.

దధ్యక్షతహవిర్లాజైః ధూపైరగరుచందనైః. ౮
నానామాల్యోపగంధైశ్చ సదాభ్యర్చిత చత్వరమ్.
ఆశీర్వాదాన్ బహూన్ శృణ్వన్ సుహృద్భిః సముదీరితాన్. ౭
యథార్హం చాపి సంపూజ్య సర్వానేవ నరాన్ యయౌ

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ రాముఁడు; సుహృద్భిః= స్నేహితుల చేత; సముదీరితాన్=చెప్పఁబడిన; బహూన్ = అనేకములయిన; ఆశీర్వాదాన్=దీవెనలను; శృణ్వన్= వినుచు; నరాన్=మనుష్యులను; సర్వానేవ = అందఱనే;యథార్హం=యథాయోగ్యముగ; సంపూజ్యచాపి= గౌరవించియు;దధ్యక్షతహవిర్లాజైః=పెరుఁగుచేతను అక్షతలచేతను హవిస్సుచేతను పేలాలచేతను; అగరుచందనైః= అగరుచెక్కలచేతను చందనపుచెక్కలచేతను, గలిగిన;ధూపైః=పొగలచేతను; నానామాల్యోపగంధైశ్చ= నానావిధములయినపుష్పమాలికలుమున్నగువాసనాద్రవ్యములచేతను;సదా= ఎల్లప్పుడును ; అభ్యర్చితచత్వరం = పూజింపఁబడినమధ్యప్రదేశముగల; రాజపథం (అధ్యాహృతము)= రాజమార్గమును; యయౌ=పొందెను.

రాముఁడు, స్నేహితులు సేయునాశీర్వాదవచనంబులు వినుచు,జనులనందఱనువారివారియోగ్యతకుందగునట్లు గౌరవించుచు, పెరుఁగు పేలాలు నక్షతలు హవిస్సు నిండారగు ధూపంబులును నానావిధములగు సుగంధిపుష్పమాలికలును గల్గియుండుమధ్యప్రదేశములతోనొప్పి, యెల్లప్పుడు రమణీయంబై యుండు, రాజమార్గంబును బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

పితామహైరాచరితం తథైవ ప్రపితామహైః. ౮
అద్యోపాదాయ తం మార్గ మభిషిక్తో నుపాలయ

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; అద్య=ఇప్పుడు;అభిషిక్తః= అభిషేకింపఁబడినవాఁడవై; పితామహైః= తాతలచేతను;తథైవ = అట్లే; ప్రపితామహైః=ముత్తాతలచేతను; ఆచరితం=ఆచరింపఁబడినట్టి;తం= ఆమార్గం=

దారిని; ఉపాదాయ=గ్రహించి; అనుపాలయ=రక్షింపుము.

రాముడా! నీవు, ఇప్పుడు, పట్టాభిషిక్తుండవై, మున్ను నీ తాతలును ముత్తాతలును గాపాడిన పద్ధతిని, మమ్ములం గాపాడుము. అని, తాత్పర్యము.

యథా స్మ లాలితాః పిత్రా యథా పూర్వైః పితామహైః ।
తత స్సుఖతరం రామే వత్స్యామ స్సతి రాజని

టీక॥ వయం (అధ్యాహృతము) = మేము; యథా = ఎట్లు; ("స్మ" అనునది పాదపూరణార్థము.) పిత్రా = రాముని తండ్రిచేతను; యథా = ఎట్లు; పూర్వైః = మునుపటివారలయిన; పితామహైః = తాతలచేతను; లాలితాః = బుజ్జగింపబడినవారలమో; రామే = రాముడు; రాజని సతి = రాజుగానుండగా; తతః = దానికన్నను; సుఖతరం = అధికమయిన సుఖము గలుగునట్లుగా; వత్స్యామః = ఉండగలము.

మేము, రాముని తండ్రికాలంబునను, అంతకు మున్ను తాతల కాలంబులందును, ఎంత సుఖంబు ననుభవించుచుంటిమో, రాముండు రాజుగానుండగా, నంతకన్న నెచ్చు సుఖంబనుభవింపగలము. అని, తాత్పర్యము.

అల మద్య హి భుక్తేన పరమార్థై రలం చ నః ౧౦
యథా పశ్యామ నిర్యాంతం రామం రాజ్యే ప్రతిష్ఠితమ్

టీక॥ అద్య = ఇప్పుడు; ("హి" అనునది పాదపూరణార్థము) నః = మాకు; భుక్తేన = భోగముచేత; లేక, భోజనముచేత; అలం = చాలును; నః = మాకు; పరమార్థైశ్చ = శ్రేష్ఠములయిన పురుషార్థములగు స్వర్గాదులచేతను; అలం = చాలును. రాజ్యే = దొరతనమునందు; ప్రతిష్ఠితం = ఉంచబడినవాడును; నిర్యాంతం = గృహంబునకుం బోవుచున్నవాడునగు; రామం = రాముని; యథా = చక్కగా; పశ్యామ = చూతముగాక.

ఇప్పుడు, మాకు భోజనంబేమి భోగాదులేమియక్కఱ లేదు; స్వర్గము మొదలగు పురుషార్థములు నక్కఱ లేదు; రాముడు రాజ్యంబునభిషిక్తుండై మా యిలగృహంబు

నకుంబోవుచుండునప్పుడు, అతనిం, జక్కఁగాఁజూచినం,జాలను.

అని, తాత్పర్యము.

తతోహి నః ప్రియతరం నాన్య త్కించి ద్భవిష్యతి. ౧౧
యథాభిషేకో రామస్య రాజ్యే నామిత తేజసః

టీక॥ అమిత తేజసః=కొలఁదిలేనిపరాక్రమముగల; రామస్య=రామునియొక్క; రాజ్యేన = (చతుర్థ్యర్థమందుఁ దృతీయ) దొరతనముకొఱకు; అభిషేకః=అభిషేకము; యథా=ఎట్లో; తథా (అధ్యాహృతము)—అట్లు; నః=మాకు; ప్రియతరం = మిక్కిలియిష్టమయినది; తతః=దానికన్నను; అన్యత్=ఇతరము; కించిత్=ఏదియు; నభవిష్యతిహి=ఉండదుగదా!

కొలఁదిలేని పరాక్రమంబుగల రాముండు, రాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుండగుటకన్న, నితరంబేదియు మాకంత ప్రియంబు కాదు.

అని, తాత్పర్యము.

ఏతా శ్చాన్యాశ్చ సుహృదా ముదాసీనః కథాః శుభాః. ౧౨
ఆత్మసంపూజనీః శృణ్వ న్యయౌ రామో మహాపథమ్

టీక॥ రామః=రాముడు; సుహృదాం=స్నేహితులయొక్క; ఏతాశ్చ=ఈమాటలను; అన్యాః=ఇతరములయినవియును; శుభాః=మంగళకరములయినవియును; ఆత్మసంపూజనీః=తన్నుఁబొగడుచున్నవియునగు; కథాశ్చ=మాటలను; శృణ్వన్=వినుచు; ఉదాసీనః=వికారంబునొందనివాఁడై; మహాపథం= రాజమార్గంబును; యయౌ=పొందెను.

రాముండు, స్నేహితులు దనకు మంగళంబుగల్గునట్లుపొగడుచుఁజెప్పిన, యీమాటలను, మఱియునితరములను వినుచు, ధీరోదాత్తుండుకావునఁదన్నుఁ బొగడినప్పుడు గలుగవలసిన యుత్సాహంబునొందక,నిర్వికారుండై, రాజమార్గంబునంబోయెను.

అని, తాత్పర్యము.

న హితస్మా న్మనః కశ్చి చ్చక్షుషీ వా నరోత్తమాత్. ౧౩

నర శ్చక్షో స్త్యపా కృష్ట మతి క్రాంతేపి రాఘవే

టీక॥ నరః=పురుషుండు; కశ్చిత్=ఒకానొకండును; రాఘవే=రాముండు; అతిక్రాంతేపి=దూరముగాఁబోయినను; మనః=మనస్సునుగాని; చక్షుషీవా=కండ్లనుగాని; నరోత్తమాత్=పురుషశ్రేష్ఠుండగు; తస్మాత్=ఆరామునుండి; అపాకృష్టుం=మఱలించుకొనుటకు; నశక్నోతిహి=చాలఁడుగదా!

పురుషులునుగూడ, నారాముండెంతదూరంబు పోయినప్పటికిని, మనస్సులో నతని ధ్యానింపకుండుటకుఁగాని అతికష్టంబునైనను గండ్లతో నతనినే చూడకుండుటకుఁగాని, శక్తులుకాఁజాలరు; ఇంకస్త్రీల, కట్లతనియందనురాగాతిశయంబుండుట యేమిచిత్రము! దగ్గఱగానున్నచో సమస్తమునువిడిచియతనినేచూచుచుందురని, చెప్పనేల?

అని, తాత్పర్యము.

యశ్చ రామం న పశ్యేత్తు యంచ రామో న పశ్యతి. ౧౮
నిందిత స్స వసే ల్లోకే స్వా త్మా ప్యేనం విగర్హతే

టీక॥యః=ఎవ్వఁడు; రామంచ=రామునింగూడ; నపశ్యేత్=చూడనేనేయుండునో; రామశ్చ=రాముఁడును; యం=ఎవ్వనిని; నపశ్యతి=చూడఁడో; సః=అతఁడు; లోకే=ప్రపంచమందు; నిందితః=దూషింపఁబడినవాఁడైనవసేత్=ఉండును. స్వాత్మాపి=తనమనసును; ఏనం=ఇట్టివానిని; విగర్హతే=నిందించును.

ఎవ్వఁడు, దర్శనమాత్రంబుననే పరమానందంబుగలుగఁజేయునట్టి రామునింగూడఁజూడకుండునో; రాముఁడును, తన్నుఁజూడకుండుటంజేసి, ఎవ్వనిఁజూడకుండునో! అప్పురుషునెల్లప్పుడు ప్రపంచంబునందఱునునిందించుచుందురు; ఇతరులుమాత్రమేకాదు, అతండుతానేతన్ను "రామునింజూడనైతి, నావంటిపాపిష్ఠుండులేఁడు, నాజన్మంబేల?" యనినిందించుకొనును. అని, తాత్పర్యము.

సర్వేషాం హి సధర్మాత్మా వర్ణానాం కురుతే దయామ్. ౧౯

చతుర్ణాంహి వయస్స్థానాం తేనతే త మనువ్రతాః

టీక॥ ధర్మాత్మా=ధర్మస్వభావుండగు; సః= ఆరాముండు; వయస్స్థానాం= బాల్యాదివయసులలోనుండు ; సర్వేషాం= సమస్తములయిన; వర్ణానాం= జాతులకు; చతుర్ణాం=నాల్గింటికిని; దయాం=దయను; కురుతేహి= చేయుచున్నాఁడుగదా! తేన=ఆకారణముచేత; తే=వారు; తంహి=ఆరామునే; అనువ్రతాః=అనుసరించియున్నారు.

ఆరాముండు, ధర్మాత్ముండుగానున, నాలుగువర్ణంబుల వారియందును, వారివారివయసునకుఁదగునట్లు, దయయుంచియుండుటవలన, వారలందఱు, ఆరామునియందే, మిక్కిలియుఁబ్రీతిగలిగియున్నవారు.

అని, తాత్పర్యము.

చతుష్పథాన్దేవపథాం శ్చైత్యా న్యాయతనానిచ. ౧౬
ప్రదక్షిణం పరిహరన్ జగామ నృపతే స్సుతః

టీక॥ నృపతేః=మనుష్యులకుఁబ్రభువైనదశరథునియొక్క; సుతః=కొడుకైనరాముఁడు; చతుష్పథాన్= నాలుగుదారులు కలయుస్థానంబులను; దేవపథాన్=దేవాలయంబులను; చైత్యాః= రచ్చచెట్లను ; ఆయతనానిచ=సభాస్థానములను; ప్రదక్షిణం=ప్రదక్షిణమగునట్లుగా; పరిహరన్ = దాఁటుచు; జగామ=పోయెను.

దశరథమహారాజు కుమారుండగు రాముండు, నాలుగుదారులుకలయుస్థానములకును దేవాలయంబులకును రచ్చచెట్లకును సభాస్థానంబులకును ప్రదక్షిణంబగునట్లుగాఁ, బోయెను.

అని, తాత్పర్యము.

స రాజకుల మాసాద్య మేఘసంఘోపమై శ్శుభైః. ౧౭
ప్రాసాదశృంగై ర్వివిధైః కైలాసశిఖరోపమైః
ఆవారయద్భి ర్గగనం విమానై రివ పాండురైః. ౧౮
వర్ధమానగృహైశ్చాపి రత్నజాలపరిష్కృతైః
త త్పృథివ్యాం గృహవరం మహేంద్రభవనోపమమ్. ౧౯
రాజపుత్రః పితు ర్వేశ్మ ప్రవివేశ శ్రియా జ్వలన్

టీక॥ సః=ఆ ; రాజపుత్రః = రాచకొమారుండగు రాముండు ; రాజకులం=రాజగృహమును; ఆసాద్య=పొంది; శ్రియా=కాంతిచే; జ్వలన్=ప్రకాశించుచు ; మేఘసంఘోపమైః=మేఘసమూహంబులతోఁబోలిక-గలవియును ; శుభ్రైః మంగళకరంబులును; వివిధైః=నానావిధంబులును ; కైలాసశిఖరోపమైః=కైలాసపర్వతశిఖరములతోఁబోలిక-గలవియును, గగనం= ఆకాశమును;ఆవారయద్భిః= అడ్డగించుచున్నవియును; పాండురైః=తెల్లనైన; విమానైరివ(స్థితైః)=విమానములంబోలెనున్నవియును;ప్రాసాదశృంగైః=మేడలశిఖరములచేతను; రత్నజాలపరిష్కృతైః=మణిసమూహంబులచేనలంకరింపబడిన;వర్ధమానగృహైశ్చ= వర్ధమానంబను రాజగృహలక్షణముతోఁగూడినగృహములతోను; యుక్తం (అభ్యావృతము)= కూడినదియును; పృథివ్యాం= భూమియందు;గృహవరం=ఇండ్లలో శ్రేష్ఠమయినదియును;మహేంద్రభవనోపమం=దేవేంద్రునియింటితోఁబోలిక- గలదియునగు; పితుః=తండ్రియొక్క;వేశ్మ = ఇంటిని;ప్రవివేశ=చొచ్చెను.

రాచకొమరుండగు నారాముండు, రాజగృహంబుఁజేరి, కాంతిచే వెలుంగుచు, మేఘసమూహంబులుంబోలె నున్నవియును మంగళకరంబులును నానావిధంబులును కైలాసశిఖరంబులుంబోలెధవళంబులునున్నతంబులునై చాలదూరము ఆకాశము నడ్డగించి తెల్లని విమానంబులుంబోలెఁజూపట్టుచున్న మేడలునుమణిసమూహంబులచేనలంకృతంబులై వర్ధమానలక్షణంబులతోఁగట్టంబడిన యిండ్లును, గలిగి, భూలోకంబునందుండుసమస్తగృహంబులలోన శ్రేష్ఠంబనందగి, దేవేంద్రుని గృహంబునకు సాటియగుచున్నతనతండ్రియైనదశరథునిగృహంబుం బ్రవేశించెను.అని, తాత్పర్యము.

స కక్ష్యా ధన్విభి గుప్తాస్తిస్రోతిక్రమ్య వాజిభిః. ౨౦
పదాతిరపరే కక్ష్యే ద్వే జగామ నరోత్తమః

టీక॥ నరోత్తమః=పురుషశ్రేష్ఠుండగు; సః=ఆరాముండు; ధన్విభిః= విలుకాండ్రచేత; గుప్తాః= రక్షింపబడిన; కక్ష్యాః=లొట్టికట్టులను ; తిస్రః=మూ

వుచుండెననుట.

అంత, నప్పుడు, రాచకొమరుండగు రాముండు, తండ్రియొద్దకుం బోఁగానే, యతనివెంబడివచ్చిన జనంబంతయు, సముద్రంబు చంద్రోదయంబుగోరుచుండిక, నారాముని రాకంగోరుచుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, సప్తదశ స్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానమునందు, అయోధ్యాకాండసప్తదశసర్గటీక,
ముగిసినది.



శ్రీః

అష్టాదశ సర్గ ప్రారంభః.

స దదర్శాసనే రామో నిషణ్ణం పితరం శుభే
కైకేయీసహితం దీనం ముఖేన పరిశుష్యతా. ౧

టీక: సః=ఆ; రామః= రాముండు; శుభే=మంగళకరంబయిన; ఆసనే=పీఠమందు; నిషణ్ణం= కూర్చుండినవాఁడును; కైకేయీసహితం = కైకేయితోఁ గూడినవాఁడును; పరిశుష్యతా= ఎండుచున్న, కళదప్పినదయనుట; ముఖేన= మొగముతో; యుక్తః=కూడినవాఁడును; దీనం=దుఃఖమునొందినవాఁడునగు; పితరం= తండ్రియయినదశరథుని; దదర్శ= చూచెను.

ఉత్తమంబగు నాసనంబునం గూర్చుండి; కైకేయిం గూడి, కాంతిదఱిగినముఖంబుతో దుఃఖితుండై యున్న, దండ్రియగు దశరథుని, రాముండు, చూచెను.

అని, తాత్పర్యము.

స పితు శ్చరణౌ పూర్వ మభివాద్య వినీతవత్

తతో వవందే చరణౌ కైకేయ్యా స్ససమాహితః. ౨

టీక॥సః = ఆరాముఁడు;సుసమాహితః= మిక్కిలియు నెచ్చరికగలవాఁడై;వినీతవత్ = వినయంబుగలవాఁడై; పూర్వం=మొదట;పితుః = తండ్రియొక్క;చరణౌ = పాదములను;అభివాద్య=నమస్కరించి;తతః = అటుపిమ్మట;కైకేయ్యాః=కైకేయియొక్క;చరణౌ=పాదములను; వవందే=నమస్కరించెను.

ఆరాముఁడు, మిగుల నెచ్చరికగలవాఁడై,వినయంబున, మొదలు, తండ్రియగు దశరథుని పాదంబులకు మ్రొక్కి, యటుపిమ్మట,కైకేయి పాదంబులకున మస్కరించెను. అని, తాత్పర్యము.

రామే త్యుక్త్వాచ వచనం బాష్పపర్యాకులేక్షణః
శశాక నృపతి ర్దీనో నేక్షితుం నాభిభాషితుమ్. ౩

టీక॥నృపతిః= మనుష్యులకుఁ బ్రభుండైనదశరథుండు;"రామ = రాముఁడా!" ఇతి=ఈ;వచనం = మాటను;ఉక్త్వాచ=చెప్పినంతనె;బాష్పపర్యాకులేక్షణః= కన్నీళ్లచేఁ గలఁతపడినకన్నులు గలవాఁడై;దీనః= దుఃఖంబునొందినవాఁడై ; ఈక్షితుం=చూచుటకు ; నశశాక = చాలఁడయ్యె . అభిభాషితుం= మాటలాడుటకు;న(శశాక)= చాలఁడయ్యె.

దశరథమహారాజు, "రాముఁడా!" అని మాత్రము చెప్పి, యంతఁ గండ్లనిండఁ గన్నీరు పెట్టుకొని, పరమదుఃఖంబునొంది,రామునిం జూచుటకుఁ గాని, పైమాటలు వలుకుటకుఁగాని, శక్తుండు కాఁడయ్యె. అని, తాత్పర్యము.

త దపూర్వం నరపతే ర్దృష్ట్వా రూపం భయావహమ్
రామోపి భయ మాపన్నః పదా స్పృష్ట్వేవ పన్నగమ్. ౪

టీక॥నరపతేః=మనుష్యులకుఁబ్రభువైనదశరథునియొక్క; అపూర్వం = అంతకుమున్ను గలుగనట్టిదియు, కావుననే; భయావహం=భయంబుగల్గించునదియునగు; తత్=ఆ; రూపం=ఆకారమును; దృష్ట్వా=చూచి; రామోపి

రాముండునుగూడ; పన్నగం=సర్పము
ను; పదా=కాలిచేత; స్పృష్ట్వేవ =
తాఁకివలె; భయం = వెఱపును ; ఆప
న్నః=పొందినాఁడు.

దశరథమహారాజునకు,ఎప్పుడునుగ
లుగనిట్టి భయంకరంబగు దుఃఖముఁగ
ల్గుటంజూచి, ఎట్టిదుఃఖంబులను సరకు
సేయని రాముండునుంగూడఁ, దన్నుఁగు
ఱించి దశరథుండు దుఃఖమునొందియుం
డ ననితలంచి, పామునుగాలం దొక్కిన
వాఁడుంబోలె, మిగుల భయంబునొందె
ను. అని, తాత్పర్యము.

ఇంద్రియైర ప్రహృష్టై స్తం శోకసంతాపకర్శితమ్
నిశ్శ్వసంతం మహారాజం వ్యథితాకులచేతసమ్. ౫
ఊర్మిమాలిన మక్షోభ్యం క్షుభ్యంత మివ సాగరమ్
ఉపప్లుత మివాదిత్య ముక్తానృత మృషిం యథా. ౬

టీక॥ రామః=(అధ్యాహృతము)=
రాముఁడు; అప్రహృష్టైః=సంతోషం
బునొందని, దుఃఖంబునొందినయనుట;
ఇంద్రియైః = ఇంద్రియంబులతోఁ; యు
క్తం(అధ్యాహృతము)=కూడినవాఁడు
ను; శోకసంతాపకర్శితం = దుఃఖము
చేతను దాపముచేతను కృశింపఁజేయఁ
బడినవాఁడును ; నిశ్శ్వసంతం= నిట్టూ
ర్పులువుచ్చుచున్నవాఁడును; వ్యథితాకు
లచేతసం= దుఃఖంబునొందినదియుఁగ
లఁతనొందినదియునగు మనసుగలవాఁ
డును; అక్షోభ్యం= కలఁతఁ పడనట్టిచే
యఁగూడనిదియు; క్షుభ్యంతం=కలఁతప
డుచున్నదియునగు; ఊర్మిమాలినం=
అలలపట్టులుగల ; సాగరమివ (స్థి
తం) = సముద్రముంబోలెనున్నవాఁడు
ను; ఉపప్లుతం= గ్రహణంబునొందిన ;
ఆదిత్యమివ (స్థితం)= సూర్యుండుంబో
లెనున్నవాఁడును; ఉక్తానృతం=చెప్పఁ
బడినయబద్ధముగల; ఋషింయథా (స్థి
తం)=ఋషియుంబోలె నున్నవాఁడున
గు; తం=ఆ; మహారాజం= దశరథమ
హారాజును; దృష్ట్వా (అధ్యాహృత
ము)=చూచి; భయం, ఆపన్నః (అ
ధ్యాహృతము)=భయంబును, బొందివాఁడు.

దుఃఖితంబులగునింద్రియంబులతోఁ
గూడి , దుఃఖంబునను సంతాపంబున
నుం గుందుచు, నిట్టూర్పులువుచ్చుచు,
దుఃఖంబునం గలఁతఁ జెందినమనంబుగ

లిగి, యెంతమాత్రముక్షోభింపఁజేయ రాని దయ్యుక్షోభంబు నొందిన సముద్రంబుంబోలె, నతిధీరుండయ్యు దుఃఖితుండై, రాహుగ్రస్తుండగుసూర్యుఁ భంగి, దబ్బఱలాడినఋషియుంబోలె, నిస్తేజస్కుండై, యున్నయాదశరథమహారాజుంజూచి, రాముండు, భయంబు నొందెను. అని, తాత్పర్యము.

అచింత్యకల్పం హి పితు స్తం శోకముపధారయన్
బభూవ సంరబ్ధతర స్సముద్ర ఇవ పర్వణి. ౮

టీక॥ సః(అధ్యాహృతము)= ఆరాముఁడు; పితుః = తండ్రియగుదశరథుని యొక్క; అచింత్యకల్పం= ఎంతమాత్రము తలంపరాని; తం=ఆ; శోకం=దుఃఖమును; ఉపధారయన్= విచారించుచు; పర్వణి=పౌర్ణమియందు; సముద్రఇవ=సముద్రుండుంబోలె; సంరబ్ధతరః= మిక్కిలియునుగలఁతనొందినవాఁడు; బభూవ=అయ్యెను.

ఆరాముఁడు, తండ్రియగుదశరథునకు, మనంబునఁగూడఁదలంపఁగూడనియట్టిదుఃఖముగల్గుటంజూచి, పూర్ణిమయందు సముద్రుండుంబోలె, మిక్కిలి యుఁగలఁతనొందెను.

అని, తాత్పర్యము.

చింతయామాస చ తదా రామః పితృహితే రతః

టీక॥ పితృహితే = తండ్రియిష్టమునందు; రతః=ఆసక్తుఁడగు; రామః=రాముఁడు; తదా=అప్పుడు; చింతయామాస=ఆలోచించెను.

తండ్రిహితముసేయుటయందుమిగులనాసక్తిగల రాముం, డప్పుడిట్లని, యాలోచించెను. అని, తాత్పర్యము.

కింస్విదద్యైవ నృపతిర్న మాం ప్రత్యభినందతి. ౯

టీక॥ కింస్విత్ =ఏమో; అద్యైవ= ఇప్పుడుమాత్రము; నృపతిః=మనుష్యులకుఁబ్రభువైనదశరథుండు ; మాంప్రతి=నన్నుఁగూర్చి; నాభినందతి= సంతోషింపఁడు.

ఏమో! కారణముతెలియలేదు ;॥

ప్పుడుమాత్రము దశరథమహారాజు నకునన్నుఁజూచినంత , సంతోషముగలుగక, దుఃఖంబుగలుగుచున్నది.

అని, తాత్పర్యము

అన్యదా మాం పితా దృష్ట్వా కుపితోఽపి ప్రసీదతి
తస్య మా మద్య సంప్రేక్ష్య కిమాయాసః ప్రవర్తతే. ౯

టీక॥ అన్యదా= ఇతరకాలములందు, ఇంతకుమునుపనుట ; పితా=తండ్రియగుదశరథుండు; కుపితోఽపి = కోపంబునొందినవాఁడయ్యును ;మాం=నన్ను; దృష్ట్వా=చూచి; ప్రసీదతి= సంతోషంబునొందును, తస్య=అట్టిదశరథునకు ; అద్య = ఇప్పుడు; మాం=నన్ను ; సంప్రేక్ష్య=చూచి; ఆయాసః=దుఃఖము; ప్రవర్తతే=కలుగుచున్నది ; కిం=ఏమికారణము?

ఇంతకుమునుపు, దశరథుండుకోపము నొందియున్నను నన్నుఁజూడగానే కోపంబువిడిచి సంతోషంబునొందును; అట్టిదశరథునకిప్పుడునన్నుఁజూడఁగానే, దుఃఖంబుగలుగుచున్నదే ! ఏమికారణము? అని, రాముండాలోచించెను.

అని, తాత్పర్యము.

స దీన ఇవ శోకార్తో విషణ్ణవదనద్యుతిః
కైకేయీ మభివాద్యైవ రామో వచన మబ్రవీత్. ౧౦

టీక॥సః=ఆ; రాముఁడు; దీన ఇవ= ధైర్యములేనివాఁడువలె; శోకార్తః= దుఃఖముచేఁబీడింపఁబడినవాఁడై; విషణ్ణవదనద్యుతిః = దుఃఖమునొందినముఖకాంతిగలవాఁడై, తఱిగినముఖకాంతిగలవాఁడైయనుట ; అభివాద్యైవ= నమస్కరించినంతనే; కైకేయీం=కైకేయినిగూర్చి; వచనం = మాటను ; అబ్రవీత్=చెప్పెను.

ఆ రాముండు, దీనుండయ్యును, ధైర్యంబులేని వాఁడుంబోలె , దుఃఖంబునొంది, కాంతిలేనిముఖంబుతోఁ, గైకేయికినమస్కరించినంతనే, ఆబిడంజూచి,యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

కచ్చిన్మయా నాపరాద్ధ మజ్ఞానా ద్యేన మే పితా

కుపితస్తన్మమాచక్ష్వ త్వమేవైనం ప్రసాదయ. ౧౧

టీక॥అజ్ఞానాత్=తెలియమివలన; మయా=నాచేత; నాపరాద్ధంకచ్చిత్=అపరాధముచేయఁబడలేదుగదా? యేన=ఏకారణముచేత; మే=నాయొక్క; పితా=తండ్రి; కుపితః=కోపంబునొందినాఁడో; తత్ = ఆకారణమును ; మమ=నాకు; ఆచక్ష్వ=చెప్పుము. త్వమేవ=నీవే; ఏనం=ఇతని; ప్రసాదయ=ప్రసన్నునిఁగాఁజేయుము.

నేనజ్ఞానంబుననేమైన నపరాధంబుచేయలేదుగదా? నాతండ్రిదశరథుండేలయిట్లుకోపించియున్నాఁడు? నాకాకారణంబుఁజెప్పుము; నీవేయితనికిఁగోపంబుపోఁగనట్లుచేయుము. అని, తాత్పర్యము.

అప్రసన్నమనాః కిన్ను సదా మాంప్రతి వత్సలః
వివర్ణవదనో దీనో నహి మామభిభాషతే. ౧౨

టీక॥సదా=ఎల్లప్పుడు; మాంప్రతి=నన్నుఁగూర్చి; వత్సల = ప్రేమగల; పితా(అధ్యాహార్యము) = తండ్రి; కిన్ను=ఎందువలన; అప్రసన్నమనాః = ప్రసన్నముకానిమనస్సుగలవాఁడై ; వివర్ణవదనః= తెల్లఁబాఱినముఖముగలవాఁడై; దీనః=దుఃఖమునొందినవాఁడై; మాం=నన్నుఁగూర్చి; నాభిభాషతే= పలుకకున్నాఁడు? ("హి" అనునది పాదపూరణార్థము).

నాయందెల్లప్పుడును మిగులఁబ్రేమగలిగియుండునాతండ్రిదశరథుండు, ఇప్పుడెందువలన, నన్నుఁజూచి, ప్రసన్నుండుగాక, తెల్లఁబాఱినమొగంబుతో దుఃఖితుండై నాతో నేమియుఁబలుకకున్నాఁడు? అని, తాత్పర్యము.

శారీరో మానసోవాపి కచ్చిదేనం న బాధతే
సంతాపో వాభితాపోవా దుర్లభంహి సదా సుఖమ్. ౧౩

టీక॥ శారీరః = శరీరంబునఁగల్గినట్టి; సంతాపః=వ్యాధిగాని, మానసోవాపి= మనసునందుఁగల్గినట్టి; అభితాపోవా=దుఃఖముగాని ; ఏనం=ఈదశరథమహారాజును; నబాధతేకచ్చిత్ = బాధింపకున్నదిగదా ? సదా = ఎల్ల

ప్పుడు; సుఖం=సౌఖ్యము ; దుర్లభం హి=పొందుటకష్టముగదా!

ఈదశరథమహారాజునకు, శరీరవ్యాధిగాని మనోదుఃఖముగాని లేకున్నది గదా? మనుష్యులకెల్లప్పుడును సుఖంబె కలుగదు, కావున , సంశయించెదను అని, తాత్పర్యము.

కచ్చి న్నకించి ద్భరతే కుమారే ప్రియదర్శనే
శత్రుఘ్నే వా మహాసత్త్వే మాతౄణాం వా మమాశుభమ్. ౧౪

టీక॥ప్రియదర్శనే=సంతోషపరచుచుచూచుటగల; కుమారే = బాలుండగు; భరతే = భరతునియందుగాని; మహాసత్త్వే=అధికమయినబలముగల; శత్రుఘ్నేవా= శత్రుఘ్నునియందుగాని; మమ = నాయొక్క; మాతౄణాం వా=తల్లులలోఁగాని; అశుభం=అమంగళము; కించిత్=కొంచెమయినను; నకచ్చిత్=లేకున్నదికదా?

చూపరులకుసంతోషంబు గల్గించు, బాలుండగు భరతునకుఁగాని, మహాబలుండగుశత్రుఘ్నునకుఁగాని , నాతల్లులలోనెవ్వరికైనఁగాని , యమంగళంబేమియులేదుగదా? అని, తాత్పర్యము.

అతోషయ న్మహారాజ మకుర్వ న్వా పితు ర్వచః
ముహూర్తమపి నేచ్ఛేయం జీవితుం కుపితే నృపే. ౧౫

టీక॥అహం(అధ్యాహృతము)= నేను; నృపే= మనుష్యులఁబాలించునట్టిదశరథుఁడు; కుపితే= కోపమునొందియుండఁగా; మహారాజం=దశరథమహారాజును; అతోషయన్= సంతోషింపఁజేయనివాఁడనై; పితుః = తండ్రియగుదశరథునియొక్క; వచః = మాటను; అకుర్వన్వా=చేయనివాఁడనై; ముహూర్తమపి=కొంచెముసేపయినను; జీవితుం=బ్రతుకుటకు; నేచ్ఛేయం=కోరను.

నాతండ్రియగు దశరథమహారాజు కోపంబునొందియుండఁగా, నతనికిసంతోషంబుసేయకగాని, యతండుచెప్పుకార్యంబుసేయకగాని, కొంచెముసేపైనను జీవింపనొల్లను.

అని, తాత్పర్యము.

యతోమూలం నరః పశ్యే త్ప్రాదుర్భావ మిహాత్మనః
కథం తస్మి న్నవర్తేత ప్రత్యక్షే సతి దైవతే. ౧౬

టీక॥ నరః=మనుష్యుఁడు; ఇహ=ఈ లోకమందు; ఆత్మనః = తనయొక్క; ప్రాదుర్భావం=ఉత్పత్తిని; యతోమూలం= ఎవ్వఁడు కారణముగాఁగలదానిఁగా; పశ్యేత్=చూచునో; ప్రత్యక్షే=కంట్లకగపడునట్టి; దైవతే = దేవతగా; సతి=ఉన్న; తస్మిన్=ఆతండ్రియందు; కథం=ఎట్లు; నవర్తేత=ఉండఁడు?

మనుష్యుఁడు, తానీలోకంబునంబుట్టుటకెవ్వఁడు కారణమో, అట్టి, ప్రత్యక్షదైవమయిన, తండ్రికివశ్యుఁడై యెట్లుండఁడు? అవశ్యమువశ్యుండై యేయుండును. అని, తాత్పర్యము.

కచ్చి త్తే పరుషం కించి దభిమానా త్పితా మమ
ఉక్తో భవత్యా కోపేన యత్రా స్య లులితం మనః. ౧౭

టీక॥ మమ=నాయొక్క; పితా=తండ్రియగుదశరథుఁడు; తే=నీయొక్క; కోపేన=కోపముచేత; అభిమానాత్; స్నేహాభిమానమువలన; భవత్యా=నీచేత; కించిత్=ఏదైన; పరుషం=కఠినమయినమాటను; ఉక్తః కచ్చిత్=చెప్పఁబడినాఁడా యేమి? యత్ర=దేనిచేత; అస్య=ఇతనియొక్క; మనః=మనస్సు; లులితం = తిరుగఁబడినొందినదో.

నాతండ్రియగుదశరథునిఁగూర్చి, నీకేమైన స్నేహగర్వంబునఁగోపించి, కఠినవచనంబులం బలికితివా యేమి? దానిచేతనిట్లు మనసు కాయాసంబు గలిగినదా? అని, తాత్పర్యము.

ఏత దాచక్ష్వ మే దేవి తత్త్వేన పరిపృచ్ఛతః
కి న్నిమిత్త మపూర్వో యం వికారో మనుజాధిపే. ౧౮

టీక॥ దేవి=తల్లివగుకైకేయీ! పరిపృచ్ఛతః = అడుగుచున్న; మే=నాకు; తత్త్వేన=యాథార్థ్యముచేత; ఏతత్=దీనిని; ఆచక్ష్వ=చెప్పుము; మనుజాధిపే= మనుష్యులకుఁబ్రభువైనదశరథునియందు; అపూర్వః=మునుపెప్పుడునుగలుగనట్టి; అయం=ఈ; వికారః=తిరుగుడు; కిన్నిమిత్తం=ఏకా

రణమువలన?

తల్లివగు కైకేయీ! దశరథమహారాజునకు, మునుపెప్పుడునుగలుగని యిట్టివికారం బెందువలనఁ గల్గినది? నాకుదీని యథార్థముగాఁ జెప్పుము. అని, రాముండు, కైకేయితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా తు కైకేయీ రాఘవేణ మహాత్మనా
ఉవాచేదం సునిర్లజ్జా ధృష్ట మాత్మహితం వచః. ౧౯

టీక॥ సునిర్లజ్జా=ఎంతమాత్రము సిగ్గులేని; కైకేయీతు=కైకేయియు; మహాత్మనా=పూజ్యమయినస్వభావముగల; రాఘవేణ=రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; ధృష్టం=జంకులేనట్లుగా; ఆత్మహితం=తనకుహితమయిన; ఇదం=ఈ; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

మహాత్ముండగు రాముండు చెప్పిన మాటను, విని, కైకేయి పెనిమిటికి దుఃఖంబుగలిగించితినని యెట్లు చెప్పవచ్చునని సిగ్గెంతమాత్రమును లేనిదై, ప్రత్యక్షంబుగా "నీకుఁబట్టాభిషేకంబు వలదు, నీవడవికిఁబొమ్ము" అని, యెట్లు చెప్పవచ్చునని యెంతమాత్రము జంకులేక, తనకు, హితమగునట్లుగా, రామునితో నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

న రాజా కుపితో రామ వ్యసనం నాస్య కించన
కించిన్మనోగతం త్వస్య త్వద్భయా న్నాభిభాషతే. ౨౦

టీక॥ రామ=రాముఁడా! రాజా=దశరథమహారాజు; కుపితః=కోపంబునొందినవాఁడు; న=కాఁడు. అస్య=ఇతనికి; వ్యసనం=దుఃఖము; కించన=కొంచెమయినను; న=లేదు. అస్య=ఇతనికి; కించిత్తు=ఒకానొకటి మాత్రము; మనోగతం=మనసును బొందినది. త్వద్భయాత్=నీవలని భయంబువలన; నాభిభాషతే=చెప్పఁడు.

రాముఁడా! దశరథుండు కోపంబు నొందలేదు; ఇతనికేమియు దుఃఖంబు లేదు; ఇతని మనసున నొకకోరిక మాత్రమున్నది; నీవేమి చెప్పుదువో అను భయంబున, దానిం జెప్పకున్నాఁడు.

అని, తాత్పర్యము.

ప్రియం త్వా మప్రియం వక్తుం వాణీ నాస్యోపవర్తతే

అస్య=ఇతనియొక్క; వాణీ=వాక్కు; ప్రియం=ఇష్టుండవగు; త్వాం=నిన్నుఁగూర్చి; అప్రియం=అనిష్టవార్తను; వక్తుం=చెప్పుటకు; నోపవర్తతే=రాకున్నది.

నీవు ప్రియుండవు కావున, నీకప్రియవార్తఁజెప్పుటకు, ఇతనికినోరాడకున్నది. అని, తాత్పర్యము.

యదవశ్యం త్వయా కార్యం యదనేనాశ్రుతం మమ. ౨౧

టీక॥ యత్=ఏది; అనేన=ఈదశరథునిచేత; మమ=నాకు; ఆశ్రుతం=ఒప్పుకొనఁబడెనో; తత్=అది; అవశ్యం=నిశ్చయముగా; త్వయా=నీచేత; కార్యం=చేయఁదగినది.

నాకితండేకార్యముచేసెదనని ప్రతిజ్ఞఁజేసియున్నాఁడో, ఆకార్యమును నీవవశ్యముచేయవలెను. అని, తాత్పర్యము.

ఏష మహ్యం వరం దత్వా పురా మా మభిపూజ్య చ
స పశ్చాత్తప్యతే రాజా యథాన్యః ప్రాకృత స్తథా. ౨౨

టీక॥ సః=అట్టి, సత్యమునెమాటలాడుదుననువ్రతముగల; ఏషః=ఈ; రాజా=దశరథమహారాజు; పురా=మున్ను; మహ్యం=నాకొఱకు; వరం=వరమును; దత్వా=ఇచ్చి; మాం=నన్ను; అభిపూజ్య చ=గౌరవించియు; అన్యః=ఇతరుఁడైన; ప్రాకృతః=తెలివిలేనివాఁడు; యథా=ఎట్లో; తథా=అట్లు; పశ్చాత్తప్యతే=వెనుకఁబరితపించుచున్నాఁడు.

సత్యమునేమాటలాడుదుననేవ్రతముపట్టియుండు నీదశరథమహారాజు, మున్ను నన్ను గౌరవింపవలసిన కాలంబున, నాకువరంబొసంగి నన్ను గౌరవించి, యిప్పుడు, దబ్బఱలాడునట్టి తెలివిలేనివాఁడుంబోలె, నేలయిచ్చితినని దుఃఖించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

అతిసృజ్య దదానీతి వరం మమ విశాంపతిః

స నిరర్థం గతజలే సేతుం బంధితు మిచ్ఛతి ౨౩

టీక॥ సః=అట్టి; విశాం=మనుష్యలకు; పతిః=ప్రభువైన దశరథుఁడు; మమ=నాకు; "వరం=వరమును; దదాని=ఇచ్చెదను" ఇతి=అని; అభిసంధ్య=ప్రతిజ్ఞ చేసి; నిరర్థం=వ్యర్థముగా; గతజలే=పోయినజలముగల ప్రదేశమునందు; సేతుం=కట్టను; బంధితుం=కట్టుటకు; ఇచ్ఛతి=కోరుచున్నాఁడు.

ఈదశరథమహారాజు, నాకువరంబిచ్చెదనని ప్రతిజ్ఞచేసి, చెఱువులోని నీళ్లు పోయినవెనుకఁ గట్టఁగట్టఁ గోరునట్లు, ఇప్పుడు, ఆప్రతిజ్ఞ చేసితనని, వ్యర్థముగాఁ జింతించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

ధర్మమూల మిదం రామ విదితంచ సతామపి
తత్సత్యం న త్యజే ద్రాజా కుపిత స్త్వత్కృతే యథా. ౨౪

టీక॥ రామ=రాముఁడా! ఇదం=ఈ సత్యము; ధర్మమూలం=ధర్మమునకుఁ గారణమయినది. సతామపి=పెద్దలకును; విదితంచ=తెలిసినదియు. తత్=అందువలన; రాజా=దశరథమహారాజు; త్వత్కృతే=నీకొఱకు; కుపితః=కోపంబునొందినవాఁడై; సత్యం=సత్యమును; యథా=ఎట్లు; న త్యజేత్=విడువఁడో; తథా, కురు(అధ్యాహృతము)=అట్లు, చేయుము.

రాముఁడా! సత్యముధర్మమునకుం బయిఁ గారణమయినది, అట్లుపెద్దలు చెప్పుచున్నారు; కావున, దశరథమహారాజు, నీకొఱకు, నామీఁదఁ గోపించి, సత్యంబును విడువకుండునట్లు, చేయుము. అని, తాత్పర్యము.

యది తద్వక్ష్యతే రాజా శుభం వా యది వాశుభమ్
కరిష్యసి తత స్సర్వ మాఖ్యాస్యామి పున స్త్వహమ్. ౨౫

టీక॥ రాజా=దశరథమహారాజు; శుభం=మంగళకరమయినదానిఁగాని; అశుభం యది వా=అమంగళమునుగాని; యత్(అధ్యాహృతము)=దేని; వక్ష్యతే(వక్ష్యతి)=చెప్పునో; తత్=దానిని; కరిష్యసి యది=చేయుదువేని; తతః=

అంతః;అహంపునస్తు = నేనే;సర్వం= అంతను;ఆఖ్యాస్యామి=చెప్పెదను.

దశరథమహారాజు చెప్పుకార్యమును, అదినీకు మేలుగానికీడుగాని, చేసెదనని నీనొప్పుకొందువని, నేనేయాకార్యము నంతయు,నీకుఁజెప్పెదను.

అని, తాత్పర్యము.

యది త్వభిహితం రాజ్ఞా త్వయి తన్న విపత్స్యతే
తతో౽హ మభిధాస్యామి న హ్యేష త్వయి వక్ష్యతి. ౨౮

టీక॥ రాజ్ఞా=దశరథమహారాజుచేత;అభిహితం = చెప్పఁబడిన;తత్=ఆ కార్యము;త్వయి=నీయందు;నవిపత్స్యతేయదితు= విపత్తునుబొందక నీయందు నేని,నిష్ఫలముకాక నీయందు నేయునుట;తతః=అంతట;అహం=నేను;అభిధాస్యామి=చెప్పెదను.ఏషః= ఈదశరథుఁడు;త్వయి = నీయందు;నవక్ష్యతిహి=చెప్పఁడుగదా!

“దశరథమహారాజు చెప్పుమాటలను, నీవు, “అవశ్యముసఫలముగాఁజేసెదనని, “ప్రతిజ్ఞ చేయుదువేని,యప్పుడు, నేను, దశరథమహారాజునకు బదులుగాఁజెప్పెదను;ఆతఁడునీకట్టియప్రియ కార్యంబుఁజెప్పనోరాడదు. అని,కైకేయి, రామునితోఁజెప్పెదను.

అని, తాత్పర్యము.

ఏతత్తు వచనం శ్రుత్వా కైకేయ్యా సముదాహృతమ్
ఉవాచ వ్యథితో రామ స్తాం దేవీం నృపసన్నిధౌ. ౨౯

టీక॥ రామః=రాముఁడు ; కైకేయ్యా = కైకేయిచేత ; సముదాహృతం=చెప్పఁబడిన;ఏతత్=ఈ;వచనం= మాటను;శ్రుత్వాతు = వినినంతనే ; వ్యథితః= దుఃఖమునొందినవాఁడై; నృపసన్నిధౌ= దశరథమహారాజుయొక్క సమీపమందు;తాం=ఆ; దేవీం=కైకేయిన్గూర్చి; ఉవాచ=పలికెను.

రాముఁడు, కైకేయిచెప్పిన యా మాటనువినినంతనె, “తండ్రిగారియునాజ్ఞాప్రకారమునడచుకొనునో నడచుకొనఁడో”అని, నాయందు, సంశయంబుం చెందగినంతటిస్థితినాకుఁగలిగినదే, యని,దుఃఖంబునొంది,దశరథమహారాజుసమీపంబున,నాకైకేయింజూచి, యిట్లని చెప్పెను.అని,తాత్పర్యము.

అహో ధిఙ్నార్హసే దేవి వక్తుం మామీదృశం వచః

టీక॥ అహో=అయ్యో! ధిక్=నేను దహింపబడుదునుగాక! దేవి=తల్లివగు కైకేయీ! మాం=నన్నుగూర్చి; ఈదృశం=ఇట్టి; వచః=మాటను; వక్తుం=చెప్పుటకు; నార్హసే(నార్హసి)=తగవు.

అయ్యో! నేను బ్రతికియుండియేమి ప్రయోజనము? తల్లివగు కైకేయీ! నాయందిట్టి సంశయంబుంచవలదు. అని, తాత్పర్యము.

అహం హి వచనాద్రాజ్ఞః పతేయమపి పావకే. ౨౮
భక్షయేయం విషం తీక్ష్ణం మజ్జేయమపి చార్ణవే

టీక॥ రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; వచనాత్తు=మాటవలన; అహం=నేను; పావకేపి=నిప్పునందైనను; పతేయంహి=పడుదునుగదా! తీక్ష్ణం=అతివేగముగల; విషం=విషమును; భక్షయేయం(హి)=తిందునుగదా! అర్ణవేచాపి=సముద్రమునందైనను; మజ్జేయం(హి)=మునుగుదునుగదా!

దశరథమహారాజాజ్ఞాపించునేని, నేను, అగ్నిహోత్రమునందైనను బడుదును; తీక్ష్ణమగువిషంబునైనం దినుదును; సముద్రమునందును మునుగుదును. అని, తాత్పర్యము.

నియుక్తో గురుణా పిత్రా నృపేణ చ హితేన చ. ౨౯

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; గురుణా=ఆచార్యుడును; పిత్రా=తండ్రియును; నృపేణచ=రాజును; హితేనచ=మేలు చేయువాడునగు దశరథునిచేత; నియుక్తః=ఆజ్ఞాపింపబడినవాడనై; కరిష్యే(అధ్యాహృతము)=చేయుదును.

ఆచార్యులలో ముఖ్యుండును తండ్రియును రాజును ఇందునంతను మేలుచేయువాడునగు దశరథుండాజ్ఞాపించినప్పుడు, నేనేకార్యమునైనను జేయుదును; సంశయింపవలదు. అని, తాత్పర్యము.

తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభికాంక్షితమ్
కరిష్యే ప్రతిజానేచ రామో ద్విర్నాభి భాషతే. ౩౦

టీక॥ దేవి=కైకేయీ! తత్=అందువలన; రాజ్ఞః= దశరథమహారాజునకు; యత్=ఏది; అభికాంక్షితం=కోరఁబడినదో; తత్ (అధ్యాహృతము)=ఆ; వచనం=మాటను; బ్రూహి=చెప్పుము. కరిష్యే=చేసెదను. ప్రతిజానేచ=ప్రతిజ్ఞయుఁ జేయుచున్నాను. రామః=రాముఁడు; ద్విః = రెండుమాఱులు; నాభిభాషతే=పలుకఁడు.

కైకేయీ! అందువలన, దశరథమహారాజుకోరిక యేదో దానిం జెప్పుము; దానిఁ జేసెదను; తప్పను; ప్రతిజ్ఞ యును గూడఁజేయుచున్నాను; రాముండెప్పుడును, అబద్ధంబుపలుకఁడు. అని, రాముండు కైకేయితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తమార్జవసమాయుక్త మనార్యా సత్యవాదినమ్
ఉవాచ రామం కైకేయీ వచనం భృశదారుణమ్. ౩౧

టీక॥ అనార్యా=దుష్టురాలగు; కైకేయీ = కైకేయి; ఆర్జవసమాయుక్తం= కౌటిల్యములేకుండుటతోఁగూడినవాఁడును; సత్యవాదినం=సత్యమునె చెప్పువాఁడునగు; తం=ఆ; రామం = రామునిఁగూర్చి; భృశదారుణం= మిక్కిలియుభయంకరంబయిన; వచనం=మాటను; ఉవాచ=పలికెను.

దుష్టురాలయిన కైకేయి, యెంతమాత్రము కౌటిల్యములేనివాఁడై సత్యవాదియైయుండు రామునితో, మిగులభయంకరంబగునీమాటం జెప్పెను.

అని తాత్పర్యము.

పురా దైవాసురే యుద్ధే పిత్రా తే మమ రాఘవ
రక్షితేన వరౌ దత్తౌ సశల్యేన మహారణే. ౩౨

టీక॥ రాఘవ=రామునా! పురా=మునుపు; దైవాసురే=దేవతలకునునసురులకునుజరగిన; యుద్ధే=యుద్ధమునందు; మహారణే=గొప్పయుద్ధమునందు;

సశల్యేన=బాణములతోఁగూడినవాఁడు నుఃమయా (అధ్యాహృతము)= నాచే తఃరక్షితేన = కాపాడఁబడినవాఁడున గుః తే=నీయొక్క; పిత్రా= తండ్రియగుదశరథునిచేత;మమ=నాకు;వరౌ = రెండువరములు; దత్తౌ=ఇవ్వఁబడినవి.

మునుపు దేవతలకు నసురులకుయుద్ధముజరిగినప్పుడు, మహాయుద్ధంబున, నీతండ్రి దశరథుని దేహంబంతయు బాణంబులు, గ్రుచ్చుకొనుటంజేసి యతండుసోలఁగా, నేనాబాణంబులన్నియుఁ బెటికి బాగుచేసినాను, కావున,నాకు, నీతండ్రి రెండువరంబులిచ్చెను. అని, తాత్పర్యము.

తత్ర మే యాచితో రాజా భరత స్యాభిషేచనమ్
గమనం దండకారణ్యే తవ చాద్యైవ రాఘవ. ౩౩

టీక॥ రాఘవ = రాముఁడా! తత్ర=ఆరెండువరంబులకును ; మే=(తృతీయార్థేమందుషష్ఠి) నాచేత ; రాజా=దశరథమహారాజు; భరతస్య=భరతునికి; అభిషేచనం=పట్టాభిషేకమును; అద్యైవ=ఇప్పుడే; తవ=నీకు;దండకారణ్యే=దండకారణ్యమందు; గమనంచ=తిరుగుటను; యాచితః=అడుగఁబడినాఁడు.

రాముఁడాఁ! నేనా రెండువరంబులకును,భరతునకుఁబట్టాభిషేకము గావలెననియు , నీవిపుడె దండకారణ్యంబునకుఁ బోవలయుననియు, దశరథమహారాజు నడిగినాను. అని, తాత్పర్యము.

యది సత్య ప్రతిజ్ఞం త్వం పితరం కర్తు మిచ్ఛసి
త్మానంచ నరశ్రేష్ఠ మమ వాక్య మిదం శృణు. ౩౪

టీక॥నరశ్రేష్ఠ= పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా; త్వం=నీవు;పితరం=తండ్రిని;ఆత్మానంచ = నిన్నును; సత్యప్రతిజ్ఞం= సత్యమయినప్రతినగలవానినిగా; కర్తుం=చేయుటకు;ఇచ్ఛసియది=కోరుదువేని;మమ = నాయొక్క;ఇదం=ఈ;వాక్యం= మాటను;శృణు = వినుము.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! నీతండ్రియు,నీవును, అబద్ధముచెప్పనివారమనియనిపించుకొనఁగోరితేని, యిప్పుడు నేనుజెప్పునట్లు,వినుము. అని, తాత్పర్యము.

సన్నిదేశే పితు స్త్విష్ఠ యథా తేన ప్రతిశ్రుతమ్
త్వయారణ్యం ప్రవేష్టవ్యం నవవర్షాణి పంచచ. ౩౫

టీక॥ పితుః=తండ్రియగుదశరథుని యొక్క; సన్నిదేశే = ఆజ్ఞయందు; తిష్ఠ=ఉండుము. తేన=ఆ, దశరథునిచేత; యథా=ఎట్లు; ప్రతిశ్రుతం = వాగ్దత్తముచేయఁబడినదో; తథా(అధ్యాహృతము)=అట్లు; త్వయా=నీచేత; వర్షాణి=సంవత్సరములు; నవ=తొమ్మిదియును; పంచచ=ఐదును, పదునాలుగునను; అరణ్యం=అడవి; ప్రవేష్టవ్యం=ప్రవేశింపఁబడవలసినది.

నీవు, నీతండ్రియగు దశరథుండాజ్ఞాపించునట్లు సేయుము; అతండు, నాకువాగ్దత్తముచేసియున్నట్లు, నీవు, పదునాలుగుసంవత్సరములు, అరణ్యంబుననుండవలెను. అని, తాత్పర్యము.

భరత స్త్వభిషిచ్యేత యదే త దభిషేచనమ్
త్వదర్థే విహితం రాజ్ఞా తేన సర్వేణ రాఘవ. ౩౬

టీక॥ రాఘవ=రాముఁడా! రాజ్ఞా=దశరథమహారాజుచేత; త్వదర్థే=నీకొఱకు; యత్=ఏ; ఏతత్=ఈ; అభిషేచనం=అభిషేకసామగ్రి; విహితం=ఏర్పఱుపఁబడినదో; సర్వేణ=సమస్తమయిన; తేన=దానిచేత; భరతస్తు = భరతుండే; అభిషిచ్యేత=అభిషేకింపఁబడును.

రాముఁడా! ఇప్పుడు నీకుఁబట్టాభిషేకముసేయవలయునని దశరథ మహారాజు సిద్ధముచేసియుండునభిషేక సామగ్రిచేత భరతునకే పట్టాభిషేకము సేయవలెను. అని, తాత్పర్యము.

సప్త సప్తచ వర్షాణి దండకారణ్య మాశ్రితః
అభిషేక మిమం త్యక్త్వా జటాజీనధరో వస. ౩౭

టీక॥ త్వం (అధ్యాహృతము)= నీవు; ఇమం=ఈ; అభిషేకం = పట్టాభిషేకమును; త్యక్త్వా=విడిచి; సప్తము=ఏడును; సప్తచ=ఏడును, పదునాలుగను;

వర్షాణి= సంవత్సరములు; దండకారణ్యాం= దండకారణ్యమును; ఆశ్రితః = పొందినవాఁడవై; జటాజినధరః= జడలనుదోళ్లనుధరించినవాఁడవై; వస= ఉండుము.

నీ, వీపట్టాభిషేకమునువిడిచి, పదునాలుగు సంవత్సరములు దండకారణ్యమందు, జడలుఁ గృష్ణాజినంబును దాల్చుచు, వాసంబు సేయుము.

అని, తాత్పర్యము.

భరతః కోసలపురే ప్రశాస్తు వసుధా మిమామ్
నానారత్నసమాకీర్ణాం సవాజిరథకుంజరామ్. ౩౪

టీక॥ భరతః=భరతుండు; కోసలపురే=కోసలదేశమునకుఁబ్రధాన పట్టణమయిన యయోధ్యయందు; స్థితః (అధ్యాహృతము)=ఉన్నవాఁడై; నానారత్నసమాకీర్ణాం = నానావిధములగు మణులచేవ్యాపింపఁబడినదియును ; సవాజిరథకుంజరాం = గుఱ్ఱములతోను ఏనుఁగులతోను గూడినదియునగు ; ఇమాం=ఈ ; వసుధాం = భూమిని; ప్రశాస్తు= పాలించుఁగాక.

భరతుండు, అయోధ్యాపట్టణంబున నుండి, నానావిధమణులతోను గుఱ్ఱములతోను రథములతోనుఏనుంగులతోనుం గూడి, యీ రాజ్యంబుఁ బాలింపుచుండుఁగాక. అని, తాత్పర్యము.

ఏతేనత్వాం నరేంద్రోయం కారుణ్యేన సమాప్లుతః
శోకసంక్లిష్టవదనో నశక్నోతి నిరీక్షితుమ్. ౩౫

టీక॥ ఏతేన=ఈకారణముచేత; అయం=ఈ; నరేంద్రః=మనుష్యులకుఁబ్రభువైనదశరథుఁడు; కారుణ్యేన= దయచే; సమాప్లుతః=నిండినవాఁడై; శోకసంక్లిష్టవదనః = దుఃఖముచేఁగ్లేశమునొందినముఖముగలవాఁడై; త్వాం=నిన్ను ; నిరీక్షితుం = చూచుటకు ; నశక్నోతి=చాలకున్నాఁడు.

ఈకారణముచేతనే , యీదశరథమహారాజు, మహాదయాశాలికావునఁ, బ్రియపుత్రుండవగు నిన్నువనంబునకంపవలసివచ్చెనేయని దుఃఖంబున, మొగంబువంచి, నిన్నుంజూడ నేరకున్నాఁడు. అని, తాత్పర్యము.

ఏతత్తు కురు నరేంద్రస్య వచనం రఘునందన

టీక॥ రఘునందన=రాముఁడా! నరేంద్రస్య=మనుష్యులకుఁ బ్రభువైనదశరథునియొక్క; ఏతత్=ఈ; వచనం=మాటను; కురు=చేయుము.

రాముఁడా! ఈదశరథమహారాజు మాట ప్రకారము నీవు పట్టాభిషేకంబు విడిచి యరణ్యమునకుఁ బదునాలుగుసంవత్సరంబులు పొమ్ము. అని, తాత్పర్యము.

సత్యేన మహతా రామ తారయస్వ నరేశ్వరం. ౪౧

టీక॥ రామ = రాముఁడా! మహతా=పూజ్యమయిన; సత్యేన = సత్యముచేత; నరేశ్వరం=మనుష్యులకుఁబ్రభువైనదశరథుని; తారయస్వ=తరింపఁ జేయుము.

రాముఁడా! నీవు దశరథమహారాజుమాటను సత్యముగాఁ జేసి, యితని నసత్యవాదునిఁ గాకుండునట్లు సేయుము. అని, తాత్పర్యము.

ఇతీవ తస్యాం పరుషం వదంత్యాం
న చైవ రామః ప్రవివేశ శోకం
ప్రవివ్యథే చాపి మహానుభావో
రాజా తు పుత్రవ్యసనాభితప్తః. ౪౨

టీక॥ ఇతి=ఇట్లు; ("ఇవ" అనునది వాక్యాలంకారార్థము); తస్యాం=ఆకైకేయి; పరుషం=కఠినముగా; వదంత్యాం=చెప్పుచుండఁగా; రామః=రాముఁడు; శోకం=దుఃఖమును; న చైవ ప్రవివేశ=పొందనేలేదు. మహానుభావః=అధికమయిన ప్రభావముగల; రాజా తు=దశరథమహారాజుమాత్రము; పుత్రవ్యసనాభితప్తః=పుత్రునివలని దుఃఖముచేత మిక్కిలి తపించినవాఁడై; ప్రవివ్యథే చ=మిక్కిలియు మనోవ్యసనమును బొందెను.

ఆకైకేయి యిట్లు పరుషవచనంబులఁ జెప్పగా, రామునకెంతమాత్రము దుఃఖంబుగలుగదయ్యె, మహానుభావుండయినను దశరథమహారాజుమాత్ర

ము, పుత్రదుఃఖంబునకుంగుందుచు, మిక్కిలియుమనోవ్యథంబొందెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, అష్టాదశస్సర్గః.
ఇది, సప్తాధికము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టాదశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకోనవింశసర్గప్రారంభః.

తదప్రియ మమిత్రఘ్నో వచనం మరణోపమమ్
శ్రుత్వా న వివ్యథే రామః కైకేయీం చేద మబ్రవీత్. ౧

టీక: అమిత్రఘ్నః = శత్రువులంజం పునట్టి; రామః = రాముండు; అప్రియం = అనిష్టంబును; మరణోపమం = చావుతోం బోల్కికగలిగియుండు; వచః = ఆవచనం = మాటను; శ్రుత్వా = విని; న వివ్యథే = దుఃఖపడలేదు. కైకేయీం = కైకేయినిగూర్చి; ఇదం = ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను,

శత్రువులంజంపునట్టి రాముండు, అప్రియంబును మరణంబువంటిదియునగు నామాటనువిని, యెంతమాత్రమయిన దుఃఖంబునొందక, కైకేయింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ మస్తు గమిష్యామి వనం వస్తు మహం త్వితః
జటాజినధరో రాజ్ఞః ప్రతిజ్ఞా మనుపాలయన్. ౨

టీక: ఏవం = ఈప్రకారము; అస్తు = అగుంగాక. అహంతు = నేనును; రా

జ్ఞః=దశరథమహారాజుయొక్క; ప్రతిజ్ఞాం=ప్రతినను; అనుపాలయన్=పాలించుచు;జటాజినధరః=జడలనుకృష్ణాజినమునుదాల్చువాఁడనై;వస్తుం=వాసముసేయుటకు;ఇతః=ఇటనుండి;వనం=అడవిని;గమిష్యామి=పొందెదను.

నీవుచెప్పినట్టు భరతుండు రాజగుఁగాక; నేనును, దశరథమహారాజు చేసిన ప్రతిజ్ఞ చొప్పున,నడవికిఁబోయి,జడలను కృష్ణాజినంబునుదాల్చి,వాసంబుచేసెదను.అని, తాత్పర్యము.

ఇదంతు జ్ఞాతు మిచ్ఛామి కిమర్థం మాం మహీపతిః
నాభినందతి దుర్ధర్షో యథాపుర మరిందమః. ౩

టీక॥దుర్ధర్షః=ఎదిరింపఁగూడనివాఁడును;అరిందమః=శత్రువులనడఁగఁద్రొక్కువాఁడునగు;మహీపతిః= భూమికిఁబ్రభువైనదశరథమహారాజు; కిమర్థం=ఎందుకొఱకు;మాం=నన్ను;యథాపురం = మునుపటివలె;నాభినందతి=బుజ్జగింపఁడు?ఇదంతు = దీనినిమాత్రము;జ్ఞాతుం=తెలిసికొనుటకు;ఇచ్ఛామి=కోరుచున్నాను.

శత్రువులకెదిరింపఁ గూడనివాఁడును శత్రువులనడంగం ద్రొక్కువాఁడునగుదశరథమహారాజు, మునుపటివలె, నన్నేల యుపలాలింపకున్నాఁడు? దీనిని మాత్రము తెలియఁగోరుచున్నాను.

అని, తాత్పర్యము.

మన్యుర్నచ త్వయా కార్యో దేవి బ్రూమి తవాగ్రతః
యాస్యామి భవ సుప్రీతా వనం చీరజటాధరః. ౪

టీక॥దేవి=కైకేయీ! త్వయా=నీచేత;మన్యుః=కోపము;నకార్యశ్చ=చేయఁదగినదియుఁగాదు.తవ = నీయొక్క;అగ్రతః = ముందట;చీరజటాధరః = వల్కలంబులనుజడలనుదాల్చినవాఁడనై;వనం=అడవిని;యాస్యామి=పొందెదను. ఇతి(అధ్యాహృతము)=అని;బ్రూమి(బ్రవీమి)= చెప్పుచున్నాను. సుప్రీతా=మిక్కిలియుసంతసించినదానవు;భవ=అగుము.

కైకేయీ! నీవునుగోపంబుసేయవలదు, నేను,నీయెదుటనే, నారచీరలును

...డలునుం దాల్చియడవికిఁ బోయెదను; ...గులసంతోషంబుగలిగియుందుము.

అని, తాత్పర్యము.

హితేన గురుణా పిత్రా కృతజ్ఞేన నృపేణచ
నియుజ్యమానో విస్రబ్ధః కిన్నకుర్యా మహం ప్రియమ్. ౫

టీక॥ అహం=నేను; హితేన=మేలు సేయువాఁడును; గురుణా=ఆచార్యుఁడును; పిత్రా=తండ్రియును; కృతజ్ఞేన=తనకుఁ జేయఁబడినయుపకారము కొంచెమయినను దాని నెచ్చుగా నెఱుంగువాఁడును; నృపేణచ=రాజునగు దశరథునిచేత; నియుజ్యమానః=ఆజ్ఞాపింపఁబడుచున్నవాఁడనై; విస్రబ్ధః=విశ్వాసముగలవాఁడనై; ప్రియం=సంతోషకరంబగుదాని; కిం=దేనిని; నకుర్యాం=చేయకుందును!

దశరథుండు, నాకుహితుండు, ఆచార్యులలో ముఖ్యుండు, తండ్రి, కొంచెము మంచిఁజేసినను దాని నధికనుగాఁదలంచిబహుమానించువాఁడు, మఱియు రాజు; అట్టిదశరథుండాజ్ఞాపింపఁగా, నేను విశ్వాసంబు గలిగి, నతనికిఁ బ్రియంబగుకార్యమును, దేనిఁజేయను? ఎద్దియైనం జేయుదును.

అని, తాత్పర్యము.

అలీకం మానసం త్వేకం హృదయం దహతీవ మే
స్వయం యన్నాహ మాం రాజా భరతస్యాభిషేచనమ్. ౬

టీక॥ రాజా=దశరథమహారాజు; స్వయం=తానే; మాం=నన్నుఁగూర్చి; భరతస్య=భరతునియొక్క; అభిషేచనం=పట్టాభిషేకమును; నాహయత్=చెప్పలేదనునది యేదిగలదో; తత్ (అధ్యాహృతము)=ఆ; ఏకం=ఒక; అలీకంతు=దుఃఖముమాత్రము; మానసం=మనసునందున్నదై; మే=నాయొక్క; హృదయం=మనసును; దహతీవ=కాల్చునట్లున్నది.

దశరథమహారాజు, భరతునకుఁ బట్టాభిషేకముసేయు వృత్తాంతమును, తానైనాతోఁ జెప్పలేదేయనునది ఒక దుఃఖముమాత్రము నామనస్సును, దహించునట్లు, బాధించుచున్నది.

అని, తాత్పర్యము.

అహం హి సీతాం రాజ్యంచ ప్రాణా నిష్టాన్ ధనానిచ
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయా ప్రచోదితః. ౭

టీక॥ అహం=నేను; అప్రచోదితః=ప్రేరేపింపఁబడనివాఁడనై ; స్వయం=నేనే; భ్రాత్రే= తమ్ముఁడగు; భరతాయ=భరతునికొఱకు; హృష్టః= సంతోషంబుగలవాఁడనై; సీతాం=సీతను; రాజ్యంచ=రాజ్యమును; ఇష్టాన్ = ప్రియంబులగు; ప్రాణాన్= ప్రాణంబులను; ధనానిచ=ధనంబులను ; దద్యాం హి=ఇత్తునుగదా!

నేను, ఎవ్వరును ప్రేరేపింపకున్నను, నేనే, నాతమ్ముఁడగుభరతునకు, నా భార్యయగు సీతనుగాని రాజ్యంబును గాని ప్రియంబులగు ప్రాణంబులనుగాని ధనంబులనుగాని, సంతోషంబున, నిత్తును. అని, తాత్పర్యము.

కిం పున ర్మనుజేంద్రేణ స్వయం పిత్రా ప్రచోదితః
తవచ ప్రియ కామార్థం ప్రతిజ్ఞా మనుపాలయన్. ౮

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; పిత్రా = తండ్రియగు; మనుజేంద్రేణ=మనుష్యులకుఁ బ్రభువైనదశరథుని చేత; స్వయం = తానేయై; ప్రచోదితః=ప్రేరేపింపఁబడినవాఁడయ్యు; తవ= నీయొక్క; ప్రియకామార్థంచ = సంతోషంబుకోరుటకొఱకును; ప్రతిజ్ఞాం= ప్రతినను; అనుపాలయన్= పాలించువాఁడనై ; రాజ్యం = (అధ్యాహృతము) = రాజ్యమును; దద్యామితి (అధ్యాహృతము)= ఇచ్చెదనని. కింపునః (వక్తవ్యం)=చెప్పనేల?

అట్టినేను, నాతండ్రియును రాజునగుదశరథుండు, తానై యాజ్ఞాపింపఁగా, నీకును సంతోషంబు గల్గునట్లుండఁగా, నేను "నీవుచెప్పినదిచేసెదను" అని ప్రతిజ్ఞచేసియుండఁగా, సత్యసమయంబున, భరతునకు రాజ్యంబునుమాత్రము, నిత్తునని చెప్పనేల? అని, తాత్పర్యము.

త దాశ్వాసయ హీమం త్వం కిన్విదం యన్మహీపతిః
వసుధాసక్తనయనో మంద మశ్రూణి ముంచతి. ౯

టీక॥ తత్—అందువలన , త్వం=నీవు ; ఇమం—ఈదశరథమహారాజును ; ఆశ్వాసయ=ఊరడించుము(“హి” అనునది పాదపూరణార్థము) ; మహీపతిః= భూమికిఁబ్రభువైనదశరథుఁడు ; వసుధాసక్తనయనః = భూమియందాసక్తములయినకండ్లుగలవాఁడై ; మందం=తిన్నగా; అశ్రూణి = కన్నీళ్లను; ముంచతియత్=విడుచుచున్నాఁడనునదియేదిగలదో ; తత్ = (అధ్యాహృతము)=ఆ ; ఇదం=ఇది; కిన్ను=ఏమికారణముగలది?

అందువలన , నీవీదశరథమహారాజునాశ్వాసింపుము;ఇతఁడు, నేలంజూచుచుఁదిన్నగాఁగన్నీళ్లువిడుచుచున్నాఁడే,ఇదియేమి? అని, తాత్పర్యము.

గచ్ఛంతు చైవానయితుం దూతా శ్శీఘ్రజవై ర్హయైః
భరతం మాతులకులా దద్యైవ నృపశాసనాత్. ౧౦

టీక॥ అద్యైవ=ఇప్పుడే ; నృపశాసనాత్=రాజాజ్ఞవలన; దూతాః = రాయబారులు; భరతం = భరతుని; మాతులకులాత్ = మేనమామయింటనుండి; ఆనయితుం (ఆనేతుం) చైవ= తోడ్కొనివచ్చుటకును; శీఘ్రజవైః = శీఘ్రమయినవేగముగల ; హయైః=గుఱ్ఱములచేత ; గచ్ఛంతు= పోవుదురుగాక.

ఇప్పుడు,రాజాజ్ఞవలన , దూతలు, వేగంబుగాఁబోవుగుఱ్ఱంబులనెక్కి,మాతులగృహంబునందుండి భరతుందోడ్కొని వచ్చుటకై, పోవలయును. అని, తాత్పర్యము.

దండకారణ్య మేషోహ మితో గచ్ఛామి సత్వరః
అవిచార్య పితు ర్వాక్యం సమా వస్తుం చతుర్దశ. ౧౧

టీక॥ ఏషః=ఈ; అహం=నేను; పితుః=తండ్రియొక్క; వాక్యం—మాటనుగూర్చి; అవిచార్య=ఆలోచింపక; చతుర్దశ—పదునాలుగు; సమాః=సంవత్సరములు; వస్తుం= వాసముసేయుటకు; ఇతః=ఇచ్చటనుండి; సత్వరః=వేగముగలవాఁడనై; దండకారణ్యం=దండకారణ్యమునుగూర్చి; గచ్ఛామి = పోవుచున్నాను.

నేను, తండ్రియాజ్ఞ నవలంబించి,

యుక్తాయుక్తంబులువిచారింపక, పదు నాలుగు సంవత్సరంబులు వాసంబుసే యుటకై, శీఘ్రముగా,దండకారణ్యము నకుఁ,బోయెదనుఅని, రాముండుకై కేయితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

సా హృష్టా తస్య త ద్వాక్యం శ్రుత్వా రామస్య కైకయీ
ప్రస్థానం శ్రద్దధానా హి త్వరయామాస రాఘవమ్. ౧౨

టీక॥సా=ఆ;కై కేయీ=కైకయి;త స్య=ఆ;రామస్య=రామునియొక్క;త త్=ఆ;వాక్యం=మాటను;శ్రుత్వా=వి ని;హృష్టా=సంతసించినదై;ప్రస్థానం= పయనమునుగూర్చి;శ్రద్దధానా=శ్రద్ధగ లదై;రాఘవం=రాముని;త్వరయామా సహి=వేగిరపఱచెనుగదా!

ఆకై కేయి, రాముని మాటనువిని, సంతోషంబునొంది,రాముండుపయనం బగుటయందుశ్రద్ధగలదై, శీఘ్రంబుగాఁ బయనంబగుటకై, రాముని వేగిరపఱచె ను. అని, తాత్పర్యము.

ఏవం భవతు యాస్యంతి దూతా శ్శీఘ్రజవై ర్హయైః
భరతం మాతులకులా దుపావర్తయితుం నరాః. ౧౩

టీక॥ఏవం = ఈప్రకారము;భవ తు=అగుఁగాక. దూతాః=రాయబా రులగు;నరాః=పురుషులు; భరతం=భ రతుని;మాతులకులాత్ = మేనమామ యింటనుండి;ఉపావర్తయితుం= తో డ్కొనివచ్చుటకు; శీఘ్రజవైః=శీఘ్ర మయినవేగముగల;హయైః=గుఱ్ఱముల చేత;యాస్యంతి=పోవుదురు.

నీవుచెప్పినట్లగుఁగాక; రాయబారు లగువారు, మాతులగృహంబునుండి భరతుం గొనివచ్చుటకై, వేగంబుగాఁ బోవుగుఱ్ఱంబులనెక్కి,పోవుదురు. అని, తాత్పర్యము.

తవ త్వహం క్షమం మన్యే నోత్సుకస్య విలంబనమ్

టీక॥అహం=నేను;ఉత్సుకస్య=పో వుటయందుత్సాహముగల; తవతు=నీ కుమాత్రము; విలంబనం=[illegible] టను;క్షమం = యుక్తము[illegible]

స్యే=తలంపను.

నీవువనంబునకుఁ బోవుట కుత్సాహంబుగల్గియున్నావు, కావున,నీవుజాగుసేయుటయుక్తముకాదనినాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

రామ తస్మా దిత శ్శీఘ్రం వనం త్వం గంతు మర్హసి. ౧౪

టీక॥ రామ=రాముఁడా! తస్మాత్ = అందువలన; త్వం=నీవు; శీఘ్రం=శీఘ్రముగా; ఇతః=ఇచ్చటనుండి; వనం=అడవినిగూర్చి; గంతుం=పోవుటకు; అర్హసి=తగుదువు.

రాముఁడా! అందువలన, నీవిచ్చటనుండిజాగుసేయక శీఘ్రంబుగానడవికిఁబోవలయును. అని, తాత్పర్యము.

వ్రీడాన్విత స్స్వయం యచ్చ నృప స్త్వాం నాభిభాషతే
నైత త్కించి న్నరశ్రేష్ఠ మన్యు రేషోఽపనీయతామ్. ౧౫

టీక॥ నరశ్రేష్ఠ=పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! నృపః=దశరథమహారాజు; వ్రీడాన్వితః = సిగ్గుతోఁగూడినవాఁడై; స్వయం=తానై; త్వాం = నిన్నుఁగూర్చి; నాభిభాషతేయత్ = మాటలాడ లేదనునదియేదిగలదో; తత్ (అధ్యాహృతము)=అ; ఏతచ్చ=ఇదియును; న కించిత్ =ఏమియుఁగాదు. ఏషః=ఈ; మన్యుః=దైన్యము; అపనీయతాం=పోఁగొట్టఁబడుఁగాక.

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! దశరథమహారాజు "రాముండునామాట సత్యముసేయునోసేయఁడో" అనిసిగ్గుపడియుండుటంజేసి, నీతోనేమియుమాటలాడకున్నాఁడేకాని వేఱుగాదు; నీవు, వనంబునకుంబోయి, యీసిగ్గునుంబోవునట్లుసేయుము. అని, తాత్పర్యము.

యావ త్త్వం న వనం యాతః పురా దస్మా దభిత్వరన్
పితా తావ న్నతే రామ స్స్నాస్యతే భోక్ష్యతే పివా. ౧౬

టీక॥ రామ=రాముఁడా! త్వం=నీ ... యావత్ = ఎంతవఱకు; అస్మాత్ = ఈ; పురాత్ = పట్టణమునుండి; అభిత్వరన్ = వేగిరపడుచు వనం=అడవినిగూ...




ర్పి; నయాతః=పోకున్నావో; తావత్= అంతవఱకు; తే= నీయొక్క; పితా=తండ్రి; నస్నాస్యతే=స్నానముచేయఁడు; (న)భోక్ష్యతేపివా= భోజనమునుంజేయఁడు.

రాముఁడా! నీవెంతవఱకుశీఘ్రంబుగావనంబునకుంబోవక యీపట్టణంబునందుండెదవో, అంతవఱకు, నీతండ్రిదశరథుండు, స్నానమునుగాని భోజనమునుగాని చేయఁడు. అని, కైకేయి, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ధిక్కష్ట మితి నిశ్శ్వస్య రాజా శోకపరిప్లుతః
మూర్ఛితో న్యపతత్తస్మిన్ పర్యంకే హేమభూషితే. ౧౭

టీక॥ రాజా=దశరథమహారాజు; "ధిక్=దహింపఁబడుదునుగాక! కష్టం= ఓర్వఁగూడనిది!" ఇతి=అని; నిశ్శ్వస్య= నిట్టూర్పువిడిచి; శోకపరిప్లుతః= దుఃఖముచేవ్యాపింపఁబడినవాఁడై; మూర్ఛితః=మూర్ఛనుబొందినవాఁడై; హేమభూషితే= బంగారముచే నలంకరింపఁబడిన; తస్మిన్=ఆ ? పర్యంకే=పాన్పునందు; న్యపతత్=పడెను.

దశరథమహారాజు, కైకేయిచెప్పినభయంకరవాక్యంబువిని "నేనుదహింపఁబడుదును గాక! ఎంతకష్టము!" అని, చెప్పి, దుఃఖంబున మూర్ఛనొంది, బంగారముచే నలంకరింపఁబడియుండునా శయనంబుపైఁబడెను.

అని, తాత్పర్యము.

రామో ప్యుత్థాప్య రాజానం కైకేయ్యాభిప్రచోదితః
కశయేవాహతో వాజీ వనం గంతుం కృతత్వరః. ౧౮

టీక॥ కైకేయ్యా=కైకేయిచేత; అభిప్రచోదితః=ప్రేరేపింపఁబడిన; రామోపి=రాముఁడును; రాజానం= దశరథమహారాజును; ఉత్థాప్య=ఎత్తి; వనం= అడవినిగూర్చి; గంతుం=పోవుటకు; కశయా=చబుకుచేత; ఆహతః= కొట్టఁబడిన; వాజీవ=గుఱ్ఱముబోలె; కృతత్వరః = చేయఁబడినవేగిరపాటుగలవాఁడు; బభూవ (అధ్యాహృతము)= ఆయెను.

రాముండును, అట్లుమూర్ఛిల్లినదశరథునెత్తిపట్టి, కైకేయియట్లువేగిర పా




చినదికావున, జబుకునంగొట్టబడినగు ఱ్ఱంబుంబోలె, నప్పుడె యతివేగంబున వనంబునకుంబోవ నిశ్చయించెను.

అని, తాత్పర్యము.

తదప్రియ మనార్యాయా వచనం దారుణోదయమ్
శ్రుత్వా గతవ్యథో రామః కైకేయీం వాక్య మబ్రవీత్. ౧౯

టీ॥ రామః = రాముఁడు; అనార్యాయాః, దుష్టురాలయిన కైకేయియొక్క; అప్రియం = కీడుగల్గించునదియును; దారుణోదయం = భయంకరంబయినఫలంబుగలదియునగు; తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; గతవ్యథః = పోయినదుఃఖము గలవాఁడై; కైకేయీం = కైకేయినిగూర్చి; వాక్యం = మాటను; అబ్రవీత్ = పలికెను.

రాముఁడు, తనకుఁ జెఱుపుదెచ్చుటకై, తన్ను గ్యాంబునకుఁ బొమ్మని చెప్పినదుష్టురాలగు కైకేయి మాటనువిని, యెంతమాత్రము దుఃఖమునొందక, కైకేయితో నిట్లని చెప్పెను అని, తాత్పర్యము.

నాహ మర్థపరో దేవి లోక మావస్తు ముత్సహే

టీక॥ దేవి = కైకేయీ! అహం = నేను; అర్థపరః = ధనమునందాసక్తిగలవాఁడను; న = కాను; లోకం = జనమును; ఆవస్తుం = అధిష్ఠించియుండుటకు; (న) ఉత్సహే = కోరను.

కైకేయీ! నాకుధనమునందాసక్తి లేదు; జనులననుసరించియుండవలయునని కోర్కెయు లేదు. అని, తాత్పర్యము.

విద్ధి మా మృషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్. ౨౦

టీక॥ మాం = నన్ను; ఋషిభిః = ఋషులతో; తుల్యం = సమానునిగాను; ధర్మం కేవలం = ధర్మమునుమాత్రము; ఆస్థితం = అవలంబించియున్నవానినిగాను; విద్ధి = ఎఱుంగుము.

నేను, ఋషివంటివాఁడను, ధర్మమునుమాత్రమే యవలంబించి యున్నవాఁడను, ఇంకనేదియునాకిష్టముగాదు, అని, యెఱుంగుము.

అని, తాత్పర్యము.

యదత్రభవతః కించిచ్ఛక్యం కర్తుం ప్రియం మయా
ప్రాణానపి పరిత్యజ్య సర్వథా కృతమేవ తత్. ౨౧

టీక॥ అత్రభవతః = పూజ్యుఁడైన దశరథునకు; ప్రియం = ఇష్టమగునది; కించిత్ = ఏదైనను; యత్ = ఏది; మయా = నాచేత; ప్రాణాన్ = ప్రాణములను; పరిత్యజ్యాపి = విడిచియైనను; కర్తుం = చేయుటకు; శక్యం = కూడినది; తత్ = అట్టికార్యము; సర్వథా = అన్నివిధములను; కృతమేవ = చేయఁబడినదే; ఇతివిధి (అధ్యాహృతము) = అని యెఱుంగుము.

పూజ్యుండగు దశరథుండు చెప్పకార్యమేదైనను, అది, నాచేఁ, బ్రాణంబులు విడిచియైనను జేయఁగూడిన దగునేని, అట్టికార్యము, సిద్ధముగాఁ జేయఁబడినదే, యని యెఱుంగుము.

అని, తాత్పర్యము.

న హ్యతో ధర్మచరణం కించిదస్తి మహత్తరమ్
యథా పితరి శుశ్రూషా తస్య వా వచనక్రియా. ౨౨

టీక॥ పితరి = తండ్రియందు; శుశ్రూషా = సేవగాని; తస్య = అతనియొక్క; వచనక్రియా వా = మాటచేయుట గాని; యథా = ఎట్లో; అతః = దీనికన్నను; మహత్తరం = అధికమయిన; ధర్మచరణం = ధర్మమునాచరించుట; కించిత్ = ఒకానొకటియు; నాస్తిహి = లేదుగదా!

"తండ్రికిఁ గాళ్లొత్తుకుట మొదలగు సేవలుచేయుట, యతఁడు చెప్పినపనిని జేయుట" దీనికన్నను, అధికమయినధర్మమేదియు లేదు.

అని, తాత్పర్యము.

అనుక్తోప్యత్రభవతా భవత్యా వచనాదహమ్
వనే వత్స్యామి విజనే వర్షాణీహ చతుర్దశ. ౨౩

టీక॥ అహం = నేను; అత్రభవతా = పూజ్యుండగు దశరథునిచేత; అనుక్తోపి = చెప్పఁబడనివాఁడనైనను; భవత్యాః = నీయొక్క; వచనాత్ =

టవలన; ఇహ=ఇప్పుడు; విజనే= జనములేని; వనే=అరణ్యంబునందు ; చతుర్దశ=పదునాలుగు; వర్షాణి=సంవత్సరంబులను; వత్స్యామి= ఉండెదను.

పూజ్యుండగు నీదశరథుండు తానై "అరణ్యంబునకుం బొమ్ము" అని నాకుం జెప్పకున్నను, నీవు చెప్పినావు కావున, నేనిప్పుడె విజనంబగు నరణ్యంబునకుం బోయి, పదునాలుగుసంవత్సరంబులువాసంబు చేసెదను.

అని, తాత్పర్యము.

న నూనం మయి కైకేయి కించి దాశంససే గుణమ్
య ద్రాజాన మవోచ స్త్వం మమేశ్వరతరా సతీ. ౨౪

టీక॥ కైకేయి=కైకేయీ; త్వం=నీవు; మమ=నాకు; ఈశ్వరతరా సతీ=మిక్కిలియు ప్రభువైన దానవగుచు; యత్=ఏకారణమువలన; రాజానం=దశరథమహారాజునుగూర్చి ; అవోచః = చెప్పితివో; తత్ = (అధ్యాహృతము)=ఆకారణమువలన ; నూనం=నిశ్చయముగా ; మయి=నాయందు; గుణం=గుణమును; కించిత్=కొంచెమైనను; నాశంససే=విచారింపవైతివి.

కైకేయి! నీవొకరికన్న నెచ్చుగా నన్నాజ్ఞాపింపఁజాలినదానవై నీమాటనే నేనవశ్యము వినవలసినవాఁడనై నీవు చెప్పినట్లు సేయుటకు సిద్ధుఁడనై యుండఁగా, నీవు "భరతుండు పట్టాభిషిక్తుండు కావలెను, నీవరణ్యంబునకుఁ బోవలెను" అని నాతోఁ జెప్పక, దశరథమహారాజును, వరరూపంబుగా యాచించితివే; కావున, నీవు నా స్వభావంబును గొంచెమైనను విచారింపలేదు.

అని, తాత్పర్యము.

యావ న్మాతర మా పృచ్ఛే సీతాం చా నునయా మ్యహమ్
తతో ద్యైవ గమిష్యామి దండకానాం మహ ద్వనమ్. ౨౫

టీక॥ అహం=నేను; యావత్=ఎంతలోపల; మాతరం=తల్లిని; ఆపృచ్ఛే=వీడుకొనుదునో; సీతాంచ=సీతను; అనునయామి=ఊఱడింపుదునో; తతః=అటుపిమ్మట; అద్యైవ=ఈదినముననే; దండకానాం= దండకదేశముయొక్క;

పరమధార్మికంబగు రామునిమాటను విని, దుఃఖంబినుమడియగుటంజేసి, కన్నీళ్ల నడంచు కొనంజాలక, గొప్పధ్వనిగా, నేడ్చెను. అని, తాత్పర్యము.

వందిత్వా చరణౌ రామో విసంజ్ఞస్య పితుస్తథా
కైకేయ్యాశ్చాప్యనార్యాయా నిష్పపాత మహాద్యుతిః. ౨౮

టీక॥ రామః = రాముఁడు; విసంజ్ఞస్య= తెలివిదప్పిన; పితుః = తండ్రియొక్కయు; తథా = అట్లు; అనార్యాయాః = దుష్టురాలగు; కైకేయ్యాశ్చాపి= కైకేయియొక్కయు; చరణౌ = పాదములను; వందిత్వా=నమస్కరించి ; మహాద్యుతిః=అధికమయిన కాంతిగలవాఁడై; నిష్పపాత=వెడలెను.

రాముం, డట్లుమూర్ఛఁబొంది తెలివితప్పియుండుదండ్రికిని, దుష్టురాలగు కైకేయికిసినమస్కరించి, అట్టి కష్టంబు సందును నెంతమాత్రముదుఃఖంబునొందక "పితృవాక్య పరిపాలనంబునం గల్గుధర్మఫలంబబ్బినదిగదా!" అని, సంతోషంబుననినుమడించినకాంతితో, నిల్లువెడలెను. అని, తాత్పర్యము.

స రామః పితరం కృత్వా కైకేయీంచ ప్రదక్షిణమ్
నిష్క్రమ్యాంతః పురాత్తస్మాత్స్వం దదర్శ సుహృజ్జనమ్. ౨౯

టీక॥ సః=ఆ; రామః=రాముఁడు ; పితరం = తండ్రినిగూర్చియు ; కైకేయీంచ=కైకేయినిగూర్చియు; ప్రదక్షిణం= ప్రదక్షిణమును ; కృత్వా=చేసి; తస్మాత్=ఆ; అంతఃపురాత్ =అంతఃపురమునందుండి; నిష్క్రమ్య= వెడలి; స్వం=తనదైన; సుహృజ్జనం=స్నేహితజనమును; దదర్శ=చూచెను.

ఆరాముఁడట్లు తండ్రికిని గైకేయికిని బ్రదక్షిణంబుఁజేసి, యాయంతఃపురంబు వెడలి, తనస్నేహితులం,జూచెను. అని, తాత్పర్యము.

తం బాష్పపరిపూర్ణాక్షః పృష్ఠతో నుజగామహ
లక్ష్మణః పరమక్రుద్ధ స్సుమిత్రానంద వర్ధనః. ౩౦

టీక॥ సుమిత్రానందవర్ధనః = సుమిత్ర సంతోషమును వృద్ధిఁబొందించు న

ట్టి; లక్ష్మణః=లక్ష్మణుఁడు ; బాష్పపరిపూర్ణాక్షః=కన్నీళ్లచేనిండినకండ్లుగలవాఁడై; పరమక్రుద్ధః= మిక్కిలియుఁ గోపంబునొందినవాఁడై; తం = ఆరామునిః; పృష్ఠతః = వెనుకనుండి; అనుజగామ=వెంబడించెను "హ" అనునది పాదపూరణార్థము.

సుమిత్రకొడుకైనలక్ష్మణుండు , కన్నీళ్లనిండియుండుకండ్లతోఁ, బరమకోపంబునొంది, యారాముని వెనుకం బోయెను. అని, తాత్పర్యము.

అభిషేచనికం భాండం కృత్వా రామః ప్రదక్షిణమ్
శనై ర్జగామ సాపేక్షో దృష్టిం తత్రా విచారయన్. ౩౧

టీక॥ రామః=రాముఁడు ; అభిషేచనికం= అభిషేకముకొఱకైన; భాండం= ఉపకరణమునుగూర్చి ; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా=చేసి ; తత్ర=దానియందు;దృష్టిం=చూపును; అవిచారయన్=పఱపనివాఁడై;సాపేక్షః=దశరథాజ్ఞయందపేక్షతోఁ గూడినవాఁడై;శనైః=మెల్లఁగా; జగామ=పోయెను.

మంగళపదార్థములు మొదలగు వానికిఁ బ్రదక్షిణముసేయుచుఁ బోవలయునని శాస్త్రమునందు విధింపఁబడుటంజేసి, రాముఁడట్టటనుండియుండు నభిషేకపాత్రికిఁ బ్రదక్షిణముమాత్రముచేసి, దానివంకఁ జూడఁబోక, దశరథాజ్ఞ నన్యముకావలెనని ప్రార్థించుచు, మెల్లఁగాఁ బోయెను.
అని, తాత్పర్యము.

న చాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోఽపకర్షతి
లోకకాంతస్య కాంతత్వా చ్ఛీతరశ్మే రివ క్షపా. ౩౨

టీక॥ కాంతత్వాత్=కాంతిగలుగుటవలన; లోకకాంతస్య=లోకంబుయొక్క-మనోహరుండైన; అస్య = ఈరామునియొక్క; మహతీం= అధికమయిన; లక్ష్మీం=ముఖకాంతిని; రాజ్యనాశః=రాజ్యంబుపోవుటయును; క్షపా=రాత్రి;శీతరశ్మేః=చంద్రునియొక్క ; లక్ష్మీం(అధ్యాహృతము) ఇవ= కాంతినింబోలె; నాపకర్షతి=తగ్గనట్లు చేయదయ్యె.

లోకంబునకంతయుసంతోషంబు గ్లించునట్టి యీ రామునిముఖకాంతి,అధికకాంతిగల్గుటంజేసి, రాజ్యంబుపోయినను, రాత్రియందుఁ జంద్రునికాంతితగ్గకుండునట్లు, ఎంతమాత్రమును దగ్గదయ్యె. అని తాత్పర్యము.

స వనం గంతుకామస్య త్యజతశ్చ వసుంధరామ్
సర్వలోకాతిగస్యేవ లక్ష్యతే చిత్త విక్రియా. ౩౩

టీక॥వనం = అడవిని;గంతుకామస్య = పొందఁగోరువాఁడును;వసుంధరాం=భూమిని; త్యజతశ్చ=విడుచుచున్నవాఁడునగు,రామునకు; సర్వలోకాతిగస్యేవ=సమస్తలోకంబులనతిక్రమించియుండు పరమయోగికివలె;చిత్తవిక్రియా=మనోవికారము;నలక్ష్యతే=చూడఁబడదు.

అట్లు రాజ్యంబును విడిచి యడవికిఁ బోనిశ్చయించియుండు నా రామునిమనస్సుసమస్తలోకంబులవిడిచియుండుపరమయోగీంద్రుని మనస్సుంబోలె, నెంతమాత్రమువికారమునొందకుండినది.

అని, తాత్పర్యము.

ప్రతిషిధ్య శుభం ఛత్రం వ్యజనేచ స్వలంకృతే
విసర్జయిత్వా స్వజనం రథం పౌరాం స్తథా జనాన్. ౩౪
ధారయ న్మనసా దుఃఖ మింద్రియాణి నిగృహ్యచ
ప్రవివే శాత్మవా న్వేశ్మ మాతు రప్రియశంసివాన్. ౩౫

టీక। ఆత్మవాన్= అధికమయినధైర్యముగల, రాముఁడు; శుభం=మంగళకరమయిన;ఛత్రం=గొడుగును; స్వలంకృతే=చక్కఁగా నలంకరింపఁబడిన;వ్యజనే=చామరములను; ప్రతిషిధ్య=నిషేధించి;స్వజనం = తనస్నేహితులను;రథం=రథమును;తథా = అట్లు; పౌరాన్=పట్టణంబుననుండు; జనాన్=జనులను;విసర్జయిత్వా(విసృజ్య)=విడిచి;మనసా=మనసుచేత;దుఃఖం=దుఃఖమును;ధారయన్= అడంచుకొనుచు; ఇంద్రియాణి = ఇంద్రియంబులను;నిగృహ్యచ = నిగ్రహించుకొనియు ; మాతుః=తల్లియొక్క; వేశ్మ=గృహమును; అప్రియశంసివాన్ = అనిష్టవార్తఁజెప్పువాఁడై;ప్రవివేశ=చొచ్చెను.

ధీరుండగు నా రాముండు, మంగళకరంబగు ఛత్రంబును జక్కఁగా నలంకరింపఁబడిన చామరంబులను వదలి, స్నేహితులను రథమును బట్టణవాసిజనులను విడిచి, ధీరోదాత్తుండు కావున మనంబున దుఃఖంబు నడంచుకొని, యింద్రియంబుల నిగ్రహించుకొని, తల్లికిఁ యప్రియవార్తం జెప్పుటకై, తల్లి యింటికిం బోయెను. అని, తాత్పర్యము.

సర్వో హ్యభిజన శ్శ్రీమాన్ శ్రీమత స్సత్యవాదినః
నాలక్షయత రామస్య కించి దాకార మాననే. ౩౬

టీక॥ శ్రీమాన్=అధికమయిన కాంతిగల; అభిజనః=రాముని చుట్టునుండు జనము; సర్వః=అంతయు; శ్రీమతః=అధికమయిన కాంతిగలవాఁడును; సత్యవాదినః=సత్యమునె చెప్పువాఁడునగు; రామస్య=రామునియొక్క; ఆననే=ముఖమునందు; ఆకారం=వికారమును; కించిత్=కొంచెమయినను; నాలక్షయత=చూడలేదు.

రామునకుఁ బట్టాభిషేకంబు జరుగునని యలంకరించుకొని రామునిం జుట్టుకొనియుండు జనులను, శ్రీమంతుండును సత్యవాదియు నగు రాముని మొగంబున, నెంతమాత్రమును వికారం బగపడలేదు. అని, తాత్పర్యము.

ఉచితంచ మహాబాహు ర్నజహౌ హర్ష మాత్మనః
శారద స్సముదీర్ణాంశు శ్చంద్ర స్తేజ ఇవాత్మజమ్. ౩౭

టీక॥ మహాబాహుః=పెద్దచేతులుగల రాముండు; ఆత్మనః=తనయొక్క; ఉచితం=యోగ్యమయిన, స్వాభావికమయిన యనుట; హర్షం=సంతోషమును; శారదః=శరదృతువునందుఁ గలవాఁడును; సముదీర్ణాంశుః=అధికమయిన కిరణములు గలవాఁడునగు; చంద్రః=చంద్రుఁడు; ఆత్మజం=తనయందుఁ బుట్టిన; తేజఇవ=కాంతినింబోలె; నజహౌ=విడువలేదు.

శరదృతువునందధిక కాంతితోఁ గూడియుండు చంద్రుండు తన కాంతిని విడవకుండునట్లు, మహాబాహుండగు రాముండు, స్వాభావికంబగు తన సంతో

మంబు, నెంతమాత్రమునువిడవఁడయ్యె. అని, తాత్పర్యము.

వాచా మధురయా రామ స్సర్వం సమ్మానయన్ జనమ్
భ్రాతుస్సమీపం ధీరాత్మా ప్రవివేశ మహాయశాః. ౩౮

టీక॥ ధీరాత్మా=ధైర్యముతోఁగూడిన మనసుగలవాఁడును; మహాయశాః= అధికమయినకీర్తిగలవాఁడునగు; రామః=రాముఁడు;మధురయా=మనోహరంబయిన;వాచా = మాటచేత; సర్వం=సమస్తమయిన;జనం=జనమును; సమ్మానయన్ = గౌరవించుచు;భ్రాతుః=తమ్ముఁడగులక్ష్మణునియొక్క; సమీపం=సమీపమును; ప్రవివేశ=పొందెను.

మహాయశుండగు రాముఁడు, దుఃఖంబుచేఁ బోబడని మనసుగలవాఁడుగావునఁ, దానెంతమాత్రమును దుఃఖింపక, జనులనందఱ మధురవాక్యంబులఁ గౌరవించుచుఁ, దనతమ్ముఁడగులక్ష్మణునినికటఁజేరెను. అని, తాత్పర్యము.

తం గుణై స్సమతాం ప్రాప్తో భ్రాతా విపులవిక్రమః
సౌమిత్రి రనువవ్రాజ ధారయన్ దుఃఖమాత్మజమ్. ౩౯

టీక॥ గుణైః = గుణములచేత; సమతాం=సామ్యముగుటను; ప్రాప్తః=పొందినవాఁడును; విపులవిక్రమః=అధికమయినపరాక్రమముగలవాఁడును; భ్రాతా=తమ్ముఁడునగు; సౌమిత్రిః=సుమిత్రకొడుకైనలక్ష్మణుండు; ఆత్మజం= మనసునంబుట్టిన; దుఃఖం=దుఃఖమును; ధారయన్= అడంచుకొనుచు; తం=ఆరామునిని; అనువవ్రాజ=వెంబడించెను.

సౌజన్యాదిగుణంబులరామునకుసరియయి మహాపరాక్రమశాలియయి యుండు రామునితమ్ముండు లక్ష్మణుండు, మనంబునదుఃఖంబు నడంచుకొని రాముని వెంబడించిపోయెను. అని, తాత్పర్యము.

ప్రవిశ్య వేశ్మాతిభృశం ముదాన్వితమ్
సమీక్ష్య తాం చార్థవిపత్తి మాగతామ్

స చైవ రామో త్ర జగామ విక్రియామ్
సుహృజ్జనస్యాత్మవిపత్తిశంకయా. ౪౦

టీక॥ రామః = రాముఁడు; అతిభృశం = మిక్కిలియును; ముదా = సంతోషముతో; అన్వితం = కూడియున్న, మిగుల సంతోషముతోఁగూడియుండు జనులు గలయనుట; వేశ్మ = గృహమును; ప్రవిశ్య = చొచ్చి; ఆగతాం = వచ్చిన; ఆత్మవిపత్తిం = కార్యనాశమును; సమీక్ష్య చ = చూచియు; సుహృజ్జనస్య = స్నేహితజనమునకు; ఆత్మవిపత్తిశంకయా = ప్రాణనాశమువలనిభయంబుచేత; అత్ర = ఇచ్చట, కౌసల్యాగృహమందనుట; విక్రియాం = వికారమును; న చైవ జగామ = పొందనే లేదు.

రాముండు, తనకుఁబట్టాభిషేకంబుగలుగునని మిగులసంతోషంబుతోనున్న జనులుగలిగియుండు గృహంబుం జొచ్చి, యిప్పుడుతనకు వాటిల్లిన రాజ్యభ్రంశంబును వనవాసంబునుం దలంచుకొని, యుపమపశ్యముదుఃఖంబుగలిగించుసందర్భంబయ్యును, దానుదుఃఖించినచోఁ దనస్నేహితులు ప్రాణంబులు విడుతురనుభయంబున దుఃఖంబు నంతయుమనంబుననె యణంచుకొని యెంతమాత్రమును బైటికగపడకుండునట్లు, వికారంబుఁజెందకుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, ఏకోనవింశస్సర్గః.
ఇది, సర్గార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకోనవింశసర్గటీక, ముగిసినది.

శ్రీ

వింశసర్గప్రారంభః.

తస్మింస్తు పురుషవ్యాఘ్రే నిష్క్రామతి కృతాంజలౌ
ఆర్తశబ్దో మహాన్ జజ్ఞే స్త్రీణా మంతఃపురే తదా. ౧

టీక॥ పురుషవ్యాఘ్రే=పురుషశ్రేష్ఠుండగు; తస్మిన్=ఆరాముఁడు; కృతాంజలౌ=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; నిష్క్రామతితు = బయలువెడలఁగానే; తథా=అప్పుడు; అంతఃపురే=అంతఃపురమందు; స్త్రీణాం = స్త్రీలయొక్క; మహాన్=గొప్పదైన; ఆర్తశబ్దః=దుఃఖముతోఁగూడినధ్వని; జజ్ఞే=కలిగినది.

పురుషశ్రేష్ఠుండగు రాముండు, కైకేయీ దశరథులకు నమస్కరించి, చేతులు మొగుడ్చుకొని , బయలువెడలఁగానే, యంతఃపురమునందలి స్త్రీలు, గట్టిగా నేడ్వనారంభించిరి.

అని, తాత్పర్యము.

కృత్యేష్వ చోదితః పిత్రా సర్వ స్యాంతఃపురస్యచ
గతి ర్య శ్శరణం చాపి స రామోద్య ప్రవత్స్యతి. ౨

టీక॥ యః=ఎవఁడు; పిత్రా= తండ్రియగు దశరథునిచేత ; అచోదితః=ప్రేరేపింపఁబడనివాఁడై; సర్వస్య= సమస్తమయిన ; అంతఃపురస్యచ=అంతఃపురజనమునకును; కృత్యేషు = చేయవలసిన కార్యములయందు; గతిః= గతియును; శరణంచాపి=రక్షించువాఁడునో; సః=ఆరాముఁడు; అద్య = ఇప్పుడు; ప్రవత్స్యతి=ఊరువిడిచిపోవును.

ఎవఁడు, తండ్రిచెప్పకున్నను, అంతఃపురస్త్రీలమగుమాకందఱకును గావలసినకార్యములంజేసి , మమ్ములనందఱు నుంగాపాడుచుండునో, అట్టిరాముం డిప్పుడూరువిడిచియరణ్యంబునవసింపఁబోవుచున్నాఁడు. అని, తాత్పర్యము.

కౌసల్యాయాం యథా యుక్తో జనన్యాం వర్తతే సదా

తథైవ వర్తతే స్మాసు జన్మప్రభృతి రాఘవః. ౩

టీక॥ రాఘవః= రాముఁడు ; యథా = ఎట్లు; జనన్యాం = తల్లియగు; కౌసల్యాం=కౌసల్యయందు; సదా=ఎల్లప్పుడును;యుక్తః= ఆసక్తుఁడై; వర్తతే=ఉండునో; తథైవ= అలాగే; అస్మాసు=మాయందును; జన్మప్రభృతి=పుట్టుక మొదలు ; వర్తతే= ఉన్నాఁడు.

రాముఁడు తల్లియగు కౌసల్యకెట్లు శుశ్రూషలు సేయుచుండునో, అలాగే, పుట్టినది మొదలు మాకును శుశ్రూషలు సేయుచుండును. అని, తాత్పర్యము.

స క్రుధ్యత్యభిశస్తోపి క్రోధనీయాని వర్జయన్
క్రుద్ధాన్ ప్రసాదయన్ సర్వాన్ స ఇతోఽద్య ప్రవత్స్యతి. ౪

టీక॥ యః (అధ్యాహృతము)= ఏ రాముఁడు; అభిశస్తోపి=నిందింపఁబడినవాఁడైనను;న క్రుధ్యతి= కోపమునొందఁడో; క్రోధనీయాని= కోపము కలిగించువానిని; వర్జయన్=విడుచుచు; క్రుద్ధాన్=కోపించినవారలను; సర్వాన్= అందఱను; ప్రసాదయన్= ప్రసన్నులఁజేయుచు ; వర్తతే (అధ్యాహృతము)=ఉండునో; సః=అట్టి రాముఁడు; అద్య=ఇప్పుడు; ఇతః=ఇచ్చటనుండి; ప్రవత్స్యతి=ఊరువిడిచిపోవును.

ఎవ్వఁడు, తన్నెంతనిందించినను, ఎంతమాత్రము కోపంబునొందఁడో, మఱియుఁ గోపంబుఁగల్గించుకార్యంబుల విడుచుచుఁ, గోపంబునొందియుండు వారి కోపంబును మంచిమాటలచేఁ బోఁగొట్టుచుండునో, అట్టి రాముఁడిప్పుడు, పట్టణంబువిడిచి యరణ్యంబునకుఁ బోవుచున్నాఁడే! ఏమిసేయవచ్చును! అని, తాత్పర్యము.

అబుద్ధిర్బత నో రాజా జీవలోకం చరత్యయమ్
యో గతిం సర్వభూతానాం పరిత్యజతి రాఘవమ్. ౫

టీక॥ యః = ఏ దశరథమహారాజు; సర్వభూతానాం=సమస్తప్రాణులకును; గతిం=ప్రాప్యస్థానమయిన; రాఘవం=రామునిఁ; పరిత్యజతి = విడుచుచు

న్నాఁడో; సః (అధ్యాహృతము)= అట్టి; నః=మాయొక్క; రాజా=దశరథ మహారాజు; అబుద్ధిః= తెలివిలేనివాఁడై; జీవలోకం=ప్రాణివర్గమును; చరతి=భక్షించుచున్నాఁడు, నశింపఁజేయుచున్నాఁడనుట. బత=అయ్యో!

మాదశరథమహారాజు, దుర్బుద్ధియగుటంజేసి, సమస్తప్రాణులకును రక్షకుండగు రామునరణ్యంబున కంపి, ప్రాణిసమూహంబునకంతయు నాశంబుగలుగఁ జేయుచున్నాఁడు. అనియంతఃపురస్త్రీలందఱేడ్చిరి.

అని, తాత్పర్యము.

ఇతి సర్వా మహిష్య స్తా వివత్సా ఇవ ధేనవః
పతి మాచుక్రుశు శ్చైవ సస్వరంచాపి చుక్రుశుః. ౮

టీక॥ ఇతి = ఈప్రకారముగా; తాః=ఆ; మహిష్యః=రాజభార్యలు; సర్వాః=అందఱును; వివత్సాః =దూడలఁబాసినట్టి; ధేనవఇవ(స్థితాః)=ఆవులుంబోలెనున్నవారలై; పతిం చైవ=పెనిమిటియగు దశరథమహారాజును; ఆచుక్రుశుః=నిందించిరి; సస్వరం=ధ్వనితోఁగూడునట్లుగా; చుక్రుశుశ్చాపి=ఏడ్చిరియు.

ఇట్లు, ఆరాజభార్యలందఱు, దూడలంబాసి నయావులుంబోలె దుఃఖించుచుఁ, బెనిమిటియగుదశరథుని నిందించుచుగట్టిగా నేడ్చిరి.

అని, తాత్పర్యము.

స హి చాంతఃపురే ఘోర మార్తశబ్దం మహీపతిః
పుత్రశోకాభిసంతప్త శ్శ్రుత్వా వ్యాలీయతాఽసనే. ౯

టీక॥పుత్రశోకాభిసంతప్తః= పుత్రదుఃఖముచేఁ దపించునట్లు చేయఁబడిన; సః=ఆ; మహీపతిః=భూమికిఁబ్రభువైనదశరథమహారాజు; అంతఃపురే=అంతఃపురమునందు; ఘోరం=భయంకరమునైన; ఆర్తశబ్దం=ఏడ్పును; శ్రుత్వాచ=విని యు; ఆసనే=పాన్పునందు; వ్యాలీయత హి = లయమునొందెనుగదా, మూర్ఛనొందెనుగదాయనుట.

పుత్రదుఃఖంబునం దపించుచుండునా దశరథ మహారాజు, అంతఃపురస్త్రీల యేడ్పునువినినంతనె, దుఃఖంబతిశయిం

చటంజేసి,మూర్ఛనొందెను. అని, తాత్పర్యము.

రామస్తు భృశ మాయస్తో నిశ్శ్వసన్నివ కుంజరః
జగామ సహితో భ్రాత్రా మాతు రంతఃపురం వశీ. ౮

టీక॥రామస్తు = రాముండును;భృశం=మిక్కిలియును; ఆయస్తః=దుఃఖమునొందినవాండై; కుంజరఇవ=ఏనుంగుంబోలె; నిశ్శ్వసన్ = నిట్టూర్పులువుచ్చుచు;వశీ=ఇంద్రియనిగ్రహముగలవాండై; భ్రాత్రా=తమ్మునితో; సహితః=కూడినవాండై; మాతుః=తల్లియొక్క;అంతఃపురం = అంతిపురమును,జగామ=పొందెను.

రాముండును, అంతఃపురస్త్రీలయేడ్పునువిని, మిగులదుఃఖంబునొంది, యేనుంగుంబోలె నిట్టూర్పులువుచ్చుచు, నింద్రియంబులనిగ్రహించుకొని,దుఃఖంబడంచుకొని, తమ్మునిలక్ష్మణునింగూడి, తల్లియంతఃపురంబునకుంబోయెను.

అని, తాత్పర్యము.

సోపశ్య త్పురుషం తత్ర వృద్ధం పరమపూజితమ్
ఉపవిష్టం గృహద్వారి తిష్ఠత శ్చాపరా న్బహూన్. ౯

టీక॥సః=ఆరాముండు;తత్ర = అచ్చట;గృహద్వారి = ఇంటివాకిలియందు;ఉపవిష్టం=కూర్చున్నవాండును; పరమపూజితం= మిక్కిలియుగౌరవింపంబడినవాండునగు;వృద్ధం= ముదుసలియయిన;పురుషం=పురుషుని;తిష్ఠతః=నిలుచున్న;అపరాన్=ఇతరులను;బహూన్=అనేకులను; అపశ్యత్=చూచెను.

ఆరాముండచ్చటద్వారంబునంగూర్చుండియున్నవాని దశరథమహారాజుచేగౌరవింపంబడువాని వృద్ధపురుషుని, మఱియునిలుచుండియున్నవారలననేకులనుం,జూచెను.

అని, తాత్పర్యము.

దృష్ట్వైవతు తదా రామం తే సర్వే సహసోత్థితాః
జయేన జయతాం శ్రేష్ఠం వర్ధయంతి స్మ రాఘవమ్. ౧౦

టీక॥తదా=అప్పుడు; తే= ఆద్వారపాలకులు;సర్వే = అందఱును; రా

మం=రాముని; దృష్ట్వైవతు=చూచినంతనే;సహసా = శీఘ్రముగా;ఉత్థితాః=లేచినవారలై;జయతాం = జయించువారలలో;శ్రేష్ఠం=ఉత్తముండగు;రాఘవం=రాముని; జయేన=జయముచేత;వర్ధయంతిస్మ = ఆశీర్వదించిరి.

అప్పుడు, ఆద్వారపాలకులందఱు, రామునింజూచినంతనే, దిగ్గునలేచి, జయంబుగలవారలలో నుత్తముండగునా రాముని, "నీకుజయంబుగలుగుఁగాక" యని,యాశీర్వదించిరి.

అని,తాత్పర్యము.

ప్రవిశ్య ప్రథమాం కక్ష్యాం ద్వితీయాయాం దదర్శ సః
బ్రాహ్మణాన్ వేదసంపన్నాన్ వృద్ధాన్ రాజ్ఞాభిసత్కృతాన్. ౧౧

టీక॥ సః = ఆరాముఁడు ; ప్రథమాం=మొదటిదైన; కక్ష్యాం = తొట్టికట్టును; ప్రవిశ్య=చొచ్చి; ద్వితీయాయాం=రెండవతొట్టికట్టునందు ; వేదసంపన్నాన్= వేదములతోఁగూడినవారలును ; వృద్ధాన్=ముసలివాండ్రును; రాజ్ఞా=దశరథమహారాజుచేత ;అభిసత్కృతాన్=పూజింపఁబడినవారలునగు;బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను; దదర్శ=చూచెను.

ఆరాముండు, ఇట్లుమొదటితొట్టికట్టుఁజొచ్చియంత రెండవతొట్టికట్టునయుండువారల వేదవేత్తలదశరథమహారాజుచేఁ బూజింపఁబడువారలవృద్ధబ్రాహ్మణులంజూచెను.

అని, తాత్పర్యము.

ప్రణమ్య రామ స్తాన్ విప్రాన్ తృతీయాయాం దదర్శ సః
స్త్రియో వృద్ధా స్తథా బాలా ద్వారరక్షణతత్పరాః. ౧౨

టీక॥సః=ఆ; రామః=రాముఁడు; తాన్=ఆ; విప్రాన్ = బ్రాహ్మణులను ; ప్రణమ్య=సమస్కరించి ; తృతీయాయాం=మూడవతొట్టికట్టునందు ; ద్వారరక్షణతత్పరాః =వాకిలిగాచుటయందాసక్తలయిన ; వృద్ధాః=ముసలివారలగు; స్త్రియః=స్త్రీలను;తథా=అట్లు ; బాలాః=పిన్నస్త్రీలను ; దదర్శ=చూచెను.

ఆరాముండు , ఆబ్రాహ్మణులను

నమస్కరించి, యంతమూడవతోట్టికట్టుఁ జొచ్చి, యచ్చటవాకిలిగాచుచుండువారలవృద్ధస్త్రీలను బాలస్త్రీలనుం జూచెను.

అని, తాత్పర్యము.

వర్ధయిత్వా ప్రహృష్టాస్తాః ప్రవిశ్యచ గృహం స్త్రియః
న్యవేదయంత త్వరితా రామమాతుః ప్రియం తదా. ౧౩

టీక॥ తదా=అప్పుడు; తాః=ఆ; స్త్రియః=స్త్రీలు; ప్రహృష్టాః=సంతోసించినవారలై; వర్ధయిత్వా=ఆశీర్వదించి; గృహం=ఇంటిని; ప్రవిశ్యచ=చొచ్చియు; త్వరితాః=వేగిరపడువారలై; రామమాతుః=రాముని తల్లికి; ప్రియం=సంతోషవార్తను; న్యవేదయంత=తెల్పిరి.

అప్పుడా స్త్రీలు, సంతోషంబునొంది, రాముని నాశీర్వదించి, లోనికింబోయి, వేగిరపాటుతో రాముని తల్లికి, సంతోషంబగు రామాగమనవార్తను, చెప్పిరి. అని, తాత్పర్యము.

కౌసల్యాపి తదా దేవీ రాత్రిం స్థిత్వా సమాహితా
ప్రభాతే త్వకరోత్పూజాం విష్ణోః పుత్రహితైషిణీ. ౧౪

టీక॥ తదా=అప్పుడు; దేవీ=పట్టపురాణియగు; కౌసల్యాపి=కౌసల్యయును; సమాహితా=నియమంబుగలదై; రాత్రిం=రాత్రియంతయు; స్థిత్వా=ఉండి; ప్రభాతేతు=తెల్లవారంగానే; పుత్రహితైషిణీ=కొడుకుమేలుగోరునదై; విష్ణోః=విష్ణుదేవుని యొక్క; పూజాం=పూజను; అకరోత్=చేసెను.

అప్పుడు, కౌసల్య, రాత్రియంతయు నియమంబున నిద్రలేకయుండి, తెల్లవారంగానే, కొడుకు రామునకు మేలుగలుగటకై, విష్ణుని బూజించెను. అని, తాత్పర్యము.

సా క్షౌమవసనా హృష్టా నిత్యం వ్రతపరాయణా
అగ్నిం జుహోతిస్మతదా మంత్రవత్కృతమంగళా. ౧౫

టీ॥ నిత్యం=ఎల్లప్పుడును; వ్రతపరాయణా=వ్రతంబులయందధికమయినయాసక్తిగలదియగు; సా= ఆకౌసల్యా; తదా=అప్పుడు; క్షౌమవసనా=తెల్లపట్టుచీరగట్టుకొన్నదై; హృష్టా=సంతసించినదై; కృతమంగళా = చేయఁబడినమంగళాలంకారంబులు గలదై; అగ్నిం=అగ్నిహోత్రమును; జుహోతిస్మ=హోమముచేసెను, స్త్రీలకుహోమాధికారము లేకుండుటచేత, బ్రాహ్మణునిచేఁజేయించెననుట.

ఎప్పుడును వ్రతంబులు సేయుటయందుమిగులనాసక్తిగలయా కౌసల్య, యప్పుడు, తెల్లపట్టుబట్టగట్టుకొని మంగళాలంకారంబులుధరించి సంతోషంబున బ్రాహ్మణునిచే హోమము చేయించుచుండెను. అని, తాత్పర్యము.

ప్రవిశ్య చ తదా రామో మాతురంతఃపురం శుభమ్
దదర్శ మాతరం తత్ర హావయంతీం హుతాశనమ్. ౧౬

టీ॥ తదా=అప్పుడు; రామః= రాముఁడు; శుభం=మంగళకరంబయిన; మాతుః=తల్లియొక్క; అంతఃపురం=అంతఃపురంబును; ప్రవిశ్య చ=చొచ్చినంతనే; తత్ర = అచ్చట; హుతాశనం = అగ్నిహోత్రమును; హావయంతీం=హోమముచేయించుచున్న; మాతరం=తల్లిని; దదర్శ=చూచెను.

అప్పుడు, రాముండు, సుందరంబగు తల్లియంతఃపురంబులోనికిం బోయి, యచ్చట, బ్రాహ్మణులచే హోమముచేయించుచున్నతల్లిం, జూచెను.

అని, తాత్పర్యము.

దేవకార్యనిమిత్తం చ తత్రాపశ్యత్ సముద్యతమ్

టీ॥ సః (అధ్యాహృతము)= ఆ రాముఁడు; తత్ర = అచ్చట; సముద్యతం= సిద్ధముయిన; దేవకార్యనిమిత్తం చ = దేవపూజయుపకరణ సామగ్రిని; అపశ్యత్ =చూచెను.

ఆ రాముండు, అచ్చట సిద్ధమయియుంచఁబడియుండు, దేవపూజాసామగ్రినిం, జూచెను.

అని, తాత్పర్యము.

దధ్యక్షతం ఘృతంచైవ మోదకాన్ హవిష స్తథా. ౧౭
లాజా న్మాల్యాని శుక్లాని పాయసం కృసరం తథా
సమిధః పూర్ణకుంభాంశ్చ దదర్శ రఘునందనః. ౧౮

టీక॥రఘునందనః=రాముఁడు; దధ్యక్షతం = పెరుఁగునుఅక్షతలను;ఘృతం చైవ=నేతిని; మోదకాన్ = కుడుములను;తథా=అట్లు; హవిషః(హవీంషి)=హవిస్సులను;లాజాన్=పేలాలను; శుక్లాని=తెల్లని;మాల్యాని=పుష్పమాలికలను;పాయసం = క్షీరాన్నమును;తథా=అట్లు;కృసరం= నువ్వులుబెల్లమును;సమిధః=సమిత్తులను; పూర్ణకుంభాంశ్చ=నీళ్లతోనించినకలశంబులను;దదర్శ=చూచెను.

రాముఁడు,అచ్చట, దేవపూజకై యుంచఁబడియుండు, పెరుఁగు, నక్షతలను, నేతి,కుడుములను, హవిస్సులను, పేలాలను, తెల్లపూలమాలికలను, క్షీరాన్నమును, నువ్వులుబెల్లమును,సమిధలను, జలముతోనిండినకలశంబులను, జూచెను.అని, తాత్పర్యము.

తాం శుక్ల క్షౌమసంవీతాం వ్రతయోగేన కర్శితామ్
తర్పయంతీం దదర్శాద్భి ర్దేవతాం దేవవర్ణినీమ్. ౧౯

టీక॥సః(అధ్యాహృతము)= ఆ రాముఁడు; శుక్లక్షౌమసంవీతాం=తెల్లపట్టుబట్టచేఁ గప్పఁబడినదియును; వ్రతయోగేన = వ్రతసంబంధముచేత;కర్శితాం= కృశింపఁజేయఁబడినదియును; దేవవర్ణినీం= దేవతలయొక్క కాంతివంటికాంతిగలదియును; దేవతాం=విష్ణుదేవుని;అద్భిః = నీళ్లచేత;తర్పయంతీం = తృప్తిఁబఱుచుచున్నదియునగు; తాం=ఆకౌసల్యను; దదర్శ=చూచెను.

తెల్లని పట్టుబట్ట గట్టుకొని, జలంబులవిష్ణుతర్పణంబు సేయుచున్నదాని, వ్రతోపవాసంబునఁగృశించియున్నదాని,దేవతలవంటిశోభఁగాంచినట్టిదాని, కౌసల్యను, రాముఁడు,చూచెను. అని, తాత్పర్యము.

సా చిర స్యాత్మజం దృష్ట్వా మాతృనందన మాగతమ్
అభిచక్రామ సంహృష్టా కిశోరం బడబా యథా. ౨౦

వానిదనకోమకును రాముని౦జూచిచు తనికిసంతోషంబును మేలును గల్గించున ట్టి, యీమాటం, జెప్పెను.

అని, తాత్పర్యము.

వృద్ధానాం ధర్మశీలానాం రాజర్షీణాం మహాత్మనామ్
ప్రాప్నుహ్యాయుశ్చ కీర్తించ ధర్మంచోపహితం కులే. ౨౩

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; వృద్ధానాం=ముసలివాండ్రును; ధర్మశీలానాం= ధర్మస్వభావంబుగలవారలును; మహాత్మనాం = అధికమయినప్రభావము గల వారలునగు; రాజర్షీణాం= రాజులునుఋషులునగు వారల యొక్క; ఆయుశ్చ = ఆయుస్సును; కీర్తించ=కీర్తిని; కులే=వంశంబునందు; ఉపహితం = స్వాభావికంబయియున్న; ధర్మంచ= ధర్మమును; ప్రాప్నుహి= పొందుము.

వృద్ధులును ధార్మికులును మహాప్రభావులునగురాజర్షులకుంబోలె, నీకు, దీర్ఘాయుస్సును, గొప్పకీర్తియును, నీ వంశంబునకుదగిన ధర్మంబును, గలుగుంగాక. అని, తాత్పర్యము.

సత్యప్రతిజ్ఞం పితరం రాజానం పశ్య రాఘవ
అద్యైవహి త్వాం ధర్మాత్మా యౌవరాజ్యే ఽభిషేక్ష్యతి. ౨౪

టీక॥ రాఘవ=రాముఁడా! సత్యప్రతిజ్ఞం= అబద్ధముకానిప్రతినగలవాండును; పితరం = తండ్రియునగు; రాజానం= దశరథమహారాజును; పశ్య=చూడుము. ధర్మాత్మా = ధర్మబుద్ధిగల, దశరథుండు ; అద్యైవ = ఇప్పుడె ; త్వాం=నిన్ను; యౌవరాజ్యే = యువరాజుదొరతనమునందు; అభిషేక్ష్యతి హి=అభిషేకించునుగదా!

రాముఁడా! నీతండ్రిదశరథమహారాజు ప్రతిజ్ఞతప్పఁడు ; ధర్మబుద్ధిగలవాఁడు; నీకిప్పుడెయావరాజ్యపట్టాభిషేకము సేయును, చూడుము . అని, కౌసల్య రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

దత్త మాసన మాలభ్య భోజనేన నిమంత్రితః
మాతరం రాఘవః కించి ద్వ్రీడా త్ప్రాంజలి రబ్రవీత్. ౨౫

టీక॥ రాఘవః=రాముఁడు; భోజనేన—(చతుర్థ్యర్థమందుఁ దృతీయ) భోజనముకొఱకు; నిమన్త్రితః = నిమన్త్రింపఁబడినవాఁడై ; దత్తం = ఇయ్యఁబడిన; ఆసనం = పీటను ; ఆలభ్య=తాఁకి; కించిత్=కొంచెము ; వ్రీడాత్ = (వ్రీడాయాః)= సిగ్గువలన; ప్రాంజలిః = మంచి చేమోడ్పుగలవాఁడై ; మాతరం=తల్లినిగూర్చి ; అబ్రవీత్=పలికెను.

రాముఁడు, కౌసల్య "భోజనంబు సేయు" మని చెప్పి, యాసనంబివ్వఁగా "దనకై తల్లి యిచ్చిన యాసనంబునఁ గూర్చుండకున్నను జేతితోనైనను దాఁకవలె" నని శాస్త్రంబుండుటచే, దాని దాఁకి, "ఇట్టుపచారంబులు సేయుచుఁ బరమానందపరివాత్సల్యంబుగల్గి యున్న తల్లితో వనవాసవృత్తాంతం బెట్లుచెప్పదను?" అని కొంచెము లజ్జనొంది, చేతులు మొగుడ్చుకొని, కౌసల్యతో, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

స స్వభావవినీతశ్చ గౌరవాచ్చ తదా నతః
ప్రస్థితో దండకారణ్య మాప్రష్టు ముపచక్రమే. ౨౮

టీక॥ స్వభావవినీతః=స్వభావంబుననె వినయంబుగలవాఁడును; తదా=అప్పుడు; గౌరవాత్=తల్లియందలి గౌరవంబువలనను; నతః= నమస్కరించియుండువాఁడునగు; సః=ఆ రాముఁడు; దండకారణ్యం=దండకారణ్యమునుగూర్చి; ప్రస్థితః = పయనంబైనవాఁడై; మాతరం (అధ్యాహృతము)=తల్లిని; ఆప్రష్టుం=అడుగుకొనుటకు ; ఉపచక్రమే=ఆరంభించెను.

స్వభావంబున వినయంబుగల యారాముఁడు , మాతృగౌరవంబున , నింకను వినయంబుతోఁ దాను దండకారణ్యంబునకుఁ బయనంబగుటకై, తల్లి యనుజ్ఞనొందుటకై యడ్గింప నారంభించెను. అని, తాత్పర్యము.

దేవి నూనం నజానీషే మహ ద్భయ ముపస్థితమ్
ఇదం తవచ దుఃఖాయ వైదేహ్యా లక్ష్మణస్యచ. ౨౯

టీక॥దేవి=తల్లీ!నూనం = నిశ్చయముగా;నజానీషే — తెలియకున్నావు.

పపాత సహసా దేవీ దేవతేవ దివ శ్చ్యుతా. ౩౨

టీక॥ సా=ఆ; దేవీ=పట్టపురాణియగుకౌసల్య; వనే=అరణ్యంబునందు; పరశునా= గొడ్డలిచేత; నికృత్తా= నఱుకఁబడిన; సాలస్య=వృక్షముయొక్క; యష్టిరివ=కొమ్మయుంబోలె ; దివః= స్వర్గంబునుండి; చ్యుతా=జాఱిపడిన; దేవతేవ=దేవతాస్త్రీయుంబోలె ; సహసా=తటాలున; పపాత=పడెను.

పట్టపురాణియగుకౌసల్య, రాముం డుచెప్పినమాటలనువిని , పరమదుఃఖం బునొంది, వనంబునగొడ్డలిచే నఱుకం బడిన చెట్టుకొమ్మయుంబోలె , స్వ ర్గంబుననుండి నేలంబడు దేవతాస్త్రీ యుంబోలె, మూర్ఛనొంది, తటాలున నేలంబడెను. అని, తాత్పర్యము.

తా మదుఃఖోచితాం దృష్ట్వా పతితాం కదళీమివ
రామస్తూత్థాపయామాస మాతరం గతచేతసమ్. ౩౩

టీక॥ రామస్తు=రాముఁడును; అదుఃఖోచితాం= దుఃఖంబునకుఁదగనిదియును; గతచేతసం=పోయినతెలివిగలదియును, మూర్ఛనొందినదియనుట; పతితాం=పడిన; కదళీమివ(స్థితాం) = అరఁటిచెట్టుంబోలె నున్నదియు నగు; తాం=ఆ; మాతరం=తల్లిని; దృష్ట్వా=చూచి; ఉత్థాపయామాస=ఎత్తెను.

రాముఁడును, ఎంతయుఁ గ్రమమును దుః ఖంబునకుఁ దగనిదియును, మూర్ఛ నొంది, నేలంబడియున్న యరఁటిచెట్టుం బోలెనున్నదియును నగుతల్లిం జూచి, యా మెను లేవనెత్తెను. అని, తాత్పర్యము.

ఉపావృత్త్యోత్థితాం దీనాం బడబామివ వాహితామ్
పాంసుకుంఠితసర్వాంగం విమమర్శ చ పాణినా. ౩౪

టీక॥ ఉపావృత్య = పొరలి; ఉత్థితాం=లేచిన; వాహితాం=బరువుమోసియుండు; బడబామివ(స్థితాం)=ఆఁడుగుఱ్ఱముం బోలెనున్నదియు; పాంసుకుంఠితసర్వాంగం= దుమ్ముచేఁగప్పఁడినయవయవములునుంగల

ల్యను; రామః(అధ్యాహృతము)— రాముఁడు; పాణినా = చేతిచే; పరిమమర్శ = తడవెను.

రాముండు, తాను లేవనెత్తఁగా లేచి, దుమ్ము కప్పిన దేహంబుతోఁ గూడి, అలపుదీర్చుకొనుటకై నేలం బొరలి లేచిన భారవహనంబున నలసియుండు నాఁడుగుఱ్ఱంబుం బోలెఁ, బాపట్టుచున్న, తల్లిదేహంబంతయుఁ, దనచేతఁ దడవెను.

అని, తాత్పర్యము.

సా రాఘవ ముపాసీన మసుఖార్తా సుఖోచితా
ఉవాచ పురుష వ్యాఘ్ర ముపశృణ్వతి లక్ష్మణే. ౩౪

టీక॥ అసుఖార్తా = దుఃఖముచేఁ బీడింపఁబడినదియును; సుఖోచితా = సుఖంబునకు మాత్రము దగినదియు నగు; సా = ఆకౌసల్య; ఉపాసీనం = సేవించుచున్న; పురుషవ్యాఘ్రం = పురుషశ్రేష్ఠుండగు; రాఘవం = రాముని గూర్చి; లక్ష్మణే = లక్ష్మణుండు; ఉపశృణ్వతి = వినుచుండఁగా; ఉవాచ = చెప్పెను.

ఇట్లు దుఃఖముచేఁ బీడింపఁ బడినదియు సుఖంబనుభవించుటకు మాత్రమె తగినదియు నగు నా కౌసల్య, తన్ను సేవింపుచున్న పురుషశ్రేష్ఠుండగు రామునింజూచి, లక్ష్మణుండు వినుచుండఁగా, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యది పుత్ర నజాయేథా మమ శోకాయ రాఘవ
న స్మ దుఃఖ మతో భూయః పశ్యేయ మహ మప్రజా. ౩౮

టీక॥ పుత్ర = కుమారుండవగు; రాఘవ = రాముఁడా! త్వం (అధ్యాహృతము) = నీవు; మమ = నాయొక్క, శోకాయ = దుఃఖము కొఱకు; నజాయేథాయది = పుట్టకుందువేని; అహం = నేను; అప్రజాః — సంతానము లేనిదాననై; అతః = దీనికన్నను; భూయః = దుఃఖమును; నపశ్యేయంస్మ — చూడను, గదా!

పుత్రుఁడా! నేను దుఃఖమనుభవించుటకై యె, నీవు నాకుఁ బుట్టినావు; నీవు పుట్టకయుండువేని, "నాకు సంతానము లేదే" యను దుఃఖముకన్న నధికమయిన దుఃఖము నాకుఁ గలుగదు.

అని, తాత్పర్యము.

స ౨౦

టీక॥ సా=అట్టి; అహం=నేను; పరాసతీ=శ్రేష్ఠనగుదు; అవరాణాం = తక్కువయిన వారలగు; హృదయచ్ఛిదాం = మనసును ఛేదించునట్టి; సపత్నీనాం=సవతులయొక్క; బహూని=అనేకములయిన; అమనోజ్ఞాని = దుఃఖకరంబులగు; వాక్యాని=మాటలను; శ్రోష్యే=వినఁగలను.

ఇంక, సవతులలోనందఱికన్నఁ బూజ్యురాలనగుచున్నఁ జూచి, నాకన్నఁ దక్కువయినసవతులు, నామనసునకుదుఃఖంబుగలుగఁ జేయుటకై, యవమానంబుగాఁ జెక్కుమాటలాడుదురు.

అని, తాత్పర్యము.

అతో దుఃఖతరం కిన్ను ప్రమదానాం భవిష్యతి
మమ శోకో విలాపశ్చ యాదృశో౽య మనంతకః ౪౦

టీక॥ ప్రమదానాం = స్త్రీలకు; అతః=దీనికన్నను; దుఃఖతరం=అధికదుఃఖము; కిన్ను=ఏది; భవిష్యతి = కాఁగలదు? మమ=నాయొక్క; శోకః=దుఃఖమును; విలాపశ్చ=ఏడ్పును; యాదృశః=ఎట్టిదో, ఇట్టిదనిచెప్పనలవిగానిదనుట; అనంతకః=తుదిలేనిది.

స్త్రీలకు, సవతులచేతమాటపడుటకన్న నధికదుఃఖం బేమియున్నది? కావున, నాదుఃఖము నేడ్పును, ఇంతయనిచెప్పనలవిగాదు, దానికంతములేదు.

అని: తాత్పర్యము.

త్వయి సన్నిహితేప్యేవ మహ మాసం నిరాకృతా
కింపునః ప్రోషితే తాత ధ్రువం మరణ మేవ మే. ౪౧

టీక॥ తాత=నాయనా! త్వయి=నీవు; సన్నిహితేపి = దగ్గఱనుండినను; ఏవం=ఇట్లు, నీవుచూచుచున్నట్లనుట; అహం=నేను; నిరాకృతా=తిరస్కరింపఁబడినదానను; ఆసం = అయితిని. ప్రోషితే = దూరంబునకుఁబోయినవాఁడవు కాఁగా; కింపునః(వక్తవ్యం)=చెప్పవలసినదేమి? మే=నాకు; మరణమేవ= చావే; ధ్రువం=నిశ్చయము.

నీవుదగ్గఱనుండునప్పుడును, నాకుఁదిరస్కారంబుగలుగుటను నీవుచూచినావుగదా! నీవుదూరంబుపోఁగా, నాకుఁదిరస్కారంబుగలుగుటను గుఱించిచెప్పనేల? ఇంకనాకుమరణంబేకాని వేఱులే

కైకేయ్యా వచనం ద్రష్టుం పుత్ర శక్ష్యామి దుర్గతా. ౪౪

టీక॥పుత్ర=కొడుకా! దుర్గతా=గతిలేనిదాననగు; అహం (అధ్యాహృతము) = నేను; తస్యాః=ఆ; కైకేయ్యాః=కైకేయియొక్క; నిత్యక్రోధతయా=ఎల్లప్పుడునుగోపము గలదగుటచేత; ఖరవాది=పరుషముగాఁ బలుకునట్టి;తత్ =ఆ;(పాఠాంతరపక్షమందు) ఖరవాదినం (ఖరవాది) = పరుషముగాఁబలుకునట్టి;వచనం=మాటను; ద్రష్టుం=చూచుటకు; కథన్ను=ఎట్లు; శక్ష్యామి=చాలుదును?

రాముఁడా!ఇట్లుగతిలేకుండు నేను నాపైనెప్పుడును గోపంబు వహించియుండుకైకేయిపరుషవాక్యంబులాడఁగా,నేనువానినెట్లు సహింపుచుందును? అని, తాత్పర్యము.

దశ సప్తచ వర్షాణి తవ జాతస్య రాఘవ
అసితాని ప్రకాంక్షంత్యా మయా దుఃఖ పరిక్షయమ్. ౪౫

టీక॥రాఘవ= రాముఁడా! తవ=నీవు;జాతస్య=పుట్టఁగా; (అరణ్యకాండంబున సీత,రావణునితో, "రామున కువనంబునకువచ్చునప్పుడు ఇరువదిసంవత్సరంబు" లని చెప్పియుండుట వలన, "జాతస్య" అనుదానికి "ఉపయనంబు కొందఁగా"యర్థము;ఉపనయనము బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు ద్వితీయజన్మమనుట, శాస్త్రసిద్ధము.) ఉపనయనంబుకొందఁగాననుట; దశ=పదియును; సప్తచ=ఏడును , పదునేడుననుట; వర్షాణి=ఏండ్లు; దుఃఖపరిక్షయం = దుఃఖనాశమును; ప్రకాంక్షంత్యా=కోరుచున్నట్టి; మయా=నాచేత; అసితాని=కడపఁబడినవి.

రాముఁడా!నీకుపనయనంబయినది మొదలు,'ఇప్పటికిఁ బదునేడు సంవత్సరములుగా "నీకుయౌవరాజ్యంబువచ్చును, నాదుఃఖంబు నశించును" అని,కోరుచు, దినంబులుగడపినాను.

అని, తాత్పర్యము.

తదక్షయం మహద్దుఃఖం నోత్సహే సహితుం చిరమ్
విప్రకారం సపత్నీనా మేవం జీర్ణాపి రాఘవ. ౪౬

టంజేసి, "నాకుమాత్రము చావులేదు; యమలోకంబున నన్నుంచుటకుస్థలంబు లేదు." అని, తోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

స్థిరం హి నూనం హృదయం మమాయసమ్
న భిద్యతే య ద్భువి నావదీర్యతే
అనేన దుఃఖే న చ దేహ మర్పితం
ధ్రువం హ్యకాలే మరణం న విద్యతే. ౫౧

టీక॥ మమ = నాయొక్క; హృదయం=మనసును; దేహం = దేహమును; అనేన=ఈ; దుఃఖేన=దుఃఖముచేత; అర్పితంచ=వ్యాపింపఁబడినదైనను; యత్ =ఏకారణమువలన; భువి= భూమియందు; నభిద్యతే=భేదింపఁబడలేదో; నావదీర్యతే= తునకలుచేయఁబడలేదో; తత్ (అధ్యాహృతము)=ఆ కారణమువలన; స్థిరం=గట్టిదియు; ఆయసంహి= ఇనుముచేఁజేయఁబడినదియుఁగదా! నూనం=నిశ్చయము! అకాలే= విధింపఁబడనికాలమునందు; మరణం= చావు; నవిద్యతేహి=లేదుగదా! ధ్రువం=నిశ్చయము!

నాహృదయంబును దేహంబును, ఇట్టి దుఃఖంబునొందియును, పగిలితునకలై నేలంబడకున్నవి, కావున, ఇనుముతోఁ జేయఁబడినవియు స్థిరంబులు నని తోఁచుచున్నది; ఈశ్వరుఁడేర్పఱుపని కాలమునందు మరణంబు గలుగదనుట నిశ్చయము. అని, తాత్పర్యము.

ఇదంతు దుఃఖం య దనర్థకాని మే
వ్రతాని దానానిచ సంయమాశ్చ హి
తపశ్చ తప్తం య దపత్య కారణాత్
సునిష్ఫలం బీజ మి వోప్త మూషరే. ౫౨

టీక॥ యత్ = ఏకారణమువలన; మే=నాయొక్క; వ్రతాని=వ్రతములును; దానానిచ=దానములును; సంయమాశ్చ= ధ్యానములును; ("హి" అనునది పాదపూరణార్థము); అనర్థకాని=ప్రయోజనములేనివో; యత్ = ఏ

కారణమువలన; అపత్యకారణాత్ = సంతానముకొఱకు; తప్తం=తపింపఁబడిన, చేయఁబడినయినుటు; తపశ్చ= తపస్సును; ఊషరే=చవుటినేలయందు; ఉప్తం = నాటఁబడిన; బీజమివ= విత్తువలె; సునిష్ఫలం=ఎంతమాత్రము ఫలములేకున్నదో; తత్ ( అధ్యాహృతము)= ఆకారణమువలన; ఇదం=ఈ; దుఃఖంతు = దుఃఖమును; జాతం (అధ్యాహృతము)=కలిగినది.

నేనుచేసినవ్రతములును దానములును ధ్యానములును వ్యర్థములయినవి; మఱియు, సంతానముగలుగుటకై నేఁ జేసినతపస్సంతయుఁ జవుటినేలలో నాటినబీజంబుంబోలె నిష్ప్రయోజనం బయినది; కావున నే, నాకిట్టిదుఃఖంబుగల్గినది. అని, తాత్పర్యము.

యది హ్యకాలే మరణం స్వయేచ్ఛయా
లభేత కశ్చి ద్గురు దుఃఖకర్శితః
గతాహ మద్యైవ పరేతసంసదమ్
వినా త్వయా ధేను రివాత్మజేనవై. ౪౩

టీక:కశ్చిత్=ఒకానొకఁడును; గురుదుఃఖకర్శితః=అధికమయిన దుఃఖముచేఁ గృశించునట్లు చేయఁబడినవాఁడై; స్వయేచ్ఛయా= తనయిచ్ఛచేత; అకాలే=విధింపఁబడని కాలమునందు; మరణం=చావును; లభేతయది=పొందునేని ("హి" అనునది పాదపూరణార్థము); అహం=నేను; త్వయావినా= నిన్నువిడిచి; ఆత్మజేన(వినా)= దూడనువిడిచి ; ("వై" అనునది పాదపూరణార్థము) ధేనురివ=ఆవుంబోలె; అద్యైవ=ఇప్పుడె; పరేతసంసదం=యమసభను; గతా = పొందినదానను ; స్యాం(అధ్యాహృతము)= అగుదును.

ఎవ్వఁడైనను, దానుమిగులదుఃఖము పొందియున్నప్పుడు, కాలంబు రాకున్నను యథేచ్ఛగాఁ బ్రాణంబులువిడువంగలఁడేని, నేను, దూడఁబాసిన యావుపోలిక, నిన్నువిడిచి యుండఁజాలక, యిప్పుడె ప్రాణంబులు విడుతును; అట్టిశక్తిలేదయ్యె. అని, తాత్పర్యము.

అథాపి కిం జీవిత మద్య మే వృథా

త్వయా వినా చంద్రనిభాననప్రభ
అనువ్రజిష్యామి వనం త్వయైవ గౌ
స్సుదుర్బలా వత్స మివానుకాంక్షయా. ౫౪

టీక॥ చంద్రనిభాననప్రభ = చంద్రునితోసమానమయినముఖకాంతిగల రాముఁడా! అథాపి = అయినను; త్వయా వినా = నిన్నువిడిచి; అద్య = ఇప్పుడు; మే = నాయొక్క; కింజీవితం = కుత్సితమయినబ్రతుకు; వృథా = వ్యర్థము. సుదుర్బలా = ఎంతమాత్రమును బలములేని; అహం (అధ్యాహృతము) = నేను; అనుకాంక్షయా = వాత్సల్యముచేత; త్వయైవ (సహ) = నీతోఁగూడనె; గౌః = ఆవు; వత్సమివ = దూడనుంబోలె; వనం = అడవినిగూర్చి; అనువ్రజిష్యామి = వెంబడింతునను.

చంద్రునితోసాటియగుముఖంబు గలరాముఁడా! నీవులేక, నేను కుత్సితముగా బ్రతుకుటచే, నేమియుఁబ్రయోజనములేదు; కావున, ఆవు దూడనువెంబడించునట్లు, నీతోఁగూడవనంబునకువచ్చెదను. అని, తాత్పర్యము.

భృశ మసుఖ మమర్షితా తదా
బహు విలలాప సమీక్ష్య రాఘవం
వ్యసన ముపనిశామ్య సా మహ
త్సుతమివ బద్ధ మవేక్ష్య కిన్నరీ. ౫౫

టీక॥ సా = ఆకౌసల్య; తదా = అప్పుడు; అసుఖం = దుఃఖమును; అమర్షితా = ఓర్వనిదై; మహత్ = అధికమయిన; వ్యసనం = దుఃఖమును; ఉపనిశామ్య = ఆలోచించి; బద్ధం (అధ్యాహృతము) = దశరథాజ్ఞకులోఁబడిన; రాఘవం = రాముని; సమీక్ష్య = చూచి; బద్ధం = కట్టఁబడిన; సుతం = కొడుకును; అవేక్ష్య = చూచి; కిన్నరీవ = కిన్నరస్త్రీయునుబోలె; భృశం = మిక్కిలియును; బహు = అధికముగా; విలలాప = ఏడ్చెను.

అప్పుడా కౌసల్య, దుఃఖముఁబట్టఁజాలక, యింక రాముండువనంబునకుఁబోయిన వెనుకఁ దనకుఁగల్గు దుఃఖంబునా

లోచించి, రాముండు దశరథాజ్ఞాబద్ధుండై యుండుటం జూచి, తనకొడుకును వేటకాండ్రు పట్టుకొని బంధించుటం జూచి కిన్నరి దుఃఖించునట్లు, మిక్కిలి యు దుఃఖించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండవింశసర్గటీక, ముగిసినది.

---

౨౧

ఏకవింశసర్గప్రారంభః.

తథా తు విలపంతీం తాం కౌసల్యాం రామమాతరమ్
ఉవాచ లక్ష్మణో దీనస్తత్కాలసదృశం వచః. ౧

టీక॥ లక్ష్మణః = లక్ష్మణుండు; దీనః = దుఃఖము నొందినవాండై; తథాతు = అట్లే; విలపంతీం = ఏడ్చుచున్న; రామమాతరం = రాముని తల్లియగు; తాం = ఆ; కౌసల్యాం = కౌసల్యను గూర్చి; తత్కాలసదృశం = ఆ కాలమున కనుసరియయిన; వచః = మాటను; ఉవాచ = చెప్పినాండు.

లక్ష్మణుండు, దీనుండై, యట్లు విలపించుచున్న రామమాతయగు కౌసల్యం జూచి, యాసమయంబునకుం దగినట్లుగా, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

న రోచతే మమాప్యేతదార్యే యద్రాఘవో వనమ్
త్యక్త్వా రాజ్యశ్రియం గచ్ఛేత్ స్త్రియా వాక్యవశంగతః. ౨

టీక॥ ఆర్యే = పూజ్యురాలవగు కౌసల్యా=రాఘవః=రాముఁడు ; స్త్రియాః= ఆఁడుదానియొక్క ; వాక్యవశం=మాటకులోఁకువయగుటను;గతః, పొందినవాఁడై; రాజ్యశ్రియం=రాజ్యలక్ష్మిని; త్యక్త్వా=విడిచి ; వనం=యడవినిగూర్చి ; గచ్ఛేద్యత్ = పోవుననునదియేదో ; ఏతత్ = ఇది; మమ=నాకును; నరోచతే=సమ్మతిపడలేదు.

పూజ్యురాలవగుకౌసల్యా!ఆఁడుదానిమాటకులోఁబడి రాముండురాజ్యంబు విడిచియరణ్యంబునకుఁబోవుట,నాకును సమ్మతముగానుండలేదు.

అని, తాత్పర్యము.

విపరీతశ్చ వృద్ధశ్చ విషయైశ్చ ప్రధర్షితః
నృపః కిమివ న బ్రూయా చ్చోద్యమాన స్సమ న్మథః. ౩

టీక॥విపరీతశ్చ=మనస్థైర్యముదప్పినవాఁడును;వృద్ధశ్చ= ముసలివాఁడును; విషయైః = విషయములచేత; ప్రధర్షితశ్చ= తిరస్కరింపఁ బడినవాఁడును,లోఁగొనఁబడిన వాఁడుననుట ; చోద్యమానః = ప్రేరింపఁబడుచున్నవాఁడును;సమన్మథః= మన్మథతాపముతోఁ గూడినవాఁడునగు;నృపః= దశరథమహారాజు;కిమివ = దేనిని;నబ్రూయాత్ =చెప్పఁడు?ఏమాటనైనంజెప్పుననుట.

వృద్ధుం డగుటవలనఁ జపలంబగు మనసుగలవాఁడు , విషయంబులకులోఁబడినవాఁడు మన్మథతాపంబుతోఁగూడినవాఁడునగు దశరథమహారాజు, కైకేయిప్రేరేపించుచుండఁగా, నేమాటం జెప్పఁడు? ఏమాటనైనంజెప్పును; అది యంగీకరింప దగినదికాదు.

అని, తాత్పర్యము.

నాస్యాపరాధం పశ్యామి నాపి దోషం తథా విధం
యేన నిర్వాస్యతే రాష్ట్రా ద్వనవాసాయ రాఘవః. ౪

టీక॥యేన=ఏకారణముచేత; రాఘవః=రాముఁడు;రాష్ట్రాత్=దేశమునుండి;వనవాసాయ=అరణ్యంబుననుండుటకై ;నిర్వాస్యతే= వెడలఁగొట్టఁబడుచున్నాఁడో;అస్య=ఇతనియొక్క;తథావిధం = అట్టిదైన; అపరాధం=

తప్పును;నపశ్యామి=చూడను.దోషం= పాపమును;న(పశ్యామి)=చూడను.

దేశంబువిడిచి యరణ్యంబుననుండుటకై వెడలఁగొట్టఁబడగినంతటి రాజద్రోహంబుగాని పాతకంబుగాని రాముని యందునాకగపడలేదు.

అని, తాత్పర్యము.

న తం పశ్యామ్యహం లోకే పరోక్షమపి యో నరః
స్వమిత్రోపి నిరస్తోపి యోస్య దోష ముదాహరేత్. ౫

టీ॥స్వమిత్రోపి=మిక్కిలియుశత్రువైనను;నిరస్తోపి=తిరస్కరింపఁబడినవాఁడైనను;యః=ఏ; యః=ఏ("లేదు"అనుట నిశ్చయార్థముగ్రహించుటకై రెండవయచ్ఛబ్దముచెప్పఁబడినది);నరః= మనుష్యుఁడు; పరోక్షమపి = మఱుఁగుననయినను;అస్య=ఈ;రామునియొక్క;దోషం=దోషమును;ఉదాహరేత్=చెప్పునో;తం=అతనిని;అహం=నేను;నపశ్యామి=చూడలేను.

రామునకుమిక్కిలియు శత్రువుగాని రామునివలన నవమానంబు నొందిన వాఁడుకానియెవ్వఁడైనను రామునిపై దోషంబుఁజెప్పువాఁడు నాకగపడలేదు.

అని, తాత్పర్యము.

దేవకల్ప మృజుం దాంతం రిపూణామపి వత్సలమ్
అవేక్షమాణః కో ధర్మం త్యజేత్పుత్ర మకారణాత్. ౬

టీ॥ధర్మం=ధర్మమును; అవేక్షమాణః=చూచుచున్న,ధార్మికుండగు ననుట;కః=ఎవ్వఁడు; దేవకల్పం=దేవతతోసమానుఁడును;ఋజుం=కపటములేనివాఁడును;దాంతం= ఇంద్రియనిగ్రహము గలవాఁడును ; రిపూణామపి= శత్రువులకును, శత్రువులయందుననుట; వత్సలం = ప్రేమగలవాఁడునగు; పుత్రం=కొడుకును; అకారణాత్=కారణంబులేమివలన;త్యజేత్=విడుచును?

దేవతంబోలినవాఁడును కౌటిల్యము లేనివాఁడు నింద్రియనిగ్రహంబుగలవాఁడును శత్రువులయందును ప్రేమగలవాఁడునగు, కొడుకును, ధార్మికుండగు వాఁడెవ్వఁడువిడుచును?అట్టిగుణంబులు గలరామునిదశరథుఁడు విడిచినాఁడు,

కావున, దశరథుండు ధార్మికుండు కాఁడు, పరమదుష్టుండు; ఇతనిమాటయంగీకరింపఁదగినదికాదు. అని, తాత్పర్యము.

త దిదం వచనం రాజ్ఞః పున ర్బాల్య ముపేయుషః
పుత్రః కో హృదయే కుర్యా ద్రాజవృత్త మనుస్మరన్. ౭

టీక॥ తత్=అందువలన ; పునః=మఱల; బాల్యం=చిన్నతనమును; ఉపేయుషః=పొందిన; రాజ్ఞః= రాజుయొక్క; ఇదం=ఈ; వచనం=మాటను ; రాజవృత్తం=రాజులయాచారమును ; అనుస్మరన్ = ఆలోచించుచున్న; పుత్రః=కొడుకు; కః=ఎవ్వఁడు ; హృదయే=మనసునందు ; కుర్యాత్ = చేయును?

అందువలన, వృద్ధుండైనను , మఱలబాలుఁడుంబోలెమన్మథపరవశుండై మూఢుండైయున్న , రాజు, ఎగదిగనిట్లు చెప్పనేని, పుత్రుండెవ్వఁడు రాజనీతి దెలిసినవాఁడు , దానినంగీకరించును? ఎవ్వఁడునంగీకరింపఁడు ; కావునమన్మథపరవశుండైనదశరథుండు చెప్పినమాటను రాముండువినవలసినదిలేదు. అని, తాత్పర్యము.

యావదేవ న జానాతి కశ్చి దర్థ మిమం నరః
తావదేవ మయా సార్ధ మాత్మస్థం కురు శాసనమ్. ౮

టీక॥ నరః=మనుష్యుఁడు; కశ్చిత్=ఒకానొకండును; యావత్=ఎంతవఱకు; ఇమం=ఈ; అర్థం = సమాచారమును ; నజానాత్యేవ=తెలిసికొనకయుందునో; తావదేవ = అంతలోపలనే ; త్వం(అధ్యాహృతము)=నీవు ; మయా సార్థం=నాతోఁగూడ; శాసనం=రాజ్యమును; ఆత్మస్థం=నీయధీనమునుగా; కురు=చేసికొనుము.

రాముఁడా! దశరథుండునిన్నువనంబునకుఁబొమ్మన్నసమాచారమెవ్వరికిని దెలియకుండునప్పుడె, నీవునాతోఁ గూడ రాజ్యమంతయు స్వాధీనముఁజేసికొనుము. అని, తాత్పర్యము.

మయా పార్శ్వే సధనుషా తవ గుప్తస్య రాఘవ
క స్సమర్థోఽధికం కర్తుం కృతాం తస్యేవ తిష్ఠతః. ౯

టీక॥ రాఘవ=రాముఁడా ! పార్శ్వే=ప్రక్కయందు; సధనుషా = విల్లుతోఁగూడిన; మయా= నాచేత; గుప్తస్య=రక్షింపఁబడినవాఁడవును; తిష్ఠతః=నిలుచుండిన ; కృతాంతస్యేవ (స్థితస్య)=యముండుంబోలెనున్న వాఁడవునగు; తవ=నీకు; అధికం=ఎచ్చును ; కర్తుం=చేయుటకు,కః=ఎవ్వఁడు ; సమర్థః=చాలినవాఁడు?

నేనుధనుర్ధరుండనై పార్శ్వంబునం గాచియుండఁగా, యముండుంబోలెఁ జూపట్టుచున్ననీ యాజ్ఞ నెవ్వం డతిక్రమింపఁజాలును? అని, తాత్పర్యము.

నిర్మనుష్యా మిమాం కృత్స్నా మయోధ్యాం మనుజర్షభ
కరిష్యామి శరై స్తీక్ష్ణై ర్యది స్థాస్యతి విప్రియే. ౧౦

టీక॥మనుజర్షభ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా!విప్రియే = విరోధమునందు;స్థాస్యతియది = ఉండునేని; తీక్ష్ణైః=కఱకుగల;శరైః = బాణములచేత; ఇమాం=ఈ;అయోధ్యాం=అయోధ్యను; కృత్స్నాం=అంతను; నిర్మనుష్యాం = మనుష్యులులేనిదానిఁగా; కరిష్యామి=చేసెదను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఈయయోధ్యయందలిజనులేమైన విరోధముసేయుదురేని, వీరలనందఱను , తీక్ష్ణంబులగు బాణంబులచేఖండించి, యయోధ్యలో నొకమనిషియు లేకుండునట్లుగాఁజేసెదను. అని, తాత్పర్యము.

భరతస్యా థ పక్ష్యోవా యోవాస్య హిత మిచ్ఛతి
సర్వా నేతా న్వధిష్యామి మృదుర్హి పరిభూయతే.౧౧

టీక॥అథ=ఇంక;భరతస్య=భరతుని యొక్క;పక్ష్యోవా=పక్షమునందుండువాఁడుగాని; అన్యోవా (అధ్యాహృతము)=ఇతరుఁడుగాని;యోవా= ఎవ్వఁడు;అస్య= ఈభరతునియొక్క ; హితం=మేలును; ఇచ్ఛతి=కోరుచున్నాఁడో;ఏతాన్=వీరలను; సర్వాన్=అందఱను; వధిష్యామి=చంపెదను. మృదుర్హి=మెత్తనివాఁడే కదా!పరిభూయతే= తిరస్కరింపఁబడుచున్నాఁడు.

ఇంక,భరతునిపక్షమునవలంబించియుండువారలు,కాని , యితరులుకా

ని,యతనిమేలుకోరువార లెవ్వరైననుం దురేని,వారలనందఱం జంపెదను ; మెత్తగానున్న నవమానంబువచ్చును; కావునంగఠినము గానే దండింపవలయును అని, తాత్పర్యము.

ప్రోత్సాహితోఽయం కైకేయ్యా స దుష్టో యది నః పితా
అమిత్రభూతో నిస్సంగం వధ్యతాం బధ్యతామపి. ౧౨

టీక॥ దుష్టః=దుష్టుండగు; అయం=ఈ; నః=మనయొక్క ; పితా=తండ్రి; కైకేయ్యా=కైకేయిచేత ; ప్రోత్సాహితః=పురికొల్పఁబడినవాఁడై; అమిత్రభూతో యది=శత్రువుగానుండు నేని; నిస్సంగం= విచారములేక ; వధ్యతాం=చంపఁబడుఁగాక. అపి=లేక; బధ్యతాం=కట్టఁబడుఁగాక.

దుష్టుండగు నట్టి తండ్రి దశరథుండు, కైకేయిమాట విని, మనకు శత్రువై మన కార్యంబునకు విఘ్నంబు సేయుచున్న, యతనిం జంపెదను; లేక, అంతేగాక తీవ్యను వలనేని, బంధించివేయుదము.
అని, తాత్పర్యము.

గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్. ౧౩

టీక॥ అవలిప్తస్య=గర్వించినవాఁడును, లేక, కామాదులకు లోఁబడినవాఁడును; కార్యాకార్యం= చేయఁదగినదానిని చేయఁదగనిదానిని; అజానతః= తెలియనివాఁడును; ఉత్పథం=కానిత్రోవను; ప్రతిపన్నస్య=పొందినవాఁడునగు; గురోరపి=తండ్రికిని; శాసనం=దండనము; కార్యం=చేయఁదగినది; భవతి = అగుచున్నది.

తండ్రియైనను, గర్వించి కామాదులకు లోఁబడి, "ఏది చేయదగినది ఇది చేయఁదగనిది" యని తెలియక, మర్యాద నతిక్రమించి యుత్పథంబున వలంబించునేని, యతనికి దండనము చేయవలసినది.
అని, తాత్పర్యము.

బల మేష కిమాశ్రిత్య హేతుం వా పురుషర్షభ
దాతు మిచ్ఛతి కైకేయ్యై రాజ్యం స్థిత మిదం తవ. ౧౪

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! ఏషః=ఈదశరథుఁడు; తవ=నీకు; స్థితం=ఉన్న; ఇదం=ఈ; రాజ్యం=దొరతనమును; కిం = ఏ; బలం= బలిమిని; కం (అధ్యాహార్యము)= ఏ; హేతుం వా=కారణముఁగాని; ఆశ్రిత్య=ఆశ్రయించి; కైకేయ్యై=కైకేయి కొఱకు; దాతుం=ఇచ్చుటకు; ఇచ్ఛతి= కోరుచున్నాఁడు?

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! నీకుఁ గ్రమంబునఁ బ్రాప్తంబైయుండు నీ రాజ్యంబును, ఈదశరథుండు కైకేయికి య్యఁగోరుచున్నాఁడే; ఈదశరథునకు నిన్నుజయించునంతటి బలంబేమియున్నది? లేక, నీకు రాజ్యంబియ్యకుండుటకుఁ దగుకారణం బేమియున్నది? లేదనుట నిక్కము. అని, తాత్పర్యము.

త్వయా చైవ మయా చైవ కృత్వా వైర మనుత్తమమ్
కాస్య శక్తి శ్శ్రియం దాతుం భరతాయారిశాసన. ౧౫

టీక॥ అరిశాసన=శత్రువులశిక్షించునట్టి రాముఁడా! త్వయా చైవ = నీతోను, మయా చైవ=నాతోను, అనుత్తమం=లేనకన్నశ్రేష్ఠంబులేని; వైరం = పగను; కృత్వా=చేసికొని; భరతాయ= భరతుని కొఱకు; శ్రియం = రాజ్యలక్ష్మిని; దాతుం=ఇచ్చుటకు; అస్య = ఈదశరథునకు; కా=ఏమి; శక్తిః= సామర్థ్యము; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది?

శత్రువులశిక్షించునట్టి రాముఁడా! నీతోను నాతోను మిక్కిలింబగువిరోధంబు చేసికొని, భరతునకు రాజ్యంబొసంగుటకీదశరథునకేమి శక్తియున్నది? అని, తాత్పర్యము.

అనురక్తోస్మి భావేన భ్రాతరం దేవి తత్త్వతః
సత్యేన ధనుషా చైవ దత్తేనేష్టేన తే శపే. ౧౬

టీక॥ దేవి = పట్టపురాణివగుకౌసల్యా! తత్త్వతః = యథార్థముచే; భ్రాతరం = అన్ననుగూర్చి; భావేన= హృదయముచే; అనురక్తః= అనురాగముగలవాఁడను; అస్మి=అగుచున్నాను; తే=నీకొఱకు; సత్యేన=సత్యముచేతను; ధనుషా చైవ=వింటిచేతను; దత్తేన=దానముచేతను; ఇష్టేన=యాగముచేతను;

శపే=ప్రమాణముసేయుచున్నాను.

కౌసల్యాదేవీ! నాకుయథార్థము గాహృదయమందన్నయగు రామునిమీఁదననురాగంబున్నది; నేనుజ్ఞాతినని శంకింపవలదు;నీముందట, సత్యమునుధనుస్సును దానంబునుసాక్షిగాఁబ్రమాణము చేసెను. అని, తాత్పర్యము.

దీప్త మగ్ని మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి
ప్రవిష్టం తత్ర మాం దేవి త్వం పూర్వ మవధారయ. ౧౬

టీక॥దేవి=తల్లి వగుకౌసల్యా! దీప్తం=మండుచున్న; అగ్నిం = నిప్పును గాని;అరణ్యంవా=అడవిని గాని; రామః=రాముఁడు; ప్రవేక్ష్యతియది=ప్రవేశింపఁగలఁడేని;మాం=నన్ను;తత్ర=అచ్చట;పూర్వం=ముందు; ప్రవిష్టం=ప్రవేశించినవానిఁగా;త్వం=నీవు; అవధారయ=నిశ్చయింపుము.

తల్లివగుకౌసల్యా! మండుచున్నయగ్నిహోత్రమును గాని యడవిని గాని రాముండుప్రవేశింపయత్నించు నేని, "నేనతనికన్నముందుప్రవేశించితి" నని సిద్ధముగా నిశ్చయింపుము.

అని, తాత్పర్యము.

హరామి వీర్యాద్దుఃఖం తే తమః సూర్య ఇవోదితః.

టీక॥అహం=నేను; వీర్యాత్=పరాక్రమమువలన ; తే=నీయొక్క; దుఃఖం=దుఃఖమును ; ఉదితః=ఉదయించిన; సూర్యః=సూర్యుఁడు ; తమఇవ=చీఁకటినింబోలె ; హరామి=పోఁగొట్టెదను.

సూర్యుండుదయించి కాంతిచేఁ జీఁకటినింబోఁగొట్టునట్లు, నేను, బరాక్రమంబున నీదుఃఖమును బోఁగొట్టెదను.

అని, తాత్పర్యము.

దేవీ పశ్యతు మే వీర్యం రాఘవశ్చైవ పశ్యతు. ౧౮

టీక॥మే=నాయొక్క ; వీర్యం = పరాక్రమమును; దేవీ=తల్లియగు కౌసల్య; పశ్యతు=చూచుఁగాక . రాఘవశ్చైవ= రాముఁడును ; పశ్యతు= చూచుఁగాక.

నాపరాక్రమంబును, గౌసల్యయు

రాముండును,ఇప్పుడుచూతురు గాక. అని,లక్ష్మణుండు,కౌసల్యతోను రామునితోనుంజెప్పెను. అని, తాత్పర్యము.

ఏతత్తు వచనం శ్రుత్వా లక్ష్మణస్య మహాత్మనః
ఉవాచ రామం కౌసల్యా రుదంతీ శోకలాలసా. ౧౯

టీక॥మహాత్మనః= అధికమయినపరాక్రమముగల;లక్ష్మణస్య=లక్ష్మణుని యొక్క;ఏతత్ =ఈ ; వచనం—మాటను;శ్రుత్వాతు=వినినంతనె ; కౌసల్యా=కౌసల్య; రుదంతీ=ఏడ్చుచు;శోకలాలసా=దుఃఖముచేనధికేచ్ఛగలదై; రామం=రామునిగూర్చి; ఉవాచ=పలికెను.

మహాపరాక్రమ శాలియగు లక్ష్మణుండు చెప్పినమాటనువిని, కౌసల్యయేడ్చుచు,తిను దుఃఖంబునకంతంబు గల్గునేమోయనికోరి, రామునింజూచి యిట్లని చెప్పెను. అని,తాత్పర్యము.

భ్రాతుస్తే వదతః పుత్ర లక్ష్మణస్య శ్రుతం త్వయా
యదత్రా నంతరం కార్యం కురుష్వ యది రోచతే. ౨౦

టీక॥పుత్ర=కొడుకా! తే=నీయొక్క; భ్రాతుః=తమ్ముడగు; లక్ష్మణస్య= లక్ష్మణుండు; వదతః=చెప్పుచుండఁగా ; త్వయా—నీచేత; శ్రుతం = వినఁబడినదాః అత్ర=ఈవిషయమందు; అనంతరం— వెనుక ; కార్యం=చేయఁదగిన యత్ =ఏదో;రోచతేయది= రుచించునేని;తత్ (అధ్యాహృతము)=దానిఁకురుష్వ—చేయుము.

రాముఁడా! నీతమ్ముఁడగులక్ష్మణుండుచెప్పు మాటలను విన్నావుగదా!ఇంకనికదియుచించునేని, పైనఁజేయవలసిన కార్యముం,జేయుము. అని,తాత్పర్యము.

నచాధర్మ్యం వచశ్శ్రుత్వా సపత్న్యా మమ భాషితమ్
విహాయ శోకసంతప్తాం గంతు మర్హసి మామితః. ౨౧

టీక॥ మమ = నాయొక్క ; సపత్న్యా = సవతిచేత ; భాషితం—పలు

క్కఁబడిన; అధర్మ్యం = ధార్మికంబు కాని; వచః=మాటను ; శ్రుత్వా=విని; శోకసంతప్తాం = దుఃఖముచేతఁదపింపఁజేయఁబడిన ; మాం=నన్ను ; విహాయ= విడిచి; ఇతః=ఇచ్చటనుండి ; గంతుం=పోవుటకు ; నార్హసి=తగవు.

నాచవతి చెప్పినయధర్మవచనంబు విని, దుఃఖంబునఁదపించుచున్ననన్ను విడిచి, నీవువనంబున కెంతమాత్రమును బోఁగూడదు. అని, తాత్పర్యము.

ధర్మజ్ఞ యది ధర్మిష్ఠో ధర్మం చరితు మిచ్ఛసి
శుశ్రూష మామిహ స్థస్త్వం చరధర్మ మనుత్తమమ్. ౨౨

టీక॥ధర్మజ్ఞ = ధర్మముల నెఱింగినరామునిఁడా! త్వం=నీవు; ధర్మిష్ఠః=పరమధార్మికుఁడవై; ధర్మం=ధర్మమును; చరితుం=చేయుటకు; ఇచ్ఛసి=యది=కోరుదువేని; ఇహస్థః=ఇచ్చటనున్నవాఁడవై; మాం=నన్ను; శుశ్రూష=సేవింపుము. అనుత్తమం=తనకన్నశ్రేష్ఠములేని; ధర్మం = ధర్మమును; చర=చేయుము.

రామునిఁడా! నీవుసమస్తధర్మంబుల నెఱింగినవుఁ, నీవు, ధర్మంబాచరింపవలెననుకోర్కెగలదేని, నీవిచ్చటనెయుండి, నాకుశుశ్రూషసేయుచు, శ్రేష్ఠంబయినయీధర్మంబాచరింపుము; మాతృశుశ్రూష కన్ననధికమయిన ధర్మము, లేదు. అని, తాత్పర్యము.

శుశ్రూషుః జననీం పుత్ర స్వగృహే నియతో వసన్
పరేణ తపసా యుక్తః కాశ్యపస్త్రిదివం గతః. ౨౩

టీక॥ పుత్ర = కొడుకా ! కాశ్యపః=కాశ్యపుఁడు; జననీం=తల్లిని ; శుశ్రూషుః= సేవించుచు; స్వగృహే=తనయింటియందు; నియతః=నియమంబు గలవాఁడై; వసన్=ఉండుచు; పరేణ= అధికమయిన; తపసా=తపముతో; యుక్తః=కూడినవాఁడై; త్రిదివం=స్వర్గమును; గతః=పొందినాఁడు.

రామునిఁడా! మున్ను, కాశ్యపుండు, తల్లికి శుశ్రూషచేయుచుఁ దనయింటనెనియమంబుతోనుండి, యందువలనమహాతపస్సునొంది, స్వర్గంబునొందెను. అని, తాత్పర్యము.

యథైవ రాజా పూజ్యస్తే గౌరవేణ తథా హ్యహమ్
త్వాం నాహ మనుజానామి న గంతవ్య మితో వనమ్. ౨౪

టీక॥ తే=నీకు; యథా=ఎట్లు; గౌరవేణ=గురుత్వముచేత; రాజా=దశరథమహారాజు; పూజ్యః=పూజింపఁదగినవాఁడో; తథైవ=అట్లే; అహం=నేను; పూజ్యా(అధ్యాహృతము)హి = పూజింపఁదగినదాననుగదా! అహం = నేను; త్వాం=నిన్ను; నానుజానామి=అనుమతింపను. ఇతః=ఇచ్చటనుండి; వనం=అడవినిగూర్చి; నగంతవ్యం= పోఁగూడదు.

నీకు, ఎట్లు, తండ్రియగుటచేదశరథమహారాజు మాటప్రకారము నడుచుకొనవలసియున్నదో, అట్లె, నేనునీకుఁదల్లినిగావున, నామాటప్రకారమునీకవశ్యమునడుచుకొనవలసి యుండుటతప్పదు; నీవడవికిఁబోవుటకు నేనుసమ్మతింపను; నీవయోధ్యవిడిచి యెంత మాత్రము, వనంబునకుఁబోఁగూడదు.

అని, తాత్పర్యము.

త్వద్వియోగా న్న మే కార్యం జీవితేన సుఖేనవా
త్వయా సహ మమ శ్రేయ స్తృణానా మపి భక్షణమ్. ౨౫

టీక॥ త్వద్వియోగాత్ = నీయెడఁబాటుకంటె; పరం(అధ్యాహృతము)= వెనుకను; మే=నాకు; జీవితేన=బ్రతుకుచేఁగాని; సుఖేనవా=సుఖముచేఁగాని; కార్యం=పని; న=లేదు. త్వయాసహ= నీతోఁగూడ; తృణానాం=గడ్డియొక్క; భక్షణమపి=తినుటయును; మమ = నాకు; శ్రేయః=మంచిది.

నీవులేకున్నచో, నాకుబ్రతుకుటకైసుఖంబేటికి? నీతోఁగూడగడ్డితినుచుండుటయయిననునాకుమంచిది.

అని, తాత్పర్యము.

యది త్వం యాస్యసి వనం త్యక్త్వా మాం శోకలాలసామ్
అహం ప్రాయ మిహాసిష్యే నహి శక్ష్యామి జీవితుమ్. ౨౬

టీక॥ త్వం = నీవు; శోకలాలసాం= దుఃఖముచేఁ జపలనైయున్న; మాం=నన్ను; త్యక్త్వా=విడిచి; వనం = అడవిని; యాస్యసియది = పొందుదువేని; అ

హం=నేను;ఇహ=ఇచ్చట;ప్రాయం;ఏమియుఁదినకుండుప్రవతము;ను;ఆసిష్యే=అవలంబించెదను.జీవితుం= బ్రతుకుటకు;నశక్ష్యామిహి=చాలనుగదా.

నేనిట్లుదుఃఖంబునం బరితపించుచుండఁగా , నీవునన్నువిడిచియడవి కేగుదు వేని , యటుపిమ్మటనే నెంతమాత్రముజీవింపంజాలను; ఏమియుఁదినక నీరుద్రాఁగకుండి యయినను బ్రాణంబుల విడుతును. అని, తాత్పర్యము.

తత స్త్వం ప్రాప్స్యసే పుత్ర నిరయం లోకవిశ్రుతమ్
బ్రహ్మహత్యామివా ధర్మా త్సముద్ర స్సరితాం పతిః. ౨౭

టీక॥పుత్ర=కొమరుకా! తతః= అందువలన; త్వం=నీవు;సరితాం= నదులకు ; పతిః = పెనిమిటియయిన; సముద్రః=సముద్రుఁడు; అధర్మాత్ = అధర్మమువలన,పిప్పలాదమునికిఁ జేసిన యపకారమువలననుట ; బ్రహ్మహత్యామివ =బ్రాహ్మణుండగుపిప్పలాదమునివలనఁగలిగినకష్టమునుంబోలె; లోకవిశ్రుతం=లోకములందుఁబ్రసిద్ధమయిన; నిరయం=దుర్గతిని;ప్రాప్స్యసే=పొందఁగలవు.

అట్లునీనిమిత్తమునేను బ్రాణంబులు విడుచుటంజేసి,సముద్రుండు పిప్పలాదమునికినపకారముచేసి యతనికోపంబునఁ గష్టంబునొందినట్లు, సమస్తలోకంబులనుబ్రసిద్ధికెక్కి- నదుర్గతిం బొందఁగలవు. అని,కౌసల్యరామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

విలపంతీం తథాదీనాం కౌసల్యాం జననీం తతః
ఉవాచ రామో ధర్మాత్మా వచనం ధర్మసంహితమ్. ౨౮

టీక॥ తతః=అటుపిమ్మట ; ధర్మాత్మా=ధర్మమునందేబుద్ధిగల ; రామః=రాముఁడు; తథా=అట్లు;విలపంతీం=ఏడ్చుచున్నదియును,దీనాం= దుఃఖమునొందినదియును ; జననీం=తల్లియునగు;కౌసల్యాం = కౌసల్యనుగూర్చి; ధర్మసంహితం= ధర్మముతోఁగూడిన;వచనం=మాటను; ఉవాచ=చెప్పెను.

అంత, నట్లువిలపించుచుదుఃఖితయై యున్నతల్లినిగౌసల్యంజూచి, ధర్మాత్ముండగు రాముండు, ధర్మమునవలం

టించి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

నాస్తి శక్తిః పితు ర్వాక్యం సమతి క్రమితుం మమ
ప్రసాదయే త్వాం శిరసా గంతు మిచ్ఛా మ్యహం వనమ్. ౨౯

టీక॥ పితుః=తండ్రియొక్క ; వాక్యం=మాటను ; సమతిక్రమితుం= మీఱుటకు; మమ=నాకు ; శక్తిః=సామర్థ్యము; నాస్తి=లేదు . త్వాం = నిన్ను ; శిరసా=తలచేత;ప్రసాదయే=వేడుకొనుచున్నాను. అహం= నేను ; వనం=అడవిని; గంతుం=పొందుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

తండ్రిమాట నతిక్రమింప నాచేతఁగాదు; సాష్టాంగంబుగనమస్కరించిని న్నువేఁడుకొనెదను;నేనడవికింబోవలె; పోనిమ్ము. అని, తాత్పర్యము.

ఋషిణాచ పితు ర్వాక్యం కుర్వతా వ్రతచారిణా
గౌ ర్హతా జానతా ధర్మం కండునాపి విపశ్చితా. ౩౦

టీక॥ ఋషిణాచ=దివ్యజ్ఞానముగలవాఁడును;వ్రతచారిణా= వ్రతములం బొందినవాఁడును; ధర్మం=ధర్మమును;జానతా=తెలిసినవాఁడును; విపశ్చితా=పండితుండును; పితుః = తండ్రియొక్క;వాక్యం = మాటను; కుర్వతా=చేయువాఁడునగు; కండునాపి=కండువనుమునిచేతనుగూడ;గౌః = ఆవు;హతా=చంపఁబడినది.

దివ్యజ్ఞానముగలవాఁడును ఎల్లప్పుడునువ్రతంబులు సేయుచుండువాఁడును ధర్మరహస్యం బెఱింగినవాఁడును బండితుఁడునగుకండుమహర్షియును, దండ్రిపనుపు సేయంబూని, ఆవునుంగూడఁజంపినాఁడు.అని, తాత్పర్యము.

అస్మాకం చ కులే పూర్వం సగరస్యాజ్ఞయా పితుః
ఖనద్భి స్సాగరై ర్భూమి మవా ప్త స్సుమహా న్వధః. ౩౧

టీక॥అస్మాకం=మాయొక్క; కులే=వంశమునందును; పూర్వం=మును పు;పితుః=తండ్రియగు; సగరస్య=సగరుని యొక్క;ఆజ్ఞయా = ఆజ్ఞచేత;

భూమిం=నేలను; ఖనద్భిః = త్రవ్వుచున్న; సాగరైః=సగరునికొడుకులచేత; సుమహాన్ = మిక్కిలియుగొప్పదైన, భయంకరమయినయనుట; వధః=చంపఁబడుట; అవాప్తః=పొందఁబడినది.

మున్ను, మావంశంబునందును, దండ్రి సగరునియాజ్ఞచే, సగరపుత్రులందఱు, భూమింద్రవ్వి, భయంకరంబుగా, మరణంబునొందిరి; అట్లు, వారలు ప్రాణంబులంబోఁగొట్టుకొనియయినను దండ్రియాజ్ఞంబాలించిరి; కొంతకాలమడవియందుసుఖంబుండుట కేమికష్టము?

అని, తాత్పర్యము.

జామదగ్న్యేన రామేణ రేణుకా జననీ స్వయమ్
కృత్తా పరశునా రణ్యే పితు ర్వచనకారిణా. ౩౨

టీక॥ పితుః=తండ్రియొక్క; వచనకారిణా = మాటనుజేయునట్టి; జామదగ్న్యేన = జమదగ్నికొడుకైన; రామేణ=పరశురామునిచేత; అరణ్యే=అడవియందు; స్వయం=తనచేతనే; జననీ= తల్లియగు; రేణుకా = రేణుక; పరశునా=గొడ్డలిచే; కృత్తా=నఱుకఁబడినది.

జమదగ్ని కొడుకు పరశురాముండు, తండ్రివాక్యంబు సేయంబూని, యరణ్యంబునగొడ్డలిచేఁ దన్నుగన్న తల్లియగు రేణుకనుంజంపినాఁడు; అట్లుండుటం జేసి, నీకుదుఃఖంబైనను నేనుదండ్రియాజ్ఞ చొప్పున నడవికిఁ బోవుటవలన నేమియు దోషములేదు.

అని, తాత్పర్యము.

ఏతై రన్యైశ్చ బహుభి ర్దేవి దేవసమైః కృతమ్
పితు ర్వచన మక్లీబం కరిష్యామి పితు ర్హితమ్. ౩౩

టీక॥ దేవి=తల్లీ! ఏతైః=వీరును; అన్యైశ్చ=ఇతరులునగు; దేవసమైః = దేవతలతో సమానులయినవారలచేత; కృతం=చేయఁబడిన; పితుః=తండ్రికి; హితం=ఇష్టమయిన; పితుః = తండ్రియొక్క; వచనం=మాటను; అక్లీబం= వ్యర్థముగానట్లుగా; కరిష్యామి=చేసెదను.

తల్లీ! దేవసమానులయిన కందుమహర్షి మొదలగువారలును ఇంకనితరు

అనుజ్ఞేసినట్లు, నేనును, నాతండ్రికిసంతోషంబుగలుగునట్లు, నాతండ్రియాజ్ఞ చొప్పునం జేసెదను. అని, తాత్పర్యము.

న ఖల్వేతన్మయైకేన క్రియతే పితృశాసనమ్
ఏతై రపి కృతం దేవి యే మయా తవ కీర్తితాః. ౩౪

టీక॥ దేవి=తల్లీ! మయా= నాచేత; ఏకేన=ఒక్కనిచే; ఏతత్=ఈ; పితృశాసనం=తండ్రియాజ్ఞ ; నక్రియతే ఖలు=చేయఁబడలేదుగదా! యే=ఎవరు; మయా=నాచేత;తవ=నీకు; కీర్తితాః=చెప్పఁబడినారో;ఏతైరపి = వీరిచేతనుగూడ; కృతం= చేయఁబడినది.

తల్లీ! నేనొకఁడనే తండ్రియాజ్ఞ చొప్పునంజేయుటలేదుగదా! ఇప్పుడు నేను నీకుఁజెప్పిన మహాత్ములును జేసియున్నారే. అని, తాత్పర్యము.

నాహం ధర్మ మపూర్వం తే ప్రతికూలం ప్రవర్తయే
పూర్వై రయ మభిప్రేతో గతో మార్గోఽనుగమ్యతే. ౩౫

టీక॥అహం=నేను ; అపూర్వం= ముందులేనిదియు;ప్రతికూలం = పూర్వాచారమునకు విరుద్ధమునగు ; ధర్మం=ధర్మమును; తే= నీకొఱకు; న ప్రవర్తయే=జరిగింపలేదు.పూర్వైః= మునుపటివారిచేత ; అభిప్రేతః = అంగీకరింపఁబడినదియు ; గతః=పొందఁబడినదియునగు;మార్గః=దారి;అనుగమ్యతే=అనుసరింపఁబడుచున్నది.

నేను,నీవుదుఃఖింపవలెనని, ఇదివఱకులేక పూర్వాచారమునకు విరుద్ధమై యుండుక్రొత్తధర్మము నేయలేదు; మునుపటి వారు మహాత్ములంగీకరించి యాచరించినపద్ధతిని, అనుసరించెదను, గాని, వేఱుగాదు.అని, తాత్పర్యము.

త దేతత్తు మయా కార్యం క్రియతే భువి నాన్యథా
పితుర్హి వచనం కుర్వ న్నకశ్చి న్నామహీయతే. ౩౬

టీక॥భువి=భూలోకంబునందు; కార్యం=చేయఁదగిన;తత్=అట్టి;ఏతత్=

ఈపిత్రృవచనము; మయాతు=నాచేత మాత్రము;అన్యథా= వేఱువిధముగా; నక్రియతే=చేయఁబడదు . కశ్చిన్నా మ=ఒకానొకండును ; పితుః=తండ్రి యొక్క; వచనం=మాటను;కుర్వన్ ; చే యుచు;నహీయతేహి=చెడఁడుగదా! భూలోకంబునముఖ్యముగాఁ జేయ వలసినదగునీ పితృవచనమును , నేను మాత్రము, చేయకుండఁజాలను;అవశ్య ముచేయుదును ; ఒకవేళఁదల్లి మొద లగునితరులకుదుఃఖంబు సంభవిల్లినను, దండ్రిపనుపునెఱవేర్చువానికి దోషం బును గలుగదు. అని, రాముండు కౌస ల్యతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తా మేవ ముక్త్వా జననీం లక్ష్మణం పున రబ్రవీత్
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠశ్శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్. ౩౭

టీక॥ వాక్యవిదాం=మాటలు దెలి సినవారిలో; శ్రేష్ఠః = మేటియయిన వాఁడును;సర్వధనుష్మతాం= అందటి విలుకాండ్రలోపలను; శ్రేష్ఠః= మేటి యయినవాఁడునగు రాముండు ; జన నీం=తల్లియగు;తాం = ఆకౌసల్యను గూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా = చె ప్పి; పునః=అటుపిమ్మట; లక్ష్మణం= లక్ష్మణునిగూర్చి;అబ్రవీత్ =చెప్పెను. చక్కఁగామాటలాడు వారలలో శ్రేష్ఠుండునువిలుకాండ్రయందఱిలోను మేటియునగురాముండు, తల్లియగుకౌ సల్యతోనీప్రకారముచెప్పి,యంత,లక్ష్మ ణునిం జూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

తవ లక్ష్మణ జానామి మయి స్నేహ మనుత్తమమ్
విక్రమం చైవ సత్త్వంచ తేజశ్చ సుదురాసదమ్. ౩౮

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! తవ= నీయొక్క;మయి=నాయందు; అనుత్త మం=తనకన్ననధికములేని; స్నేహం= స్నేహమును;సుదురాసదం= పొందఁ గూడని; విక్రమంచైవ= పరాక్రమం బును;సత్త్వంచ=బలమును; తేజశ్చ= ప్రభావంబును; జానామి = ఎఱుం గుదును. లక్ష్మణుఁడా!నీకునాయందత్యంతస్నే హంబుగలుగుటయు , నీయత్యంతశౌర్య

మంబును బలంబును బ్రభావంబును మ
తి యెవ్వరియందును లేకుండుటయు,
నే కొఱుంగుదును. అని, తాత్పర్యము.

మమ మాతు ర్మహ ద్దుఃఖ మతులం శుభలక్షణ
అభిప్రాయ మవిజ్ఞాయ సత్యస్యచ శమస్యచ. ౩౯

టీక॥శుభలక్షణ—మంగళకరములయి
నలక్షణములుగలలక్ష్మణుఁడా! సత్యస్య
చ=సత్యముయొక్కయు; శమస్యచ—
శాంతియొక్కయు;అభిప్రాయం= ర
హస్యమును;అవిజ్ఞాయ— తెలియక;మ
మ—నాయొక్క;మాతుః = తల్లికి;మ
హాత్ = అధికమయినదియును;అతు
లం=సరిలేఁదియునగు; దుఃఖం=దుఃఖ
ము;భవతి(అధ్యాహృతము)= అగుచు
న్నది.

మంగళ కరములగు లక్షణములుగ
లలక్ష్మణుఁడా!సత్యంబును శాంతియును
జక్కఁగాఁ దెలియమింజేసి,మాతల్లియ
గుకౌసల్యకుమిగుల దుఃఖంబుగలుగు చు
న్నది;నీకవి దెలిసియు, నీ వేలయిట్లుపలు
కుచున్నావు?అని, తాత్పర్యము.

ధర్మోహి పరమో లోకే ధర్మేసత్యం ప్రతిష్ఠితమ్
ధర్మసంశ్రిత మే తచ్చ పితు ర్వచన ముత్తమమ్. ౪౦

టీక॥లోకే — ప్రపంచమందు;ధ
ర్మః=ధర్మము;పరమోహి— శ్రేష్ఠ
ముగదా! ధర్మే—ధర్మమునందు;స
త్యం—సత్యము;ప్రతిష్ఠితం=ప్రతిష్ఠింపఁ
బడినది.ఉత్తమం — శ్రేష్ఠమయిన;ఏ
తత్=ఈ;పితుః = తండ్రియొక్క;వచ
నంచ=మాటయును;ధర్మసంశ్రితం=
ధర్మము నొందినది, ధర్మమే ఫలము
గాఁగలదనుట.

ప్రపంచంబున సర్వపురుషార్థము
లలోను ధర్మంబుశ్రేష్ఠంబు; సత్యంబు
నధర్మంబుగలుగును ; ఉత్తమంబగునీ
పితృవాక్యపరిపాలనంబువలనను, అధి
కధర్మంబుగలుగును; నేను,“దశరథుం
డాజ్ఞాపించినట్లు చేసెదను” అని కైక
యితోఁ జెప్పినాను ; దశరథునియాజ్ఞ
యునైనది; కావున,సత్యంబును , పి
తృవాక్య పరిపాలనంబును , ఈరెండు
నునావశ్యముచేయవలసినది.
అని, తాత్పర్యము.

సంశ్రుత్యచ పితుర్వాక్యం మాతుర్వా బ్రాహ్మణస్యవా
నకర్తవ్యం వృథా వీర ధర్మమాశ్రిత్య తిష్ఠతా. ౪౧

టీక॥వీర — పరాక్రమశాలివగులక్ష్మణుఁడా! పితుః=తండ్రికిఁగాని; మాతుర్వా=తల్లికిఁగాని ; బ్రాహ్మణస్యవా=బ్రాహ్మణునకుఁగాని ; సంశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి; వాక్యం—మాటను; ధర్మం=ధర్మమును; ఆశ్రిత్య = ఆశ్రయించి; తిష్ఠతా=ఉన్నవానిచేత; వృథా—వ్యర్థముగా ; నకర్తవ్యం=చేయఁబడరాదు.

లక్ష్మణుఁడా ! నీవుమిక్కిలియుఁబరాక్రమశాలివే ; అందుకుసంతసించెదను; అయితే , తండ్రికిఁగానితల్లికిఁగాని బ్రాహ్మణునకుఁగాని, ఏదైననుజేసెదనని ప్రతిజ్ఞ చేసి, యామాటను ఎంతమాత్రము , ధర్మమునుగోరువాఁడు, తప్పరాదు.

అని, తాత్పర్యము.

సోహం న శక్ష్యామి పితుర్నియోగ మతివర్తితుమ్
పితుర్హి వచనాద్వీర కైకేయ్యాహం ప్రచోదితః. ౪౨

టీక॥వీర=పరాక్రమశాలివగులక్ష్మణుఁడా! సః=అట్టి; అహం — నేను; పితుః=తండ్రియొక్క; నియోగం— ఆజ్ఞను; అతివర్తితుం—అతిక్రమించుటకు; నశక్ష్యామి=చాలను. అహం = నేను; పితుః—తండ్రియొక్క; వచనాద్ధి=మాటవలననే గదా! కైకేయ్యా=కైకేయిచేత; ప్రచోదితః = ప్రేరేపింపఁబడినాను.

పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! నేనట్లుతండ్రియాజ్ఞ చొప్పునంగావించెదనని ప్రతిజ్ఞ చేసి, తండ్రిమాటనతిక్రమింపం జాలను ; అయితే , తండ్రినన్నాజ్ఞాపింపలేదే, కైకేయియేగదానితోఁజెప్పినదనియడుగుదువుకాఁబోలు; తండ్రియాజ్ఞ ననుసరించియొకవా కైకేయినన్నుఁ బ్రేరేపించినది.

అని, తాత్పర్యము.

తదేనాం విసృజానార్యాం క్షత్రధర్మాశ్రితాం మతిమ్
ధర్మమాశ్రయ మాతైక్ష్ణ్యం మద్బుద్ధిరనుగమ్యతామ్. ౪౩

టీక॥ తత్ = అందువలన; అనార్యాం=మంచిదికానిదియును ; క్షత్రధర్మాశ్రితాం = క్షత్త్రియులధర్మము న్నాశ్రయించినదియునగు; ఏనాం=ఈ; మతిం=బుద్ధిని ; విస్పృజ=విడువుము. ధర్మం=ధర్మమును; ఆశ్రయ= ఆశ్రయింపుము. తైక్ష్ణ్యం=క్రూరత్వమును; మా(ఆశ్రయ) = ఆశ్రయింపకుము. మద్బుద్ధిః=నాయొక్క-మతము; అనుగమ్యతాం=అనుసరింపఁబడుఁగాక.

అందువలన, నీవిట్లు, క్షాత్రంబునవలంబించి, ధర్మంబునువిడిచి, యధర్మవచనంబులంబలుకవలదు; ధర్మమునాశ్రయింపుము; క్రౌర్యంబునువిడువుము; నాయిష్టముచొప్పుననుండుము. అని, రాముండులక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— ఈరామాయణంబునధర్మస్థాపనంబుముఖ్యముగాఁజెప్పఁబడుచున్నది. అది, "ధర్మంబునిష్ప్రయోజనంబు, నీతినిమాత్రమెయాశ్రయింపవలెను" అను నాస్తిక మతమును ఖండించి చేకొఁదగినది . కావునఁదదర్థమైలక్ష్మణుండునాస్తిక మతము నుపన్యసింపఁగా , రాముండు, దానిఖండించి, ధర్మస్థాపనమును జేయును. కాని, లక్ష్మణునియభిప్రాయమదికాదు. అనిగోవిందరాజులు, వచించిరి.

తమేవ ముక్త్వా సౌహార్దా ద్భ్రాతరం లక్ష్మణాగ్రజః
ఉవాచ భూయః కౌసల్యాం ప్రాంజలి శ్శిరసా నతః. ౪౪

టీక॥ లక్ష్మణాగ్రజః = లక్ష్మణుని యన్నయయిన రాముఁడు ; సౌహార్దాత్=స్నేహమువలన ; తం= ఆ ; భ్రాతరం = తమ్ముఁడగులక్ష్మణునిగూర్చి ; ఏవం=ఇట్లు ; ఉక్త్వా=చెప్పి ; ప్రాంజలిః = మంచిచేమోడ్పుగలవాఁడై; శిరసా=తలచేత; నతః=నమస్కరించినవాఁడై ; భూయః=మరల; కౌసల్యాం = కౌసల్యనుగూర్చి ; ఉవాచ=చెప్పెను.

రాముండు, భ్రాతృస్నేహంబున, నిట్లు, లక్ష్మణునకుంజెప్పి , యంతమఱలఁగౌసల్యంజూచి , చేతులుమొగిడ్చిసాష్టాంగంబుగనమస్కరించి, యిట్లని, చెప్పెను. అనితాత్పర్యము.

అనుమన్యస్వ మాం దేవి గమిష్యన్తమితో వనమ్
శాపితాసి మమ ప్రాణైః కురు స్వస్త్యయనాని మే. ౪౫

టీక॥ దేవి=తల్లీ! ఇతః = ఇచ్చట నుండి; వనం=అడవినిగూర్చి; గమిష్యంతం=పోఁబోవుచున్న; మాం=నన్ను; అనుమన్యస్వ=అనుమతింపుము. మమ=నాయొక్క; ప్రాణైః= ప్రాణములచేత; శాపితా= ఒట్టుపెట్టుకొనునట్లు చేయఁబడిన దానవు; అసి=అగుచున్నావు; మే=నాకొఱకు; స్వస్త్యయనాని= ఆశీర్వచనములను; కురు= చేయుము.

తల్లీ! నేనయోధ్యవిడిచియడవికిఁబోవనిశ్చయించితిని; నామీఁదఁదప్పులు చెప్పక సమ్మతింపుము; నాప్రాణములపై నొట్టుపెట్టెదను; మఱియు నాకేమియుఁగష్టము కలుగకుండునట్లాశీర్వదింపుము. అని, తాత్పర్యము.

తీర్ణప్రతిజ్ఞశ్చ వనాత్పునరేష్యామ్యహం పురీమ్
యయాతిరివ రాజర్షిః పురా హిత్వా పునర్దివమ్. ౪౬

టీక॥ అహం=నేను; తీర్ణప్రతిజ్ఞశ్చ= దాఁటఁబడిన ప్రతిజ్ఞగలవాఁడనైనంతనే, నెఱవేర్పఁబడిన ప్రతిజ్ఞగలవాఁడనైనంతనేయనుట; రాజర్షిః=రాజునుబుషియునగు; యయాతిః=యయాతిమహారాజు; పురా=మున్ను; దివం (అధ్యాహృతము) = స్వర్గమును; హిత్వా=విడిచి; పునః=మఱల; దివమివ=స్వర్గమునుంబోలె; వనాత్=అడవినుండి; పునః=మఱల; పురీం= అయోధ్యాపట్టణమును; ఏష్యామి= పొందెదను.

రాజర్షియగు యయాతిమహారాజు స్వర్గమునుండి మఱల స్వర్గమును బొందినట్లు, నేనును, నాప్రతిజ్ఞ నెఱవేర్చికొనినంతనే, యడవిని విడిచి, మఱలనీయయోధ్యాపట్టణంబునకు, వచ్చెదను. అని, తాత్పర్యము.

శోకస్సంధార్యతాం మాతర్హృదయే సాధు మా శుచః
వనవాసాదిహైష్యామి పునః కృత్వా పితుర్వచః. ౪౭

టీక॥ మాతః=తల్లీ! శోకః = దుఃఖము; హృదయే=మనసునందు; సాధు=

స్సగాః;సంధార్యతాం= ధరింపఁబడుఁ గాక,అణఁచుకొనఁబడుఁగాక యనుట. మాశుచః=దుఃఖింపకుము. పితుః=తండ్రియొక్క;వచః=మాటను; కృత్వా= చేసి; వనవాసాత్=వనవాసమునుండి; పునః=మరల;ఇహ=ఇచ్చటికి; ఏష్యామి=వచ్చెదను.

తల్లీ! నీవిట్లు దుఃఖింపవలదు; దుఃఖంబును మనంబులోనే చక్కఁగా నణంచుకొనుము; నేను దండ్రిపనుపుం గావించినంతనె వనంబువిడిచి, యిచ్చటికి వచ్చెదను. అని, తాత్పర్యము.

త్వయా మయాచ వైదేహ్యా లక్ష్మణేన సుమిత్రయా
పితు ర్నియోగే స్థాతవ్య మేష ధర్మ స్సనాతనః. ౪౧

టీక॥ త్వయా=నీచేతను ; మయా చ=నాచేతను; వైదేహ్యా= సీతచేతను;లక్ష్మణేన=లక్ష్మణునిచేతను ; సుమిత్రయా=సుమిత్రచేతను;పితుః= తండ్రియగు దశరథమహారాజుయొక్క ; నియోగే=ఆజ్ఞయందు;స్థాతవ్యం= ఉండుటకావలసినది. ఏషః=ఇది ; సనాతనః=శాశ్వతమయిన;ధర్మః = ధర్మము.

దశరథుని యాజ్ఞకులోఁబడవలసినది నాకుమాత్రమె కాదు; నీవును, సుమిత్రయును లక్ష్మణుండును సీతయును గూడ, అట్లు దశరథునియాజ్ఞకులోఁబడవలసియున్నది; ఇదియె శాశ్వతంబగు ధర్మంబు.అని, తాత్పర్యము.

అంబ సంహృత్య సంభారాన్ దుఃఖం హృది నిగృహ్యచ
వనవాసకృతా బుద్ధి ర్మమధర్మ్యా౽నువర్త్యతామ్. ౪౨

టీక. అంబ=తల్లీ!సంభారాన్=అభిషేకద్రవ్యములను;సంహృత్య = విడిచి;దుఃఖం=దుఃఖమును;హృది=మనసునందు; నిగృహ్యచ=అణఁచుకొనియు; మమ=నాయొక్క;ధర్మ్యా= ధర్మముతోఁగూడిన;వనవాసకృతా= వనవాసమునందుఁజేయఁబడిన;బుద్ధిః= తలంపు;అనువర్త్యతాం= అనుసరింపఁబడుఁగాక.

తల్లీ!ఇప్పుడు,నాపట్టాభిషేక మునకై నీవుసంగ్రహించియుండు ద్రవ్యంబులనువిడిచి, దుఃఖంబును మనంబుననణం

దుకొని, ధర్మ్యంబగువనవాసము సేయవలెనను నాతలంపునకునీవునుసమ్మతింపుము. అని, తాత్పర్యము.

ఏతద్వచ స్తస్య నిశమ్య మాతా
సుధర్మ్య మవ్యగ్ర మవిక్లబంచ
మృతేవ సంజ్ఞాం ప్రతిలభ్య దేవీ
సమీక్ష్యరామం పున రిత్యువాచ. ౫౦

టీక॥ దేవీ=పట్టపురాణియగు; మాతా = తల్లియయిన కౌసల్య ; తస్య=ఆరామునియొక్క; సుధర్మ్యం=మిక్కిలియు ధర్మముతోఁ గూడినదియును; అవ్యగ్రం= కలఁతలేనిదియును; అవిక్లబంచ = దృఢంబైనదియునగు; ఏతత్=ఈ; వచః=మాటను;నిశమ్య=విని; మృతేవ=చచ్చినదియుంబోలె; సంజ్ఞాం = స్మృతిని;ప్రతిలభ్య=పొంది; రామం=రాముని; సమీక్ష్య=చూచి; ఇతి=ఇట్లని; పునః=మఱల; ఉవాచ=చెప్పెను.

పట్టపురాణియు రాముని తల్లియునగు నాకౌసల్య , రాముండు చెప్పిన ధర్మ్యంబును ధీరంబును దిరుగుపాటులేనిదియునగు మాటను విని, చచ్చినట్లుపడి,కొంతవడికిందెలివొంది , రామునింజూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

యథైవ తే పుత్త్ర పితా తథాహమ్
గురు స్స్వధర్మేణ సుహృత్తయాచ
న త్వానుజానామి న మాం విహాయ
సుదుఃఖితా మర్హసి గంతు మేవమ్. ౫౧

టీక॥ పుత్త్ర=కొడుకా!స్వధర్మేణ=నిజధర్మముచేతను; సుహృత్తయాచ=స్నేహముచేతను; తే=నీకు; పితా=తండ్రి;యథా=ఎట్లో;తథా = అట్లు;అహం=నేను; గురుః=గురువైనదానను. త్వా=నిన్ను;నానుజానామి=సమ్మతింపను.ఏవం=ఇట్లు;సుదుఃఖితాం= మిక్కిలియు దుఃఖము నొందియున్న

మాం=నన్ను; విహాయ = విడిచి; గంతుం=పోవుటకు; నార్హసి=తగవు.

కొడుకా! నిన్నుఁబోషించుటయను ధర్మంబునను స్నేహంబునను, నీకెట్లుతండ్రిగురువో, అట్లుతల్లినగునేనును గురువైనదానను; కాఁబట్టి, నాయనుజ్ఞ లేకనీవుపోఁగూడదు; నీకు వనంబునకుఁబోవ ననుజ్ఞ యొసంగను; నేనిట్లు మహాదుఃఖంబు నొందిపరితపించుచుండఁగా, నన్నువిడిచి, నీవుపోఁగూడదు.

అని, తాత్పర్యము.

కిం జీవితే నేహ వినా త్వయా మే
లోకేనవా కిం స్వధయా మృతేన
("సుధయామృతేన" ఇతిపాఠాంతరమ్.)
శ్రేయో ముహూర్తం తవ సన్నిధానమ్
మమేహ కృత్స్నాదపి జీవలోకాత్. ౫౩

టీక॥ మే=నాకు; త్వయావినా = నిన్నువిడిచి; ఇహ=ఇచ్చట; జీవితేన=బ్రతుకుచేత; కిం=ఏమిప్రయోజనము? లోకేనవా=పరలోకముచేతఁగాని; స్వధయావా = పితృలోకంబునొందినవుడు కొరకునట్టి స్వధయను నాహుతిచేతఁగాని; అమృతేన=స్వర్గమునొందినవుడు దొరకునట్టియమృతముచేతఁగాని; కిం= ఏమిప్రయోజనము? (పాఠాంతరపక్షమందు) సుధయా= స్వర్గమునొందినవుడుదొరకునమృతముచేతఁగాని; అమృతేన=మోక్షముచేతఁగాని; కిం=ఏమిప్రయోజనము? మమ=నాకు; ఇహ=ఇచ్చట; కృత్స్నాత్ = సమస్తమయిన; జీవలోకాత్=ప్రాణిలోకముకన్నను; ముహూర్తం= స్వల్పకాలమైనను; తవ=నీయొక్క, సన్నిధానం=సమీపమందుండుట; శ్రేయః=మంచిది.

నీవులేనిచో, నాకుబ్రతుకేల? పరలోకముతోనేమికార్యము? పితృలోకంబునంగలుగుస్వధనాకేఁదుకు? స్వర్గలోకంబునలభ్యమగు నమృతంబు నాకేల? (పాఠాంతరపక్షమందు, స్వర్గమునందు లభ్యమగునమృతంబు నాకేల? మోక్షంబైననునాకెందుకు?) నాకేదియునక్కఱలేదు, నాకు సమస్తప్రాణిలోకంబులకన్నను, కొంచెముసేపయినను నీసమీపమునుండుట, శ్రేష్ఠము.

అని, కౌసల్య రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

నరై రివోల్కాభి రపోహ్యమానో
మహాగజో ధ్వాన మనుప్రవిష్టః
భూయః ప్రజజ్వాల విలాప మేవం
నిశమ్య రామః కరుణం జనన్యాః. ౫౩

టీక॥ నరైః=మనుష్యులచేత ; ఉల్కాభిః=కొఱవికట్టెలచేత ; అపోహ్యమానః=అడ్డగింపఁబడుచున్న ; అధ్వానం= మార్గమును ; అనుప్రవిష్టః=ప్రవేశించిన; మహాగజఇవ=గొప్పయేనుంగుంబోలె; రామః = రాముండు; ఏవం=ఇట్లు;జనన్యాః=తల్లియొక్క; కరుణం= దుఃఖముగల్గించునట్టి; విలాపం=ఏడ్పును; నిశమ్య=వినీ; భూయః=మిక్కిలియును ; ప్రజజ్వాల=పరితపించెను.

మార్గంబునం బడి పోవుచున్నట్టి మహాగజంబు, మనుష్యులడ్డగించి కొఱవికట్టెలతోనదలింపఁగాఁ, బరితపించునట్లు, రాముండు, తనతల్లి యిట్లు మహాదుఃఖంబుతోఁజెప్పినమాటనువిని, మిగులం బరితపించెను. అని, తాత్పర్యము.

స మాతరం చైవ విసంజ్ఞకల్పా
మార్తంచ సౌమిత్రి మభిప్రతప్తమ్
ధర్మే స్థితో ధర్మ్య మువాచ వాక్యమ్
యథాసవే వాహతి తత్ర వక్తుమ్. ౫౪

టీక॥సః=ఆ రాముఁడు; ధర్మే=ధర్మమునందు;స్థితః = ఉన్నవాఁడై;విసంజ్ఞకల్పాం = స్మృతిలేనిదానితోసమానురాలైయున్న;మాతరంచైవ=తల్లినిగూర్చియు; ఆర్తం=దుఃఖమునొందినవాఁడును;అభిప్రతప్తం=పరితపించుచున్నవాఁడునగు; సౌమిత్రించ=సుమిత్రకొమరుఁడైన లక్ష్మణునిగూర్చియు; ధర్మ్యం = ధర్మముతోఁగూడిన; వాక్యం=మాటను;ఉవాచ=చెప్పెను. యథా = [illegible]; ఉవాచ(అధ్యాహృతము)=చెప్పెనో; తథా(అధ్యాహృత

ము)=అట్లు; తత్ర = ఆధర్మసంకట మునందు; వక్తుం=చెప్పుటకు; సఏవ=ఆ రాముఁడే; అర్హతి=తగును.

ఆ రాముండు, దృఢంబుగా ధర్మం బునవలంబించి, స్మృతిలేనట్లున్న తల్లిని, దుఃఖంబునం బరితపించుచున్న లక్ష్మణునిం జూచి, ధర్మ్యంబగు నీమాటం జెప్పెను; అట్టిధర్మసంకట కాలమునందు ఆ రాముండుదక్క, ముల్లోకంబుల యందును మఱియెవ్వండును, అట్లుమాటలాడం జాలఁడు.

అని, తాత్పర్యము.

అహం హి తే లక్ష్మణ నిత్య మేవ
జానామి భక్తించ పరాక్రమంచ
మమ త్వభిప్రాయ మసన్నిరీక్ష్య
మాత్రా సహాభ్యర్దసి మాం సుదుఃఖమ్. ౨౨

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! అహం=నేను; నిత్యమేవ=ఎల్లప్పుడును; తే=నీయొక్క; భక్తించ=భక్తిని; పరాక్రమంచ=పరాక్రమమును; జానామిఖలు= ఎఱుంగుదును గదా! త్వం (అధ్యాహృతము)=నీవు; మమ=నాయొక్క; అభిప్రాయం= అభిప్రాయమును; అసన్నిరీక్ష్యతు=చూడకనే; మాత్రాసహ = తల్లితోఁగూడ; మాం=నన్ను; సుదుఃఖం=మిక్కిలియుదుఃఖము గలుగునట్లు; అభ్యర్దసి = పీడించుచున్నావు.

లక్ష్మణుఁడా! నీకు నాయందుఁగల భక్తినీ పరాక్రమంబును నేనెఱుంగుదును గదా! నీవు, తల్లి కౌసల్యతోఁ జేరి, యిట్లు నాకు మిగులదుఃఖము గలుగునట్లు బాధించుచున్నావేమి?

అని, తాత్పర్యము.

ధర్మార్థకామాః ఖలు తాత లోకే
సమీక్షితా ధర్మ ఫలోదయేషు
తే తత్ర సర్వే స్యు రసంశయం మే
భార్యేవ వశ్యాఽభిమతా సుపుత్రా. ౨౩

టీక॥ తాత = నాయనా! లోకే= లోకమునందు; ధర్మఫలోదయేషు=

ధర్మఫలములయినవానిఁబొందికలయం దు; ధర్మార్థకామాః = ధర్మము నుఅర్థమునుగామమును; సమీక్షితాః ఖలు = చూడఁబడినవిగదా! తే = ఆధ ర్మార్థకామములు; సర్వే = అన్ని యును; తత్ర = ఆధర్మము నందు; స్యుః = కలుగును. మే = నాకు; అసంశ యం = సందేహములేదు. వశ్యా = స్వా ధీనురాలును; అభిమతా = ప్రియురాలు ను; సుపుత్రా = మంచికొడుకుగలదియు నగు; భార్యేవ = పెండ్లామువలె; ధ ర్మః, ధర్మకామార్థాన్, జనయ తి (అధ్యాహృతము) = ధర్మము, ధ ర్మకామార్థములను, గలిగించును.

నాయనా! లోకమునందు, ధర్మ మునాచరించువానికి, ధర్మార్థ కామ ములు మూడును, గలుగునని చెప్పఁబడి యున్నదిగదా! అట్లు, ఒకధర్మము నాచరించినచో, ధర్మార్థకామము లుమూడును సిద్ధించుననువిషయంబునం దు నాకుసందేహము లేదు; ఒక భా ర్యయే, భర్తకు స్వాధీనురాలై ధ ర్మమును, ప్రియురాలై కామమును, మంచికొడుకునుగని యర్థమును, సిద్ధిం పఁజేయునట్లు, ఒకధర్మమే, ధర్మము ను గామమును అర్థమును మూఁడిటిని, సిద్ధింపఁజేయును. అని, తాత్పర్యము.

యస్మింస్తు సర్వే స్యు రసన్నివిష్టా
ధర్మో యత స్స్యా త్త దుపక్రమేత
ద్వేష్యో భవ త్యర్థ పరో హి లోకే
కామాత్మతా ఖల్వపి న ప్రశస్తా. ౫౭

టీక॥ యస్మిన్ = ఏకర్మమునందు; సర్వే = ధర్మార్థకామములు మూడు ను; అసన్నివిష్టాః = కలుగనివి; స్యుః = అ గునో; తత్ (అధ్యాహృతము) = తు = ఆ కర్మమును మాత్రము; నోపక్రమేత (అ ధ్యాహృతము) = ఆరంభింపఁగూడ దు; యతః = ఏకర్మమువలన; ధర్మః = ధర్మము; స్యాత్ = కలుగునో; తత్ = దా నిని; ఉపక్రమేత = ఆరంభింపవలెను. లో కే = లోకమునందు; అర్థపరః = అర్థ మునందు మాత్రమాసక్తిగలవాఁడు; ద్వేష్యః = ద్వేషింపఁదగినవాఁడు; భవతి హి = అగుచున్నాఁడుగదా! కామాత్మ తాపి = కామమునందె బుద్ధిగలిగియుం

డుటయును; న ప్రశస్తాఃఖలు = శ్రేష్ఠము గాదుగదా!

ఏకర్మముచే ధర్మార్థ కామములలోనేదియుఁ గలుగనేరదో, దానిం జేయరాదు; అయితే, ఏకర్మమువలన ధర్మార్థకామములు మూఁడును సిద్ధించునో, దానినవశ్యము సేయవలయును; మఱియు, నేకర్మంబువలన, నర్థముగాని కామముగాని గలుగక ధర్మముమాత్రముగలుగునో, దానిం జేయవలయును; అయితే అర్థకామంబులరెండిటిని మాత్రమునిచ్చుకర్మమును మాత్రము సేయరాదు; ఎందువలననఁగా, అర్థమును మాత్రముగోరువానిం జూచి, లోకంబునందఱును నిందింతురు; అట్లు, కామమును మాత్రమె యవలంబించియుండువాఁడు లోకంబుననిందితుండగుచున్నాఁడు. అని, తాత్పర్యము.

గురుశ్చ రాజాచ పితాచ వృద్ధః
క్రోధా త్ప్రహర్షా ద్యదివాపి కామాత్
య ద్వ్యాదిశే త్కార్య మవేక్ష్య ధర్మం
క స్త న్నకుర్యా దనృశంసవృత్తిః. ౫౮

టీక॥ గురుశ్చ = ఆచార్యుఁడును; రాజాచ = రాజును; పితాచ = తండ్రియును; వృద్ధః = ముదుసలియునగువాఁడు; క్రోధాత్ = కోపమువలననఁగాని; ప్రహర్షాత్ = సంతోషమువలననఁగాని; కామాద్యదివాపి = కామము వలననఁగాని; యత్ = ఏ; కార్యం = పనిని; వ్యాదిశేత్ = ఆజ్ఞాపించునో; అనృశంసవృత్తిః = పాపిష్ఠవృత్తిలేనివాఁడు; కః = ఎవ్వఁడు; ధర్మం = ధర్మమును; అవేక్ష్య = చూచి; తత్ = ఆకార్యమును; న కుర్యాత్ = చేయకుండును?

ఆచార్యుండును రాజునుదండ్రియును వృద్ధుండునునగువాఁడు, కోపంబునంగాని సంతోషంబునంగాని కామంబునంగాని, యాజ్ఞాపించినప్పుడు, పాపిష్ఠుండుగాని వాఁడెవ్వండు, ధర్మంబెఱింగి తండ్రియాజ్ఞను శిరసావహించి, యాకార్యంబును జేయకుండును? పాపిష్ఠుండు మాత్రముసేయఁడుగాని, ధార్మికులందఱునుం జేయుదురు. అని, తాత్పర్యము.

స వై న శక్నోమి పితుః ప్రతిజ్ఞా

ఇమాం మకర్తుం సకలాం యథావత్
సహ్యావయో స్తాత గురు ర్నియోగే
దేవ్యాశ్చ భర్తా సగతి స్స ధర్మః. ౫౯

టీక॥ సః (అహం) = అట్టినేను ("వై" అనునదిపాదపూరణార్థము) ; పితుః=తండ్రియొక్క; ఇమాం=ఈ ; ప్రతిజ్ఞాం= ప్రతినను; సకలాం=అంతను; యథావత్=సరిగా; అకర్తుం= చేయకుండుటకు; నశక్నోమి=చాలను. తాత=నాయనా! ఆవయోః= మనకిద్దఱికిని; నియోగే=ఆజ్ఞాపించుటయందు; సః=ఆదశరథుండు; గురుః=ఆచార్యుఁడు ,ప్రభుండనుట. దేవ్యాశ్చ= తల్లియగుకౌసల్యకును; సః=ఆదశరథుఁడు;భర్తా=పెనిమిటి. సః=ఆదశరథుఁడు; గతిః=ప్రాప్యస్థానము ; సః=అది, అట్లుభర్తనే పొందియుండుటయనుట ; ధర్మః=ధర్మము.

నేనట్లుపాపిష్ఠుండఁగానుకావున ; తండ్రియాజ్ఞాపించిన కార్యము సంతయుఁజక్కఁగాఁ జేయకుండఁజాలను ; నాకుమాత్రమెకాదు ; దశరథుండు , తండ్రికావున, నీకును నాకును, ఆజ్ఞాపింపంగలవాఁడు; నాతల్లికౌసల్యకును పెనిమిటికావున, నతనియాజ్ఞచొప్పున నడువవలసినదే; మఱియునతని విడువఁగూడదు; అట్లు , పెనిమిటినివడువకుండుటభార్యకుధర్మము;కావున,ఈవిడ , భర్తనువిడిచి . నావెంటరాఁగూడదు.

అని, తాత్పర్యము.

తస్మిన్ పున ర్జీవతి ధర్మరాజే
విశేషత స్స్వే పథి వర్తమానే
దేవీ మయా సార్థ మితో పగచ్ఛేత్
కథంస్వి దన్యా విధవేవ నారీ. ౬౦

టీక॥ ధర్మరాజే=ధర్మమునకుఁబ్రభువైనవాఁడును, ధర్మమును బాలించువాఁడుననుట; విశేషతః= ఎక్కుగా; స్వే=తనదైన;పథి=మార్గమునందు; వర్తమానే = ఉన్నవాఁడునగు; తస్మిన్=ఆపెనిమిటియగుదశరథుండు

జీవతిపునః = బ్రతికియుండఁగానే; దేవీ = పట్టపురాణియగు కౌసల్యా; కథం స్విత్ = ఎట్లు; అన్యా = ఇతరమైన; విధవా = చనిపోయిన పెనిమిటిగల; నారీవ = స్త్రీయుంబోలె; మయాసార్ధం = నాతోఁగూడ; ఇతః = ఇచ్చటనుండి; అపగచ్ఛేత్ = వెడలును?

అట్టిపెనిమిటి యగు దశరథమహారాజు, ధర్మంబుగాపాడుచుఁ, బూర్వరాజులకన్న నెచ్చుగా స్వధర్మంబు దప్పక రాజ్యంబేలుచు బ్రతికియుండఁగానే, పట్టపురాణివై మెప్పుచుండు కౌసల్య మఱియొక్కతె విధవ స్త్రీ కొడుకు నాశ్రయించి పోవునట్లు , నాతోఁగూడవనంబునకెట్లు రావచ్చునా? ఎంతమాత్రమును రాఁగూడదు. అనిరాముండు, లక్ష్మణునితోఁ, జెప్పెను.

అని, తాత్పర్యము.

సా మానుమన్య స్వ వనం వ్రజంతం
కురుష్వ న స్స్వస్త్య యనాని దేవి
యథా సమాప్తే పునరా వ్రజేయం
యథా హి సత్యేన పున ర్యయాతిః. ౬౧

టీక॥ దేవి = పట్టపురాణివగు కౌసల్యా! సా(త్వం) = అట్టి నీవు; వనం = అడవినిగూర్చి; వ్రజంతం = పోవుచున్న; మా = నన్ను; అనుమన్యస్వ = అనుమతింపుము. సత్యేన = సత్యముచేత , ధర్మముచేత ననుట ; యయాతిః = యయాతి ; పునః = మఱల ; యథాహి = ఎట్లో; తథా(అధ్యాహృతము) = అట్లు; సమాప్తే = వ్రతముముగియఁగానే; యథా = ఎట్లు; పునః = మఱల ఆవ్రజేయం = వత్తునో; తథా(అధ్యాహృతము) = అట్లు; నః = (ఏకవచనార్థమందు బహువచనము) నాకు; స్వస్త్యయనాని = మంగళాశీర్వచనములను; కురుష్వ = చేయుము.

పట్టపురాణివగు కౌసల్యా! దశరథుండు జీవించి యున్నపుడు నీవు నా వెంటరాఁగూడదు; నేనడవికిఁబోవుటకు సమ్మతింపుము; దౌహిత్రుండిచ్చిన పుణ్యబలంబున యయాతి మఱల స్వర్గంబునొందినట్లు, నేనును, బదునాలుగు సంవత్సరములు ముగియఁగానే , మఱల సుఖంబుననిచ్చటికి వచ్చునట్లు, నాకు మంగళాశీర్వచనంబుల నొసంగుము

అని, తాత్పర్యము.

యశో హ్యహం కేవలరాజ్యకారణా
న్న పృష్ఠతః కర్తు మలం మహోదయమ్
అదీర్ఘకాలే నతు దేవి జీవితే
వృణేఽ వరా మద్య మహీ మధర్మతః. ౬౨

టీక॥ అహం=నేను; కేవలరాజ్యకారణాత్ = పట్టిదారతనమునకై; మహోదయం= అధికమయినఫలముగల; యశః=కీర్తిని; పృష్ఠతః = వెనుకను; కర్తుం=చేయుటకు, ఉంచుటకు, విడుచుటకనుట; నాలంహి=సమర్థుండనుగానుగదా! దేవి = తల్లీ! అదీర్ఘకాలే = స్వల్పమయినకాలముగల; జీవితే = బ్రతుకునిమిత్తమై; లేక; జీవితే=ప్రాణము; అదీర్ఘకాలే=స్వల్పమయినకాలముగలదిగానుండఁగా; అవరాం=తుచ్ఛమయిన; మహీం= భూమిని; అద్య=ఇప్పుడు; అధర్మతః=అధర్మమువలన; నతువృణే = కోరనేకోరను.

నేను, ధర్మంబువిడనాడి, పట్టిరాజ్యమునకై, మహాఫలంబగుకీర్తిని విడువంజాలను; బ్రతుకునది స్వల్పకాలము; దీనికై, యధర్మంబవలంబించి, తుచ్ఛంబగు భూమిని సంపాదింపనాకిష్టము లేదు. అని, రాముండు, కౌసల్యతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ప్రసాదయ న్నరవృషభ స్స మాతరం
పరాక్రమా జ్జిగమిషు రేవ దండకాః
అథానుజం భృశ మనుశాస్య దర్శనం
చకార తాం హృది జననీం ప్రదక్షిణమ్. ౬౩

టీక॥నరవృషభః=పురుషోత్తముండయిన; సః=ఆరాముండు; మాతరం= తల్లిని; ప్రసాదయన్ = ఊఱడించుచు; పరాక్రమాదేవ = తనపరాక్రమమువలననే; దండకాః=దండకారణ్యమును; జిగమిషుః = పోవఁదలంచినవాడై; అథ=అటుపిమ్మట; అనుజం = తమ్ముండగులక్ష్మణుని; దర్శనం= తనమతమును; భృశం=మిక్కిలి; అనుశాస్య=తెలియునట్లుచేసి; హృది = మన

స్సునందు; తాం=ఆ ; జననీం = తల్లి నిగూర్చి; ప్రదక్షిణం = ప్రదక్షిణము ను; చకార=చేసెను.

పురుషోత్తముండగు నారాముఁడు, డిట్లు తల్లి నూఱడించుచు, తానొంటరిగానే తన పరాక్రమంబు మాత్రమె సహాయముగాఁగొని దండకారణ్యంబునకుఁ బోఁదలంచి, తమ్ముండగు లక్ష్మణునకు సుదసయభిప్రాయంబంతయుఁ జక్కఁగాఁ దెలియఁజెప్పి, మనస్సులోఁ, దల్లి కౌసల్యకుఁ బ్రదక్షిణంబు చేసినట్లు, భావించెను. అని తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ఏకవింశస్సర్గః.
ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకవింశసర్గ టీక,
ముగిసినది.

---

౨౨

ద్వా విం శ స ర్గ ప్రా రం భః

అథ తం వ్యథయా దీనం సవిశేష మమర్షితమ్
శ్వసంత మివ నాగేంద్రం రోషవిస్ఫారితేక్షణమ్. ౧
ఆసాద్య రామ స్సౌమిత్రిం సుహృదం భ్రాతరం ప్రియమ్
ఉవాచేదం సధైర్యేణ ధారయ౯ సత్వ మాత్మవా౯. ౨

టీక॥ అథ=అటుపిమ్మట ; ఆత్మవా౯=అధికమయిన ధైర్యముగల; సః=ఆ; రామః=రాముఁడు; వ్యథయా=దుఃఖముచేత; దీనం=దైన్యము నొందినవాఁడును; సవిశేషం= అతిశయము తోఁగూడినట్లు; అమర్షితం= కోపము నొందినవాఁడును; శ్వసంతం= నిట్టూర్పులు పుచ్చుచున్న; నాగేంద్రమివ(స్థితం)=సర్పశ్రేష్ఠముంబోలె నున్నవాఁడును; రోషవిస్ఫారితేక్షణం=కోపముచేతఁ బెద్దవిగాఁ జేయఁబడిన కండ్లుగలవాఁడును; సుహృదం= స్నేహితుండును

ను; భ్రాతరం=తమ్ముండగువాను; ప్రియం= సంతోషకరుండునగు ; సౌమిత్రిం=లక్ష్మణుని; ఆసాద్య=డగ్గఱి ; ధైర్యేణ=ధైర్యముచేత; సత్వం=మనోవికారమును; ధారయన్ = అణఁచుకొనుచు; ఇదం=ఈమాటను ; ఉవాచ= చెప్పెను.

అంత దుఃఖంబునొంది,దీనుండై, మిక్కిలియుఁగోపంబునొంది, సర్పంబుం బోలె నిట్టూర్పులువుచ్చుచుఁ, గోపంబునవిస్తరిల్లియుండుకన్నులతో నున్నవానిని, స్నేహితుండగువానిఁ, బ్రియుండగువానిఁ, దమ్మునిలక్ష్మణునిండాచి, రాముండు,ధైర్యశాలికావునధైర్యంబునమనోవికారముబయలుపడకుండనణంచుకొని, యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

నిగృహ్య రోషం శోకంచ ధైర్య మాశ్రిత్య కేవలమ్
అవమానం నిరస్యేమం గృహీత్వా హర్ష ముత్తమమ్. ౩
ఉపక్లప్తం హి యత్కించి దభిషేకార్థ మద్య మే
సర్వం విసర్జయ క్షిప్రం కురు కార్యం నిరత్యయమ్.౪

టీక॥ రోషం= కోపమును; శోకంచ=దుఃఖమును; నిగృహ్య=విడిచి; ధైర్యం కేవలం = ధైర్యమునుమాత్రము; ఆశ్రిత్య=అవలంబించి; ఇమం = ఈ; అవమానం=భంగమును; నిరస్య= విడిచి; ఉత్తమం = శ్రేష్ఠమయిన; హర్షం = సంతోషమును;గృహీత్వా=చేకొని; యత్ కించిత్=ఏదేది; అద్య= ఇప్పుడు; మే = నాయొక్క; అభిషేకార్థం= పట్టాభిషేకముకొఱకు; ఉపక్లప్తంహి = చేర్పఁబడియున్నదో; తత్(అధ్యాహృతము) = దానిని; సర్వం=అంతను; క్షిప్రం= శీఘ్రముగా; విసర్జయ= విడువుము. నిరత్యయం= ఆలస్యములేనట్లుగా;కార్యం = పనిని; కురు=చేయుము.

నీవు, తండ్రిపైఁగోపంబును, "నాకిట్లు సంభవించినదిగదా" యని దుఃఖమునువిడిచి, ధైర్యంబవలంబించి, యారంభించిన యభిషేకమునిలిచిన దీనివలననవమానంబుమనంబుననుంచక,యధికంబుగ సంతోషంబునొంది, ఇప్పుడు నాపట్టాభిషేకముకొఱకై చేసియుంచినవలంకారాదులనుశీఘ్రముగావిడిచి

[illegible] భాగుసేయకుము. అని, తాత్పర్యము.

సౌమిత్రే యోఽభిషేకార్థే మమ సంభారసంభ్రమః
అభిషేకనివృత్త్యర్థే సోఽస్తు సంభారసంభ్రమః. ౫

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! మమ=నాయొక్క; అభిషేకార్థే = పట్టాభిషేకముకొఱకు; సంభార సంభ్రమః = పదార్థములయం దుత్సాహము; యః(అస్తి) = ఏదిగలదో; సః= ఆ; సంభారసంభ్రమః= పదార్థములయందుత్సాహము; అభిషేకనివృత్త్యర్థే = పట్టాభిషేకమునిలుపుట కొఱకు; అస్తు=అగుఁగాక.

లక్ష్మణుఁడా! నా పట్టాభిషేకమునకై, పదార్థములంగూర్చుటయందు నీకుం గల్గియుండు నుత్సాహంబును, నాపట్టాభిషేకంబునిలిపి నాకు వనవాసయోగ్యంబులగు నారచీర మొదలగువానిని సమకూర్చి నన్ను వనంబునకుఁ బంపుట యందుంచుము. అని, తాత్పర్యము.

యస్యా మదభిషేకార్థే మానసం పరితప్యతే
మాతా మే సా యథా న స్యాత్ సవిశంకా తథా కురు. ౬

టీక॥ మదభిషేకార్థే=నాపట్టాభిషేకమనెడు ప్రయోజనమునందు; యస్యాః=ఎవ్వతెయొక్క ; మానసం= మనస్సు; పరితప్యతే = పరితాపము నొందుచున్నదో; సా=అట్టి; మే= నాయొక్క; మాతా=తల్లియగు కౌసల్య; యథా=ఎట్లు; సవిశంకా= భయముతోఁగూడినది; న స్యాత్ = కాకుండునో; తథా=అట్లు; కురు= చేయుము.

నాపట్టాభిషేకము నిలిచినదే యని పరితపించుచున్న నాతల్లి కౌసల్యకు, "తాముందు, పదునాలుగు సంవత్సరములే కదా వనంబుననుందును ; అటుపిమ్మట మరల నిచ్చటికివచ్చునుగదా! పదునాలుగుసంవత్సరములనఁగా నెంతకు," ఇట్లు చెప్పి, భయంబు లేకుండునట్లు సేయుము. అని, తాత్పర్యము.

లేక॥ పూర్వార్థము సమానము. సా=అట్టి; మే=నాయొక్క; మాతా= తల్లియగుకైకేయి; యథా=ఎట్లు; సవిశంకా=సందేహముతోఁగూడినది ; న స్యాత్=కాకుండునో; తథా=అట్లు కు

రు—చేయుము.

నాకుఁబట్టాభిషేకము గలుగు నే మోయని పరితపించుచున్న నాతల్లికైకేయికి; "రాముండులక్ష్మణునితో నాలోచించుచున్నాఁడే ; వీరిద్దఱును జేరిరాజ్యంబునకే ప్రయత్నింతురో యేమో"యని, సందేహంబుగలుగకుండునట్లుసేయుము. అని, తాత్పర్యము.

తస్యాశ్శంకామయం దుఃఖం ముహూర్తమపి నోత్సహే
మనసి ప్రతి సంజాతం సౌమిత్రేహ ముపేక్షితుమ్. ౭

టీక॥సౌమిత్రే=లక్ష్మణుఁడా ! అహం—నేను; తస్యాః= ఆకౌసల్యయొక్క-; మనసి=మనస్సునందు; ప్రతిసంజాతం=పుట్టిన; శంకామయం=భయరూపమయిన; దుఃఖం= దుఃఖమును; ముహూర్తం= స్వల్పకాలమయినను; ఉపేక్షితుం=ఉపేక్షించుటకు; నోత్సహే=ఉత్సహింపను.

లక్ష్మణుఁడా! కౌసల్య,మనంబునభయంబునొంది దుఃఖించుచుండుటను నేను గొంచెముసేపైనను , ఉపేక్షించియుండఁజాలను, అని, తాత్పర్యము.

లేక; తస్యాః=ఆకైకేయియొక్క-; మనసి ప్రతిసంజాతం; శంకామయం= సందేహరూపమయిన;దుఃఖం. శేషము సమానము.

లక్ష్మణుఁడా!అట్లుఆకైకేయిమనంబున నాయందుసందేహించి దుఃఖంబునొందుటను,నేనుగొంచెముసేపైనను , ఉపేక్షించియుండఁజాలను.

అని, తాత్పర్యము.

న బుద్ధిపూర్వం నాబుద్ధం స్మరామీహ కదాచన
మాతౄణాంవా పితుర్వాహం కృత మల్పంచ విప్రియమ్. ౮

టీక॥ అహం= నేను;ఇహ= ఈలోకమునందు; కదాచన=ఒకప్పుడును ; మాతౄణాంవా=తల్లులకుఁగాని ; పితుర్వా=తండ్రికిఁగాని; అల్పంచ=కొంచెమయినను; బుద్ధిపూర్వం= తెలివిముందుగలుగునట్లుగా, తెలిసియనుట; కృతం—చేయఁబడిన; విప్రియం= అపకారమును; నస్మరామి=స్మరింపను. అబుద్ధం=తెలివిలేకుండునట్లు; కృతం, విప్రియం (అధ్యాహృతము) = చేయఁబ

వినయపకారమును ; నస్మరామి (అధ్యాహృతము)=స్మరింపను.

నేను,బుట్టినదిమొదలొకప్పుడును, దల్లులకుఁగాని తండ్రులకుఁగాని, తెలిసికాని తెలియకకాని, కొంచెమైననుఅపకారముచేసియెఱుంగను.

అని, తాత్పర్యము.

సత్య స్సత్యాభిసంధశ్చ నిత్యం సత్యపరాక్రమః
పరలోకభయా ద్భీతో నిర్భయోస్తు పితా మమ. ౯

టీక॥ సత్యః= సత్యమునెమాటలాడువాఁడును; సత్యాభిసంధశ్చ= సత్యమయిన ప్రతిజ్ఞగలవాఁడును; నిత్యం= ఎల్లప్పుడును; సత్యపరాక్రమః = వ్యర్థముకాని పరాక్రమంబు గలవాఁడును;పరలోకభయాత్ = పరలోకభయంబువలన;భీతః = భయంబునొందినవాఁడునగు; మమ = నాయొక్క;పితా=తండ్రి;నిర్భయః = భయములేనివాఁడు;అస్తు=అగుఁగాక.

నాతండ్రిదశరథుండు,ఎప్పటికినబద్ధమాడఁడు; చేసినప్రతిజ్ఞ తప్పినవాఁడు కాఁడు; అమోఘంబగు పరాక్రమంబు గలవాఁడు, గావున, నీభూలోకంబున నతనికెందునుభయంబులేదు; అయితే, "యిప్పుడుచేసిన ప్రతిజ్ఞ తప్పునేమో తప్పినట్టయినఁ బరలోకంబునఁగష్టంబు నొందవలయునే" అని,పరలోకంబువలనభయపడి యున్నాఁడు; అతండునిర్భయుండుకావలయును.

అని, తాత్పర్యము.

తస్యాపిహి భవే దస్మిన్ కర్మణ్య ప్రతిసంహృతే
సత్యం నేతి మనస్తాప స్తస్య తాప స్తపేచ్చ మామ్. ౧౦

టీక॥ అస్మిన్=ఈ; కర్మణి= పట్టాభిషేకకార్యము;అప్రతిసంహృతే= నిలుపఁబడనిదికాఁగా; తస్యాపి=అదశరథునకును; సత్యంన =సత్యములేదు.ఇతి=అని;మనస్తాపః= మనస్సునఁబరితాపము; భవేద్ధి=కలుగునుగదా! తస్య= అతనియొక్క; తాపః= పరితాపము; మాం=నన్ను; తపేచ్చ = తపింపఁజేయును.

ఇప్పుడు నాపట్టాభిషేకమును నిలు

పకున్న పక్షమునఁ అట్టిదశరథమహారాజు నకు, "నేను గైకేయికి వరంబొసంగిన మాటసత్యముకాలేదుగదా!" అని, మనస్తాపముగలుగును ; అతనికి మనస్తాపంబు గలుగుటను , నేనోర్వఁజాలను.

అని, తాత్పర్యము.

అభిషేకవిధానంతు తస్మా త్సంహృత్య లక్ష్మణ
అన్వగే వాహ మిచ్ఛామి వనం గంతు మితఃపునః. ౧౧

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! తస్మాత్=అందువలన; అహం=నేను ; అభిషేకవిధానం = పట్టాభిషేక కార్యమును; సంహృత్యతు=విడిచియే ; అన్వగేవ=వెంటనే; ఇతఃపునః = ఇచ్చటనుండియే; వనం=అడవినిగూర్చి ;గంతుం=పోవుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

లక్ష్మణుఁడా!అందువలననే, పట్టాభిషేక కార్యమునంతయువిడిచి, యిప్పుడె, యిచ్చటనుండి వనంబునకుఁబోఁ గోరుచున్నాను.

అని, తాత్పర్యము.

మమ ప్రవ్రాజనా దద్య కృతకృత్యా నృపాత్మజా
సుతం భరత మవ్యగ్ర మభిషేచయితా తతః.౧౨

టీక॥ తతః=అటుపిమ్మట; నృపాత్మజా = రాచకొమార్తెయగు కైకేయి; అద్య=ఇప్పుడు; మమ = నాయొక్క;ప్రవ్రాజనాత్= అడవికిఁబోవుటవలన;కృతకృత్యా= నెఱవేఱినప్రయోజనముగలదై: సుతం= కొడుకైన;భరతం=భరతుని;అవ్యగ్రం=కలఁతలేనట్లుగా; అభిషేచయితా= అభిషేకించుకొనఁగలదు.

ఇట్లు నేనువనంబునకుఁ బోయినపిదప, రాచకొమార్తెయగు కైకేయి, కృతార్థయయి, సంతోషంబునఁ, దనకొడుకుభరతునకునిర్విఘ్నంబుగాఁ బట్టాభిషేకంబు,చేసికొనఁగలదు.

అని, తాత్పర్యము.

మయి చీరాజినధరే జటామండలధారిణి

గతేరణ్యం చ కైకేయ్యా భవిష్యతి మనస్సుఖమ్. ౧౩

టీక॥ మయి=నేను; చీరాజినధరే=నారచీరలను కృష్ణాజినంబును దాల్చినవాఁడనై; జటామండలధారిణి=జడలయొక్క-సమూహమును ధరించినవాఁడనై; అరణ్యం=అడవిని; గతేచ=పోయినవాఁడనుగాఁగా; కైకేయ్యాః=కైకేయికి; మనస్సుఖం= మనస్సంతోషము; భవిష్యతి=కాఁగలదు.

నేను నారచీరలుఁ గృష్ణాజినంబునుఁగట్టుకొని జడలం దాల్చి యడవికిఁ బోయినపిమ్మట, కైకేయిమనంబునకు సంతోషంబుగలుగును; అంతవఱకుఁ గలుగదు; కావున, శీఘ్రముగాఁ బోవలయును.

అని, తాత్పర్యము.

బుద్ధిః ప్రణీతా యేనేయం మనశ్చ సుసమాహితమ్

తంతు నాహామి సంక్లేష్టుం ప్రవ్రజిష్యామి మాచిరమ్. ౧౪

టీక॥ యేన=ఎవ్వానిచేత; ఇయం=ఈ; బుద్ధిః=తలంపు; ప్రణీతా=చేయఁబడినదో; మనశ్చ= మనసును; సుసమాహితం= మిక్కిలియుస్థిరముగాఁజేయఁబడినదో; తంతు = అట్టితండ్రిని మాత్రము; సంక్లేష్టుం= దుఃఖపఱచుటకు; నాహామి= తగను. ప్రవ్రజిష్యామి=అడవికిఁబోయెదను. చిరం=బహుకాలము, ఆలస్యమనుట; మా = కూడదు.

ఎవ్వఁడు, సత్యపరిపాలనార్థమయి, "రాముండువనంబునకుఁబోవలయును" అని,తలంచి,యట్లు,అతికష్టంబున, మనసును స్థిరముగాఁ జేసికొనియున్నాఁడో,అట్టినాతండ్రి దశరథమహారాజు దుఃఖించునట్లు చేయఁ గూడదు; నేనుశీఘ్రముగా నడవికిఁ బోయెదను; జాగుసేయఁగూడదు.

అని, తాత్పర్యము.

కృతాంతస్త్వేవ సౌమిత్రే ద్రష్టవ్యో మత్ప్రవాసనే

రాజ్యస్యచ వితీర్ణస్య పునరేవ నివర్తనే. ౧౫

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! మత్ప్రవాసనే = నాయొక్క-యడవికిఁబం

పుటయందును; వితీర్ణస్య=ఇయ్యబడిన; రాజ్యస్య=దొరతనముయొక్క; పునరేవ=మఱలను; నివర్తనేచ=నిలుపుటయందును ; కృతాంతస్యైవ=దైవమే ; కారణం(అధ్యాహృతము) = కారణముగా ; ద్రష్టవ్యః = చూడఁబడవలసినది.

లక్ష్మణుఁడా! నన్నువనంబునకుఁబంపుటయందును, నాకిచ్చిన రాజ్యముఁనాకులభ్యముగాకుండుటయందును, కైకేయికారణముకాదు; ఇవన్నియు దైవమువలననే సంభవించినవని యెఱుంగుము. అని, తాత్పర్యము.

కైకేయ్యాః ప్రతిపత్తిర్హి కథం స్యాన్మమ పీడనే
యది భావో న దైవోఽయం కృతాంతవిహితో భవేత్. ౧౮

టీక॥ దైవః=దేవీసంబంధి యయిన, తల్లియగుకైకేయిదైనయనుట; అయం=ఈ; భావః= అభిప్రాయము; కృతాంతవిహితః=దైవముచేఁ జేయఁబడినది; నభవేద్యది= కాకుండునేని; కైకేయ్యాః=కైకేయికి; మమ = నాయొక్క; పీడనే=బాధించుటయందు; ప్రతిపత్తిః=బుద్ధి; కథం=ఎట్లు; స్యాత్=కలుగును?

ఇప్పుడు తల్లియగు కైకేయికిం గల్గిన యీయభిప్రాయము , దైవముచేఁ గలిగినది కాదేని , నాయందెప్పుడును మిక్కిలియు వాత్సల్యముగలిగియుండునట్టి కైకేయికి, నన్నుబాధింపవలయుననుబుద్ధియెట్లు కలుగును? అని, తాత్పర్యము.

జానాసి హి యథా సౌమ్య న మాతృషు మమాంతరమ్
భూతపూర్వం విశేషో వా తస్యా మయి సుతేఽపి వా. ౧౯

టీక॥ సౌమ్య = తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా!మమ=నాకు; మాతృషు = తల్లులయందు; అంతరం= భేదము; యథా=ఎట్లు;భూతపూర్వం= ముందుగలిగినది; న=కాదో; తస్యాః= ఆకైకేయికి;మయి= నాయందుఁగాని; సుతేపివా=కొమరుఁడుభరతునియందు గాని;విశేషోవా=భేదము గాని; యథా(అధ్యాహృతము)=ఎట్లు;భూతపూర్వేన (అధ్యాహృతము)= ముందుకలిగినదిగా

దో॥ తథా (అధ్యాహృతము)=అట్లు; బాసొసిహి=ఎఱుంగుదువుగదా!

అన్నదమ్ములలో నెవరినిగూర్చియు ద్వేషము లేకుండ నుండెను; ఇదివఱ కిప్పుడును, నేను, దల్లుల నందఱను, ఎంతమాత్రము "కన్నతల్లి చవతితల్లి" అని భేదముంచక, సమానముగాఁ జూచుకొనుచుండుటయు, అట్లు కైకేయికిని, దనకొడుకు భరతుని యందును నాయందును, భేదములేక సమానముగాఁ బ్రేమముగల్గియుండుటయు, నీవుఁ దెలిసి యున్నదిగదా! అట్లుండ నిప్పుడు, దైవ ప్రేరణము లేకుండ నేని, అట్టి కైకేయి కిట్టిబుద్ధియేల గల్గును?

అని, తాత్పర్యము.

సోఽభిషేక నివృత్త్యర్థైః ప్రవాసార్థైశ్చ దుర్వచైః
ఉగ్రై ర్వాక్యై రహం తస్యా నాన్యద్దైవా త్సమర్థయే. ౧౮

టీక॥ సః=అట్టి; అహం=నేను; తస్యాః= ఆకైకేయియొక్క; అభిషేక నివృత్త్యర్థైః=పట్టాభిషేకమునిలుపుటయె ప్రయోజనము గాఁగలవియును; ప్రవాసార్థైశ్చ=వనంబునకుఁబంపుటయె ప్రయోజనముగాఁగలవియును; దుర్వచైః= చెప్పఁగూడనివియును; ఉగ్రైః = భయంకరములునగు; వాక్యైః=మాటలచేత; దైవాత్ = దైవముకన్న; అన్యత్ = ఇతరమును; కారణం(అధ్యాహృతము) = కారణమును; నసమర్థయే=నిశ్చయింపను.

నేను, అట్లు, మొదటనుండియు బిడ్డనాయందతివాత్సల్యంబు గల్గియుండుట ననుభవించి యున్నవాఁడను, గావున, అట్టికైకేయి, యిప్పుడు, నన్నుఁజూచి, పట్టాభిషేకమును విడిచి యరణ్యంబునకుఁబొమ్మని, చెప్పరాని భయంకరవాక్యంబులాడుటచే, దైవంబుదక్క మఱి యేదియుఁ గారణముగా నిశ్చయింప నవకాశములేదు; కైకేయి స్వభావంబె కారణమయినచో, నింతకుమున్ను బహుకాలముగా నాయెడ నాయందుం గల్గియుండు వాత్సల్యాతిశయంబు పోవుటకుఁ గారణముగాన రాదు; కావున, దైవమే యిట్లు సంభవింపంజేసినది; అట్లగుటం జేసి, కైకేయిని నిందింపవలదు.

అని, తాత్పర్యము.

కథం ప్రకృతిసంపన్నా రాజపుత్రీ తథా గుణా

బ్రూయాత్త్వా ప్రాకృతేవ స్త్రీ మత్పీడాం భర్తృసన్నిధౌ.

టీక॥ రాజపుత్రీ=రాచకొమార్తెయును; తథాగుణా=అట్టిగుణంబులు గలదియునగు; సా=ఆకైకేయి; ప్రకృతిసంపన్నా(చేత్)=తనస్వభావముతోనె కూడియున్నదగునేని; కథం=ఎట్లు; ప్రాకృతా=తక్కువయినదగు; దుష్కులంబునంబుట్టి దుస్స్వభావంబులుగల్గి దుష్టయయి యుండునట్టి యనుట; స్త్రీవ=స్త్రీయుంబోలె; భర్తృసన్నిధౌ=పెనిమిటిసమీపమునందు; మత్పీడాం=నాకుబాధగల్గించునట్టివార్తను; బ్రూయాత్=చెప్పును.

కైకేయి రాచకొమార్తె సద్గుణంబులుగలదియుఁగావునఁ, బెనిమిటి యొద్దనెట్లు నడుచుకొనవలయునో యామర్యాదం దెలిసి యట్లె యాచరించునది; మఱియు, నామీఁద నతివాత్సల్యంబుగలది; అట్టికైకేయి, తనస్వభావంబుతోనే యుండునేని, మునుపటియట్లభర్తృగౌరవంబును జాటింపక, నాయందు వాత్సల్యంబుం జూపక, క్షుద్రస్త్రీయుంబోలెఁ, బెనిమిటియొద్దసిగ్గును భయంబును విడిచి, తనకును బెనిమిటికిని మిక్కిలియుఁ బ్రియుండనై యున్న నాకుఁ బీడగలిగించునట్టి దుర్వాక్యంబులు చెప్పునా? ఎంతమాత్రము చెప్పదు; కావున, దైవబలంబుననే, యాబిడస్వభావంబు భేదిల్లినది. అని, తాత్పర్యము.

యదచింత్యంతు తద్దైవం భూతేష్వపి న హన్యతే
వ్యక్తం మయిచ తస్యాంచ పతితో వా విపర్యయః. ౨౦

టీక॥ అచింత్యం=ఎన్నరాని, ఎన్నరానిమహిమగలయనుట; దైవం=దైవము; యత్(అస్తి)=ఏదిగలదో; తత్=ఆదైవము; భూతేష్వపి=సమస్తప్రాణులందును; నహన్యతే=కొట్టుపడదు. వ్యక్తం=స్పష్టము. మయిచ=నాయందును; తస్యాంచ=ఆకైకేయియందును; విపర్యయః=భేదము; పతితోహి=పడినదిగదా!

దైవంబుమహిమము లెక్కింపనలవిగాదు; సమస్తభూతంబులయందును దానికెదురులేదు; ఇందుసందియము లేదు; ఇప్పుడు అందఱును జేరియన్నివిధంబుల నాలోచించి నిష్కర్షించిన నాపట్టాభిషేకము నిలిచినది; అట్లునాయందతివాత్సల్యంబు గల్గియుండినకై

కంబు స్వభావంబు విపరీతంబైనది గదా! కావున, దైవంబునకెందును ఎదురులేదనుట సత్యము.

అని, తాత్పర్యము.

కశ్చిద్దైవేన సౌమిత్రే యోద్ధు ముత్సహతే పుమాన్
యస్య న గ్రహణం కించి త్కర్మణో న్యత్ర దృశ్యతే. ౨౧

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! యస్య=ఏదైవముయొక్క; గ్రహణం=తెలియుటకుఁగారణము; కర్మణః=కార్యమునకన్న; అన్యత్ర=ఇతరమునందు; కించిత్ = కొంచెమైనను; నదృశ్యతే=చూడఁబడదో; తేన (అధ్యాహృతము)=అట్టి; దైవేన=దైవముతో ; యోద్ధుం=పోరుటకు; కశ్చిత్ = ఏ; పుమాన్=పురుషుఁడు; ఉత్సహతే = ప్రయత్నించును?

లక్ష్మణుఁడా! "ఆదైవంబున్నదనుటకేమిసాధకము? ఉన్నదిపో; పురుషప్రయత్నముచేత, దానినేలనివారింపఁగూడదు?" అనియడుగుదువు కాఁబోలు; మనకుదైవమునునది యగపడకున్నను, దాని కార్యముచేత, నదియున్నదనియనుమానించుచున్నాము; మనము కాలత్రికా ద్రమంబులలోఁ జేసినపనులలోఁగొన్ని సఫలములుకావు; అందుమనచేసినయది కారణముకనుపట్టదు; కొన్ని, కొంతమాత్రమును శ్రద్ధగాని శ్రమముగానిలేనిదే, యధికఫలము లగుచున్నవి; అట్లగుటకుందగుసాధనసంపత్తియు మనకుఁగనుపట్టదు; ఈరెంటికినిగారణమేదైవమనంబడును; కారణము లేనిదే కార్యముఁగలుఁగదు; కావున, శ్రమంబుచేసినను ఫలింపకపోవుటయుఁ దగినశ్రమంబులేనిదేయధికఫలంబగుటయును గారణముగలవగుచున్నవి; అయితేపైరెండుకార్యములును దైవమునకన్న నితరమగు కారణముగలదికాదని తెలియవచ్చుచున్నది; కాఁబట్టి, పైరెండుకార్యములకును, దైవమేకారణము; దైవములేనిదే పైరెంటికినిగారణమెట్లగును? కావున దైవమనునదియొకటియున్నదనియను మానప్రమాణముచే సిద్ధించుచున్నది; అట్టిదైవముకార్యము సేయువానికిఁగంటికగపడదు; నప్పుడదియనుకూలమో ప్రతికూలముగనున్నదోయను సంగతియుఁ దెలియనేరదు; భవిష్యత్సంగతియెవ్వనికిఁదెలియును? కార్యము చెడినప్పుడుమాత్రము, తనకుదైవము ప్రతికూల

ముగనుండినదని యెఱుంగును; అప్పుడు అశ్రైవమున కేమిప్రతికారము సేయనగును? కార్యము చెడిపోవుటకుమున్ను, అది ప్రతికూలముగనున్నదని తెలిసినం గదా దానికిం బ్రతికారము సేయవచ్చును; మఱియు, నదియెప్పటికిని గుంటికగపడదు గావున, ననుమానముపలనవస్తుస్థితి మాత్రము తెలిసియుఁ, బురుషుండేమియుఁ సేయఁగలండు? కావున దైవకార్యంబనుభవింపవలసినదే కాని దానికిఁ బ్రతికారంబులేదు. అని, తాత్పర్యము.

సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ
యచ్చకించి త్తథాభూతం నను దైవస్య కర్మ తత్. ౨౨

టీక॥ నను=ఓయి ! సుఖదుఃఖే = సుఖమును దుఃఖమును; భయక్రోధౌ = భయమును గోపమును; లాభాలాభౌ= లాభంబును లాభంబు లేమియును ; భవాభవౌ = పుట్టుకయును నాశమును ; తథాభూతం=అట్టిది; యత్ కించిచ్చ= ఏ శేదో; తత్ = అది; సర్వం (అధ్యాహృతము)=అంతయు; దైవస్య= దైవము యొక్క; కర్మ= కార్యము.

సుఖము, దుఃఖము, శాంతి , కోపము, లాభము, అలాభము, పుట్టుక, నాశము, ఇవి మొదలుగఁ గారణమగపడని కార్యములన్నియు, దైవకార్యములే. అని, తాత్పర్యము.

ఋషయో ప్యుగ్రతపసో దైవే నాభిప్ర పీడితాః
ఉత్సృజ్య నియమాం స్తీవ్రాణ్ భ్రశ్యంతే కామమన్యుభిః. ౨౩

టీక॥ ఉగ్రతపసః=భయంకరమగు తపసుగల; ఋషయోపి=ఋషులును ; దైవేన = దైవముచేత ; అభిప్రపీడితాః=మిక్కిలియుఁ బీడింపఁ బడినవారలై; తీవ్రాణ్=తీక్ష్ణములయిన ; నియమాణ్=వ్రతంబులను; ఉత్సృజ్య= విడిచి; కామమన్యుభిః = కామక్రోధములచేత; భ్రశ్యంతే = భ్రోయఁబడు చున్నారు.

భయంకరంబు గాఁదపస్సు సేయుచుండినం దాదులనుంగూడ సరకు సేయకయుండు విశ్వామిత్రాది ఋషులును , దైవబలంబునం బీడితులై, కామవలం బిడిచినతీక్ష్ణవ్రతంబులం బరిత్యజించి, కామ

క్రోధంబులకు లోఁబడి, తపస్సులం బోఁగొట్టుకొనుచున్నారు, అని, తాత్పర్యము.

అసంకల్పిత మేవేహ య దకస్మా త్ప్రవర్తతే
నివర్త్యారంభ మారబ్ధం నను దైవస్య కర్మ తత్. ౨౪

టీక॥ ఇహైవ=ఈలోకమునందే; ఆరబ్ధం=ఆరంభింపఁబడిన; ఆరంభం=పనిని; వివర్త్య=నిలిపి; అసంకల్పితం = తలంపఁబడని; యత్=ఏకార్యము; అకస్మాత్=తటాలున; ప్రవర్తతే=ప్రవర్తించునో; తత్=అది; దైవస్య=దైవముయొక్క; కర్మనను=కార్యమే.

ఈలోకంబునందు, బహు ప్రయత్నంబున నారంభించిన కార్యమునునిలిపి, యంతకుమునుపు మనంబులోనుంగూడఁదలంపనికార్యము మఱియొకటి తటాలున సంభవించుచున్నదే; అది, దైవకార్యమే. అని, తాత్పర్యము.

ఏతయా తత్త్వయా బుద్ధ్యా సంస్తభ్యాత్మాన మాత్మనా
వ్యాహతే ప్యభిషేకే మే పరితాపో న విద్యతే. ౨౫

టీక॥ తత్త్వయా= యథార్థమయిన; ఏతయా=ఈ; బుద్ధ్యా=తలంపుచేత; ఆత్మనా=నాచేతనే; ఆత్మానం=మనసును; సంస్తభ్య=నిగ్రహించుకొని; స్థితస్య(అధ్యాహృతము)=ఉన్నట్టి; మే=నాకు; అభిషేకే=పట్టాభిషేకము; వ్యాహతేపి= కొట్టఁబడినను; పరితాపః=అనుతాపము; నవిద్యతే=లేదు.

యథార్థమయినయీన్యాయంబుచే నాకునేనేమనసును నిగ్రహించుకొని, యున్నాను; కావున, నాకుఁ, బట్టాభిషేకమునిల్చిపోయినను, బరితాపముగలుగకున్నది.

అని, తాత్పర్యము.

తస్మా దపరితాపస్సం స్త్వ మప్యనువిధాయ మామ్
ప్రతిసంహారయ క్షిప్ర మాభిషేచనికీం క్రియామ్. ౨౬

టీక॥ తస్మాత్=అందువలన ; త్వమపి=నీవును; మాం=నన్ను ; అనువిధాయ = అనుసరించి ; అపరితాపస్సన్ = పరితాపములేనివాఁడవై ; క్షిప్రం=శీఘ్రముగా; అభిషేచనికీం=అభిషేకసంబంధియగు ; క్రియాం=కార్యమును; ప్రతిసంహారయ=నిలుపుము,

అట్లు,నీవునునావలెనే,దైవశక్తింబర్యాలోచించి,పరితాపంబువిడిచి, యిప్పుడు నాపట్టాభిషేకమునకై సేయుచుండుకార్యములనునిలుపుము.

అని, తాత్పర్యము.

ఏభిరేవ ఘటైః సర్వైరభిషేచనసంభృతైః
మమ లక్ష్మణ తాపస్యే వ్రతస్నానం భవిష్యతి. ౨౭

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా ! అభిషేచనసంభృతైః = పట్టాభిషేకముకొఱకుసంపాదింపఁబడిన ; సర్వైః=సమస్తములయిన; ఏభిః=ఈ ;ఘటైరేవ=కలశములచేతనే, కలశములయందలిజలములచేతనేయనుట ; మమ=నాకు ; తాపస్యే=తాపసునకుయోగ్యమయినకర్మమునందు ; వ్రతస్నానం=వ్రతముకొఱకైనస్నానము ; భవిష్యతి=కాఁగలదు.

లక్ష్మణుఁడా! ఇప్పుడు,పట్టాభిషేకమునకై తెచ్చియున్నారే,ఈమంగళకలశంబులందలిజలంబంతయునాపట్టాభిషేకంబునకుపయోగింపకున్ననేమి? నేనుదాపసవ్రతఁబవలంబించుటకై చేయవలసినసంకల్పస్నానంబున కుపయోగపడునుగాక.

అని,తాత్పర్యము.

అథవా కిం మమైతేన రాజద్రవ్యమతేన తు
("రాజ్యద్రవ్యమయేనతు" ఇతిపాఠాంతరం)
ఉద్ధృతం మే స్వయం తోయం వ్రతాదేశం కరిష్యతి.౨౮

టీక॥అథవా=అటుగాకేని;రాజద్రవ్యమతేనతు= రాజద్రవ్యమని యెన్నఁబడినట్టి;ఏతేనతు= ఈజలముచేతను; మమ=నాకు; కిం=ఏమిప్రయోజనము? (పాఠాంతరపక్షమందు)రాజ్యద్రవ్యమయేనతు=రాజ్య నిమిత్తములయిన ద్రవ్యములుప్రచురముగాఁగల; ఏతేన, మమ, కిం=ఈజలముచేత, నాకు,ఏమిప్ర

యోజనము? స్వయం=నాచేతనే; ఉద్ధృతం=చేదఁబడిన; తోయం= జలము; మే=నాకు; వ్రతాదేశం=వ్రతనియమమును; కరిష్యతి=చేయఁగలదు.

ఒకవేళ, నీజలముతో స్నానము చేయుదునేని కైకేయి మఱియు సందేహించునుగాఁబోలు; ఇది రాజద్రవ్యము; మఱి రాజ్యమునకుప యుక్తముల గు ద్రవ్యములతోఁ గూడియున్నది; ఇట్టి జలము నాకేల? నేనే చేదుకొని యాజలములో వ్రతస్నానము చేసెదను.

అని, తాత్పర్యము.

మాచ లక్ష్మణ సంతాపం కార్షీః లక్ష్మ్యా విపర్యయే
రాజ్యంవా వనవాసోవా వనవాసో మహోదయః. ౨౯

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! త్వం (అధ్యాహృతము) చ = నీవు; లక్ష్మ్యాః=రాజ్యలక్ష్మియొక్క; విపర్యయే=భేదిల్లుటనిమిత్తమై; సంతాపం=పరితాపమును; మాకార్షీః — చేయకుము. రాజ్యంవా, దొరతనముగాని; వనవాసోవా — అడవినుండుటగాని; తుల్యః (అధ్యాహృతము)= సమానము. వనవాసః = అడవినుండుటయే; మహోదయః=అధికఫలముగలది.

లక్ష్మణుఁడా! రాజ్యములేకపోయిన దని నీవుపరితాపముపడవలదు; రాజ్యంబునఁ బ్రజాపాలనాది ధర్మములుగలుగును; వనవాసంబునఁ దపస్సు మొదలగునవిగలుగును; కావున, రెండును సమానములే; అయితే, విచారింపఁగా మాత్రము, రాజ్యంబుననుండు ప్రజలకృత్యాకృత్యసుఖదుఃఖచింత లేమిం జేసి, పితృవచనపరిపాలనధర్మంబధికంబుగా నుండుటం జేసియు, వనవాసంబె యధికము.

అని, తాత్పర్యము.

న లక్ష్మణాస్మిన్ ఖలు కర్మవిఘ్నే
మాతా యవీయస్యతిశఙ్కనీయా
దైవాభిపన్నా హి వద త్యనిష్టం
జానాసి దైవంచ తథాప్రభావమ్. ౩౦

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! అస్మిన్ — ఈ; కర్మవిఘ్నే=కార్యనాశమునందు;

యవీయసీ=చిన్నదైన; మాతా=తల్లి యగుకైకేయి; కారణం (అధ్యాహృతము) = కారణముగా ; నాతిశంకనీయాఖలు=సందేహింపఁదగినదిగాదుగదా! సా (అధ్యాహృతము)=ఆకైకేయి;దైవాభిపన్నాహి;దైవముచేనావేశింపఁబడినదైయే;అనిష్టం,అప్రియవార్తను; వదతి=చెప్పుచున్నది. దైవం=దైవమును ; తథాప్రభావంచ = అట్టిప్రభావంబుగలదానిఁగాను; జానాసి=ఎఱుంగుదువు.

లక్ష్మణుఁడా! దైవప్రభావంబు నీకిప్పుడు తెలిసియేయున్నదిగదా ! అట్టిదైవముప్రేరించుటచేతఁ గైకేయియాప్రకారంబ ప్రియవార్తలఁ బలుకుచున్నదికాని వేఱుకాదు; కావున నిప్పుడు పట్టాభిషేకంబునకుఁ గైకేయి విఘ్నంబుచేసిన దనితలంపవలదు.విఘ్నముచేసినదిదైవమే.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ద్వావింశస్సర్గః.
ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ,ద్వావింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః
త్రయోవింశసర్గప్రారంభః.

ఇతి బ్రువతి రామేతు లక్ష్మణోఽధశ్శిరా ముహుః
శ్రుత్వా మధ్యం జగామేవ మనసా దుఃఖహర్షయోః. ౧

టీక॥ రామే = రాముఁడు;ఇతి= ఇట్లు; బ్రువతితు= చెప్పుచుండఁగానే; లక్ష్మణః=లక్ష్మణుఁడు;ముహుః=పలుమాఱు; అధశ్శిరాః = వంగినతలగలవాఁడై; శ్రుత్వా=విని; మనసా=మనసుచేత;దుఃఖహర్షయోః= దుఃఖమునకునుసంతోషమునకును; మధ్యం= నడుమను; జగామేవ = పొందినట్లుం

డెను.

రాముండిట్లు చెప్పుచుండఁగా, లక్ష్మణుండు, మాటిమాటికిఁ దలవంచుకొనుచు, నంతయువిని, తనయన్నరాముండు, మిక్కిలియు ధర్మబుద్ధిగలవాఁడని సంతోషంబును రాజ్యంబువిడుచుననిదుఃఖంబును, ఆరెంటిని, బొందినట్లుండెను. అని, తాత్పర్యము.

తదాతు బద్ధ్వా భ్రుకుటీం భ్రువోర్మధ్యే నరర్షభః
నిశశ్వాస మహాసర్పో బిలస్థ ఇవ రోషితః. ౨

టీక॥ నరర్షభః=పురుషశ్రేష్ఠుండగులక్ష్మణుండు; తదాతు= అప్పుడు; భ్రువోః = కనుబొమ్మలయొక్క; మధ్యే=నడుమనందు; భ్రుకుటీం= బొమముడిని; బద్ధ్వా= కట్టి; రోషితః= కోపమునొందిన; బిలస్థః=రంధ్రంబుననున్న; మహాసర్పఇవ=గొప్పసర్పముంబోలె; నిశశ్వాస=నిట్టూర్పువిడిచెను.

పురుషశ్రేష్ఠుండగు లక్ష్మణుండు, అంతఁ, గోపంబునబొమముడిభీకరంబై కనుపట్టఁ, గుపితంబై నబిలస్థంబగుమహాసర్పంబుంబోలె, నిట్టూర్పులువుచ్చెను.

అని, తాత్పర్యము.

తస్య దుష్ప్రతివీక్షం తద్భ్రుకుటీసహితం తదా
బభౌ క్రుద్ధస్య సింహస్య ముఖస్య సదృశం ముఖమ్. ౩

టీక. తదా=అప్పుడు; తస్య = ఆలక్ష్మణునియొక్క; దుష్ప్రతివీక్షం= చూడఁ గూడనిదియును; భ్రుకుటీ సహితం= బొమముడితోఁగూడినదియునగు; ముఖం=ముఖము; క్రుద్ధస్య=కోపించిన; సింహస్య= సింహముయొక్క; ముఖస్య=మొగమునకు; సదృశం = సరియై; బభౌ=ప్రకాశించినది.

అప్పుడు, భయంకరంబగుబొమముడిగల్గి చూపరులకుభయంబుగల్గించుచున్న, యాలక్ష్మణునిముఖంబు, కుపితంబైనసింహముముఖంబుతోసరియై, చూపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

అగ్రహస్తం విధున్వంస్తు హస్తీ హస్తమివాత్మనః

తిర్యగూర్ధ్వం శరీరేచ పాతయిత్వా శిరోధరామ్. ౪
అగ్రాక్ష్ణా వీక్షమాణస్తు తిర్యగ్భ్రాతర మబ్రవీత్

టీక॥ సః(అధ్యాహృతము)= ఆలక్ష్మణుండు; హస్తీ= ఏనుంగు; హస్తమివ= తొండమునుంబోలె; ఆత్మనః= తనయొక్క; అగ్రహస్తం= కొనచేతిని; విధూన్వన్= విదిలించుచు; ("తు" అనునది పాదపూరణార్థము) శరీరే= దేహంబునందు; తిర్యక్ = అడ్డముగను; ఊర్ధ్వం= పైకిని; శిరోధరాం= మెడను; పాతయిత్వాచ= పడునట్లు చేసియు; అగ్రాక్ష్ణా= కొనకంటిచేత; తిర్యక్ = అడ్డముగా; వీక్షమాణః= చూచుచు ("తు" అనునది పాదపూరణార్థము); భ్రాతరం= అన్ననుగూర్చి; అబ్రవీత్= పలికెను.

ఆలక్ష్మణుండు, కోపంబునం గొనచేతిని విదిలించి, మెడను ముందుకు వెనుకకుం గ్రిందికిం ద్రిప్పి, కడకంట నడ్డముగాం జూచుచు, అన్నగారగురామునితో నిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

అస్థానే సంభ్రమో యస్య జాతో వై సుమహానయమ్. ౫
ధర్మదోషప్రసంగేన లోకస్యానతిశంకయా

టీక॥ యస్య= (తచ్ఛబ్దార్థమందు యచ్ఛబ్దము ప్రయోగింపఁబడినది) అట్టినీకు; ధర్మదోషప్రసంగేన= ధర్మహానియొక్క ప్రసక్తిచేతను; లోకస్య= లోకమునకు; అనతిశంకయా= సందేహము లేకుండుటచేతను, సందేహము లేకుండుటకొఱకనుట; జాతః= పుట్టిన; ("వై" అనునది పాదపూరణార్థము.) సుమహాన్= మిక్కిలియు నధికమయిన; అయం= ఈ; సంభ్రమః= వేగిరపాటు; అస్థానే = యుక్తము కాదు.

నీవు సమస్తనీతులం దెలిసినవాఁడవు; అట్టినీవు; "పితృవచనపరిపాలనధర్మంబు చెడు"ననియు "నేను ధర్మంబు నాచరింపకుండునేని, లోకులు ధర్మంబు నువిడుతు"రనియు, భ్రమించి, వనంబునకుంబోవ, వేగిరపడుట యుక్తముగాదు. అని, తాత్పర్యము.

కథం హ్యేత దసంభ్రాంత స్త్వద్విధో వక్తు మర్హతి. ౮
యథాదైవ మశౌండీరం శౌండీర క్షత్రియర్షభ

టీక॥ శౌండీరక్షత్రియర్షభ=శూరులయందును క్షత్రియులయందును శ్రేష్ఠుండవగు రాముఁడా! త్వం = నీవు; అశౌండీరం=సమర్థము కాని; దైవం=దైవమును; యథా=ఎట్లు; వదసి (అధ్యాహృతము)= చెప్పుచున్నావో; ఏతత్= ఈమాటను; అసంభ్రాంతః=భ్రాంతిలేని; త్వద్విధః= నీవంటివాఁడు; వక్తుం= చెప్పుటకు; కథంహి=ఎట్లు; అర్హతి=తగును?

నీవు శూరులలో మేటివయినవాఁడవు, మఱియు క్షత్రియశ్రేష్ఠుఁడవు; నీవుగూడ, దుర్బలంబగు దైవంబును, మహాప్రబలము ననఁగాఁ జెప్పుచున్నావే; నీకు భ్రాంతికలిగినట్లున్నది; అట్టి భ్రాంతి గలుగకుఁడునేని, నీయట్టివాఁ డిట్టిమాటం జెప్పఁడు. అని, తాత్పర్యము.

కిన్నామ కృపణం దైవ మశక్త మభిశంససి. ౯
పాపయో స్తే కథంనామ తయో శ్శంకా నవిద్యతే

టీక॥కృపణం= దీనమును ; అశక్తం=సామర్థ్యములేనిదియును నగు; దైవం=దైవమును ; కిన్నామ=ఎందుకు; అభిశంససి = పొగడుచున్నావు? తే=నీకు; పాపయోః= పాపాత్ములయిన ;తయోః= ఆకైకేయీదశరథులయందు;కథన్నామ=ఎట్లు;శంకా= సందేహము; నవిద్యతే=లేదు?

దీనులనాశ్రయించియుండునదియు శక్తిలేనిదియునగు దైవంబునేల పొగడెదవు? ఆకైకేయీదశరథులు పాపాత్ములని నీకేలతోఁచలేదు? వారలు పాపాత్ములుగావున, వారలపనుపు సేయకుండుటచే నీకేమియు దోషంబుగలుగదు. అని, తాత్పర్యము.

సంతి ధర్మోపధా శ్శ్లక్ష్ణా ధర్మాత్మన్ కిన్నబుధ్యసే. ౧౦
తయో స్సుచరితం స్వార్థం శాఠ్యా త్పరి జిహీర్షతోః

టీక॥ధర్మాత్మన్= ధర్మస్వభావుండవగు రాముఁడా! ధర్మోపధాః=

ధర్మము కపటముగాఁగలవారలును; శ్లక్ష్ణాః=ప్రియములు పలుకు వారలును, ప్రియములుపలుకునట్లభినయించు వారలుననుట; సంతి=ఉన్నారు. శాఠ్యాత్=రహస్యముగాఁ గీడు సేయుటవలన; స్వార్థం=నీ ప్రయోజనమును; పరిజిహీర్షంతౌ=పోఁగొట్టఁగోరుచున్నట్టి; తయోః=ఆకైకేయీ దశరథులయొక్క; సుచరితం=చక్కనియాలోచనను; నబుధ్యసేకిం=ఎఱుఁగవా వేమి?

ధర్మాత్ముండవగు రామా! లోకంబునఁ గొందఱు, కపటముగాధర్మమాచరించునట్లు వేషమువేసికొని స్వకార్యసిద్ధికై ప్రియవార్తలంజెప్పునట్లభినయించుచుందురు; అట్లు, ఆకైకేయీదశరథులును, కైకేయియందత్తివాత్సల్యంబుగలిగియుండునట్లభినయించుచు, రహస్యముగామనంబులోనీకుఁ గీడుగోరిచేసినయాలోచనంబు, నీకుఁ దెలియదావేమి? అని, తాత్పర్యము.

యది నైవం వ్యవసితం స్యాద్ధి ప్రాగేవ రాఘవ,
తయోః ప్రాగేవ దత్తశ్చ స్యాద్వరః ప్రకృతశ్చ సః

టీక॥ రాఘవ=రాముఁడా! ఏవం=ఇట్లు; ప్రాగేవ=మునుపే; వ్యవసితం=ప్రయత్నింపఁబడినది; నస్యాద్యది=కాకుండునేని; ("హి" అనునది పాదపూరణార్థము); ప్రకృతః=బహుకాలమునుండియున్న; తయోః=వారలయొక్క; సః=ఆ; వరశ్చ=వరమును; ప్రాగేవ=మునుపే; దత్తశ్చ=ఇయ్యఁబడినదియు; స్యాత్=అగును.

రాముఁడా! దశరథుండు కైకేయికివరంబొసంగి బహుకాలంబైనది; ఇదివాస్తవమగునేని, ధర్మజ్ఞుండగు దశరథుండిదివఱకు దానిను పేక్షించియుండఁడు; ఇదివఱకెప్పుడో దానిఁదీర్చుకొనియేయుండును; ఇదివఱకా ప్రస్తావమే లేదే; మఱియు, నావరంబునుపయోగపఱచుకొనుటకు, ఇదేసమయమా? నీకుఁ బట్టాభిషేకంబు వెల్లడిసేయుట, అనంతరము, ఈవరప్రసక్తిగలుగుట, వీనింజూడఁగా, "భరతునకురాజ్యం బివ్వవలయును; జ్యేష్ఠుండగు రాముండుండగానదిపొసంగదు; కావున, నేను, రామునకుఁ బట్టాభిషేకమనివెల్లడి చేసె

దను; అప్పుడు, నీవు నేనువరంబులొసంగియున్నట్టును, ఆవరంబులు రెంటికిని, భరతాభిషేకంబును రామవివాసనంబును, గావలసినట్టును నీవడుగుము; అప్పుడు నేను సత్యపాశబద్ధుండనైనట్లుండి కార్యము నెఱవేర్చుకొనియెదను" అని దశరథుండును కైకేయియును; జక్కగా నాలోచించుకొనినట్లు తోఁచుచున్నది; అట్లువారలు, ఆలోచింపకనె యుండి యుందురేని, దశరథుండిదివఱకెన్నఁడో యిచ్చినవరంబులఁ గైకేయియునూరకపెట్టియుండదు; దశరథుండునుడూరకపెట్టుకొనియుండఁడు; ఇదివఱకుఁ గైకేయి యెన్నిమాఱులో అడిగియుండును; దశరథుండును ధర్మజ్ఞుండు కావున నిదివఱ కెన్నఁడో యిచ్చియుండును; అట్లుకాలేదు కాఁబట్టి, వీరలు కృత్రిమంబుగ నాలోచించుకొని రనుట సత్యము. అని, తాత్పర్యము.

లోకవిద్విష్ట మారబ్ధం త్వదన్యస్యాభిషేచనమ్. ౧౦
నోత్సహే సహితుం వీర తత్ర మే క్షంతు మర్హసి

టీక॥ వీర = పరాక్రమశాలివగు రాముఁడా! లోకవిద్విష్టం = ప్రపంచమునందు ద్వేషింపఁబడినట్లుగా; ఆరబ్ధం = ఆరంభింపఁబడిన; త్వదన్యస్య = నీకంటెనితరునియొక్క; అభిషేచనం = పట్టాభిషేకమును; సహితుం = ఓర్చుటకు; నోత్సహే = ఉత్సహింపను. మే = నాయొక్క; తత్ర = ఆవిషయమందు; క్షంతుం = క్షమించుటకు; అర్హసి = తగుదువు.

పరాక్రమశాలివగు రాముఁడా! నిన్నువిడిచి నీతమ్మునకుఁ బట్టాభిషేకము సేయుట, లోకవిరుద్ధంబయినకార్యము; ఈకైకేయీదశరథులు, దానిఁ జేయం బూనినారు; దానిని మాత్రము నేను సహింపఁజాలను; ఆవిషయమందు మాత్రము నన్ను నీవు మన్నింప వలసినది. అని; తాత్పర్యము.

యేనేయ మాగతా ద్వైధం తవ బుద్ధి ర్మహామతే. ౧౧
సహి ధర్మో మమ ద్వేష్యః ప్రసంగా ద్యస్య ముహ్యసి

టీక॥ మహామతే = మహాబుద్ధిశాలివగు రాముఁడా! తవ = నీయొక్క; బుద్ధిః =

బుద్ధిః; యేన= ఏధర్మముచేత; ద్వైధం=భేదమును; ఆగతా = పొందినదో; యస్య=ఏధర్మముయొక్క; ప్రసంగాత్ = ప్రసక్తివలన; ముహ్యసి= మోహము నొందుచున్నావో; సః= ఆ; ధర్మః= పితృవచనపాలనరూపధర్మము; మమ=నాకు; ద్వేష్యోహి= ద్వేషింపఁదగినదిగదా!

మహాబుద్ధిశాలివగు రాముఁడా! ఏధర్మముచేత, నీకుఁబట్టాభిషేకమును విడిచియరణ్యంబునకుఁ బోవలెననిబుద్ధికి భేదంబుగల్గినదో, ఏధర్మంబువలనఁ, "జేయకున్నఁ బ్రత్యవాయముగల్గు" నని మోహంబునొందియున్నావో, అట్టి, పితృవచన పరిపాలనరూపధర్మము, నాకిష్టముకాదు. అని, తాత్పర్యము.

కథం త్వం కర్మణా శక్తః కైకేయీ వశవర్తినః. ౧౨
కరిష్యసి పితు ర్వాక్య మధర్మిష్ఠం విగర్హితమ్

టీక॥ కర్మణా = పౌరుషకార్యముచేత; శక్తః = సమర్థుండవగు; త్వం= నీవు; కైకేయీవశవర్తినః= కైకేయి యధీనతయందున్న; పితుః= తండ్రియొక్క; అధర్మిష్ఠం=మిక్కిలియు నధర్మముతోఁ గూడినదియును; విగర్హితం = నిందింపఁబడినదియునగు; వాక్యం=మాటను; కథం= ఎట్లు; కరిష్యసి=చేయుదువు?

నీవు, ప్రతికారంబు సేయుటయందు సమర్థుండవై, దండ్రి కైకేయివలలోఁజిక్కి చెప్పిన యధార్మికంబును నిందితంబునగు వచనంబు సేయవచ్చునా? నీవు, దానిఁదిరస్కరించి, పరాక్రమంబుఁ జూపవలయుఁగాని యెంతమాత్రమును, దశరథుని మాటనువినఁగూడదు. అని, తాత్పర్యము.

యద్యయం కిల్బిషాద్భేదః కృతోఽప్యేవం నగృహ్యతే. ౧౩
జాయతే తత్ర మే దుఃఖం ధర్మసంగశ్చ గర్హితః

టీక॥ అయం=ఈ; భేదః= మాఱువు; కిల్బిషాత్=కపటమువలన; కృతోఽపి= చేయఁబడినదైనను; ఏవం=ఇట్లు; నగృహ్యతేయది=గ్రహింపఁబడకుండునేని; తత్ర=ఆవిషయమందు; మే=నాకు; దుఃఖం= దుఃఖము; జాయతే=

పుట్టుచున్నది. ధర్మసంగశ్చ= ఇట్టిధర్మాచరణమును; గర్హితః=నిందింపఁబడినది.

నీకై యారంభింపఁబడినపట్టాభిషేకకార్యమునునిలిపిభరతునకుఁబట్టాభిషేకమును నీకువనవాసంబునుగాఁ, గైకేయీదశరథులుకపటబుద్ధిచేతనే చేసి యుండియు,నీకట్లుతోఁచకుండుటవలన మాత్రము, నాకుదుఃఖంబగుచున్నదిమరియుఁ, గామకుండగుతండ్రిమాటవినియరణ్యంబునకుఁ బోవుటలోకవిరుద్ధమగుధర్మమేకానివేఱుగాదు. అని, తాత్పర్యము.

మనసాపి కథంకామం కుర్యాస్త్వం కామవృత్తయోః, ౧౪
తయోస్త్వహితయోర్నిత్యం శత్ర్వోః పిత్రాభిధానయోః

టీక॥ త్వం = నీవు; కామవృత్తయోః=కామాధీనమగునాచారముగల వారలును;నిత్యం=ఎల్లప్పుడును; అహితయోః=కీడుచేయువారలును; పిత్రభిధానయోః= తలిదండ్రులనుపేరుగల వారలును;శత్ర్వోః= శత్రువులయిన వారలునగు; తయోస్తు= ఆకైకేయీ దశరథులయొక్కయు;కామం = కోర్కిని; మనసాపి = మనసుచేతనుగూడ; కథం=ఎట్లు; కుర్యాః = చేయుదువు?

కామాధీనులయినీకెల్లప్పుడునుగీడు సేయఁగోరుచుండలిదండ్రులను వేషము తోనుండుశత్రువులయినయాకైకేయీదశరథులు, కామపరవశులయి, కోరరానిదికోరఁగా, వారల కోర్కెనింగూడనెఱవేఱుపఁబలయునని, నీవుమనసులోనం గూడనెట్లుతలంపవచ్చును?

అని, తాత్పర్యము.

యద్యపి ప్రతిపత్తిస్తే దైవీచాపి తయోర్మతమ్. ౧౫
తథాప్యుపేక్షణీయం తే న మే తదపిరోచతే

టీక॥తయోః=ఆకైకేయీదశరథులయొక్క; ప్రతిపత్తిః=తలంపు; దైవీచాపి=దైవముచేఁగలిగినదే ; ఇతి(అధ్యాహృతము)=అని; తే= నీయొక్క; మతంయద్యపి=మతమెయయినను ; తథాపి= అట్లయినను; తే=నీకు,నీచేతననుట;ఉపేక్షణీయం= ఉపేక్షింపఁదగినది. మే=నాకు;తదపి=ఆదైవమును ; న

రోచతే=రుచింపలేదు,
"ఆర్తె కేయీదశరథుల కిట్టి దురభిప్రాయంబుపుట్టుట దైవకృతమే కాని వారల స్వభావంబునం గలిగినది కాదు" అని నీవు తలంచియున్నావు; అయినను, అది సరిగాదు; నాకింతమాత్రము దైవము ప్రమాణముగా నేదోచలేదు.

అని, తాత్పర్యము.

విక్లబో వీర్యహీనో యస్స దైవ మనువర్తతే, ౧౬
వీరా స్సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే

టీక॥ యః=ఎవ్వఁడు; విక్లబః=దృఢమయిన మనస్సు లేనివాఁడును; వీర్యహీనః = పరాక్రమము చేవిడువఁబడినవాఁడునో; సః= అతఁడు; దైవం= దైవమును; అనువర్తతే= అనుసరించును. వీరాః= పరాక్రమశాలులును సంభావితాత్మానః= చక్కనియాలోచనంబుగల మనసుగలవారలునగు వారలు; దైవం= దైవమును; నపర్యుపాసతే= సేవింపరు.

పరాక్రమంబులేనివాఁడును దెలివిలేనివాఁడును మాత్రము దైవంబు ననుసరించును; పరాక్రమశాలురును బుద్ధిమంతులగువారలయినచో, నెట్టియనుపమసామర్థ్యంబునం గార్యంబు సాధించుకొనుదురే కాని, దైవంబు నుపాసింపంగరు.

అని, తాత్పర్యము,

దైవం పురుషకారేణ యస్సమర్థః ప్రబాధితుమ్. ౧౭
న దైవేన విపన్నార్థః పురుషస్సోఽవసీదతి

టీక॥ యః=ఎవ్వఁడు; దైవం=దైవమును; పురుషకారేణ= పౌరుషముచేత; ప్రబాధితుం=బాధించుటకు; సమర్థః= శక్తుఁడో; సః=ఆ; పురుషః= పురుషుఁడు; దైవేన=దైవముచేత; విపన్నార్థః= చెడినప్రయోజనముగలవాఁడై; నావసీదతి=దుఃఖింపఁడు.

పౌరుషంబున దైవంబునడంగంద్రొక్కుటకు సమర్థుండగు పురుషుండు మాత్రము,ఎప్పుడును, దైవంబునకు వెఱచి స్వార్థంబుఁబోఁగొట్టుకొని,దుఃఖింపఁడు.అని, తాత్పర్యము.

ద్రక్ష్యంతి త్వద్య దైవస్య పౌరుషం పురుషస్యచ. ౧౮
దైవమానుషయో రద్య వ్యక్తా వ్యక్తి ర్భవిష్యతి

టీక॥ అద్యతు=ఇప్పుడె; దైవస్య=దైవముయొక్కయు; పురుషస్యచ=పురుషునియొక్కయు; పౌరుషం=శక్తిని; ద్రక్ష్యంతి = చూడఁగలరు. అద్య=ఇప్పుడు; దైవమానుషయోః = దైవముయొక్కయుఁ బురుషునియొక్కయు; వ్యక్తిః=ఇదిప్రబలము, ఇదిదుర్బలము, అనుభేదము ; వ్యక్తా=స్పష్టము ; భవిష్యతి=కాఁగలదు.

జను లిప్పుడు దైవసామర్థ్యమును బురుషునిసామర్థ్యమునుం జూడఁగలరు; ఇప్పుడు, దైవము ప్రబలమో పురుషుండు ప్రబలుఁడో, యీసందేహమును దీర్చెదను. అని, తాత్పర్యము.

అద్య మత్పౌరుషహతం దైవం ద్రక్ష్యంతి వై జనాః. ౧౯
యద్దైవా దాహతం తేఽద్య దృష్టం రాజ్యాభిషేచనమ్

టీక॥ యద్దైవాత్ = ఏదైవమువలన; అద్య=ఇప్పుడు; ఆహతం = కొట్టఁబడిన; తే= నీయొక్క; రాజ్యాభిషేచనం= పట్టాభిషేకము; దృష్టం= చూడఁబడినదో; అద్య = ఇప్పుడు; తత్ (అధ్యాహృతము)= ఆ; దైవం=దైవమును; మత్పౌరుషహతం = నాయొక్కపౌరుషముచేఁ గొట్టఁబడినదానిఁగా; జనాః=జనులు; ద్రక్ష్యంతి=చూడఁగలరు. "వై" అనునది పాదపూరణార్థకము.

ఏదైవ మిప్పుడు నీపట్టాభిషేకమును జెఱుపం జూచినదో, ఆదైవమునిప్పుడు నా పౌరుషంబుచేఁ బ్రతిహతంబగుటను జనులందఱుం జూడఁగలరు. అని, తాత్పర్యము.

అత్యంకుశ మివోద్దామం గజం మద బలోద్ధతమ్. ౨౦
ప్రధావిత మహం దైవం పౌరుషేణ నివర్తయే

టీక॥ అహం=నేను; అత్యంకుశం=అంకుశము నతిక్రమించినదియును ; ఉద్దామం=కట్టులేనిదియును, కాలిగొలుసు దెచ్చుకొన్నదియుననుట;మదబలోద్ధ



తం=మదముచేతనుబలముచేతనుగర్వించినదియును; ప్రధావితం=పరుగిడుచున్నదియునగు; గజమివ = ఏనుంగునుంబోలె; దైవం=దైవమును ; పౌరుషేణ=పౌరుషముచేత; నివర్తయే = మఱల్చెదను.

అంకుశమును సరకుసేయక, నిగళంబు దెంచుకొనిమదబలంబునగర్వించి దుర్నివారంబై పరుగిడుచున్న యేనుంగునుసమర్థుఁడగుమావటీఁడు స్వసామర్థ్యంబునమఱల్చినట్లు, నేనిప్పుడు, దుర్నివారంబని నీచేఁజెప్పఁబడుచున్న దైవమును,నాసామర్థ్యంబున మఱల్చెదను. అని, తాత్పర్యము.

లోకపాలా స్సమస్తా స్తే నాద్య రామాభిషేచనమ్.౨౧
నచ కృత్స్నా స్త్రయో లోకా విహన్యుః కింపునః పితా

టీక॥ తే=ఆ; లోకపాలాః = దిక్పాలకులు; సమస్తాః=అందఱును ; అద్య=ఇప్పుడు: రామాభిషేచనం=రామపట్టాభిషేకమును; నవిహన్యుః = అడ్డగింపలేరు; త్రయః=మూఁడైన; లోకాః=లోకములును; కృత్స్నాః=అన్నియును; న (విహన్యుః=అడ్డగింపరు. పితా= తండ్రి; కింపునః(వక్తవ్యం)=అడ్డగింపలేఁడని చెప్పనేల?

దిక్పాలురందఱు నొక్కటియైవచ్చినను, ముల్లోకంబులన్నియు నొక్కటైనను,ఇప్పుడు, నేను సంరంభించియుండఁగా రాముని పట్టాభిషేకము నిలుపనేరరు; ఇంకేమునరివాఁ డొక్కఁడు దశరథుఁడేమిసేయఁగలఁడు?

అని, తాత్పర్యము.

యై ర్వివాస స్త్వరణ్యే మిథో రాజన్ సమర్థితః.౨౨
అరణ్యే తే నివత్స్యంతి చతుర్దశ సమాస్తథా

టీక॥ రాజన్=మహారాజా! (రాముండు రాజగుటసుసిద్ధముగానెంచియిట్లుచెప్పఁబడినది. యైః=ఎవ్వరిచేత ; మిథః=రహస్యముగా; తవ=నీకు; అరణ్యే = అడవియందు; నివాసః= ఉనికి ; సమర్థితః = కోరఁబడినదో; తే=వారలు ; తథా=అట్లు; చతుర్దశ= పదునాలుగు; సమాః=సంవత్సరములను; అరణ్యే=అడవియందు; నివత్స్యంతి=నివసింపఁగలరు.



మహారాజా! నీకు వనవాసంబు గలుగవలయునని యెవ్వరు రహస్యముగా నాలోచించి నిశ్చయించినారో, అట్టి పాపాత్ము లందఱు, వారలు నీకుఁ జెప్పినట్లు, పదునాలుగు సంవత్సరములును, అడవినుండునట్లు గావించెదను. అని, తాత్పర్యము.

అహం తదాశాం ఛేత్స్యామి పితు స్తస్యా శ్చ యా తవ. ౨౩
అభిషేకవిఘాతేన పుత్రరాజ్యాయ వర్తతే

టీక॥ తత్=అందువలన; అహం=నేను; యా=ఎవ్వతె; తవ=నీయొక్క; అభిషేకవిఘాతేన=పట్టాభిషేకము చెఱచుటచేత; పుత్రరాజ్యాయ=కొడుకు దొరతనముకొఱకు; వర్తతే=ప్రయత్నించుచున్నదో; తస్యాః=ఆకైకేయి యొక్కయు; పితుశ్చ=తండ్రియగు దశరథునియొక్కయు; ఆశాం=ఆశను; ఛేత్స్యామి=నఱకెదను, పోఁగొట్టెదనుట.

అందువలన, నీపట్టాభిషేకమునకు విఘాతము గావించి తనకొడుకు భరతునకు రాజ్యంబురావలయునని కోరుచున్న కైకేయికిని దశరథునకునుగలిగియున్న దురాశను, బోఁగొట్టెదను.
అని, తాత్పర్యము.

మద్బలేన విరుద్ధాయ న స్యా ద్దైవ బలం తథా. ౨౪
ప్రభవిష్యతి దుఃఖాయ యథోగ్రం పౌరుషం మమ

టీక॥ మద్బలేన=నాబలముతో; విరుద్ధాయ=విరోధించినవానికొఱకు; ఉగ్రం=భయంకరమగు; మమ=నాయొక్క; పౌరుషం=పౌరుషము; యథా=ఎట్లు; దుఃఖాయ=దుఃఖముకొఱకు; ప్రభవిష్యతి=సమర్థమగునో; తథా=అట్లు; దైవబలం=దైవముయొక్క శక్తి; నస్యాత్=కానేరదు.

అయితే, కైకేయీదశరథులకు దైవంబనుకూలంబుగనున్నదే; మనకది ప్రతికూలము; కావునవారలలోఁగొనుట మనకుదుస్తరమనియందువేమో; నాతో విరోధించిన వానికిమాత్రము, దైవమెంత యనుకూలముగానున్నను, ఏమియునుపయోగముండదు; అటందు నాపౌరుషంబునకుంజిక్కి దుఃఖించునే

కాని తప్పించుకొనలేదు. అని, తాత్పర్యము.

ఊర్ధ్వం వర్షసహస్రాంతే ప్రజాపాల్య మనంతరమ్. ౨౫
ఆర్యపుత్రాః కరిష్యంతి వనవాసం గతే త్వయి

టీక॥ఊర్ధ్వం=పిమ్మట; వర్షసహస్రాంతే= సంవత్సరముల వేయితుదను; త్వయి=నీవు; వనవాసం= అడవినుండుటను; గతే=పొందఁగా;అనంతరం=అటుపిమ్మట ; ఆర్యపుత్రాః= పూజ్యుండవగునీకొడుకులు ; ప్రజాపాల్యం=ప్రజలపాలించుటను;కరిష్యంతి=చేయఁగలరు.

ఇట్లు సమస్తరాజ్యసుఖంబులనుభవించి వేయిసంవత్సరంబులుకడచనినపిదప, నీవువానప్రస్థాశ్రమంబవలంబించి వనంబునకుంబోయిన యనంతరము, నీకొడుకులు రాజ్యపరిపాలనంబు సేయుదురు; ఇంకనెప్పటికిని,భరతునకు రాజ్యపాలనాధికారమునకవకాశంబు లేదు. అని, తాత్పర్యము.

పూర్వరాజర్షి వృత్త్యా హి వనవాసో విధీయతే. ౨౬
ప్రజా నిక్షిప్య పుత్రేషు పుత్రవత్పరిపాలనే

టీక॥ పుత్రేషు=కొడుకులయందు; ప్రజాః=ప్రజలను; పుత్రవత్ =కొడుకులనుంబోలె; పరిపాలనే= కాపాడుటనిమిత్తమయి; నిక్షిప్య=ఉంచి; పూర్వరాజర్షివృత్త్యా=మునుపటి రాజర్షులయాచారముచేత;వనవాసః= అరణ్యమునందుండుట;విధీయతేహి= విధింపఁబడియున్నదిగదా!

తానుశక్తియున్నంతవఱకుఁ బ్రజాపరిపాలనంబుచేసి, యుంచఁ , బ్రజల నుగొడుకులకొప్పగించి, "మీరలు మీకొడుకులం గాపాడుకొనునట్లు ప్రజలనుబుత్రవాత్సల్యంబునం గాపాడుచుండవలయు"నని చెప్పి, యిట్లు మునుపటి రాజర్షులాచరించినవిధంబున, వనవాసంబు , సేయవలయుననియేకదా శాస్త్రంబునం జెప్పఁబడియున్నది.

అని, తాత్పర్యము.

న చేద్రాజ న్యనేకాగ్రే రాజ్యవిభ్రమ శంకయా. ౨౭

నైనమిచ్ఛసి ధర్మాత్మన్ రాజ్యం రామ త్వ మాత్మని
ప్రతిజానేచ తే వీర మాభూవం వీరలోకభాక్. ౨౮

టీక॥ ధర్మాత్మన్=ధర్మస్వభావుండవగు; రామ=రాముఁడా! సః=అ; త్వం=నీవు; రాజని= దశరథమహారాజు; అనేకాగ్రే= చపలుఁడుగానుండఁగా; రాజ్యవిభ్రమ శంకయా= రాజ్యములో భేదములవలని భయముచేత; ఆత్మని= మనసునందు; ఏనం= ఈ; రాజ్యం= దొరతనము; నేచ్ఛసి చేత్=కోరకుందువేని; వీర= పరాక్రమశాలివగు రాముఁడా! తే = నీకొఱకు; "అహం(అధ్యాహృతము)= నేను; వీరలోకభాక్= వీరస్వర్గమునుబొందువాఁడను; మాభూవం=కాకపోదును." ఇతి(అధ్యాహృతము)=అని; ప్రతిజానేచ=ప్రతిజ్ఞయుఁజేసెదను.

ధర్మాత్ముండవగురాముఁడా!"ఇప్పుడు దశరథమహారాజు మనసుచపలముగానున్నది; నేనుసాహసించి రాజ్యంబుస్వాధీనముచేసికొనం జూతునేని, రాజ్యమునందన్నిభేదములుగలుగునో; వానినన్నిఁటినినే నొంటరిగాఁడనెట్లుసవరించుకొనంగలను?, అనునీయభిప్రాయంబున,నీవీరాజ్యంబుఁగోరకుందువేని, దానిం జెప్పుము; నీవును వీరుండవు; నేనునీకుఁదోడుండఁగా నీకేమిభయము? "అట్లు భంగమువచ్చునట్లయ్యెనేని, నేను వీరలోకంబున కరుగుండఁగాకపోవుదును" అని, ప్రతిజ్ఞయుంజేసెదను.అని,తాత్పర్యము.

రాజ్యంచ తవ రక్షేయ మహం వే లేవ సాగరమ్

టీక॥ అహం=నేను; వేలా= చెలియలికట్ట; సాగరమివ = సముద్రమునుంబోలె; తవ=నీయొక్క; రాజ్యంచ=రాజ్యమును;రక్షేయం=కాపాడెదను.

చెలియలికట్ట, సముద్రమునెట్లుపొంగిరాకుండఁగాచియుండునో,అట్లు, నేనునీరాజ్యంబులో నేమియుం గలఁతలేకుండునట్లుకాచియుండెదను.

అని, తాత్పర్యము.

మంగలై రభిషించస్వ తత్ర త్వం వ్యాపృతో భవ. ౨౯

అహ మేకో మహీపాలా నలం వారయితుం బలాత్

టీక॥ మంగళైః=మంగళద్రవ్యముల చేత; అభిషించస్వ = అభిషేకించుకొనుము. త్వం=నీవు; తత్ర=ఆకార్యమునందు; వ్యాపృతః=ఆసక్తుండవు ; భవ=అగుము. మహీపాలాన్=రాజులను; బలాత్=బలిమివలన ; వారయితుం=అడ్డగించుటకు; అహం=నేను ; ఏకః=ఒక్కఁడను;అలం=చాలుదును.

నీవువసిష్ఠాదులం జీరి పట్టాభిషేకంబుచేసికొనుము ; నీవింక నా కార్యంబుఁ జూడుము; విరోధంబున నీమీఁదికివచ్చు రాజులనందఱ సంహరింపనేనొకండనే చాలుదును. అని, తాత్పర్యము.

న శోభార్థా విమౌ బాహూ న ధను ర్భూషణాయ మే. ౩౦

టీక॥ మే=నాయొక్క ; ఇమౌ = ఈ; బాహూ = భుజములు ; శోభార్థౌ = అలంకారమె ప్రయోజనము గాఁగలవి; న=కావు; ధనుః = విల్లు ; భూషణాయ= అలంకారముకొఱకు ; న=కాదు.

ఈనాచేతులు రెండును,యుద్ధముసేయుటకైయున్నవికాని; యలంకారమునకుఁగాదు;నాచేతనుండుధనుస్సును,ఎక్కిడి,శత్రువులపైనమ్ములంబ్రయోగించుటకై ధరించియున్నానుగాని, యలంకారార్థమైకాదు. అని,తాత్పర్యము.

నాసి రాబంధనార్థాయ నశరా స్తంభహేతవః

టీక॥ అసిః=కత్తి;ఆబంధనార్థాయ=మొలలోఁగట్టుకొనుటయనుప్రయోజనముకొఱకు; న = కాదు. శరాః=బాణంబులు; స్తంభహేతవః=ఊరకుండుటయె ప్రయోజనము గాఁగలవి;న=కావు.

ఈకత్తిశత్రువుల నఱుకుటకైయుపయోగించునదేకాని, యలంకారముగా మొలలోఁ గట్టుకొనుటకుఁగాదు; నాయమ్ములపొదిలోనుండుబాణంబులు శత్రువులపైఁబ్రయోగించుటకై యుంచఁబడినవికాని వ్యర్థముగా నూరక యుంచఁబడినవికావు.

అని,తాత్పర్యము.

అమిత్రదమనార్థం మే సర్వ మే తచ్చ తుష్టయమ్. ౩౧

టీక॥ మే=నాయొక్క; ఏతత్=ఈ;చతుష్టయం=నాలుగును;సర్వం= అన్నియును; అమిత్రదమనార్థం = శత్రువులయొక్క యడంగద్రొక్కుటయె ప్రయోజనముగాఁగలది.

నాకు, ఈనాలుగాయుధములును,మఱియు నితరములయినవియు, శత్రువులనడఁగం ద్రొక్కుటకే కాని మఱి దేనికింగాదు. అని,తాత్పర్యము.

నచాహం కామయేత్యర్థం యస్స్యాచ్ఛత్రు ర్మతో మమ
అసినా తీక్ష్ణధారేణ విద్యుచ్చలితవర్చసా. ౩౨
ప్రగృహీతేన వై శత్రుం వజ్రిణం వా న కల్పయే

టీక॥ యః=ఎవ్వఁడు;మమ=నాకు; అత్యర్థం = మిక్కిలియు; శత్రుః=శత్రువుగా; మతః= ఎన్నఁబడినవాఁడు; స్యాత్=అగునో;తం=అతని; అహం=నేను;నకామయే=కోరను,జీవింపనివ్వననుట.అహం(అధ్యాహృతము) = నేను;ప్రగృహీతేన = గ్రహింపఁబడిన ("వై"అనునది పాదపూరణార్థము) తీక్ష్ణధారేణ = కఱకయినయంచుగలదియును;విద్యుచ్చలితవర్చసా= మెఱపుంబోలెఁ జలించుచున్న కాంతిగలదియు నగు; అసినా=కత్తిచేత; శత్రుం= శత్రువైన; వజ్రిణం = వజ్రాయుధమునుధరించిన యింద్రుడైనను ; నకల్పయే=సరకుసేయను.

నాకుశత్రువనియెవ్వఁడుచెప్పఁబడుచున్నాఁడో, అతండుజీవించుటనెంతమాత్రము నేనుసహింపఁజాలను; కఱకుగలిగి, మెఱుపుంబోలె మెఱయుచున్న ఖడ్గముం జేకొని , దేవేంద్రుండు వజ్రాయుధముతో నెదిరించినను, సరకుసేయక,చంపుదును. అని, తాత్పర్యము.

ఖడ్గనిష్పేషనిష్పిష్టై ర్గహనా దుశ్చరా చ మే. ౩౩
హస్త్యశ్వనరహస్తోరుశిరోభి ర్భవితా మహీ

టీక॥ మహీ=భూమి; మే= నాయొక్క; ఖడ్గనిష్పేషనిష్పిష్టైః = కత్తిచే

నలియఁగొట్టుటచేఁ జూర్ణములుగాఁ జేయఁబడిన; హస్త్యశ్వనరహస్తోరుశిరోభిః=ఏనుఁగులయొక్కయు గుఱ్ఱములయొక్కయు మనుష్యులయొక్కయుఁ జేతులచేతను దొడలచేతను దలలచేతను; గహనా=దట్టమయినదిగాను; దుశ్చరాచ= సంచరింపఁగూడనది గాను; భవితా=కాఁగలదు.

నాఖడ్గప్రహారంబులకుఁ జూర్ణములయి తెగి, యేనుంగులయు గుఱ్ఱంబులయు మనుష్యులయుఁ జేతులుఁ గాళ్లుఁ దలలు, నెచ్చుగా సంఘ లేకపడియుండుటవలన, భూమియందంతటను సంచరించుటకు నవకాశము లేకపోవును. అని, తాత్పర్యము.

ఖడ్గధారాహతా మేద్య దీప్యమానా ఇవాద్రయః. ౩౪
పతిష్యంతి ద్విపా భూమౌ మేఘా ఇవ సవిద్యుతః

టీక॥ అద్య=ఇప్పుడు; మే=నాయొక్క; ఖడ్గధారాహతాః=కత్తియంచుచేఁగొట్టఁబడినవియును; కావున నే, దీప్యమానాః=మండుచున్న; అద్రయఇవ; కొండలుంబోలె; సవిద్యుతః= మెఱుపులతోఁ గూడిన; మేఘాఇవ (స్థితాః)=మేఘంబులుంబోలె నున్నవియు నగు; ద్విపాః=ఏనుంగులు; భూమౌ= నేలయందు; పతిష్యంతి=పడఁగలవు.

ఇంకశీఘ్రంబుగనే, నాకత్తిదెబ్బకుం దెగి, శత్రుగజంబులు, నెత్తురు గ్రక్కుచుండుట వలన, మండుచున్న కొండలుంబోలె మెఱుపులతోఁ గూడిన మేఘంబులుం బోలె జూపట్టుచు, నేలంబడఁగలవు. అని, తాత్పర్యము.

బద్ధగోధాంగుళిత్రాణే ప్రగృహీతశరాసనే. ౩౫
కథం పురుషమానీ స్యాత్పురుషాణాం మయి స్థితే

టీక॥మయి=నేను; బద్ధగోధాంగుళిత్రాణే=కట్టఁబడిన యుడుముతోలుతోఁజేయఁబడిన వ్రేలికవచముగలవాఁడనై; ప్రగృహీతశరాసనే= పట్టుకొనఁబడినవిల్లుగలవాఁడనై; స్థితే=ఉండఁగా; పురుషాణాం=పురుషులలోపల; కశ్చిత్ (అధ్యాహృతము)= ఒకానొకఁడును; పురుషమానీ= నేనుబురుషుం

తనని యహంకరించువాఁడు; కథం = ఎట్లు; స్యాత్ = అగును?

నేను, ఉడుముతోలుతోఁగట్టిన కవచంబును, అల్లెత్రాటిదెబ్బ తాఁకకుండుటకై వ్రేళ్లకుండొడుగుకొని, ధనువుధరించి, యుద్ధంబునకు సన్నద్ధుండనై, నిలువఁగా, నెవ్వఁడు, నేనుబురుషుండనని యెదిరింపఁగలఁడు? అందఱును స్త్రీలుంబోలె భయంబునం దాఁతిపోదురే కాని, యెవ్వఁడును బురుషుఁడనని యేచెప్పుకొనఁడు.

అని, తాత్పర్యము.

బహుభి శ్చైక మత్యస్య న్నేకేనచ బహూన్ జనాన్. ౨౮
వినియోక్ష్యే హం బాణా న్నృవాజిగజమర్మసు

టీక॥ అహం = నేను; బహుభిః = పెక్కుబాణములచేత; ఏకం = ఒకనిని; ఏకేన = ఒక్కబాణముచేత; బహూన్ = అనేకులయిన; జనాంశ్చ = జనులను; అత్యస్యన్ = మిక్కిలియువేయుచు; ఏవం (అధ్యాహృతము) = ఇట్లు; బాణాన్ = బాణములను; నృవాజిగజమర్మసు = మనుష్యులయొక్కయు గుఱ్ఱములయొక్కయు నేనుఁగులయొక్కయు జీవస్థానములయందు; వినియోక్ష్యామి = వినియోగించెదను.

నేను, బలవంతునొకనినిఁ బెక్కుబాణంబులను, తుచ్ఛజనులననేకులనొక్కబాణంబునను వేయుచు, నిట్లు, నరహయగజంబుల మర్మస్థానంబులందు బాణంబులం బ్రయోగించుచు, విహారంబుచేసెదను. అని, తాత్పర్యము.

అద్యమే స్త్రప్రభావస్య ప్రభావః ప్రభవిష్యతి. ౨౯
రాజ్ఞశ్చా ప్రభుతాం కర్తుం ప్రభుత్వంచ తవ ప్రభో

టీక॥ ప్రభో = నియామకుండవగు రాముఁడా! అద్య = ఇప్పుడు; మే = నాయొక్క; అస్త్రప్రభావస్య = అస్త్రమాహాత్మ్యముయొక్క; ప్రభావః = ప్రతాపము; రాజ్ఞః = దశరథ మహారాజునకు; అప్రభుతాంచ = ప్రభుత్వము లేకుండుటను; తవ = నీకు; ప్రభుత్వంచ = ప్రభుత్వమును; కర్తుం = చేయుటకు; ప్రభవిష్యతి = సమర్థమగును.

ప్రభుండవగు రాముఁడా! నానేర్చి

నయస్త్రీమూలమాహాత్మ్యముం జూడుము; ఈక్షణంబుననె దశరథమహారాజునవలం ద్రోసివుచ్చి, నిన్నుం బ్రభువుగాం జేసెదను. అని, తాత్పర్యము.

అద్య చందనసారస్య కేయూరామోక్షణస్యచ. ౩౮
వసూనాం చ విమోక్షస్య సుహృదాం పాలనస్యచ
అనురూపా విమౌ బాహూ రామ కర్మ కరిష్యతః. ౩౯
అభిషేచనవిఘ్నస్య కర్తౄణాం తే నివారణే

టీక॥ రామ=రాముఁడా! అద్య= ఇప్పుడు; చందనసారస్య= చందనద్రవమునకును; కేయూరామోక్షణస్య చ= బాహుపురులుధరించుటకును; వసూనాం= ధనములయొక్క; విమోక్షస్యచ=ఇచ్చుటకును; సుహృదాం= స్నేహితులయొక్క; పాలనస్యచ = రక్షించుటకును; అనురూపౌ=తగిన; ఇమౌ=ఈ; బాహూ=భుజములు; తే= నీయొక్క; అభిషేచనవిఘ్నస్య = పట్టాభిషేకవిఘాతముయొక్క; కర్తౄణాం= చేయువారలయొక్క; నివారణే=అడ్డగించుటవిషయమునయి; కర్మ= కార్యమును; కరిష్యతః= చేయఁగలవు.

రాముఁడా! చందనరసంబులందికొనుటకును, బాహుపురులు ధరించుకొనుటకును, యాచకునకు ధనములిచ్చుటకును స్నేహితులనుశత్రుబాధలం జిక్కకుండఁ గాపాడుటకును యోగ్యంబులయినయీనాబాహువులు రెండును, ఇప్పుడు, నీపట్టాభిషేకంబునకడ్డపడినవారలనందఱనుం బాఱఁదోలుట కుద్యోగింపఁగలవు. అని, తాత్పర్యము.

బ్రవీహి కోఽద్యైవ మయా వియుజ్యతాం
తవా సుహృత్ప్రాణయశస్సుహృజ్జనైః. ౪౦
యథా తవేయం వసుధా వశే భవే
త్తథైవ మాం శాధి తవాస్మి కింకరః

టీక॥ తవ=నీయొక్క; అసుహృత్= శత్రుఁడు; కః= ఎవ్వఁడు; మయా= నాచేత; అద్యైవ= ఇప్పుడె; ప్రాణయశస్సుహృజ్జనైః = ప్రాణములచేతను కీర్తిచేతను స్నేహితులచేతను; వియుజ్యతాం(వియోజ్యతాం)= విడువఁ

బడునట్లు చేయఁబడుఁగాక? బ్రవీహి (బ్రూహి)=చెప్పుము. యథా = ఎట్లు; ఇయం—ఈ; వసుధా= భూమి; తవ=నీయొక్క; వశే=అధీనతయందు ; భవేత్ — ఉండునో ; తథైవ=అట్లే: మాం=నన్ను; శాధి= ఆజ్ఞాపింపుము. అహం(అధ్యాహృతము)=నేను; తవ — నీకు; కింకరః= కింకరుండను ; అస్మి= అగుచున్నాను.

నీశత్రుం డెవ్వఁడు ? నేనిప్పు డెవ్వని ప్రాణంబులను గీర్తిశేషునిం గావలయును ? ఎవ్వని స్నేహితులం జంపవలయు? ఈభూమియంతయునీయధీనమగునట్టియుపాయంబవలంబించి మాత్రమున న్నాజ్ఞాపింపుము; ఈక్షణమె చేసెదను; నేననీకుఁగింకరుండనుగాని వేఱుగాదు. అని,లక్ష్మణుండు,రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

విమృజ్య బాష్పం పరిసాంత్వ్య చా సకృ
త్స లక్ష్మణం రాఘవవంశవర్ధనః. ౭౧
ఉవాచ పిత్ర్యే వచనే వ్యవస్థితమ్
నిబోధ మా మేషహి సౌమ్య సత్పథః

టీక॥ రాఘవవంశవర్ధనః=రఘువంశమునువృద్ధిఁబొందించునట్టి; సః—ఆరాముఁడు; బాష్పం=కన్నీటిని; విమృజ్య= తుడిచి ; అసకృత్ —పలుమాఱు ; పరిసాంత్వ్యచ = ఊఱడించియు ; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి;"సౌమ్య=తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా! మాం=నన్ను; పిత్ర్యే= తండ్రిసంబంధియయిన; వచనే—మాటయందు ; వ్యవస్థితం=స్థైర్యముఁగలవానిఁగా ; నిబోధ=తెలిసికొనుము. ఏషహి— ఇదియే; సత్పథః = సన్మార్గము.

లక్ష్మణునిమాటవిని, రఘువంశంబునువృద్ధిఁబొందించునట్టి రాముండు , లక్ష్మణునికన్నీళ్లుదుడిచి , పలుమాఱు మంచిమాటలనోదార్చి,యతనిఁజూచి, "లక్ష్మణుఁడా! నీవెప్పుడును సౌమ్యుఁడవే,ఇప్పుడేలయిట్లు కోపంబునొందితివి? నేను దండ్రిమాటను గొంచెమైననతిక్రమింపను; ఎట్లైననేమి?ఆయనచెప్పినట్లు చేయుటకు స్థిరచిత్తుండనై యున్నాఁడనని తెలిసికొనుము; ఇదియె పరమధ

ర్గము" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, త్రయోవింశస్సర్గః.
ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అయోధ్యాకాండత్రయోవింశసర్గటీక ,
ముగిసినది.

---

౨౪
చతుర్వింశసర్గ ప్రారంభః.

తం సమీక్ష్య త్వవహితం పితు ర్నిర్దేశపాలనే
కౌసల్యా బాష్పసంరుద్ధా వచో ధర్మిష్ఠ మబ్రవీత్. ౧

టీక॥ తం=ఆ రాముని; పితుః=తండ్రియొక్క; నిర్దేశపాలనే=ఆజ్ఞాపరిపాలనమందు;అవహితం=ఎచ్చరికగలవానిఁగా; సమీక్ష్యతు = చూచినంతనె,ఎఱింగినంతనెయనుట; కౌసల్యా=కౌసల్య; బాష్పసంరుద్ధా=కన్నీళ్లచేతడ్డగింపఁబడినదై; ధర్మిష్ఠం=మిక్కిలియుధర్మముగల; వచః=మాటను;అబ్రవీత్=చెప్పెను.

రాముఁడు, తండ్రియాజ్ఞాప్రకారము సేయుటకునిశ్చయించి దృఢచిత్తుండై యుండుటంజూచి, కౌసల్య, కన్నీళ్లవలనం దడఁబడుచు,ధర్మిష్ఠంబగునీ మాటంజెప్పెను.అని, తాత్పర్యము.

అదృష్టదుఃఖో ధర్మాత్మా సర్వభూతప్రియంవదః
మయి జాతో దశరథా త్కథ ముంఛేన వర్తయేత్. ౨

టీక॥ అదృష్టదుఃఖః= చూడఁబడని దుఃఖముగలవాఁడును; ధర్మాత్మా=ధర్మస్వభావుండును; సర్వభూతప్రియంవదః= సమస్తప్రాణులకునుప్రియముసేచెప్పువాఁడును; దశరథాత్=దశరథునివలన ; మయి=నాయందు ; జా

తః=పుట్టినవాఁడునగు; సః (అధ్యాహృతము)= ఆరాముఁడు ; కథం=ఎట్లు; ఉంఛేన=దైవవశంబున నేలరాలిన ధాన్యకణంబుల నేరుకొను వృత్తిచేత; వర్తయేత్=జీవించును?

ఎప్పుడునుదుఃఖంబనుభవించినవాఁడుగాఁడు, ధర్మాత్ముండు, సమస్తప్రాణులకును బ్రియంబగువార్తనే చెప్పువాఁడు; దశరథ మహారాజు నకును నాకును బుట్టినవాఁడు, అట్టి,రాముండు, దైవవశంబున నేలరాలిన ధాన్యకణంబుల నొక్కొ-క్కటిగానేరుకొని, యెట్లు జీవింపఁగలఁడు?

అని, తాత్పర్యము.

యస్య భృత్యాశ్చ దాసాశ్చ మృష్టా న్యన్నాని భుంజతే
కథం స భోక్ష్యతే నాథోవనే మూలఫలా న్యయమ్. ౩

టీక॥ యస్య=ఎవ్వనియొక్క; భృత్యాశ్చ=భటులును ; దాసాశ్చ=పరిచారకులును; మృష్టాని= శ్రేష్ఠములయిన; అన్నాని=అన్నములను; భుంజతే=తినుచున్నారో; సః=అట్టి ; నాథః=ప్రభుండగు; అయం=ఈరాముఁడు; వనే=అడవియందు ; మూలఫలాని=గడ్డలనుబండ్లను; కథం= ఎట్లు; భోక్ష్యతే=తినఁగలఁడు?

ఎవ్వని భృత్యులును బరిచారకులునుమృష్టాన్నంబులందినుచున్నారో,అట్టి నాథుండగు రాముండు, వనంబున, గడ్డలను ఫలంబులనుందినుచు, నెట్లు, మనియుండఁగలఁడు? అని, తాత్పర్యము.

క ఏత చ్ఛ్రద్దధే శ్రుత్వా కస్యవా న భవే ద్భయమ్
గుణవా న్దయితో రాజ్ఞా రాఘవో యద్వివాస్యతే. ౪

టీక॥ రాజ్ఞా=దశరథమహారాజుచేత; గుణవాన్=మంచిగుణంబులు గలవాఁడును; దయితః=ప్రియుండునగు; రాఘవః రాముఁడు;వివాస్యతే(ఇతి)యత్=అడవికిఁబంపఁబడుచున్నాఁడనునదియేదిగలదో; ఏతత్ = ఈమాటను; శ్రుత్వా=విని; కః=ఎవ్వఁడు; శ్రద్ధధేత్=నమ్మును? కస్యవా=ఎవ్వనికి ; భయం= వెఱపు;నభవేత్=కలుగదు.

దశరథమహారాజు , గుణవంతుండును సమస్త ప్రాణులకును బ్రియుండునగు రామునడవికిఁబంపు చున్నాఁడను

మాటనువినినను, ఇట్టిదియసంభావిత ముగావున, దీనినెవ్వరును నమ్మరు;అట్లునమ్ముదురేని, ప్రాణులందఱును మహాభయంబునొందుదురు.

అని, తాత్పర్యము.

నూనం తు బలవాన్ లోకే కృతాంత స్సర్వ మాదిశన్
లోకే రామాభి రామ స్త్వంవనం యత్ర గమిష్యసి. ౫

టీ॥ రామ=రాముఁడా;యత్ర=ఏదినిమిత్తముగా;లోకే=ప్రపంచమునందు;అభిరామః=ప్రియుండవగు;త్వం=నీవు;వనం=అడవినిగూర్చి;గమిష్యసి=పోఁగలవో; సర్వం= అంతను ; ఆదిశన్= ఆజ్ఞాపించుచున్న; సః (అధ్యాహృతము)=ఆ; కృతాంతః=దైవము; బలవాన్ తు=అధికబలముగలదే;నూనం=నిశ్చయము.

నీవు, సమస్తప్రాణులకును బ్రియుండవయ్యు, ఏదైవమువలనఁ బట్టాభిషేకమును విడిచియడవికిఁ బోఁబోవుచున్నానో, లోకమునందు సమస్త కార్యంబులకును మూలకారణం బయిన యాదైవము మిక్కిలిబలంబుగలదే;ఇది శ్చయము. అని, తాత్పర్యము.

అయంతు మా మాత్మ భవ స్తవాదర్శన మారుతః
విలాపదుఃఖ సమిధో రుదితాశ్రుహుతాహుతిః. ౬
చింతాబాష్పమహాధూమ స్తవాదర్శనచిత్తజః
కర్శయిత్వా భృశం పుత్ర నిశ్వాసాయాససంభవః. ౭
త్వయా విహీనా మిహమాం శోకాగ్ని రతు లోమహాన్
ప్రధక్ష్యతి యథా కక్షం చిత్రభాను హిమాత్యయే. ౮

టీక॥ పుత్ర = కొడుకా! ఆత్మభవః=దేహమునఁబుట్టినదియును; తవ= నీయొక్క; అదర్శనమారుతః= అగపడకుండుటయను గాలిగలదియును; విలాపదుఃఖసమిధః= ఏడ్పువలనఁగలిగినదుఃఖ మెకట్టెలుగాఁగలదియును; రుదితాశ్రుహుతాహుతిః= ఏడ్పువలనఁగలిగిన కన్నీళ్లెహుతమయిన యాహుతిగాఁగలదియును; చింతాబాష్ప మహాధూమః = వగపునఁగల్గినయుష్ణమెపొగ

గాఁగలదియును;తవ=నీయొక్క;అదర్శ నచిత్తజః=అగపడకుండుటవలనమనసునం బుట్టినదియును; నిశ్శ్వాసాయాససంభవః=నిట్టూర్పులతిరుగుడువలనఁగలిగినదియును; అతులః=సరిలేనిదియును; మహాన్=అధికమునగు; అయం=ఈ; శోకాగ్నిః = దుఃఖమనెడునగ్నిహోత్రము; ఇహ=ఇచ్చట;త్వయా=నీచేత; విహీనాం = విడువఁబడిన; మాం=నన్ను; హిమాత్యయే= శిశిరతుఁవునందు; చిత్రభానుః=నిప్పు; కక్షంయథా = పొదనుంబోలె ; భృశం=మిక్కిలియు;కర్శయిత్వా = కృశింపఁజేసి; మాం= నన్ను; ప్రధక్ష్యతి=దహింపఁగలదు.

కొడుకా! ఇంక, నిన్నుఁ జూడకుండుటవలన నాదేహంబునంబొడమి, నీవగపడకుండుటయె గాలిగాను, రోదనదుఃఖమెకట్టెలుగానుగన్నీరెయాహుతిగాను,జింతోష్ణంబెధూమంబుగానుం, గలిగి,నిట్టూర్పులవృద్ధింబొంది , యతులంబై చెలరేఁగినదుఃఖాగ్ని,శిశిరతుఁవునందు, మంచుచేఁదడుపం బడియుండు పొదను, దావాగ్ని,క్రమముగావాడఁజేసిదహించునట్లు, నిన్నువిడిచి యిచ్చటనొంటనున్న,నన్నుఁగృశింపఁజేసిదహింపఁగలదు. అని,తాత్పర్యము.

కథంహి ధేను స్స్వం వత్సం గచ్ఛంతం నానుగచ్ఛతి
అహం త్వానుగమిష్యామి యత్ర పుత్ర గమిష్యసి. ౯

టీక॥ పుత్ర=కొడుకా!ధేనుః= ఆవు; గచ్ఛంతం= పోవుచున్న; స్వం=తనదైన; వత్సం=దూడను;కథంహి=ఎట్లు; నానుగచ్ఛతి = వెంబడింపదు? త్వం(అధ్యాహృతము)=నీవు; యత్ర=ఎచ్చటికి; గమిష్యసి=పోయెదవో ; తత్ర(అధ్యాహృతము) = అచ్చటికి;అహం=నేను; త్వా = నిన్ను;అనుగమిష్యామి=వెంబడించెదను.

కొడుకా! ఆవు, తనదూడనువెంబడించిపోకయుండునా? అట్లునేనును,నీవెచ్చటికిఁబోయెదవో, అచ్చటికినీతోఁగూడవచ్చెదను. అని, కౌసల్యరామునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

తథా నిగదితం మాత్రా త ద్వాక్యం పురుషర్షభః
శ్రుత్వా రామోఽ బ్రవీ ద్వాక్యం మాతరం భృశదుఃఖితామ్. ౧౦

టీక॥ తథా=అట్లు; మాత్రా=తల్లి చేత; నిగదితం=చెప్పఁబడిన;తత్= ఆ; వాక్యం=మాటను; శ్రుత్వా= విని; పురుషర్షభః = పురుషశ్రేష్ఠుండగు; రామః= రాముఁడు; భృశదుఃఖితాం= మిక్కిలియుదుఃఖమునొందిన; మాతరం = తల్లినిగూర్చి; వాక్యం= మాటను;అబ్రవీత్ =చెప్పెను.

అట్లుతల్లి చెప్పినమాటనువిని, పురుషశ్రేష్ఠుండగు రాముండు, మిక్కిలియు దుఃఖము నొందియున్న తల్లింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కైకేయ్యా వంచితో రాజా మయి చారణ్య మాశ్రితే
భవత్యాపి పరిత్యక్తో ననూనం వర్తయిష్యతి. ౧౧

టీక॥ మయిచ=నేనును;అరణ్యం= అడవిని; ఆశ్రితే= పొందఁగా; కైకేయ్యా=కైకేయిచేత; వంచితః= వంచింపఁబడిన; రాజా=దశరథమహారాజు; భవత్యాపి=నీచేతనుగూడ; పరిత్యక్తః (చేత్)= విడువఁబడినవాఁడగునేని; నవర్తయిష్యతి=జీవింపఁడు. నూనం=నిశ్చయము.

దశరథుండు మొదలే కైకేయిచేవంచితుండైయున్నవాఁడు; నేనునువనము నకుఁబోయెదను; నీవును అతనివిడిచివత్తువేని, యతండెంత మాత్రముజీవింపలేఁడు; ఇదినిశ్చయము.
అని, తాత్పర్యము.

భర్తుః కిల పరిత్యాగో నృశంసః కేవలం స్త్రియాః
స భవత్యా న కర్తవ్యో మనసాపి విగర్హితః. ౧౨

టీక॥ స్త్రియాః=ఆఁడుదానికి; భర్తుః = పెనిమిటియొక్క; పరిత్యాగః=విడుచుట; కేవలం=మిక్కిలియు; నృశంసః= పాపముగల్గించునది. విగర్హితః= నిందింపఁబడిన; సః=ఆయుధర్మము; భవత్యా=నీచేత; మనసాపి=మనసుచేతనుంగూడ ;నకర్తవ్యః= చేయఁబడఁగూడదు.

ఆఁడుది, పెనిమిటినివిడుచునేని, మహా పాపంబునొందును; కాఁబట్టి, నీవు, లోకశాస్త్రవిరుద్ధంబగు నాకార్యమునుమనసు లోనంగూడఁ, దలంపరాదు. అని, తాత్పర్యము.

యావజ్జీవతి కాకుత్స్థః పితా మే జగతీపతిః
శుశ్రూషా క్రియతాం తావ త్స హి ధర్మ స్సనాతనః. ౧౩

టీక॥ మే=నాయొక్క; పితా=తండ్రియును; జగతీపతిః=భూమికిప్రభువునగు; కాకుత్స్థః=దశరథుఁడు; యావత్=ఎంతవఱకు; జీవతి=బ్రతికియుండునో; తావత్=అంతవఱకు; శుశ్రూషా=సేవ; క్రియతాం=చేయఁబడుఁగాక. సః=అది; సనాతనః=శాశ్వతమయిన; ధర్మోహి=ధర్మము గదా!

నా తండ్రి దశరథమహారాజు బ్రతికియుండునంతవఱకును, నీవతనికిం బరిచర్య సేయుచుండుము; నీకదియె శాశ్వతంబగు ధర్మము; ఇంకొ నేదియు శాశ్వతముగాదు. అని, రాముఁడు కౌసల్యతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తాతు రామేణ కౌసల్యా శుభదర్శనా
తథేత్యువాచ సుప్రీతా రామ మక్లిష్ట కారిణమ్. ౧౪

టీక॥ శుభదర్శనా=మంగళకరమయినబుద్ధిగల; కౌసల్యాతు=కౌసల్యయును; రామేణ=రామునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; సుప్రీతా=మిక్కిలియు సంతసించినదై; అక్లిష్టకారిణం=దుఃఖములేనట్లు సేయునట్టి; రామం=రామునిగూర్చి; తథా=అట్లే. ఇతి=అని; ఉవాచ=చెప్పెను.

మంగళకరంబగుధర్మబుద్ధిగల కౌసల్యాదేవి, రాముఁడుచెప్పినదివిని సంతోషంబునొంది, ఎదిటివారిదుఃఖముం బోవునట్లు సేయునట్టి రాముంజూచి, "నీవు చెప్పినట్టిచేసెదను" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు వచనం రామో ధర్మభృతాం వరః
భూయ స్తా మబ్రవీ ద్వాక్యం మాతరం భృశదుఃఖితామ్. ౧౫

టీక॥ ధర్మభృతాం= ధర్మమునుభరించువారిలోపల; వరః= శ్రేష్ఠుండ

యిన; రామస్తు=రాముండును; ఏవం= ఇట్లు; వచనం=మాటను; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; భృశదుఃఖితాం= మిక్కిలియు దుఃఖము నొందియున్న; తాం=ఆ; మాతరం= తల్లినిగూర్చి; భూయః=మఱల; వాక్యం= మాటను; అబ్రవీత్=చెప్పెను.

ధార్మికులలో నుత్తముండగు రాముండు, తల్లిమాటవిని, యంతమఱలంబరమదుఃఖితయయి యున్న తల్లిం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మయా చైవ భవత్యా చ కర్తవ్యం వచనం పితుః

టీక॥ మయా చైవ=నాచేతను; భవత్యా చ=నీచేతను; పితుః= తండ్రియయినదశరథమహారాజుయొక్క; వచనం=మాట; కర్తవ్యం = చేయఁబడవలసినది.

నేనుమాత్రమె కాదు; నీవును నేను ఇద్దఱమును, నాతండ్రిదశరథమహారాజు చెప్పినట్లు, నడుచుకొనవలసినది.

అని, తాత్పర్యము.

రాజా భర్తా గురుశ్శ్రేష్ఠ స్సర్వేషా మీశ్వరః ప్రభుః. ౧౮

టీక॥ సః (అధ్యాహృతము)= ఆదశరథుఁడు; సర్వేషాం= అందఱకును; రాజా=సంతోషముగల్గించువాఁడు. భర్తా=పోషించువాఁడు. గురుః= ఆచార్యుఁడు. శ్రేష్ఠః = ఉత్తముఁడు. ఈశ్వరః=అధిపతి. ప్రభుః = నియామకుండు.

ఆదశరథుఁడు, మనకందఱకును, రాజును, పోషించువాఁడును, ఆచార్యుండును, పూజింపఁదగినవాఁడును, అధిపతియును, ప్రభుండును, గావున, మనమందఱమును, అతనిమాటకు లోఁబడవలసినవారమే. అని, తాత్పర్యము.

ఇమానితు మహారణ్యే విహృత్య నవ పంచచ
వర్షాణి పరమప్రీత స్థ్సాస్యామి వచనే తవ. ౧౯

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; ఇమాని=ఈ; నవ= తొమ్మిదియును; పంచచ=అయిదును, పదునాలుగనుట; వర్షాణితు=సంవత్సరముల

నుమాత్రము; మహారణ్యే = కాఱడవి యందు; విహృత్య = క్రీడించి; పరమప్రీతః = మిక్కిలియు సంతసించిన వాఁడనై; తవ = నీయొక్క; వచనే = మాట యందు; స్థాస్యామి = ఉండెదను.

నేను, ఈపదునాలుగుసంవత్సరంబులుమాత్రము, మహారణ్యంబునసుఖంబుగాఁ గాలంబుగడపి, యటుపిమ్మటఁ బరమసంతోషంబున, నీయాజ్ఞలోనే యుండెదను. అనిరాముండు కౌసల్యతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా ప్రియం పుత్రం బాష్పపూర్ణాననా తదా
ఉవాచ పరమార్తా తు కౌసల్యా పుత్రవత్సలా. ౧౮

టీక॥ తదా = అప్పుడు; పుత్రవత్సలా = కొడుకునందలిప్రేమగల; కౌసల్యా = కౌసల్య; ఏవం = ఇట్లు; ఉక్తా = చెప్పఁబడినదై; బాష్పపూర్ణాననా = కన్నీటనిండినముఖముగలదై; పరమార్తా = మిక్కిలియుదుఃఖము నొందినదై ("తు" అనునది పాదపూరణార్థము); ప్రియం = సంతోషకరుండగు; పుత్రం = కొడుకునుగూర్చి; ఉవాచ = చెప్పెను.

అప్పుడు, రాముండు చెప్పినదివిని, కొడుకునందలిప్రేమంబుగల కౌసల్యాదేవి, మొగంబంతయుఁ గన్నీరునిండఁగాఁ, బరమదుఃఖితయయి, ప్రియపుత్రుండగురామునిఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఆసాం రామ సపత్నీనాం వస్తుం మధ్యే న మే క్షమమ్

టీక॥ రామ = రాముఁడా! ఆసాం = ఈ; సపత్నీనాం = చవతులయొక్క; మధ్యే = నడుమునందు; వస్తుం = ఉండుటకు; మే = నాకు; నక్షమం = మంచిది కాదు.

రాముఁడా! నాకుశత్రువులయినయీ చవతులనడుమనుండుట నాకు మంచిది కాదు; కావున, నన్నునీతోఁగూడఁ దీసికొనిపొమ్ము. అనితాత్పర్యము.

నయ మామపి కాకుత్స్థ వనం వన్యాం మృగీం యథా. ౧౯

యది తే గమనే బుద్ధిః కృతా పితు రపేక్షయా

టీక॥ కాకుత్థ్స=రాముఁడా! పితుః=తండ్రియొక్క; అపేక్షయా=ఇచ్ఛచేత; తే=నీకు; గమనే=పోవుటయందు; బుద్ధిః=తలంపు; కృతా యది=చేయఁబడిన దగునేని; వన్యాం=అడవియందుఁబుట్టిన; మృగీం యథా=లేడినింబోలె; మాం అపి=నన్నును; వనం=అడవిని; నయ=పొందింపుము.

రాముఁడా! నీవు తండ్రియాజ్ఞచేత నడవికిం బోవ నిశ్చయించితివేని, అడవిలేడినింబోలె నన్నును అడవికిం దీసికొనిపొమ్ము; అడవిలేడి యడవిలో సంతోషంబున నుండునట్లు, నేనును, నీకు శ్రమంబు గలుగఁజేయక సంతోషంబుననుండెదను. అని, కౌసల్య రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తాం తథా రుదతీం రామో రుదన్ వచన మబ్రవీత్. ౨౦

టీక॥ రామః=రాముఁడు; రుదన్=ఏడ్చుచు; తథా=అట్లు; రుదతీం=ఏడ్చుచున్న; తాం=ఆకౌసల్యనుగూర్చి, వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

అట్లు వచించి యేడ్చుచున్నతల్లిని గౌసల్యం జూచి, రాముఁడును దుఃఖంబున రోదనంబుసేయుచు, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

జీవంత్యా హి స్త్రియా భర్తా దైవతం ప్రభు రేవచ

టీక॥ భర్తా=పెనిమిటి; జీవంత్యాః=బ్రతికియున్న; స్త్రియాః=ఆఁడుదానికి; దైవతం=దేవుఁడును ప్రభురేవచహి=అధిపతియునుగదా!

బ్రతికియున్నంతవఱకు, ఆఁడుదానికిఁ బెనిమిటి యే దేవుండును బ్రభుండు, మఱి యెవ్వరిని, ఆఁడుదియాశ్రయింపఁగూడదు. అని, తాత్పర్యము.

భవత్యా మమచైవాద్య రాజా ప్రభవతి ప్రభుః. ౨౧

టీక॥ అద్య=ఇప్పుడు; ప్రభుః=నియామకుండును; రాజా=రాజు

నగుదశరథమహారాజు; భవత్యాః=నీకును; మమచైవ=నాకును; ప్రభవతి=

నియామకుండగుచున్నాఁడు.

అట్లగుటంజేసి, దశరథ మహారాజు, నాకుమాత్రమె కాదు; నాకును నీకునుంగూడ, నియామకుండగుచున్నాఁడు. అని, తాత్పర్యము.

సహ్యా నాథా వయంరాజ్ఞా లోకనాథేన ధీమతా

టీక॥లోకనాథేన = ప్రపంచమునకుఁ ప్రభుండును; ధీమతా = ధర్మబుద్ధి గలవాఁడునగు; రాజ్ఞా = దశరథమహారాజుచేత; సనాథాః (అధ్యాహృతము) = నాథునితోఁగూడియున్న; వయం = మనము; అనాథాః = నాథుఁడు లేనివారలము; సహి = కాముగదా!

లోకంబునంతయుఁ బాలింపఁగలవాఁడును, ధార్మికుండునగుదశరథ మహారాజుమనకునాథుండై యున్నాఁడు గదా! నీవనాథవుగావే! నీకేమితక్కువ? అనాథయుంబోలె నేలభయంపడుచున్నాఁవు? అని, తాత్పర్యము.

భరతశ్చాపి ధర్మాత్మా సర్వభూతప్రియంవదః. ౨౨

టీక॥ భరతశ్చాపి = భరతుండును; ధర్మాత్మా = ధర్మస్వభావుండు. సర్వభూతప్రియంవదః = సమస్తప్రాణులకును బ్రియముగామాటలాడువాఁడు.

"అయితే, నాకుఁజవతులవలని భయంబున్నదే" యనిచెప్పుదువుకాఁబోలు ; రాజు కాఁబోలు. భరతుండును, మిక్కిలి ధార్మికుండు ; సర్వ ప్రాణులకును బ్రియము సేయువాఁడు; కావున, నీయందువాత్సభక్తియుంచి, నిన్నురక్షించుచుండును; భయపడకుము. అని, తాత్పర్యము.

భవతీ మనువర్తేత సహి ధర్మరత స్సదా

టీక॥ ధర్మరతః = ధర్మమునందాసక్తుండగు; సః = ఆభరతుండు; సదా = ఎల్లప్పుడును; భవతీం = నిన్ను; అనువర్తేతహి = అనుసరించుచు సేయుండును.

"అయితే, భరతుండు, స్వభావంబున ధార్మికుండయ్యును, గైకేయిమాట విని, యేమైమనను అపకారంబుసేయు

ను" అనియందువుకాఁబోలు; అతఁడు, ధర్మంబునందుమిక్కిలియుం బ్రీతిగలఁవాఁడు; కావున, సతండెప్పుడును, ఎవ్వరుచెప్పినను ధర్మవిరుద్ధంబగు మార్గంబునం బ్రవర్తింపఁడు; ఎల్లప్పుడు ననీకుఁబరిచర్య సేయుచు నేయుండును.

అని, తాత్పర్యము.

యథా మయి తు నిష్క్రాంతే పుత్రశోకేన పార్థివః. ౨౩
శ్రమం నావాప్నుయా త్కించి దప్రమత్తా తథా కురు

టీక॥ మయి= నేను; నిష్క్రాంతే తు=పోఁగానే; యథా = ఎట్లు, పార్థివః = దశరథమహారాజు; పుత్రశోకేన = పుత్రదుఃఖముచేత; కించిత్=కొంచెమయినను; శ్రమం = ఆయాసమును; నావాప్నుయాత్ =పొందకుండునో; తథా=అట్లు; అప్రమత్తా= ఏమఱుపాటులేనిదానవై; కురు = చేయుము.

నేనువనంబునకుఁబోయినపిదప, నీవెంతమాత్రమే మఱుపాటులేనిదానవై, దశరథమహారాజునకుఁ, బుత్రదుఃఖంబునంగొంచెమయిన నాయాసంబుగల్గకుండునట్లు, మంచిమాటలం దేర్చుచు, నుపచారంబులు సేయుచుండుము.

అని, తాత్పర్యము.

దారుణ శ్చాప్యయం శోకో యథైనం న వినాశయేత్. ౨౪
రాజ్ఞో వృద్ధస్య సతతం హితం చర సమాహితా

టీక॥ యథా=ఎట్లు; దారుణః=భయంకరమయిన; అయం=ఈ; శోకశ్చ=పుత్రదుఃఖమును; ఏనం= ఈదశరథమహారాజును; నవినాశయేత్ = నశింపంజేయదో; తథా (అధ్యాహృతము)=అట్లు; త్వం(అధ్యాహృతము)= నీవు; సతతం= ఎల్లప్పుడును; సమాహితా= ఎచ్చరికగలదానవై; వృద్ధస్య= ముసలివాఁడగు; రాజ్ఞః=దశరథమహారాజునకు; హితం= ప్రియమును; చర=చేయుము.

భయంకరమగు, నీపుత్రశోకమున, వృద్ధుండగుదశరథమహారాజునకు, మరణంబుగల్గకుండునట్లు, నీవెచ్చరికతో

నుండి, యతనికిఁ బ్రియంబులగు నుపచారంబులు సేయుచుండుము.

అని, తాత్పర్యము.

వ్రతోపవాసనిరతా యా నారీ పరమోత్తమా. ౨౫
భర్తారం నానువర్తేత సాతు పాపగతి ర్భవేత్

టీక॥ యా=ఏ; నారీ=స్త్రీ; వ్రతోపవాసనిరతా= వ్రతములయందునుఉపవాసములయందు నాసక్తురాలయి; పరమోత్తమా = మిక్కిలియుఁ శ్రేష్ఠురాలై; భర్తారం= పెనిమిటిని; నానువర్తేత = అనుసరింపదో; సాతు= ఆబిడయు; పాపగతిః=పాపమేఫలము గాఁగలది; భవేత్ =అగును.

ఎల్లప్పుడును వ్రతంబులనుపవాసంబులుఁ జేయుచు, మిక్కిలియు నుత్తమయని పేరువహించిన స్త్రీయును, పెనిమిటి ననుసరించియుండ దేని, పాపిష్ఠురాలేయగును. అని, తాత్పర్యము.

భర్తు శ్శుశ్రూషయా నారీ లభతే స్వర్గ ముత్తమమ్. ౨౬
అపి యా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్

టీక॥ యా=ఏయాఁడుది; నిర్నమస్కారా= నమస్కారములు లేనిదియును, భర్తకన్న నితరులగుబ్రాహ్మణాదులకు నమస్కారము సేయనిదయుననుట; దేవపూజనాత్ = దేవతలపూజించుటనుండి; నివృత్తా= మఱలినదియునో, దేవపూజ సేయకున్నదియునో; సా(అధ్యాహృతము)= ఆ; నార్యపి= స్త్రీయయినను; భర్తుః = పెనిమిటియొక్క; శుశ్రూషయా= సేవచేత; ఉత్తమం=శ్రేష్ఠమయిన; స్వర్గం= స్వర్గమును; లభతే=పొందుచున్నది.

బ్రాహ్మణులు మొదలగు పెద్దలకెప్పుడును నమస్కరింపక దేవతలం బూజింపకుండు స్త్రీయును, భర్తకు భక్తితో శుశ్రూష సేయుచుండునేని, యుత్తమంబగు స్వర్గంబునొందును.

అని, తాత్పర్యము.

శుశ్రూషామేవ కుర్వీత భర్తుః ప్రియహితే రతా. ౨౭

స ౨౪

టీక॥ నారీ (అధ్యాహృతము)=స్త్రీ; భర్తుః=పెనిమిటికి; ప్రియహితే= ఇష్టంబును మేలునగు దానియందు; రతా= అసక్తురాలై; శుశ్రూషామేవ=సేవనే; కుర్వీత=చేయవలెను.

ఆడుది, యెప్పటికిని, పెనిమిటికి, మనస్సంతోషంబు గలిగించునవియు మేలు గలిగించునవియునగు కార్యంబులం జేయుచు, సేవ చేయుచు నేయుండవలయును. అని, తాత్పర్యము.

ఏష ధర్మః పురా దృష్టో లోకే వేదే శ్రుతః స్మృతః

టీక॥ ఏషః=ఈ; ధర్మః= ధర్మము; పురా=పూర్వమునుండి; లోకే= లోకమునందు; దృష్టః=చూడఁబడినది. వేదే=వేదమునందు; శ్రుతః= వినఁబడినది. స్మృతః=స్మృతులయందును జెప్పఁబడినది.

ఈధర్మము, లోకంబునందలి శిష్టాచారమువలనం దెలియవచ్చుచున్నది; అట్లు వేదమునను జెప్పఁబడియున్నది; తదనుకూలముగనే స్మృతులయందునుం జెప్పఁబడియున్నది. అని, తాత్పర్యము.

అగ్నికార్యేషు చ సదా సుమనోభిశ్చ దేవతాః. ౨౫
పూజ్యాస్తే మత్కృతే దేవి బ్రాహ్మణాశ్చైవ సువ్రతాః

టీక॥ దేవి=తల్లీ! మత్కృతే=నాకొఱకు; అగ్నికార్యేషు చ = హోమములయందును; సుమనోభిశ్చ= పుష్పములచేతను; దేవతాః=దేవతలును; సువ్రతాః = మంచివ్రతములుగల; బ్రాహ్మణాశ్చైవ = బ్రాహ్మణులును; తే=నీకు; పూజ్యాః పూజింపఁదగినవారలు.

తల్లీ! నీవు, నేనువచ్చువఱకు నాక్షేమార్థమై, హోమములచేతను పుష్పాదులచేతను దేవతలం బూజింపుచుండుము; మఱియు, బ్రాహ్మణోత్తములను వివిధదానములచేతం దనుపుచుండుము. అని తాత్పర్యము.

ఏవం కాలం ప్రతీక్షస్వ మమాగమనకాంక్షిణీ. ౨౬
నియతా నియతాహారా భర్తృశుశ్రూషణే రతా

టీక॥ త్వం అధ్యాహృతము)= నీవు; ఏవం=ఇట్లు; మమ=నాయొక్క ; ఆగమనకాంక్షిణీ=వచ్చుటనుగోరు దానవై; నియతా=నియమముతోఁగూడిన దానవై; నియతాహారా= నియమముతోఁగూడినయాహారముగల దానవై; భర్తృశుశ్రూషణే=పతిసేవయందు; రతా=ఆసక్తిగలదానవై; కాలం = నేనువచ్చుకాలమును ; ప్రతీక్షస్వ=ఎదురుచూచుచుండుము.

నీవిట్లు, నేనుసుఖంబుగవనంబునుండి యింటికివచ్చుటంగోరుచు, నియమంబవలంబించి మధుమాంసాదులవిడిచి శుద్ధంబగుసాత్త్వికాహారంబు గొనుచుఁ బెనిమిటికిశుశ్రూషసేయుచు, నీపదునాలుగువత్సరంబులను గడుపుము.

అని, తాత్పర్యము.

ప్రాప్స్యసే పరమం కామం మయి ప్రత్యాగతే సతి. ౩౦
యది ధర్మభృతాం శ్రేష్ఠో ధారయిష్యతి జీవితమ్

టీక॥ మయి=నేను; ప్రత్యాగతేసతి=మఱలరాఁగానే; ధర్మభృతాం= ధర్మంబుభరించువారలలోపల ; శ్రేష్ఠః=ఉత్తముండగుదశరథమహారాజు; జీవితం=ప్రాణమును ; ధారయిష్యతి యది=తాల్చియుండునేని; పరమం = ఉత్తమంబయిన; కామం= కోరికను ; ప్రాప్స్యసే=పొందఁగలవు.

నేనువనంబునుండివ అలవచ్చినపిమ్మట, ధార్మికోత్తముండగు దశరథుండు బ్రతికియున్నపక్షమున, నీవ్రక్కోర్కులన న్నింటినిఁబొందఁగలవు. అని, రాముండు, కౌసల్యతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తాతు రామేణ బాష్పపర్యాకులేక్షణా. ౩౧
కౌసల్యా పుత్రశోకార్తా రామం వచన మబ్రవీత్

టీక॥ కౌసల్యా=కౌసల్యాదేవి; రామేణ=రామునిచేత; ఏవం= ఇట్లు; ఉక్తాతు=చెప్పఁబడినదైనంతనే; బాష్పపర్యాకులేక్షణా= కన్నీరుచేఁగలఁతఁజెందినకండ్లుగలదై; పుత్రశోకార్తా= పుత్రదుఃఖముచేఁబీడింపఁబడినదై; రామం=రామునిగూర్చి; వచనం= మాటను; అబ్రవీత్=చెప్పెను.

కౌసల్యాదేవి, రాముండు చెప్పినది విని, తనప్రియపుత్రుండగు రాముండు వనంబునకుం బోవుచున్నాండేయని పుత్ర దుఃఖంబునం బరితపించుచుం, గండ్లనిండ నీళ్లు గార్చుచు, రామునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

గమనే సుకృతాం బుద్ధిం న తేశక్నోమి పుత్రక. ౩౨
వినివర్తయితుం వీర నూనం కాలో దురత్యయః

టీ॥ వీర = పరాక్రమశాలివగు; పుత్రక = చిన్నికొడుకా! గమనే = పోవుటయందు; సుకృతాం = మిక్కిలియు దృఢమయిన; తే = నీయొక్క; బుద్ధిం = తలంపును; వినివర్తయితుం = మఱలించుటకు; నశక్నోమి = చాలను. కాలః = కాలము; దురత్యయః = అతిక్రమింపంగూడనిది. నూనం = నిశ్చయము.

కొడుకా! నీవు పరాక్రమశాలివి; కావునని కెందును భయములేదు; వనంబునకుం బోవలయునని నీవు గట్టిగాం బట్టియున్నావు; దానిం ద్రిప్పుటకు నాచేతంగాలేదు; కావున నే కాలము నతిక్రమింపనలవిగాదని చెప్పుదురు.
అని, తాత్పర్యము.

గచ్ఛ పుత్ర త్వ మేకాగ్రో భద్రం తేస్తు సదా విభో. ౩౩

టీ॥ పుత్ర = కొడుకా! త్వం = నీవు; ఏకాగ్రః = కలంకంబాఱిన మనసులేనివాండవై; గచ్ఛ = పొమ్ము; విభో = ప్రభుండవగు రాముండా! సదా = ఎల్లప్పుడును; తే = నీకు; భద్రం = మంగళము; అస్తు = అగుంగాక.

కొడుకా! నీవు చాపలంబునొందక వనంబునకుం బొమ్ము; నీ కెందును మంగళమేయగును గాక. అని, తాత్పర్యము.

పున స్త్వయి నివృత్తేతు భవిష్యామి గతక్లమా

టీ॥ త్వయి = నీవు; పునః = మఱల; నివృత్తేతు = మఱలిరాంగానే; గతక్లమా = పోయినదుఃఖము గలదానను; భవిష్యామి = కాంగలను.

నీవు మఱలవనంబునుండి రాంగానే నాదుఃఖంబంతయుం బోయి, నాకు సు

ఖంబుగలుగును. అని, తాత్పర్యము.

ప్రత్యాగతే మహాభాగే కృతార్థే చరితవ్రతే. ౩౪
పితు రానృణ్యతాం ప్రాప్తే త్వయి లప్స్యే పరం సుఖమ్

టీక॥ మహాభాగే=పూజ్యమగుభాగ్యముగలవాఁడవును; కృతార్థే=నెఱవేఱినప్రయోజనము గలవాఁడవును; చరితవ్రతే=చేయఁబడినవ్రతముగలవాఁడవును; పితుః=తండ్రికి; ఆనృణ్యతాం=ఋణములేకుండుటను; ప్రాప్తే=పొందినవాఁడవునగు; త్వయి=నీవు; ప్రత్యాగతే=మఱలిరాఁగానే; పరం=అధికమైన; సుఖం=సౌఖ్యమును; లప్స్యే=పొందఁగలను.

మహాభాగుఁడవగు నీవు, పితృవచనపరిపాలనవ్రతంబాచరించి, కృతార్థుండవై, తండ్రిఋణంబుదీర్చుకొని, వనంబునుండి మఱలవచ్చినపిదప, నేను బరమసౌఖ్యంబునొందఁగలను.

అని, తాత్పర్యము.

కృతాంతస్య గతిః పుత్ర దుర్విభావ్యా సదా భువి. ౩౫
య స్త్వా సంచోదయతి మే వచ ఆచ్ఛిద్య రాఘవ

టీక॥ రాఘవ=రాముఁడా! యః=ఏది; మే=నాయొక్క; వచః=మాటను; ఆచ్ఛిద్య = తిరస్కరించి; త్వాం=నిన్ను; సంచోదయతి=ప్రేరించుచున్నదో; పుత్ర=కొడుకా! తస్య (అధ్యాహృతము)=అట్టి; కృతాంతస్య=దైవముయొక్క; గతిః=గమనము; సదా=ఎల్లప్పుడును; భువి=భూమియందు; దుర్విభావ్యా=ఎన్నరానిది.

రాముఁడా! నేనెంత చెప్పినను వినకుండ వనంబునకుఁబోఁగోరునట్లు నిన్నుఁ బ్రేరేపించుచున్నదే, ఈదైవబలము, ఇంతయనియెన్నుటకలవిగాదు.

అని, తాత్పర్యము.

గచ్ఛేదానీం మహాబాహో క్షేమేణ పున రాగతః. ౩౬
నందయిష్యసి మాం పుత్ర సామ్నా వాక్యేన చారుణా

టీక॥ మహాబాహో= పెద్దచేతులు గలరాముఁడా! ఇదానీం=ఇప్పుడు; గ

చ్ఛ=పొమ్ము. పుత్ర= కొడుకా! క్షేమే ణ=క్షేమముతో; ఆగతః= వచ్చినవాఁడవై; మాం=నన్ను; సామ్నా= తిన్ననిదియును; చారుణా=మనోహరంబునగు; వాక్యేన=మాటచేత; నందయిష్యసి=సంతసింపఁజేయఁగలవు.

రాముఁడా! నీవు మహాబాహుండవు కావున, నీకన్నిటను జయంబె గలుగును; నీవు మరల క్షేమంబునను వచ్చుటకే వచ్చి మనోహరంబగు సామవచనంబున, నన్నానందింపఁగలవు. అని, తాత్పర్యము.

అపీదానీం స కాలస్స్యాద్వనాత్ప్రత్యాగతం పునః. ౩౭
యత్త్వాం పుత్రక పశ్యేయం జటావల్కలధారిణమ్

టీక॥ పుత్రక=చిన్నికొడుకా! యత్=ఏకాలమునందు; పునః= మరల; వనాత్=అడవినుండి; ప్రత్యాగతం= వచ్చినవాఁడవును; జటావల్కలధారిణం=జడలను నారచీరలను దాల్చినవాఁడవునగు; త్వాం=నిన్ను; పశ్యేయం= చూతునో; సః=ఆ; కాలః=కాలము; ఇదానీం=ఇప్పుడే; అపిస్యాత్ = కలుగునా!

ఏకాలమునందు, నాను, జడలును నారచీరలును దాల్చి వనంబునుండి మరలి వచ్చిననిన్నుఁ, జూడఁగలుగునో, అట్టి, చతుర్దశసంవత్సరానంతర కాలము, ఇప్పుడె వచ్చినచో నాకుసంతోషముగానుండును. అని, తాత్పర్యము.

తథాహి రామం వనవాస నిశ్చితం
సమీక్ష్య దేవీ పరమేణ చేతసా. ౩౮
ఉవాచ రామం శుభలక్షణం వచో
బభూవ చ స్వస్త్యయనాభికాంక్షిణీ

టీక॥ దేవీ=కౌసల్యాదేవి; తథా= అట్లు; వనవాసనిశ్చితం=వనంబుననుండుటయందు నిశ్చయించియున్న ; రామం=రాముని; సమీక్ష్య=చూచి; పరమేణ=ఉత్తమంబగు; చేతసా = మనస్సుచేత; శుభలక్షణం=మంగళకరంబులగులక్షణములుగల; రామం= రాముని గూర్చి; వచః=మాటను; ఉవాచహి=

చెప్పెనుగదా! స్వస్త్యయనాభికాంక్షిణీచ=మంగళాశీర్వ్వచనముసేయఁ గోరునదియు; బభూవ=అయినది.

కౌసల్యాదేవి, రాముండట్లు పితృవచన ప్రకారమున వనవాసంబు సేయనిశ్చయించియున్నాఁడని యెఱింగి, మంగళ లక్షణంబులతోఁగూడినయారాముంజూచి, ఆదరంబుతోనుదాహరింపఁబడినవిధంబునం జెప్పి, రామునకు, మంగళాశీర్వచనంబులొసంగఁగోరెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, చతుర్వింశస్సర్గః.
ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ చతుర్వింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

షడ్వింశసర్గప్రారంభః.

సా పనీయ త మాయాస ముపస్పృశ్య జలం శుచిః
చకార మాతా రామస్య మంగళాని మనస్వినీ. ౧

టీక॥ మనస్వినీ=మంచిమనస్సుగలదు; మాతా=తల్లియయిన; సా=ఆ కౌసల్య=తం=ఆ; ఆయాసం=దుఃఖమును; అపనీయ=విడిచి; జలం=నీటిని; ఉపస్పృశ్య=ఆచమించి; శుచిః=పరిశుద్ధమై; రామస్య=రామునకు; మంగళాని=మంగళాశీర్వచనములను; చకార=చేసెను.

మంచిమనసుగల యాకౌసల్యాదేవి, యాదుఃఖంబునువిడిచి, రోదనంబుగావిందుటవలనఁగలిగిన మైలంబోఁగొట్టుకొనుటకై, యాచమనంబుచేసి, రామునకు మంగళాశీర్వచనంబులు గావించెను. అని, తాత్పర్యము.

నశక్యసే వారయితుం గచ్ఛేదానీం రఘూత్తమ
శీఘ్రం చ వినివర్తస్వ వర్తస్వచ సతాం క్రమే. ౨

టీక॥ రఘూత్తమ = రాముఁడా! వారయితుం=అడ్డగించుటకు; నశక్యసే=అలవిగాకున్నావు. ఇదానీం = ఇప్పుడు; గచ్ఛ=పొమ్ము. శీఘ్రం = శీఘ్రముగా; వినివర్తస్వచ= మఱలిరమ్ము. సతాం=పెద్దలయొక్క; క్రమే= మార్గమునందు; వర్తస్వచ=ఉండుము.

రాముఁడా! నేనెంతచెప్పినను వినక వనంబునకుఁ బోవనిశ్చయించియున్నావు; నీయిష్టప్రకారమిప్పుడు వనంబునకుం బొమ్ము; అయితే అట్లేగాచ్చటనుండక, పదునాలుగు సంవత్సరములయిన వెంటనే, మఱలిరమ్ము; సత్పురుషుల యాచారమును వదలకుము.

అని, తాత్పర్యము.

యం పాలయసి ధర్మం త్వం ధృత్యాచ నియమేనచ
సవై రాఘవశార్దూల ధర్మస్త్వా మభిరక్షతు. ౩

టీక॥ రాఘవశార్దూల=రఘువంశమునందుత్తముఁడవైన రాముఁడా! త్వం=నీవు; ధృత్యాచ= సంతోషముచేతను; నియమేనచ = నియతిచేతను; యం=ఏ; ధర్మం=ధర్మమును; పాలయసి= పాలించుచున్నావో, తప్పక యనుష్ఠించుచున్నావోయనుట; సః= ఆ ("వై" అనునది పాదపూరణార్థము); ధర్మః= ధర్మము; త్వాం=నిన్ను; అభిరక్షతు= అంతటను గాపాడునుగాక.

రాముఁడా! నీవు, సంతోషంబుగలవాఁడవై, నియమంబున, నే ధర్మంబును, గొంచెమయినను దప్పకుండ ననుష్ఠించుచున్నాఁడవో, ఆ ధర్మమె నిన్ను సమస్తకాలంబులందును రక్షించుచుండుఁగాక. అని, తాత్పర్యము.

యేభ్యః ప్రణమసే పుత్ర చైత్యేష్వాయతనేషుచ
తేచ త్వా మభిరక్షంతు వనే సహ మహర్షిభిః. ౪

టీక॥ పుత్ర=కొడుకా; చైత్యేషు= నాలుగుదారులు కలయు మార్గములం

దును;ఆయతనేషుచ=దేవాలయములం దును; యేభ్యః = ఎవరికొఱకు; ప్రణమసే = నమస్కరించుచున్నావో; తేచ=ఆదేవతలును; వనే = అడవియందు; మహర్షిభిస్సహ= పూజ్యులయినఋషులతోఁగూడ; స్థితం(అధ్యాహృతము)=ఉన్న; త్వాం= నిన్ను; అభిరక్షంతు = అంతటను గాపాడుదురుగాక.

కొడుకా! నీవు, ప్రతిదినమును జతుష్పథంబులయందును దేవస్థానంబులందును, ఏదేవతలకు నమస్కారముసేయుచుందువో, ఆదేవతలు, అడవియందు మహర్షులతోఁగూడనున్న నిన్ను, అన్నివిషయంబులం గాపాడుదురుగాక. అని,తాత్పర్యము.

యాని దత్తాని తేఽస్త్రాణి విశ్వామిత్రేణ ధీమతా
తాని త్వా మభిరక్షంతు గుణై స్సముదితం సదా. ౫

టీక॥ధీమతా=బుద్ధిమంతుఁడగు; విశ్వామిత్రేణ = విశ్వామిత్రుని చేత; తే=నీకొఱకు; యాని=ఏ;అస్త్రాణి=అస్త్రములు; దత్తాని = ఇవ్వఁబడినవో;తాని= ఆయస్త్రంబులు;గుణైః=గుణములచేత;సముదితం= శ్రేష్ఠుండవగు;త్వా=నిన్ను; సదా = ఎల్లప్పుడును;అభిరక్షంతు= అంతటను,కాపాడుచుండుఁగాక.

బుద్ధిమంతుండగు విశ్వామిత్రుండు, నీకొసంగినదివ్యాస్త్రంబులన్నియు, సద్గుణ సంపన్నుండవగునిన్ను, ఎల్లప్పుడును,సమస్తస్థలంబులందును, రక్షించుచుండుఁగాక. అని,తాత్పర్యము.

పితృశుశ్రూషయా పుత్ర మాతృశుశ్రూషయా తథా
సత్యేనచ మహాబాహో చిరం జీవాభిరక్షితః. ౬

టీక॥ మహాబాహో=పెద్దచేతులుగల; పుత్ర=కొడుకా! పితృశుశ్రూషయా=పితృసేవచేతను; తథా = అట్లు;మాతృశుశ్రూషయా=మాతృసేవచేతను;సత్యేనచ;సత్యముచేతను;అభిరక్షితః=అంతటను గాపాడఁబడినవాఁడవై; చిరం= బహుకాలము;జీవ= బ్రతుకుము.

మహాబాహుఁడవగు రాముఁడా! నీవు, ధర్మంబుదప్పక చేయుచుండినపి

తృసేవయు మాతృసేవయు నీసత్యవ్రతంబును, నిన్ను, అన్నిసంకటంబులనుండి రక్షింపుచుండుఁగాక.

అని, తాత్పర్యము.

సమిత్కుశపవిత్రాణి వేద్యశ్చాయతనానిచ
స్థండిలాని విచిత్రాణి శైలా వృక్షాః క్షుపా హ్రదాః. ౭
పతంగాః పన్నగా స్సింహా స్త్వాం రక్షంతు నరోత్తమ

టీక॥ నరోత్తమ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! సమిత్కుశపవిత్రాణి= సమిత్తులును దర్భలును బవిత్రంబులును (దర్భముడులును); వేద్యశ్చ = అగ్నివేదికలును; ఆయతనానిచ= దేవస్థానంబులును; విచిత్రాణి = నానావిధములయిన; స్థండిలాని= దేవపూజసేయు స్థలంబులును, శైలాః = పర్వతంబులును; వృక్షాః= మ్రాఁకులును; క్షుపాః= చిన్నచెట్లును ; హ్రదాః= మడుగులును ; పతంగాః = పక్షులును ; పన్నగాః=సర్పములును ; సింహాః=సింహంబులును; త్వాం= నిన్ను; రక్షంతు= కాపాడుచుండుఁగాక.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! అరణ్యంబునందలి యాశ్రమంబుల నుండు, సమిత్తులును దర్భలును బవిత్రములు నగ్నివేదికలును దేవస్థానంబులును దేవపూజసేయుటకై యేర్పఱిచిన నానావిధస్థలంబులును బర్వతంబులును బెద్ద మ్రాఁకులును జిన్నచెట్లును మడుగులును బక్షులును సర్పంబులును సింహంబులును నిన్నుఁ గాపాడుచుండుఁగాక.

అని, తాత్పర్యము.

స్వస్తి సాధ్యాశ్చ విశ్వేచ మరుతశ్చ మహర్షయః. ౮

టీక॥ సాధ్యాశ్చ = సాధ్యులను దేవతలును; విశ్వేచ=విశ్వేదేవులును; మరుతశ్చ = వాయువులును; మహర్షయః= పూజ్యులయిన ఋషులును; తే (అధ్యాహృతము)= నీకొఱకు ; స్వస్తి=మంగళమును; కుర్వంతు (అధ్యాహృతము)=చేయుదురుగాక.

సాధ్యులును, విశ్వేదేవులును, వాయువులును, మహర్షులును, నీకు మంగళంబొసంగుచుందురుగాక.

అని, తాత్పర్యము.

స్వస్తి ధాతా విధాతాచ స్వస్తి పూషా భగోఽర్యమా.

టీక॥ ధాతా=సమస్తప్రపంచంబునకును ఆధారమయిన విరాట్పురుషుండును; విధాతాచ = బ్రహ్మదేవుండును; స్వస్తి=మంగళమును ; కుర్వతాం (అధ్యాహృతము)= చేయుదురుగాక. పూషా=పూషయనుసూర్యుఁడును ;భగః= భగుండనుసూర్యుండును ; అర్యమా=అర్యముండనుసూర్యుఁడును; స్వస్తి=మంగళమును; కుర్వంతు (అధ్యాహృతము)=చేయుదురుగాక.

సమస్తప్రపంచముల కాధారభూతుండైన విరాట్పురుషుండును బ్రహ్మదేవుండును నీకుమంగళం బొసంగుదురుగాక; మఱియు, ద్వాదశాదిత్యులలోఁ జేరిన పూషయును భగుండును అర్యముఁడును నీకు మంగళంబు నిచ్చుచుండుదురుగాక. అని, తాత్పర్యము.

లోకపాలాశ్చ తే సర్వే వాసవప్రముఖా స్తథా. ౯

టీక॥ తథా=అట్లు; వాసవప్రముఖాః = ఇంద్రుండుమొదలుగాఁగల; తే=ఆ; లోకపాలాశ్చ=దిక్పాలురును; సర్వే=అందఱును; స్వస్తి, కుర్వంతు (అధ్యాహృతము)= మంగళకరమును, చేయుచుందురుగాక.

అట్లు, దేవేంద్రుండు మొదలుగాఁ గలదిక్పాలురు, ఎనమండ్రును, నీకుమంగళంబొసంగుచుందురుగాక.

అని, తాత్పర్యము.

ఋతవశ్చైవ పక్షాశ్చ మాసా స్సంవత్సరాః క్షపాః
దినానిచ ముహూర్తాశ్చ స్వస్తి కుర్వంతు తే సదా. ౧౦

టీక॥ ఋతవశ్చైవ= ఋతువులును;పక్షాశ్చ= పక్షంబులును; మాసాశ్చ=మాసంబులును; సంవత్సరాః = సంవత్సరంబులును ; క్షపాః=రాత్రులును; దినానిచ= పగళ్లును;ముహూర్తాశ్చ=దినములో ముప్పదియవభాగములును, రెండుగడియలకాలములును నట; తే=నీకొఱకు ; సదా=ఎల్లప్పుడును; స్వస్తి=మంగళమును ; కుర్వంతు=చేయుఁగాక.

వసంతాదిఋతువులును శుక్లపక్ష కృష్ణపక్షంబులును చైత్రాదిమాసంబులును ప్రభవాదిసంవత్సరంబులును రాత్రులునుదినములునుముహూర్తంబులును నీకెల్లప్పుడునుమంగళంబొసంగుచుండుగాక. అని, తాత్పర్యము.

స్మృతి ర్ధృతిశ్చ ధర్మశ్చ పాతు త్వాం పుత్ర సర్వతః

టీక॥ పుత్ర=కొడుకా ! స్మృతిః= ధ్యానమును; ధృతిశ్చ= యోగంబును; ధర్మశ్చ=ధర్మమును; త్వాం=నిన్ను; సర్వతః=అంతటను; పాతు= రక్షించుఁగాక.

కొడుకా! ధ్యానంబునుయోగంబును ధర్మంబును, ఏకష్టమును రాకుండ, నిన్ను. రక్షించుచుండుఁగాక.

అని, తాత్పర్యము.

స్కందశ్చ భగవాన్ దేవ స్సోమశ్చ స బృహస్పతిః. ౧౧
సప్తర్షయో నారదశ్చ తే త్వాం రక్షంతు సర్వతః

టీక॥ భగవాన్= మాహాత్మ్యము గల; దేవః=దేవుండగు; స్కందశ్చ= కుమారస్వామియును; సోమశ్చ=చంద్రుండును; సః=ఆ ; బృహస్పతిః= బృహస్పతియును; సప్తర్షయః= సప్తఋషులును; నారదశ్చ= నారదుండును; తే=వారలందఱును; త్వాం= నిన్ను; సర్వతః=అంతటను; రక్షంతు= కాపాడుదురుగాక.

భగవంతుండగు కుమారస్వామియును జంద్రుండును బృహస్పతియును, సప్తఋషులును నారదుండును, నీకేమియుఁగష్టములేకుండునట్లు నన్నురక్షించుచుందురుగాక.

అని, తాత్పర్యము.

యాశ్చాపి సర్వత స్సిద్ధా దిశశ్చ సదిగీశ్వరాః. ౧౨
స్తుతా మయా వనే తస్మిన్ పాంతు త్వాం పుత్ర నిత్యశః

టీక॥ పుత్ర=కొడుకా ! సదిగీశ్వరాః=దిక్పాలురతోఁగూడిన; యాః=ఏ; దిశః=దిక్కులు; సర్వతః = అంతటను; సిద్ధాః = ప్రసిద్ధములై యున్న

హ్యా; తాః (అధ్యాహృతము) చాపి=అవియును; మయా=నాచేత; స్తుతాః=పొగడఁబడినవై; తస్మిన్=ఆ; వనే=అడవియందు; త్వాం=నిన్ను; సర్వశః=ఎల్లప్పుడును; పాంతు=రక్షించుచుందురుగాక.

కొడుకా! ప్రసిద్ధమయిన దిక్కులు నుదిక్పాలురును, నేనుచేయు స్తోత్రంబులచేఁ బ్రసన్నులయి, యడవియం దు నిన్నెల్లప్పుడును గాపాడుచుందురు గాక. అని, తాత్పర్యము.

శైలా స్సర్వే సముద్రాశ్చ రాజా వరుణ ఏవచ. ౧౩
ద్యౌ రంతరిక్షం పృథివీ నద్యః స్సర్వా స్తథై వచ
నక్షత్రాణిచ సర్వాణి గ్రహాశ్చ సహదేవతాః. ౧౪
అహోరాత్రే తథాసంధ్యే పాంతు త్వాం వనమాశ్రితమ్

టీక॥ శైలాః=పర్వతములును, సర్వే=సమస్తములయిన; సముద్రాశ్చ=సముద్రములును; రాజా= కుబేరుండును; వరుణఏవచ= వరుణుండును; ద్యౌః=స్వర్గంబును; అంతరిక్షం=ఆకాశమును; పృథివీ= భూమియును; తథా=అట్లు; సర్వాః= సమస్తములయిన;నద్యఏవచ=నదులును; సర్వాణి=సమస్తములయిన; నక్షత్రాణిచ = నక్షత్రంబులును; సహదేవతాః=అభిమానిదేవలతోఁగూడిన; గ్రహాశ్చ= గ్రహములును;తథా=అట్లు; అహోరాత్రే= పగలును రాత్రియును; సంధ్యే= సంధ్యాకాలములును;వనం=అడవిని;ఆశ్రితం=పొందిన;త్వాం, నిన్ను;పాంతు=రక్షింతురుగాక.

కులపర్వతంబులును సమస్త సముద్రంబులును స్వర్గంబును ఆకాశంబునుభూమియును నదులును నక్షత్రంబులన్నియు నంగారకాది గ్రహంబులును దదభిమాని దేవతలును అహోరాత్రంబులును సంధ్యలును, అడవిలోనున్ననిన్ను రక్షింపుచుండుఁగాక;మఱియును,కుబేరుండును వరుణుండునునిన్నురక్షింపుచుందురుగాక.

అని, తాత్పర్యము.

ఋతవశ్చైవ షట్పుణ్యా మాసా స్సంవత్సరా స్తథా. ౧౫
కలాశ్చ కాష్ఠాశ్చ తథా తవ శర్మ దిశంతుతే

టీక॥ తే=అ; పుణ్యాః — పవిత్రములయిన; ఋతవః=ఋతువులు; షట్చ=ఆఱును; మాసాః= మాసములును; తథా=అట్లు;సంవత్సరాః= సంవత్సరములును; కలాశ్చ=కలలును; తథా=అట్లు; కాష్ఠాశ్చ=కాష్ఠలును; తవ=నీకు; శర్మ=సుఖమును ; దిశంతు=ఇచ్చునుగాక.

పవిత్రంబులగు ఋతువులాఱును, మాసంబులును సంవత్సరంబులును కలలును గాష్ఠలును, నీకరణ్యంబునసౌఖ్యం బిచ్చుచుండుఁగాక.

అని, తాత్పర్యము.

మహావనే విచరతో మునివేషస్య ధీమతః. ౧౬
తవాదిత్యాశ్చ దైత్యాశ్చ భవంతు సుఖదా స్సదా

టీక॥ ఆదిత్యాశ్చ=అదితికొడుకులయినదేవతలును; దైత్యాశ్చ= దితికొడుకులయినయసురులును ; ధీమతః= బుద్ధిమంతుండవును; మునివేషస్య=మునియొక్క-వేషంబువంటివేషము గలవాఁడవును; మహావనే=కాఱడవియందు; విచరతః ; తిరుగుచున్నవాఁడవు నగు; తవ=నీకు; సదా=ఎల్లప్పుడును; సుఖదాః=సుఖమునిచ్చువారలు;భవంతు= అగుదురుగాక.

ధర్మబుద్ధిగలవాఁడవై పితృవచనంబున మునివేషంబుధరించి కాఱడవిం దిరుగుచున్ననీకు దేవతలునసురులు నెల్లప్పుడును సౌఖ్యంబొసంగుచుందురుగాక. అని, తాత్పర్యము.

రాక్షసానాం పిశాచానాం రౌద్రాణాం క్రూరకర్మణామ్. ౧౭
క్రవ్యాదానాంచ సర్వేషాం మాభూత్పుత్రక తే భయమ్

టీక॥ పుత్రక=చిన్నికొడుకా! రౌద్రాణాం= మిక్కిలియుఁగోపముగల; క్రూరకర్మణాం=క్రూరములయినకార్యముగల;రాక్షసానాం — (పంచమ్యర్థమందుషష్ఠి)రాక్షసుల వలనను; పిశాచానాం=(పంచమ్యర్థమందు షష్ఠి)=పిశాచముల వలనను;సర్వేషాం= సమస్తములయిన; క్రవ్యాదానాంచ= (పంచమ్యర్థమందుషష్ఠి )క్రూరమృగములవలనను ; భయం = భయము; తే=నీకు;మాభూత్ — కలుగకుండుఁగాక.

తాత్పర్యము, సులభము.

ప్లవగా వృశ్చికా దంశా మశకాశ్చైవ కాననే. ౧౮
సరీసృపాశ్చ కీటాశ్చ మాభూవన్ గహనే తవ

టీక॥గహనే=చొరరాని;కాననే=అడవియందు;తవ=నీకు;ప్లవగాః=కోఁతులును;వృశ్చికాః=తేళ్లును; దంశాః=అడవియీఁగెలును;మశకాశ్చైవ=దోమలును;సరీసృపాశ్చ=పాములును; కీటాశ్చ=ఇతరములయిన, పురుగులును; మాభూవన్=లేకపోవుఁగాక.

చొరరానియరణ్యంబునఁ, గోఁతులును దేళ్లునడవియీఁగలును దోమలును బాములునింకనితరములయిన పురుగులును,నిన్నుబాధింపకుండెడుఁగాక.

అని, తాత్పర్యము.

మహాద్విపాశ్చ సింహాశ్చ వ్యాఘ్రా ఋక్షాశ్చ దంష్ట్రిణః. ౧౯
మహిషా శ్శృంగిణో రౌద్రా న తే ద్రుహ్యంతు పుత్రక

టీక॥పుత్రక = కొడుకా!దంష్ట్రిణః=కోఁరలుగల;మహాద్విపాశ్చ=పెద్దయేనుంగులును;సింహాశ్చ=సింహములును;వ్యాఘ్రాః=పెద్దపులులును; ఋక్షాశ్చ=ఎలుఁగుగొడ్డులును;శృంగిణః=కొమ్ములుగల; రౌద్రాః=భయంకరములయిన;మహిషాః = ఎనుఁబోతులును; తే = నీకొఱకు,నిన్ననుట;నద్రుహ్యంతు=బాధింపకుండుఁగాక.

కొడుకా! పెద్దయేనుంగులు సింహంబులుఁబెద్దపులులు నెలుఁగుబంటులు మొదలగుకోఁరలుగలమృగంబులును,భయంకరములయిన యెనుఁబోతులు మొదలగు కొమ్ములుగలమృగంబులును,అడవియందునిన్నుబాధింపకుండెడుఁగాక.

అని, తాత్పర్యము.

నృమాంసభోజినో రౌద్రా యేచాన్యే సత్త్వజాతయః. ౨౦
మా చ త్వాం హింసిషుః పుత్ర మయా సంపూజితా స్త్విహ

టీక॥పుత్ర=కొడుకా!అన్యే=ఇతరములయినవియును ; నృమాంసభోజినః= మనుష్యమాంసమునుదినునవియును;రౌద్రాః = భయంకరములయినవి

యనగు; సత్త్వజాతయః=బలమునకు జన్మస్థానములయినజంతువులు, బలిష్ఠములయిన క్రూరజంతువులనుట; యే (సంతి)=ఏవిగలవో; తే(అధ్యాహృతము)చ=అవియును;ఇహ=ఇచ్చట; మయా=నాచేత; సంపూజితాః = చక్కఁగాఁ బూజింపఁ బడినవియై ; త్వాం=నిన్ను;మాహింసిషుశ్చ = బాధింపకుందురుగాక.

మఱియు, మనుష్యమాంసంబుదిను చుభయంకరంబులై యుండు నితరములయినక్రూరజంతువులను, నేనిచ్చటం జేయుపూజచేసంతోషంబునొంది, నిన్నడవియం దెంతమాత్రము బాధింపకుండెదురుగాక. అని, తాత్పర్యము.

అగమాస్తే శివా స్సంతు సిధ్యంతుచ పరాక్రమాః. ౨౧
సర్వసంపత్తయే రామ స్వస్తిమాన్ గచ్ఛ పుత్రక

టీక॥ తే=నీయొక్క ; అగమాః= మార్గములు; శివాః= మంగళకరములుగా; సంతు=అగుఁగాక. పరాక్రమాశ్చ=పరాక్రమములును ; సిధ్యంతు=సఫలంబులగుఁగాక. పుత్రక=చిన్నికుమారుఁడవైన ; రామ= రాముఁడా!సర్వసంపత్తయే=సమస్తముసిద్ధించుటకొఱకు; స్వస్తిమాన్=మంగళమువాఁడవై; గచ్ఛ=పొమ్ము.

రాముఁడా ! నీవుపోవు మార్గంబులు నీకుసుఖంబునిచ్చుచుండుఁగాక; అన్నిస్థలములయందును నీ పరాక్రమంబునకెదురులేకపోవుఁగాక ; నీవెందును మంగళంబునెపొందుదు , సమస్త ధర్మంబులుంబడయుటకై , వనంబునకుంబొమ్ము. అని. తాత్పర్యము.

స్వస్తి తే స్త్వంతరిక్షేభ్యః పార్థివేభ్యః పునఃపునః. ౨౨
సర్వేభ్య శ్చైవ దేవేభ్యో యేచ తే పరిపంథినః

టీ॥ అంతరిక్షేభ్యః= ఆకాశమునందుండు దేవతలవలనను; పార్థివేభ్యః= భూమియందుండు దేవతలవలనను; దేవేభ్యః = దేవతలవలన ; సర్వేభ్య శ్చైవ=అందఱివలనను ; తే=నీయొక్క; పరిపంథినః=శత్రువులు; యే= ఎవరో; తేభ్యః (అధ్యాహృతము)చ= వారివలనను; తే=నీకు; స్వస్తి=మం

గళము; అస్తు=కలుగుఁగాక.

అంతరిక్షంబుననుండు దేవతలును భూమియందుండుదేవతలునితర దేవతలందఱును, నీకుమంగళం బొసంగుదురుగాక; నీకుశత్రువులయిన వారలుగూడనీకుమంగళంబు నే సేయుచుందురుగాక. అని, తాత్పర్యము.

గురుస్సోమశ్చ సూర్యశ్చ ధనదోథ యమ స్తథా. ౨౩
పాంతు త్వా మర్చితా రామ దండకారణ్య వాసినమ్

టీక॥ రామ=రాముఁడా! గురుః=బృహస్పతియును; సోమశ్చ=చంద్రుందును; సూర్యశ్చ = సూర్యుండును; అథ=ఇంక; ధనదః = కుబేరుండును; తథా=అట్లు; యమః=యముండును; అర్చితాః=పూజింపఁబడిన వారలై; దండకారణ్యవాసినం=దండకారణ్యమునందున్న; త్వాం=నిన్ను ; పాంతు=రక్షించుదురుగాక.

రాముఁడా! బృహస్పతియుఁ జందురుండునుసూర్యుండును గుబేరుండును యముండును, నేనుజేయుపూజకుఁదృప్తినొంది,దండకారణ్యంబున నివసింపు చున్ననిన్నుఁగాపాడుదురుగాక.

అని, తాత్పర్యము.

అగ్నిర్వాయు స్తథా ధూమో మంత్రాశ్చర్షిముఖాచ్చ్యుతాః. ౨౪
ఉపస్పర్శనకాలే తు పాంతు త్వాం రఘునందన

టీక॥ రఘునందన=రాముఁడా! ఉపస్పర్శనకాలేతు= స్నానము సేయుకాలమునందును; అగ్నిః = అగ్నిహోత్రుండును; వాయుః=వాయువును; తథా=అట్లు; ధూమః=అగ్నిహోత్రమునందలిపొగయును; ఋషిముఖాత్ = విశ్వామిత్రమహర్షినోటనుండి; చ్యుతాః=జాతిన,ఉపదేశింపఁబడినయనుట; మంత్రాశ్చ=మంత్రములును; త్వాం = నిన్ను; పాంతు=రక్షించుచుండెదుఁగాక.

రాముఁడా! నీవునదులలో స్నానము సేయునప్పుడును, అగ్నిదేవుండునువాయుదేవుండును, అట్లు అగ్నిహోత్రధూమంబునువిశ్వామిత్రమహర్షినీకుపదేశించినమంత్రంబులును,నిన్నుఁగాపాడుచుండెదుఁగాక.అని, తాత్పర్యము.

సర్వలోకప్రభు ర్బ్రహ్మా భూతభర్తా తథర్షయః. ౨౫
యేచ శేషా స్సురా స్తే త్వాం రక్షంతు వనవాసినమ్

టీక॥సర్వలోకప్రభుః= సమస్తలోకంబులకునునాయకుండగు; బ్రహ్మా=బ్రహ్మదేవుండును;భూతభర్తా = ప్రాణులనుబోషించునట్టి నారాయణుండును;తథా=అట్లు; ఋషయః=ఋషులును; శేషాః=మిగిలిన;సురాః=దేవతలు; యే(సంతి)=ఎవరున్నారో; తేచ=వారును;వనవాసినం = అడవియందున్న; త్వాం=నిన్ను; రక్షంతు=కాపాడుదురుగాక.

సమస్తలోకంబులకును నాయకుండగు బ్రహ్మదేవుండును సమస్తప్రాణులనుబోషించునట్టి నారాయణుండును ఋషులును,దక్షిణ దేవతలును, వనవాసంబు సేయుచున్న, నిన్ను, గాపాడుచుందురుగాక. అని,కౌసల్య, రామునకు మంగళాశీర్వచనంబులు చేసెను.

అని, తాత్పర్యము.

ఇతి మాల్యై స్సురగణాన్ గంధై శ్చాపి యశస్వినీ. ౨౬
స్తుతిభి శ్చానురూపాభి రానర్చా యతలోచనా

టీక॥యశస్వినీ = అధికమయినకీర్తిగల;ఆయతలోచనా= పెద్దకండ్లుగలకౌసల్య;ఇతి = ఇట్లు;ఉక్త్వా(అధ్యాహృతము)=చెప్పి;మాల్యైః = పుష్పమాలికలచేతను;అనురూపాభిః= తగిన;స్తుతిభిశ్చ=స్తోత్రములచేతను; సురగణాన్=దేవతలసమూహములను; ఆనర్చ=పూజించెను.

అధికమయిన కీర్తిగలదియుఁ బెద్దకండ్లుగలదియునగుకౌసల్య, యిట్లు రామునకుమంగళాశీర్వచనంబు లొసంగి, పుష్పమాలికలచేతనునానావిధస్తోత్రంబులచేతను, దేవతలంబూజించెను.

అని, తాత్పర్యము.

జ్వలనం సముపాదాయ బ్రాహ్మణేన మహాత్మనా. ౨౭
హావయామాస విధినా రామమంగళకారణాత్

టీక॥కౌసల్యా(అధ్యాహృతము)=కౌసల్య; రామమంగళకారణాత్ =

రామునకుమంగళముగలుగవలెననుకారణమువలన; జ్వలనం=అగ్నిహోత్రమును; సమువాదాయ=తెచ్చి ; మహాత్మనా=పూజ్యస్వభావంబుగల ; బ్రాహ్మణేన=బ్రాహ్మణునిచేత; విధినా = శాస్త్రముచే; హావయామాస=హోమముచేయించెను.

కౌసల్య,యంత, రామునకుమంగళముగల్గుటకై యగ్నిహోత్రంబుగొనితెచ్చి , మహాత్ముండగుబ్రాహ్మణునిచే, యథాశాస్త్రముగా, హోమముచేయించెను. అని, తాత్పర్యము.

ఘృతం శ్వేతాని మాల్యాని సమిధశ్శ్వేత సర్షపాన్. ౨౮
ఉపసంపాదయామాస కౌసల్యా పరమాంగనా

టీక॥ పరమాంగనా= ఉత్తమస్త్రీయయిన , కౌసల్యా=కౌసల్య ; ఘృతం=నేతిని; శ్వేతాని=తెల్లని; మాల్యాని=పుష్పమాలికలను; సమిధః=సమిత్తులను; శ్వేతసర్షపాన్ = తెల్లనియావాలను; ఉపసంపాదయామాస=సంపాదించెను.

స్త్రీలలోనుత్తమయయిన కౌసల్యాదేవి, హోమమునకై , నేయి, తెల్లనిపుష్పమాలికలు, సమిధలు, తెల్లయావాలు, వీనిరప్పించెను. అని,తాత్పర్యము.

ఉపాధ్యాయస్స విధినా హుత్వా శాంతిమనామయమ్. ౨౯
హుతహవ్యావశేషేణ బాహ్యం బలిమకల్పయత్

టీ॥ సః=ఆ; ఉపాధ్యాయః= ఋత్విజుడు; శాంతిం=సమస్తోపద్రవములుశమించుటను; అనామయం= ఆరోగ్యంబునుంగూర్చి; విధినా=శాస్త్రముచే; హుత్వా=హోమముచేసి; హుతహవ్యావశేషేణ=హోమముచేయఁబడిన హవిస్సులోమిగిలినదానిచేత; బాహ్యం= వెలుపటి; బలిం=బలిని ; అకల్పయత్ =చేసెను,

ఆఋత్విజుండు, సమస్తోపద్రవములు శమించుటకై యును ఆరోగ్యము గలుగుటకై యును యథావిధిగ హోమము చేసి, హోమము సేయఁగా మిగిలిన హవిస్సుచే, బాహ్యబలిం గావించెను.అని, తాత్పర్యము.

మధుదధ్యక్షతఘృతైః స్వస్తి వాచ్య ద్విజాం స్తతః. ౩౦

వాచయామాస రామస్య వనే స్వస్త్యయనక్రియాః

టీక॥ సః(అధ్యాహృతము) = ఆ ఋత్విజుఁడు; మధుదధ్యక్షతఘృతైః= తేనెచేతను పెరుగుచేతనుఅక్షతలచేతనునేయిచేతను; ద్విజాన్=బ్రాహ్మణులను; స్వస్తి= పుణ్యాహమును ; వాచ్య (వాచయిత్వా)=చెప్పించి;తతః=అటుపిమ్మట; వనే = అడవియందు;రామస్య=రామునకు;స్వస్త్యయనక్రియాః= మంగళముగలిగించుమంత్రములను ; వాచయామాస=చెప్పించెను.

ఋత్విజుండగు నాబ్రాహ్మణుండు, తేనెయుఁ బెరుఁగు నక్షతలును నేయియుదక్షిణలొసంగి, బ్రాహ్మణులచేఁ బుణ్యాహంబుచదివించి, మఱియు, వనంబున రామునకుమంగళంబుగలిగించు మంత్రంబులం జదివించెను.

అని, తాత్పర్యము.

తత స్తస్మై ద్విజేంద్రాయ రామమాతా యశస్వినీ. ౩౦
దక్షిణాం ప్రదదౌ కామ్యాం రాఘవం చేద మబ్రవీత్

టీక॥ తతః=అటుపిమ్మట; యశస్వినీ = అధికమయినకీర్తిగల; రామమాతా = రామునితల్లి;ద్విజేంద్రాయ= బ్రాహ్మణశ్రేష్ఠుండగు; తస్మై=ఆఋత్విజునికొఱకు; కామ్యాం=కోరఁదగిన, గొప్పదైనయనుట; దక్షిణాం=దక్షిణను;ప్రదదౌ=ఇచ్చెను. రాఘవం = రామునిగూర్చి;ఇదం=ఈమాటను; అబ్రవీచ్చ=పలికెను.

అంత, గొప్పకీర్తిగలరామునితల్లి యగుకౌసల్య, యాబ్రాహ్మణోత్తముం డగుఋత్విజునకు, గొప్పదక్షిణనొసంగి, రామునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

య న్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే. ౩౧
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్

టీక॥ సర్వదేవనమస్కృతే=సమస్తదేవతలచేతనునమస్కరింపఁబడిన; సహస్రాక్షే= దేవేంద్రునియందు;వృత్రనాశే = వృత్రునిచావు నిమిత్తమై;

యత్=ఏ; మంగళం=మంగళము;సమభవత్=కలిగెనో;తత్=ఆ;మంగళం=మంగళము; తే=నీకు; భవతు=కలుగుఁగాక.

సమస్తదేవతలచేతను నమస్కరింపఁబడుచుండుదేవేంద్రునకు,శత్రువయినవృత్రుండుచచ్చుటంజేసి,యేమంగళంబుకలిగెనో, ఆమంగళంబునీకును గలుగుఁగాక. అని,తాత్పర్యము.

యన్మంగళం సుపర్ణస్య వినతా కల్పయత్పురా- ౩౩
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్

టీక॥పురా=మున్ను; వినతా=వినత;అమృతం= అమృతమును;ప్రార్థయానస్య=కోరుచున్న; సుపర్ణస్య=గరుత్మంతునకు;యత్=ఏ;మంగళం=మంగళమును; అకల్పయత్=కావించెనో;తత్=ఆ;మంగళం= మంగళము; తే=నీకు;భవతు=కలుగుఁగాక.

మునుపు, వినత, తనకొడుకుగరుత్మంతుఁడమృతంబుకొరకుఁబోవునప్పుడతనికి,ఏమంగళంబుగావించెనో, ఆమంగళంబునీకుఁగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్- ౩౪
అదితి ర్మంగళం ప్రాదాత్తత్తే భవతు మంగళమ్

టీక॥అదితిః = అదితిదేవి;అమృతోత్పాదనే= అమృతంబుపుట్టించుటయందు;దైత్యాన్= దితికొడుకులయినయసురులను; ఘ్నతః=చంపుచున్న;వజ్రధరస్య = వజ్రాయుధంబుదాల్చునట్టిదేవేంద్రునకు;యత్=ఏ; మంగళం=మంగళమును;ప్రాదాత్=ఇచ్చెనో;తత్=ఆ;మంగళం=మంగళము; తే=నీకు;భవతు=కలుగుఁగాక.

అదితిదేవి,యసురులఁజంపునట్టితనకొడుకుదేవేంద్రునకు, సముద్ర మథనకాలమునందు,ఏమంగళంబొసంగెనో, ఆమంగళంబునీకిప్పుడుగలుగుఁగాక.

అని, తాత్పర్యము.

త్రీన్ విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమిత తేజసః- ౩౫
యదాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళం

టీక॥ రామ= రాముఁడా! త్రీన్= మూఁడైన; విక్రమాన్=అడుగులను; ప్రక్రమతః= ఉంచుచున్న; అమితతేజసః = కొలఁదిలేనిప్రభావముగల; విష్ణోః=విష్ణుదేవునకు; యత్=ఏ; మంగళం=మంగళము; ఆసీత్=ఉండెనో; తత్=ఆ; మంగళం=మంగళము; తే=నీకు; భవతు=కలుగుఁగాక.

రాముఁడా! త్రివిక్రమావతారంబున బలిచక్రవర్తియొసంగిన మూఁడడుగుల నేలంగొలుచుకొనునప్పుడు, కొలందిలేని ప్రభావంబుగల విష్ణుదేవునకేమంగళంబుండినదో, ఆమంగళంబునీకిప్పుడుగలుగుఁగాక. అని, తాత్పర్యము.

ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశ శ్చ తే. ౩౬
మంగళాని మహాబాహో దిశంతు శుభమంగళాః

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలరాముఁడా! శుభమంగళాః= మంగళములకునుమంగళములయిన, మంగళద్రవ్యములకునుఅతిశయమునిచ్చునవియయినయనుట; ఋతవః=వసంతాది ఋతువులును; సాగరాః=సముద్రములును; ద్వీపాః=ద్వీపములును; వేదాః=వేదములును; లోకాః=స్వర్గాదిలోకములును; దిశశ్చ=దిక్కులును; తే=నీకొఱకు; మంగళాని = మంగళములను; దిశంతు=ఇచ్చునుగాక.

పెద్దచేతులుగలరాముఁడా! స్వభావంబుననె మంగళస్వరూపంబుగానున్న దానికిని మంగళంబునొసంగఁజాలిన, వసంతర్తుమొదలయినఋతువులునుసముద్రంబులును ద్వీపంబులును వేదములును స్వర్గాదిలోకంబులునుదిక్కులును, నీకుమంగళంబుల నొసంగుచుండుఁగాక. అని, కౌసల్యరామునితోఁజెప్పినది. అని, తాత్పర్యము.

ఇతి పుత్రస్య శేషాశ్చ కృత్వా శిరసి భామినీ. ౩౭
గంధై శ్చాపి సమాలభ్య రామ మాయతలోచనా
ఓషధీం చాపి సిద్ధార్థాం విశల్య కరణీం శుభామ్. ౩౮
చకార రక్షాం కౌసల్యా మంత్రై ర్భిజ జాపచ

టీక॥ ఆయతలోచనా=పెద్దకండ్లుగల; భామినీ = స్త్రీయయిన; కౌసల్యా=

కౌసల్య;ఇతి=ఇట్లు; ఉక్త్వా(అధ్యాహృతము)=చెప్పి; పుత్రస్య=కొడుకైనరాముని యొక్క;శిరసి = తలయందు;శేషాః=అక్షతలను;కృత్వాచ=చేసియు, ఉంచియుననుట;రామం=రాముని;గంధైః=గంధముల చేత;సమాలభ్యచాపి=పూసియు;సిద్ధార్థాం = నిశ్చితమైనప్రయోజనముగల, చూడఁబడినఫలముగలయనుట; శుభాం=మంగళకరమైన;విశల్యకరణీం(దేహములోపలనిఱుకుకొనినబాణమును వెలికిఁదీయునట్టి)=విశల్యకరణియను;ఓషధీంచాపి =మూలికను;రక్షాం=రక్షనుగా;చకార = చేసెను. మంత్రైః=మంత్రములచే; అభిజజాప చ=అభిమంత్రించెను.

పెద్దకండ్లుగల కౌసల్యాదేవి, యిట్లాశీర్వదించి, రామునిశిరంబునసక్షతల నుంచి,రామునిదేహమునకు సుగంధంబు నలంది, యిదివఱకుఁ బెక్కుమాఱులు పరీక్షింపఁబడివీర్యవంతమని నిశ్చయింపఁబడిన, దేహములోపలనిఱుకుకొనినబాణమును వెలికిఁదీయునట్టి , విశల్యకరణి యను మూలికను, రక్షణార్థమయి, రామునిచేతిలోరక్షగాఁగట్టి, దాని,మంత్రంబులనభిమంత్రించెను.

అని, తాత్పర్యము.

ఉవాచాతి ప్రహృష్టేవ సా దుఃఖవశవర్తినీ. ౩౯
వాఙ్మాత్రేణ న భావేన వాచా సంసజ్జమానయా

టీక॥దుఃఖవశవర్తినీ = దుఃఖము యొక్కయధీనతలోనుండునట్టి;సా=ఆకౌసల్య;భావేన=మనసుచేత; న=కాదు.వాఙ్మాత్రేణ=నోటమాత్రము; అతిప్రహృష్టేవ(స్థితా)= మిక్కిలియుసంతోషించినదివలెనున్నదై; అసంసజ్జమానయా = తొట్రుపడుచున్న;వాచా=మాటచేత;ఉవాచ=పలికెను.

ఆకౌసల్య, దుఃఖసముద్రములోము నింగియున్నను, మనసునంగాకున్నను, ప్రయాణకాలంబుననమంగళంబు సేయరాదుకావున,నోటమాత్రముమహాసంతోషంబునొందినట్లుచూపట్టుచుఁ, దొట్రుపాటుతో,నిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

ఆనమ్య మూర్ధ్ని చాఘ్రాయ పరిష్వజ్య యశస్వినీ. ౪౦

అవద త్పుత్ర సిద్ధార్థో౽ గచ్ఛ రామ యథా సుఖమ్

టీక॥యశస్వినీ = అధికమయినకీర్తిగలకౌసల్యాదేవి; రామం (అధ్యాహృతము) = రామునిని;ఆనమ్య(ఆనమయ్య)=వంచి;మూర్ధ్ని = శిరస్సునందు;ఆఘ్రాయచ=మూర్కొనియు;పరిష్వజ్య=కవుఁగిలించి; అవదత్ =పలికెను.పుత్ర=కుమారుఁడవగు;రామ=రాముఁడా.సిద్ధార్థః=ఈడేఱినప్రయోజనములుగలవాఁడవై;యథాసుఖం=సుఖముగా;గచ్ఛ=పొమ్ము.

అధికమయిన కీర్తిగల కౌసల్యాదేవి,రామునివంచిశిరంబునమూర్కొని,కౌఁగిలించికొని,యిట్లని, చెప్పెను; కొడుకా!నీవుకృతకృత్యుండవై , సుఖంబుగా,నడవికింబొమ్ము.

అని, తాత్పర్యము.

అరోగం సర్వసిద్ధార్థ మయోధ్యాం పున రాగతమ్.౪౧
పశ్యామి త్వాం సుఖం వత్స సుస్థితం రాజ వర్త్మని

టీక॥వత్స = బిడ్డఁడా!అరోగం=రోగములేనివాఁడవును; సర్వసిద్ధార్థం (సిద్ధసర్వార్థం)= ఈడేఱినయన్నిప్రయోజనములునుగలవాఁడవును; పునః= మఱల;అయోధ్యాం=అయోధ్యను;ఆగతం=పొందినవాఁడవును; రాజవర్త్మని=రాజులమార్గమునందు;సుస్థితం=చక్కఁగానున్నవాఁడవునగు; త్వాం=నిన్ను;సుఖం=సుఖముగా; పశ్యామి= చూచెదను.

బిడ్డఁడవగురాముఁడా! నీవేమియు రోగంబునొందకసమస్తప్రయోజనంబులంబొంది క్షేమంబున మఱలనయోధ్యకు వచ్చి, రాజమార్గంబయిన రాజ్యాధిపతిత్వంబునవలంబించియుండఁగాఁ, జూడఁగలను. అని, తాత్పర్యము.

ప్రణష్టదుఃఖసంకల్పా హర్షవిద్యోతి తాననా. ౪౨
ద్రక్ష్యామి త్వాం వనా త్ప్రాప్తం పూర్ణచంద్ర మివోదితమ్

టీక॥అహం(అధ్యాహృతము)= నేను;ప్రణష్టదుఃఖసంకల్పా— బొత్తిగానశించినదుఃఖమును జింతయునుగలదాననై;హర్షవిద్యోతితాననా— సంతోషముచేఁబ్రకాశింపఁజేయఁబడిన ముఖము గలదాననై;వనాత్ — అడవినుండి;

ప్రాప్తం=వచ్చిన; త్వాం=నిన్ను; ఉదితం = ఉదయించిన; పూర్ణచంద్రమివ=నిండుచంద్రునింబోలె; ద్రక్ష్యామి=చూడఁగలను.

నేను, నాదుఃఖంబునుజింతయునునశింపఁగా, సంతోషంబునఁ బ్రకాశించుముఖంబుతోఁగూడినదానవై, పూర్ణచంద్రుండుదయించునట్లు, అడవినుండి మఱలవచ్చిననిన్నుఁ,జూడఁగలను.

అని, తాత్పర్యము.

భద్రాసనగతం రామ వనవాసాది హాగతమ్. ౪౩
ద్రక్ష్యామిచ పున స్త్వాంతు తీర్ణవంతం పితు ర్వచః

టీక॥ రామ = రాముఁడా! వనవాసాత్ =అడవియందుండుటనుండి, అడవియందుండుటను విడిచియనుట ; ఇహ=ఇచ్చటికి ; ఆగతం=వచ్చినవాఁడవును; పితుః=తండ్రియొక్క ; వచః=మాటను ; తీర్ణవంతం=దాఁటినవాఁడవును, నెఱవేర్చినవాఁడవనుట; భద్రాసనగతం=సింహాసనమును బొందినవాఁడవునగు; త్వాంతు=నిన్నును;పునశ్చ=మఱల ; ద్రక్ష్యామి = చూడఁగలను.

రాముఁడా! తండ్రియాజ్ఞను నెఱవేర్చి, యడవినివిడిచి యిచ్చటికివచ్చి , సింహాసనంబునధిష్ఠించియున్న, నిన్ను, నేను. మఱలం, జూడఁగలను.

అని, తాత్పర్యము.

మంగళై రుపసంపన్నో వనవాసా దిహాగతః. ౪౪
వధ్వా మమచ నిత్యం త్వం కామాన్ సంవర్ధ యాహిభో

టీక॥ త్వం=నీవు; వనవాసాత్ =అడవినుండుటనువిడిచి ; ఇహ=ఇచ్చటికి; ఆగతః = వచ్చినవాఁడవై ; మంగళైః=మంగళములతో; ఉపసంపన్నః=కూడినవాఁడవై ; వధ్వాః=నాకోడలు సీతయొక్కయు; మమచ=నాయొక్కయు; నిత్యం=ఎల్లప్పుడు; కామాన్ =కోరఁబడుపదార్థములను;సంవర్ధ(సంవర్ధయ)=వృద్ధిఁబొందింపుము . భో యాహి=పోవయ్యా.

అడవినుండియిచ్చటికివచ్చి సమస్తమంగళద్రవ్యంబులనుంగూడి , నాకును నాకోడలు సీతకును ఎల్లకోర్కులనునెఱవేర్పుచుండుము;ఇప్పుడునీయిష్టప్రకా

రమువనంబునకుంబొమ్ము. అని, తాత్పర్యము.

మయార్చితా దేవగణా శ్శివాదయో
మహర్షయో భూతమహాసురోరగాః. ౪౫
అభిప్రయాతస్య వనం చిరాయ తే
హితాని కాంక్షంతు దిశశ్చ రాఘవ

టీక॥ రాఘవ = రాముఁడా! మయా=నాచేతను; అర్చితాః = పూజింపఁబడిన; శివాదయః=శివుఁడు మొదలుగాఁగల; సురగణాః= దేవతాసమూహములును; మహర్షయః=పూజ్యులయినఋషులును; భూతమహాసురోరగాః=భూతములునుగొప్ప యసురులునుసర్పములును; దిశశ్చ=దిక్కులును;వనం=అడవినిగూర్చి; అభిప్రయాతస్య=పోవుచున్న; తే=నీకు; హితాని=మేలుగలిగించువానిని; చిరాయ=బహుకాలము; కాంక్షంతు = కోరుచుండెదరుగాక.

రాముఁడా! దిక్కులునుసర్పంబులును అసురులును భూతంబులును మహర్షులునుశివుండుమొన్నగు దేవతలును, నేనిప్పుడుచేసినపూజకుఁ దృప్తినొంది, వనంబునకుఁబోవుచున్ననీకు, బహుకాలము, మేలుసేయుచుందురుగాక. అని, కౌసల్య, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతీవ చాశ్రుప్రతిపూర్ణలోచనా
సమాప్యచ స్వస్త్యయనం యథా విధి. ౪౬
ప్రదక్షిణం చైవ చకార రాఘవం
పునః పునశ్చాపి నిపీడ్య సస్వజే

టీక॥సా(అధ్యాహృతము)= ఆకౌసల్య;ఇతీవచ = ఈప్రకారముగాను;అశ్రుప్రతిపూర్ణలోచనా=కన్నీరునిండినకండ్లుగలదై;స్వస్త్యయనం = మంగళాశీర్వచనమును; యథావిధి=యథాశాస్త్రముగ;సమాప్యచ = ముగించియు; రాఘవం=రామునిఁగూర్చి; ప్రదక్షిణంచైవ=ప్రదక్షిణమును; చకార=

చేసెను. పునఃపునశ్చాపి = పలుమారులు; నిపీడ్య=పట్టుకొని; సస్వజే = కౌఁగిలించుకొనెను.

ఆకౌసల్య, యిట్లుకంఠస్వనిండఁగన్నీరువాఁడమఁగా, రామునకు, యథాశాస్త్రముగ మంగళాశీర్వచనంబొనరించి, రక్షార్థమయి రామునిచుట్టునుండిరగి, యతనిఁబలుమఱుఁగవుఁగిలించుకొనెను. అని, తాత్పర్యము.

తథాచ దేవ్యా స కృతప్రదక్షిణో
నిపీడ్య మాతు శ్చరణౌ పునఃపునః. ౪౭
జగామ సీతానిలయం మహాయశా
స్స రాఘవః ప్రజ్వలిత స్స్వయా శ్రియా

టీక॥ తథా=అట్లు; దేవ్యా = కౌసల్యాదేవిచేత; కృతప్రదక్షిణః=చేయఁబడినప్రదక్షిణముగల; సచ=ఆరాముఁడును; పునఃపునః=పలుమారులు; మాతుః=తల్లియొక్క; చరణౌ=పాదములను; నిపీడ్య=పట్టుకొని; మహాయశాః= అధికమయినకీర్తిగల; సః=ఆ; రాఘవః=రాముఁడు; స్వయా= తనదైన; శ్రియా= కాంతిచేత; ప్రజ్వలితః=ప్రకాశించుచున్నవాఁడై; సీతానిలయం=సీతయింటినిగూర్చి; జగామ=పోయెను.

అట్లుకౌసల్యాదేవిరక్షార్థమై ప్రదక్షిణంబుచేసినపిదప, నధికమయినకీర్తిగలయారాముండు, తల్లికౌసల్యపాదంబులకుఁబలుమారులుమ్రొక్కి, యదిమహాదుఃఖకాలంబయినను, గాంతిమంతుండు కావున, నిజకాంతిచేఁ దేజరిల్లుచు, సీతాదేవియింటికిఁబోయెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

అయోధ్యాకాండే, పంచవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికావ్యాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండపంచవింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ
షడ్వింశసర్గప్రారంభః.

అభివాద్యచ కౌసల్యాం రామ స్సంప్రస్థితో వనమ్
కృతస్వస్త్యయనో మాత్రా ధర్మిష్ఠే వర్త్మని స్థితః. ౧
విరాజయ న్రాజసుతో రాజమార్గం నరై ర్వృతమ్
హృదయా న్యామమం థేవ జనస్య గుణవత్తయా. ౨

టీక॥ రాజసుతః=రాచకొమరుండైన; రామః= రాముఁడు; మాత్రా=తల్లి చేత; కృతస్వస్త్యయనః=చేయఁబడినమంగళాశీర్వచనములుగలవాఁడై; కౌసల్యాం=కౌసల్యను; అభివాద్యచ=నమస్కరించియు; ధర్మిష్ఠే=మిక్కిలియు ధర్మముగల; వర్త్మని=మార్గమునందు; స్థితః=ఉన్నవాఁడై; వనం=అడవిని గూర్చి; సంప్రస్థితః= పయనమయినవాఁడై; విరాజయన్ = ప్రకాశించుచు; నరైః=మనుష్యులచేత; వృతం=కప్పఁబడిన; రాజమార్గం = రాజమార్గమును; ప్రవిష్టః(అధ్యాహృతము)=చొచ్చినవాఁడై; గుణవత్తయా=ప్రశస్తములగుగుణములుగల్గుటచేత; జనస్య = జనముయొక్క; హృదయాని=మనసులను; ఆమమంథేవ=చిలికినట్లుండెను.

రాచకొమరుండగు రాముండు, తల్లిచేమంగళాశీర్వచనంబునొంది, కౌసల్యకు నమస్కరించి, ధార్మికంబగుమార్గంబునవలంబించి, వనంబునకుంబోవ సమకట్టి, నిజకాంతిం జేజరిల్లుచు, మనుష్యులతో నిండియుండు రాజమార్గంబుఁజొరఁగాగుణవంతుండుగావున, నా రామునచ్చటిజనులుచూడఁగానే, వారలమనంబులు, రామునందలిప్రీతివిశేషంబున, మిక్కిలియుఁ జలనంబునొందినవి.

అని, తాత్పర్యము.

వై దేహీచాపి త త్సర్వం న శుశ్రావ తపస్వినీ

టీక॥ తపస్విస్వనీ = అభిషేకార్థమయి వ్రతంబునవలంబించిన; వైదేహీ చాపి=సీతయును ; తత్ =ఆసమాచారమును; సర్వం= అంతను ; నశుశ్రావ=వినదయ్యె.

అభిషేకార్థమయి, నియమంబున వ్రతంబవలంబించియున్న సీతాదేవికి, రాముని వనవాసంబు గుఱించినవృత్తాంతంబేమియుఁ దెలియదు. అని, తాత్పర్యము.

తదేవ హృది తస్యాశ్చ యావరాజ్యాభిషేచనమ్. ౩

టీక॥ తస్యాశ్చ= ఆబిడయొక్క ; హృది=మనసునందు; తత్ =ఆ; యావరాజ్యాభిషేచనమేవ= యువరాజుదొరతనమునందభిషేకించుటయె; అవర్తత(అధ్యాహృతము)=ఉండినది.

సీతాదేవి, మనంబున, రామునకు యావరాజ్యంబున, పట్టాభిషేకంబు నేయఁబడుననియె, తలంచుచుండినది. అని, తాత్పర్యము.

దేవకార్యం స్వయం కృత్వా కృతజ్ఞా హృష్టచేతనా
అభిజ్ఞా రాజ ధర్మాణాం రాజపుత్రం ప్రతీక్షతే. ౪

టీక॥ కృతజ్ఞా= కార్యములనెఱింగినదియు; రాజధర్మాణాం= రాజుల నడవడికలయొక్క , నడవడికల ననుట; అభిజ్ఞా=ఎఱింగినదియునగు సీతాదేవి; స్వయం=తానె; దేవకార్యం = దేవపూజను; కృత్వా=చేసి ; హృష్టచేతనా=సంతసించిన మనసుగలదై , రాజపుత్రం=రాచకొమారుండగు రాముని; ప్రతీక్షతే= (భూతార్థమందు లట్) ఎదురుచూచుచుండినది.

సీతాదేవి, దానె దేవతాపూజఁజేసి, రాజునకుఁబట్టాభిషేకమయిన పిమ్మటఁబట్టమహిషి చేయవలసిన కార్యములనెఱింగినదియు రాజులనడవడికల నెఱింగినదియుఁగావున , రాచకొమరుండగురాము నెదురుసూచుచుండెను. అని, తాత్పర్యము.

ప్రవివేశాథ రామస్తు స్వం వేశ్మ సువిభూషితమ్
ప్రహృష్టజనసంపూర్ణం హ్రియా కించి దవాఙ్ముఖః. ౫

టీక॥అథ=అటుపిమ్మట; రామస్తు=రాముఁడును; హ్రియా = సిగ్గుచేత; కించిత్ =కొంచెము; అవాఙ్ముఖః=వంగిన ముఖముగలవాఁడై; సువిభూషితం=మిక్కిలియుఁ జక్కఁగా నలంకరింపఁబడినదియు; ప్రహృష్టజనసంపూర్ణం= మిక్కిలియు సంతసించియుండు జనులచే నిండినదియునగు; స్వం = తనదైన; వేశ్మ=ఇంటిని; ప్రవివేశ=చొచ్చెను.

అంత, రాముండు, "ఈదుఃఖవృత్తాంతము నెట్లుసీతకుం జెప్పుదు"నని, లజ్జచేఁదలవంచుకొని, చక్కఁగానలంకరింపఁబడిమహాసంతోషంబునొందియుండుజనులతో నొప్పుచుండు తనగృహంబుం బ్రవేశించెను. అని, తాత్పర్యము.

అథ సీతా సముత్పత్య వేపమానాచ తం పతిమ్
అపశ్య చ్ఛోక సంతప్తం చింతావ్యాకులితేంద్రియమ్. ౬

టీక॥అథ=అటుపిమ్మట; సీతా=సీత; సముత్పత్య=తటాలున లేచి; వేపమానా= వడఁకుచు; శోకసంతప్తం=దుఃఖముచేఁదపింపఁ జేయఁబడినవాఁడును; చింతావ్యాకులితేంద్రియం= చింతచేఁ గలంతనొందునట్లు చేయఁబడినయింద్రియములుగలవాఁడునగు; తం = ఆ; పతిం = పెనిమిటనైనరాముని; అపశ్యత్=చూచెను.

అంత,సీతాదేవి , తటాలునలేచి , భయంబునవడఁకుచు , మహాదుఃఖంబునొంది కలంతనొందిన యింద్రియంబులతోనున్న పెనిమిటిని రాముంజూచెను. అని,తాత్పర్యము.

తాం దృష్ట్వా స హి ధర్మాత్మా న శశాక మనోగతమ్
తం శోకం రాఘవ స్సోఢుం తతో వివృతతాం గతః. ౭

టీక ॥ ధర్మాత్మా= ధర్మస్వభావుండైన; సః=ఆ ; రాఘవః=రాముఁడు; తాం=ఆసీతాదేవిని ; దృష్ట్వా=చూచి; మనోగతం=మనంబునొందియున్న; తం=ఆ; శోకం = దుఃఖమును ; సోఢుం=సహించుటకు; నశశాకహి=చాలఁడయ్యెఁగదా! తతః= అందువలన; వివృతతాం = బయలుపడుటను ; గతః=పొందినాఁడు.

ధర్మాత్ముండగు నారాముండు ,

సీతంబూడఁగానే , మనంబులోనున్న దుఃఖంబు నెంతమాత్రమునడంచు కొనలేకపోయెను ; గావున, నతనిదుఃఖము బయలుపడెను. అని, తాత్పర్యము.

వివర్ణవదనం దృష్ట్వా తం ప్రస్విన్న మమర్షణమ్
ఆహ దుఃఖాభిసంతప్తా కి మిదానీ మిదం ప్రభో. ౮

టీక॥వివర్ణవదనం= తెల్లఁబాఱి నముఖముగలవాఁడును ; ప్రస్విన్నం = చెమటనొందిన వాఁడును ; అమర్షణం= దుఃఖమును తాళఁజాలనివాఁడున గు;తం=ఆరాముని; దృష్ట్వా=చూచి ; సా(అధ్యాహృతము)=ఆసీత ; దుఃఖాభిసంతప్తా = దుఃఖముచేఁదపింపఁజే యఁబడినదై;ఆహ=చెప్పెను.ప్రభో= నాథుఁడా!ఇదానీం=ఇప్పుడు; ఇదం= ఈదుఃఖము;కిం=ఎందుకు?

దేహంబంతయుఁ జెమటపట్టఁగాఁ దెల్లఁబాఱినముఖంబుతోఁగూడి దుఃఖంబుదాళఁజాలకున్న యారామునిం జూచి, సీతాదేవి, మిగులదుఃఖంబునొంది, యిట్లని,చెప్పెను; "నాథుఁడా!నీవిప్పుడే లయిట్లుదుఃఖించుచున్నావు?"
అని, తాత్పర్యము.

అద్య బార్హస్పత శ్శ్రీమా నుక్తః పుష్యోను రాఘవ
("శ్రీమాన్యుక్తః" ఇతిపాఠాంతరమ్.)
ప్రోచ్యతే బ్రాహ్మణైః ప్రాజ్ఞైః కేన త్వ మసి దుర్మనాః.౯

టీక॥రాఘవ=రాముఁడా! అద్య= ఇప్పుడు; బార్హస్పతః = బృహస్పతి దేవతగాఁగలదియును ; శ్రీమాన్ = సంపదగలదియు, సంపదనిచ్చునదియు ననుట; ఉక్తః= పట్టాభిషేకార్హమని చెప్పఁబడినదియును; యుక్తః(అని,పాఠాంతరము)=పట్టాభిషేకమునకుఁదగినదియునగు; పుష్యః=పుష్యనక్షత్రము; ప్రాజ్ఞైః=పండితులగు; బ్రాహ్మణైః= బ్రాహ్మణులచేత; ప్రోచ్యతేను=చెప్పఁబడుచున్నదిగదా!త్వం=నీవు; కేన=దేనిచేత;దుర్మనాః=దుఃఖముగలవాఁడవు;అసి=అగుచున్నావు?

రాముఁడా! పండితులగుబ్రాహ్మణులు, బృహస్పతిదేవతాకంబునుసంపదనిచ్చునదియు నిప్పుడు నీపట్టాభిషేకమున

కు:దగిననక్షత్రముగా నిర్ణయింపబ డినదియునగుపుష్యనక్షత్రము, ఇప్పుడు, వచ్చియున్నదనిచెప్పుచున్నారు; నీవిట్టి మంగళసమయంబునందిట్లేల దుఃఖించు చున్నావు? అని, తాత్పర్యము

న తే శతశలాకేన జలఫేననిభేన చ
ఆవృతం వదనం వల్గు ఛత్రేణాపి విరాజతే. ౧౦

టీక॥ తే=నీయొక్క; వల్గు= సుందర మయిన; వదనం=ముఖము; శతశలాకే న=నూఱుకమ్ములుగలదియు; జలఫేన నిభేనచ=నీటినురుఁగువంటిదియు నగు; ఛత్రేణ=గొడుగుచేత; ఆవృతం=కప్పఁ బడినదై; నవిరాజతే = ప్రకాశింపకు న్నది.

సుందరంబగు నీముఖంబు, నూఱుక మ్ములు గలిగి నీటినురుఁగువంటి ధవ ళంబైయుండు శ్వేతచ్ఛత్రంబు లేకుండు టంజేసి, వానిచేఁ గప్పఁబడుటంగల్గు శ్రీ కాంతిఁ బొందకున్నది.

అని, తాత్పర్యము.

వ్యజనాభ్యాం చ ముఖ్యాభ్యాం శతపత్రనిభేక్షణమ్
చంద్రహంసప్రకాశాభ్యాం వీజ్యతే న తవాననమ్. ౧౧

టీక॥ శతపత్రనిభేక్షణం = తామర పూలతోసమానములయిన కండ్లుగల; తవ=నీయొక్క; ఆననం= ముఖము; ముఖ్యాభ్యాం=శ్రేష్ఠములును; చంద్ర హంసప్రకాశాభ్యాం= చంద్రునియొ క్కయు హంసపక్షియొక్కయుఁగాం తివంటికాంతిగలదియునగు; వ్యజనా భ్యాం చ=వింజామరలచేతను; నవీజ్య తే=వీవఁబడకున్నది.

తామరపూలవంటికండ్లతో నొప్పు చున్నీముఖము, చంద్రుండునుహం సయుంబోలె తెల్లఁగా శ్రేష్ఠములయి యుండు చామరంబులు, వీవఁబడనివి యున్నది! అని, తాత్పర్యము.

వాగ్మినో వందిన శ్చాపి ప్రహృష్టా స్త్వాం నరర్షభ
స్తువంతో నాత్ర దృశ్యంతే మంగళై స్సూతమాగధాః. ౧౨

టీక॥ నరర్షభ—పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! వాగ్మినః= వాచాలకులయిన; బందినశ్చాపి= స్తుతిపాఠకులను; సూతమాగధాః= పురాతనవృత్తాంతములం జెప్పుసూతులను వాయునవంశావళిం గీర్తించుమాగధులను వారలును; ప్రహృష్టాః= సంతసించినవారలై; మంగళైః= మంగళవచనంబులచేత; త్వాం= నిన్ను; స్తువంతః= పొగడుచు; అత్ర= ఇచ్చట ; సదృశ్యంతే—చూడఁబడుచున్నారు.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! వాచాలురగుస్తుతిపాఠకులను బూర్వవృత్తాంతంబులం బ్రశంసించు సూతులను వంశావళిం గీర్తించు మాగధులును, సంతోషంబున, నిచ్చట మంగళవచనంబులం బ్రస్తుతింపుచున్నారేమి? అని, తాత్పర్యము.

సతే యోఽగ్రంత దధిత బ్రాహ్మణా వేదపారగాః
మూర్ధ్ని మూర్ధాభిషిక్తస్య దదతిస్మ విధానతః. ౧౩

టీక॥ వేదపారగాః = వేదములయంతమునెఱిఁగిన ; బ్రాహ్మణాః—బ్రాహ్మణులు; మూర్ధాభిషిక్తస్య—తలకుస్నానముచేసిన; తే— నియొక్క; మూర్ధ్ని = తలయందు; యో...= తేనెను; దధిత—పెరుగును ; విధానతః= శాస్త్రమువలన; దదతిస్మ—ఇచ్చిరి , అభిషేకింపరైరియునట.

వేదవేదాంతవేత్తలగు బ్రాహ్మణులు, శిరస్స్నానముచేసి పరిశుద్ధుండవై యుండు నీశిరమునను, తేనెయు పెరుఁగును యథావిధిగ, తీర్థోదకములతో, నభిషేకింపుచున్నారేమి! అని, తాత్పర్యము.

సత్వాం ప్రకృతయస్సర్వా శ్శ్రేణిముఖ్యాశ్చ భూషితాః
అనువ్రజితు మిచ్ఛంతి పౌరజానపదాస్తథా. ౧౪

టీక॥ ప్రకృతయః= మంత్రులు మున్నగువారలు; సర్వాః= అందఱును; శ్రేణిముఖ్యాశ్చ= వీధులకుముఖ్యులయినవారలును; తథా= అట్లు; పౌరజనపదాః= పట్టణమునందుండు వారలును గ్రామంబులనుండువారలును; భూషితాః= అలంకరింపఁ బడినవారలై ; త్వాం= నిన్ను; అనువ్రజితుం= వెం

స ౨౬

బడెంచుటకు; నేచ్ఛంతి=కోరకున్నారు. మంత్రులుమిత్రులుమున్నగువారలను అమాత్యవీధులజనులలో ముఖ్యులయి యుండువారలును బట్టణవాసి జనులను గా శ్రమంబులనుండు జనులును, జక్కఁగానలంకరించుకొని, నిన్నువెంబడింపకున్నారేమి? అని, తాత్పర్యము.

చతుర్భి ర్వేదసంపన్నై ర్హయై కాంచన భూషితైః
ముఖ్యః పుష్య రథో యుక్తః కిన్నగచ్ఛతి తేఽగ్రతః. ౧౫

టీక॥ వేగసంపన్నైః=వేగముతోఁ గూడినవియును; కాంచనభూషితైః=బంగారుచే నలంకరింపఁ బడినవియును గు; చతుర్భిః=నాలుగైన; హయైః=గుఱ్ఱములతో; యుక్తః=కూడిన; ముఖ్యః=శ్రేష్ఠమయిన; పుష్యరథః=ఉత్సవార్థమయినరథము; కిం=ఎందుకు; తే=నీయొక్క, అగ్రతః = ముందట; నగచ్ఛతి=పోకున్నది.

మంచి వేగముగల్గి బంగారముచే నలంకరింపఁబడి యుండు నాలుగుగుఱ్ఱములుగట్టి యుత్సవార్థమయి సింగారింపఁబడియుండుపుష్యరథంబు, నీముందట నడవకున్నదేమి? అని, తాత్పర్యము.

న హస్తీ చాగ్రతః శ్రీమాం స్తవలక్షణ పూజితః
ప్రయాణే లక్ష్యతే వీర కృష్ణమేఘగిరిప్రభః. ౧౬

టీక॥ వీర=పరాక్రమశాలివగురాముఁడా! తవ=నీయొక్క; ప్రయాణే=పయనమునందు; అగ్రతః = ముందట; కృష్ణమేఘగిరిప్రభః = నల్లనిమేఘముయొక్కయుఁ బర్వతము యొక్కయుఁ గాంతివంటి కాంతిగలదియును; శ్రీమాన్=సంపదగలదియును, సంపదగలిగించునదియునసుట; లక్షణపూజితః=లక్షణములచేఁబూజింపఁబడినదియును గు, శుభలక్షణంబులు గలదియు నగునసుట; హస్తీచ = ఏనుంగును; నలక్ష్యతే=చూడఁబడకున్నది.

పరాక్రమశాలివగురాముఁడా! నల్లనిమేఘంబువిధిఁ బర్వతంబు మాడ్కిఁ గ్రాలుచు శ్రీమంతంబై శుభలక్షణంబులుఁగలిగియుండుపట్టపేనుంగు, నీవువీధింబోవునప్పుడు, నీముందట, లేకున్నదేమి? అని, తాత్పర్యము.

నచ కాంచనచిత్రం తే పశ్యామి ప్రియదర్శన
భద్రాసనం పురస్కృత్య యాతం వీర పురస్కృతమ్. ౧౭

టీక॥ ప్రియదర్శన=సంతోషకరంబగుచూచుటగలరాముఁడా! కాంచనచిత్రం=బంగారుచేఁ జిత్రవర్ణముగా నుండు; భద్రాసనం=సింహాసనమును; పురస్కృత్య=ముందిడుకొని; వీరపురస్కృతం=పరాక్రమశాలులగు వారలచేముందిడుకొనఁబడిన; తే=నీయొక్క; యాతంచ=గమనమును; నపశ్యామి=చూడకున్నాను.

చూపరులకు సంతోషంబుగల్గించునట్టి రాముఁడా! నీవు, బంగారముచే నలంకరింపఁబడిన సింహాసనంబును ముందిడుకొని వీరులు వెంటరాఁగా, వీధినూరేగకున్నావేమి? అని, తాత్పర్యము.

అభిషేకో యథా సజ్జః కి మిదానీ మిదం తవ
అపూర్వో ముఖవర్ణశ్చ న ప్రహర్షశ్చ లక్ష్యతే. ౧౮

టీక॥ యథా=ఎట్లు; అభిషేకః=అభిషేకము; సజ్జః=సిద్ధమయినదో; తథా (అధ్యాహృతము)=అట్లు; అపూర్వః=ముందులేని; ముఖవర్ణశ్చ=మొగమురంగును; దృశ్యతే(అధ్యాహృతము)=చూడఁబడుచున్నది. ప్రహర్షశ్చ=సంతోషమును; నలక్ష్యతే=చూడఁబడకున్నది. ఇదానీం=ఇప్పుడు; తవ=నీకు; ఇదం=ఈదుఃఖము; కిం=ఎందుకు?

ఇప్పుడెంతసంతోషముగాఁ బట్టాభిషేకము సన్నద్ధముగానున్నదో, అంతదుఃఖముగా, నిదివఱకెన్నఁడనులేని, యీరంగునీమొగమునకుఁ గలిగియున్నది; సంతోషముకనుపడలేదు; నీకిప్పుడింత దుఃఖంబేలవచ్చినది? అని, సీత, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతీవ విలపంతీం తాం ప్రోవాచ రఘునందనః

టీక॥ రఘునందనః=రాముఁడు; ఇతీవ=ఇట్లు; విలపంతీం=ఏడ్చుచున్న; తాం=ఆసీతనుగూర్చి; ప్రోవాచ=చెప్పెను.

ఇట్లువిలపించుచున్న సీతాదేవిం జూచి, రాముం డీప్రకారము చెప్పెను. అని, తాత్పర్యము.

సీతే తత్ర భవాం స్తాతః ప్రవ్రాజయతి మాం వనమ్. ౧౯

టీక॥ సీతే=సీతా! తత్రభవాన్= పూజ్యుఁడైన; తాతః=తండ్రియగుదశరథమహారాజు; మాం= నన్ను; వనం= అడవిని; ప్రవ్రాజయతి= పొందించు చున్నాఁడు.

సీతా! పూజ్యుండగునాతండ్రిదశరథమహారాజు, నన్నూరువిడిచి యడవికిఁబొమ్మని యాజ్ఞాపించు చున్నాఁడు. అని, తాత్పర్యము.

కులే మహతి సంభూతే ధర్మజ్ఞే ధర్మచారిణి
శృణు జానకి యేనేదం క్రమేణాభ్యా గతం మమ. ౨౦

టీక॥ మహతి=పూజ్యమయిన; కులే=వంశమునందు; సంభూతే=పుట్టినదానవును; ధర్మజ్ఞే = ధర్మంబునెఱింగిన దానవును; ధర్మచారిణి=ధర్మమునాచరించుదానవునగు ; జానకి=జనకునికొమార్తెవైనసీతా ! ఇదం=ఇది;మమ=నాకు; యేన=ఏ; క్రమేణ= మార్గముచేత; అభ్యాగతం=వచ్చినదో; తం(అభ్యాహృతము)=ఆమార్గమును ; శృణు=వినుము.

సీతా!నీవుపూజ్యంబగు వంశంబునం బుట్టిన దానవు, ధర్మంబు దెలిసినదానవు,ధర్మంబు నెయాచరించుదానవు , పరమ ధార్మికుండగు జనకునికొమార్తెవు,కావున, ధర్మమునతిక్రమింపవు ; నాకీవనవాస మెట్లు సంభవించినదో,ఆరీతింజెప్పెదను. వినుము. అని, తాత్పర్యము.

రాజ్ఞా సత్యప్రతిజ్ఞేన పిత్రా దశరథేన చ
కైకేయ్యై మమ మాత్రే తు పురా దత్తౌ మహావరౌ. ౨౧

టీక॥పురా=మునుపు;మమ = నాయొక్క; మాత్రే=తల్లియయిన;కైకేయ్యైతు = కైకేయికిమాత్రము;రాజ్ఞా=రాజును;సత్యప్రతిజ్ఞేన=అబద్ధముకానిప్రతినగలవాఁడును;పిత్రాచ=తండ్రియునగు; దశరథేన=దశరథునిచేత; మహావరౌ=గొప్పవరములురెండు; దత్తౌ=ఇయ్యఁబడినవి.

మునుపు, చేసినప్రతినతప్పనివాఁడును నాతండ్రియునగుదశరథమహారాజు,

నాతల్లి కైకేయికి, గొప్పవరంబులు రెండు, ఇచ్చినాఁడు. అని, తాత్పర్యము.

తయా ద్య మమ సజ్జే స్మి న్నభిషేకే నృపోద్యతే
ప్రచోదిత స్స సమయో ధర్మేణ ప్రతినిర్జితః. ౨౨

టీక॥ అద్య=ఇప్పుడు; నృపోద్యతే= రాజుచేఁ బ్రయత్నింపఁబడిన; మమ= నాయొక్క;అస్మిన్=ఈ; అభిషేకే= పట్టాభిషేకము; సజ్జే=సిద్ధముకాఁగా; తయా=ఆకైకేయిచేత;సః= ఆ;సమయః=వరసంకేతము; ప్రచోదితః=ప్రవర్తిల్లఁజేయఁబడినది. దశరథశ్చ (అధ్యాహృతము) = దశరథుండును;ధర్మేణ=ధర్మముచే; ప్రతినిర్జితః=జయింపఁబడినాఁడు.

ఇప్పుడు,దశరథునియాజ్ఞచొప్పున, నాకుఁ బట్టాభిషేకంబు సన్నద్ధమయియుండఁగా,నాకైకేయి, దశరథుని,ఆ వరంబులడిగినది; దశరథుండును , ధర్మంబుదప్పనివాఁడుకావున, అబిడకులోఁబడినాఁడు. అని,తాత్పర్యము.

చతుర్దశ హి వర్షాణి వస్తవ్యం దండకే మయా

టీక॥మయా=నాచేత;దండకే=దండకారణ్యమునందు; చతుర్దశ=పదునాలుగు;వర్షాణి=ఏండ్లను;వస్తవ్యం హి=ఉండుటకావలయునుగదా!

ఆరెండు వరంబులలో, నొకటికిఁగా, నేను,దండకారణ్యంబునఁ, బదునాలుగుసంవత్సరంబులు,వాసంబుసేయవలయును. అని, తాత్పర్యము.

పిత్రా మే భరతశ్చాపి యౌవరాజ్యే నియోజితః. ౨౩

టీక॥భరతశ్చాపి = భరతుండును గూడ; మే=నాయొక్క;పిత్రా= తండ్రిచేత;యౌవరాజ్యే= యువరాజుదొరతనమునందు;నియోజితః= ఆజ్ఞాపింపఁబడినాఁడు.

ఆరెండవవరంబునకై, భరతునిగూడ,నప్పుడె, నాతండ్రిదశరథమహారాజు, యువరాజుగానుండు నట్లేర్పఱిచినాఁడు. అని, తాత్పర్యము.

సో హం త్వా మాగతో ద్రష్టుం ప్రస్థితో విజనం వనమ్

టీక॥ సః=అట్టి; అహం=నేను; విజనం=జనులులేని; వనం=అడవినిగూర్చి; ప్రస్థితః = పయనమయినవాఁడనై; త్వాం=నిన్ను; ద్రష్టుం=చూచుటకై; ఆగతః=వచ్చినాఁడ.

అట్లు, గావున, నేనిప్పుడువిజనంబగు వనంబునకుంబోవనిశ్చయించి, నిన్నుఁ జూచిపోవుటకై, యిచ్చటికివచ్చినాను. అని, తాత్పర్యము.

భరతస్య సమీపేతు నాహం కథ్యః కదాచన. ౨౮

టీక॥ భరతస్య=భరతునియొక్క; సమీపేతు= సమీపమునందుమాత్రము; అహం=నేను; కదాచన=ఒకానొకప్పుడును; నకథ్యః = చెప్పఁదగినవాఁడను గాను.

భరతునిసమీపంబునమాత్రము, నన్నెప్పటికిని, శ్లాఘింపవలదు. అని, తాత్పర్యము.

ఋద్ధియుక్తా హి పురుషా నసహంతే పరస్తవమ్

టీక॥ ఋద్ధియుక్తాః = సంపదతోఁ గూడిన; పురుషాః=పురుషులు; పరస్తవం=ఇతరులపొగడుటను; నసహంతే హి=ఓర్వరుగదా!

శ్రీమంతులగుపురుషులు, తమపొగడుట, ఇతరపురుషులంబొగడుటను, సహింపరు. అని, తాత్పర్యము.

తస్మాన్న తే గుణాః కథ్యా భరతస్యాగ్రతో మమ. ౨౯

టీక॥ తస్మాత్=అందువలన; మమ=నాయొక్క; గుణాః=గుణములు; భరతస్య=భరతునియొక్క; అగ్రతః=ముందట, నకథ్యాః=చెప్పఁదగినవికావు.

అట్లగుటంజేసి, నీవు, భరతునియెదుట, నాగుణంబులను, శ్లాఘించి, చెప్పవలదు. అని, తాత్పర్యము.

నాపిత్వం తేన భర్తవ్యా విశేషేణ కదాచన

టీక॥ త్వం=నీవు; కదాచన=ఒకానొకప్పుడును; తేన= ఆభరతునిచేత ;

విశేషేణ=అతిశయముచేత; భర్తవ్యా పి=పోషింపఁబడవలసిన దానవునను; న=కావు.

ఎప్పటికిని నిన్నుఁ బోషింపవలెననియం తమైన్నైనయావశ్యకత భరతునకు లేదు; బంధుత్వముచేత, సామాన్యముగా నిన్నువాఁడు పోషింపఁవలసినవాఁడే కాని వేఱు కాదు. అని, తాత్పర్యము.

అనుకూలతయా శక్యం సమీపే త్వస్య వర్తితుమ్. ౨౬

టీక॥ అనుకూలతయాతు—అనుకూలముగానుండుటచేత మాత్రము; అస్య=ఈభరతునియొక్క; సమీపే=సమీపమునందు; వర్తితుం=ఉండుటకు; శక్యం=కావచ్చును.

నీవీభరతునకనుకూలముగా నున్నట్టయిననే, యతనిసమీపంబుననుండఁ గలవు; లేనిచో నుండలేవు.

అని, తాత్పర్యము.

తస్మై దత్తం నృపతినా యౌవరాజ్యం సనాతనమ్

టీక॥ నృపతినా = మనుష్యులకుఁ బ్రభుండైనదశరథమహారాజుచేత ; సనాతనం= పురాతనమయిన ; యౌవరాజ్యం—యువరాజుదొరతనము; తస్మై= ఆభరతునికొఱకు; దత్తం—ఇయ్యఁబడినది.

దశరథమహారాజు, సనాతనంబగు యువరాజుదొరతనమును , ఆభరతునకే యిచ్చియున్నాఁడు.

అని, తాత్పర్యము.

స ప్రసాద్య స్త్వయా సీతే నృపతిశ్చ విశేషతః. ౨౭

టీక॥ సీతే=సీతా! త్వయా = నీచేత; సః=ఆభరతుఁడును ; నృపతిశ్చ = మనుష్యులకుఁబ్రభువైనదశరథమహారాజును; విశేషతః=అతిశయమువలన; ప్రసాద్యః = సంతోషింపఁజేయఁ దగినవాఁడు.

సీతా! నీవాభరతునకును, దశరథమహారాజునకును, విశేషించి, సంతోషం బుగల్గునట్లు, సేయుచుండవలయు.

అని, తాత్పర్యము.

అహంచాపి ప్రతిజ్ఞాం తాం గురోః స్సమనుపాలయన్
వనమద్యైవ యాస్యామి స్థిరా భవ మనస్విని. ౨౮

టీక॥ అహంచాపి = నేనును; గురోః=తండ్రియొక్క; తాం=ఆ; ప్రతిజ్ఞాం=ప్రతినను; సమనుపాలయన్ = పాలించుచు; అద్యైవ=ఇప్పుడె; వనం=అడవినిగూర్చి; యాస్యామి = పోయెదను. త్వం (అధ్యాహృతము)=నీవు; మనస్విని= మంచిమనసుగలదానవై; స్థిరా = నిలుకడగలదానవు ; భవ=అగుము.

నేనును, దండ్రియగు దశరథమహారాజు చేసిన యాప్రతిజ్ఞం బరిపాలించుటకై, యిప్పుడెయడవికిఁబోయెదను; నీవు మంచిమనస్సుతో నిలుకడగా నుండుము.

అని, తాత్పర్యము.

యాతే చ మయి కల్యాణి వనం మునినిషేవితమ్
వ్రతోపవాసపరయా భవితవ్యం త్వయాఽనఘే. ౨౯

టీక॥ అనఘే = పాపములేనిదానవు; కల్యాణి= మంగళస్వరూపిణివగు సీతా! మయి=నేను; మునినిషేవితం = మునులచే సేవింపఁబడిన; వనం= అడవిని; యాతేచ=పొందఁగానే; త్వయా= నీచేత; వ్రతోపవాసపరయా=నియమమునందునుపవాసమునందును ఆసక్తిగలదానవుగా; భవితవ్యం= ఉండుటకావలసినది.

పాపములేనిదానవు మంగళస్వరూపిణివగుసీతా! నేనుమునులు నివసించు దండకారణ్యంబునకుఁబోయినపిదప, నీవు, వ్రతంబునవలంబించి, యుపవాసంబులుసలుపుచుండవలయును.

అని, తాత్పర్యము.

కాల్య ముత్థాయ దేవానాం కృత్వా పూజాం యథావిధి
వందితవ్యో దశరథః పితా మమ నరేశ్వరః. ౩౦

టీ॥ త్వయా(అధ్యాహృతము)=నీచేత; కాల్యం=ప్రత్యూషఃకాలమునందును; ఉత్థాయ=లేచి; యథావిధి=యథాశాస్త్రముగ; దేవానాం = దేవతలకు

కర్; పూజాం=పూజను; కృత్వా = చేసి; మమ=నాయొక్క; పితా= తండ్రియును; నరేశ్వరః = మనుష్యులకుఁ బ్రభువైనవాఁడునగు; దశరథః= దశరథుఁడు; వందితవ్యః= నమస్కరింపఁబడవలెను.

నీవు ప్రతిదినమును, ఉషఃకాలమునందు నిద్రలేచి , యథావిధిగ దేవతలం బూజించి, మనుష్యులకందఱకుఁ బ్రభుండైన నాతండ్రి దశరథ మహారాజునకు నమస్కారము సేయవలయును.

అని, తాత్పర్యము.

మాతాచ మమ కౌసల్యా వృద్ధా సంతాపకర్శితా
ధర్మమేవాగ్రతః కృత్వా త్వత్త స్సమ్మాన మర్హతి. ౩౧

టీక॥ధర్మమేవ=ధర్మమునే; అగ్రతః=ముందట; కృత్వా= చేసికొని, ఇడుకొని; స్థితా = (అధ్యాహృతము) ఉన్నదియును; వృద్ధా= ముసలిదియును; సంతాపకర్శితా= దుఃఖముచేఁగృశింపఁజేయఁ బడినదియును; మమ=నాయొక్క; మాతా=తల్లియునగు; కౌసల్యాచ=కౌసల్యయును ; త్వత్తః=నీవలన;సమ్మానం = గౌరవమును; అర్హతి=పొందఁదగును.

కేవలముధర్మమునేయాశ్రయించియున్నదియువృద్ధురాలును దుఃఖసముద్రంబునమునింగియున్నదియునగు నాతల్లి కౌసల్యను,నీవు, గౌరవించుచుండవలయును. అని, తాత్పర్యము.

వందితవ్యా శ్చ తే నిత్యం యా శ్శేషా మమ మాతరః
స్నేహప్రణయసంభోగై స్సమాహి మమ మాతరః. ౩౨

టీక॥ మమ=నాయొక్క; శేషాః= మిగిలిన; మాతరః = తల్లులు; యాః (సంతి) = ఎవ్వరుగలరో; తాః (అధ్యాహృతము)చ=వారును; తే= నీకు; నిత్యం=ఎల్లప్పుడును ; వందితవ్యాః= నమస్కరింపఁబడ వలసినవారలు. మమ=నాకు; మాతరః=తల్లులు; స్నేహప్రణయసంభోగైః, స్నేహ= చెలిమిచేతను, ప్రణయ=ప్రేమచేతను , సంభోగైః=పోషించుటచేతను ("భోగో రాజ్యేధనే సౌఖ్యేపాలనాభ్య వహారయోః" అనివైజయంతి); సమాహి=

సమానులుగదా!

నాయందు స్నేహంబును బ్రేమయు నుంచుట, నన్నుఁగాపాడుట, ఈవిషయములందు, నాతల్లులందఱునాకుసమానలే, కావునఁ, గౌసల్యకుంబోలెనితరలయినసాతల్లులకును, నీవునమస్కారంబుసేయుచుండవలయు.

అని, తాత్పర్యము.

భ్రాతృపుత్రసమా చాపి ద్రష్టవ్యౌచ విశేషతః
త్వయా భరతశత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ. ౩౩

టీక॥మమ=నాకు; ప్రాణైః=(పంచమ్యర్థమందుఁ దృతీయ) ప్రాణంబులకన్న; ప్రియతరౌ=అధికప్రియులయిన; భరతశత్రుఘ్నౌచాపి= భరతుండును శత్రుఘ్నుండును; త్వయా=నీచేత; విశేషతః=అతిశయమువలన; భ్రాతృపుత్రసమౌ = తోఁబుట్టువుతోను గొడుకుతోను సమానులుగా; ద్రష్టవ్యౌ = చూడఁబడవలసినవారు.

నాకునాప్రాణంబులకన్న నధికప్రియులయిన, భరతశత్రుఘ్నులను, నీవు, విశేషించి, నీతోఁబుట్టువును గొడుకునుం జూచుకొనునట్లు, చూచుకొనవలయును. అని, తాత్పర్యము.

విప్రియం నచ కర్తవ్యం భరతస్య కదాచన
స హిరాజా ప్రభు శ్చైవ దేశస్యచ కులస్యచ. ౩౪

టీక॥భరతస్య=భరతునకు; కదాచన=ఒకానొకప్పుడును; విప్రియంచ=విరోధమును; నకర్తవ్యం = చేయఁబడఁగూడదు. సః=ఆభరతుఁడు; దేశస్యచ=దేశమునకును; కులస్యచ=ఇంటికిని; రాజా=రాజును; ప్రభుశ్చైవహి=నియామకుండునుగదా!

భరతుఁడీదేశమునకును మనయింటికినిగూడ, రాజును బ్రభుండును, గావున, నీవతనికెప్పుడును, విరోధముసేయఁగూడదు. అని, తాత్పర్యము.

ఆరాధితాహి శీలేన ప్రయత్నై శ్చోపసేవితాః
రాజాన స్సంప్రసీదంతి ప్రకుప్యంతి విపర్యయే. ౩౫

టీక॥ రాజానః=రాజులు; శీలేన=స్వభావముచేత; ఆరాధితాః=సంతోషింపఁ జేయఁబడినవారలయి; ప్రయత్నైః=యత్నములచేత; ఉపసేవితాశ్చ=సేవింపఁబడినవారలునై; సంప్రసీదంతిహి=సంతోషింతురుగదా! విపర్యయే=వేఱువిధమునందు; ప్రకుప్యంతి=మిక్కిలియుఁ గోపంబునొందుదురు.

రాజులు, తమకనుకూలముగాఁ బ్రవర్తించి, యాలస్యాదులులేక యెల్లప్పుడును దమ్ము సేవించుచుండినచో, సంతోషింతురు; అట్లుగానిచో, మిక్కిలియుఁ గోపంబునొందుదురు.

అని, తాత్పర్యము.

ఔరసానపి పుత్రాన్హి త్యజంత్యహితకారిణః
సమర్థాన్ సంప్రగృహ్ణంతి జనానపి నరాధిపాః. ౩౯

టీక॥ నరాధిపాః=మనుష్యులకుఁబ్రభువులయినవారలు, రాజులనుట; అహితకారిణః=అనిష్టము సేయునట్టి; ఔరసాన్=తమవలనఁదమధర్మపత్నికిఁబుట్టిన; పుత్రానపి=కొడుకులనయినను; త్యజంతిహి=విడుతురుగదా! సమర్థాన్=సమర్థులయిన; జనానపి=సాధారణజనులనైనను; సంప్రగృహ్ణంతి=స్వీకరింతురు.

రాజులు, తమకు విరోధము సేయుదురేని, తమకుఁదమధర్మపత్నులందుఁబుట్టిన, ధర్మప్రదులగు, నౌరసపుత్రులనైనను, బరిత్యజింతురు; బంధువులుకాని సాధారణజనులయినను, సమర్థులును దమకుహితము సేయువారలగుదురేని, వారలంబరిగ్రహింతురు.

అని, తాత్పర్యము.

సా త్వం వసేహ కళ్యాణి రాజ్ఞ స్సమనువర్తినీ
భరతస్య రతా ధర్మే సత్యవ్రతపరాయణా. ౩౭

టీక॥ కల్యాణి=మంగళస్వరూపిణివగుసీతా! సా=అట్టి; త్వం=నీవు; రాజ్ఞః=రాజయిన; భరతస్య=భరతునకు; సమనువర్తినీ=అనుకూలురాలవై; ధర్మే=ధర్మమునందు; రతా=ఆసక్తురాలవై; సత్యవ్రతపరాయణా=సత్యమునునియమము నైముఖ్యమయినగతిగాఁగలదానవై; ఇహ=ఇచ్చట; వస=

ఉండుము.

మంగళస్వరూపిణివగు సీతా! అట్లు భరతున కనుకూలముగాఁ బ్రవర్తింపని చోనీకుఁ గష్టముగలుగుఁ, గావున, నీవు, రాజయిన భరతుననువర్తింపుచు, ధర్మంబువదలక, సత్యంబునునియమంబు నవలంబించి, యిచ్చటనే, యుండుము. అని, తాత్పర్యము.

అహం గమిష్యామి మహావనం ప్రియే
త్వయాహి వ స్తవ్య మిహైవ భామిని
యథా వ్యళీకం కురుషే న కస్యచి
త్తథా త్వయా కార్య మిదం వచో మమ. ౩౮

టీక॥ప్రియే = ప్రియురాలవగు సీతా! అహం = నేను; మహావనం = కాఁడవిని; గమిష్యామి = పోయెదను. భామిని = స్త్రీవగు సీతా! త్వయా = నీచేత; ఇహైవ = ఇచ్చటనే; వ స్తవ్యంహి = ఉండుట కావలసినదిగదా! యథా = ఎట్లు; కస్యచిత్ = ఒకానొకనికిని; వ్యళీకం = అప్రియమును; నకురుషే = చేయకుందువో; తథా = అట్లు; త్వయా = నీచేత; కార్యం = చేయఁదగినవి. ఇదం = ఇది; మమ = నాయొక్క; వచః = మాట.

ప్రియురాలవగు సీతా! నేను, గాఁడవిలోనుండఁబోయెదను; నీవు, స్త్రీవికావున, నాతోనడచుటకి రాఁదగవు; నీవిచ్చటనే యుండవలయుఁగదా! ఇచ్చట, నెవ్వనికిని, నీపైఁగోపంబు రాకుండునట్లు, అనుకూలముగా, నడుచుకొనుచుండుము; ఇదే నేను జెప్పుమాట! అని, రాముండు, సీతాదేవికిం, జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, షడ్వింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండషడ్వింశసర్గ టీక,
ముగిసినది.

శ్రీ

సప్తవింశసర్గప్రారంభః.

ఏవ ముక్తాతు వైదేహీ ప్రియార్హా ప్రియవాదినీ
ప్రణయా దేవ సంక్రుద్ధా భర్తార మిద మబ్రవీత్. ౧

టీక॥ ప్రియార్హా=సంతోషముగలిగించుమాటలకేదగినదియును; ప్రియవాదినీ=సంతోషముగలిగించుమాటలంజెప్పునదియునగు; వైదేహీ=సీత ; ఏవం=ఇట్లు ; ఉక్తాతు= చెప్పఁబడినదై సంతనె ; ప్రణయాదేవ=స్నేహంబువలననె; సంక్రుద్ధా= మిక్కిలికోపించినదై; భర్తారం=పెనిమిటినిగూర్చి ; ఇదం= ఈమాటను ; అబ్రవీత్ = చెప్పెను.

సంతోషకరంబులగుమాటలెచెప్పందగినదియు, సంతోషకరంబుగనె మాటలాడునదియునగు సీతాదేవి, పెనిమిటిచెప్పినమాటలనువిని, స్నేహంబుననె, మిక్కిలియుఁ గోపంబునొంది,పెనిమిటినిరామునిఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కి మిదం భాషసే రామ వాక్యం లఘుతయా ధ్రువమ్
త్వయా య దపహాస్యం మే శ్రుత్వా నరవరాత్మజ. ౨

టీక॥నరవరాత్మజ= మనుష్యులకుఁబ్రభుండైన దశరథుని కుమారుండవగు; రామ=రాముఁడా ! త్వయా=నీచేత; భాషితం(అధ్యాహృతము)=చెప్పఁబడిన; యత్=ఏమాట ; శ్రుత్వా=విని; మే=నాకును ; అపహాస్యం=పరిహసింపఁదగినదో; తత్ (అధ్యాహృతము)=అట్టి ; లఘుతయా=చులకనయగుటచేత ; ధ్రువం= నిశ్చయింపఁబడిన, చులుకనయనినిశ్చయింపఁబడినయనుట; వాక్యం= మాటను; భాషసే=చెప్పుచున్నావు॰ఇదం = ఇది; కిం=ఏమి?

రాముఁడా!నీవు రాజపుత్రుండవు,నీవిప్పుడు,నావంటియాఁడుదానికింగూడ పరిహాసము సేయఁదగినట్టి,పనికిమాలిన మాటంజెప్పుచున్నావే!ఇదియేమి విచిత్రము!ఇదివఱకెన్నఁడును నీనోటనే ని

ట్టిమాటలనువిన్నదిలేదు! అని, తాత్పర్యము.

ఆర్యపుత్ర పితా మాతా భ్రాతా పుత్ర స్తథా స్నుషా
స్వాని పుణ్యాని భుంజానా స్స్వంస్వం భాగ్య ముపాసతే. 3

టీక॥ఆర్యపుత్ర=(ఇది, సంస్కృతములోఁబెనిమిటింబిలుచుశబ్దము) పూజ్యుండవగుదశరథునికుమారుండవయిన రాముఁడా! పితా=తండ్రియును; మాతా=తల్లియును; భ్రాతా=తోడఁబుట్టువును; పుత్రః=కొడుకును; తథా=అట్లు; స్నుషా=కోడలును; స్వాని=తమవయిన; పుణ్యాని=పుణ్యంబులను, పుణ్యఫలంబులననుట; భుంజానాః=అనుభవించుచు; స్వంస్వం=తమతమ; భాగ్యం=శుభాశుభకర్మమును; ఉపాసతే=పొందుచున్నారు.

పెనిమిటివగు రాముఁడా! తండ్రియును దల్లియును దోఁబుట్టువును, గొడుకును గోడలును, వీరలందఱుఁ, దమతమపుణ్యపాపములఫలంబుల ననుభవించుచు, వానివలనం దమకుఁగలుగు, శుభాశుభకర్మంబులను, దామెయనుభవించుచున్నారు. అని, తాత్పర్యము.

భర్తుర్భాగ్యంతు భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ

టీక॥పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! భార్యా=పెండ్లాము; ఏకాతు=ఒక్కతెయె; భర్తుః భాగ్యం=పెనిమిటిభాగ్యమును; ప్రాప్నోతి=పొందుచున్నది.

పెనిమిటికర్ధశరీరమయినభార్యయొకర్తెమాత్రమె, తనపెనిమిటికింగలుగుశుభాశుభకర్మంబులనె, దానును, బొందుచున్నది. అని, తాత్పర్యము.

అత శ్చైవాహ మాదిష్టా వనే వస్తవ్య మిత్యపి. 4

టీక॥ అతః=ఇందువలన; అహమపి=నేనును; "వనే=అడవియందు; వస్తవ్యం=ఉండుటకావలయును" ఇతి=అని; ఆదిష్టాచైవ=ఆజ్ఞాపింపబడినదాననే.

అట్లగుటంజేసి , నిన్నాజ్ఞాపించుట

| | |
|---|---|
| మాత్రము చేతనే, నన్నును, అడవిలో నుండవలయునని, యాజ్ఞాపించినట్లియ | గుచున్నది. అని, తాత్పర్యము. |

న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః
ఇహ ప్రేత్య చ నారీణాం పతి రేకో గతి స్సదా. ౫

టీక॥ నారీణాం=స్త్రీలకు; పితా=తండ్రి; గతిః(అధ్యాహృతము)=ప్రాప్యస్థానము; న—కాదు. ఆత్మజః=కొడుకు; న—కాదు. ఆత్మా=తానును. న=కాదు. మాతా=తల్లి; న=కాదు. సఖీజనః=చెలికత్తెజనము; న=కాదు. ఇహ=ఈలోకమునందును; ప్రేత్య చ=పరలోకమందును; పతిః=పెనిమిటి; ఏకః—ఒకఁడే; సదా=ఎల్లప్పుడును; గతిః=ప్రాప్యస్థానము.

స్త్రీలకుఁదండ్రిగాని, కొడుకుగాని, తల్లిగాని, చెలికత్తెలుగాని, గతి కానేరరు; వారలు దమకుఁ దామెస్వతంత్రలును గారు; పెనిమిటియొకఁడు, మాత్రమె, వారలకీలోకమునందును బరలోకమునందును, ఎల్లప్పుడును, గతి యగును; మఱియెవ్వఁడును లేఁడు.

అని, తాత్పర్యము.

యది త్వం ప్రస్థితో దుర్గం వన మద్యైవ రాఘవ
అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్. ౬

టీక॥ రాఘవ=రాముఁడా! త్వం=నీవు; అద్యైవ=ఇప్పుడే; దుర్గం=చొరరాని; వనం=అడవినిగూర్చి; ప్రస్థితో యది=పయనమగుదువేని; అహం(అధ్యాహృతము)=నేను; కుశకంటకాన్—దర్భముక్కలను; మృద్నంతీ=మెత్తగిల్లఁజేయుచు; తే=నీకు; అగ్రతః=ముందట; గమిష్యామి=పోయెదను.

రాముఁడా! నీవిప్పుడె గహనంబగునరణ్యంబునకుంబోవఁ బయనంబగుదువేని, నేను, నీముందట, దర్భముక్కలమెత్తగాఁ బాదంబుల ద్రొక్కుచుఁ, బోయెదను; వెనుక వచ్చునట్టి నీకు వానిపైఁ బాదంబులుంచుటకుఁ గష్టముండదు.

అని, తాత్పర్యము.

ఈర్ష్యారోషౌ బహిష్కృత్య భుక్తశేష మివోదకమ్

నయ మాం వీర విస్రబ్ధః పాపం మయి న విద్యతే. ౭

టీక॥ వీర= పరాక్రమశాలివగురా ముఁడా! త్వం(అధ్యాహృము)=నీవు; ఈర్ష్యారోషౌ = ఓర్వమినిగోపంబు ను; భుక్తశేషం= తినఁబడిమిగిలిన, త్రావఁగామిగిలినయనుట; ఉదకమివ= జలమునుంబోలె; బహిష్కృత్య=విడిచి; విస్రబ్ధః=నమ్మకముగలవాఁడవై; మాం= నన్ను; నయ=కొనిపొమ్ము. మయి = నాయందు; పాపం = దోషము; నవిద్యతే=లేదు.

నీవు, పరాక్రమశాలివి, నీకెందును భయములేదు, నావంటివాండ్రెందఱి నైనంగాపాడఁజాలుదువు, నేనుస్త్రీన నిభయపడవలదు; "నేనురావలదనఁగా వినక, వచ్చెదనని చెప్పుచున్నదే" యని యోర్వమియు, "నామాటనతిక్రమించు చున్నదే" యనికోపంబును, త్రాఁగిమిగిలినజలంబునువిడుచునట్లు, పరిత్యజించి, నాయందునమ్మకంబుంచి, నన్నునుగొని పొమ్ము; నేనునీకేమియునపకారంబుసేయలేదు. అని, తాత్పర్యము.

ప్రాసాదాగ్రై ర్విమానై ర్వా వైహాయసగతేన వా
సర్వావస్థాగతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే. ౮

టీక॥ ప్రాసాదాగ్రైః = (పంచమ్యర్థమందుఁ దృతీయ, ఇట్లుముందు నెఱుంగునది) మేడలశిఖరములకన్నను; విమానైర్వా=విమానములకన్నను; వైహాయసగతేనవా=ఆకాశమునందలిగమనముకన్నను; సర్వావస్థాగతా, సర్వావస్థా= అన్నియవస్థలందును, ఆగతా=అనుగతమయిన; భర్తుః= పెనిమిటియొక్క; పాదచ్ఛాయా=అడుగులనీడ, పాదసేవయనుట; విశిష్యతే = అధికమగుచున్నది.

మేడలపైనుండుటకన్నను విమానంబులనుండుటకన్నను, అణిమాదిసిద్ధులంబొంది యాకాశంబునం దిరుగుటకన్నను, అన్నియవస్థలందు నేకరీతిగాఁ బెనిమిటిననుసరించి, యతనిపాదంబులకుసేవ సేయుటయె, యధికము.

అని, తాత్పర్యము.

అనుశిష్టాచ మాత్రాచ పిత్రాచ వివిధాశ్రయమ్

టీక॥ మాత్రాచ=తల్లిచేతను ; పిత్రాచ = తండ్రిచేతను ; వివిధాశ్రయం=నానాప్రకారములుగా ; అనుశిష్టా=శిక్షింపఁబడినదానను; అస్మి=అగుచున్నాను.

నాతల్లియును నాతండ్రియును, నాకీవిషయమునుగుఱించి, నానావిధములుగా, నుపదేశించి యున్నారు.

అని, తాత్పర్యము.

నాస్మి సంప్రతి వక్తవ్యా వర్తితవ్యం యథా మయా. ౯

టీక॥ యథా=ఎట్లు; మయా=నాచేత; వర్తితవ్యం = ఉండఁటకావలయునో; తథా (అధ్యాహృతము) = అట్లు; సంప్రతి=ఇప్పుడు; వక్తవ్యా= చెప్పఁబడ వలసినదానను; నాస్మి = కాను.

నేనెట్లు నడుచుకొనవలయునో, ఆసంగతియిప్పుడునాకెవ్వరును దేశింపవలసినదిలేదు ; నాకిదివఱకె నాతలిదండ్రులుపదేశించి యున్నారు.

అని, తాత్పర్యము.

అహం దుర్గం గమిష్యామి వనం పురుషవర్జితమ్
నానామృగగణాకీర్ణం శార్దూలవృకసేవితమ్. ౧౦

టీక॥ అహం=నేను ; దుర్గం = చొరరానిదియును; పురుషవర్జితం= జనులచేవిడువఁబడినదియును ; నానామృగగణాకీర్ణం= నానావిధములయినమృగములచేవ్యాపింపఁబడినదియును; శార్దూలవృకసేవితం=పెద్దపులులచేతనుదోడేళ్లచేతను సేవింపఁబడినదియు నగు; వనం = అడవిని; గమిష్యామి= పొందెదను.

అరణ్యంబు, చొరరానిదయ్యుజనులులేనిదైనను , పెద్దపులులు దోడేళ్లు మొదలగు నానావిధములయిన మృగంబులతో నిండిన దైనను, నేనుదప్పక, నీతోఁగూడ, నరణ్యంబునకు,వచ్చెదను.

అని, తాత్పర్యము.

సుఖం వనే నివత్స్యామి యథైవ భవనే పితుః
అచింతయంతీ త్రీన్ లోకాన్ చింతయంతీ పతివ్రతమ్. ౧౧

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; త్రీన్=మూడైన; లోకాన్ = లోకములను; అచింతయంతీ = ఎన్నని దాననై; పతివ్రతం= పెనిమిటివిషయమయిన వ్రతమును, శుశ్రూషననుట; చింతయంతీ=చింతింపుచు; వనే=అడవియందు; పితుః= తండ్రియొక్క; భవనే యథైవ= ఇంటియందువలె; సుఖం=సుఖముగా; నివత్స్యామి=ఉండెదను.

నేను, త్రైలోక్యాధిపత్యమునైనను లెక్కింపక, పెనిమిటి శుశ్రూషచేయుట దక్క మఱి వేఱుతలంపక, మాతండ్రియింటనుండునట్లు, సుఖంబుగా, వనంబులోనుండెదను.

అని, తాత్పర్యము.

శుశ్రూషమాణా తే నిత్యం నియతా బ్రహ్మచారిణీ
సహ రంస్యే త్వయా వీర వనేషు మధుగంధిషు. ౧౨

టీక॥ వీర=పరాక్రమశాలివగు రాముఁడా! అహం(అధ్యాహృతము)= నేను; నిత్యం=ఎల్లప్పుడును; తే = నీకు; శుశ్రూషమాణా=పరిచర్య సేయుచు; నియతా=నియమముగలదాననై; బ్రహ్మచారిణీ= తపంబునొందుచు; మధుగంధిషు=తేనెచేమంచివాసనగల; వనేషు= వనములయందు; త్వయాసహ=నీతోఁగూడ; రంస్యే=క్రీడింపుచుండెదను.

పరాక్రమశాలివగు రాముఁడా! నేను నీకెల్లప్పుడును సేవసేయుచు, నియమంబునఁదపంబు సల్పుచు, మంచి తేనియలు గల్గుటచేసు గంధంబు గుబాళించుచుండు వనంబులందు, నిన్నుఁగూడి, క్రీడింపుచుండెదను అని, తాత్పర్యము.

త్వం హి శక్తో వనే కర్తుం రామ సంపరిపాలనమ్
అన్యస్యాపి జనస్యేహ కింపునర్మమ మానద. ౧౩

టీక॥ మానద=మానంబునిచ్చునట్టి; రామ=రాముఁడా! త్వం=నీవు; వనే= అడవియందు; అన్యస్య=ఇతరమైన; జనస్యాపి=జనముయొక్కయు; సంపరిపాలనం=కాపాడుటను; కర్తుం=చేయుటకు; శక్తోహి= చాలినవాఁడవుగదా! ఇహ=ఇప్పుడు; మమ = నాయొక్క; సంపరిపాలనం, కర్తుం, శక్త, ఇతి

(అధ్యాహృతము) = కాపాడుటనుజే యుటకుఁజాలినవాఁడవని;కింవునః (వ క్తవ్యం)=చెప్ప నేల?

నావూనంబుఁ గాపాడునట్టి రాముఁడా!నీవు,అడవియందు,నన్నును,ఇం కనితరజనులనగూడఁ, గాపాడఁటకుశ క్తుండవు;అట్టుండఁగా నన్నుమాత్రము గాపాడుటనీ కెంతమాత్రము?

అని, తాత్పర్యము.

సహాత్వయా గమిష్యామి వన మద్య న సంశయః

టీ॥అహం(అధ్యాహృతము)= నేను;త్వ యాసహ=నీతోఁగూడ;అద్య=ఇప్పుడు; వనం=అడవినిగూర్చి;ఆగమిష్యామి=వ చ్చెదను.సంశయః=సందేహము ; న= లేదు.

నేనిప్పుడునీతోఁగూడనే,యడవికివచ్చె దను; ఈవిషయంబునందెంతమాత్రము నుసందేహములేదు.అని, తాత్పర్యము.

నా హం శక్యా మహాభాగ నివర్తయితు ముద్యతా. ౧౪

టీక॥ఉద్యతా = వనంబునకువచ్చు టకుఁబ్రయత్నించిన;అహం= నేను; నివ ర్తయితుం=మఱలించుటకు; శక్యా= అలవియయినదానను;న=కాను.

ఇట్లువనంబునకునీతోఁగూడరావల యుననినిశ్చయించియున్ననన్ను, ఇచ్చ టనిలుపనీకలవిగాదు.అని,తాత్పర్యము.

ఫలమూలాశనా నిత్యం భవిష్యామి న సంశయః

టీక। అహం(అధ్యాహృతము)= నే ను;నిత్యం=ఎల్లప్పుడును; ఫలమూలాశ నా = పండ్లునుగడ్డలు నేయాహారము గాఁగలదానను;భవిష్యామి=అయ్యెద ను.సంశయః=సందేహము; న=లేదు.

"వనంబున, మంచియాహారంబుదొ రికదు; పండ్లను గడ్డలనుదినియుండవల యును"అనియందువేమొ;నేనెల్లప్పుడు నుబండ్లనుగడ్డలనేదినుచుండెదను; మం చియాహారంబె నాకక్కఱలేదు; దీనికి సందేహములేదు. అని, తాత్పర్యము.

న తే దుఃఖం కరిష్యామి నివసంతీ సహాత్వయా. ౧౫

టీక॥ అహం(అధ్యాహృతము)—నేను; త్వయాసహ=నీతోఁగూడ; నివసంతీ—ఉండుచు; తే=నీకు; దుఃఖం—దుఃఖమును; నకరిష్యామి=చేయను.

నేను, నీకెవిధమయినదుఃఖమును జేయక, నీతోఁగూడనుండెదను.

అని, తాత్పర్యము.

ఇచ్ఛామి సరితః శ్శైలాన్ పల్వలాని వనాని చ
ద్రష్టుం సర్వత్ర నిర్భీతా త్వయా నాథేన ధీమతా. ౧౬

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; ధీమతా—బుద్ధిమంతుఁడవైన; నాథేన=పెనిమిటివగు; త్వయా= నీతో; సహితా (అధ్యాహృతము)—గూడినదాననై; నిర్భీతా= భయములేనిదాననై; సరితః=నదులను; శైలాన్—పర్వతములను; పల్వలాని—నీళ్లుగల చిన్నపల్లములను; వనానిచ— వనంబులను; సర్వత్ర=అంతటను ; ద్రష్టుం= చూచుటకు; ఇచ్ఛామి—కోరుచున్నాను.

నేను , బుద్ధిమంతుండవు నాథుండవగు నీవు తోడుండఁగా , నెంతమాత్రము భయములేక, అడవియందుండు, నదులనుబర్వతంబులను నీళ్లునిలిచియుండు పల్లములను వనంబులను, వీనన్నిటినింజూడఁగోరుచున్నాను.

అని, తాత్పర్యము.

హంసకారండవాకీర్ణాః పద్మినీః సాధుపుష్పితాః
ఇచ్ఛేయం సుఖినీ ద్రష్టుం త్వయా వీరేణ సంగతా. ౧౭

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను; వీరేణ— పరాక్రమశాలివగు; త్వయా=నీతో; సంగతా=కూడినదాననై; సుఖినీ—అధికమయిన సుఖముగలదాననై; హంసకారండవాకీర్ణాః=హంసపక్షులచేతను నీరుకోళ్ల చేతను వ్యాపింపఁబడినవియును ; సాధుపుష్పితాః—చక్కఁగాఁ బూచినవియునగు; పద్మినీః=తామరకొలనులను; ద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛేయం= కోరుదును.

నేను, బరాక్రమశాలివగు నిన్నుఁగూడి , భయంబులేక , సుఖముగా, హంసపక్షులును నీరుకోళ్లును గలిగి చక్కఁగాఁబూచియుండు తామరకొలం

తులం, దాఁ గోరుచున్నాను. అని, తాత్పర్యము.

అభిషేకం కరిష్యామి తాసు నిత్యం యతవ్రతా

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; యతవ్రతా=దృఢమయిన నియమముగలదాననై; నిత్యం= ఎల్లప్పుడును; తాసు=ఆతామరకొలనులందు; అభిషేకం=స్నానమును ; కరిష్యామి= చేసెదను.

నేను,దృఢమయిననియమం బవలంబించి , యాతామర కొలఁకులందె, స్నానంబుచేసెదను ; ఉష్ణోదకంబగోరను. అని, తాత్పర్యము.

సహ త్వయా విశాలాక్ష రంస్యే పరమనందినీ. ౧౮

విశాలాక్ష=వెడల్పైన కన్నులుగల రాముఁడా! అహం ( అధ్యాహృతము)= నేను;తాసు(అధ్యాహృతము)= ఆతామరకొలనులందు; త్వయాసహ= నీతోఁగూడ; పరమనందినీ = మిక్కిలి యుసంతోషముగలదాననై;రంస్యే = క్రీడించెదను.

విశాలంబులగు నేత్రంబులుగల రాముఁడా!ఆతామరకొలంకులందు , నిన్నుఁగూడి, పరమసంతోషంబునం,గ్రీడించుచుండెదను.అని, తాత్పర్యము.

ఏవం వర్షసహస్రాణాం శతం వాహం త్వయా సహ
వ్యతిక్రమం న వేత్స్యామి స్వర్గోఽపి నహి మే మతః. ౧౯

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను ; ఏవం=ఇట్లు; త్వయాసహ = నీతోఁగూడ;స్థితా(అధ్యాహృతము)= ఉన్నదాననై, వ్యతిక్రమం=(వ్యతిక్రాంతం)కడచిన;వర్షసహస్రాణాం=సంవత్సరములవేలయొక్క;శతంవా=నూటినైనను ; నవేత్స్యామి=ఎఱుంగకుండెదను. త్వయావినా(అధ్యాహృతము) నిన్నువిడిచి ; స్వర్గోపి=స్వర్గమయినను ; మే=నాకు;మతః=ఇష్టమయినది; నహి=కాదుగదా!

ఈప్రకారమునీతోఁగూడనరణ్యంబునవాసంబు సేయుచు , నూఱువేలసంవత్సరంబులుగడచినను , ఇంతకాలంబైనదనియెఱుంగకుండెదను ; ఇంకఁబదునాలుగు సంవత్సరములెంత మాత్ర

ము! నిన్నువిడిచి, స్వర్గంబులో, నుండుటయైనను, నాకిష్టము కాదు.
అని, తాత్పర్యము.

స్వర్గేపిచ వినా వాసో భవితా యది రాఘవ
త్వయా మమ నరవ్యాఘ్ర నాహం తమపి రోచయే. ౨౦

టీక॥ నరవ్యాఘ్ర=మనుష్యశ్రేష్ఠుండవగు; రాఘవ=రాముఁడా! మమ=నాకు; త్వయావినా=నిన్నువిడిచి; స్వర్గేపిచ=స్వర్గమునందైనను; వాసః=ఉనికి; భవితాయది=కాఁగలదేని; అహం=నేను; తమపి= దానింగూడ; నరోచయే=సమ్మతింపను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! నాకు స్వర్గంబున వాసంబుసిద్ధించి నను, నీవులేకున్నచో, నేనువానింగూడ నెంతమాత్రముసమ్మతింపను.
అని, తాత్పర్యము.

అహం గమిష్యామి వనం సుదుర్గమం
మృగాయుతం వానరవారణైర్యుతమ్

టీక॥ అహం= నేను; సుదుర్గమం=ఎంతమాత్రము చొరరానిదియును; మృగాయుతం=మృగములతోఁగూడినదియును; వానరవారణైః=కోఁతులతోనుఏనుంగులతోను; యుతం=కూడినదియునగు; వనం=అడవిని; గమిష్యామి= పొందెదను.

నేను, అడవిలోనికింబోరనలవి కాకున్నను, అందుఁగోఁతులు నేనుంగులు మున్నగుమృగంబులున్నను, నేను, దప్పక, నీతోఁగూడ, నడవికి, వచ్చెదను.
అని, తాత్పర్యము.

వనే నివత్స్యామి యథా పితుర్గృహే
తవైవ పాదా వుపగృహ్య సంయతా. ౨౧

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను; తవ=నీయొక్క; పాదావేవ=అడుగులనే; ఉపగృహ్య=పట్టుకొని; సంయతా = నియమముగలదాననై; పితుః=తండ్రియొక్క; గృహేయథా=ఇంటియందుంబోలె; వనే = అడవి

యందు; నివత్స్యామి=ఉండెదను.

నేను,నియమంబున , నీపాదంబుల నాశ్రయించి, తండ్రియింటనుండునట్లు సుఖంబుగా , వనంబుననుండెదను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అహం = నేను;సుదుర్గమం;మృగాయుతం=మృగరూపుఁడగు మారీచునితోఁ గూడినది యును;వానరవారణైః= వానరశ్రేష్ఠులగుసుగ్రీవాదులతోఁ; యుతం=కూడినదియునగు;వనం;గమిష్యామి;వనే= అశోకవనమునందు;తవ; పాదౌ ఏవ;ఉపగృహ్య;సంయతా; పితుః; గృహేయథా;నివత్స్యామి.

నేనడవికినీతోఁ గూడవత్తును; అచ్చట మారీచుండనురాక్షసుండు, మృగరూపంబుననుండును;వానివలన, నీకునునాకునువియోగంబుగలుగు; మఱియునవ్వనంబున, వానరశ్రేష్ఠులగు సుగ్రీవాదులుందురు;వారలతోనీకు స్నేహంబుఘటిల్లు;మఱియు నేను,నిన్నువిడిచినపిమ్మట, నశోకవనంబుఁజేరి, యచ్చట, దండ్రియింట నేనుండినప్పుడుంబోలె, నిన్నువిడిచి,యొంటిగా, నీపాదంబులుస్మరించుచుందును.అని,సీత,భావికథను,సూచించినది.

అనన్యభావా మనురక్తచేతసం
త్వయా వియుక్తాం మరణాయ నిశ్చితామ్
నయస్వ మాం సాధు కురుష్వ యాచనాం
న తే మయాతో గురుతా భవిష్యతి. ౨౨

టీక॥ అనన్యభావాం = ఇతరుని యందుమనసుగలదికానిదానను ; అనురక్తచేతసం=నీయందనురాగముగలమనసుగలదానను, కావుననె; త్వయా= నీచేత; వియుక్తాం= విడువబడినదానను, అగుదునేని; మరణాయ=చచ్చుటకొఱకు ; నిశ్చితాం=నిశ్చయించుకొన్నదాననగు;మాం=నన్ను;నయస్వ=కొనిపొమ్ము. యాచనాం = ప్రార్థనను;సాధు=చక్కఁగా; కురుష్వ=చేయుము.అతః=దీనివలన; మయా=నాచేత; తే=నీకు; గురుతా=భారము ; నభవిష్యతి=కాదు.

నిన్నుఁదక్కమఱియెవ్వనింగన్నెత్తిచూడనిదానను,నీయందనురాగంబుగలదానను, నీవువిడిచిపోవుదువేనిమరణం

ము! నిన్నువిడిచి, స్వర్గంబులో, నుండుటయయినను, నాకిష్టముకాదు.

అని, తాత్పర్యము.

స్వర్గేపిచ వినా వాసో భవితా యది రాఘవ
త్వయా మమ నరవ్యాఘ్ర నాహం తమపి రోచయే. ౨౦

టీక॥ నరవ్యాఘ్ర=మనుష్యశ్రేష్ఠుండవగు; రాఘవ=రాముఁడా! మమ=నాకు; త్వయావినా=నిన్నువిడిచి; స్వర్గేపిచ=స్వర్గమునందైనను; వాసః=ఉనికి; భవితాయది=కాఁగలదేని; అహం=నేను; తమపి=దానింగూడ; నరోచయే=సమ్మతింపను.

పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! నాకుస్వర్గంబున వాసంబుసిద్ధించినను, నీవులేకున్నచో, నేనుదానింగూడ నెంతమాత్రముసమ్మతింపను.

అని, తాత్పర్యము.

అహం గమిష్యామి వనం సుదుర్గమం
మృగాయుతం వానరవారణైర్యుతమ్

టీక॥ అహం=నేను; సుదుర్గమం=ఎంతమాత్రము చొరరానిదియును; మృగాయుతం=మృగములతోఁగూడినదియును; వానరవారణైః=కోఁతులతోను ఏనుంగులతోను; యుతం=కూడినదియునగు; వనం=అడవిని; గమిష్యామి=పొందెదను.

నేను, అడవిలోఁ జొరరానిది కానున్నను, అందుఁగోఁతులు నేనుఁగులు నున్నగుమృగంబులున్నను, నేను, దప్పక, నీతోఁగూడ, నడవికి, వచ్చెదను.

అని, తాత్పర్యము.

వనే నివత్స్యామి యథా పితుర్గృహే
తవైవ పాదా వుపగృహ్య సంయతా. ౨౧

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను; తవ=నీయొక్క; పాదావేవ=అడుగులనే; ఉపగృహ్య=పట్టుకొని; సంయతా=నియమముగలదాననై; పితుః=తండ్రియొక్క; గృహేయథా=ఇంటియందుంబోలె; వనే=అడవి

యందు; నివత్స్యామి=ఉండెదను.

నేను,నియమంబున, నీపాదంబుల నాశ్రయించి, తండ్రియింటనుండునట్లు సుఖంబుగా, వనంబుననుండెదను.

అని, తాత్పర్యము.

రహస్యార్థము.— అహం = నేను;సుదుర్గమం;మృగాయుతం=మృగరూపుఁడగు మారీచునితోఁ గూడినది యును;వానరైవారణైః= వానరశ్రేష్ఠు లగుసుగ్రీవాదులతో; యుతం=కూడిన దియునగు;వనం;గమిష్యామి;వనే= అశోకవనమునందు;తత; పాదౌ వేవ;ఉప గృహ్య;సంయతా; పితుః; గృహే;యథా;నివత్స్యామి.

నేనడవికినీతోఁ గూడవత్తును; అచ్చట మారీచుండను రాక్షసుండు, మృగరూపంబుననుండును;వానివలన, నీకునునా కునువియోగంబుగలుగు; మఱియునవ్వనంబున, వానరశ్రేష్ఠులగు సుగ్రీవాదు లుందురు;వారలతో నీకు స్నేహంబుఘటిల్లు;మఱియు నేను,నిన్నువిడిచినపిమ్మట, నశోకవనంబుఁజేరి, యచ్చట, తండ్రి యింట నేనుంటినప్పుడుంబోలె, నిన్నువిడిచి,యొంటిగా, నీ పాదంబులుస్మరించు చుందును.అని,సీత,భావికథను,సూచించినది.

అనన్యభావా మనురక్తచేతసం
త్వయా వియుక్తాం మరణాయ నిశ్చితామ్
నయస్వ మాం సాధు కురుష్వ యాచనాం
న తే మయాతో గురుతా భవిష్యతి. ౨౨

టీక॥ అనన్యభావాం = ఇతరునియందుమనసుగలదికానిదానను ; అనురక్తచేతసం=నీయందనురాగముగలమనముగలదానను, కావుననె; త్వయా= నీచేత; వియుక్తాం= విడువబడినదానను, అగుదునేని; మరణాయ=చచ్చుటకొఱకు ; నిశ్చితాం=నిశ్చయించుకొన్నదాననగు;మాం=నన్ను;నయస్వ= కొనిపొమ్ము. యాచనాం = ప్రార్థనను;సాధు=చక్కఁగా; కురుష్వ=చేయుము.అతః=దీనివలన; మయా=నాచేత; తే=నీకు; గురుతా=భారము ; నభవిష్యతి=కాదు.

నిన్నుఁదక్కమఱియెవ్వనిం గన్నెత్తి చూడనిదానను,నీయందనురాగంబుగల దానను, నీవువిడిచిపోవుదు వేనిమరణం

బునొందు నిశ్చయించిన దానను; అట్టిన న్నునీతోఁగూడ వనంబునకుఁదీసికొనిపొమ్ము; నాప్రార్థనననంగీకరింపుము; నన్నుఁగొనిపోవుటవలన, నాచే నీకేమియుఁగష్టము రాదు. అని, తాత్పర్యము.

రహస్యార్థము.— నిన్నుఁదక్క మఱియెవ్వనింగన్నెత్తి చూడని దానను నీయందు మిక్కిలియునను రాగంబుగల దాననగు నేను, నీచేవిడువఁబడి, యశోక వనంబులోఁజిక్కి, యచటనోనికొనియు యినంద్రాణంబువిడువంబోవుచునంతలో నీవు, హనుమంతుని నాయొద్దకుంబంపి, నాజాడఁదెలిసికొని, నన్నుంగొని తెచ్చుకొమ్ము; అట్లు, దేవతలు రావణుఁజంపుమని ప్రార్థింపుచున్నారే! వారిప్రార్థనననంగీకరింపుము; ఇట్లుచేయుట, నీకెంతమాత్రము! అని, సీతాదేవి, రామునితోఁజెప్పినది. అని, తాత్పర్యము.

తథా బ్రువాణా మపి ధర్మవత్సలో
నచ స్మ సీతాం నృవరో నినీషతి
ఉవాచ చైనాం బహు సన్నివర్తనే
వనే నివాసస్యచ దుఃఖితాం ప్రతి. ౬౩

టీక॥ధర్మవత్సలః=ధర్మమునందు తిప్రీతిగలు; నృవరః=మనుష్యశ్రేష్ఠుండగు రాముండు; తథా=అట్లు; బ్రువాణామపి=చెప్పుచున్నదైనను; సీతాం=సీతను; ననినీషతిచస్మ=తోడ్కొనిపోవనిచ్ఛింపనేలేదు. సన్నివర్తనే=మఱలించుటనిమిత్తమయి; వనే=అడవియందు; నివాసస్య=ఉనికియొక్క; దుఃఖితాం ప్రతిర=దుఃఖముగల్గుటనుగూర్చియె; ఏనాం=ఈసీతనుగూర్చి; బహు=అధికముగా; ఉవాచచ=చెప్పెను.

ధర్మమునందుఁ బ్రీతిగలశ్రురుషోత్తముండగు రాముండు, సీతాదేవియిట్లు ప్రార్థింపుచున్నను, ఆమెను వనంబునకుఁ దోడ్కొనిపోవ నొప్పకుండెను; ఆమెను మఱలించుటనిమిత్తము, వనవాసంబునంగల్గుదుఃఖంబులంగూర్చి, యధికముగా, నామెకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే; ఆదికావ్యే, అయోధ్యాకాండే; సప్తవింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండసప్తవింశసర్గటీక, ముగిసినది.



శ్రీ

అ ష్టా విం శ స ర్గ ప్రా రం భః.

స ఏవం బ్రువతీం సీతాం ధర్మజ్ఞో ధర్మవత్సలః
న నేతుం కురుతే బుద్ధిం వనే దుఃఖాని చింతయన్. ౧

టీక॥ ధర్మజ్ఞః= ధర్మము నెఱింగినవాఁడును; ధర్మవత్సలః = ధర్మమునందత్యప్రీతిగలవాఁడునగు; సః = ఆ రాముఁడు; వనే=అడవియందలి; దుఃఖాని=కష్టములను; చింతయన్ = తలంచుచు; ఏవం=ఇట్లు; బ్రువతీం= చెప్పుచున్న; సీతాం=సీతను; నేతుం = కొనిపోవుటకు; బుద్ధిం=తలంపును; నకురుతే (భూతార్థమందులట్) = చేయఁడయ్యె.

సీతయిట్లుచెప్పుచున్నను, ధర్మంబునెఱింగినవాఁడును ధార్మికుండును నగు రాముండు, వనంబునందుఁగలుగుకష్టంబులందలంచుకొని, యాబిడందనతోఁ గూడనరణ్యంబునకుఁగొనిపోవుటకు, ఎంతమాత్రమంగీకరింపఁడయ్యె,

అని, తాత్పర్యము.

సాంత్వయిత్వా పునస్తాం తు బాష్పదూషితలోచనామ్
నివర్తనార్థే ధర్మాత్మా వాక్యమేత దువాచ హ. ౨

టీక॥ ధర్మాత్మా=ధర్మస్వభావుండగు రాముండు; బాష్పదూషితలోచనాం=కన్నీటిచేఁగలఁకఁబాఱినకండ్లుగల; తాం=ఆసీతను; సాంత్వయిత్వా=ఊరడించియు; పునః=మఱల; నివర్తనార్థే = నిలుపుటయనుప్రయోజనమునిమిత్తమయి; ఏతత్=ఈ; వాక్యం=మాటను; ఉవాచ = చెప్పెను.

"హ" అనునది పాదపూరణార్థము.

ధర్మాత్ముండగు రాముండు, కన్నీళ్లనిండి కలంకంబారిన కండ్లతోనున్న సీతాదేవినూఱడించి, యాబిడనచ్చట నెనిలుపునిమిత్తమయి, మఱలనిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సీతే మహాకులీనాసి ధర్మేచ నిరతా సదా
ఇహాచర స్వధర్మం త్వం మా యథా మనసస్సుఖమ్. ౩

టీక॥ సీతే=సీతా! త్వం=నీవు; మహాకులీనా = పూజ్యమయినకులమునందుబుట్టినదానవును; సదా = ఎల్లప్పుడును; ధర్మే= ధర్మమునందు; నిరతాచ=ఆసక్తిగలదానవును; అసి= అగుచున్నావు; ఇహ=ఇచ్చటనే; స్వధర్మం=నీదైనధర్మమును; యథా= ఎట్లు; మనసః=మనసునకు; సుఖం= సౌఖ్యము; భవతి (అధ్యాహృతము)= కలుగునో; తథా (అధ్యాహృతము)= అట్లు; మాం=నన్నుద్దేశించి; ఆచర = చేయుము.

సీతా! నీవు, పూజ్యమగు వంశమునం బుట్టినదానవు, మఱియు నెల్లప్పుడు ధర్మమునందు మిక్కిలియాసక్తి గలదానవు; నీవిచ్చటనెయుండి నీమనసునకుసుఖంబు గల్గునట్లుగా, నన్నుద్దేశించి, నీవు చేయవలసిన ధర్మము నాచరించుచుండుము. అని, తాత్పర్యము.

టీక; పూర్వార్థము సమానము. ఇహ=ఇచ్చట; స్వధర్మం=నీదైనధర్మమునే ఆచర=చేయుము. యథా=ఎట్లు; మనసః=మనసునకు; సుఖం=సౌఖ్యము; భవతి=కలుగునో; తథా=అట్లు; మాం (ఆచర)=చేయుము.

నీవు గొప్పకులంబున బుట్టినదానవు, ధర్మమునందాసక్తిగలదానవు, ఇచ్చటనుండి ధర్మమును యాచరింపుచుండుము; నామనసున కిష్టమయినట్లు మాంగూర్చి సేయుము.

అని, తాత్పర్యము.

సీతే యథా త్వాం వక్ష్యామి తథా కార్యం త్వయాऽబలే

టీక॥ అబలే=స్త్రీవగు; సీతే= సీతా! యథా=ఎట్లు; త్వాం=నిన్నుగూర్చి వక్ష్యామి=చెప్పుదునో; తథా= అట్లు; త్వయా=నీచేత; కార్యం=చే

యుదగినది.

అబలవగుసీతా! నేనునీకెట్లుచెప్పు దున్నానో,నీవట్లు సేయవలయును, గానిస్వతంత్రింపఁగూడదు.

అని, తాత్పర్యము.

వనేహి దోషా బహవో వదతస్తాన్నిబోధమే. ౪

టీక॥ వనే=అడవియందు ; బహవః=పెక్కులయిన; దోషాః = దోషములు; సంతి (అధ్యాహృతము) హి=ఉన్నవిగదా! వదతః = చెప్పుచున్న; మే=(పంచమ్యర్థమందుషష్ఠి) నావలన; తాన్=ఆదోషములను; నిబోధ= తెలిసికొనుము.

అడవియందుఁ బెక్కుకష్టములున్నవి; నేనునీకువానిం జెప్పెదను; వినుము.

అని, తాత్పర్యము.

సీతే విముచ్యతా మేషా వనవాసకృతా మతిః.

టీక॥ సీతే=సీతా! ఏషా=ఈ; వనవాసకృతా= అడవినుండుటయందుఁ జేయఁబడిన; మతిః = తలంపు ; విముచ్యతాం= విడువఁబడుఁగాక.

సీతా ! అడవిలోవాసంబు సేయవలయుననితలంపు విడువుము.

అని, తాత్పర్యము.

బహుదోషం హి కాంతారం వన మిత్యభిధీయతే. ౫

టీ॥ "కాంతారం=ఘోరరాని; వనం=అడవి; బహుదోషం=పెక్కుకష్టములుగలది;" ఇతి=అని; అభిధీయతేహి=చెప్పఁబడుచున్నదిగదా!

"ప్రవేశించుటకశక్యమయినమహారణ్యంబుననుండువారలకుఁ బెక్కుకష్టము లనుభవింతురు" అని, జనులుచెప్పుచుండగా, వినియున్నావుగదా!

అని, తాత్పర్యము.

హితబుద్ధ్యా ఖలు వచో మయైత దభిధీయతే

టీక॥ మయా=నాచేత; హితబుద్ధ్యాఖలు= మేలుసేయవలెనను బుద్ధిచేతనే

దా! ఏతత్ = ఈ; వచః = మాట; అభిధీయతే = చెప్పఁబడుచున్నది.

నీ మేలుఁగోరియే నేనీమాటం జెప్పుచున్నానుగాని, నిన్నుభరించుట కష్టమని కాదు. అని, తాత్పర్యము.

సదా సుఖం న జానామి దుఃఖమేవ సదా వనమ్. ౬

టీక॥ వనం = అడవి; సదా = ఎల్లప్పుడును; దుఃఖమేవ = దుఃఖముగలిగించునదే. సదా = ఎల్లప్పుడును; సుఖం = సౌఖ్యము; న = లేదు. ఇతి (అధ్యాహృతము) = అని; జానామి = ఎఱుంగుచున్నాను.

అడవిలోనుండుటచే, నెప్పటికిని గష్టమేగల్గును; ఒకప్పుడైనను సుఖముగల్గదు: అని, నేనునిశ్చయించియున్నాను. అని, తాత్పర్యము.

గిరినిర్ఝరసంభూతా గిరికందరవాసినామ్
సింహానాం నినదా దుఃఖాః శ్రోతుం దుఃఖ మతో వనమ్. ౭

టీక॥ గిరినిర్ఝరసంభూతాః = పర్వతంబులయందలి సెలయేఱులయందుఃబుట్టిన; నినదాః = ధ్వనులును; గిరికందరవాసినాం = పర్వతంబులయందలిగుహలందుండునట్టి; సింహానాం = సింహములయొక్క; నినదాశ్చ (అధ్యాహృతము) = ధ్వనులును; శ్రోతుం = వినుటకు; దుఃఖాః = దుఃఖముగలిగించునవి. అతః = ఇందువలన; వనం = అడవి; దుఃఖం = దుఃఖముగలిగించునది.

కొండలయందలి సెలయేఱుల ధ్వనులను గుహలందుండు సింహంబులధ్వనులును, వినుటకెంతో గష్ట, కావున, నడవిలోనుండుట కష్టము. అని, తాత్పర్యము.

క్రీడమానాశ్చ విస్రబ్ధా మత్తా శ్శూన్యే మహామృగాః
దృష్ట్వా సమభివర్తంతే సీతే దుఃఖ మతో వనమ్. ౮

టీక॥ శూన్యే = నిర్జనప్రదేశమునందు; విస్రబ్ధాః = భయములేనివై; క్రీడమానాః = విహరించుచున్నవియు; మత్తాః = క్రొవ్వినవియునగు; మహామృగాశ్చ = గొప్పమృగములును; అస్మాన్ (అధ్యాహృతము) = మనలను; దృష్ట్వా = చూచి; సమభివర్తంతే = ఎదుర్కొనివచ్చును. సీతే = సీతా! అతః = ఇందువలన; వనం =

స ౨౮

అడవి; దుఃఖం=కష్టముగలిగించునది.

సీతా! నిర్జనప్రదేశములందు, భయంబులేక, విచ్చలవిడిగా గ్రీడించుచు మదించియుండు, సింహశార్దూలాది క్రూరజంతువులు, మనలం జూచినంతనే, సంభ్రమంబున, మనలంజంపుటకు, మనయొద్దకువచ్చును; కావున, వనంబులో నుండుటకష్టము. అని, తాత్పర్యము.

సగ్రాహా స్సరిత శ్చైవ పంకవత్యశ్చ దుస్తరాః
మత్తైరపి గజై ర్నిత్య మతో దుఃఖతరం వనమ్. ౯

టీక॥ నిత్యం = ఎల్లప్పుడు; సగ్రాహాః=మొసళ్లతోఁగూడినవియును; పంకవత్యశ్చ=అధికముగాబురదగలవియును; మత్తైః=మదించిన; గజైరపి = ఏనుగులచేతను; దుస్తరాః=దాఁటఁగూడనివియునగు; సరితశ్చైవ=నదులును; సంతి(అధ్యాహృతము) = కలవు. అతః=ఈకారణమువలన; వనం=అడవి; దుఃఖతరం = మిక్కిలియుదుఃఖముగలిగించునవి.

అడవిలోనప్పటప్పట, ఎల్లప్పుడును మొసళ్లుగలిగి విశేషముగా బురదతోఁ గూడి, మత్తగజంబులకైనను దాఁటనలవిగాకుండు, నదులుగలవు; వానిని దాఁటియవ్వలికట్టుచేర, మనకెంపిగాదు; కావున, వనములోనుండుటమహాకష్టము.

అని, తాత్పర్యము.

లతాకంటకసంపూర్ణాః కృకవాకూపనాదితాః
నిరపాశ్చ సుదుర్గాశ్చ మార్గా దుఃఖ మతో వనమ్. ౧౦

టీక॥ మార్గాః = దారులు; లతాకంటకసంపూర్ణాః=తీఁగెలచేతను ముండ్లచేతనునిండినవిగాను; కృకవాకూపనాదితాః= అడవికోళ్లచేతధ్వనింపఁజేయఁబడినవిగాను; నిరపాశ్చ=నీళ్లులేనివిగాను; సుదుర్గాశ్చ= ఎంతమాత్రముచొరనలవిగానివిగాను; సంతి(అధ్యాహృతము)=ఉండును. అతః = ఇందువలన; వనం=అడవి; దుఃఖం = కష్టముగలిగించునది.

అడవిలోనిమార్గంబులు, తీఁగెలతోను ముండ్లతోనునిండి భయంకరంబులగునడవికోళ్లధ్వనులతోఁ గూడినీళ్లుకొంచెమైనను లేక చొరలనలవిగాకుండును; కావున, వనంబులలోనుండుటకష్టము.

అని, తాత్పర్యము.

సుప్యతే పర్ణశయ్యాసు స్వయం భగ్నాసు భూతలే
రాత్రిషు శ్రమఖిన్నేన తస్మా ద్దుఃఖతరం వనమ్. ౧౧

టీక॥ శ్రమఖిన్నేన= అలసటచేదుఃఖముఁబొందినవానిచేతను; భూతలే= నేలయందు; స్వయం=తమకుఁదా మే; భగ్నాసు=రాలిన; పర్ణశయ్యాసు= ఆకులనెడుపాన్పులందు; రాత్రిషు= రాత్రులందును; సుప్యతే= నిద్రపోవ టయగుచున్నది. తస్మాత్= అందువలన; వనం= అడవి; దుఃఖతరం=మిక్కిలియుదుఃఖముఁగలిగించునది.

పగలంతయుఁ బండ్లుగష్టబడిని యలసి, దుఃఖంబున, రాత్రులందు, నేలందమంతటనె రాలిన పర్ణంబులం బఱచుకొని, పరుండి, నిద్రింపవలయును; కావున, నడవిలోనుండుట మహాకష్టము. అని, తాత్పర్యము.

అహోరాత్రంచ సంతోషః కర్తవ్యో నియతాత్మనా
ఫలై ర్వృక్షావపతితైః సీతే దుఃఖ మతో వనమ్. ౧౨

టీక॥ సీతే=సీతా! అహోరాత్రంచ=పవలును రేయును; నియతాత్మనా=నియమంబుతోఁగూడినమనసుగలవానిచేత; వృక్షావపతితైః = చెట్లనుండిపడిన; ఫలైః=పండ్లచేత; సంతోషః=సంతోషము; కర్తవ్యః= చేయఁబడవలసినది. అతః=ఇందువలన; వనం=అడవి; దుఃఖం=దుఃఖము గలిగించునది.

సీతా! రేయుంబవలును, నియమంబునఁ, దమంతనె చెట్లనుండి రాలినపండ్లుతిని, తృప్తిఁబొందియుండవలయును; ఇంకేమియుఁదొరకదు; కావున, నడవిలోనుండుటకష్టము. అని, తాత్పర్యము.

ఉపవాసశ్చ కర్తవ్యో యథాప్రాణేన మైథిలి
జటాభారశ్చ కర్తవ్యో వల్కలాంబరధారిణా. ౧౩

టీక॥ మైథిలి=సీతా! యథాప్రాణేన=యథాశక్తిచేత; ఉపవాసశ్చ=ఉపవాసమును; కర్తవ్యః= చేయఁబడవలసినది. వల్కలాంబరధారిణా= నారచీరలంగట్టుకొనినవానిచేత; జటాభారశ్చ=జటలధారణమును; కర్తవ్యః=

చేయఁబడవలసినది.

సీతా! అడవిలోనికిఁబోయిన పిమ్మట, యథాశక్తినుపవాసంబులు సేయవలయు; ఎఱయి, నారచీరలు గట్టుకొనఁబడలుధరించియుండవలయు.

అని, తాత్పర్యము.

దేవతానాం పితౄణాంచ కర్తవ్యం విధిపూర్వకమ్
ప్రాప్తానా మతిథీనాంచ నిత్యశః ప్రతిపూజనమ్. ౧౪

టీక॥ దేవతానాం— దేవతలకును; పితౄణాంచ— పితరులకును; ప్రాప్తానాం=వచ్చిన; అతిథీనాంచ=అతిథులకును; నిత్యశః=ఎల్లప్పుడును; విధిపూర్వకం=శాస్త్రమునముందుగలుగునట్లుగా, శాస్త్రప్రకారముగా ననుట; ప్రతిపూజనం— పూజ; కర్తవ్యం=చేయఁబడవలసినది.

నిత్యము, దేవతలకును పితరులకును అప్పుడప్పుడువచ్చునతిథులకును,యథావిధిగఁబూజసేయుచుండవలయు.

అని, తాత్పర్యము.

కార్య స్త్రి రభిషేకశ్చ కాలేకాలేచ నిత్యశః
చరతా నియమేనైవ తస్మా ద్దుఃఖతరం వనమ్. ౧౫

టీక॥ నియమేనైవ —నియమముచేతనే; చరతా=ఆచరించువానిచేత; నిత్యశః=ప్రతిదినమునందును; కాలేకాలే— ఆయాకాలమునందు; త్రిః= మూఁడుమాఱులు ; అభిషేకశ్చ — స్నానమును; కార్యః—చేయఁదగినది.తస్మాత్— అందువలన; వనం= అడవి ; దుఃఖతరం=మిక్కిలిదుఃఖముగలిగించునది.

ఎల్లప్పుడునియమంబవలంబించియుండవలయు ; మఱియుఁబ్రతిదినమునందును , ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములందు , మూఁడుమాఱులు,స్నానముసేయుచుండవలయు; కావున, నడవిలోనుండుటమహాకష్టము.

అని, తాత్పర్యము.

ఉపహారశ్చ కర్తవ్యః కుసుమైః స్వయ మాహృతైః
ఆర్షేణ విధినా వేద్యాం బాలే దుఃఖ మతో వనమ్. ౧౬

టీక॥ స్వయం=తనచేతనె. ఆహృతైః=తేఁబడిన; కుసుమైః=పూలచేత; వేద్యాం=అగ్నివేదికయందు ; ఆర్షేణ=ఋషులకుఁదగిన; విధినా=విధానముచేత; ఉపహారశ్చ=పూజయును;కర్తవ్యః=చేయఁబడవలసినది. బాలే=చిన్నదానవగుసీతా ! అతః=ఇందువలన; వనం = అడవి ; దుఃఖం=దుఃఖముగలిగించునది.

వానప్రస్థులగు ఋషులుసేయువిధంబున, దానిగోసితెచ్చిన పూలచేత, నగ్నివేదికిఁ, బ్రతిదినమును , బూజసేయుచుండవలయు; నీవుచిన్నదానవు , కావున , నట్టికష్టకార్యంబులుసేయఁజాలవు, కావున , వనంబులోనుంపుట,కష్టము. అని,తాత్పర్యము.

యథాలబ్ధేన సంతోషః కర్తవ్య స్తేన మైథిలి
యతాహారై ర్వనచరై ర్నిత్యం దుఃఖ మతో వనమ్.౧౭

టీక॥ మైథిలి = సీతా! యతాహారైః= నియతమయినయాహారముగల; వనచరైః=వనంబునం దిరుగవారిలచేత;నిత్యం=ఎల్లప్పుడును;యథాలబ్ధేన=ఎంతదొరకినదో అంత; తేన=ఆఫలాదిపదార్థముచేత;సంతోషః= తృప్తి;కర్తవ్యః=చేయఁబడవలసినది. అతః=ఇందువలన;వనం=అడవి; దుఃఖం=దుఃఖముగలిగించునది.

సీతా! వనంబునందువారలు, ఆహారమునియతముగాఁ గొనిరా, యెల్లప్పుడును, దొరకినపండ్లు మొదలగునవి యెంతదొరకునో, అంతమాత్రముచేతనె, తృప్తిఁబొందుచుండవలయును; కావున,వనంబులోనుండుట,కష్టము.

అని, తాత్పర్యము.

అతీవ వాతా స్తిమిరం బుభుక్షా చాత్ర నిత్యశః
భయానిచ మహాంత్యత్ర తతో దుఃఖతరం వనమ్. ౧౮

టీక॥ అత్ర=ఈవనమునందు; నిత్యశః=ఎల్లప్పుడును; వాతాః = వాయువులును; తిమిరం= చీఁకటియును ; బుభుక్షాచ=తిననిచ్ఛయు , ఆఁకలియును; అతీవ=అధికములు. అత్ర= ఈవనమునందు; భయానిచ=భయంబులును; మహాంతి=అధికములు.తతః= అందువలన; వనం=అడవి; దుఃఖతరం =

మిక్కిలియు దుఃఖము కలిగించునది.

వనమునందు, ఎప్పుడును, గాలియె క్కువగావీచుచుండును; రాత్రులందుఁజీకటియధికముగానుండును ; ఎల్లప్పుడు ను, ఆఁకలియధికముగాఁ గలిగి యుం డును; మఱియు, గొప్పభయంబులును గలుగును; కావున,వనంబులో నుండు ట, మహాకష్టము.అని, తాత్పర్యము.

సరీసృపాశ్చ బహవో బహురూపాశ్చ భామిని
చరంతి పృథివీం దర్పా త్తతో దుఃఖతరం వనమ్. ౧౯

టీక॥భామిని=స్త్రీవగు సీతా!బహవః= పెక్కులగునవియును; బహురూపాశ్చ = అధికమయినయాకారముగలవి యునగు;సరీసృపాశ్చ;సర్పములును;ద ర్పాత్=గర్వమువలన;పృథివీం= భూమిని;చరంతి=పొందుచుండును. తతః= అందువలన;వనం=అడవి;దుఃఖతరం= మిక్కిలియు దుఃఖము కలిగించునది.

మిక్కిలియుఁ బెద్దవైనకొండపాము ల నేకంబులు,గర్వంబున, నేలపైఁ, దిరుగు చుండును; నీవు స్త్రీవి, కావున , వానిం జూడఁగానే భయంబు నొందుదువు ; అందువలన, వనంబులోనుండుటమహా కష్టము. అని, తాత్పర్యము.

నదీనిలయనా స్సర్పా నదీకుటిలగామినః
తిష్ఠం త్యావృత్య పంథానం తతో దుఃఖ తరం వనమ్. ౨౦

టీక॥ నదీనిలయనాః = నదులయందు నికిపట్టుగాఁ గలవియును; నదీకుటిలగా మినః=నదులుంబోలెఁగుటిలంబుగా న డుచునవియునగు;సర్పాః= పాములు; పంథానం=మార్గమును; ఆవృత్య= అడ్డగించి; తిష్ఠంతి= ఉండును.తతః = అందువలన; వనం = అడవి; దుఃఖత రం = మిక్కిలియు దుఃఖము కలిగిం చునది.

నదులుంబోలెఁగుటిలంబుగాఁబోవున వియు నదులయందుండునవియునగు మ హాసర్పంబులు, దారికడ్డముగాఁ బరుం డియుండును; కావున,వనంబులో నుం డుట, మహాకష్టము. అని, తాత్పర్యము.

పతంగా వృశ్చికాః కీటా దంశాశ్చ మశకై స్సహ

బాధంతే నిత్య మబలే సర్వం దుఃఖ మతో వనమ్. ౨౧

టీక॥అబలే=స్త్రీవగుసీతా! పతంగాః=మిడుతలును;వృశ్చికాః = తేళ్లును; కీటాః=పురుగులును; దంశాశ్చ = అడవియీఁగెలును; మశకైస్సహ=దోమలతోఁగూడ ; నిత్యం=ఎల్లప్పుడును ; భాధంతే=బాధించుచుండును. అతః= ఇందువలన ; వనం=అడవి; సర్వం = అంతయును; దుఃఖం= దుఃఖముగలిగించునది.

మిడుతలును తేళ్లును పురుగులు నడవియీఁగెలును దోమలును,ఎల్లప్పుడు,బాధించుచుండును; నీవుస్త్రీవి కావున, ఈ కష్టమునోర్వఁజాలియుండలేవు ; అందువలన, వనంబులోనుండుట మహాకష్టము. అని, తాత్పర్యము.

ద్రుమాః కంటకిన శ్చైవ కుశకాశాశ్చ భామిని
వనే వ్యాకులశాఖాగ్రా స్తేన దుఃఖతరం వనమ్. ౨౨

టీక॥ భామిని=స్త్రీవగుసీతా ! వనే=అడవియందు ; ద్రుమాః = వృక్షములును; కుశకాశాశ్చ = దర్భలును తెల్లును. కంటకినశ్చైవ = ముండ్లుగలవిగాను;వ్యాకులశాఖాగ్రాః= ఒకటితోనొకటియొరసుకొనియున్నకొమ్మలు నుకొనలునుగలవిగాను;సంతి (అధ్యాహృతము)=ఉన్నవి. తేన=అందుచేత; వనం=అడవి;దుఃఖతరం=మిక్కిలియు దుఃఖముగలిగించునది.

అడవియందుఁజెట్ల కొమ్మలుదట్టముగానొకటితోనొకటియొరసుకొని , యుండును ; దర్భలునుతెల్లునుదట్టముగా మొలిచియుండును;కావున,నడుచుటకుగొంచెమయినను దారియె యుండదు; అందువలన , వనంబులోనుండుట మహాకష్టము. అని, తాత్పర్యము.

కాయక్లేశాశ్చ బహవో భయాని వివిధానిచ
అరణ్యవాసే వసతో దుఃఖ మేవ తతో వనమ్. ౨౩

టీక॥అరణ్యవాసే= వనమునునివాసస్థానమునందు;వసతః=ఉండువానికి;బహవః=అనేకములయిన; కాయక్లేశాశ్చ=దేహకష్టములును;వివిధాని = నా

నానావిధములయిన; భయాని=భయము లను; సంతి(అధ్యాహృతము)=కలవు. తతః=అందువలన; వనం=అడవి; దుఃఖ మేవ=దుఃఖము కలిగించునదే.

మఱియు, నరణ్యంబులో నుండువారి లకు గృహకష్టంబుల నేకంబులను, నానావిధభయంబులను, గలవు; కావున, వనంబులో నుండుట చాలఁ గష్టమే.

అని, తాత్పర్యము.

క్రోధలోభౌ విమోక్తవ్యౌ కర్తవ్యా తపసే మతిః
న భేతవ్యం చ భేతవ్యే నిత్యం దుఃఖ మతో వనమ్. ౨౪

టీక॥ క్రోధలోభౌ=కోపంబును లోభ యును; విమోక్తవ్యౌ=విడువఁబడవలసి నవి. తపసే=తపస్సుకొఱకు; మతిః=తలంపు; కర్తవ్యా=చేయఁబడవలసినది. భేతవ్యే చ=భయపడవలసినదానియందును; న భేతవ్యం=భయపడుటకారాదు. అతః=ఇందువలన; వనం=అడవి; నిత్యం=ఎల్లప్పుడును; దుఃఖం=దుఃఖము కలిగించునది.

కోపంబును లోభంబును విడువవలయు; తపస్సునందు బుద్ధియుంచవలయు; భయము గల్గించు సింహాదులఁ గాంచినను, భయపడఁగూడదు; కావున, వనంబులో నుండుట, యెప్పటికిఁ గష్టము.

అని, తాత్పర్యము.

తదలం తే వనం గత్వా క్షమం నహి వనం తవ

టీక॥ తత్=అందువలన; తే=నీకు; వనం=అడవినిగూర్చి; గత్వా=పోయి; అలం=చాలును. తవ=నీకు; వనం=అడవి; క్షమం=తగినది; నహి=కాదుగదా!

అట్లగుటంజేసి, నీవు, వనంబునకు రావలయునను కోరికను విడువుము; నీవడవిలో నుండఁదగినదానవు కావు.

అని, తాత్పర్యము.

విమృశన్నిహ పశ్యామి బహుదోషతరం వనమ్. ౨౫

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; ఇహ=ఇచ్చట; విమృశన్=ఆలోచించుచు; వనం=అడవిని; బహుదోషతరం=మిక్కిలియనధికముగాఁ గష్టముగ

లదానీంగాం; పశ్యామి = చూచుచున్నాను, ఎఱుఁగుచున్నాననుట.

నేనిచ్చటఁ జక్కఁగానాలోచింపఁగా, నాకు, వనంబులోనుండుట, మిక్కిలియుఁగష్టమనియేతోఁచుచున్నది. అని, రాముఁడు సీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

వనం తు నేతుం న కృతా మతి స్తదా
బభూవ రామేణ యదా మహాత్మనా
న తస్య సీతా వచనం చకార త
త్తతో బ్రవీ ద్రామ మిదం సుదుఃఖితా. ౨౬

టీక॥ యదా = ఎప్పుడు; మహాత్మనా=పూజ్యమయినస్వభావముగల; రామేణ=రామునిచేత; వనం=అడవినిగూర్చి; నేతుంతు = తోడ్కొనిపోవుటకు మాత్రము; మతిః=తలంపు; కృతా=చేయఁబడినది; నబభూవ = కాలేదో; తదా=అప్పుడు; సీతా = సీతాదేవి; తస్య=ఆరామునియొక్క; తత్=ఆ; వచనం=మాటను; నచకార=చేయలేదు, అంగీకరింపలేదనుట. తతః=అటుపిమ్మటః; సుదుఃఖితా= మిక్కిలియుదుఃఖము పొందినదై; రామం=రామునిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్ = చెప్పెను.

ఇట్లు, మహాత్ముఁడగు రాముఁడు, సీతనువనంబునకుందోడ్కొనిపోవుటకుసమ్మతింపకుండఁగా, సీతయాతని మాట నంగీకరింపక, పరమదుఃఖితయయి, యారామునింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, అష్టావింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టావింశసర్గటీక,
ముగిసినది.

---

(౩౨)

ఏకోనత్రింశసర్గప్రారంభః.

ఏతత్తు వచనం శ్రుత్వా సీతా రామస్య దుఃఖితా
ప్రసక్తాశ్రుముఖీ మంద మిదం వచనమ బ్రవీత్. ౧

టీక॥ సీతా=సీత; రామస్య=రామునియొక్క; ఏతత్=ఈ; వచనం=మాటను; శ్రుత్వా=విని నంతనే; దుఃఖితా=దుఃఖమునొందినదై; ప్రసక్తాశ్రుముఖీ=అంటుకొన్నకన్నీళ్లుగల ముఖము గలదై; మందం=తిన్నగా; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

సీతాదేవి, రాముడు చెప్పినమాటను విని, పరమదుఃఖమునొంది, కన్నులనీళ్లునించుచు రామునిజూచి, తిన్నగా, ఇట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యే త్వయా కీర్తితా దోషా వనే వస్తవ్యతాం ప్రతి
గుణా నిత్యేవ తాన్విద్ధి తవ స్నేహపురస్కృతాన్. ౨

టీక॥ యే=ఏ; దోషాః=దోషములు; త్వయా=నీచేత; వనే=అడవియందు; వస్తవ్యతాం ప్రతి=ఉండుటనుగూర్చి; కీర్తితాః=చెప్పబడినవో; తవ=నీయొక్క; స్నేహపురస్కృతాన్=అనురాగముచే ముందిడు కొనబడిన; తాన్=ఆదోషములను; గుణానిత్యేవ=గుణంబులనగానే; విద్ధి=ఎఱుంగుము.

నీవిప్పుడు వనవాసంబు సేయుటయందు ఏదోషంబులున్నవని చెప్పితివో, అవన్నియు, దోషములుగావు; నీవు తోడున్నావు, కావున, నవన్నియు నాకు గుణంబులే, యని యెఱుంగుము. అని, తాత్పర్యము.

మృగా స్సింహా గజా శ్చైవ శార్దూలా శ్శరభా స్తథా
పక్షిణ స్సృమరా శ్చైవ యే చాన్యే వనచారిణః. ౩
అదృష్టపూర్వరూపత్వాత్సర్వే తే తవ రాఘవ
రూపం దృష్ట్వాపసర్పేయు ర్భయే సర్వేహి బిభ్యతి. ౪

టీక॥ రాఘవ= రాముఁడా! మృగాః=జింకలును; సింహాః= సింహములును; గజాశ్చైవ=ఏనుఁగులును; శార్దూలాః=పెద్దపులులును; తథా= అట్లు; శరభాః = ఎనిమిదికాళ్లమృగములును; సృమరాశ్చైవ= పెద్దచమరమృగములును; పక్షిణః= పక్షులును; అన్యే=ఇతరములయిన; వనచారిణః= అడవియందుఁదిరుగునట్టి మృగంబులు; యే (సంతి)=ఏవిగలవో; తేచ=అవియు; సర్వే=అన్నియును ; అదృష్టపూర్వరూపత్వాత్ = ముందుచూడఁబడనిరూపమగుటచే; తవ= నీయొక్క; రూపం=రూపమును; దృష్ట్వా= చూచి; అపసర్పేయుః= తొలఁగిపోవును. సర్వే=అందఱును; భయే= భయముగలుగఁగా ; బిభ్యతిహి — భయపడుదురుగదా!

రాముఁడా! జింకలును, సింహంబులును, ఏనుఁగులును, పెద్దపులులును, శరభంబులును, పెద్దచమరంబులును, పక్షులు, మఱియునరణ్యంబులో నుండు నితరమృగంబులన్నియు , నీరూపము వంటియమానుషరూపంబును , ఇదివఱకెప్పుడునుజూచియుండవు , కావున, నీరూపమునుజూడఁగానే, భయంబునసవ్వలికిం బాఱిపోఁగలవు; భయంబుగల్గునప్పుడు, అందఱును భయముపడుదురుగదా! కావున, నాక్రూరజంతువులవలన, నాకేమియుభయంబుగలుగదు. అని, తాత్పర్యము.

త్వయాచ సహ గంతవ్యం మయా గురుజనాజ్ఞయా

టీక॥ గురుజనాజ్ఞయా = నీతండ్రియయినదశరథునియాజ్ఞచే; మయా= నాచేత; త్వయా సహ= నీతోఁగూడ, గంతవ్యంచ=పోవుట కావలసినదియు. ఇదిగాక , నిన్నువనంబునకుఁ బొమ్మనియాజ్ఞాపించుటచే నన్నునాజ్ఞాపించినట్లగుచున్నది, కావున, దశరథునియాజ్ఞాప్రకారము, నేనవశ్యము నీతోఁగూడవనంబునకు రావలసినదాన నగుచున్నాను. అని, తాత్పర్యము.

త్వద్వియోగేన మే రామ త్యక్తవ్య మిహ జీవితమ్. ౫

టీక॥ రామ=రాముఁడా! త్వద్వియోగేన=నీవిరహముచేత; మే=నాకు ; ఇహ=ఇచ్చట; జీవితం=ప్రాణము; త్యక్తవ్యం=విడువఁబడవలసినది.

రాముఁడా! నీవు నన్నిచ్చట నె విడిచి యరణ్యంబునకుఁ బోదువేని, నేనవశ్యముఁ బ్రాణములు విడువవలసినది, ఇదినా ధర్మము. అని, తాత్పర్యము.

నచ మాం త్వత్సమీపస్థా మపి శక్నోతి రాఘవ
సురాణా మీశ్వర శ్శక్రః ప్రధర్షయితు మోజసా. ౬

టీక॥ రాఘవ = రాముఁడా! త్వత్సమీపస్థాం = నీసమీపంబుననున్న; మాం = నన్ను; సురాణాం = దేవతలకు; ఈశ్వరః = ప్రభుఁడైన; శక్రః = ఇంద్రుఁడైనను; ఓజసా = పరాక్రమముచేత; ప్రధర్షయితుంచ = తిరస్కరించుటకును; నశక్నోతి = చాలఁడు.

రాముఁడా! నేనునీసమీపంబున నుండఁగా, దేవతలకుఁ బ్రభుండైన యింద్రుండైనను, బరాక్రమంబున, నన్నవమానింపఁజాలఁడు. అని, తాత్పర్యము.

పతిహీనాతు యా నారీ న సా శక్ష్యతి జీవితుమ్

టీక॥ యా = ఏ; నారీ = స్త్రీ; పతిహీనా = పెనిమిటచే విడువఁబడినదో; సాతు = ఆస్త్రీమాత్రము; జీవితుం = బ్రతుకుటకు; నశక్ష్యతి = చాలదు.

పెనిమిటిం బాసిన స్త్రీమాత్రము, ఎంతమాత్రము, జీవింపఁజాలదు. అని, తాత్పర్యము.

కామ మేవంవిధం రామ త్వయా మమ విదర్శితమ్. ౭

టీక॥ రామ = రాముఁడా! త్వయా = నీచేత; మమ = నాకు; కామం = మిక్కిలియు; ఏవంవిధం = ఇట్టిసంగతి; విదర్శితం = ఉపదేశింపఁబడినది.

రాముఁడా! నీవును, పెక్కుమాఱులు, నాకీసంగతి నుపదేశించియున్నావు. అని, తాత్పర్యము.

అథచాపి మహాప్రాజ్ఞ బ్రాహ్మణానాం మయా శ్రుతమ్
పురా పితృగృహే సత్యం వస్తవ్యం కిల మే వనే. ౮

టీక॥ మహాప్రాజ్ఞ = మిక్కిలియుఁబడితుండవగు రాముఁడా! అథచాపి =

ఇదిగాక ; పురా = మున్ను ; పితృగృహే = తండ్రియింటియందు; మయా = నాచేత; బ్రాహ్మణానాం — (పంచమ్యర్థమందుషష్ఠి) బ్రాహ్మణులవలన; "మే = నాకు; వనే = అడవియందు; వస్తవ్యం = ఉండుటకావలసినది" ఇతి (అధ్యాహృతము) = అని ; శ్రుతం = వినఁబడినది. సత్యం = సత్యము.

మహాపండితుండవగు రామా! మున్ను నేను నాతండ్రియింటనుండునప్పుడు, "నాకుఁ, గొంతకాలము వనంబున నుండవలసివచ్చును" అని, జ్యోతిశ్శాస్త్రజ్ఞులగు బ్రాహ్మణులు చెప్పఁగా, వినియున్నాను; ఇది, సత్యము.

అని, తాత్పర్యము.

లక్షణిభ్యో ద్విజాతిభ్య శ్శ్రుత్వాహం వచనం పురా
వనవాసకృతోత్సాహా నిత్యమేవ మహాబల. ౯

టీక॥ మహాబల = అధికమయినబలముగల రామా! అహం = నేను; పురా = మున్ను; లక్షణిభ్యః = సాముద్రలక్షణములెఱింగిన; ద్విజాతిభ్యః = బ్రాహ్మణులవలన; వచనం = మాటను, శ్రుత్వా = విని; నిత్యమేవ = ఎల్లప్పుడు నేఁ; వనవాసకృతోత్సాహా = వనంబునందుండుటయందుఁ జేయఁబడినయుత్సాహముగలదాననై; అస్మి (అధ్యాహృతము) = ఉన్నాను.

మహాబలుఁడవగు రామా! నేను మున్ను సాముద్రికలక్షణములు తెలిసిన బ్రాహ్మణులవలన "నాకుఁ గొంతకాలము వనవాసముగల్గును" అనుమాటను విన్నది మొదలు, నా మనంబున, "ఎప్పుడెప్పుడు, వనంబునకుఁ బోవుదును" అని, చాలను త్సాహంబు గల్గియున్నది.

అని, తాత్పర్యము.

ఆదేశో వనవాసస్య ప్రాప్తవ్య స్స మయా కిల

టీక॥ మయా = నాచేత; సః = ఆ; వనవాసస్య = వనవాసముయొక్క; ఆదేశః — చెప్పుట; ప్రాప్తవ్యః కిల — పొందఁబడవలసినదిగదా!

లక్షణవేత్తలగు నా బ్రాహ్మణులు చెప్పినట్లు నేను గొంతకాలము వనంబులో నుండవలసినదాననే కదా.

అని, తాత్పర్యము.

సా త్వయా సహ తత్రాహం యాస్యామి ప్రియ నాన్యథా. ౧౦

టీక॥ప్రియ= పెనిమిటివగు రాముఁడా! సా=అట్టి; అహం=నేను; తత్ర=అవనంబునకు; త్వయాసహ=నీతోఁగూడ నే; యాస్యామి=పోఁగలను. అన్యథా=వేఱువిధముగాఁ న=లేదు.

ప్రియుండవగు రాముఁడా! నేను వనంబునకు నీతోఁగూడ రావలయునుగాని, మఱివేఱెయుపాయము నేను వనంబునకుఁబోవుటకేదియు లేదు.

అని, తాత్పర్యము.

కృతాదేశా భవిష్యామి గమిష్యామి సహ త్వయా

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; కృతాదేశా=చేయఁబడిన బ్రాహ్మణవచనముగలదానను; భవిష్యామి = (అ)య్యెదను. త్వయాసహ=నీతోఁగూడ; గమిష్యామి=పోయెదను, వచ్చెదననుట.

నేనిప్పుడు నీతోఁగూడ వనంబునకువచ్చి, యాబ్రాహ్మణులవచనంబును, సత్యముఁగాఁజేసెదను.

అని, తాత్పర్యము.

కాల శ్చాయం సముత్పన్న స్సత్యవాక్ భవతు ద్విజః. ౧౧

టీక॥అయం=ఈ; కాలశ్చ=వనవాసంబునకుఁ దగినకాలమును; సముత్పన్నః=సంభవించినది. ద్విజః = ఆబ్రాహ్మణజనము; సత్యవాక్ =అబద్ధముగానిమాటగలది; భవతు=అగుఁగాక.

అందుకుఁదగినట్లుగా, వనవాసంబు ఘటిల్లంజేయుకాలమును సంభవించినది; కావున, నేను దప్పక నీతోఁగూడవచ్చెదను; లక్షణవేత్తలగు నాబ్రాహ్మణుల మాటసత్యమగుఁగాక.

అని, తాత్పర్యము.

వనవాసే హి జానామి దుఃఖాని బహుధా కిల

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; వనవాసే= అడవియందుండుట యందు; బహుధా=పెక్కులయిన; దుఃఖాని=దుఃఖములను; జానామికిల= ౨

ఉంగుదునుగదా!

వనంబునందు వాసంబు సేయుట లోఁబెక్కుకష్టంబులుగలుగునని, నాకును తెలిసియున్నది.

అని, తాత్పర్యము.

ప్రాప్స్యంతే నియతం వీర పురుషైః అకృతాత్మభిః. ౧౨

టీక॥ వీర=పరాక్రమశాలివగు రాముఁడా; తాని (అధ్యాహృతము)=అదుఃఖములు; అకృతాత్మభిః=శిక్షింపఁబడనిమనసుగల వారలచేత; నియతం=నిశ్చయముగా; ప్రాప్స్యంతే=పొందఁబడుచున్నవి.

నీవు పరాక్రమవంతుండవు, నీకేమి యునట్టికష్టంబులు గలుగవు; మనోనిగ్రహములేనివారికిమాత్రము, అట్టికష్టంబులు సంభవించును. అని, తాత్పర్యము.

కన్యయా చ పితుర్గేహే వనవాసః శ్రుతో మయా
భిక్షిణ్యాః సాధువృత్తాయాః మమ మాతురిహాగ్రతః. ౧౩

కన్యయా=పెండ్లి కానిదాననగు; మయా చ=నాచేతను; ఇహ=ఈ; పితుః=తండ్రియొక్క; గేహే=ఇంటియందు; మమ=నాయొక్క; మాతుః=తల్లియొక్క; అగ్రతః=ముందట; సాధువృత్తాయాః=మంచియాచారముగల; భిక్షిణ్యాః=తాపసస్త్రీవలన; వనవాసః=అడవిలోనుండుట; భావీతి (అధ్యాహృతము)=కలుగఁగలదని; శ్రుతః=వినఁబడినది.

నాకుఁ బెండ్లి గాకమునుపు, నేను నాతండ్రియింటనుండునప్పుడు, నొకనాఁడు నాతల్లి సమీపంబుననుండఁగా, సదాచారసంపన్నురాలగు నొకతాపసస్త్రీ, నన్నుఁజూచి, నాకుఁ గొంతకాలము వనవాసము సంభవించునట్లు చెప్పఁగా వినియున్నాను. అని, తాత్పర్యము.

ప్రసాదితశ్చ వై పూర్వం త్వం వై బహువిధం ప్రభో

టీక॥ ప్రభో=నాథుండవగు రాముఁడా! త్వం వై=నీవును; పూర్వం=ముందు; బహువిధం=పెక్కువిధములను; ప్రసాదితశ్చ వై=సంతోషింపఁ

వెంబడించుచు; వికల్మషా= పాపము లేనిదానను; భవిష్యామి=అయ్యెదను. మమ=నాయొక్క; దైవతం= దేవుఁడు;భర్తాహి=పెనిమిటియెకదా!

అసూయాదులులేనిరాముఁడా! నేను, స్నేహంబునఁ,బెనిమిటివగు నిన్ననుసరించుచుంటి,నాపాపంబులను నశింపఁజేసికొని, కృతార్థురాల నయ్యెదను; నాకుఁబెనిమిటియే దేవుఁడు;అతనికన్నమతియే దైవమునధికము గాదు.

అని, తాత్పర్యము.

ప్రేత్యభావేపి కల్యాణ స్సంగమో మే సహత్వయా

టీక॥ మే=నాకు; ప్రేత్యభావేపి= పరలోకమునందును ; త్వయాసహ= నీతోఁగూడ ; కల్యాణః= మంగళకరమయిన; సంగమః= కూడిక ; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ఇచ్చటమాత్రమెకాదు ; పరలోకమునందును, నీతోఁగూడ నాకు,ఎడతెగక, సంగమంబుగల్గియుండును.

అని, తాత్పర్యము.

శ్రుతిహి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినామ్. ౧౭

టీక॥యశస్వినాం=అధిక మయిన కీర్తిగల; బ్రాహ్మణానాం = బ్రాహ్మణులయొక్క, బ్రాహ్మణులచేఁజదువఁబడినట్టియనుట;పుణ్యా= పవిత్రమయిన; శ్రుతిః=వేదము; శ్రూయతేహి= వినఁబడుచున్నదిగదా!

కీర్తిమంతులగుబ్రాహ్మణులు చదువుకొనుచుండఁగాఁ, బవిత్రంబగు నీ వేదవాక్యమునువినియున్నాము గదా!

అని, తాత్పర్యము.

ఇహలోకేచ పితృభి ర్యా స్త్రీ యస్య మహామతే
అద్భి ర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేపి తస్య సా. ౧౮

టీక॥ మహామతే=అధికమయిన బుద్ధిగలరాముఁడా!యా=ఏ;స్త్రీ= ఆఁడుది; పితృభిః=తండ్రిమొదలగు వారలచేత; ఇహ=ఈ;లోకేచ=లోకమునందును; యస్య=ఎవ్వనికిఁ స్వధర్మేణ=తమధర్మముచేత; అద్భిః=నీళ్లచేత; దత్తా=ఇయ్యఁబడినదో; సా= ఆస్త్రీ; ప్రేత్యభావేపి=పరలోకమునందును; తస్య= అతనికి; భార్యాభవతి (అధ్యాహృతము)= పెండ్లామగును.

అధికమయినబుద్ధిగలవాఁడవగు రాముఁడా! తండ్రి మొదలగువారలచేసి లోకంబున, నే స్త్రీ యే పురుషునకు, దమవర్ణాదిధర్మంబుననుసరించి, యుదకపూర్వకముగా, నివ్వంబడునో; ఆ స్త్రీకి, పరలోకమునందును, ఆపురుషుఁడే, పెనిమిటిగానుండును. అనునర్థముగలవేదవాక్యమువినియున్నాము.

అని, తాత్పర్యము.

ఏవమస్మాత్స్వకాం నారీం సువృత్తాం హి పతివ్రతామ్
నాభిరోచయసే నేతుం త్వం మాం కేనేహ హేతునా. ౧౯

టీ॥ ఏవం=ఇట్లుండఁగా; త్వం=నీవు; సువృత్తాం — మంచియాచారముగలదానను; ("హి" అనునది పాదపూరణార్థము.) పతివ్రతాం = పెనిమిటియందలివ్రతముగలదానను; స్వకాం=నీదైన; నారీం=భార్యనగు; మాం=నన్ను; ఇహ=ఇప్పుడు; అస్మాత్ — ఈపట్టణమునుండి; నేతుం—తోడ్కొనిపోవుటకు; కేన=ఏ; హేతునా — కారణముచేత; నాభిరోచయసే=సమ్మతింపవు?

ఇట్లు వేదమునందును జెప్పఁబడియుండఁగా, నీవు, సదాచారసంపన్నను, పతివ్రతను, నీభార్యనగునన్ను, ఇప్పుడు, వనంబునకుఁదోడ్కొనిపోవుటకు, సమ్మతింపవేమి? అని, తాత్పర్యము.

భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖదుఃఖయోః
నేతుమర్హసి కాకుత్స్థ సమానసుఖదుఃఖినీమ్. ౨౦

టీ॥ కాకుత్స్థ — రాముఁడా! భక్తాం= నీయందనురాగముగలదానను; పతివ్రతాం—పతివ్రతను; దీనాం = దుఃఖముఁబొందినదానను; సుఖదుఃఖయోః — సుఖమునందును దుఃఖమునందును; సమాం= ఒకవిధముగానుండుదానను; సమానసుఖదుఃఖినీం=నీతోసరిగాసుఖదుఃఖములుగలదాననగు; మాం=నన్ను; నేతుం = తోడ్కొనిపోవుటకు; అర్హసి=తగుదువు.

రాముఁడా! నీయందనురాగముగలదానను, పతివ్రతను, నన్నొకరుఁడవిడిచిపోయెదవోయనిదుఃఖముఁబొందియున్నదానను, సుఖంబుగల్గినను దుఃఖంబునుభవించినను, ఒకటేవిధముగానుండుదానను, నీకుసుఖంబుగల్గునప్పుడు . సుఖంబు

నొందు దానను నీకు దుఃఖంబువచ్చునప్పు మదుఃఖంబునొందు దాననగు, నన్ను, వనంబునకుం దోడ్కొనిపొమ్ము.

అని, తాత్పర్యము.

యది మాం దుఃఖితా మేవం వనం నేతుం న చేచ్ఛసి
విష మగ్నిం జలం వాఽహ మాస్థాస్యే మృత్యుకారణాత్. ౨౧

టీక॥ ఏవం=ఇట్లు ; దుఃఖితాం = దుఃఖమునొందియున్న; మాం=నన్ను; వనం=అడవినిగూర్చి; నేతుం = తోడ్కొనిపోవుటకు ; నేచ్ఛసియదిచ = సమ్మతింపకపోవుదువేనియు; అహం= నేను; మృత్యుకారణాత్ = మరణంబునొందుకారణమువలన; విషం=విషమైనను ; అగ్నిం=నిప్పైనను; జలం వా=నీటినైనను; ఆస్థాస్యే = పొందెదను.

ఇట్లుపరమదుఃఖంబునం బరితపించుచున్ననన్ను వనంబునకుం దోడ్కొనిపోవ సమ్మతింపవేని, నేను, విషముద్రావియయినను , అగ్నిహోత్రములోఁబడియయినను; నీళ్లలోదుముకియయినను, ప్రాణంబులువిడిచెదను. అని, సీత, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవం బహువిధం తం సా యాచతే గమనం ప్రతి
నానుమేనే మహాబాహు స్తాం నేతుం విజనం వనమ్. ౨౨

టీక॥ సా=ఆసీత ; ఏవం=ఇట్లు ; బహువిధం = పెక్కువిధములుగా ; తం=ఆరాముని; గమనంప్రతి=పోవుటనుగూర్చి; యాచతే=(భూతార్థమందులట్) ప్రార్థించినది . మహాబాహుః= పెద్దచేతులుగలరాముండు ; తాం=ఆసీతను; విజనం=జనులులేని ; వనం=అడవినిగూర్చి ; నేతుం = తోడ్కొనిపోవుటకు; నానుమేనె = సమ్మతింపఁడయ్యె.

ఆసీత , యీప్రకారముపెక్కువిధంబులఁ , దన్నడవికిఁ దోడ్కొనిపొమ్మని రామునిం బ్రార్థించినను ; అధికమయిన బాహుబలంబు గలరాముండు "అడవిలో జనులెవ్వరునుండరే, ఈసీతమిక్కిలియు సుకుమారదేహముగలది, అచ్చటదీనినెట్లు కాపాడుదు నను నభిప్రాయంబున, నాసీతను, వనంబునకుంగొనిపోవసమ్మతింపఁడయ్యె.

అని, తాత్పర్యము.

వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండమైకోనత్రింశసర్గటీక, ముగిసినది.

శ్రీ.

త్రింశసర్గప్రారంభః.

సాంత్వ్యమానాతు రామేణ మైథిలీ జనకాత్మజా
వనవాసనిమిత్తాయ భర్తారమిదమబ్రవీత్. ౧

టీక॥ జనకాత్మజా = జనకునికూఁతురయిన; మైథిలీతు = సీతయును; రామేణ = రామునిచేత; సాంత్వ్యమానా = ఊఁటడింపఁబడుచున్నదై; వనవాసనిమిత్తాయ = అడవియందునివసించునిమిత్తమయి; భర్తారం = పెనిమిటినిగూర్చి; ఇదం = ఈమాటను; అబ్రవీత్ = పలికెను.

జనకునికూఁతురయినసీత, యిట్లు రామునిచేనూఁటడింపఁబడి, యెట్లయినను, వనంబులోనుండ రామునియనుమతిం బొందుటకై, పెనిమిటియగు రాముం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సా త ముత్తమసంవిగ్నా సీతా విపులవక్షసమ్
ప్రణయాచ్చాభిమానాచ్చ పరిచిక్షేప రాఘవమ్. ౨

టీక॥ సా = ఆ; సీతా = సీత; ఉత్తమసంవిగ్నా = మిక్కిలియుదుఃఖమునొందినదై; విపులవక్షసం = విశాలమయినఱొమ్ముగల; తం = ఆ; రాఘవం = రాముని; ప్రణయాచ్చ = స్నేహమువలనను; అభిమానాచ్చ = కోపమువలనను; పరిచిక్షేప = తిరస్కరించెను.

ఆసీతాదేవి, యిట్లు, పరమదుఃఖంబునొందియున్నదికావున, విశాలమగు ఱొమ్ము గలిగి శూరుండైన రాముం జూచి, స్నేహంబునమిక్కిలియుఁ గోపంబునొంది, యిట్లని, తిరస్కారముగాఁబలికెను. అని, తాత్పర్యము.

కింత్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః

రామ జామాతరం ప్రాప్య స్త్రీయం పురుషవిగ్రహమ్. ౩

టీక॥ రామ=రాముఁడా! మే=నా యొక్క; పితా=తండ్రియును; మిథిలాధిపః= మిథిలకుఁబ్రభువునగు; వైదేహః= జనకమహారాజు; త్వాం = నిన్ను; ప్రాప్య — పొంది, తెలిసికొనియునుట; స్త్రీయం= స్త్రీస్వభావంబుగలవాఁడవును; పురుషవిగ్రహం= పురుషరూపమయిన వేషముగలవాఁడవునగు; జామాతరం= అల్లునిఁగా; అమన్యతకిం — తలంచునే మో! అవశ్యముతలంచును.

విశేషార్థము.— రామ= పరమ సౌందర్యంబుగలవాఁడా! సౌందర్యమాత్రంబున నందఱను భ్రమింపఁజేయు వాఁడా! మే, పితా, మిథిలాధిపః=మిథిలకుఁబ్రభువైన, శూరుండగుననుట; వైదేహః= "కర్మణైవహిసంసిద్ధిమాస్థితా జనకాదయః" (జనకుండమున్నగువారలు, కర్మముచేత నిజ్ఞానసిద్ధిం బొందిరి) అని, ప్రసిద్ధుండైన, జనకుండు, కర్మఠుండుకావునఁ, గర్మలోపంబుగలుగున నుభయంబున, నెప్పుడునుభార్యనువిడిచి యుండనివాఁడనుట; త్వాం= నన్నేక దానింగాపాడనశక్తుండవై నన్ను భార్యనిచ్చట నెవిడిచివనంబునకుఁబోయిన నిన్ను; ప్రాప్య= తెలిసికొని; స్త్రీయం; పురుషవిగ్రహం; జామాతరం; అమన్యతకిం.

నీయందు సౌందర్యంబు మాత్రమె యున్నది, దానిచేత నెనిన్నుఁజూచియందఱు భ్రమించుచున్నారుగాని, నీయం దెంతమాత్రమును, పౌరుషంబులేదు; మహాకర్మఠుండుగావునఁ, గర్మలోప భయంబున నెంతమాత్రమును విడిచి యుండనివాఁడును శూరుండునగు నా తండ్రిజనకమహారాజు, నీవిట్లునన్నొక దానింబోషింపంజాలకభార్యనన్నిచ్చట నెవిడిచియరణ్యంబునకుంబోవుటనువిని, "నాయల్లుండు, సాక్షాత్పురుషుండు గాఁడు; కేవలముస్త్రీయె; పురుషవేషంబువేసికొని నన్ను మోసపుచ్చి నాకొమార్తెఁబెండ్లియయ్యె" అనితప్పక, తలంచును. అని, తాత్పర్యము.

లేక; రామ=రాముఁడా! మే=నా యొక్క; పితా=తండ్రియును; మిథిలాధిపః=మిథిలకుఁబ్రభువైనవాఁడునగు; వైదేహః — జనకమహారాజు; స్త్రీయం=స్వభావంబునస్త్రీయును; పురుషవిగ్రహం= పురుషాకారంబుగలవాఁడవునగు; త్వాం=నిన్ను; జామాతరం= అల్లునిఁగా; ప్రాప్య— పొంది; కిమమన్య

త=ఏమితలంచెను? ఏమియుఁదెలిసికొనఁడయ్యె.

రాముఁడా! నాతండ్రిజనకమహారాజు,స్వభావంబునస్త్రీని,పురుషాకారంబుగలవాఁడవగునిన్ను,అల్లునిఁగాఁబొందినాఁడే;నీకునన్నిచ్చునప్పుడు, అతనికినీయథార్థ స్వరూపము తెలియదుకాఁబోలు; తెలిసియుండినచో, నీకునన్నిచ్చియుండఁడు. అని, తాత్పర్యము.

లేక; రామ, మే,పితా,మిథిలాధిపః, వైదేహః, త్వాం=నిన్ను;జామాతరం, అల్లునిఁగా;ప్రాప్య=పొంది;పురుషవిగ్రహం = పురుషాకారముగలజనమును; స్త్రీయం=స్త్రీప్రాయమునుగా; కిం=ఎందుకు;అమన్యత=తలంచెను?

"సఏవ వాసుదేవోయం సాక్షాత్పురుషఉచ్యతే, స్త్రీప్రాయమే తత్సర్వం జగద్బ్రహ్మపురస్సరం" (అట్టియీవిష్ణుదేవుండొక్కఁడె సాక్షాత్పురుషుండనంబడును ; కావునతదితరమైన బ్రహ్మ మొదలగు జగత్తంతయు స్త్రీప్రాయమే.) యనివిష్ణుపురాణంబునఁ జెప్పఁబడిన విధంబున, విష్ణుదేవావతారుండవగు,నిన్నల్లునిఁగాఁబొంది,నిన్నుఁజూచినవెనుక "నీవొకండవే పురుషుండవు; ఇతరపురుషులుపురుషులుకారు, వారలందఱుస్త్రీప్రాయులె" యనితలంచియున్నాఁడే! నీసంగతియతనికిం దెలియదుకాఁబోలు; తెలిసినచో, నతండట్లుతలంచునా? అని, తాత్పర్యము.

లేక; రామజ=క్రీడించుటకుఁ బుట్టిన,లీలార్థమయి యవతరించిన యనుట; పురుష=పరమపురుషుఁడవగు రాముఁడా! మే,పితా,మిథిలాధిపః, వైదేహః;అమాతరం = తల్లిగానట్టి,దవతితల్లియయినయనుట; స్త్రీయం=స్త్రీయగుకైకేయిని; ప్రాప్య = పొంది; త్వా= నిన్నుఁగూర్చి; విగ్రహం= కలహమును ; అమన్యత కిం= తలంచినాఁడా?తలంపనేలేదు.

నీవులీలార్థమయి యవతరించి పరమ పురుషుండవైనన్నాఁడవు; నీకుఁ జవతితల్లికైకేయి యున్నదని తెలిసియుండి, నాతండ్రిజనకుండు, నీకావిడమేమైనంగలహముసేయుననినీకునన్నిచ్చునప్పుడెంతమాత్రము తెలిసికొనఁడయ్యె.

అని, తాత్పర్యము.

లేక; మే,పితా, మిథిలాధిపః,వైదేహః;పురుషవిగ్రహం = భక్తులగుపురుషులనువిశేషించిస్వీకరించునట్టి; రామజామాతరం, రామ=ఆనందరూపుఁడవగు,జామాతరం=అల్లుఁడవైన,త్వాం=నిన్ను; ప్రాప్య=పొంది;స్త్రీయం=తనభార్యను, (ఇదియుపలక్షణము) పుత్ర

మిత్రాదిసంసారమును; అనస్మృతకిం = తలంచినాఁడా? తలంపనే లేదనుట.

నాతండ్రి జనకమహారాజు, భర్తర ఈణ తత్పరుండవు నానందరూపుండవు నగునీవల్లఁడవైనపిమ్మట పుత్ర మిత్రకళత్రాదులపై మమతవిడిచిపరమానందపూర్ణుఁడైయున్నవాఁడు; అట్లు, భక్తులనందఱ నానందపూర్ణులం యున్నట్టినీవు,నన్నుమాత్రమిట్లే ... పడునట్లు సేయుచున్నావు ? నాప్రార్థ ననంగీకరించి నన్ను వనంబునకుఁ గొని పోయి, నాకుసంతోషంబు ఘటింపుము, అని, తాత్పర్యము.

అనృతం బత లోకోఽయ మజ్ఞానా ద్యది వక్ష్యతి
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే. ౮

టీక॥ తపతి=తపింపఁజేయుచున్న; దివాకరఇవ=సూర్యునియందుంబోలె; రామే=రామునియందు; పరం=అధికమయిన; తేజః=తేజస్సు; నాస్తి = లేదు. అయం=ఈ; లోకః=జనము; అజ్ఞానాత్=తెలివిలేమివలన; వక్ష్యతి యది=చెప్పనేని; తత్ (అధ్యాహృతము)=అది; అనృతంబత=అబద్ధమే.

ప్రకాశించుచుండుసూర్యునియందుం డునట్లు రామునియందెంతమాత్రము తేజస్సులేదు; ఈజనులు, రామునందు సూర్యునందుంబోలె, నధికమయిన తేజంబున్నదని చెప్పచున్నారే యనియుందువేమొ; వారలజ్ఞానంబుననట్లు చెప్పచున్నారుగానివేఱుగాదు; అదినత్యమగుచో, సూర్యునందుంబోలె రామునందును తేజంబగపడుఁగాక;అట్లుగనుపడకుండుటం జేసి,యదియబద్ధమే.

అని, తాత్పర్యము.

లేక; సీతమొదటరామునాక్షేపించిపలికి, యటువెనుక; భయంబున, జనులిట్లనుకొందురనిచెప్పి, తనయపరాధమును, దప్పించుకొనుచున్నది. — అయం=ఈ; లోకః= జనముః తపతి = తపింపఁజేయుచున్న; దివాకర ఇవ=సూర్యునందుంబోలె; రామే = రామునియందు; పరం = అధికమయిన; తేజః=తేజస్సు; నాస్తి = లేదు; ఇతి (అధ్యాహృతము) = అని; అజ్ఞానాత్ = తెల్వి లేమివలన; అనృతం=అబద్ధమును; వక్ష్యతియది=చెప్పనట్టయినచో! చెప్పదురే! యనుట.

నీవిట్లునన్నిచట నె విడిచి వనంబునకుంబోవుటంబూచి, జనులందఱు, నీవు

...ల ంబోషింపఁజాలక విడిచిపోతివనితలం చెదరా సూర్యునందుండునట్లు రాముని, యజ్ఞానంబున, నబద్ధమును వాడుకొందురే! దానికేమి సేయుదుము.

అని, తాత్పర్యము.

కింహి కృత్వా విషణ్ణ స్త్వం కుతోవా భయ మస్తి తే
య త్పరిత్యక్తుకామ స్త్వం మా మనన్యపరాయణామ్. ౫

టీక॥ త్వం=నీవు; కింహి= దేనిని; కృత్వా=చేసి, ఉంచుకొని యనుట; విషణ్ణః=దుఃఖితుండవయితివి? తే= నీకు; కుతోవా=దేనివలన; భయం=వెఱపు; అస్తి=కలదు? యత్ = ఎందువలన; త్వం= నీవు; అనన్యపరాయణాం = ఇతరుండు గతిగాఁ గలదానను గాని; మాం=నన్ను; పరిత్యక్తుకామః= విడువఁగోరినావో.

నీవు, మనంబున నేమియుంచుకొని, యిట్లు దుఃఖమునొందియున్నావు? మఱియు మహాపరాక్రమశాలివగు నీకు దేనివలన భయము? దానినీవు నీవే తప్ప వేఱేగతి లేకుండునన్నుల విడువఁగోరుచున్నావు. అని, తాత్పర్యము.

ద్యుమత్సేనసుతం వీర సత్యవంత మనువ్రతామ్
సావిత్రీ మివ మాం విద్ధి త్వ మాత్మవశవర్తినీమ్. ౬

టీక॥ వీర= పరాక్రమశాలివగు రాముఁడా! త్వం=నీవు; ద్యుమత్సేనసుతం= ద్యుమత్సేనునికొడుకైన; సత్యవంతం= సత్యవంతుని; అనువ్రతాం=అనుసరించినః; సావిత్రీమివ= సావిత్రీదేవినింబోలె; మాం=నన్ను; ఆత్మవశవర్తినీం= నీయధీనతయందున్నదానిఁగా; విద్ధి=ఎఱుంగుము.

పరాక్రమశాలివగు రాముఁడా! సావిత్రీదేవి, తన పెనిమిటియగు, ద్యుమత్సేనునికొడుకును సత్యవంతు ననుసరించుచు, నతనివిడువకున్నట్లు, నేనును, నీయధీనురాలనై నిన్నువిడువకుండు దానననియెఱుంగుము. అని, తాత్పర్యము.

నత్వహం మనసాప్యన్యం ద్రష్టాస్మి త్వదృతేఽనఘ

త్వయా రాఘవ గచ్ఛేయం యథాన్యా కులపాంసనీ. ౭

టీక॥అనఘ = పాపములేని; రాఘవ=రాముడా! అన్యా = ఇతరయయిన; కులపాంసనీయథా= కులమును జెఱుపునట్టిదుష్టస్త్రీవలె; అహంతు = నేను మాత్రము; మనసాపి= మనసుచేతనైనను; త్వదృతే=నీవుదక్క; అన్యం=ఇతరపురుషుని; నద్రష్టాస్మి = చూడను. త్వయా=నీతో; గచ్ఛేయం=పోదును.

అనఘుండవగు రాముడా! అన్యులగాక దానుబుట్టినకులమును జెఱుపునట్టి దుష్టస్త్రీయు బోలె, నేనెప్పటికైనను, మనంబుననైనను, నీవుదక్క నితరపురుషుం జూచుదానను గాను; కావున, నీతోడవనంబునకువత్తును గాని, నిన్నువిడిచియుండజాలను. అని, తాత్పర్యము.

స్వయంతు భార్యాం కౌమారీం చిరమధ్యుషితాం సతీమ్
శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతుమిచ్ఛసి. ౮

టీక॥ రామ=రాముడా! త్వం(అధ్యాహృతము)=నీవు ; కౌమారీం = నూతనయౌవనముగలదానను; చిరం= బహుకాలము; అధ్యుషితాం = సహవాసమునొందినదానను; సతీం=పతివ్రతను; భార్యాం=భార్యనగు; మాం=నన్ను; శైలూషఇవ=తనభార్యనితరులకిచ్చి జీవించు వాడువలె ; స్వయంతు=నీవైయె; పరేభ్యః= ఇతరులకొఱకు; దాతుం=ఇచ్చుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావు.

రాముడా! నీవు, నూతనయౌవనంబునొందియున్నదానను, బహుకాలమునసహవాసంబు నొందినదానను పతివ్రతను, భార్యనగునన్ను, తనభార్య నితరపురుషులకిచ్చి జీవించువానియట్లు నీవైయె, యితరులకియ్యఁగోరినావు. అని, తాత్పర్యము.

యస్య పథ్యంచ రామాత్థ యస్యచార్థేఽవరుధ్యసే
త్వం తస్య భవ వశ్యశ్చ విధేయశ్చ సదాఽనఘ. ౯

టీక॥అనఘ=పాపములేని; రామ=రాముడా! యస్య=ఏజనమునకు ; పథ్యంచ=హితమును; ఆత్థ = చెప్పుచున్నావో; యస్య=ఏజనముయొక్క;అ

శేఽచ=ప్రయోజనమునిమిత్తమయ్యు; అవరుధ్యసే=నన్నుడ్డగించుచున్నావో; త్వం=నీవు; తస్య=ఆజనమునకు; సదా=ఎల్లప్పుడును; పశ్యశ్చ=లోఁకువయయినవాఁడవును; విధేయశ్చ=ఆజ్ఞాపింపఁదగినవాఁడవును; భవ=అగుము.

అనఘుండవగురాముఁడా! నీవిప్పు డెవ్వరికిహితము సేయుమని చెప్పుచున్నావో, మఱియునెవ్వరినిమిత్తమయి, నన్నువనంబునకు రావలదని చెప్పుచున్నావో, అట్టికౌసల్యాదశరథుఁడు మున్నగుగురుజనులకు, నీవు, ఎల్లప్పుడును, వశ్యుండవై, వారలుచెప్పు పనులుసేయుచుండుము; నేనో! నిన్ననుసరించెదను. అని, తాత్పర్యము.

లేక; అనఘ; రామ; యస్య; పథ్యం చ; అర్థే; యస్య; అర్థేఽచ; అవరుధ్యసే=నిర్బంధమునొందుచున్నావో; త్వం=నీవు; తస్య=అట్టిజనమయిననాకు; సదా=ఎల్లప్పుడును; వశ్యశ్చ=లోఁకువయయినవాఁడవును; విధేయశ్చ=ఆజ్ఞాపింపఁదగినవాఁడవును; భవ=అగుము.

అనఘుండవగురాముఁడా! నీవునాకు హితంబుచెప్పుచున్నావుగదా! మఱియునానిమిత్తమయ్యె, యిట్లు దుఃఖమునొందియున్నావు; నేనట్లునీకుఁ బ్రియురాలనుగానున్నానుగదా! నీవిట్లు నాహితముగోరి, నాకసమ్మతమయినపనిం జెప్పుటకుబదులుగా, నేనుజెప్పునట్లువిని, నన్నునీతోఁ గూడవనంబునకుండిసికొనిపోయి, నాకు హితంబుగావింపుము. అని, తాత్పర్యము.

లేక; అనఘ; రామ; యస్య=ఏభరతునకు; పథ్యంచ=హితమును; అర్థే=చెప్పుచున్నావో; యస్య=ఏభరతుని యొక్క; అర్థేఽచ=ప్రయోజనము నిమిత్తమయి; అవరుధ్యసే=నిగ్రహింపఁబడుచున్నావో; త్వం=నీవు; తస్య=ఆభరతునకు; సదా=ఎల్లప్పుడును; వశ్యశ్చ=లోఁకువయయినవాఁడవును; విధేయశ్చ=ఆజ్ఞాపింపఁదగినవాఁడవును; భవ=అగుము.

అనఘుండవగురాముఁడా! నీవిప్పు డెవ్వనికిహితముసేయుమనినాతోఁ జెప్పుచున్నావో, మఱియునెవ్వనికిఁ బట్టాభిషేకంబుగలుగునిమిత్తమయి, నీవుదశరథునిచేనిగ్రహింపఁబడినావో, అట్టిభరతునకునీవెయెల్లప్పుడును వశ్యుండవై యతండాజ్ఞాపించుపనులం జేయువాఁడవై యుండుము; నేను నిన్ననుసరించెదను; నన్నుమాత్రమట్లుచేయుమనిచెప్పుటసరికాదు.

అని, తాత్పర్యము.

స మా మనాదాయ వనం న త్వం ప్రస్థాతు మర్హసి

టీక॥సః=అట్టి;త్వం=నీవు;మాం=నన్ను;అనాదాయ=తీసికొనక; వనం=అడవినిగూర్చి; ప్రస్థాతుం= పయన మగుటకు;నార్హసి=తగవు.

ఇట్లుసమస్తనీతులును దెలిసిననీవు, నన్నిచ్చటవిడిచి , వనంబునకుఁ బోఁగూడదు. అని, తాత్పర్యము,

తపోవా యది వారణ్యం స్వర్గోవా మే సహత్వయా. ౧౦

టీ॥ మే=నాకు; తపోవా=తపస్సుగాని; అరణ్యంయదివా= అడవిగాని, అడవిలోనుండుటగానియనుట ; స్వర్గోవా=స్వర్గముగాని, స్వర్గ వాసముగాని యనుట; త్వయాసహ= నీతోఁగూడ; భవతు(అధ్యాహృతము)=అగుఁగాక.

తపస్సుసేయుటగాని, యడవిలో నుండుటగాని, స్వర్గంబులో నుండుటగాని, నాకు, నీతోఁగూడ, కావలయునుగాని, వేఱులేదు.

అని, తాత్పర్యము.

నచ మే భవితా తత్ర కశ్చి త్పథి పరిశ్రమః
పృష్ఠత స్తవ గచ్ఛంత్యా విహారశయనే ష్వివ. ౧౧

టీక॥తవ=నీయొక్క; పృష్ఠతః=వెనుకను;గచ్ఛంత్యాః=పోవుచున్న; మే=నాకు;విహారశయనేష్వివ=లీలగాఁదిరుగుటలయందునుబరుండుటలయందును౦ బోలె;తత్ర=అచ్చట;పథి=మార్గమునందు;పరిశ్రమశ్చ=అలసటయును; కశ్చిత్=ఒకానొకటియయినను, కొంచెమైననుట;నభవితా=కలుగదు.

నేనునీవెనుక వచ్చుచుండఁగా నెట్టికష్టమార్గములందైనను, నాకు,ఉద్యానంబులం దిరుగునప్పుడును బరుండి యుండునప్పుడునుసుఖముగానుండునట్లుసుఖముగానేయుండును, గాని, ఎంతమాత్ర మునలసటగలుగదు.అని, తాత్పర్యము.

కుశకాశశరేషీకా యేచ కంటకినో ద్రుమాః
తూలాజినసమస్పర్శా మార్గే మమ సహత్వయా. ౧౨

టీక॥ మార్గే=దారియందు; కుశకాశశరేషీకాః, కుశ=దర్భలును, కాశశర=ఱెల్లును, ఇషీకాః=ముండ్లదుబ్బులును; కంటకినః=ముండ్లుగల; ద్రుమాః=వృక్షములు; యే(సంతి)=ఏవి గలవో; తే(అధ్యాహృతము)చ=అవియును; త్వయాసహ=నీతోఁగూడ; స్థితాయాః(అధ్యాహృతము)=ఉన్న; మమ=నాకు; తూలాజినసమస్పర్శాః=దూదికిని తోలునకును సరియయిన తాఁకుడుగలవి.

దారిలోనున్న దర్భముక్కలును తెల్లును ముండ్లదుబ్బులును మఱియు ముండ్లవృక్షంబులేవియున్నవో యవియన్నియును, నీసమీపంబుననుండునప్పుడు, నాకు, దూదియు జింకతోలు మొదలగు తోళ్లునుంబోలెఁ, దాఁకుటకు సుఖముగానే యుండును. అని, తాత్పర్యము.

మహావాతసముద్ధూతం యన్మా మపకరిష్యతి
రజో రమణ తన్మన్యే పరార్ధ్యమివ చందనమ్. ౧౩

టీక॥ రమణ=ప్రియుండవగు రాముఁడా; మహావాతసముద్ధూతం=పెద్దగాలిచే నెగరఁగొట్టఁబడిన; యత్=ఏది; మాం=నన్ను; అపకరిష్యతి=కప్పునో; తత్=ఆ; రజః=దుమ్మును; పరార్థ్యం=శ్రేష్ఠమయిన; చందనమివ=చందనమునువలె; మన్యే=తలంచుచున్నాను.

ప్రియుండవగు రాముఁడా! అడవిలోఁ బెద్దగాలికిఁ, బైకెగిరి నాదేహంబంతయు నంటుకొను దుమ్మును, గస్తూరి మొదలగునవి గలసిన శ్రేష్ఠంబగు సుగంధంబుగాఁ, దలంచెదను. అని, తాత్పర్యము.

శాద్వలేషు యథా శిష్యే వనాంతే వనగోచర
కథా స్తరణతల్పేషు కిం స్యాత్సుఖకరం తతః. ౧౪

టీక॥ వనగోచర=అడవియందగపడునట్టి రాముఁడా! వనాంతే=వనమధ్యప్రదేశమునందు; శాద్వలేషు=లేఁతపచ్చికగల నేలలందు; యథా=ఎంతసుఖముగా; శిశ్యే=పరుండుదునో; కుథాస్తరణతల్పేషు=చిత్రకంబళములతోను బైనిపఱచెడు వస్త్రములతోనుం గూడిన పాన్పులందు; కిం=ఏది; తతః=అంతకన్న; సుఖకరం=సుఖము సేయునది; స్యాత్=అగును?

వనవాసంబుసేయురాముఁడా! నాకువనమధ్యంబున, లేతపచ్చికలు మొలిచియుండునేలపై, నీతోఁగూడఁ, బరుండుటకన్న, నీచిత్రకంబళములతోనుబైఁబలుచెదువస్త్రములతోనుంగూడినపాన్పులందిచ్చటబరుండుటచే, నెంతమాత్రమునెచ్చుగాసుఖంబుగలుగదు.

అని, తాత్పర్యము.

పత్రం మూలం ఫలం య త్త్వ మల్పంవా యదివా బహు
దాస్యసి స్వయ మాహృత్య తన్మేఽమృతరసోపమమ్. ౧౫

టీక॥త్వం=నీవు; పత్రం=ఆకునుగాని; మూలం=గడ్డనుగాని; ఫలం=పండునుగాని; అల్పంవా=కొంచెమునుగాని; బహుయదివా — అధికమును గాని; యత్=దేని; స్వయం = నీవై; ఆహృత్య=తెచ్చి; దాస్యసి=ఇత్తువో; తత్=అది; మే—నాకు; అమృతరసోపమం=అమృతముయొక్కరుచితోఁబోల్కిగలది.

వనంబున, నీవు, పత్రముగానిగడ్డగానిపండుగాని, కొంచెముగాఁగాని మెచ్చుగాఁగాని, దేని, నీచేతులారఁదెచ్చి యిత్తువో, అదినాకమృతమువంటిది.

అని, తాత్పర్యము.

న మాతు ర్న పితు స్తత్ర స్మరిష్యామి న వేశ్మనః
ఆర్తవా న్యుపభుంజానా పుష్పాణిచ ఫలానిచ. ౧౬

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను; తత్ర — ఆయడవియందు; ఆర్తవాని=అన్యో ఋతువులంగలిగిన; పుష్పాణిచ=పూలను; ఫలానిచ = పండ్లను; ఉపభుంజానా—అనుభవించుచు; మాతుః— (ద్వితీయార్థమందుషష్ఠి, ఇట్లుముందు నెఱుంగునది ) తల్లిని; న స్మరిష్యామి=తలంచుకొనను . పితుః=తండ్రిని; న (స్మరిష్యామి)=తలంచుకొనను. వేశ్మనః=ఇంటిని; న (స్మరిష్యామి)=తలంచుకొనను.

నేనువనంబున, నన్యో ఋతువులంగలుగుపుష్పంబులనుధరించి ఫలంబులందినుచు, సుఖముగా, నాతల్లినిగాని , నాతండ్రినిగాని, యింటినిగాని, యెంతమాత్రమును స్మరింపకుండెదను.

అని, తాత్పర్యము.

నచ తత్ర గతః కించి ద్ద్రష్టు మర్హసి విప్రియమ్
మత్కృతే నచ తే శోకో న భవిష్యామి దుర్భరా. ౧౭

టీక॥ తత్ర = ఆవనమునందు; గతః=పొందిన ; త్వం (అధ్యాహృతము)=నీవు; మత్కృతే= నానిమిత్తమయి; విప్రియం=కష్టమును; కించిత్ = కొంచమైనను; ద్రష్టుం=చూచుటకు ; నార్హసి=తగవు; తే=నీకు; శోకశ్చ= దుఃఖమును; నభవేత్ (అధ్యాహృతము)=కలుగదు;అహం (అధ్యాహృతము)=నేను ; దుర్భరా=భరింపనలవి గానిదానను; నభవిష్యామి=కాను.

నీవునన్నుఁదోడ్కొని యడవికింబోయినవెనుక, నీకెంతమాత్ర, మచ్చట , నానిమిత్తమయి, కష్టముగాని , దుఃఖముగాని,గలుగదు;కావున, నన్నుఁగాపాడుటకేమియుఁగష్టములేదు.

అని, తాత్పర్యము.

య స్త్వయా సహ స స్వర్గో నిరయో య స్త్వయా వినా
ఇతి జానన్ పరాం ప్రీతిం గచ్ఛ రామ మయా సహ. ౧౮

టీక॥రామ=రాముఁడా!త్వయాసహ=నీతోఁగూడ;వాసః (అధ్యాహృతము)=ఉనికి;యః=ఏదో;సః=అది; స్వర్గః=స్వర్గము.త్వయావినా=నిన్ను విడిచి; వాసః(అధ్యాహృతము)=ఉనికి; యః=ఏదో ; సః (అధ్యాహృతము)=అది; నిరయః=నరకము. ఇతి= ఇట్టి;పరాం=అధికమయిన ; ప్రీతిం= అనురాగమును; జానన్ = ఎఱింగినవాఁడవై; మయాసహ= నాతోఁగూడ; గచ్ఛ=పొమ్ము.

రాముఁడా! నాకునీతోఁగూడనుండుటయెస్వర్గము; నీవులేకుండుటయెనరకము; ఇదినామతము; నాకునీయందుండుప్రీతియిట్టిదనియెఱింగి , నన్నుఁదోడ్కొనియడవికింబోమ్ము;ఇచ్చట విడువవలదు.అని, తాత్పర్యము.

అథ మామేవ మవ్యగ్రాం వనం నైవ నయిష్యసి
విష మద్యైవ యాస్యామి మావిశం ద్విషతాం వశమ్. ౧౯

టీక ॥ అథ = ఇంక; ఏవం= ఇట్లు ; అవ్యగ్రాం = నిశ్చయించి

యందు ; మాం = నన్ను ; వనం= అడవినిగూర్చి ; నైవనయిష్యసి (నైవ నేష్యసి, చేత్)= తీసికొనక పోదువే ని ; అహం (అధ్యాహృతము)= నేను అద్యైవ=ఇప్పుడే ; విషం= విషమును ; యాస్యామి=పొందెదను, ద్విషతాం= శత్రువులయొక్క ; వశం = అధీనతను ; నావిశం (మావిశేయం)= పొందను.

నేనింతదూరము చెప్పినను, నామాటవినక, యిట్లే నన్ననుసరించుట యందు దృఢనిశ్చయముగలనన్ను దోడ్కొనక యె వనంబునకుం బోదువేని, నేనెంత మాత్రము శత్రువులగు భరతాదులవశంబుననుండజాలను ; ఇప్పుడునీ యెదుటనె విషంబు ద్రావి ప్రాణంబులు విడిచెదను.

అని, తాత్పర్యము,

పశ్చాదపి హి దుఃఖేన మమ నైవా స్తి జీవితమ్
ఉజ్ఝితాయా స్త్వయా నాథ తదైవ మరణం వరమ్. ౨౦

టీక॥ నాథ= పెనిమిటివగు రాముడా! త్వయా=నీచేత ; ఉజ్ఝితాయాః= విడువంబడిన ; మమ=నాకు ; పశ్చాదపి= వెనుకనైనను ; జీవితం=బ్రతుకు ; దుఃఖేన=దుఃఖముచేత ; నైవాస్తి= కలుగదు. తదైవ=అప్పుడె, నీవువిడుచు నప్పుడెయనుట ; మరణం= చచ్చుట ; వరం=మంచిది.

పెనిమిటివగు రాముడా! ఒకవేళ నేనిప్పుడు చావకున్నను, నీవు నన్ను విడిచిపోయినపిమ్మటనైనను, దుఃఖంబునం, జావవలసిన దాననే ; కావున, నట్లుదుఃఖంబునొందుటకుమును పె, నీవు నన్ను విడిచిపోవునప్పుడె, ప్రాణంబువిడుచుటమంచిది.

అని, తాత్పర్యము.

ఇమం హి సహితుం శోకం ముహూర్త మపి నోత్సహే
కిం పున ర్దశవర్షాణి త్రీణి చైకంచ దుఃఖితా. ౨౧

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను ; ఇమం= ఈ ; దుఃఖం =దుఃఖమును ; ముహూర్తమపి = స్వల్పకాలమైనను ; సహితుం=ఓర్చుటకు ; నోత్సహే=ఇచ్ఛింపను. దుఃఖితా = దుఃఖమునొందినదాననై ; వర్షాణి=సంవత్సరములు ; దశ=పదింటిని ; త్రీణిచ= మూటిని ; ఏకంచ = ఒకటిని ; సహి-

తుం,నోత్సహే , ఇతి (అధ్యాహృత ము)=ఓర్వనిచ్ఛింపననిః;కింపునః (వక్తవ్యం)=చెప్ప నేలః?

నిన్నువిడిచియుండి యాదుఃఖమును ముహూర్తకాలమయినను సహింపఁజాలను;అట్లుండఁగా, మొదటసంవత్సరములుపది,ఆపిమ్మటమూఁడు, నటుపిమ్మటనొకటి-సంవత్సరమును,ఇట్లుపదునాలుగుసంవత్సరములు, సహింపఁజాలనని,చెప్ప నేలః అని,సీతరామునితోఁజెప్పినది. అని, తాత్పర్యము.

ఇతి సా శోకసంతప్తా విలప్య కరుణం బహు
చుక్రోశ పతి మాయస్తా భృశ మాలింగ్య సస్వరమ్. ౨౨

టీక॥సా = ఆసీత;శోకసంతప్తా= దుఃఖముచేమిక్కిలియుఁదపింపఁజేయఁబడినదై;ఆయస్తా=ఆయాసమునుబొందినదై;ఇతి=ఇట్లు; కరుణం=వినువారికి దుఃఖముగలుగునట్లుగా; బహు=అధికముగా;విలప్య = దుఃఖముగాఁజెప్పి;పతిం=పెనిమిటిని; భృశం=మిక్కిలియు; ఆలింగ్య=కౌఁగిలించుకొని; సస్వరం=అధికధ్వని గలుగునట్లుగా; చుక్రోశ= ఏడ్చెను.

సీతాదేవి,మహాదుఃఖంబున,నాయాసంబునొంది,యిట్లు, వినువారలకునుదుఃఖముగల్గునట్లువిలపించి,యంతఁ,బెనిమిటియగురామునిదృఢంబుగాఁగవుఁగిలించుకొని,గట్టిగానేడ్చెను.

అని, తాత్పర్యము.

సా విద్ధా బహుభి ర్వాక్యై ర్దిగ్ధై రివ గజాంగనా
చిరసన్నియతం బాష్పం ముమోచాగ్ని మివా రణిః. ౨౩

టీక॥సా=ఆసీత;బహుభిః=పెక్కులయిన;వాక్యైః = మాటలచేత; దిగ్ధైః= విషముపూసినబాణములచేత; గజాంగనేవ= అఁడేనుంగుంబోలె;విద్ధా=కొట్టఁబడినదై;అరణిః=మథించినిప్పుఁబుట్టించెడుకొయ్య; అగ్నిమివ=నిప్పునుంబోలె;చిరసన్నియతం= బహుకాలముగానణంపఁబడిన;బాష్పం= కన్నీటిని;ముమోచ=విడిచెను.

సీతాదేవి, రాముండుచెప్పినకఠినతరంబులగు నామాటలకు, విషంబుపూసినబాణంబుల వ్రేటున కాఁడేనుం

గుంబో లె, ఖిన్నయయి, యరణిచక్కఁ గామథింపఁబడి బహుకాలముగాఁదన లోనడంగియున్నయగ్నిం బ్రకట్టనట్లు, అమంగళశంకచేబహుకాలముగా నడంచికొనియుండిన, కన్నీళ్లను, విడిచెను.

అని, తాత్పర్యము.

తస్యా స్స్ఫటికసంకాశం వారి సంతాపసంభవమ్
నేత్రాభ్యాం పరిసుస్రావ పంకజాభ్యా మివోదకమ్. ౨౪

టీక॥ తస్యాః = ఆసీతయొక్క; నేత్రాభ్యాం = కండ్లనుండి; పంకజాభ్యాం= తామరపూలనుండి; ఉదకమివ—జలముంబోలె; స్ఫటికసంకాశం= స్ఫటికమణితో సమానమును; సంతాపసంభవం—దుఃఖమువలనంబుట్టినదియునగు; వారి=జలము; పరిసుస్రావ—కారెను.

అప్పు, డాసీతాదేవికండ్లనుండి, ధారగాఁ గాఱుచుండుటచేఁ గాటుకంత యంఁబోయినందున, స్ఫటికమువలెస్వచ్ఛముగానుండు, కన్నీరు, తడుపఁబడినకమలంబులనుండి నీళ్లుకాఱునట్లు కాఱుచుండెను. అని, తాత్పర్యము.

తచ్చైవా మలచంద్రాభం ముఖ మాయతలోచనమ్
("అమలసంకాశం" ఇ,తిపాఠాంతరమ్)
పర్యశుష్యత బాష్పేణ జలోద్ధృత మివాంబుజమ్. ౨౫

టీక॥ అమలచంద్రాభం= స్వచ్ఛమయిన చంద్రునియొక్క కాంతి వంటి కాంతి గలదియును ; అమల సంకాశం (అనిపాఠాంతరము)= స్వచ్ఛ మగుటచేఁబ్రకాశించు చున్నదియును; ఆయతలోచనం=నిడుపులయిన కండ్లుగలదియునగు; తత్ =ఆ; ముఖంచైవ = ముఖమును; బాష్పేణ—కన్నీరుచేత(పఠాంతరమునందు)ఉష్ణముచేత; జలోద్ధృతం=నీటనుండియెత్తఁబడిన; అంబుజమివ=కమలంబుంబోలె; పర్యశుష్యత—వాడెను.

స్వచ్ఛమగుచంద్రబింబంబుంబోలెఁ జూడనగుచుఁ బెద్దకండ్లతో నొప్పుచున్న, సీతాదేవిముఖంబు, కన్నీరుగ్రమ్మియుంటంజేసి, జలంబునుండి వెలుపలికిఁదీయఁబడినకమలంబు, ఎండతాఁకుడుకువాడునట్లు, వాడియుండినది.

అని, తాత్పర్యము.

తాం పరిష్వజ్య బాహుభ్యాం విసంజ్ఞామివ దుఃఖితామ్
ఉవాచ వచనం రామః పరివిశ్వాసయం స్తదా. ౯

టీక॥ తదా=అప్పుడు; రామః=రాముఁడు=దుఃఖితాం — దుఃఖమునొందినదియు;విసంజ్ఞామివ (స్థితాం)=స్మృతిలేనట్లున్నది యునగు; తాం= ఆసీతాదేవిని; బాహుభ్యాం=చేతులచే; పరిష్వజ్య — కౌఁగిలించుకొని;పరివిశ్వాసయన్=చక్కఁగానూఱడించుచు; వచనం= మాటను; ఉవాచ—పలికెను.

అప్పుడు,రాముండు, పరమదుఃఖంబునమూర్ఛవోయినట్లు నేలంబడియున్నసీతాదేవిని, బాహువులంగవుఁగిలించుకొని, మంచిమాటలందేర్చుచు, నిట్లని,చెప్పెను. అని, తాత్పర్యము.

నదేవి తవ దుఃఖేన స్వర్గమ ప్యభిరోచయే

టీక॥ దేవి=రాణివగుసీతా!తవ=నీయొక్క;దుఃఖేన = దుఃఖముచేత;స్వర్గమపి=స్వర్గమునైనను; నాభిరోచయే=ఇచ్ఛింపను.

సీతా! నీకుదుఃఖముగలుగునట్టయిన, నాకుస్వర్గముప్రాప్తించినను దానింగూడసరకుసేయను.

అని, తాత్పర్యము.

నహిమే స్తి భయం కించి త్స్వయంభో రివ సర్వతః. ౨౭

టీక॥ మే=నాకు; స్వయంభోరివ— బ్రహ్మదేవునకుంబోలె;సర్వతః=అన్నింటివలనను;భయం=వెఱపు; కించిత్=కొంచెమయినను;నాస్తిహి — లేదుగదా!

సమస్తజంతుజాలమునుబుట్టించుటకును వానినుదుటనాయుఃపరిమాణంబునుభాగ్యంబునువ్రాయుటకును దుడుచుటకునుగర్తయయిన బ్రహ్మదేవునకెందునుభయములేనట్లు, నాకు, దేనివలననుభయములేదు.అని, తాత్పర్యము.

తవ సర్వ మభిప్రాయ మవిజ్ఞాయ శుభాననే
వాసం నరోచయే౽రణ్యే శక్తిమానపి రక్షణే. ౨౮

టీక॥ శుభాననే=సుందరంబగుముఖముగలదానవగుసీతా! అహం(అధ్యాహృతము)=నేను;రక్షణే=కాపాడుటయందు;శక్తిమానపి= సామర్థ్యముగలవాఁడనైనను;తవ=నీయొక్క;అభిప్రాయం=భావమును; సర్వం= అంతను; అవిజ్ఞాయ=తెలిసికొనక;అరణ్యే=వనమునందు;వాసం=ఉనికిని;నరోచయే= ఇచ్ఛింపకున్నాను.

సుందరంబగు ముఖముగల దానవగు సీతా! నేను, నిన్నడవిలోఁగాపాడుటకు శక్తుండనైనను, నీమనసునందలి యభిప్రాయము నాకుఁదెలియకుండినది, కావున,నింతవఱకు,నీవు నాతోఁగూడవనంబునకువచ్చుటకుసమ్మతింపకుంటిని.

అని, తాత్పర్యము.

యత్సృష్టాసి మయా సార్ధం వనవాసాయ మైథిలి
నవిహాతుం మయాశక్యా కీర్తిరాత్మవతా యథా. ౨౯

టీక॥ మైథిలి=సీతా! యత్=ఎందువలన; త్వం (అధ్యాహృతము)=నీవు; మయాసార్ధం=నాతోఁగూడ;వనవాసాయ =వనంబులోనుండుటకొఱకు; సృష్టా=నిశ్చయించినదానవు; అసి=అగుచున్నావో;తస్మాత్=(అధ్యాహృతము)అందువలన;ఆత్మవతా=దృఢమైనమనసుగలవానిచేత;కీర్తిర్యథా=కీర్తియుంబోలె; మయా=నాచేత; విహాతుం=విడుచుటకును; శక్యా= అలవియైనదానవు;న=కావు.

సీతా! నీవిట్లు, అన్నివిధంబులను, నాతోఁగూడవనములోనుండవలయునని,దృఢముగా నిశ్చయించియున్నావు; కావున, నెట్టికష్టమునందైనను, ధైర్యంబువిడువనివాఁడు,కీర్తినివిడువఁజాలనట్లు, నేనునిన్నింకవిడువఁజాలను.

అని, తాత్పర్యము.

ధర్మస్తు గజనాసోరు సద్భిరాచరితః పురా
తం చాహ మనువర్తేద్య యథాసూర్యం సువర్చలా. ౩౦

టీక॥ గజనాసోరు= ఏనుంగుతొండమువంటితొడలుగలదానవగు సీతా! ధర్మస్తు= ఈధర్మముమాత్రము; పురా=మున్ను;సద్భిః=పెద్దలచేత;ఆచరితః=చేయఁబడినది. యథా=ఎట్లు;సువర్చలా=సువర్చల; సూర్యం=సూర్యుని; అన్వవర్తత(అధ్యాహృతము)=అనుసరించెనో (ఇది,యుదాహరణము).

అహం=నేను; సంచ=ఆధర్మమును; అద్య=ఇప్పుడు; అనువర్తే = అనుసరించెదను.

ఏనుంగుతొండమువంటి తొడలుగలదానవగుసీతా! భార్య, పెనిమిటి మెచ్చటికిఁబోయినను, అచ్చటికిఁ దానతని వెంబడింపవలయునను నీవు చెప్పినధర్మము, ముందు పెద్దలాచరించిన వేగాని వేఱుగాదు; సువర్చల సూర్యుననుసరించియుండలేదా? అట్లుకావున, నీవును నాతోఁగూడ వనంబునకు రమ్ము; నేనాధర్మంబు ననుసరించి నిన్ను వనంబునకుఁ దోడ్కొనిపోయెదను.

అని, తాత్పర్యము.

న ఖల్వహం న గచ్ఛేయం వనం జనక నందిని
వచనం త న్నయతి మాం పితుస్సత్యోప బృంహితమ్. ౩౧

టీక॥జనకనందిని=సీతా! సత్యోపబృంహితం=సత్యముచే నుపష్టబ్ధమయిన; పితుః=తండ్రియగు దశరథమహారాజుయొక్క; తత్=ఆ; వచనం=ఆజ్ఞ; మాం=నన్ను; నయతి=కొనిపోవుచున్నది. తస్మాత్ (అధ్యాహృతము)= అందువలన; అహం=నేను; వనం= అడవినిగూర్చి; నఖలునగచ్ఛేయం=పోనేపోవుదును.

సీతా! నేనుబిత్రువాక్య ప్రకారముచేసెదనని కైకేయికిఁ జెప్పినసత్యమును, తండ్రియాజ్ఞయు నన్ను వనంబున కీడ్చుకొనిపోవుచున్నవి; కావున, నేనెంతమాత్రము నిలువను; అవశ్యము వనమునకుఁబోవుదును. అని, తాత్పర్యము.

ఏష ధర్మస్తు సుశ్రోణి పితుర్మాతుశ్చ వశ్యతా
అతశ్చతం వ్యతిక్రమ్య నాహం జీవితు ముత్సహే. ౩౨

టీక॥సుశ్రోణి=మంచిపిఱుఁదులు గలసీతా; పితుః=తండ్రికిని; మాతుశ్చ=తల్లికిని; వశ్యతా=విధేయుఁడుగానుండుట; ఇతి(అధ్యాహృతము)= అనెడు; ఏషతు=ఇదియె; ధర్మః=ధర్మము. అతశ్చ=ఇందువలననె; తం=దాని; అతిక్రమ్య=అతిక్రమించి; అహం= నేను; జీవితుం=బ్రతుకుటకు; నోత్సహే= ఉత్సహింపను.

మంచిపిఱుఁదులుగలసీతా! తండ్రి

కినిదల్లి కినివిధేయుండుగానుండుటకన్న యధికమయినధర్మము మతియొకటలేదు; ఇందువలన, అట్టిధర్మమును విడిచి,బ్రతికియుండుటనాకిష్టము గాదు. అని, తాత్పర్యము.

అస్వాధీనం కథం దైవం ప్రకారై రభిరాధ్యతే
స్వాధీనం సమతిక్రమ్య మాతరం పితరం గురుమ్. ౩౩

టీక॥ స్వాధీనం=తనకువశ్యదైవమయిన;మాతరం=తల్లిని; పితరం=తండ్రిని;గురుం-ఆచార్యుని;సమతిక్రమ్య=విడిచి; అస్వాధీనం=వశ్యముకాని; దైవం-దైవమును; కథం-ఎట్లు; ప్రకారైః=విధములచేత; ఆరాధ్యతే- ఆరాధింపఁబడును.

తనకాజ్ఞాదులుచేసి, తానుజేసిన సత్కార్యముల కప్పుడే సంతోషంబునొందునట్టి,తల్లి,తండ్రి,గురువు, ఈదైవమును,విడిచి, మనకండ్లకగపడకకోప సంతోషాదులు మనకుఁ దెలుపనవకాశములేకుండు, దైవంబునెట్లులారాధింపవచ్చును. అని, తాత్పర్యము.

యత్ త్రయం తత్ త్రయో లోకాః పవిత్రం తత్సమం భువి
నాన్యదస్తి శుభాపాంగే తేనేద మభిరాధ్యతే. ౩౪

టీక॥శుభాపాంగే = సుందరములయినకడకండ్లుగలసీతా!యత్=ఏ; త్రయం=మూఁడు,తల్లియుఁ, దండ్రియు, గురువుననుట;తత్ = ఆమూఁడు,తల్లియుదండ్రియుగురువుననుట; త్రయః=మూఁడైన;లోకాః = లోకములు.భువి=భూమియందు; తత్సమం=దానితో సమానమయిన;అన్యత్-ఇతరమగు;పవిత్రం=పరిశుద్ధపదార్థము; నాస్తి=లేదు. తేన=అందుచేత; ఇదం = ఈ మూఁడు;అభిరాధ్యతే= ఆరాధింపఁబడుచున్నది.

సుందరములయిన కడకండ్లుగల సీతా!తల్లియుదండ్రియుగురువును, ఈ ముజ్జగములోకంబులును;వీరల,నారాధించినచో, ముల్లోకంబులనుజయింపవచ్చును; వీరలతోసమానమయిన మఱియొక దైవ మెచ్చటనులేదు; అందుచేతనే, నేనువారలనెయారాధించుచున్నాను. అని, తాత్పర్యము.

న సత్యం దానమానౌవా న యజ్ఞాశ్చాప్తదక్షిణాః
తథా బలకరాస్సీతే యథా సేవా పితుర్హితా. ౩౫

టీక॥సీతే=సీతా! హితా=మేలుసేయునట్టి; పితుః = తండ్రియొక్క; సేవా=సేవ; యథా=ఎట్లో; తథా = అట్లు; సత్యం=సత్యము; బలకరం(అధ్యాహృతము) న = బలముసేయునది కాదు. దానమానౌవా = దానమును మానమును; బలకరౌ(అధ్యాహృతము) న = బలము సేయునవికావు. ఆప్తదక్షిణాః = పొందఁబడిన దక్షిణలుగల; యజ్ఞాశ్చ = యాగములును; బలకరాః న = బలము సేయునవి కావు.

సీతా! పితృశుశ్రూష, పరలోకమునకుబలముగల్గించి, మేలుసేయునట్లు, సత్యముగాని దానమానములుగాని, సరియయినదక్షిణలతోఁగూడినయాగములుగాని, పరలోకమునకు బలముగల్గింపవు. అని, తాత్పర్యము.

స్వర్గో ధనంవా ధాన్యంవా విద్యాః పుత్రాస్సుఖానిచ
గురువృత్త్యనురోధేన న కించిదపి దుర్లభమ్. ౩౬

టీక॥గురువృత్త్యనురోధేన=పితృశుశ్రూషయొక్క యనుసరించుటచేత; స్వర్గః=స్వర్గముగాని; ధనంవా=ధనముగాని; ధాన్యంవా=ధాన్యముగాని; విద్యాః=విద్యలుగాని; పుత్రాః=కొడుకులుగాని; సుఖానిచ=సుఖములుగాని; కించిత్=కొంచెమైనను; దుర్లభం=పొందఁగూడనిది; న=లేదు.

స్వర్గముగాని ధనముగాని ధాన్యముగాని, విద్యలుగాని, పుత్రులుగాని, సుఖములుగాని, మఱియేదిగాని, పితృశుశ్రూష సేయుచుండినచో, నన్నియుసిద్ధించును; పితృశుశ్రూషకుసాధ్యముకానిదేదియులేదు. అని, తాత్పర్యము.

దేవగంధర్వ గోలోకాన్ బ్రహ్మలోకం తథాపరాన్
ప్రాప్నువంతి మహాత్మానో మాతాపితృపరాయణాః. ౩౭

టీక॥ మాతాపితృపరాయణాః=తలిదండ్రులెముఖ్యమయిన గతిగాఁగల

మహాత్మానః=పూజ్యమయిన మనస్సుగలవారలు; దేవగంధర్వగోలోకాన్=దేవలోకమును గంధర్వలోకమును గోలోకమును;అపరాన్= ఇతరములయినలోకములను; తథా=అట్లు; బ్రహ్మలోకం=బ్రహ్మలోకమును; ప్రాప్నువంతి=పొందుచున్నారు.

తలిదండ్రులకు విమనక శుశ్రూష సేయుచుండుమహాత్ములు, దేవలోకమును గంధర్వలోకమును గోలోకమును ఇతరలోకములనుంబొంది, అట్లుక్రమముగా బ్రహ్మలోకంబునొందుదురు. అని, తాత్పర్యము.

స మాం పితా యథాశాస్తి సత్యధర్మపథే స్థితః
తథావర్తితు మిచ్ఛామి సహిధర్మ స్సనాతనః. ౩౮

టీక॥సః=అట్టి;పితా=తండ్రి; సత్యధర్మపథే=సత్యమునుధర్మమును కల్గించునట్టిమార్గమునందు;స్థితః= ఉన్నవాఁడై;యథా=ఎట్లు; మాం =నన్ను;ఆశాస్తి= ఆజ్ఞాపించుచున్నాఁడో; తథా=అట్లు; వర్తితుం=ఉండుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.సః = అది; సనాతనః= నిత్యమయిన ; ధర్మో హి=ధర్మముగదా!

అట్టి నాతండ్రిసత్యమును ధర్మమునవలంబించి నన్నేమియాజ్ఞాపించుచున్నాఁడో, నేనాప్రకారము నడుచుకొనఁగోరుచున్నాను;అట్లు,తండ్రియాజ్ఞనునువర్తించుట,సనాతనంబగు ధర్మము. అని, తాత్పర్యము.

మమ సన్నా మతిస్సీతే త్వాం నేతుం దండకావనమ్
వసిష్యామీతి సా త్వం మా మనుయాతుం సునిశ్చితా. ౩౯

టీక॥సీతే=సీతా! త్వాం=నిన్ను; దండకావనం=దండకారణ్యమును; నేతుం=పొందించుటకు; మమ =నాయొక్క; మతిః=బుద్ధి; సన్నా=క్షీణించియుండినది.సా=అట్టి;త్వం=నీవు; "వసిష్యామి=(అడవిలో)ఉండెదను" ఇతి= అని;మాం=నన్ను; అనుయాతుం=వెంబడించుటకు; సునిశ్చితా=చక్కఁగానిశ్చయించుకొన్నావు.

సీతా!నాకింతకుమున్ను, నిన్నుదం

దకారణ్యమునకుఁగొనిపోవచ్చునని తోఁచలేదు;అయితే,నీవు పతివ్రతవు గావున, "నేనును వనములో నీయుండెదను" అని,నాతో నడవికి వచ్చుటకు నిశ్చయించుకొన్నావు;ఇప్పుడు నీభావము తెలిసినది గావున,నిన్నుఁదోడ్కొనిపోయెదను.

అని, తాత్పర్యము.

సా హి సృష్టా నవద్యాంగి వనాయ మదిరేక్షణే
అనుగచ్ఛస్వ మాం భీరు సహధర్మచరీ భవ. ౪౦

టీక॥మదిరేక్షణే=మదముగప్పినకన్నులుగలసీతా!సా= అస్తు;అనవద్యాంగి= నిందింపఁదగనియవయవములుగల;త్వం (అధ్యాహృతము)=నీవు;వనాయ= అరణ్యముకొఱకు; సృష్టాహి=సృజింపఁబడినావుగదా!భీరు=భయపడుస్వభావముగలదానా!మాం=నన్ను; అనుగచ్ఛస్వ=వెంబడింపుము. సహధర్మచరీ = కూడధర్మమునాచరించునది,భవ=అగుము.

మదముగప్పినకన్నులుగలసీతా! నీవు, వనంబులోనుండుటకై యె, యిట్టియతిసుందరములయిన సుకుమారావయవంబులతోఁబుట్టియున్నావుగాఁబోలు; నీవు భయపడు స్వభావంబు గలదానవయ్యును, నాతోఁగూడరమ్ము,నీకుభయమునుగలుగదు; నాతోడ నచ్చట నీధర్మమునాచరించుచుండుము.

అని, తాత్పర్యము.

సర్వథా సదృశం సీతే మమ స్వస్య కులస్య చ
వ్యవసాయ మతిక్రాంతా కాంతే త్వ మతిశోభనమ్. ౪౧

టీక॥కాంతే = మనోహరురాలవగు;సీతే=సీతా!త్వం=నీవు;సర్వథా= అన్నివిధంబులను; మమ=నాయొక్క,యు;స్వస్యచ = నీయొక్కయు; కులస్య=వంశమునకు;సదృశం = సమానమయిన; అతిశోభనం=మిక్కిలియుమంగళకరమగు;వ్యవసాయం= ప్రయత్నమును;అతిక్రాంతా= చక్కఁగాఁబొందినావు.

మనోహరంబగు రూపంబుగల సీతా! నీకిప్పుడు,భర్తననుసరింపవలెనను నీప్రయత్నముగలిగియున్నదే; ఇది,

నీకులంబునకు నాకులంబునకును దగినది; మిక్కిలియు మంచిది. అని, తాత్పర్యము.

ఆరభస్వ శుభశ్రోణి వనవాసక్షమాః క్రియాః
నేదానీం త్వదృతే సీతే స్వర్గోఽపి మమ రోచతే. ౪౨

టీక॥ శుభశ్రోణి = సుందరములయి నపిఱుందులు గలదానా? వనవాసక్షమాః = వనవాసంబునకుఁదగిన; క్రియాః = కార్యములను; ఆరభస్వ = ఆరంభింపుము. సీతే = సీతా! ఇదానీం = ఇప్పుడు; త్వదృతే = నిన్నువిడిచి; స్వర్గోఽపి = స్వర్గమయినను; మమ = నాకు; నరోచతే = రుచింపదు.

సుందరములయిన పిఱుఁదులు గల సీతా! నీవింక వనవాసంబునకుఁ గావలసిన కార్యంబులం జేయుము; ఇఁక, నీవు లేకున్న, నాకు స్వర్గమయినను, ఇష్టము గాదు.

అని, తాత్పర్యము.

బ్రాహ్మణేభ్యశ్చ రత్నాని భిక్షుకేభ్యశ్చ భోజనమ్
దేహి చాశంసమానేభ్యః సంత్వరస్వ చ మాచిరమ్. ౪౩

టీక॥ బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణుల కొఱకు; రత్నానిచ = మణులను; భిక్షుకేభ్యః = భిక్షమెత్తుకొను వాండ్రకొఱకు; భోజనంచ = భోజనమును; ఆశంసమానేభ్యశ్చ = యాచించువారలకును; దేహి = ఇమ్ము. సంత్వరస్వచ = త్వరపడుము. చిరం = ఆలస్యము; మా = కాదు.

బ్రాహ్మణులకు నానావిధమణులను భిక్షుకులకు యథేష్టముగా భోజనమును సంగుము; మఱియు నెవ్వరెవ్వరు దేనియాచింతురో దానినంతయు వారలకిమ్ము; జాగుసేయకుము; త్వరపడుము. అని, తాత్పర్యము.

భూషణాని మహార్హాణి వరవస్త్రాణి యానిచ
రమణీయాశ్చ యే కేచి త్క్రీడార్థాశ్చాప్యుపస్కరాః. ౪౪
శయనీయాని యానాని మమ చాన్యాని యానిచ
దేహి స్వభృత్యవర్గస్య బ్రాహ్మణానా మనంతరమ్. ౪౫

టీక॥ మమచ = నాయొక్కయు; త్వచ (అధ్యాహృతము) = నీయొక్కయు; మహార్హాణి = శ్రేష్ఠములయిన; భూషణాని = సొమ్ములును; వరవస్త్రాణి = శ్రేష్ఠములయిన వస్త్రములును; యాని (సంతి) = ఏవిగలవో; తాని (అధ్యాహృతము) చ = వానిని; రమణీయాశ్చ = సుందరములయినవియు; క్రీడార్థాశ్చ = క్రీడించుటయె ప్రయోజనముగాఁగలవియునగు; ఉపస్కరాః = ఉపకరణములు; కేచిత్ = కొన్ని; యే (సంతి) = ఏవిగలవో; తాన్ (అధ్యాహృతము) అపి = వానిని; శయనీయాని = పాన్పులును; యానాని = వాహనములును; అన్యాని = ఇతరములయినవియు; యాని (సంతి) = ఏవిగలవో; తాని (అధ్యాహృతము) చ = వానిని; బ్రాహ్మణానాం = బ్రాహ్మణులకు; అనంతరం = పిమ్మట; స్వభృత్యవర్గస్య = మనసౌకరులసమూహమునకు; దేహి = ఇమ్ము.

అట్లు బ్రాహ్మణులకు దానముచేసినపిమ్మట, వెలగలసొమ్ములను శ్రేష్ఠములైనవస్త్రములనుసుందరములును క్రీడింపనుపయోగించునవియునగునుపకరణములనుఁ బాన్పులనుయానములను, నావిగానివి గాని, యేవేవియున్నవో, వానన్నిటిని, మనభృత్యులకిమ్ము. అని, రాముండుసీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అనుకూలంతు సా భర్తుర్జ్ఞాత్వా గమన మాత్మనః
క్షిప్రం ప్రముదితా దేవీ దాతు మేవోప చక్రమే. ౩౮

టీక॥ సా = ఆ; దేవీ = సీతాదేవి; ఆత్మనః = తనయొక్క; గమనం = అరణ్యమునకుఁబోవుట; భర్తుః = పెనిమిటికి; అనుకూలం = అనుకూలమయినదానిఁగా; జ్ఞాత్వాతు = తెలిసికొన్నంతనే; ప్రముదితా = మిక్కిలియుసంతోషించినదై; క్షిప్రం = శీఘ్రముగా; దాతుమేవ = ఇచ్చుటకే; ఉపచక్రమే = ప్రారంభించెను.

సీతాదేవి, తానరణ్యమునకువచ్చుటకుఁ దనపెనిమిటిసమ్మతించుటను దెలిసికొన్నంతనే, మహాసంతోషంబునొంది, శీఘ్రముగాఁ, బెనిమిటిచెప్పినట్లు, దానములు సేయనారంభించెను,

అని, తాత్పర్యము.

తతః ప్రహృష్టా ప్రతిపూర్ణమానసా
యశస్వినీ భర్తు రవేక్ష్య భాషితమ్
ధనాని రత్నానిచ దాతు మంగనా
ప్రచక్రమే ధర్మభృతాం మనస్వినీ. ౪౭

టీక॥తతః=అటుపిమ్మట; యశస్వినీ=అధికమయినకీర్తిగలదియును; మనస్వినీ = మంచిమనస్సుగలదియునగు; అంగనా=సీతాదేవి; భర్తుః=పెనిమిటియొక్క; భాషితం = మాటను; అవేక్ష్య=చూచి; ప్రహృష్టా=సంతసించినదై; ప్రతిపూర్ణమానసా= నిండినమనస్సుగలదై; ధర్మభృతాం= ధర్మమునుభరించువారలకు, ధార్మికులగువారికనుట; ధనాని=ధనములను; రత్నాని=మణులను; దాతుం=ఇచ్చుటకు; ప్రచక్రమే=ఆరంభించెను.

అంత, మహాకీర్తిగలదియుమంచిమనస్సుగలదియునగు నాసీతాదేవి, రాముండుచెప్పినమాటనువిని, మహాసంతోషంబునొంది, మనంబునవేఱుయోచనసేయక, ధార్మికులగువారలకు, ధనంబులనురత్నంబులను, యథేష్టంబుగా నొసంగనారంభించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండత్రింశసర్గటీక,
ముగిసినది.



౩౧

ఏకత్రింశసర్గప్రారంభః.

ఏవం శ్రుత్వాతు సంవాదం లక్ష్మణః పూర్వ మాగతః
బాష్పపర్యాకులముఖ శ్శోకం సోఢు మశక్నువన్. ౧

స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః
సీతా ముపాచాఽతియశా రాఘవం చ మహావ్రతమ్. ౨

టీక॥పూర్వం=మును; ఆగతః=వచ్చిన;అతియశాః=అధికమయినకీర్తిగల; రఘునందనః= రఘువంశములోఁబుట్టినవారిసంతసింపఁజేయునట్టి; సః=ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ఏవం=ఇట్లు; సంవాదం=సీతారాములుమాటలాడుటను; శ్రుత్వాతు= విన్నంతనే; బాష్పపర్యాకులముఖః= కన్నీళ్లచేనిండినముఖముగలవాఁడై; శోకం= దుఃఖమును; సోఢుం=ఓర్చుటకు; అశక్నువన్=చాలనివాఁడై; భ్రాతుః=అన్నయొక్క; చరణౌ=పాదములను; గాఢం=గట్టిగా; నిపీడ్య= పట్టుకొని; సీతాం= సీతనుగూర్చియు; మహావ్రతం=పూజ్యమయినవ్రతముగల; రాఘవంచ=రామునిగూర్చియు; ఉవాచ=చెప్పెను.

అప్పటికి రామునితోఁగూడవచ్చియున్న,మహాకీర్తిశాలియగులక్ష్మణుండు, అంతవఱకు,సీతకునురామునకును జరగిన సంవాదమునువిని, "తనదేహములోనర్ధమయినసీతవచ్చుటకునుబహుకష్టంబున రాముం డొప్పుకొన్నాఁడే, ఇంకనాకేమిచెప్పనో" అని,భయపడి, కన్నుల్నిండనీళ్లుగాఱఁగా, దుఃఖంబుఁబట్టఁజాలక, అన్నగారిపాదంబులనుగట్టిగాఁబట్టుకొని,సీతను, రామునింజూచి యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

యది గంతుం కృతా బుద్ధి ర్వనం మృగగజాయుతమ్
అహం త్వా నుగమిష్యామి వన మగ్రే ధనుర్ధరః. ౩

టీక॥మృగగజాయుతం=మృగములతోనుఏనుంగులతోనుగూడిన;వనం=అడవింగూర్చి;గంతుం=పోవుటకు; బుద్ధిః=తలంపు;కృతాయది= చేయఁబడినదగునేని;అహం=నేను;అగ్రే=ముందట; ధనుర్ధరః=విల్లుధరించినవాఁడై;వనం=అడవినిగూర్చి; త్వా=నిన్ను; అనుగమిష్యామి=వెంబడించెదను.

మృగములు నేనుంగులు వ్యాపించియుండువనంబునకుఁ బోవలసినదేయని,నిర్ణయింతువేని,. నేనునీకుముందుధనుర్ధరుండనై, నిన్ను వెంబడించివచ్చెదను. అని,తాత్పర్యము.

మయా సమేతో రణ్యాని బహూని విచరిష్యసి
పక్షిభి ర్మృగయూథైశ్చ సంఘుష్టాని సమంతతః. ౪

టీక॥త్వం=నీవు;మయా= నాతో; సమేతః=కూడినవాఁడవై ;పక్షిభిః=పక్షులచేతను; మృగయూథైశ్చ=మృగములయొక్క-సమూహముల చేతను; సమంతతః=అంతటను ; సంఘుష్టాని=ధ్వనింపఁజేయఁబడినట్టి;బహూని= పెక్కు-లయిన; అరణ్యాని= అడవులను; విచరిష్యసి=తిరుగఁగలవు.

నీవు, నాచే సేవింపఁబడుచుఁ, బక్షులును మృగసమూహములును ధ్వనింపఁగా మనోహరంబులయి యుండు పెక్కు-డవులందిరుగఁగలవు.

అని, తాత్పర్యము.

న దేవలోకా క్రమణం నామరత్వ మహం వృణే
ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా. ౫

టీక॥అహం=నేను; త్వయావినా=నిన్నువిడిచి; దేవలోకాక్రమణం= దేవలోకమునాక్రమించుటను; నవృణే=కోరను . అమరత్వం= దేవతయగుటను; న(వృణె)=కోరను . లోకానాం=లోకములయొక్క- ; ఐశ్వర్యం వాపి= ప్రభుత్వమును; నకామయే=కోరను.

నీవులేనిచో, నాకు, దేవలోకముగాని, దేవత్వముగాని , సమస్తలోకములకును బ్రభుత్వముగాని, ఏమియు నక్క-అలేదు. అని,లక్ష్మణుండు రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం బ్రువాణ స్సౌమిత్రి ర్వనవాసాయ నిశ్చితః
రామేణ బహుభి స్సాంత్వై ర్నిషిద్ధః పునరబ్రవీత్. ౬

టీక॥ సౌమిత్రిః=సుమిత్రకొడుకైన లక్ష్మణుడు; వనవాసాయ = వనంబులోనుండుటకొఱకు ; నిశ్చితః=నిశ్చయించుకొన్నవాఁడై; ఏవం= ఇట్లు; బ్రువాణః=చెప్పుచు; రామేణ= రాముని చేత; బహుభిః=పెక్కు-లయి

న; సాంత్వైః=సామవాక్యములచేత; నిషిద్ధః=వలదని చెప్పఁబడినవాఁడై; పునః=మఱల; అబ్రవీత్=చెప్పెను.

లక్ష్మణుండు, తానును, రాముని వెంటవనంబునకుంబోకనిశ్చయించియీప్రకారము చెప్పి, రాముండు మంచి మాటలతో వలదని చెప్పఁగా, మఱల, రామునితో నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అనుజ్ఞాతశ్చ భవతా పూర్వమేవ య దస్మ్యహమ్
కి మిదానీం పున రిదం క్రియతే మే నివారణమ్. ౭

టీక॥ యత్=ఏకారణమువలన; అహం=నేను; పూర్వమేవ=మునుపే; భవతా=నీచేత; అనుజ్ఞాతశ్చ=అనుమతింపఁబడినవాఁడనే; అస్మి=అగుచున్నానో; తత్ (అధ్యాహృతము)=ఆకారణమువలన; పునః=మఱల; మే=నాయొక్క; నివారణం=అడ్డగించుట; క్రియతే=చేయఁబడుచున్నది! ఇదం=ఇది; కిం=ఏమి?

నీవుమునుపే, నేనువనంబునకు నీతో వచ్చుట కనుజ్ఞ యిచ్చియేయున్నావు; అట్లుండఁగా, మఱల నన్నువనంబునకు రావలదని చెప్పుచున్నావే! ఇదియేమి?

అని, తాత్పర్యము.

యదర్థం ప్రతిషేధో మే క్రియతే గంతు మిచ్ఛతః
ఏత దిచ్ఛామి విజ్ఞాతుం సంశయోహి మమానఘ. ౮

టీక॥ అనఘ=పాపములేనిరాముఁడా! యదర్థం=ఎందుకొఱకు; గంతుం=పోవుటకు, వచ్చుటకనుట; ఇచ్ఛతః=కోరుచున్న; మే=నాకు; ప్రతిషేధః=అడ్డి; క్రియతే=చేయఁబడుచున్నదో; ఏతత్=దీని; విజ్ఞాతుం=తెలిసికొనుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను; మమ=నాకు; సంశయోహి=సందేహముగదా!

పాపములేనిరాముఁడా! నేనునీతో వనంబునకు వచ్చుట కిచ్చించియుండఁగా, నన్నురావలదని చెప్పుచున్నావే; ఇదియేల? దీనికిఁగారణమునాకుఁజెప్పవలయును; నాకుసంశయముగల్గియున్నది. అని, లక్ష్మణుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతో ౽ బ్రవీ న్మహాతేజా రామో లక్ష్మణ మగ్రతః
స్థితం ప్రాగ్గామినం వీరం యాచమానం కృతాంజలిమ్. ౯

టీక॥తతః=అటుపిమ్మట; మహాతేజాః= అధికమయినపరాక్రమముగల; రామః=రాముఁడు;అగ్రతః = ముందట;స్థితం= ఉన్నవాఁడును;ప్రాగ్గామినం=ముందు కేఁబోవువాఁడును; వీరం= పరాక్రమంబుగలవాఁడును;యాచమానం= ప్రార్థించుచున్నవాఁడును;కృతాంజలిం = చేయఁబడిన చేమోడ్పుగలవాఁడునగు;లక్ష్మణం= లక్ష్మణుని గూర్చి;అబ్రవీత్=పలికెను.

అంత, మహాపరాక్రమశాలియగు రాముండు,తనముందటఁ జేతులు మొగిడ్చుకొని "నేనునువనంబునకువచ్చెదను దీసికొనిపొమ్మని" ప్రార్థించుచు నిలుచున్నవాని, ఎట్టికష్టమునందును ఎంతమాత్రమును వెనుకకుఁదిరుగనట్టిపరాక్రమవంతునిలక్ష్మణునింజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

స్నిగ్ధో ధర్మరతో వీర స్సతతం సత్పథే స్థితః
ప్రియః ప్రాణసమో వశ్యో భ్రాతాచాపి సఖాచ మే. ౧౦

టీ॥త్వం(అధ్యాహృతము)=నీవు;స్నిగ్ధః=మంచిమనసుగలవాఁడవు.ధర్మరతః=ధర్మమునందాసక్తిగలవాఁడవు. వీరః=పరాక్రమశాలివి.సతతం= ఎల్లప్పుడును;సత్పథే=మంచిమార్గమునందు; స్థితః=ఉన్నవాఁడవు. మే= నాకు; ప్రియః=సంతోషముగల్గించువాఁడవు . ప్రాణసమః= ప్రాణంబులతో సరియైనవాఁడవు. వశ్యః=అధీనుండవు. భ్రాతాచాపి= తమ్ముఁడవును . సఖాచ= స్నేహితుండవును.

నీవు,మంచిమనసుగలవాఁడవు;ధార్మికుండవు, పరాక్రమశాలివి; ఎల్లప్పుడును సన్మార్గమునందె ప్రవర్తించువాఁడవు; మఱియునాకుఁ బ్రియుండవు; ప్రాణసముండవు; వశ్యుండవు; తమ్ముఁడవు;స్నేహితుండవును; గావున,నీవునాతోఁగూడవత్తువేని నాకేమొసౌఖ్యమే;అందుకుసందేహములేదు. అని,తాత్పర్యము.

మయా ద్య సహ సౌమిత్రే త్వయి గచ్ఛతి తద్వనమ్

కో భరిష్యతి కౌసల్యాం సుమిత్రాంవా యశస్వినీమ్. ౧౧

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా! అద్య=ఇప్పుడు; త్వయి=నీవు; మయాసహ=నాతోఁగూడ; తత్=ఆ;వనం=అడవినిగూర్చి; గచ్ఛతి= పోఁగా,రాఁగాననుట;కః=ఎవ్వఁడు; కౌసల్యాం=కౌసల్యనుగాని;యశస్వినీం=అధికమయినకీర్తిగల;సుమిత్రాంవా=సుమిత్రనుగాని;భరిష్యతి=పోషించును.

లక్ష్మణుఁడా!ఇప్పుడునీవునాతోనడవికివత్తువేని,యటుపిమ్మట, కౌసల్యను సుమిత్రను, వీరలనిర్వురనెవ్వరువిచారింతురు?అట్టుగావున, వారలపోషణమునకై,నిన్నురావలదనిచెప్పినాను.

అని, తాత్పర్యము.

అభివర్షతి కామైర్యః పర్జన్యః పృథివీ మివ
స కామపాశపర్యస్తో మహాతేజా మహీపతిః. ౧౨

టీక॥యః=ఎవ్వఁడు;పృథివీం=భూమిని; పర్జన్యఇవ=ఇంద్రుండుంబోలె; కామైః=కోరఁబడుపదార్థములచేత; అభివర్షతి=వర్షించునో; సః=అట్టి; మహాతేజాః=అధికమయిన పరాక్రమముగల;మహీపతిః=భూమికిఁబ్రభువగు దశరథుఁడు;కామపాశపర్యస్తః= కామమనుత్రాటిచేఁ జుట్టుకొనఁబడినవాఁడు.

భూమిమీఁదంబర్జన్యుండు వర్షించునట్లు,తనవారలకోర్కులన్నియుఁ దీర్చునట్టి పరాక్రమశాలి దశరథమహారాజు,ఇప్పుడిట్లు,కైకేయికిలోఁబడి,కామపాశంబులఁ జిక్కుకొనియున్నాఁడు. అని,తాత్పర్యము.

సా హి రాజ్య మిదం ప్రాప్య నృపస్యాశ్వపతే స్సుతా
దుఃఖితానాం సపత్నీనాం న కరిష్యతి శోభనమ్. ౧౩

టీక॥నృపస్య=రాజయిన; అశ్వపతేః= కేకయరాజుయొక్క; సుతా=కొమార్తెయగు;సా=ఆకైకేయి; ఇదం=ఈ;రాజ్యం=భారతవనమును;ప్రాప్య=పొంది; దుఃఖితానాం=దుఃఖముపొందియుండు; సపత్నీనాం=చవతుల

కు; శోభనం=మంచిని; నకరిష్యతి=చేయదు.

అశ్వపతియగు కేకయరాజుకొమార్తెయయినయా కైకేయి, యీ రాజ్యమునంతయుఁబొంది, యటుమీఁద, దుఃఖితలయినతనసవతుల కెంతమాత్రమునుమంచి సేయదు. అని, తాత్పర్యము.

న స్మరిష్యతి కౌసల్యాం సుమిత్రాంచ సుదుఃఖితామ్
భరతో రాజ్య మాసాద్య కైకేయ్యాం పర్యవస్థితః. ౧౪

టీక॥భరతః = భరతుండు; రాజ్యం=దొరతనమును;ఆసాద్య = పొంది;కైకేయ్యాం=కైకేయియందు, కైకేయిమతమందనుట;పర్యవస్థితః= ఉన్నవాఁడై;కౌసల్యాం=కౌసల్యను; సుదుఃఖితాం= మిక్కిలియుదుఃఖమునొందిన;సుమిత్రాంచ= సుమిత్రను;నస్మరిష్యతి=తలంపఁడు.

భరతుండును, దొరతనమునొంది, రాజ్యగర్వంబునను, గైకేయిమతంబునందుండవలసినవాఁడగుటవలనను, దుఃఖితలయిన కౌసల్యాసుమిత్రల, నెంతమాత్రముతలంపఁడు.

అని, తాత్పర్యము.

తా మార్యాం స్వయమేవే హ రాజానుగ్రహణేనవా
సౌమిత్రే భర కౌసల్యా ముక్త మర్థ మిమం చర. ౧౫

టీక॥సౌమిత్రే=లక్ష్మణుఁడా! త్వం (అధ్యాహృతము)=నీవు; ఇహ=ఇచ్చట;రాజానుగ్రహణేనవా= దశరథమహారాజుయొక్క యనుగ్రహముచేతఁగాని;స్వయమేవ=నీయంతనెగాని; ఆర్యాం=పూజ్యురాలగు; తాం=ఆ;కౌసల్యాం=కౌసల్యను, (ఇదిసుమిత్రకునుపలక్షణము) సుమిత్రను;భర= పోషింపుము.ఉక్తం=చెప్పఁబడిన;ఇమం=ఈ;అర్థం= కార్యమును;చర = చేయుము.

లక్ష్మణుఁడా!నీవిచ్చటనెయుండి, దశరథునియనుగ్రహంబుసంపాదించిగాని, లేక,నీవైయెగాని,పూజ్యులగునాకౌసల్యాసుమిత్రలం బోషింపుచుండుము; బదులుచెప్పకచెప్పినట్లు సేయుము.

అని, తాత్పర్యము.

ఏవం మమ చ తే భక్తి ర్భవిష్యతి సుదర్శితా
ధర్మజ్ఞ గురుపూజాయాం ధర్మశ్చా ప్యతులో మహాన్. ౧౬

టీక॥ధర్మజ్ఞ=ధర్మము నెఱింగినలక్ష్మణుఁడా!ఏవం=ఇట్లు;మమ= (సప్తమ్యర్థ మందుషష్ఠి)నాయందు; తే=నీయొక్క; భక్తిశ్చ=భక్తియును; సుదర్శితా=చక్కఁగాచూపఁబడినది;భవిష్యతి=కాఁగలదు.గురుపూజాయాం=గురుజనముయొక్క పూజించుట యందు; అతులః=సరిలేనిదియు;మహాన్= అధికమయినదియునగు;ధర్మశ్చ= ధర్మమును; భవిష్యతి(అధ్యాహృతము)=కలుగును.

లక్ష్మణుఁడా!నీవుసమస్తధర్మంబుల నెఱింగినవాఁడవు;నీవీప్రకారము సేయుదువేని, నీకునాయందుంగల భక్తినిం జూపినట్లగును; మఱియు, మాతృపూజవలన, న సదృశమయిన ధర్మమునుం బొందుదువు.అని, తాత్పర్యము.

ఏవం కురుష్వ సౌమిత్రే మత్కృతే రఘునందన
అస్మాభి ర్విప్రహీణాయా మాతు ర్నో న భవే త్సుఖమ్. ౧౭

టీక॥రఘునందన=రఘువంశమునంబుట్టినవారలసంతసింపఁజేయునట్టి; సౌమిత్రే=లక్ష్మణుఁడా!మత్కృతే= నాకుఁగా;ఏవం=ఈప్రకారము ; కురుష్వ=చేయుము. అస్మాభిః= మనచేత; విప్రహీణాయాః=విడువఁబడిన; నః=మనయొక్క;మాతుః=తల్లికి; సుఖం=సౌఖ్యము;నభవేత్=కలుగదు.

లక్ష్మణుఁడా! నీధార్మికత్వము జూచి,మనవంశమునఁబుట్టిన వారలందఱుసంతసింతురు; నాకుఁగా, నేనుజెప్పినట్లుసేయుము; మనములేకున్నచో మనతల్లికెంతమాత్రముసుఖము గలుగదు.అని, రాముఁడులక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు రామేణ లక్ష్మణ శ్శ్లక్ష్ణయా గిరా
ప్రత్యువాచ తదా రామం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్. ౧౮

టీక॥ వాక్యజ్ఞః=మాటల నెఱింగినట్టి; లక్ష్మణః=లక్ష్మణుఁడు; రామేణ=

రామునిచేత; శ్లక్ష్ణయా= మనోహరమయిన; గిరా=వాక్యముతో; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనం తనే,తదా=అప్పుడు; వాక్యకోవిదం=మాటలయందుఁ బండితుండగు; రామం=రామునిఁ;ప్రత్యువాచ=బదులు చెప్పెను.

అంతఁజక్కఁగామాటలాడఁగలిగినలక్ష్మణుండు; ఈప్రకారమురామునిమధురవచనంబునంజెప్పినమాటలను విని,యంత, మాటలాడుటలోఁ బండితుండగురామునిఁజూచి,యిట్లని, బదులు చెప్పెను. అని, తాత్పర్యము.

తవైవ తేజసా వీర భరతః పూజయిష్యతి
కౌసల్యాంచ సుమిత్రాంచ ప్రయతో నాత్ర సంశయః. ౧౯

టీక॥వీర= పరాక్రమశాలివగురాముఁడా!తవ=నీయొక్క; తేజసైవ=పరాక్రమముచేతనే;భరతః = భరతుఁడు;కౌసల్యాంచ = కౌసల్యను;సుమిత్రాంచ=సుమిత్రను; ప్రయతః=శ్రద్ధగలవాఁడై; పూజయిష్యతి=పూజింపఁగలఁడు.అత్ర=ఈవిషయమునందు; సంశయః=సందేహము;న=లేదు.

రాముఁడా!నీవుమహాపరాక్రమశాలివి;నీపరాక్రమంబునకేభయపడి, భరతుండు,కౌసల్యనుసుమిత్రను, శ్రద్ధతోఁజక్కఁగాబూజింపుచుండును; ఇందుకు సందేహములేదు.

అని, తాత్పర్యము.

కౌసల్యా బిభృయా దార్యా సహస్రమపి మద్విధాన్
యస్యా స్సహస్రం గ్రామాణాం సంప్రాప్త ముపజీవినామ్. ౨౦

టీక॥యస్యాః=ఏకౌసల్యవలన; ఉపజీవినాం=ఆశ్రితులకు, ఆశ్రితులచేతననుట; గ్రామాణాం=గ్రామములయొక్క;సహస్రం=వేయి; సంప్రాప్తం=పొందఁబడినదో ; సా (అధ్యాహృతము)=అట్టి॥ఆర్యా= పూజ్యయయిన; కౌసల్యా=కౌసల్య; మద్విధాన్=నావంటివారలను;సహస్రమపి=వేయింటినైనను;బిభృయాత్=భరించును.

మఱియుఁగౌసల్యను మఱియొకరు పోషింపవలయునా? ఆబిడప్రసాదంబునంజేసి, ఆబిడనాశ్రయించినవారలు,

వేనవేలుగా గ్రామంబులనొందినారు; అబిడ, నావంటివారలవేయిమందినైనం గాపాడఁగలదు. అని, తాత్పర్యము.

తదాత్మ భరణే నైవ మమ మాతు స్తథైవచ
పర్యాప్తా మద్విధా నాంచ భరణాయ యశస్వినీ. ౨౧

టీక॥ తత్=అందువలన; యశస్వినీ=అధికమయినకీర్తిఁగలకౌసల్య; ఆత్మభరణేచ=తనపోషణమునందును; మమ=నాయొక్క; మాతు స్తథైవచ=తల్లియయినసుమిత్రయొక్కయు; మద్విధానాంచ=నావంటివారలయొక్కయు; భరణాయ=పోషణముకొఱకు; పర్యాప్తా=చాలినది.

అట్లగుటంజేసి, మహాకీర్తిశాలినియగునాకౌసల్యాదేవి, తన్నును, నాతల్లిసుమిత్రను, నావంటివారలననేకులను, బోషించుకొనంగలదు.

అని, తాత్పర్యము.

కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే
కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే. ౨౨

టీక॥ మాం=నన్ను; అనుచరం=సేవకునిఁగా; కురుష్వ=చేసికొనుము. ఇహ=ఈవిషయమునందు; వైధర్మ్యం=ధర్మవిరోధము. నవిద్యతే=ఉండదు. అహం=నేను; కృతార్థః=నెఱవేఱిన పనిగలవాఁడను; భవిష్యామి=అయ్యెదను. తవ=నీయొక్క; అర్థశ్చ=పనియును; ప్రకల్పతే=సిద్ధించుచున్నది.

నన్ను సేవకునిఁగాఁజేసికొనుము; ఇట్లుచేయుటవలన, నధర్మము గలుగదు; దీనిచే నేనును గృతార్థుఁడనయ్యెదను; నీకును, నేను జేయుశుశ్రూషవలన నెంతప్రయోజనముగలుగును.

అని, తాత్పర్యము.

ధను రాదాయ సశరం ఖనిత్ర పిటకాధరః
అగ్రతస్తే గమిష్యామి పంథాన మనుదర్శయన్. ౨౩

టీక॥అహం (అధ్యాహృతము)—నేను; సశరం= బాణముతోఁగూడిన; ధనుః=వింటిని;ఆదాయ=తీసికొని;ఖనిత్రపిటకాధరః= గుద్దలినిచిన్నగంపనుధరించినవాఁడై; తే—నీయొక్క;అగ్రతః=ముందట; పంథానం=మార్గమును;అనుదర్శయన్=చూపుచు;గమిష్యామి=పోయెదను.

నేను,ధనుర్బాణంబులందాల్చి, గుద్దలినిజిన్న గంపనుందీసికొని, నీకుముందుగామార్గంబుఁ జూపుచుఁబోయెదను. అని, తాత్పర్యము.

ఆహరిష్యామి తే నిత్యం మూలానిచ ఫలానిచ
వన్యాని యాని చాన్యాని స్వాహారాణి తపస్వినామ్. ౨౮

టీక॥అహం(అధ్యాహృతము)—నేను; తే—నీకొఱకు;నిత్యం=ఎల్లప్పుడును; మూలాని=గడ్డలను; ఫలానిచ= పండ్లను;అన్యాని=ఇతరములైన;వన్యాని—అడవియందుఁబుట్టిన;తపస్వినాం—తపసులయొక్క; స్వాహారాణి = మంచి యాహారములు; యాని=ఏవో; తాని (అధ్యాహృతము) = వానిని; ఆహరిష్యామి=తీసికొనివచ్చెదను.

నేను,నీకెల్లప్పుడును, గడ్డలనుఫలంబులను,మఱియుఁ దపసులింకంబుచ్చుకొనుమంచియాహారంబులను, గొనితెచ్చి, యిచ్చుచుండెదను.అని, తాత్పర్యము.

భవాంస్తు సహవైదేహ్యా గిరిసానుషు రంస్యతే
అహం సర్వం కరిష్యామి జాగ్రతస్స్వపతశ్చ తే. ౨౯

టీక॥భవాంస్తు=నీవును;వైదేహ్యాసహ=సీతతోఁగూడ; గిరిసానుషు=కొండనెత్తములందు;రంస్యతే=క్రీడించుచుండఁగలవు. తే=నీవు; జాగ్రతః=మేలుకొనియుండఁగాను;స్వపతశ్చ = నిద్రించియుండఁగాను;అహం=నేను; సర్వం—అన్నిఁటిని;కరిష్యామి=చేయుదును.

నీవును సీతయును, గొండనెత్తములందుఁగ్రీడింపుచుండవచ్చును; నేను,నీవు మేలుకొనియుండునప్పుడును, నీవునిదురవోయియుండునప్పుడును,సమస్తకార్యములనుం జేయుచుండెదను.అని, లక్ష్మణుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రామస్త్వనేన వాక్యేన సుప్రీతః ప్రత్యువాచ తం

టీక॥ రామస్తు=రాముండనః అనేన=ఈ; వాక్యేన = మాటచేత; సుప్రీతః= మిక్కిలియు సంతసించినవాండై; తం = ఆలక్ష్మణునిగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

రాముండను, లక్ష్మణుండు చెప్పినమాటకుం బరమసంతోషంబునొంది, అతనింగూర్చి యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

వ్రజా పృచ్ఛస్వ సౌమిత్రే సర్వమేవ సుహృజ్జనమ్. ౧౭

టీక॥ సౌమిత్రే= లక్ష్మణుండా! వ్రజ=పొమ్ము. సుహృజ్జనం= స్నేహితజనమును; సర్వమేవ=అంతను; ఆపృచ్ఛస్వ=వీడ్కొనుము.

లక్ష్మణుండా! అట్లయిన, నీవిప్పుడు పోయి నీస్నేహితుల కందఱకును జెప్పిరమ్ము. అని, తాత్పర్యము.

యేచ రాజ్ఞో దదౌ దివ్యే మహాత్మా వరుణస్స్వయమ్
జనకస్య మహాయజ్ఞే ధనుషీ రౌద్రదర్శనే ౧౮
అభేద్యకవచే దివ్యే తూణీ చాక్షయసాయకౌ
ఆదిత్యవిమలౌ చోభౌ ఖడ్గౌ హేమపరిష్కృతౌ. ౧౯
సత్కృత్య నిహితం సర్వమేతదాచార్యసద్మని
సర్వమాయుధమాదాయ క్షిప్రమావ్రజ లక్ష్మణ. ౨౦

టీక॥ లక్ష్మణ=లక్ష్మణుండా! రాజ్ఞః=రాజయిన; జనకస్య = జనకుని యొక్క; మహాయజ్ఞే= గొప్పయాగమునందు; మహాత్మా = అధికమయిన ప్రభావముగల; వరుణః = వరుణుండు; స్వయం=తానే; ఆవయోః (అధ్యాహృతము)=మనకు; దివ్యే = స్వర్గమునందుంబుట్టిన; రౌద్రదర్శనే= భయంకరమయినచూచుటగల; యే= ఏ; ధనుషీచ=విండ్లను; దివ్యే= స్వర్గమునందుంబుట్టిన; తే (అధ్యాహృతము)=ఏ; అభేద్యకవచే= భేదింపరానికవచములను; యౌ (అధ్యాహృతము)= ఏ; అక్షయసాయకౌ=తఱుఁగులేనిబా

ణములుగల; తూణీచ= అమ్ములపొదులను; ఆదిత్యవిమలౌ= సూర్యుండువలెస్వచ్ఛములయినవియు; హేమపరిష్కృతౌ=బంగారముచే నలంకరింపcబడినవియునగు; యా (అధ్యాహృతము)=ఏ; ఉభౌ=రెండైన; ఖడ్గౌచ= కత్తులను; దదౌ=ఇచ్చెనో; ఏతత్ = ఈయాయుధసమూహము; సర్వం=అంతయు; సత్కృత్య=పూజించి; ఆచార్యసద్మని=ఆచార్యుండగు వసిష్ఠునింటియందు; నిహితం= ఉంచcబడినది. తత్= అట్టి; త్వం=నీవు; ఆయుధం=ఆయుధమును, ఆయుధములననుట; ఆదాయ= తీసికొని; క్షిప్రం=శీఘ్రముగా; ఆవ్రజ=రమ్ము.

లక్ష్మణుcడా! జనకమహారాజుయాగంబున, మహాత్ముండగువరుణుండు, ప్రీతిపూర్వకంబుగా, మనకొసంగిన, దివ్యంబులునుజూచువారలకుభయంకరంబులునగుధనువులును, దివ్యంబులు నభేద్యంబులునగుకవచంబులను, ఎప్పటికిని బాణంబులు తఱుగకుండు నక్షయతూణీరంబులును, బంగారముచే నలంకరింపcబడి సూర్యునిబోలె వెలుంగు ఖడ్గంబులును, వీనన్నిటిని, నేను, ఆచార్యుండగు వసిష్ఠునింట, నుంచియున్నాను; నీవుపోయి, వానినన్నింటినిం దీసికొని, శీఘ్రముగారమ్ము. అని, రాముండు లక్ష్మణునకుcజెప్పెను.

అని, తాత్పర్యము.

స సుహృజ్జన మామంత్ర్య వనవాసాయ నిశ్చితః
ఇక్ష్వాకుగురు మాగమ్య జగ్రాహా యుధ ముత్తమమ్. ౩౦

టీక॥ సః=ఆలక్ష్మణుcడు; వనవాసాయ= అడవిలోనుండుటకొఱకు; నిశ్చితః= నిశ్చయించినవాcడై; సుహృజ్జనం=స్నేహితజనమును; ఆమంత్ర్య= వీడ్కొని; ఇక్ష్వాకుగురుం = ఇక్ష్వాకు వంశములోc బుట్టిన వారలయాచార్యుండగు వసిష్ఠుని; ఆగమ్య=పొంది; ఉత్తమం= శ్రేష్ఠమయిన; ఆయుధం=ఆయుధమును; జగ్రాహ= తీసికొనెను.

అట్లులక్ష్మణుండు, వనంబులోనుండ నిశ్చయించి, స్నేహితుల యొద్దకుcబోయివారలవీడ్కొని, యిక్ష్వాకుకులాచార్యుండైనవసిష్ఠునిగృహంబుననుండు నుత్తమంబులయినయాయుధంబులం దీసికొనివచ్చెను. అని, తాత్పర్యము.

తద్దివ్యం రాజశార్దూలసత్కృతం మాల్యభూషితం
రామాయ దర్శయామాస సౌమిత్రి స్సర్వ మాయుధమ్. ౩౧

టీక॥ సౌమిత్రిః = సుమిత్రకొడుకైన లక్ష్మణుండును; దివ్యం = స్వర్గంబునందుఁ బుట్టినవియును; రాజశార్దూలసత్కృతం = రాజశ్రేష్ఠులచేఁ బూజింపఁబడినవియును; మాల్యభూషితం = పుష్పమాలికలచే నలంకరింపఁబడినదియును గు; తత్ = ఆ; ఆయుధం = ఆయుధసమూహమును; సర్వం = అంతను; రామాయ = రామునికొఱకు; దర్శయామాస = చూపెను.

లక్ష్మణుండు, స్వర్గంబునంబుట్టినవియు, గొప్పరాజులచేఁబూజింపఁబడినవియుఁబుష్పమాలికలచే నలంకృతంబులునగు నాయాయుధంబులనన్నింటిని, రామునకుంజూపెను.

అని, తాత్పర్యము.

తమువాచాత్మవాన్రామః ప్రీత్యా లక్ష్మణ మాగతం

టీక॥ ఆత్మవాన్ = అధికమయినధైర్యముగల; రామః = రాముఁడు; ఆగతం = వచ్చిన; తం = ఆ; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; ప్రీత్యా = సంతోషముచే; ఉవాచ = చెప్పెను.

మహాధైర్యశాలియగు రాముండు, అట్లాయుధంబులం దీసికొనివచ్చినలక్ష్మణుంజూచి, సంతోషించి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కాలే త్వ మాగత స్సౌమ్య కాంక్షితే మమ లక్ష్మణ. ౩౨

టీక॥ సౌమ్య = తిన్ననివాఁడవైన; లక్ష్మణ = లక్ష్మణుఁడా! మమ = నాకు; కాంక్షితే = కోరఁబడిన; కాలే = కాలమునందు; త్వం = నీవు; ఆగతః = వచ్చినావు.

సౌమ్యుండవగులక్ష్మణుఁడా! నేనునీకెదురుసూచుచున్నాను; తగినకాలములో నేనీవునువచ్చినావు.

అని, తాత్పర్యము.

అహం ప్రదాతు మిచ్ఛామి యదిదం మామకం ధనం

బ్రాహ్మణేభ్య స్తపస్విభ్య స్త్వయాసహ పరంతప. ౩౩

టీక॥పరంతప=శత్రువులందపింపఁజేయునట్టిలక్ష్మణుఁడా! మామకం=నాదైన; ఇదం=ఈ; ధనం=ద్రవ్యము; యత్ (అస్తి)=ఏదికలదో; తత్ (అధ్యాహృతము)=దానిని; అహం=నేను; త్వయాసహ=నీతోఁగూడ; బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకొఱకును; తపస్విభ్యః=అధికమయినతపస్సుగలవారలకొఱకును; ప్రదాతుం=ఇచ్చుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

శత్రువులందపింపఁజేయునట్టిలక్ష్మణుఁడా! నేనుసీతోఁగూడ, నాధనమునంతయుఁ, దపస్వులకును బ్రాహ్మణులకు, నివ్వఁగోరుచున్నాను.

అని, తాత్పర్యము.

వసంతీహ దృఢం భక్త్యా గురుషు ద్విజ సత్తమాః
తేషామపిచ మే భూయ స్సర్వేషాంచోప జీవినామ్. ౩౪

టీక॥ఇహ=ఇచ్చట; యే (అధ్యాహృతము)=ఏ; ద్విజసత్తమాః=బ్రాహ్మణశ్రేష్ఠులు; గురుషు=గురువులయందు; దృఢం=మిక్కిలియు; భక్త్యా=భక్తితో; వసంతి=ఉందురో; తేషామపిచ=వారలకును; మే=నాయొక్క; ఉపజీవినాం=ఆశ్రితులకు; సర్వేషాంచ=అందఱకును; భూయః=అధికముగా; ప్రదాతుం, ఇచ్ఛామి(అధ్యాహృతము)=ఇవ్వఁగోరుచున్నాను.

ఇచ్చటనుండుదృఢమయిన గురుభక్తిగలమహాత్ములైనబ్రాహ్మణులకును, నాయాశ్రితులకందఱకును, ఎప్పటికంటెనధికముగా, దానముసేయఁగోరుచున్నాను. అని, తాత్పర్యము.

వసిష్ఠపుత్రంతు సుయజ్ఞమార్యం
త్వ మానయాశు ప్రవరం ద్విజానాం

టీక॥త్వం=నీవు; ద్విజానాం=బ్రాహ్మణులలోపల; ప్రవరం=శ్రేష్ఠుండును; ఆర్యం=పూజ్యుండునగు; వసిష్ఠపుత్రం=వసిష్ఠునికొడుకైన; సుయజ్ఞం

తు=సుయజ్ఞునిమాత్రము; ఆశు=శీఘ్రముగా; ఆనయ=తీసికొనిరమ్ము. సేవిస్వను, బీయి, బ్రాహ్మణశ్రేష్ఠు

డును బూజ్యుండునగు వసిష్ఠపుత్రుండయినసుయజ్ఞునిమాత్రము శీఘ్రముగాఁ బిలుచుకొనిరమ్ము. అని, తాత్పర్యము.

అభిప్రయాస్యామి వనం సమస్తా
నభ్యర్చ్య శిష్టా నపరాన్ ద్విజాతీన్. ౩౫

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను; శిష్టాన్= పెద్దలయిన; అపరాన్= ఇతరులగు; ద్విజాతీన్= బ్రాహ్మణులను; సమస్తాన్=అందఱను; అభ్యర్చ్య= పూజించి; వనం=అడవినిగూర్చి; అభిప్రయాస్యామి=పోయెదను.

నేను, వసిష్ఠపుత్రుండగు నాసుయజ్ఞుని, మఱియు మహాత్ములయినయితరబ్రాహ్మణులనుం బూజించి, యటుపిమ్మట నరణ్యంబునకుంబోయెదను. అని, రాముండు, లక్ష్మణునాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ఏకత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండైకత్రింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

ద్వాత్రింశసర్గప్రారంభః.

తత శ్శాసన మాజ్ఞాయ భ్రాతు శ్శుభతరం ప్రియమ్
గత్వా స ప్రవివేశాశు సుయజ్ఞస్య నివేశనమ్. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; సః= ఆలక్ష్మణుండు; భ్రాతుః= అన్నయొక్క; శుభతరం= మిక్కిలియుమంగళకరంబును; ప్రియం = సంతోషకరంబునగు;

శాసనం=ఆజ్ఞను;ఆజ్ఞాయ=అంగీకరించి;ఆశు=శీఘ్రముగా; గత్వా=పోయి;సుయజ్ఞస్య=సుయజ్ఞునియొక్క; నివేశనం=ఇంటిని; ప్రవివేశ=ప్రవేశించెను.

అంత, నాలక్ష్మణుండు, మంగళకరంబును బ్రియంబునగు తనయన్నగారి యాజ్ఞనుశిరసావహించి, శీఘ్రంబుగా సుయజ్ఞునియింటికింబోయెను. అని, తాత్పర్యము.

తం విప్ర మగ్న్యగారస్థం వందిత్వా లక్ష్మణో బ్రవీత్

టీక॥లక్ష్మణః=లక్ష్మణుఁడు;అగ్న్యగారస్థం= అగ్నిహోత్రగృహములో నున్న;తం=ఆ;విప్రం=బ్రాహ్మణుఁడైనసుయజ్ఞుని;వందిత్వా=నమస్కరించి; అబ్రవీత్=చెప్పెను.

లక్ష్మణుడు, అగ్నిహోత్రగృహంబులోనున్నసుయజ్ఞుంజూచినమస్కరించి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సఖే భ్యాగచ్ఛ పశ్యత్వం వేశ్మ దుష్కరకారిణః. ౨

టీక॥సఖే=స్నేహితుండవయినసుయజ్ఞుఁడా! త్వం=నీవు; దుష్కరకారిణః=ఎవ్వనికినిఁజేయసలవిగానికార్యమునుఁజేయునట్టిరాముని యొక్క; వేశ్మ=ఇంటినిఁగూర్చి; అభ్యాగచ్ఛ=రమ్ము. పశ్య=చూడుము.

స్నేహితుండవగుసుయజ్ఞుఁడా! రాముఁడు వనవాసంబు సేయఁబోవుచున్నాఁడు;నీవిప్పుడతనియింటికివచ్చి, దుష్కరంబయిన యతనికార్యముంజూడుము. అని,లక్ష్మణుఁడు, సుయజ్ఞునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

తత స్సంధ్యా ముపాస్యాశు గత్వా సౌమిత్రిణా సహ
జుష్టం తత్ప్రావిశ ల్లక్ష్మ్యా రమ్యం రామనివేశనమ్. ౩

టీక॥ తతః= అటుపిమ్మట; సః=(అధ్యాహృతము) ఆసుయజ్ఞుండు; ఆశు=శీఘ్రముగా;సంధ్యాం=సంధ్యను; ఉపాస్య=ఉపాసించి; సౌమిత్రిణాసహ=లక్ష్మణునితోఁగూడ; గత్వా=పోయి;లక్ష్మ్యా=లక్ష్మిచేత;జుష్టం=సేవింపఁబడినదియును;రమ్యం=సుందరమునగు;తత్=ఆ;రామనివేశనం=రామునిం

టని;ప్రావిశత్=ప్రవేశించెను.

అంత, నాసుయజ్ఞుండు, శీఘ్రముగా సంధ్యావందనముచేసి, లక్ష్మణునితోడఁ బోయి, లక్ష్మీసంపన్నంబునురమణీయంబునగు రామగృహముం బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

తమాగతం వేదవిదం ప్రాంజలి స్సీతయాసహ
సుయజ్ఞ మభిచక్రామ రాఘవో గ్నిమివా ర్చితమ్. ౪

టీక॥ రాఘవః=రాముఁడు; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; సీతయాసహ=సీతతోఁగూడ; ఆగతం=వచ్చినవాఁడును; వేదవిదం=వేదముల నెఱింగినవాఁడును; అర్చితం=పూజింపఁబడిన, హోమము సేయఁబడిన యనుట; అగ్నిమివ(స్థితం)=అగ్నిహోత్రమువంటిపోలెనున్నవాఁడునగు; తం=ఆ; సుయజ్ఞం=సుయజ్ఞుని; అభిచక్రామ=ప్రదక్షిణించెను.

అట్లువచ్చి, హుతంబగునగ్నిహోత్రంబు చందంబున నం దేజరిల్లుచున్న వేదవేత్తయగు సుయజ్ఞునకు, రాముండు చేమోడ్పుగీలించి, సీతతోఁగూడఁ, బ్రదక్షిణంబుచేసెను. అని, తాత్పర్యము.

జాతరూపమయై ర్ముఖ్యై రంగదైః కుండలై శ్శుభైః
సహేమసూత్రై ర్మణిభిః కేయూరై ర్వలయైరపి. ౫
అన్యైశ్చ రత్నై ర్బహుభిః కాకుత్థ్సః ప్రత్యపూజయత్

టీక॥ కాకుత్థ్సః=రాముఁడు; జాతరూపమయైః=బంగారు వికారములయిన; ముఖ్యైః=శ్రేష్ఠములగు; అంగదైః=బాహుపురులచేతను; శుభైః=సుందరములయిన; కుండలైః=పోఁగులచేతను; సహేమసూత్రైః=బంగారునూలుతోఁగూడిన; మణిభిః=రత్నములచేతను; కేయూరైః=మఱియొకవిధమయినబాహుపురులచేతను; వలయైరపి=కంకణములచేతను; అన్యైః=ఇతరములగు; బహుభిః=పెక్కులయిన; రత్నైశ్చ=మణులచేతను; తం=(అధ్యాహృతము)ఆసుయజ్ఞుని; ప్రత్యపూజయత్=పూజించెను.

అంత, రాముండు, శ్రేష్ఠములయిన బంగారుబాహుపురులును, మణులుచె

కిరీనబాహుపురులును, సుందరములయినకుండలంబును, బంగారుతో గట్టిన మణిసరములును గంకణంబులును ఇంకనితరములయినమణులనేకంబులును, సుయజ్ఞునకొసంగెను.

అని, తాత్పర్యము.

సుయజ్ఞం స తదో వాచ రామ స్సీతాప్రచోదితః. ౬

టీక॥తదా=అప్పుడు; సః=ఆ; రామః=రాముఁడు; సీతాప్రచోదితః=సీతచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై; సుయజ్ఞం=సుయజ్ఞునిఁగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, నారాముండు, సీతప్రేరింపఁగా, నాసుయజ్ఞుంజూచి, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

హారంచ హేమసూత్రంచ భార్యాయై సౌమ్య హారయ
రశనాం చాధునా సీతా దాతు మిచ్ఛతి తే సఖే. ౭

టీక॥సౌమ్య=తిన్ననివఁ; సఖే=స్నేహితుఁడవైనసుయజ్ఞుఁడా! సీతా=సీత; అధునా=ఇప్పుడు; తే = నీయొక్క; భార్యాయై = భార్యకొఱకు; హారంచ=హారమును; మణిసూత్రంచ=బంగారుతోఁజేయఁబడినకంఠసూత్రమును; రశనాంచ=మొలనూలును; దాతుం = ఇచ్చుటకు; ఇచ్ఛతి = కోరుచున్నది. హారయ=కొనిపొమ్ము.

సౌమ్యుండవగుసుయజ్ఞుఁడా! సీతయిప్పుడు, నీభార్యకు, హారమునుబంగారుమెడనూలును మొలనూలును, ఇవ్వఁగోరియున్నది; వీనిందీసికొని పోయి, యాబిడకిమ్ము. అని, తాత్పర్యము.

అంగదాని విచిత్రాణి కేయూరాణి శుభాని చ
ప్రయచ్ఛతి సఖే తుభ్యం భార్యాయై గచ్ఛతీ వనమ్. ౮

టీక॥సఖే=స్నేహితుఁడా! ఇయం (అధ్యాహృతము)=ఈసీత; వనం=అడవినిగూర్చి; గచ్ఛతీ (గచ్ఛంతీ)=పోవుచు; భార్యాయై = నీభార్యకొఱకు; తుభ్యం=నీకొఱకు; విచిత్రాణి= నానావర్ణములుగల; అంగదాని=బాహుపు

రులను; శుభాని=సుందరములయిన; కే యూరాణిచ = మఱియొకవిధమయిన బాహుపురులను; ప్రయచ్ఛతి= ఇచ్చుచున్నది.

స్నేహితుఁడా! ఇప్పుడే సీతవనంబునకుఁబోవుచున్నది, కావున, నీభార్యకై, నీచేతికి, నానావిధమణిఖచితంబులౌట చేనానావర్ణములయిన బాహుపురుల నునట్టిబంగారుబాహుపురులను, ఇచ్చుచున్నది. అని, తాత్పర్యము.

పర్యంక మగ్ర్యాస్తరణం నానారత్నవిభూషితమ్
త మపీచ్ఛతి వైదేహీ ప్రతిష్ఠాపయితుం త్వయి. ౯

టీక॥ వైదేహీ = సీత; అగ్ర్యాస్తరణం=శ్రేష్ఠమయినమైఁబఱచువస్త్రము గలదియును; నానారత్నవిభూషితం= నానావిధములగు మణులచేతనలంకరింపఁబడినదియునగు; తం=అట్టి; పర్యంకమపి=పాన్పును; త్వయి=నీయందు; ప్రతిష్ఠాపయితుం=ఉంచుటకు; ఇచ్ఛతి=కోరుచున్నది.

శ్రేష్ఠమయినయాస్తరణవస్త్రముగల్గి నానావిధమణుల నలంకృతంబైన యాపాన్పును గూడ, సీత, నీకియ్యఁగోరుచున్నది. అని, తాత్పర్యము.

నాగ శ్శత్రుంజయో నామ మాతులో యం దదౌ మమ
తం తే గజసహస్రేణ దదామి ద్విజపుంగవ. ౧౦

టీక॥ మాతులః = మేనమామ; మమ=నాకు; యః = ఏ, యేనుఁగును; దదౌ=ఇచ్చెనో; సః(అధ్యాహృతము)= అట్టి; శత్రుంజయోనామ=శత్రుంజయమను; నాగః = ఏనుఁగు; అస్తి(అధ్యాహృతము)=ఉన్నది. ద్విజపుంగవ=బ్రాహ్మణశ్రేష్ఠుండవగుసుయజ్ఞుఁడా; తం= ఆయేనుంగును; గజసహస్రేణ= ఏనుంగులవేయిటితో; తే = నీకొఱకు; దదామి=ఇచ్చెదను.

నాకు, నామేనమామయిచ్చిన, శత్రుంజయమనుగజంబొకటిగలదు; దానినిఇంకవేయియేనుఁగులనుంజేర్చి, నీకొసంగెదను. అని, రాముండు, సుయజ్ఞునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తస్సహి రామేణ సుయజ్ఞః ప్రతిగృహ్యతత్

రామలక్ష్మణ సీతానాం ప్రయయోజా శిష శ్శుభాః. ౧౧

టీక॥సః=ఆ;సుయజ్ఞః= సుయజ్ఞుండు; రామేణ= రామునిచేత;ఇతి=అని; ఉక్తః=చెప్పంబడినవాఁడై; తత్=దానిఁ;ప్రతిగృహ్య=పుచ్చుకొని=రామలక్ష్మణసీతానాం=రామునకును లక్ష్మణునకును సీతకును; శుభాః=మంగళకరంబులయిన;ఆశిషః=ఆశీర్వచనంబులను; ప్రయయోజ=ప్రయోగించెను, చేసెననుట

అసుయజ్ఞుండు , రాముని మాటలు విని, వానినన్నింటిని బ్రతిగ్రహించి, రామునకును లక్ష్మణునకును సీతకును, మంగళాశీర్వచంబులొసంగెను.

అని; తాత్పర్యము.

అథ భ్రాతర మవ్యగ్రం ప్రియం రామః ప్రియం వదః
సౌమిత్రిం తమువాచేదం బ్రహ్మేవ త్రిదశేశ్వరమ్. ౧౨

టీక॥అథ=అటుపిమ్మట; ప్రియంవదః=సంతోషముగలిగించుమాటలం జెప్పునట్టి; రామః=రాముఁడు ; అవ్యగ్రం=ఏమఱుపాటులేనివాఁడును ; ప్రియం=ఇష్టుండును;భ్రాతరం= తమ్ముండునగు;తం=ఆ; సౌమిత్రిం=సుమిత్రకొడుకైనలక్ష్మణునిగూర్చి; బ్రహ్మా= బ్రహ్మదేవుండు; త్రిదశేశ్వరమివ = దేవతలకుఁ బ్రభుండయిన, యింద్రునిగూర్చినవలె;ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత,ప్రియభాషియగు రాముండు, ఏమఱుపాటులేనివాఁడునుఁబ్రియుండునుదమ్ముండునగు లక్ష్మణుంజూచి, బ్రహ్మదేవుండు దేవేంద్రునకాజ్ఞాపించునట్లు,ఇట్లని,యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

అగస్త్యం కౌశికంచైవ తావుభౌ బ్రాహ్మణోత్తమౌ
అర్చయాహూయ సౌమిత్రే రత్నైస్సస్య మివాంబుభిః. ౧౩

టీక॥సౌమిత్రే=లక్ష్మణుఁడా! అగస్త్యం=అగస్త్యుని; కౌశికంచైవ= విశ్వామిత్రుని; తౌ=ఆ; బ్రాహ్మణోత్తమౌ= బ్రాహ్మణశ్రేష్ఠులను; ఉభౌ=

ఇద్దఱను; ఆహూయ=పిలిచి; అంబుభిః=నీళ్లచేత; సస్యమివ=పైరునుంబోలె; రత్నైః=మణులచేత; అర్చయ=పూజింపుము.

లక్ష్మణుఁడా! నీవుపోయి,అగస్త్యునివిశ్వామిత్రుని,ఈయిద్దఱబ్రాహ్మణోత్తములనుందీసికొనివచ్చి , పైరును నీళ్లతోడంబోలె, వారల రత్నములతోఁబూజింపుము. అని,తాత్పర్యము.

తర్పయస్వ మహాబాహో గోసహస్రైశ్చ మానద
సువర్ణై రజతైశ్చైవ మణిభిశ్చ మహాధనైః. ౧౪

టీక॥ మానద=మానమునిచ్చునట్టి; మహాబాహో=పెద్దచేతులుగల లక్ష్మణుఁడా!గోసహస్రైశ్చ = ఆవులయొక్క వేలచేతను;సువర్ణైశ్చ= బంగారములచేతను; రజతైశ్చైవ= వెండులచేత;మహాధనైః= అధికమయినవెలగల; మణిభిశ్చ=రత్నములచేతను; తర్పయస్వ=సంతోషింపఁజేయుము.

మానంబుఁగాపాడుకొనునట్టిలక్ష్మణుఁడా!మఱియు;వారలకుఁ,బెక్కువేలయావులునుబంగారమును వెండియునొసంగి, సంతోషంబుగలుగునట్లు సేయుము.

అని, తాత్పర్యము.

కౌసల్యాంచయ ఆశీర్భిః భక్తః పర్యుపతిష్ఠతి
ఆచార్యస్తైత్తిరీయాణా మభిరూపశ్చ వేదవిత్. ౧౫

టీక॥యః=ఎవ్వఁడు;భక్తః= శ్రద్ధగలవాఁడై; కౌసల్యాం= కౌసల్యను; ఆశీర్భిః=ఆశీర్వచనములచేత; పర్యుపతిష్ఠతి=సేవించుచుండునో ;సః(అధ్యాహృతము)=ఆ; తైత్తిరీయాణాం=తైత్తిరీయశాఖ నధ్యయనించు వారలయొక్క;ఆచార్యః= ఉపాధ్యాయుఁడును; అభిరూపః=పండితుండు.వేదవిచ్చ= వేదముల నెఱింగినవాఁడును.

ఎవ్వం డెల్లప్పుడును శ్రద్ధతోఁ గౌసల్యనాశీర్వదింపుచుండునో , అట్టితైత్తిరీశాఖం జదువు వారల యుపాధ్యాయుండును, బండితుండు, వేదంబులు తెలిసినవాఁడు.అని, తాత్పర్యము.

తస్య యానంచ దాసీశ్చ సౌమిత్రే సంప్రదాపయ

కౌశేయానిచ వస్త్రాణి యావత్తుష్యతి సద్విజః. ౧౬

టీక. సౌమిత్రే=లక్ష్మణుఁడా! యావత్=ఎంతలోపల; సః=ఆ; ద్విజః=బ్రాహ్మణుఁడు; తుష్యతి= సంతోషించునో; తావత్ (అధ్యాహృతము)=అంతవఱకు; తస్య=ఆబ్రాహ్మణునకు; యానంచ=వాహనమును; దాసీశ్చ=దాసీలను; కౌశేయాని= పట్టువైన; వస్త్రాణిచ=వస్త్రములను; సంప్రదాపయ=ఇమ్ము.

లక్ష్మణుఁడా! ఆబ్రాహ్మణుండు తృప్తిఁబొందువఱకు, అతనికివాహనంబులును దాసీలును బట్టుపుట్టలనొసంగుము, అని, తాత్పర్యము.

సూతశ్చిత్ర రథశ్చార్య సచివ స్సుచిరోషితః

టీక ॥ చిత్రరథః=చిత్రరథుఁడను; సూతశ్చ=సారథియు; ఆర్యసచివః=పూజ్యుఁడగుదశరథమహారాజుస్నేహితుండు; సుచిరోషితః= బహుకాలముగానున్నవాఁడు.

చిత్రరథుండనుసారథియు, మనతండ్రి దశరథమహారాజునకుఁ గావలసినవాఁడు; బహుకాలము గామనయింటనున్నవాఁడు.

అని, తాత్పర్యము.

తోషయైనం మహార్హైశ్చ రత్నైర్వస్త్రై ర్ధనైస్తథా. ౧౭
పశుకాభిశ్చ సర్వాభి ర్గవాం దశ శతేనచ

టీక॥ఏనం=ఈచిత్రరథుని ; మహార్హైః=శ్రేష్ఠములయిన;రత్నైః=మణులచేతను; వస్త్రైః= బట్టలచేతను; తథా=అట్లు;ధనైః= ధనములచేతను;సర్వాభిః=సమస్తములయిన;పశుకాభిశ్చ= చిన్నపశువులచేతను ; గవాం=ఆవులయొక్క;దశశతేనచ= పదినూఱుచేతను; తోషయ = సంతసింపఁజేయుము.

నీవితనికి ఉత్తమంబులగు మణులను వస్త్రంబులును ధనంబులు అన్ని సన్నజీవంబులు, వేయియావులునొసంగి,సంతోషముగల్గునట్లు సేయుము.

అని, తాత్పర్యము-

యేచేమే కఠకాలాపా బహవో దండమాణవాః, ౧౮
నిత్యస్వాధ్యాయ శీలత్వా న్నాన్యత్కుర్వంతి కించన

టీక॥ఇమే=ఈ; కఠకాలాపాః=కఠశాఖనధ్యయనించువారలును గాలాపశాఖ నధ్యయనించువారలును; బహవః=అనేకులైన; దండమాణవాశ్చ = పలాశదండధారులయిన బ్రహ్మచారులును; యే(సంతి)=ఎవ్వరుగలరో; తే (అధ్యాహృతము)=వారలు; నిత్యస్వాధ్యాయశీలత్వాత్=ఎల్లప్పుడునధ్యయనించుటయే స్వభావముగాఁగలవారలగుటవలన; అన్యత్=ఇతరమయినదానిః కించిత్=కొంచెమునైనను; నకుర్వంతి=చేయరు.

ఋషియు, నీకఠశాఖనధ్యయనించువారలును గాలాపశాఖనధ్యయనించువారలును ననేకులు పలాశదండధారులగు బ్రహ్మచారులును, వీరలందఱు నెల్లప్పుడు వేదాధ్యయనముచేయుచుందురు; మఱియే కార్యమునుంగొంచెమయినం జేయువారలుకారు?

అని, తాత్పర్యము.

అలసా స్స్వాదుకామాశ్చ మహతాంచాపి సమ్మతాః. ౧౯

టీక॥ తే(అధ్యాహృతము)= వారలు; అలసాః=సోమరులును; స్వాదుకామాశ్చ= రుచ్యమయినయాహారమునందుఁగోరికగలవారలును. మహతాంచాపి=పెద్దలకును; సమ్మతాః= ఇష్టులయినవారలు.

వారలు, కొంచెముసోమరులు; రుచ్యమయిన యాహారమునుగోరుచుందురు; పూజ్యులయినవారలుగూడవారలనమ్మానింపుచుందురు. అని, తాత్పర్యము.

తేషా మశీతియానాని రత్నపూర్ణాని దాపయ
శాలివాహసహస్రంచ ద్వే శతే భద్రకాం స్తథా. ౨౦

టీక॥తేషాం=వారలకు; రత్నపూర్ణాని= మణులతోనిండిన; అశీతియానాని=ఎనుబదిబండ్లను; శాలివాహసహస్రంచ= ధాన్యమును మోయువృషభంబులయొక్క వేయింటిని; తథా=అట్లు; భద్రకాన్=దున్నెడునెద్దులను; ద్వే=

రెండవైన;శతే—నూటులను; దాపయ= ఇప్పించుము.

వారలకు, ఎనుబదిబండ్లమణులును, ధాన్యమును మోయువృషభంబులు వే యింటెని, ఇన్నూటుదు న్నెదు నెద్దులను, ఇమ్ము.అని, తాత్పర్యము.

వ్యంజనార్థం చ సౌమిత్రే గోసహస్ర ముపాకురు

టీక॥సౌమిత్రే—లక్ష్మణుఁడా! వ్యంజనార్థం= భోజనోపకరణముల కొఱకు;గోసహస్రంచ= ఆవుల వేయింటిని; ఉపాకురు—ఉపకరింపుము.

లక్ష్మణుఁడా!వారలకు, భోజనంబునకుఁబాలుఁబెరుఁగు నేయి మొదలగువానికొఱకై, వేయిగోవులనిమ్ము. అని, తాత్పర్యము.

మేఖలీనాం మహాసంఘః కౌసల్యాం సముపస్థితః. ౨౧
"మేఖలానాంమహాసంఘః" ఇతిపాఠాంతరం.

టీక॥మేఖలీనాం(మేఖలినాం) మేఖలానాం(ఇది, పాఠాంతరము)—బ్రహ్మచారులయొక్క;మహాసంఘః=పెద్దగుంపు;కౌసల్యాం = కౌసల్యను;సముపస్థితః—ఆశ్రయించియున్నది.

మఱియుననేకులు బ్రహ్మచారులు, కౌసల్యనాశ్రయించియున్నవారు. అని, తాత్పర్యము.

తేషాం సహస్రం సౌమిత్రే ప్రత్యేకం సంప్రదాపయ

టీక॥సౌమిత్రే = లక్ష్మణుఁడా! తేషాం—వారలకు; ప్రత్యేకం=ఒక్కొకరికి;సహస్రం—వేయిని, వేయియావులననుట;సంప్రదాపయ=ఇప్పించుము.

లక్ష్మణుఁడా!వారలకుఁ,బ్రతిమనిషికిని, వేయిగోవులచొప్పున,నొసంగుము. అని, తాత్పర్యము.

అంబా యథా చ సా నందే త్కౌసల్యా మమ దక్షిణామ్. ౨౨
"కౌసల్యామమదక్షిణా" ఇతిపాఠాంతరం.
తథా ద్విజాతీం స్తాం త్సర్వా న్లక్ష్మణా ర్చయ సర్వశః




టీక॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! మమ=నాయొక్క; అంబా=తల్లియు; దక్షిణా (ఇది, పాఠాంతరము)=సమర్థురాలు నగు; సా=ఆ; కౌసల్యా=కౌసల్య; దక్షిణాం=దక్షిణను గూర్చి; యథా= ఎట్లు; నందేత్= సంతోషించునో; తథా=అట్లు; తాన్=ఆ; ద్విజాన్= బ్రాహ్మణులను; సర్వాన్=అందఱను; సర్వశః=అన్ని విధంబులను; అర్చయ=పూజింపుము.

లక్ష్మణుఁడా! మనతల్లి కౌసల్య సంతోషించునట్లు, నీవన్ని విధంబులను, ఆ బ్రాహ్మణులనందఱిని, బూజింపవలయును. అని, రాముండు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తతస్స పురుష వ్యాఘ్ర స్తద్ధనం లక్ష్మణ స్స్వయమ్. ౨౩
యథోక్తం బ్రాహ్మణేంద్రాణా మదదా ద్ధనదో యథా

టీక॥ తతః=అటుపిమ్మట ; పురుష వ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండగు; సః=ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ధనదో యథా= కుబేరుండుంబోలె; తత్=ఆ; ధనం= ధనమును; స్వయం=తానె ; యథోక్తం= చెప్పఁబడినట్లు ; బ్రాహ్మణేంద్రాణాం=బ్రాహ్మణశ్రేష్ఠులకు ; అదదాత్=ఇచ్చెను.

అంతట, పురుషశ్రేష్ఠుండగు నాలక్ష్మణుండు, కుబేరుండుంబోలె, నాధనమంతయు రాముండు చెప్పినట్లు, తానె బహుశ్రద్ధతో , బ్రాహ్మణోత్తములకొసంగెను. అని, తాత్పర్యము.

అథా బ్రవీ ద్బాష్పగళాం స్తిష్ఠతశ్చోప జీవినః. ౨౪
("బాష్పకలాన్") ఇతి పాఠాంతరం.
సంప్రదాయ బహుద్రవ్య మేకైకస్యోప జీవనమ్

టీక॥ అథ=అటుపిమ్మట; రామః(అధ్యాహృతము)=రాముఁడు; బాష్పగళాన్= కన్నీరుకంఠమునంగల, కన్నీళ్లనడంచుకొనియున్నయనుట; బాష్పకలాన్(ఇదిపాఠాంతరము)= కన్నీళ్లుగారుచున్న; తిష్ఠతః=నిలుచున్న; ఉపజీవినః = సేవకులంగూర్చియు; ఏకైకస్య=ఒక్కొక్కనికి; ఉపజీవనం=జీవించుటనుగూర్చి ; బహు= అధికమును; ద్రవ్యం=ధనమును; సంప్రదాయ=ఇచ్చి; అబ్రవీత్=పలికెను.

అంత, రాముండు, తనయెదుట




గన్నీళ్లు డించుకొనుచు (గన్నీళ్లుగార్చుచు)నిలుచున్న పరిచారకులంజూచి, వారు జీవించుటకై యొక్కొక్కరి కధికముగా ధనంబొసంగి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

లక్ష్మణస్యచ యద్వేశ్మ గృహంచ యదిదం మమ. ౨౫
అశూన్యం కార్య మేకైకం యావదా గమనం మమ

టీక॥లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క; వేశ్మ=ఇల్లు; యత్ = ఏదో ; తత్ (అధ్యాహృతము)=అదియు; మమ= నాయొక్క ;ఇదం=ఈ; గృహం=ఇల్లు; యత్ =ఏదో;తత్ ( అధ్యాహృతము) చ=అదియును;మమ = నాయొక్క; యావదాగమనం= వచ్చుటయగువఱకు; ఏకైకం= వేఱువేఱుగా ; అశూన్యం=ఎవరులేనిదికానిదానిఁగా ; కార్యం=చేయఁదగినది.

మీరు, నేనువచ్చువఱకు, నాయింట నులక్ష్మణునింటను,ఎవ్వరులేనట్లు సేయక, యెల్లప్పుడును గావలియుండి,కాపాడుచుండవలయును.అని, రాముండు నౌకరులకుంజెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా దుఃఖితం సర్వం జనం త ముపజీవినమ్. ౨౬
ఉవాచే దం ధనాధ్యక్షం ధన మానీయతా మితి

టీక॥రామః=(అధ్యాహృతము) రాముఁడు; దుఃఖితం=దుఃఖమునొందిన; తం=ఆ;ఉపజీవినం= పరిచరించునట్టి; సర్వం=సమస్తమయిన;జనం= జనమును గూర్చి, ఇతి=ఇట్లు;ఉక్త్వా= చెప్పి;ధనాధ్యక్షం= ధనాధికారిని గూర్చి,"ధనం=ధనము;ఆనీయతాం= తేఁబడుఁగాక" ఇతి=అని;ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

రాముఁడు, దుఃఖము నొందియున్న పరిచారకులకుం జెప్పి, యంత, ధనాధికారింజూచి, ధనమునుదీసికొని రమ్ము. అని యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

తతో స్య ధన మాజహ్రు స్సర్వమేవో పజీవినః. ౨౭

టీక॥తతః=అటుపిమ్మట; ఉపజీవినః=పరిచారకులు;అస్య= యీరాముని యొక్క;ధనం= ధనమును; సర్వమేవ = అంతనే;ఆజహ్రుః = తీసికొనివచ్చిరి.

అంతఁ, బరిచారకు, లీరాముని ధనమునంతయుఁ గొని తెచ్చిరి.

అని, తాత్పర్యము.

స రాశి స్సుమహాం స్తత్ర దర్శనీయో హ్యదృశ్యత

టీక॥తత్ర=అచ్చట;సః = ఆ;రాశిః=ధనరాశి; సుమహాన్ = మిక్కిలియుఁ బెద్దదైన; దర్శనీయః=సుందరమయి; అదృశ్యతహి = చూడఁబడినది గదా!

ఆధనరాశి, మిక్కిలియు గొప్పదికావునఁ, జూపరులకచ్చెరువు గల్గించుచుండినది. అని, తాత్పర్యము.

తత స్స పురుషవ్యాఘ్ర స్తద్ధనం సహలక్ష్మణః. ౨౮
ద్విజేభ్యో బాలవృద్ధేభ్యః కృపణేభ్యో హ్యదాపయత్

టీక॥తతః = అటుపిమ్మట;పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండగు; సః=ఆరాముండు;సహలక్ష్మణః = లక్ష్మణునితోఁగూడినవాఁడై;తత్ =ఆ; ధనం=ధనమును;కృపణేభ్యః=దరిద్రులగు;బాలవృద్ధేభ్యః=బాలురునుముసలివాండ్రునగు;ద్విజేభ్యః= బ్రాహ్మణులకొఱకు;అదాపయద్ధి=ఇప్పించెనుగదా!

అంతఁ బురుషశ్రేష్ఠుండగు నారాముండు, లక్ష్మణునింగూడి, యాధనమునంతయు,దరిద్రబ్రాహ్మణులయినబాలకవృద్ధులకు,నొసంగెను.

అని, తాత్పర్యము.

తత్రాసీ త్పింగళో గార్గ్య స్త్రిజటో నామ వై ద్విజః. ౨౯
ఉంఛవృత్తి ర్వనే నిత్యం ఫాలకుద్దాలలాంగలీ
"క్షతవృత్తిర్వనేనిత్యం"ఇతిపాఠాంతరం.

టీక॥వనే=అడవియందు; నిత్యం=ఎల్లప్పుడును;ఉంఛవృత్తిః=ఒకొక్కగింజగాధాన్యముసేరుకొనుటయేజీవికగా గలవాఁడును;క్షతవృత్తిః=త్రవ్వుటవల

నఁగలిగినవి జీవనము గాఁగలవాఁడును, కందమూలములు త్రవ్వుకొనివానిందినిజీవించు వాఁడునునుట (పైవిశేషణమును "ఫాలకుద్దాలలాంగలీ" అనుదానిం బూడఁగా,నీపాఠమె యుక్తముగాఁదోఁచుచున్నది.); ఫాలకుద్దాలలాంగలీ=చిన్నగొడ్డలియును గుద్దలియును దోఁటియును గలవాఁడును; పింగళః= గోరోచనపువన్నెగలవాఁడును ; గార్గ్యః = గర్గముని వంశమునఁ బుట్టినవాఁడు నగు; త్రిజటోనామ=త్రిజటుఁడని ప్రసిద్ధుఁడైన; ద్విజః=బ్రాహ్మణుఁడు ; తత్ర=అక్కడ; ఆసీత్ =ఉండెను.

అడవిలోనెల్లప్పుడును జిన్నగొడ్డలియును గుద్దలియును దోఁటియును ధరించి, కందమూలాదులు త్రవ్వుకొని ఫలములు గోసికొనియు జీవించుచుండువాఁడును బింగళవర్ణుఁడును నగు, త్రిజటుండను దరిద్రబ్రాహ్మణుం డొకఁడు, దైవవశంబున, నప్పుడక్కడనుండెను.

అని, తాత్పర్యము.

తం వృద్ధం తరుణీ భార్యా బాలా నాదాయ దారకాన్. ౩౦

అబ్రవీ ద్బ్రాహ్మణం వాక్యం దారిద్ర్యే ణాభి పీడితా.

టీక॥ తరుణీ=యౌవనముగల; భార్యా=పెండ్లాము; దారిద్ర్యేణ=లేమిడితనముచేత; అభిపీడితా= మిక్కిలి యుబాధింపఁబడినదై;బాలాన్ = చిన్నవాండ్రైన; దారకాన్=కొడుకులను;ఆదాయ=తీసికొని; వృద్ధం= ముసలివాఁడైన;తం=ఆ;బ్రాహ్మణం=త్రిజటుఁగూర్చి;వాక్యం=మాటను; అబ్రవీత్ =పలికెను.

యౌవనవతియగునతనిభార్య,దారిద్ర్యంబునకుంగుందుచు, బాలురగు కొడుకులందీసికొని, వృద్ధుండగునా త్రిజటుం జేరఁజని,యిట్లని, చెప్పినది.

అని, తాత్పర్యము.

అపాస్య ఫాలం కుద్దాలం కురుష్వ వచనం మమ. ౩౧

టీక॥ఫాలం=చిన్నగొడ్డలిని; కుద్దాలం=గుద్దలిని; అపాస్య= ఆవలంద్రోసి;మమ=నాయొక్క;వచనం= మాటను;కురుష్వ=చేయుము.

ఇప్పుడీగొడ్డలినిగుద్దలిని పాఱవైచి, నేను జెప్పునట్లు సేయుము.

అని, తాత్పర్యము.

రామం దర్శయ ధర్మజ్ఞం యది కించి దవాప్స్యసి.

టీక॥ ధర్మజ్ఞం=ధర్మమునెఱింగిన; రామం=రాముని; దర్శయ=చూచునట్లుచేయుము, నిన్నునునీకొడుకులనునీభార్యను అతనికిఁ జూపుకొనుమనుట); యది=చూపుదువేని; కించిత్=కొంచెము; అవాప్స్యసి = పొందఁగలవు.

రామునొద్దకుఁబోయి, నీకుటుంబమునతనికిఁజూపి నీదారిద్ర్యమును జెప్పకొనుము. అతండుమిక్కిలియుధార్మికుండు; నీవట్లుసేయుదువేని, నీకేమైననిచ్చును. అని, తాత్పర్యము.

స భార్యావచనం శ్రుత్వా శాటీ మాచ్ఛాద్య దుశ్ఛదామ్, ౩౨
స ప్రాతిష్ఠత పంథానం యత్ర రామనివేశనం

టీక॥సః=ఆత్రిజటుఁడు; భార్యావచనం=భార్యమాటను; శ్రుత్వా=విని; దుశ్ఛదాం = కప్పుకొనఁగూడని; శాటీం=వస్త్రమును;ఆచ్ఛాద్య= కప్పుకొని;సః=ఆత్రిజటుఁడు;యత్ర = ఏమార్గమునందు; రామనివేశనం(అస్తి)= రామునిల్లున్నదో; తం (అధ్యాహృతము)=ఆ;పంథానం = మార్గమునుగూర్చి; ప్రాతిష్ఠత= బయలుదేఱెను.

ఆత్రిజటుండు, భార్యచెప్పినమాటనువిని, మిక్కిలియుజీర్ణమయియుండుటంజేసి, కప్పుకొననలవిగానివస్త్రంబుఁగప్పుకొని, రాముని గృహంబుండు మార్గంబుఁబట్టి,పోయెను.

అని, తాత్పర్యము.

భృగ్వంగిరసమం దీప్త్యా త్రిజటం జనసంసది. ౩౩
అపంచమాయాఃకక్ష్యాయా నైనం కశ్చి దవారయత్

టీక ॥ కశ్చిత్=ఒకానొకఁడును; జనసంసది = జనసమూహమునందు




దీప్త్యా= కాంతిచేత;భృగ్వంగిరసమం (భృగ్వంగిరస్సమం)= భృగుమహర్షితోనుఅంగిరసునితోనుసమానుండగు; ఏనం=ఈ;త్రిజటం=త్రిజటుని; ఆపంచమాయాఃకక్ష్యాయాః=అయిదవతొట్టికట్టువఱకు;నావారయత్= అడ్డగింపఁడయ్యె.

అట్లు, జనసమూహంబున, నాత్రిజటుండుబ్రహ్మవర్చస్సుచేతభృగ్వంగిరసులుంబోలె వెలుంగుచున్నవాఁడు గావున, నతండు రామగృహంబులోనికిం జొరఁగా,నయిదవ తొట్టికట్టువఱకును,ఎవ్వరునడ్డగింపరైరి.అని, తాత్పర్యము.

స రాజపుత్ర మాసాద్య త్రిజటో వాక్య మబ్రవీత్. ౩౪
నిర్ధనో బహుపుత్రోస్మి రాజపుత్ర మహాయశః
ఉంఛవృత్తి ర్వనే నిత్యం ప్రత్యవేక్షస్వ మా మితి. ౩౫

టీక॥సః=ఆ;త్రిజటః=త్రిజటుఁడు; రాజపుత్రం= రాచకొమరుండగురామునిఁ;ఆసాద్య=చేరి; "మహాయశః=అధికమయినకీర్తిగల;రాజపుత్ర=రాచకొమరుండవగురాముఁడా!అహం (అధ్యాహృతము)=నేను;నిర్ధనః= దరిద్రుండను; బహుపుత్రః=పెక్కుకొడుకులుగలవాఁడను; వనే=అడవియందు; నిత్యం=ఎల్లప్పుడును;ఉంఛవృత్తిః= ఒక్కొకటిగా ధాన్యము నేరుకొనుటయెజీవికగాఁగలవాఁడను;అస్మి= అగుచున్నాను.మాం = నన్ను;ప్రత్యవేక్షస్వ=చూచుకొనుము." ఇతి = అని;వాక్యం=మాటను,అబ్రవీత్=పలికెను.

ఆత్రిజటుండు, రాచకొమరుండగు రాముంజేరఁజని,"రాజపుత్రుఁడా!నీవు మహాకీర్తిగలవాఁడవు; నేనుదరిద్రుండను, పెక్కుకొడుకులుగలవాఁడను; ఎల్లప్పుడునువనంబున ధాన్యంబునొక్కొక్కటిగానేరుకొని జీవించుచున్నాను; నామీఁదఁగొంచెముదృష్టియుంచుము" అని, యిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

త మువాచ తతో రామః పరిహాససమన్వితం

టీక॥తతః=అటుపిమ్మట; రామః=రాముఁడు;తం=ఆత్రిజటుంగూర్చి;పరిహాససమన్వితం=పరిహాసముతోఁగూడినమాటను;ఉవాచ=చెప్పెను.




అంత, రాముండు, ఆత్రిజటుంబూచి, పరిహాసంబుగా, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

గవాం సహస్ర మప్యేకం నతువిశ్రాణితం మయా. ౩౬

టీక॥ మయా=నాచేత; గవాం= ఆవులయొక్క; సహస్రం=వేయి; ఏకమపి=ఒకటియయినను; నతువిశ్రాణితం= ఇవ్వనేఇవ్వఁబడదు.

నేను, నీకు, వేయిగోవులలోనైనను, ఇవ్వను. అని, తాత్పర్యము.

పరిక్షిపసి దండేన యావత్తావ దవాప్స్యసి

టీక॥ దండేన=కొయ్యచేత; యావత్=ఎంతను; పరిక్షిపసి=విసరివేసి చూపుచున్నావో; తావత్=అంతను; అవాప్స్యసి=పొందఁగలవు.

నీవుకొయ్యను విసరివేయఁగా నదియెంతదూరము పోవునో, అంతదూరములోనుండఁదగినగోవులను నీకిత్తును. అని, రాముండు, త్రిజటునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

సశాటీం త్వరితః కట్యాం సంభ్రాంతః పరివేష్ట్య తామ్. ౩౭
ఆవిధ్యదండం చిక్షేప సర్వప్రాణేన వేగితః

టీక॥ సః=ఆత్రిజటుఁడు; త్వరితః=వేగిరపాటుగలవాఁడై; సంభ్రాంతః=సంతోషించినవాఁడై; తాం=ఆ; శాటీం= వస్త్రమును; కట్యాం=మొలయందు; పరివేష్ట్య=చుట్టుకొని; వేగితః= వేగముగలవాఁడై; దండం=కొయ్యను ; ఆవిధ్య=త్రిప్పి; సర్వప్రాణేన= సమస్తమయినబలముచేతను; చిక్షేప= వేసెను.

అంత, నాత్రిజటుండు, సంతోషంబునొంది, వేగిరపాటున, నావస్త్రంబు మొలకుఁజుట్టుకొని, వేగంబునదండంబుగిరగిరఁద్రిప్పి, తనయావద్బలమును బూని, విసరివైచెను.

అని, తాత్పర్యము.

సతీర్త్వా సరయూపారం దండస్తస్య కరాచ్చ్యుతః. ౩౮

గోవ్రజే బహుసాహస్రే పపాతోక్షణ సన్నిధౌ

టీక॥ సః=ఆ; దండః = కోయ్య; తస్య=అత్రిజటునియొక్క; కరాత్=హస్తమునుంచి; చ్యుతః = వెడలినదై; సరయూపారం=సరయూనదిగట్టును; తీర్త్వా=దాటి; బహుసాహస్రే=పెక్కువేలుగల; గోవ్రజే = ఆవులమందయందు; ఉక్షణసన్నిధౌ=ఆంబోతుసమీపమునందు; పపాత=పడినది.

అట్లులా త్రిజటుండు వైవఁగా, నా దండంబు సరయూనదియావలి గట్టును దాఁటి, పెక్కువేలగోవుల నతిక్రమించి, యాఁబోతుసమీపమునం, బడెను.

అని, తాత్పర్యము.

తం పరిష్వజ్య ధర్మాత్మా ఆ తస్మా త్సరయూతటాత్. ౩౯
ఆనయామాస తా గోపై స్త్రిజటాయా శ్రమం ప్రతి

టీక॥ ధర్మాత్మా=ధర్మబుద్ధిగల రాముండు; తం=ఆత్రిజటుని; పరిష్వజ్య=కౌఁగిలించుకొని; తస్మాత్=ఆ; ఆసరయూతటాత్ =సరియూనదిగట్టువఱకు; తాః= ఆయావులను; గోపైః = గొల్లవాండ్రచేత; త్రిజటాయ= (షష్ఠ్యర్థమందుఁజతుర్థి) త్రిజటునియొక్క; ఆశ్రమంప్రతి= ఆశ్రమమునుగూర్చి; ఆనయామాస, (ఆనాయయామాస)=తీసికొనిరప్పించెను.

ధర్మాత్ముండగు రాముండు, ఆత్రిజటుంజూచి, గౌఁగిలించుకొని; సరయూనదిగట్టుననతనికొయ్యపడినచోటునుండి, యాయావుల నన్నిఁటిని, గొల్లవాండ్రచే, నాత్రిజటునియాశ్రమంబునకుఁ, దోలించెను. అని, తాత్పర్యము.

ఉవాచచ తతో రామ స్తం గార్గ్య మభి సాంత్వయన్. ౪౦

టీక॥ తతః=అటుపిమ్మట; రామః= రాముఁడు; తం=ఆ; గార్గ్యం=గర్గవంశమునం బుట్టిన త్రిజటుంగూర్చి; సాంత్వయన్=ఓఁడార్చుచు; ఉవాచ చ=చెప్పెను.

అంత, రాముండు, గార్గ్యుండగు నాత్రిజటుని, మంచిమాటలననునయించుచు, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.




మన్యు ర్న ఖలు కర్తవ్యః పరిహాసోఽప్యయం మమ

టీక॥ మన్యుః = కోపము; నకర్తవ్యః ఖలు = చేయఁబడవలసినది గాదుగదా! అయం = ఇది; మమ = నాయొక్క; పరిహాసోఽపి = వినోదార్థముగాఁ జెప్పినమాటగదా!

కోపము సేయకుము, నేనువినోదముగానీమాటం జెప్పినానుగాని వేఱుగాదు. అని, తాత్పర్యము.

ఇదం హి తేజ స్తవ య ద్దురత్యయం
తదేవ జిజ్ఞాసితు మిచ్ఛతా మయా. ౪౧
ఇమం భవా నర్థ మభిప్రచోదితో
వృణీష్వ కిం చే దపరం వ్యవస్యసి

టీక॥ తవ = నీయొక్క; దురత్యయం = తనకన్ననధికము లేని; ఇదం = ఈ; తేజః = తేజస్సు; యత్ (అస్తి) = ఏది యున్నదో; తదేవ = దానినే; జిజ్ఞాసితుం = విచారించుటకు; ఇచ్ఛతా = కోరుచున్న; మయా = నాచేత; భవాన్ = నీవు; ఇమం = ఈ; అర్థం = కార్యమునుగూర్చి; అభిప్రచోదితః = ప్రేరింపఁబడినావు. అపరం = మఱియొకదానిని; వ్యవస్యసి చేత్ = కోరుదువేని; వృణీష్వ = కోరుము కిం = ఏది?

నీతేజంబు మిక్కిలి నధికంబుగానుండుటం జూచి, దానిం జక్కఁగాఁ దెలిసికొనఁగోరి, నేను నీకు, "కొయ్యను ద్రిప్పివైవు" మని చెప్పినాను; మఱియేమియుఁ గాదు. నీకింక నేమైనఁ గావలయునని గోర్కెయుండు నేని, దానిం జెప్పుము; ఇచ్చెదను. అని, తాత్పర్యము.

బ్రవీమి సత్యేన న తేఽస్తి యన్త్రణా
ధనం హి యద్య న్మమ విప్రకారణాత్. ౪౨
భవత్సు సమ్యక్ప్రతిపాదనేన త
న్మయా జితం ప్రీతియశస్కరం భవేత్

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; సత్యేన = సత్యముచేత; బ్రవీమి = చెప్పుచున్నాను. తే = నీకు; యన్త్రణా = సంకోచము; నాస్తి = లేకపోవుఁగాక.




మమ=నాకు; యద్యత్ =ఏయే; ధనం=ధనము; అస్తి (అధ్యాహృతము)=ఉన్నదో; తత్ (అధ్యాహృతము)=అది; విప్రకారణాత్ =బ్రాహ్మణులకొఱకే. భవత్సు=మీయందు; సమ్యక్ =చక్కఁగా; ప్రతిపాదనేన=వినియోగించుటచేత; మయా=నాచేత; ఆర్జితం= సంపాదింపఁబడిన; తత్ =ఆధనము; ప్రీతియశస్కరం=సంతోషమును గీర్తినింజేయునది; భవేత్ =అగును.

నేను సత్యముగాఁజెప్పుచున్నాను; నీకుసంకోచమక్కఱలేదు; నాధనమేదేదియున్నదో, అదియంతయుబ్రాహ్మణులకొఱకేగానివేఱుగాదు; మీయందిచక్కఁగావిని యోగపడునేని, నేను సంపాదించినది సుప్రయోజనమైనాకు సంతోషంబును గీర్తియును, గలుగును. అని; రాముండు, త్రిజటునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

తత స్సభార్య స్త్రిజటో మహాముని
ర్గవా మనీకం ప్రతిగృహ్య మోదితః. ౪౩
యశోబలప్రీతిసుఖోపబృంహణీ
స్తదా శిషః ప్రత్యవద న్మహాత్మనః

టీక॥ తతః=అటుపిమ్మట; సభార్యః=భార్యతోఁగూడిన; మహామునిః=పూజ్యుఁడైనమునియగు; త్రిజటః=త్రిజటుఁడు; గవాం = ఆవులయొక్క; అనీకం=సమూహమును; ప్రతిగృహ్య= పుచ్చుకొని; మోదితః=సంతోషించినవాఁడై; తదా=అప్పుడు; మహాత్మనః= పూజ్యంబగుస్వభావముగలరామునకు; యశోబలప్రీతిసుఖోపబృంహణీః= కీర్తిని బలమునుసంతోషమునుసుఖమునువృద్ధిఁబొందించునట్టి; ఆశిషః= ఆశీర్వచనంబులను; ప్రత్యవదత్ =బదులుచెప్పెను.

అంత, మహామునియగుత్రిజటుండునుఅతనిభార్యయు, నాయావులంబుచ్చుకొని, సంతోషించి, మహిమయుంగోరక, మహాత్ముండగురామునకుఁ, గీర్తియుబలంబునుసంతోషంబునుసుఖంబును వృద్ధిఁబొందునట్లు, ఆశీర్వచనంబు, లొసంగిరి. అని, తాత్పర్యము.

సచాపి రామః ప్రతిపూర్ణమానసో
మహద్ధనంధర్మబలైరుపార్జితమ్. ౪౪

నియోజయామాస సుహృజ్జనే చిరా
ద్యథార్హసమ్మానవచః ప్రచోదితః

టీక॥సః=ఆ; రామశ్చాపి = రాముఁడును; ప్రతిపూర్ణమానసః=నిండినమనసుగలవాఁడై; యథార్హ సమ్మానవచః ప్రచోదితః (ప్రచోదితయథార్హసమ్మానవచాః)=చెప్పఁబడిన యథోచితములయినసమ్మానవాక్యములుగలవాఁడై; సుహృజ్జనే= స్నేహితజనమువిషయమయి; ధర్మబలైః= ధర్మముతోఁగూడినపరాక్రమములచేత; ఆర్జితం=సంపాదింపఁబడిన; మహత్=అధికమయిన; ధనం= ధనమును; అచిరాత్=శీఘ్రముగా; నియోజయామాస=ఆజ్ఞాపించెను.

అంతరాముండు, పూర్ణంబగుమనంబున, వారివారికిఁదగునట్లు సమ్మానవాక్యంబులాడి, తానుధర్మంబు దప్పకపరాక్రమంబునసంపాదించిన ధనమునంతయు, స్నేహితులకిమ్మని యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

ద్విజస్సుహృద్భృత్య జనోథవాతదా
దరిద్రభిక్షాచరణశ్చయోభవత్. ౭౫
నతత్రకశ్చిన్న బభూవతర్పితో
యథార్హసమ్మాననదాన సంభ్రమైః

టీక॥తత్ర=అచ్చట; ద్విజః= బ్రాహ్మణుఁడుగాని; సుహృత్ = స్నేహితుఁడుగాని; భృత్యజనః=నౌకరులుగాని; అథవా=లేక; యః=ఎవ్వఁడు; భిక్షాచరణః=బిచ్చమెత్తుకొనువాఁడు; అభవత్=ఉండెనో; సః (అధ్యాహృతము) చ=అతఁడునుగాని; కశ్చిత్=ఒకానొకఁడును; యథార్హసమ్మానన దాన సంభ్రమైః=యథోచితముగా గౌరవించుటచేతను ఇచ్చుటచేతను సంతోషముచేతను; తర్పితః= తృప్తినొందఁ జేయబడినవాఁడు; నబభూవ=కాకుండలేదు.

ఆయయోధ్యయందు, బ్రాహ్మణుఁడుగాని రామునిస్నేహితుఁడు గాని యతనిభృత్యజనముగాని బిచ్చమెత్తుకొనువారుగాని, యందఱును రాముని వలనయథోచితగౌరవంబునుధనంబును గో

ఫలనుఁబొంది,మహాసంతోషంబు నొందిరి. అని,తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ద్వాత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ ద్వాత్రింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

త్రయస్త్రింశసర్గప్రారంభః.

దత్త్వాతు సహవైదేహ్యా బ్రాహ్మణేభ్యో ధనం బహు
జగ్మతుః పితరం ద్రష్టుం సీతయాసహ రాఘవౌ. ౧

టీక॥రాఘవౌ= రామలక్ష్మణులు; వైదేహ్యాసహ=సీతతోఁగూడ;బ్రాహ్మణేభ్యః—బ్రాహ్మణులకొఱకు; బహు= అధికమయిన;ధనం=ధనమును; దత్త్వాతు=ఇచ్చినంతనే; పితరం=తండ్రిని;ద్రష్టుం = చూచుటకు;సీతయాసహ=సీతతోఁగూడ;జగ్మతుః=పోయిరి.

రామలక్ష్మణులు , సీతతోఁగూడ, నట్లు.బ్రాహ్మణులకుయథేష్టంబుగా ధనంబొసంగి,యంత,దశరథుం జూచుటకై, సీతనుందీసికొని,పోయిరి. అని,తాత్పర్యము.

తతో గృహీతే దుష్ప్రేక్షే త్వశోభేతాం తదాయుధే
మాలాదామభి రాబద్ధే సీతయా సమలంకృతే. ౨

టీక॥తతః= అటుపిమ్మట;దుష్ప్రేక్షే = చూడఁగూడనివైన;మాలాదామభిః=పుష్పమాలికలచేత; ఆబద్ధే=కట్టఁబడినవి;తదాయుధే = వారలయాయుధములును;ధనుస్సులనుట (ఇదిఖడ్గాదులకునుపలక్షణము);గృహీతే = గ్ర

హింపఁబడినవై; సీతయా=సీతచేత; స మలంకృతే= చక్కఁగానలంకరింపఁబడినవై; అశోభేతాం=ప్రకాశించినవి.

అంత, నా రామలక్ష్మణులు పుష్పమాలికలనలంకరింపఁబడిన ధనుఃఖడ్గాద్యాయుధంబులఁగ్రహింపఁగా, నవి, చేతిచూడనలవిగాక, సీతసమీపంబుననుండుటంజేసి, మిక్కిలియుఁబ్రకాశించినవి.

అని, తాత్పర్యము.

తతః ప్రాసాదహర్మ్యాణి విమానశిఖరాణిచ
అధిరుహ్య జనశ్శ్రీమా నుదాసీనో వ్యలోకయత్. ౩

టీక॥ తతః = అటుపిమ్మట; శ్రీమాన్=కాంతిగల; జనః = జనము; ఉదాసీనః=సంతోషములేనివారలై; ప్రాసాదహర్మ్యాణి = రాజులయొక్కయు దేవతలయొక్కయును గృహములనుధనవంతులయిండ్లను; విమానశిఖరాణిచ=ఏడంతస్తులమేడలశిఖరములను; అధిరుహ్య=ఎక్కి; వ్యలోకయత్=చూచినది.

అంత, రామునిపట్టాభిషేకంబునకై యలంకరించుకొనియుండుజనులందఱు, సంతోషంబువిడిచి, రాజగృహంబులఁదేవాలయంబులను, విమానశిఖరంబులను, ఎక్కి, చూచుచుండిరి.

అని, తాత్పర్యము.

నహి రథ్యా స్స్మ శక్యంతే గంతుం బహుజనాకులాః
ఆరుహ్య తస్మా త్ప్రాసాదా న్దీనాః పశ్యంతి రాఘవమ్. ౪

టీక॥ బహుజనాకులాః= పెక్కుల యినజనులచేనిండిన; రథ్యాః=మార్గములు ("స్మ" అనునది పాదపూరణార్థము); గంతుం = పోవుటకు; నశక్యంతేహి=అలవిగావుకదా! తస్మాత్=అందువలన; జనాః(అధ్యాహృతము)= జనులు; ప్రాసాదాన్ = మేడలను; ఆరుహ్య=ఎక్కి; దీనాః= దుఃఖంబునొందినవారలై; రాఘవం=రామునిఁ; పశ్యంతి=చూచుచుండిరి.

మార్గములలో జనులధికముగానుండుటవలన, అందుఁబోవుటకు వీలుగాకుండుటంజేసి, జనులు, ప్రాసాదంబులనెక్కి, దుఃఖంబున, రాముం, జూచుచుండిరి. అని, తాత్పర్యము.

పదాతిం వర్జితచ్ఛత్రం రామం దృష్ట్వా జనా స్తదా
ఊచు ర్బహువిధా వాచ శ్శోకోపహతచేతసః. ౫

టీక॥ తదా=అప్పుడు; జనాః= జనులు; పదాతిం = కాళ్లతోనడుచుచున్నవాఁడును; వర్జితచ్ఛత్రం= విడువఁబడినగొడుగుగలవాఁడునగు; రామం=రాముని; దృష్ట్వా=చూచి; శోకోపహతచేతసః=దుఃఖముచేతఁగొట్టఁబడినమనసుగలవారలై; బహువిధాః= పెక్కువిధములయిన; వాచః = మాటలను; ఊచుః=చెప్పిరి.

అప్పుడు, జనులు, రాముండు ఛత్రంబుగూడలేక కాళ్లతోనడుచుచుఁ బోవుటంజూచి, పరమదుఃఖంబునొంది, నానావిధములుగా, మాటలాడుకొనిరి. అని, తాత్పర్యము.

యం యాంత మనుయాతిస్మ చతురంగబలం మహత్
త మేకం సీతయా సార్ధ మనుయాతిస్మ లక్ష్మణః ౬

టీక॥ యాంతం = పోవుచున్న; యం=ఎవ్వని; మహత్=గొప్పదైన; చతురంగబలం= రథముగజముగుఱ్ఱముపదాతియునైదునాలుగంగములుగలసేన; అనుయాతిస్మ= వెంబడింపుచుండినదో; ఏకం=ఒకఁడైన; తం=ఆరాముని; సీతయాసార్ధం = సీతతోఁగూడ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; అనుయాతిస్మ=వెంబడించుచున్నాఁడుగదా!

ఎవ్వఁడుపోవుచుండఁగా, గొప్పచతురంగసైన్యము, వెంబడించుచుండునో, ఇప్పుడట్టిరాముండొక్కఁడైపోవుచుండఁగా, సీతయునులక్ష్మణుండు నతని వెంబడించుచున్నారు. అని, తాత్పర్యము.

ఐశ్వర్యస్య రసజ్ఞస్సన్ కామినాం చైవ కామదః
నేచ్ఛత్యేవా నృతం కర్తుం పితరం ధర్మగౌరవాత్. ౭

టీక॥ రామః(అధ్యాహృతము)=రాముఁడు; ఐశ్వర్యస్య=ప్రభుత్వముయొక్క; రసజ్ఞస్సన్= రసమునెఱింగినవాఁడై, కామినాం=కోరికగలవారలకు; కామదశ్చైవ=కోరఁబడినవానినిచ్చువాఁడునై ; ధర్మగౌరవాత్=

ధర్మమునందలిగౌరవంబువలన; పితరం=తండ్రినిగూర్చి; అనృతం= అబద్ధమును; కర్తుం=చేయుటకు; నేచ్ఛత్యేవ=కోరనేకోరఁడు!

రాముండు,ఐశ్వర్యరసమునుజక్కఁగాననుభవింపుచున్నాఁడు; మఱియునెవ్వరుదేనిఁగోరుదురోవారలకువానినొసంగువాఁడు; అట్లయినను, ధర్మగౌరవంబునఁ, దండ్రికసత్య దోషమెట్లయినను సంభవింపకుండునట్లు చేయఁబూనియున్నాఁడు.అని, తాత్పర్యము.

యా నశక్యా పురా ద్రష్టుం భూతై రాకాశగై రపి
తా మద్య సీతాం పశ్యంతి రాజమార్గగతా జనాః. ౮

టీక॥యా=ఎవ్వతె; పురా=మునుపు; ఆకాశగైః=ఆకాశమునందుఁ దిరుగునట్టి; భూతైరపి=భూతములచేతను; ద్రష్టుం=చూచుటకు; శక్యాన = అలవిగాదో; తాం=అట్టి; సీతాం=సీతను; అద్య=ఇప్పుడు; రాజమార్గగతాః=రాజమార్గమునుబొందిన, జనాః=జనులు; పశ్యంతి=చూచుచున్నారు!

మున్నెవ్వతెను,ఆకాశంబునం దిరుగఁజాలినభూతంబులు సైతము చూడలేకుండినవో,అట్టిసీతనిప్పుడు, రాజమార్గంబులోని జనులందఱుఁ జూచుచున్నారు. అని.తాత్పర్యము.

అంగరాగోచితాం సీతాం రక్తచందనసేవినీమ్
వర్ష ముష్ణంచ శీతంచ నేష్యంత్యాశు వివర్ణతామ్. ౯

టీక॥అంగరాగోచితాం= మైపూఁతకుఁదగినదియును ; రక్తచందనసేవినీం=ఎఱ్ఱనిచందనమును సేవించునదియునగు; సీతాం=సీతను; వర్షం= వానయును; ఉష్ణంచ=ఎండయును; శీతంచ=చలియును; ఆశు=శీఘ్రముగా; వివర్ణతాం=మాయురంగుగలదగుటను ; నేష్యంతి=పొందింపఁగలవు.

మేలయినమైపూఁతకుఁదగినదియు నెప్పుడు నెఱ్ఱనిచందనంబుఁబూసుకొనునదియునగు సీతను , ఇంకశీఘ్రముగానే,వానయు నెండయుఁ జలియు,మాయురంగుగల్గునట్లు, సేయఁగలవు.

అని, తాత్పర్యము.

అద్య నూనం దశరథ స్సత్వ మావిశ్య భాషతే

టీ॥అద్య=ఇప్పుడు;దశరథః= దశరథుఁడు;సత్వం=పిశాచమును; ఆవిశ్య—పొంది;భాషతే—చెప్పుచున్నాఁడు.నూనం=నిశ్చయము.

ఇప్పుడు,దశరథునకుఁ బిశాచముపట్టియున్నది; ఇదినిశ్చయము; కావుననే యిట్లుచెప్పుచున్నాఁడు.
అని, తాత్పర్యము-

నహి రాజా ప్రియం పుత్రం వివాసయితు మిచ్ఛతి. ౧౦

టీక॥రాజా=దశరథుఁడు;ప్రియం=ఇష్టుండగు;పుత్రం=కొడుకును; వివాసయితుం—ఊరు వెడలఁగొట్టుటకు; నేచ్ఛతిహి—కోరఁడుగదా!

దశరథమహారాజెంతమాత్రము,తనప్రియపుత్రుండగురామునడవికిం బంపఁగోరఁడు.అని, తాత్పర్యము.

నిర్గుణస్యాపి పుత్రస్య కథం స్యా ద్విప్రవాసనమ్
కింపున ర్యస్య లోకో యం జితో వృత్తేన కేవలమ్. ౧౧

టీక॥నిర్గుణస్యాపి= గుణములు లేనివాఁడైనను;పుత్రస్య= కొడుకునకు ; విప్రవాసనం=ఊరువెడలఁగొట్టుట; కథం=ఎట్లు;స్యాత్=అగును?యస్య= ఎవ్వనియొక్క-;వృత్తేన కేవలం — చరిత్రముచేతనే;అయం=ఈ; లోకః = ప్రపంచము;జితః=జయింపఁబడినదో; తస్య(అధ్యాహృతము)—అతనికి ; కింపు నః(వక్తవ్యం)=చెప్పఁబడవలయునా?

నిర్గుణుండైనను కొడుకు నడవికిఁ బంపుదురా?అందు,దానాదిధర్మగుణంబులట్లుండఁగా,నొకసచ్చరిత్రము చేతనే, లోకంబునంతయు జయించిన రాముని వంటిసత్పుత్రునరణ్యంబునకుఁ బంపరని చెప్ప నేల?అని, తాత్పర్యము.

ఆనృశంస్య మనుక్రోశ శ్శ్రుతం శీలం దమ శ్శమః.
రాఘవం శోభయం త్యేతే షడ్గుణాః పురుషోత్తమమ్. ౧౨

టీక॥ ఆనృశంస్యం = క్రౌర్యములేకుండుట హింససేయకుండుటయనుట;

అనుక్రోశః=దయ; శ్రుతం=చదువు; శీలం=మంచిస్వభావము; దమః= ఇంద్రియనిగ్రహము; శమః=కోపములేకుండుటయు; ఏతే=ఈ; షట్ = ఆఱు; గుణాః=గుణములు; పురుషోత్తమం= పురుషశ్రేష్ఠుండగు; రాఘవం=రాముని; శోభయంతి=ప్రకాశింపఁజేయుచున్నవి

అహింసయు, దయయు, విద్యయు, సత్స్వభావమును, ఇంద్రియనిగ్రహమును, కోపములేకుండుటయు, నీయాఱుగుణంబులును, రామునియందునిత్యంబులై యున్నవి. అని, తాత్పర్యము.

తస్మా త్తస్యోపఘాతేన ప్రజాః పరమపీడితాః
ఔదకానీవ సత్త్వాని గ్రీష్మే సలిలసంక్షయాత్. ౧౩

టీక॥ తస్మాత్ = అందువలన; ప్రజాః=జనులు; తస్య=ఆ రామునకు; ఉపఘాతేన=హింసగల్గుటచేత; గ్రీష్మే= ఎండకాలమునందు; సలిలసంక్షయాత్= జలముయొక్క నశించుటవలన; ఔదకాని= జలమునందుండునట్టి; సత్త్వానీవ=జంతువులుంబోలె; పరమపీడితాః= మిక్కిలియుఁబీడింపఁబడినారు.

అట్టిసద్గుణసంపన్నుండగు రామునకుఁగష్టముసంభవించుటవలన, జనులందఱు, నెండకాలమున నీళ్లింకఁగా జలజంతువులుంబోలెఁ, బరమపీడ నొందియున్నారు. అని, తాత్పర్యము.

పీడయా పీడితం సర్వం జగదస్య జగత్పతేః.
మూలస్యే వోపఘాతేన వృక్షః పుష్పఫలోపగః. ౧౪

టీక॥ జగత్పతేః= ప్రపంచమునకధిపతియయిన; అస్య = ఈ రామునియొక్క; పీడయా=కష్టముచే; జగత్= ప్రపంచము; సర్వం = అంతయు; మూలస్య=వేరుయొక్క; ఉపఘాతేన, నశించుటచేత; పుష్పఫలోపగః= పుష్పములను ఫలములనుబొందునట్టి, పుష్పములతో ఫలములతోను గూడినట్టియనుట; వృక్షఇవ=చెట్టుంబలె; పీడితం= కష్టమునొందినది.

జగత్తునకంతయు నధిపతియయినయట్టి రామునకుఁగష్టముగలుగుటచేత, మూలమునఱుకఁబడిన పిమ్మటపుష్పఫలసహితముగా వృక్షము నాశంబునొందునట్లు, ప్రపంచమంతయుఁగష్టమునొంది యున్నది. అని, తాత్పర్యము.

మూలం హ్యేష మనుష్యాణాం ధర్మసారో మహాద్యుతిః
పుష్పం ఫలంచ పత్రంచ శాఖాశ్చా స్యేత రేజనాః. ౧౫

టీక॥ధర్మసారః= ధర్మమేసారముగాఁగలవాఁడును; మహాద్యుతిః = అధికమయినకాంతిగలవాఁడునగు ; ఏషః=ఈరాముఁడు;మనుష్యాణాం= మనుష్యులకు, ప్రాణిమాత్రమున కనుట; మూలంహి = వేఱుగదా! అస్య= ఈరాముండను వేఱుయొక్క,వృక్షము యొక్క యనుట; పుష్పం = పూవును; ఫలంచ=పండును; పత్రంచ=ఆకును; శాఖాశ్చ= కొమ్మలును ; ఇతరే=ఇతరులయిన; జనాః=జనులు.

ధర్మమునేయవలంబించి యుండువాఁడును గాంతిమంతుండునగు నీరాముండు, ప్రాణిమయమయిన వృక్షమునకు వేఱు; వృక్షమునందలి, పుష్పమునుఫలమును బత్రమును గొమ్మలునే, సమస్తజనులు.అని, తాత్పర్యము.

తేలక్ష్మణ ఇవ క్షిప్రం సపత్న్యః స్సహ బాంధవాః.
గచ్ఛంత మనుగచ్ఛామో యేన గచ్ఛతి రాఘవః. ౧౬

టీక॥ తే=అట్టి;వయం (అధ్యాహృతము)= మనము; సపత్న్యః= భార్యలతోఁ గూడినవారలమై; సహబాంధవాః=బంధువులతోఁ గూడినవారలమై; క్షిప్రం=శీఘ్రముగా;లక్ష్మణఇవ=లక్ష్మణుండువలె; రాఘవః=రాముఁడు; యేన=ఏమార్గముచేత;గచ్ఛతి=పోవుచున్నాఁడో;తేన(అధ్యాహృతము)= ఆమార్గముచేత;గచ్ఛంతం = పోవుచున్న;రామం(అధ్యాహృతము)=రాముని;అనుగచ్ఛామః=వెంబడింతము.

కావున,మనము,భార్యలనుబంధువులనుంగూడి,లక్ష్మణుండుంబోలె, శీఘ్రముగా,రాముండుపోవుదారింబట్టి, యతనివెంటనరుగుదము.

అని, తాత్పర్యము.

ఉద్యానాని పరిత్యజ్య క్షేత్రాణిచ గృహాణిచ.
ఏకదుఃఖసుఖా రామ మను గచ్ఛామ ధార్మికమ్. ౧౭

టీక॥ వయం(అధ్యాహృతము)= మనము=ఉద్యానాని=ఉద్యానవనములను;



క్షేత్రాణిచ = భూములను; గృహాణిచ=ఇండ్లను;పరిత్యజ్య = విడిచి;ఏకదుఃఖసుఖాః= సమానములయినదుఃఖసుఖములుగలవారమై; ధార్మికం=ధర్మమునాచరించునట్టి;రామం=రాముని;అనుగచ్ఛామ(అనుగచ్ఛామః)= వెంబడింతము.

మనము, ఉద్యానంబులనుభూములనుగృహంబులనువిడిచి, రాముండు, సుఖించినసుఖింపుచు, అతండుదుఃఖించినదుఃఖించుచు, ధార్మికుండగు రాముని వెంబడించుచుంబోవుదను.

అని, తాత్పర్యము.

సముద్ధృతనిధానాని పరిధ్వస్తాజిరాణివ
ఉపాత్తధనధాన్యాని హృతసారాణి సర్వశః. ౧౮
రజసాభ్యవకీర్ణాని పరిత్యక్తాని దైవతైః
మూషకైః పరిధావద్భి రుద్బిలై రావృతానిచ. ౧౯
అపేతోదకధూమాని హీనసమ్మార్జనానిచ
ప్రణష్టబలికర్మేజ్యామంత్రహోమజపానిచ. ౨౦
దుష్కాలే నేవ భగ్నాని భిన్నభాజనవంతిచ
అస్మత్త్యక్తాని వేశ్మాని కైకేయీ ప్రతిపద్యతామ్. ౨౧

టీక॥సముద్ధృతనిధానాని= ఎత్తఁబడిననిక్షేపధనముగలవియును; పరిధ్వస్తాజిరాణిచ=చెఱుపఁబడినముంగిళ్లు గలవియును; ఉపాత్త ధనధాన్యాని= తీసికొనిపోఁబడినధనమున్ను,ధాన్యమును గలవియును; సర్వశః= అన్నివిధంబులను;హృతసారాణి=అపహరింపఁబడినసారములుగలవియును;రజసా= పరాగముచేత; అభ్యవకీర్ణాని=వెదచల్లఁబడినవియును; దైవతైః= ఇలువేల్పులచేత; పరిత్యక్తాని=విడువఁబడినవియును;పరిధావద్భిః = పరుగెత్తుచున్నవియునగు; ఉద్బిలైః=త్రవ్వఁబడిన బొక్కలుగలవియునగు ; మూషకైః= పందికొక్కులచేత; ఆవృతానిచ=చుట్టఁబడినవియు;అపేతోదకధూమాని=జలమునుబొగయును లేనివియు; హీనసమ్మార్జనానిచ=విడువఁబడినచిమ్ముటగలవియు; ప్రణష్టబలికర్మేజ్యామంత్రహోమజపానిచ = నశించిన బలి




కార్యమునిష్టులును మంత్రధ్వనులు హోమములును జపములునుగలవియు; దుష్కాలేన=దుష్టకాలముచేత; భగ్నానీవ(స్థితాని)— క్షీణించినవివలె నున్నవియు; భిన్నభాజనవంతిచ=విఱిగినకుండలుగలవియునగు ; అస్మత్త్యక్తాని=మనచేతవిడువఁబడిన; వేశ్మాని= ఇండ్లను; కైకేయీ=కైకేయి ; ప్రతిపద్యతాం=పొందుఁగాక.

అట్లు, మనము విడిచిపోయినపిమ్మట, నిక్షేపములు పెల్లగింపఁబడియు, ముంగిళ్లుచెడియు ధనధాన్యంబులవ్వలికింగొనిపోఁబడియు, శయనాసనాదిముఖ్యపదార్థంబులన్నియుఁ దీసికొనిపోఁబడియు, నుండుటంజేసి, కాంతివిహీనంబులై, దుమ్ముచేసిండి, గృహదేవతలచేవిడువఁబడినవై, బిలంబులుద్రవ్వుకొనియిటునటుఁబాఱుచుండు మూషకంబులచే వ్యాపింపఁబడి, జలము చిలకరించుటయుఁజిమ్ముటయు లేకుండుటవలననపరిశుద్ధంబులయి, వంట లేకుండుటవలన ధూమ విహీనంబులై, "బలికర్మముఇష్టిమంత్రధ్వనిహోమముజపము" ఇవిలేనందున, నెంతమాత్రముశోభింపక, క్షామాదిదుష్టకాలంబులం బాధువడినవివో లెఁబూపట్టుచు, విఱిగిపోయినకుండలతో నుండు, మనయిండ్లనుదీసికొని, కైకేయి సుఖముగానుండుఁగాక.

అని, తాత్పర్యము.

వనం నగరమేవాస్తు యేనగచ్ఛతి రాఘవః
అస్మాభిశ్చ పరిత్యక్తం పురం సంపద్యతాం వనమ్. ౨౨

టీక॥యేన=ఏకారణముచేత; రాఘవః=రాముఁడు; గచ్ఛతి—పోవుచున్నాఁడో; తేన (అధ్యాహృతము)=ఆకారణముచేత; వనం=అడవి; నగరమేవ=పట్టణముగానే; అస్తు=అగుగాఁక. పురం=అయోధ్యాపట్టణము; అస్మాభిశ్చ=మాచేతను; పరిత్యక్తం= విడువఁబడినదై; వనం=అడవిగా; సంపద్యతాం=అగుఁగాక.

రాముండడవికిఁబోవుటవలన, నాయడవిపట్టణముగానే యుండుఁగాక; రాముండును మేమును విడిచి పోయినపిమ్మట, నీయయోధ్యాపట్టణమె యడవియగుఁగాక. అని, తాత్పర్యము.

స 33

బిలాని దంష్ట్రిణ స్సర్వే సానూని మృగపక్షిణః
త్యజంత్యస్మద్భయాద్భీతా గజా స్సింహా వనానిచ. ౨౩

టీక॥ దంష్ట్రిణః=కోఱలుగలజంతువులు పాములు మొదలగునవి, సర్వే=అన్నియును; బిలాని=బొక్కలను; మృగపక్షిణః=జింకలును బక్షులును; సానూని=కొండనెత్తములను; గజాః=ఏనుంగులును; సింహాః=సింహములును; వనానిచ=అడవులును; అస్మద్భయాత్=మనవలని భయమువలన; భీతాః=భయపడినవై; త్యజంతి=విడుచును.

మన మడవిలోఁ జేరినపిమ్మట, మనకు భయంపడి, పాములు, బిలములను, మృగములుఁ బక్షులుఁ గొండనెత్తములను, ఏనుంగులు సింహములు నడవులను, విడువఁగలవు.

అని, తాత్పర్యము.

అస్మత్త్యక్తం ప్రపద్యంతాం సేవ్యమానం త్యజంతుచ

టీక॥ తే(అధ్యాహృతము)= అవి; అస్మత్త్యక్తం=మాచే విడువఁబడినదానిని; ప్రపద్యంతాం=పొందుఁగాక. సేవ్యమానం=సేవింపఁబడుచున్నదాని; త్యజంతుచ=విడుచునుంగాక.

ఆహారసర్పాదులు, అట్లు, ఇదివఱకువానికినివాసస్థానమయినవనంబును విడిచి, మనచేవిడువఁబడినయాయయోధ్యాపట్టణంబులోవాసము సేయుచుండుఁగాక. అని, తాత్పర్యము.

తృణమాంసఫలాదానాం దేశం వ్యాళమృగద్విజమ్. ౨౪
ప్రపద్యతాం హి కైకేయీ సపుత్రా సహబాంధవైః

టీక॥ కైకేయీహి=కైకేయియే; సపుత్రా=కొడుకుతోఁగూడినదై; బాంధవైస్సహ=బంధువులతోఁగూడ; తృణమాంసఫలాదానాం=గడ్డినిమాంసమును బండ్లనుదిను జంతువులయొక్క; జింకలు, పులులు కాకులు మొదలగునవి, ఈజంతువుల యొక్క; వ్యాళమృగద్విజం=క్రూరములయిన మృగములును బక్షులునుగల; దేశం=దేశమును; ప్రపద్యతాం=పొందుఁగాక.

మనమువిడిచినపిమ్మట, కైకేయియు, ఆబిడకొడుకును బంధువులును,

జింకలుపులులు సింహములుకాకులుఇవి మొదలగుక్రూరజంతువులవలనగ్రూరప శులకును, నివాసస్థానమయినయాదే శమునుబొందుదురుగాక.

అని, తాత్పర్యము.

రాఘవేణ వనే సర్వే సహ వత్స్యామ నిర్వృతాః. ౨౫

టీక॥ వయం(అధ్యాహృతము)=మ నము;సర్వే=అందఱమును;వనే=అడవి యందు;రాఘవేణసహ= రామునితోఁ గూడ;నిర్వృతాః= సుఖముగలవారల మై;వత్స్యామ(వత్స్యామః) = ఉం డెదము.

మనమందఱమును,అడవిలో,రాము నితోఁగూడ, సుఖంబుగా, వాసముసే యుచుండెదము. అని, జనులుపరస్పర ముమాటలాడఁ కొనిరి.

అని, తాత్పర్యము.

ఇత్యేవం వివిధా వాచో నానాజనసమీరితాః
శుశ్రావ రామ శ్శ్రుత్వాచ నవిచక్రే స్య మానసమ్. ౨౬

టీక॥ రామః=రాముఁడు;ఇతి=అని;ఏ వం=ఇట్లు; నానాజనసమీరితాః=నా నావిధములయిన జనులచేఁ జెప్పఁబడిన; వివిధాః = నానావిధములయిన;వా చః=మాటలను;శుశ్రావ=వినెను. శ్రు త్వాచ=వినియు; అస్య= ఈరాముని యొక్క;మానసం=మనస్సును; నవిచ క్రే=వికారమునొందఁజేయదయ్యె.

రాముం,డిట్లువారువారు నానావి ధంబులుగాననుకొనుమాటలనువినెను; అట్లువిన్నను,అతనికిమనంబునకొంతమా త్రమువికారముగల్గలేదు.

అని, తాత్పర్యము.

సతు వేశ్మ పితు ర్దారా త్కైలాసశిఖరప్రభమ్
అభిచక్రామ ధర్మాత్మా మత్తమాతంగవిక్రమః. ౨౭

టీక॥ధర్మాత్మా = ధర్మస్వభా వుఁడును;మత్తమాతంగవిక్రమః= మ దపుటేనుఁగుయొక్కనడకవంటినడకగ లవాఁడునగు; సతు=ఆరాముండును;

కైలాసశిఖరప్రభం= కైలాసపర్వతశిఖరముయొక్క కాంతివంటి కాంతి గల;పితుః=తండ్రియొక్క;వేశ్మ= గృహమును గూర్చి; దూరాత్=దూరముననుండి;అభిచక్రామ=ప్రదక్షిణించెను.

ధర్మాత్ముండును మదవు ఁటేనుంగుంబోలెఁ గంభీరంబుగా నడచువాఁడునగు రాముండు, దూరంబునఁ, గైలాసపర్వతశిఖరంబుంబోలెఁ దెల్లఁగా నత్యున్నతంబై యుండు తన తండ్రి గృహముం జూచి, ప్రదక్షిణము చేసెను.

అని, తాత్పర్యము.

వినీతవీరపురుషం ప్రవిశ్యతు నృపాలయమ్
దదర్శా వస్థితం దీనం సుమంత్ర మవిదూరతః. ౨౮

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; వినీతవీరపురుషం=వినయముతోఁ గూడిన వీరులగు పురుషులు గల; నృపాలయం=రాజగృహమును ; ప్రవిశ్యతు=ప్రవేశించిన నంతనె; అవిదూరతః=కొంచెము దూరంబున;అవస్థితం=ఉన్నవాఁడును; దీనం= దుఃఖమునొందినవాఁడునగు;సుమంత్రం= సుమంత్రుని;దదర్శ=చూచెను.

రాముండు, వినయవంతులగు వీరపురుషులచే రక్షింపఁబడుచుండు, రాజగృహంబుఁ బ్రవేశించి, కొంచెము దూరంబున దుఃఖితుండై యున్న, సుమంత్రుం జూచెను. అని, తాత్పర్యము.

ప్రతీక్షమాణోపి జనం తదా ర్త
మనార్తరూపః ప్రహసన్నివా థ
జగామ రామః పితరం దిదృక్షుః
పితు ర్నిదేశం విధివ చ్చికీర్షుః. ౨౯

టీక॥ రామః=రాముఁడు;తదా=అప్పుడు;ఆర్తం=దుఃఖితంబగు; జనం=జనమును;ప్రతీక్షమాణోపి=చూచుచున్నవాఁడయ్యును; అనార్తరూపః=దుఃఖమునొందని రూపముగలవాఁడై; అథ=ఇంకను;ప్రహసన్నివ(స్థితః)= నవ్వుచున్నట్లున్నవాఁడై; పితుః = తండ్రియొక్క;నిదేశం=ఆజ్ఞను;విధివత్ = యథాశాస్త్రముగా;చికీర్షుః = చేయఁగోరువాఁడై;పితరం = తండ్రిని;దిదృ

క్షుః=చూడఁగోరినవాఁడై; జగామ=పోయెను.

అట్లు, రాముండు తనతండ్రియాజ్ఞను యథావిధింజేయఁగోరి, తండ్రింజూచుటకై పోవుచు, దారిలోతన్నుఁజూచిదుఃఖితులగు న జనులంజూచియు, నెంత మాత్రముదుఃఖము నొందకుండుటయె గాక , నవ్వుచున్నట్లు,సంతోషముననే యుండెను. అని, తాత్పర్యము.

తత్పూర్వ మైక్ష్వాకసుతో మహాత్మా
రామో గమిష్య న్వన మార్తరూపమ్
వ్యతిష్ఠత ప్రేక్ష్య తదా సుమంత్రం
పితు ర్మహాత్మా ప్రతిహారణార్థమ్. ౩౦

టీక॥ వనం = అడవినిగూర్చి; గమిష్యన్ = పోఁగలవాఁడగు; మహాత్మా=పూజ్యమైనస్వభావముగలవాఁడును; మహాత్మా= అధికమయినధైర్యముగలవాఁడునగు; ఐక్ష్వాకసుతః= ఇక్ష్వాకువంశమునఁబుట్టినదశరథునికొడుకునగు; రామః = రాముఁడు; తదా=అప్పుడు; తత్పూర్వం= అదిమొదలు, దశరథుండు రామునడవికిఁబొమ్మన్నది మొదలగుట; ఆర్తరూపం=దుఃఖమునొందినరూపముగల; సుమంత్రం=సుమంత్రుని; ప్రేక్ష్య=చూచి; పితుః=తండ్రికి; ప్రతిహారణార్థం=తన రాకను దెలుపుటకై; వ్యతిష్ఠత = నిలిచెను.

మహాత్ముండును మహాధైర్యశాలియును దశరథపుత్రుండును వనంబునకుఁ బోఁబోవువాఁడునగు రాముండు, అచ్చట, తన్నుదశరథుండడవికిఁబొమ్మన్నది మొదలు దుఃఖితుండైయున్నసుమంత్రుం జూచి,తండ్రికిందన రాకం దెల్పుటకైయ తనిం బ్రతీక్షింపుచుఁ, గొంతదడవునిలిచెను. అని, తాత్పర్యము.

పితు ర్నిదేశేనతు ధర్మవత్సలో
వనప్రవేశే కృతబుద్ధినిశ్చయః
స రాఘవః ప్రేక్ష్య సుమంత్ర మబ్రవీ
న్నివేదయ స్వాగమనం నృపాయ మే. ౩౧

టీక॥ధర్మవత్సలః=ధర్మమునందధికశ్రద్ధగలవాఁడును;పితుః=తండ్రియొక్క;నిదేశేనతు=ఆజ్ఞచేతనే; వనప్రవేశే=వనంబునొందుటయందు; కృతబుద్ధినిశ్చయః= చేయఁబడినబుద్ధియొక్కనిశ్చయముగలవాఁడునగు;సః=ఆ; రాఘవః=రాముఁడు;సుమంత్రం= సుమంత్రుని;ప్రేక్ష్య=చూచి;"మే= నాయొక్క;ఆగమనం=రాకను;స్వపాయ=దశరథమహారాజుకొఱకు;నివేదయస్వ=తెల్పుము"ఇతి(అధ్యాహృతము)= అని;అబ్రవీత్=పలికెను.

పరమధార్మికుండుగావునఁ, దండ్రియాజ్ఞచే, వనంబునకుండనిశ్చయించుకొనియుండు, రాముండు, సుమంత్రుంబూచి, "నేనువచ్చితినని యున్నానని దశరథమహారాజునకుం దెల్పుము"అని, చెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, త్రయస్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండత్రయస్త్రింశసర్గటీక,
ముగిసినది.

౩౪

చతుస్త్రింశసర్గప్రారంభః.

తతః కమలపత్రాక్షః శ్యామో నిరుదరో మహాన్
ఉవాచ రామ స్తం సూతం పితురాఖ్యాహి మామితి. ౧

టీక॥తతః=అటుపిమ్మట ; కమలపత్రాక్షః=తామరపూరేకులవంటి కన్నులుగలవాఁడును; శ్యామః= నల్లనివాఁడును; నిరుదరః=కడుపులేనివాఁడును; సన్నకడుపు గలవాఁడు ననుట ; మహాన్=పూజ్యుఁడునగు; రామః=రాముఁడు;తం=ఆ;సూతం=సారథియగు సుమంత్రునిగూర్చి; "మాం=నన్ను;

తతుః=తండ్రికి; ఆఖ్యాహి= చెప్పుము" ఇతి=అని; ఉవాచ=పలికెను.

అంతట, దామరపూతేకులుంబోలె విశాల సుందరంబులయిన కండ్లుగలిగి శ్యామలవర్ణంబునొప్పుచు, సన్నని దుముగలిగియుండు, పూజ్యుండగు రాముండు, సారథియగు నాసుమంత్రుం జూచి, "నేనువచ్చియున్నానని నాతండ్రికింజెప్పుము" అని, చెప్పెను. అని, తాత్పర్యము.

స రామప్రేషితః క్షిప్రం సంతాప కలుషేంద్రియః
ప్రవిశ్య నృపతిం సూతో నిశ్శ్వసంతం దదర్శ హ. ౨

టీక॥ సః=ఆ; సూతః= సారథియగుసుమంత్రుండు; రామప్రేషితః=రామునిచేఁబంపఁబడినవాఁడై; సంతాపకలుషేంద్రియః=దుఃఖముచేఁగలఁకఁబాఱినయింద్రియములు గలవాఁడై; క్షిప్రం=శీఘ్రముగా; ప్రవిశ్య=చొచ్చి; నిశ్శ్వసంతం= నిట్టూర్పులు వుచ్చుచున్న; నృపతిం=దశరథ మహారాజును; దదర్శ=చూచెను "హ" అనునది పాదపూరణార్థము.

ఆసుమంత్రుండు, దుఃఖంబున నింద్రియంబులన్నియుఁ గలంకం బాఱఁగా, రామునిపంపున, శీఘ్రంబున, లోనికింబోయి, నిట్టూర్పులు వుచ్చుచున్నదశరథుంజూచెను. అని, తాత్పర్యము.

ఉపరక్త మివాదిత్యం భస్మచ్ఛన్న మివానలమ్
తటాక మివ నిస్తోయ మపశ్య జ్జగతీ పతిమ్. ౩

టీక॥ సః (అధ్యాహృతము)= ఆసుమంత్రుఁడు; ఉపరక్తం=రాహువుచే గ్రసింపఁబడిన; ఆదిత్యమివ (స్థితం)=సూర్యుండుంబోలెనున్నవాఁడును; భస్మచ్ఛన్నం=బూడిదచేఁగప్పఁబడిన; అనలమివ (స్థితం)= అగ్నిహోత్రుఁడువలెనున్నవాఁడును; నిస్తోయం= నీళ్లులేని; తటాకమివ (స్థితం)=చెఱువుంబోలెనున్నవాఁడునగు; తం=ఆ, జగతీపతిం=భూమికిఁబ్రభువైనదశరథ మహారాజును; అపశ్యత్=చూచెను.

ఆసుమంత్రుండుచూచినప్పుడు, దశరథుండు, రాహుగ్రస్తుండగు సూర్యునిచందంబున బూడిదచేఁ గప్పఁబడిన

యగ్నిహోత్రునికైవడి, నీళ్లులేనిచెఱువుభంగి, కాంతిహీనుఁడై యుండెను.

అని, తాత్పర్యము.

ఆలోక్యతు మహాప్రాజ్ఞః పరమాకులచేతసమ్
రామ మేవానుశోచంతం సూతః ప్రాంజలి రాసదాత్. ౪

టీ॥ మహాప్రాజ్ఞః= పూజ్యుఁడైన పండితుండగు; సూతః=సారథియైయున సుమంత్రుండు; పరమచేతసం=మిక్కిలి యు దుఃఖమునొందినమనసు గలవాఁడును; రామ మేవ=రామునిగూర్చియే; అనుశోచంతం=దుఃఖించుచుండువాఁడునగు; తం (అధ్యాహృతము)= ఆదశరథుని; ఆలోక్యతు = చూచినంతనె; ప్రాంజలిః=మంచి చేమోడ్పుగలవాఁడై; ఆసదాత్=సమీపించెను.

మహాపండితుండగు సుమంత్రుండు, పరమ దుఃఖంబునొంది రామునిం జేర్కొనుచు దుఃఖించుచున్నదశరథుం జూచినంతనె, చేతులుమొగిడ్చుకొని, సమీపంబునకుం బోయెను. అని, తాత్పర్యము.

తం వర్ధయిత్వా రాజానం సూతః పూర్వం జయాశిషా
భయ విక్లబయా వాచా మందయా శ్లక్ష్ణ మబ్రవీత్, ౫

టీక॥ సూతః=సుమంత్రుఁడు; తం=ఆ; రాజానం=దశరథమహారాజును; జయాశిషా=జయప్రదంబగు నాశీర్వచనముచేత; వర్ధయిత్వా=దీవించి; భయవిక్లబయా= భయముచేఁ దడఁబడుచున్న; మందయా=తిన్నని; వాచా=మాటచేత; శ్లక్ష్ణం=మధురముగా; అబ్రవీత్=పలికెను.

సుమంత్రుం, డంత, దశరథమహారాజునకు జయము గలుగునట్లు ఆశీర్వచనము చేసి, భయముచే దడఁబడుచు, మందవాక్యంబునను, మధురంబుగా, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అయం సపురుషవ్యాఘ్రో ద్వారి తిష్ఠతి తే సుతః
బ్రాహ్మణేభ్యో ధనం దత్వా సర్వం చైవోప జీవినామ్. ౬

టీక॥ పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండగు; సః=అట్టి, అయం=ఈ; తే=నీయొక్క; సుతః=కొడుకురాముండు; బ్రాహ్మణేభ్యః= బ్రాహ్మణులకొఱకును; ఉపజీవినాంచైవ=భృత్యులకును; సర్వం=సమస్తమయిన; ధనం=ద్రవ్యమును; దత్త్వా=ఇచ్చి; ద్వారి=వాకిలియందు; తిష్ఠతి=ఉన్నాఁడు.

పురుషశ్రేష్ఠుండగునట్టి నీకొడుకు రాముండు, తనధనమునంతయు, బ్రాహ్మణులకును భృత్యులకునొసంగి, నిన్నుఁజూచుటకై, వచ్చివాకిటం, గనిపెట్టియున్నాఁడు. అని, తాత్పర్యము.

స త్వా పశ్యతు భద్రం తే రామ స్సత్య పరాక్రమః
సర్వాం త్సుహృద ఆపృచ్ఛ్య త్వా మిదానీం దిదృక్షతే. ౭

టీక॥ తే=నీకు; భద్రం=మంగళము; అస్తు(అధ్యాహృతము)=అగుఁగాక. సత్యపరాక్రమః=విచ్చటను వ్యర్థముకాని పరాక్రమముగల; సః= ఆ; రామః= రాముఁడు; త్వాం=నిన్ను; పశ్య = చూచుఁగాక. సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; సుహృదః = మిత్రులను; సర్వాన్=అందఱను; ఆపృచ్ఛ్య=వీడుకొని; ఇదానీం=ఇప్పుడు; త్వాం= నిన్ను; దిదృక్షతే=చూడఁగోరుచున్నాఁడు.

సత్యపరాక్రముండగు నారామునకు నీవిప్పుడు దర్శనంబొసంగుము; అతండు, మిత్రులనందఱనువీడుకొని, నిన్ను వీడ్కొనుటకై యిచ్చుటకు వచ్చి, నిన్నుంజూడఁగోరుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

గమిష్యతి మహారణ్యం తం పశ్య జగతీపతే
వృతం రాజగుణై స్సర్వై రాదిత్య మివ రశ్మిభిః. ౮

టీక॥ జగతీపతే=భూమికిఁబ్రభువైన దశరథమహారాజా! సః(అధ్యాహృతము)=ఆరాముండు; మహారణ్యం=పెద్దయడవినిగూర్చి; గమిష్యతి=పోఁగలడు; సర్వైః=సమస్తమయిన; రాజగుణైః= రాజయోగ్యంబగుగుణంబుల చేత; వృతం=చుట్టబడినవాఁడును; రశ్మిభిః= కిరణముల చేత; వృతం(అధ్యాహృతము)= చుట్టఁబడిన; ఆదిత్యమివ(స్థితం) =సూర్యుండుపోలెనున్నవాఁడునగు; తం= ఆ

రాముని; పశ్య=చూడుము.

దశరథమహారాజా! ఆరాముండు, డింకనడవికిం బోవుటకున్నాఁడు; కావున, సూర్యుఁడు కిరణంబులతోఁ గూడియుండునట్లు. సమస్తరాజగుణంబులతోను గూడియున్నయతని, నీవిప్పుడే చూడుము అనిసుమంత్రుండు, దశరథునితోఁ జెప్పెను. అని. తాత్పర్యము.

స సత్యవాదీ ధర్మాత్మా గాంభీర్యాత్సాగరోపమః
ఆకాశ ఇవ నిష్పంకో నరేంద్రః ప్రత్యువాచ తమ్. ౯

టీక॥ సత్యవాదీ=సత్యమునే చెప్పువాఁడును; ధర్మాత్మా= ధర్మస్వభావుండును; గాంభీర్యాత్ = గాంభీర్యమువలన; సాగరోపమః= సముద్రముతోఁ బోలికగలవాఁడును; ఆకాశ ఇవ= ఆకాశమువలె; నిష్పంకః= మాలిన్యము లేనివాఁడునగు; సః=ఆ; నరేంద్రః=మనుష్యులకుఁ బ్రభువైన దశరథమహారాజు; తం=ఆసుమంత్రుంగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

సత్యవాదియును ధర్మాత్ముండును గాంభీర్యంబున సముద్రంబునకు సరివచ్చువాఁడు నాకాశముంబోలె నిర్మలుండు నగు, నాదశరథమహారాజు, సుమంత్రుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

సుమంత్రానయ మే దారాన్ యే కేచి దిహ మామకాః
దారైః పరివృత స్సర్వై ర్ద్రష్టు మిచ్ఛామి ధార్మికమ్. ౧౦

టీక॥ సుమంత్ర = సుమంత్రుఁడా! మామకాః (దారాః) = నాభార్యలు; యే కేచిత్ =ఎవ్వరెవ్వరు; ఇహ=ఇచ్చట; సంతి (అధ్యాహృతము) = ఉన్నారో; తాన్ (అధ్యాహృతము)=ఆ; మే= నాయొక్క; దారాన్ =భార్యలను; ఆనయ=తోడ్కొనిరమ్ము. సర్వైః=సమస్తులైన; దారైః=భార్యలతో; పరివృతః= చుట్టఁబడినవాఁడనై; ధార్మికం=ధర్మమునాచరించునట్టి రాముని; ద్రష్టుం= చూచుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను.

సుమంత్రుఁడా! ఇప్పుడిచ్చటనుండు నాభార్యలనందఱం దోడ్కొనిరమ్ము; భార్యలయందఱింగూడి, ధార్మికుండగు రాముంజూడఁగోరుచున్నాను.

అని, తాత్పర్యము.

సోంతః పుర మతీత్యైవ స్త్రియ స్తా వాక్య మబ్రవీత్

టీక॥సః=ఆసుమంత్రుండు; అంతః పురం=అంతఃపురమును;అతీత్యైవ=అతిక్రమించియే; తాః=ఆ; స్త్రియః=స్త్రీలంగూర్చి;వాక్యం = మాటను; అబ్రవీత్=పలికెను.

ఆసుమంత్రుండు, అంత నంతఃపురమునతిక్రమించిపోయి, దశరథునిభార్యలంజూచి,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

ఆర్యా హ్వయతి వో రాజా గమ్యతాం తత్ర మాచిరమ్. ౧౧

టీక॥ఆర్యాః = పూజ్యులయినస్త్రీలా! రాజా=దశరథమహారాజు; వః=మిమ్ములను;హ్వయతి= పిలుచుచున్నాఁడు.తత్ర=అచ్చట; మాచిరం=శీఘ్రముగా;గమ్యతాం=పొందఁబడుఁగాక.

దశరథమహారాజు మిమ్ములంబిలుచుచున్నాఁడు; శీఘ్రముగా నచ్చటికిఁ బొండు. అని, సుమంత్రుఁడుదశరథుని భార్యలతోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఏవ ముక్తా స్స్త్రియ స్సర్వా స్సుమంత్రేణ నృపాజ్ఞయా
ప్రచక్రము స్త ద్భవనం భర్తు రాజ్ఞాయ శాసనమ్. ౧౨

టీక॥స్త్రియః= స్త్రీలు;సర్వాః= అందఱును;సుమంత్రేణ=సుమంత్రునిచేత;నృపాజ్ఞయా=రాజాజ్ఞచే; ఏవం= ఇట్లు చెప్పఁబడినవారలై;భర్తుః= పెనిమిటియొక్క;శాసనం=ఆజ్ఞను;ఆజ్ఞాయ=అంగీకరించి;తత్=ఆ; భవనం= ఇంటినిగూర్చి; ప్రచక్రముః= బయలుదేఱిరి.

ఆదశరథభార్యలు, సుమంత్రుఁడు, రాజాజ్ఞననుసరించిచెప్పినమాటనువిని, పెనిమిటియాజ్ఞనుశిరసావహించి, పెనిమిటియుండునింటికింబోయిరి.

అని, తాత్పర్యము.

అర్ధసప్తశతా స్తా స్తు ప్రమదా స్తామ్రలోచనాః

కౌసల్యాం పరివార్యాథ శనైర్జగ్ముర్ధృతవ్రతాః. ౧౩

టీక॥ అథ = అటుపిమ్మట; ధృతవ్రతాః = ధరింపఁబడిన వ్రతముగల; పతివ్రతలగునటి; తాః = ఆ; ప్రమదాః = స్త్రీలు; అర్ధసప్తశతాస్తు = ఏడునూఱులలో సగమంతటివారును, మూఁడునూఱులయేఁబదిమందియునను; తామ్రలోచనాః = ఎఱ్ఱనికండ్లుగలవారలై; కౌసల్యాం = కౌసల్యను; పరివార్య = చుట్టుకొని; శనైః = మెల్లఁగా; జగ్ముః = పోయిరి.

అంతఁ, బతివ్రతలగు నాస్త్రీలు, మూఁడునూఱులయేఁబదిమందియును, రామదుఃఖంబున నెఱ్ఱఁగానుండుకండ్లతోఁ, గౌసల్యంబరివేష్టించి, మెల్లఁగా నడుచుచుఁబోయిరి. అని, తాత్పర్యము.

ఆగతేషు చ దారేషు సమవేక్ష్య మహీపతిః
ఉవాచ రాజా తం సూతం సుమంత్రానయ మే సుతమ్. ౧౪

టీక॥ దారేషుచ = భార్యలును; ఆగతేషు = రాఁగా; మహీపతిః = భూమికిఁ బ్రభువైన; రాజా = దశరథమహారాజు; సమవేక్ష్య = చూచి; తం = ఆ; సుతం = సారథియయినసుమంత్రునిగూర్చి; "సుమంత్ర = సుమంత్రుఁడా! మే = నాయొక్క; సుతం = కొడుకును" ఆనయ = తోడ్కొనిరమ్ము. ఇతి (అధ్యాహృతము) = అని; ఉవాచ = చెప్పెను.

అట్లు భార్యలందఱువచ్చుటయు, దశరథమహారాజుజూచి, సుమంత్రుంబిలిచి, "నాకొడుకు రాముం దీసికొనిరమ్ము" అని, చెప్పెను.

అని, తాత్పర్యము.

స సూతో రామమాదాయ లక్ష్మణం మైథిలీం తదా
జగామాభిముఖ స్తూర్ణం సకాశం జగతీపతేః. ౧౫

టీక॥ తదా = అప్పుడు; సః = ఆ; సూతః = సారథియగుసుమంత్రుండు; రామం = రాముని; లక్ష్మణం = లక్ష్మణుని; మైథిలీం = సీతను; ఆదాయ = తీసికొని; జగతీపతేః = దశరథమహారాజుయొక్క; సకాశం = సమీపమునుగూర్చి; అభిముఖః = ఎదురుముఖముగలవాఁడై; తూర్ణం = శీఘ్రముగా; జగామ = పోయెను.

అప్పుడు, సుమంత్రుండు, రామునిలక్ష్మణునిసీతనుబిలుచుకొని, శీఘ్రముగా, దశరథమహారాజునొద్దకుఁ బోయెను, అని, తాత్పర్యము.

స రాజా పుత్ర మాయాంతం దృష్ట్వా దూరా త్కృతాంజలిమ్
ఉత్పపాతా సనా త్తూర్ణ మార్తః స్త్రీజనసంవృతః. ౧౬

టీక॥ సః=ఆ; రాజా=దశరథమహారాజు; ఆయాంతం=వచ్చుచున్నవాఁడును; దూరాత్=దూరమునసుండి; కృతాంజలిం=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడునగు; పుత్రం=కొడుకైనరామునిని; దృష్ట్వా=చూచి; ఆర్తః=దుఃఖమునొందినవాఁడై; స్త్రీజనసంవృతః=స్త్రీజనులచేఁజుట్టఁబడినవాఁడై; తూర్ణం=శీఘ్రముగా; ఆసనాత్=పీఠమునుండి; ఉత్పపాత=లేచెను.

దశరథమహారాజు, దూరంబుననుండి చేతులుమొగుడ్చుకొని వచ్చుచున్నకొడుకును రాముంజూచి, దుఃఖితుండై, భార్యలతోఁగూడ; శీఘ్రంబుగా, నాసనంబుననుండిలేచెను.

అని, తాత్పర్యము.

సో భిదుద్రావ వేగేన రామం దృష్ట్వా విశాంపతిః
త మసంప్రాప్య దుఃఖార్తః పపాత భువి మూర్ఛితః. ౧౭

టీక॥ సః=ఆ; విశాం=మనుష్యులకు; పతిః=అధిపతియయినదశరథమహారాజు; రామం=రాముని; దృష్ట్వా=చూచి; వేగేన=వేగముచేత; అభిదుద్రావ=ఎదురుగాఁబోయెను. దుఃఖార్తః=దుఃఖముచేఁ బీడింపఁబడినవాఁడు(కావుననే); తం=ఆరాముని; అసంప్రాప్య=పొందక; మూర్ఛితః=మూర్ఛపోయినవాఁడై; భువి=నేలయందు; పపాత=పడెను.

అట్లుదశరథుండు, రాముంజూచి, వేగంబునలేచి, యతనికెదురుగాఁబోయెను; అంతదుఃఖితుండగుటవలన, రాముంజేరనరుగంజాలక, మూర్ఛితుండై, నేలంబడెను.

అని, తాత్పర్యము.

తం రామో భ్యపత త్క్షిప్రం లక్ష్మణశ్చ మహారథః

విసంజ్ఞమివ దుఃఖేన సశోకం నృపతిం తదా. ౧౮

టీక॥ రామః=రాముండును; మహారథః=తన్నునుదనసారథిని దనగుఱ్ఱములనుగా పాడుకొనుచుఁబదునొకండువేలమందివిలుకాండ్రతోఁబోరునట్టి; లక్ష్మణశ్చ=లక్ష్మణుఁడును; తదా=అప్పుడు; సశోకం= దుఃఖముతోఁగూడినవాఁడును; దుఃఖేన=దుఃఖముచేత; విసంజ్ఞమివ (స్థితం)=తెల్విదప్పినవాఁడువలె నున్నవాఁడునగు; తం=ఆ; నృపతిం=దశరథమహారాజును; క్షిప్రం=శీఘ్రముగా; అభ్యపతత్=వెంబడిఁచిపడెరి.

రాముండునుమహారథుండగు లక్ష్మణుండును, అట్లుదుఃఖితుండై దుఃఖంబునఁదెల్విఁదప్పినట్లు, నేలంబడియున్నదశరథునిలేవనెత్తుటకై, తోడనే నేలకు వ్రాలిరి. అని, తాత్పర్యము.

స్త్రీసహస్రనినాదశ్చ సంజజ్ఞే రాజవేశ్మని
హాహారామే తి సహసా భూషణధ్వనిమూర్ఛితః. ౧౯

టీక॥ రాజవేశ్మని=రాజగృహమునందు; భూషణధ్వనిమూర్ఛితః= సొమ్ములధ్వనిచేవృద్ధిఁబొందిన; హాహారామ= అయ్యో! అయ్యో! రాముఁడా! ఇతి=అని; స్త్రీసహస్రనినాదశ్చ, స్త్రీసహస్ర=స్త్రీలవేలయొక్క; నినాదశ్చ=ధ్వనియును; సంజజ్ఞే=పుట్టినది.

అంతరాజగృహమునందు, దశరథభార్యలందఱు, దేహమునందలిభూషణంబునందలి భూషణంబులు మ్రోయఁగా, హాహాకారంబుల రామునింజేరొఁ̣ని, యేడ్వసాగిరి. అని, తాత్పర్యము-

తం పరిష్వజ్య బాహుభ్యాం తా వుభౌ రామలక్ష్మణౌ
పర్యంకే సీతయాసార్ధం రుదంత స్సమవేశయన్. ౨౦

టీక॥ తౌ=ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; సీతయాసార్ధం=సీతతోఁగూడ; బాహుభ్యాం=చేతులచేత; పరిష్వజ్య=కౌఁగలించుకొని; రుదంతః=ఏడ్చుచు; పర్యంకే=పాన్పునందు; సమవేశయన్=కూచుండఁబెట్టిరి.

రామలక్ష్మణులునుసీతయును, ముగ్గురును, ఆదశరథునిఁ జేతులం గ్రుచ్చియెత్తి, రోదనంబు సేయుచుఁ, బాన్పు

నంగూర్చుండఁబెట్టిరి. అని, తాత్పర్యము.

అథ రామో ముహూర్తేన లబ్ధసంజ్ఞం మహీపతిమ్
"ముహూర్తస్య" ఇతిపాఠాంతరం.
ఉవాచ ప్రాంజలి ర్భూత్వా శోకార్ణవపరిప్లుతమ్. ౨౧

టీక॥అథ=అటుపిమ్మట; రామః=రాముఁడు; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడు:భూత్వా=అయి; ముహూర్తేన= అల్పకాలముచేత; ముహూర్తస్య (ఇది,పాఠాంతరము)=(తృతీయార్థమందుషష్ఠి)అల్పకాలముచేత; లబ్ధసంజ్ఞం=పొందఁబడినతెల్విగలవాఁడును;శోకార్ణవపరిప్లుతం=దుఃఖసముద్రములో మునింగినవాఁడునగు; మహీపతిం= భూమికిఁబ్రభువయినదశరథమహారాజునుగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత,రాముండు, చేమోడ్పుగీలించి, కొంతకాలమునకు మూర్ఛదేఱిదుఃఖసముద్రంబున మునింగియున్న తండ్రియగుదశరథుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.



ఆపృచ్ఛే త్వాం మహారాజ సర్వేషా మీశ్వరోఽసి నః
ప్రస్థితం దండకారణ్యం పశ్య త్వం కుశలేన మామ్. ౨౨

టీక॥మహారాజ = మహారాజా! నః=మాకు; సర్వేషాం=అందఱకును; ఈశ్వరః=ప్రభుండవు; అసి = అగుచున్నావు. త్వాం = నిన్ను; ఆపృచ్ఛే=వీడ్కొని వెదను. త్వం = నీవు; దండకారణ్యాం = దండకారణ్యమును గూర్చి; ప్రస్థితం = బయలుదేఱిన; మాం=నన్ను; కుశలేన=సుఖముచేత; పశ్య=చూడుము.

మహారాజా! నీవు మాకందఱకును ప్రభుండవు; నిన్ను వీడ్కొనెదను; నేనిప్పుడు దండకారణ్యమునకుఁ బోయెదను; నీ విట్లు దుఃఖింపక సుఖంబుగా నన్నుఁ జూడుము. అని, తాత్పర్యము.

లక్ష్మణంచా నుజానీహి సీతాచా న్వేతి మాం వనమ్
కారణై ర్బహుభి స్తథ్యై ర్వార్యమాణౌ న చే చ్ఛతః. ౨౩

టీక॥లక్ష్మణంచ = లక్ష్మణునిం గూడ; అనుజానీహి=అనుమతింపుము. సీతా చ=సీతయును; వనం=అడవిని గూర్చి; మాం=నన్ను; అన్వేతి= వెంబడించుచున్నది. ఏతౌ(అధ్యాహృతము) = వీరలిర్వురును; తథ్యైః= యథార్థములయిన; బహుభిః=అనేకములగు; కారణైః= కారణములచేత; వార్యమాణౌ చ=అడ్డగింపఁ బడుచున్నవారలయ్యు; నేచ్ఛతః=సమ్మతింపరు.

మఱియు, లక్ష్మణునకు ననుజ్ఞ యిమ్ము; సీతయు నా వెంట నరణ్యంబునకు వచ్చుచున్నది; సీతకు ననుజ్ఞ యిమ్ము; వీరలు, సరియైన పెక్కు కారణములు చెప్పి యెంత నివారించినను, ఇచ్చట నిలుచుటకు సమ్మతింపకున్నారు.

అని, తాత్పర్యము.

అనుజానీహి సర్వా న్నః శోక ముత్సృజ్య మానద
లక్ష్మణం మాంచ సీతాంచ ప్రజాపతి రివ ప్రజాః. ౨౪

టీక॥మానద = మానము నిచ్చునట్టి వాఁడా! శోకం = దుఃఖమును; ఉత్సృజ్య=విడిచి; లక్ష్మణం=లక్ష్మణుని; మాం చ=నన్నును; సీతాంచ=సీతను; నః=మమ్ములను; సర్వాన్=అందఱను; ప్రజాపతిః=బ్రహ్మదేవుఁడు, ప్రజా ఇవ = ప్రజలం బోలె; అనుజానీహి = అనుమతింపుము.

మాకందఱకునుమానముఁగలిగించునట్టివాఁడవునీవు; ఈదుఃఖంబువిడిచి,లక్ష్మణునకునునాకును సీతకునుమాకందఱకునుబ్రహ్మదేవుండు ప్రజలకుంబోలె, ననుజ్ఞ యొసంగుము. అని, రాముండుదశరథునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ప్రతీక్షమాణ మవ్యగ్ర మనుజ్ఞాం జగతీపతేః
ఉవాచ రాజా సంప్రేక్ష్య వనవాసాయ రాఘవమ్. ౨౫

టీక॥ రాజా=దశరథమహారాజు; వనవాసాయ=అడవిలోనుండుటకొఱకు; జగతీపతేః=భూమికిఁబ్రభువైనదశరథమహారాజుయొక్క; అనుజ్ఞాం=అనుమతినిఁగూర్చి; ప్రతీక్షమాణం=ఎదురుసూచుచున్నవాఁడును; అవ్యగ్రం = ఆలస్యములేనివాఁడునగు; రాఘవం = రామని; సంప్రేక్ష్య = చూచి; ఉవాచ=చెప్పెను.

దశరథుం, డట్టులాలస్యంబుసేయక, వనవాసంబునకై తనయనుజ్ఞకెదురుసూచుచున్నరామునుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అహం రాఘవ కైకేయ్యా వరదానేన మోహితః
అయోధ్యాయా స్త్వమేవా ద్య భవ రాజా నిగృహ్య మామ్. ౨౬

టీక॥ రాఘవ = రాముఁడా! అహం=నేను; కైకేయ్యాః= కైకేయికి; వరదానేన=వరమునిచ్చుటచేత; మోహితః= మోహమునొందియున్నాను. అద్య=ఇప్పుడు; మాం = నన్ను; నిగృహ్య=తిరస్కరించి; త్వమేవ = నీవే; అయోధ్యాయాః=అయోధ్యకు; రాజా=ప్రభుండవు; భవ=అగుము.

రాముఁడా! నేనుగైకేయికివరంబిచ్చియుండుటంజేసి, మోసపోయియున్నాను; నీవిప్పుడునన్నునిగ్రహించి, నీవేయయోధ్యకురాజవగుము. అని, దశరథుండు, రామునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవముక్తో నృపతినా రామోధర్మ భృతాం వరః
ప్రత్యువాచాం జలిం కృత్వా పితరం వాక్యకోవిదః. ౨౭

టీక॥వాక్యకోవిదః= మాటలయం దుఁబండితుండును; ధర్మభృతాం= ధర్మమునుభరించువారలలోపల; వరః=శ్రేష్ఠుండునగు; రామః=రాముండు; నృపతినా= దశరథమహారాజుచేత;ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; అంజలిం=చేమోడ్పును; కృత్వా=చేసి; పితరం= తండ్రినిగూర్చి; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

మాటలంజెప్పుటయందుఁ బండితుండును ధార్మికశ్రేష్ఠుండునగు రాముండు,తండ్రిచెప్పినదివిని, చేమోడ్పుగీలించి,తండ్రితోనిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

భవాన్ వర్ష సహస్రాయ పృథివ్యానృపతే పతిః
అహంత్వ రణ్యే వత్స్యామి నమేకార్యం త్వయానృతమ్. ౨౮
"నమేకార్య స్త్వమానృతః" ఇతిపాఠాంతరం.

టీక॥నృపతే=దశరథమహారాజా! భవాన్=నీవు; వర్షసహస్రాయ= వర్షములయొక్క వేయికొఱకు, అనేకసంవత్సరములుగాననుట; పృథివ్యాః=భూమికి; పతిః= ప్రభుండవు. అహంతు = నేనో; అరణ్యే= వనమునందు; వత్స్యామి=ఉండెదను.త్వయా=నీచేత; మే=నాకొఱకు; అనృతం=అబద్ధము; నకార్యం=చేయఁదగినదికాదు. (పాఠాంతరపక్షమందు) మే=నాకు,నాచేతననుట;త్వం= నీవు; అనృతః=కొంచెమబద్ధము గలవాఁడవుగాను; నకార్యః = చేయఁదగినవాఁడవుగావు.

దశరథమహారాజా!నీవు, పెక్కుసంవత్సరంబులుగాభూమిం బాలించుచున్నావు; అట్టినీవు,నన్నసత్యవంతునిఁగాఁజేయవలదు; (పాఠాంతరపక్షమందు, అట్టినీకు నేనుగొంచెమయిననసత్యదోషము గలుగునట్లు చేయఁగూడదు;) కావున నేనరణ్యములో నుండెదను. అని, తాత్పర్యము.

నవ పంచచ వర్షాణి వనవాసే విహృత్యతే
పునః పాదౌ గ్రహీష్యామి ప్రతిజ్ఞాంతే నరాధిప. ౨౯

టీక॥నరాధిప= మనుష్యులకుఁ బ్రభుండవైనదశరథుఁడా! నవ= తొమ్మి

దియు; పంచచ=ఐదును, పదునాలు
గనుట; వర్షాణి=సంవత్సరములను;
వనవాసే=వనంబులో నుండుట యం
దు;విహృత్య=క్రీడించి; ప్రతిజ్ఞాంతే=
ప్రతిజ్ఞ యొక్కతుదను;పునః= మఱల;
తే=నీయొక్క; పాదౌ= పాదముల
ను; గృహీష్యామి=పట్టుకొనెదను.

దశరథమహారాజా! నేనుబదునాలు
గువర్షంబులువనంబులో సుఖంబుగా
నుండి, ప్రతిజ్ఞదీర్చుకొనినపిమ్మట,మ
ఱలనిచ్చటికివచ్చి, నీపాదంబుల నాశ్ర
యించెదను. అని,రాముండు దశరథు
నితోఁజెప్పెను.అని,తాత్పర్యము.

రుదన్నార్తః ప్రియం పుత్రం సత్యపాశేన సంయతః
కైకేయ్యా చోద్యమానస్తు మిథో రాజా త మబ్రవీత్. ౩౦

టీ॥రాజా=దశరథమహారాజు;రుదన్,
ఏడ్చుచు;ఆర్తః=దీనుండై; సత్యపాశే
న=సత్యమనుత్రాటిచేత;సంయతః=క
ట్టబడినవాఁడై;మిథః=రహస్యముగా;
కైకేయ్యా=కైకేయిచేత;చోద్యమాన
స్తు=ప్రేరింపఁబడిన వాఁడునై ; ప్రి
యం=ఇష్టుండగు;తం=ఆ;పుత్రం=కొ
డుకును రామునిఁగూర్చి ; అబ్రవీత్=
పలికెను.

అంత, దశరథుండు, సత్యపాశబ
ద్ధుండై, రోదనంబుసేయుచుదీనుండై
రహస్యంబునం గైకేయీప్రేరితుండై,
ప్రియపుత్రుండగు రామునింజూచి,యి
ట్లని,చెప్పెను.అని,తాత్పర్యము.

శ్రేయసే వృద్ధయే తాత పునరాగమనాయచ
గచ్ఛస్వారిష్ట మవ్యగ్రం పంథాన మకుతోభయమ్. ౩౧

టీక॥తాత=నాయనా! శ్రేయసే=
పరలోకశ్రేయస్సుకొఱకును ; వృద్ధ
యే=ఐహికవృద్ధికొఱకును ; పునరా
గమనాయచ= మఱలవచ్చుట కొఱకు
ను; అరిష్టం=మంగళకరంబును; అవ్య
గ్రం=దుఃఖములేనిదియును ; అకుతో
భయం=ఎందునను భయంబు లేనిదియు
నగు;పంథానం=మార్గమును; గచ్ఛ
స్వ=పొమ్ము.

నాయనా! నీకుఁబరలోకసుఖంబును
ఐహికసౌఖ్యంబును గలుగుఁగాక; మ
ఱలనిచ్చటికివచ్చుటయుఁగలుగుఁగాక;

మంగళకరంబును గష్టంబులేనిదియు నెం తమాత్రము భయంబులేనిదియు నగు మార్గమునవలంబించి, పొమ్ము.

అని, తాత్పర్యము.

న హి సత్యాత్మన స్తాత ధర్మాభిమనస స్తవ
వినివర్తయితుం బుద్ధి శ్శక్యతే రఘునందన. ౩౨

టీక॥ తాత=నాయనా! రఘునంద న=రఘువంశమునంబుట్టినవారలసంత సింపఁజేయునట్టివాఁడా! సత్యాత్మనః= సత్యస్వభావుండవును; ధర్మాభిమన సః=ధర్మమునొందినమనసుగలవాఁడ వునగు; తవ=నీయొక్క; బుద్ధిః= తలం పు; వినివర్తయితుం=మఱలించుటకు; న శక్యతేహి=అలవిగాదుగదా!

నాయనా! నిన్నుఁబోఁడిగా రఘువం శమునంబుట్టినవారలకండఱకును సంతో షంబుగలుగును; నీవు సత్యస్వభావుండ వు, పరమధార్మికుండవు; అట్టినీబుద్ధి మాఱునట్లు సేయనలవిగాదు.

అని, తాత్పర్యము.

అద్య త్విదానీం రజనీం పుత్ర మాగచ్ఛ సర్వథా
ఏకాహదర్శనేనాపి సాధు తావ చ్చరామ్యహమ్. ౩౩

టీక॥ పుత్ర=కొడుకా! అద్యతు=ఇ ప్పుడుమాత్రము; ఇదానీం=ఈ; రజ నీం=రాత్రిని; సర్వథా = అన్నివిధంబు లను; మాగచ్ఛ=పోవలదు. అహం=నే ను; ఏకాహదర్శనేనాపి = ఒకదినము చూచుటచేనైనను; సాధు=సుఖముగా; ("తావత్" అనునది వాక్యాలంకారము) చరామి=ఉండెదను.

కొడుకా! ఇప్పుడుమాత్రము, నీవె ట్లయిననుబోఁగూడదు; ఈ రాత్రియం తయునిచ్చట నేయుండుము; ఇట్లు, ఒక దినమయినను, నిన్నుఁజూచుచు, సుఖము గానుండెదను.

అని, తాత్పర్యము.

మాతరం మాంచ సంపశ్య న్వసే మా మద్య శర్వరీమ్
తర్పిత స్సర్వకామై స్త్వం శ్వః కాలే సాధయిష్యసి. ౩౪

టీక॥ త్వం(అధ్యాహృతము)=నీవు; అద్య=ఇప్పుడు; మాతరం=తల్లిని; మాం

చ=నన్నును; సంపశ్యన్=చూచుచు; ఇమాం=ఈ; శర్వరీం=రాత్రిని; వస=ఉండుము; త్వం=నీవు; సర్వకామైః=సమస్తములయినకోరుకలచేతను; తర్పితః = తృప్తినొందింపఁబడినవాఁడవై; శ్వః=రేపు; కాలే= ప్రాతఃకాలమునందు; సాధయిష్యసి=పోఁగలవు.

నీవు, నీతల్లిని నన్నుంజూచుచు, నీరాత్రియంతయు నిచ్చటనుండుము; మేము, నీకోరుకలన్నియుఁ దీర్చి నీవుతృప్తిఁ బొందునట్లు చేసెదము; అంత, రేపు ప్రాతఃకాలంబునం బోవచ్చును.

అని, తాత్పర్యము.

దుష్కరం క్రియతే పుత్ర సర్వథా రాఘవ త్వయా
మత్ప్రియార్థం ప్రియం స్త్యక్త్వా యద్యాసి విజనం వనమ్. ౩౫

టీక॥ పుత్ర=కొడుకా! రాఘవ=రాముఁడా! మత్ప్రియార్థం=నాసంతోషముకొఱకు; ప్రియాన్=ఇష్టములయినవానిని; త్యక్త్వా=విడచి; విజనం=జనులులేని; వనం= అడవినిఁగూర్చి; యాసి(ఇతి)యత్ = పోవుచున్నావనునదియేదిగలదో; తత్ (అధ్యాహృతము)=అట్టి; దుష్కరం=చేయనలవికానికార్యము; త్వయా=నీచేత; క్రియతే=చేయఁబడుచున్నది.

రాముఁడా! నాసంతోషమునకై, నీకుఁ బ్రియంబుగలిగించువానినన్నిటినిం బరిత్యజించి, విజనంబగు, నరణ్యంబునకుఁ బోవుచున్నావే; ఇట్టికఠినకార్యముచేయుచున్నావు; ఇట్లెవ్వరును జేయఁజాలరు. అని, తాత్పర్యము.

నచైతన్మే ప్రియం పుత్ర శపే సత్యేన రాఘవ
ఛన్నయా చలిత స్త్వస్మి స్త్రియా ఛన్నాగ్ని కల్పయా. ౩౬

టీక॥ రాఘవ=రాముఁడా! పుత్ర=కొడుకా! ఏతత్=ఇది; మే=నాకు; ప్రియం=ఇష్టము; నచ=కానేకాదు. సత్యేన=సత్యముచేత; శపే=శపథముచేసెదను. ఛన్నయా = గూఢమయినయభిప్రాయముగలదియు; ఛన్నాగ్నికల్పయా=కప్పఁబడినయగ్నితో సమానమయినదియునగు; స్త్రియా=స్త్రీచేత; చలితస్తు= చలనమునొందిన వాఁడను మాత్రము; అస్మి=అగుచున్నాను.

రాముఁడా! నీవిట్లరణ్యమునకుఁ బోవుటనాకెంతమాత్రమిష్టముగాదు; అయితే, అగ్నిహోత్రము బూడిదచేఁ గప్పఁబడినట్లు, సత్యముతో బాసచేసెదను, ఈకైకేయి మనసులో వేయుకూర్చిరాభిప్రాయంబు నుంచుకొని, నన్నుఁజా పలంబునొందినట్లుచేసినది; ఇదిమాత్రము వాస్తవము.

అని, తాత్పర్యము.

వంచనా యా తు లబ్ధా మే తాం త్వం నిస్తర్తు మిచ్ఛసి
అనయా వృత్తసాదిన్యా కైకేయ్యాభి ప్రచోదితః. ౩౭

టీక॥ యా=ఏ; వంచనా = మోసము; మే=నాకు, నాచేతననుట; లబ్ధా= పొందఁబడినది. తాంతు=ఆ మోసమును గూడ; త్వం=నీవు; వృత్తసాదిన్యా= చరిత్రమును జెఱచునట్టి; అనయా=ఈ; కైకేయ్యా = కైకేయిచేత; అభిప్రచోదితః=ప్రేరింపఁబడినవాఁడై; నిస్తర్తుం= తీర్చుటకు; ఇచ్ఛసి= కోరుచున్నావు!

నన్నుఁగైకేయి మోసముచేసినది; అట్టిమోసమునుగూడ, నీవు, కులాచారముం జెఱచునీకైకేయిమాటవిని, సఫలముగాఁజేయఁగోరుచున్నావు. నీధార్మికతంజూడగా నాశ్చర్యముగలుగుచున్నది. అని, తాత్పర్యము.

నచైత దాశ్చర్యతమం యత్త్వం జ్యేష్ఠ స్సుతో మమ
అపానృతకథం పుత్ర పితరం కర్తు మిచ్ఛసి. ౩౮

టీక॥ పుత్ర=కొడుకా! మమ = నాయొక్క; జ్యేష్ఠః=మొదటి; సుతః=కొడుకవయిన; త్వం=నీవు; పితరం=తండ్రినగు నన్ను; అపానృతకథం= దబ్బఱమాటలేనివానిఁగా; కర్తుం=చేయుటకు; ఇచ్ఛసి(ఇతి) యత్=కోరుచున్నావనునదియేదిగలదో; తత్ ఏతత్=అయిది; ఆశ్చర్యతమంచ= మిక్కిలియునాశ్చర్యముగల్గించునదియుఁగాదు.

కొడుకా! నాజ్యేష్ఠపుత్రుండవగు నీవు తండ్రినగు నాకసత్యదోషంబులేకుండునట్లుసేయఁగోరుట; యంత, యాశ్చర్యకరముగాదు. అని, దశరథుఁడు రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

అథ రామ స్తథా శ్రుత్వా పితు రార్తస్య భాషితమ్
లక్ష్మణేన సహ భ్రాత్రా దీనో వచన మబ్రవీత్. ౩౯

టీక॥అథ=అటుపిమ్మట; రామః=రాముఁడు;తథా= అట్లు;ఆర్తస్య=దుఃఖితుండగు; పితుః=తండ్రియొక్క; భాషితం = మాటను;శ్రుత్వా=విని; భ్రాత్రా= తమ్ముఁడైన; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ;దీనః=దుఃఖితుండై;వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

అంత, రాముండు, దుఃఖితుండగు తండ్రిచెప్పినమాటనువిని,దుఃఖితుండై, లక్ష్మణుండునుదుఃఖింప, నిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

ప్రాప్స్యామి యా నద్య గుణాన్ కోమే శ్వస్తాన్ ప్రదాస్యతి
అపక్రమణ మేవాత స్సర్వ కామై రహం వృణే. ౪౦

టీక॥అద్య=ఇప్పుడు;యాన్=ఏ;గుణాన్=మంచిపదార్థములను; ప్రాప్స్యామి=పొందఁగలనో; తాన్=వానిని;శ్వః=రేపు;మే=నాకొఱకు; కః=ఎవ్వఁడు;ప్రదాస్యతి=ఇవ్వఁగలడు? అతః=ఇందువలన; అహం=నేను; సర్వకామైః = సమస్తములయినకోర్కెల చేతను;అపక్రమణమేవ=పోవుట నే;వృణే=కోరుచున్నాను.

మీరుచెప్పినట్లు,ఇప్పుడు నేను మంచి పదార్థంబులననుభవించినను,వానిని, రేపునాకెవ్వఁడిచ్చును? కావున,నిప్పుడు గావలెననుటయువ్యర్థము; అందువలన,నాకోర్కెలునక్కఱలేదు;ఇప్పుడే వనంబునకుఁబోవుటగావలసినది.

అని,తాత్పర్యము.

ఇయం సరాష్ట్రా సజనా ధనధాన్యసమాకులా
మయా విసృష్టా వసుధా భరతాయ ప్రదీయతామ్. ౪౧

టీక॥ మయా=నాచేత;విసృష్టా=విడువఁబడినదియును; సరాష్ట్రా=దేశములతోఁగూడినదియును; సజనా=జనులతోఁగూడినదియును;ధనధాన్యసమాకులా=ధనముచేతను ధాన్యముచేతనునిండినదియునగు;ఇయం=ఈ;వసు

ధా=భూమి; భరతాయ=భరతునికొఱకు; ప్రదీయతాం=ఇయ్యఁబడుఁగాక.

దేశంబుతోఁగూడిజనులతోను ధాన్యములతోను సంపూర్ణంబైయున్న, నాచేవిడువఁబడిన, భూమినంతయు, భరతునకొసంగుము.

అని, తాత్పర్యము.

వనవాస కృతా బుద్ధి ర్నచ మేద్య చలిష్యతి

టీక॥ మే=నాయొక్క; వనవాసకృతా=అడవినుండుటయందుఁజేయఁబడిన; బుద్ధిః=తలంపు; అద్య=ఇప్పుడు; నచలిష్యతిచ=చలంపనేచలింపదు.

వనవాసంబుసేయవలయునను నాతలంపు, ఇప్పుడెంతమాత్రముచలనము నొందదు. అని, తాత్పర్యము.

యస్తుష్టేన వరో దత్తః కైకేయ్యై వరద త్వయా. ౪౨
దీయతాం నిఖిలేనైవ సత్యస్త్వం భవ పార్థివ

టీక॥ వరద=వరములనిచ్చునట్టి; పార్థివ=దశరథమహారాజా! తుష్టేన=సంతోషమునొందిన; త్వయా= నీచేత; కైకేయ్యై=కైకేయికొఱకు; యః=ఏ; వరః=వరము; దత్తః=ఇయ్యఁబడినదో; సః(అధ్యాహృతము)=ఆవరము; నిఖిలేనైవ=సాకల్యముచేతనే; దీయతాం=ఇయ్యఁబడుఁగాక. త్వం=నీవు; సత్యః=సత్యవాదివి; భవ=అగుము.

వరంబులనివ్వంజాలినదశరథుఁడా! నీవుసంతోషంబునఁ గైకేయికే వరంబిచ్చియున్నావో, దానినంతయుఁగొంతలేనట్లు, ఆవిడకిచ్చి, సత్యవాదివగుము.

అని, తాత్పర్యము.

అహం నిదేశం భవతో యథోక్త మనుపాలయన్. ౪౩
చతుర్దశ సమా వత్స్యే వనే వనచరై స్సహ

టీక॥ అహం=నేను; భవతః=నీయొక్క; నిదేశం=ఆజ్ఞను; యథోక్తం= చెప్పఁబడినదానినతిక్రమింపక; అనుపాలయన్=నెఱవేర్చుచు; వనే=అడవియందు; వనచరైస్సహ=అడవియందుఁదిరుగుబుషులతోఁగూడ; చతుర్దశ=పదు

నాలుగు;సమాః= సంవత్సరములను;వత్స్యే—ఉండెదను.

నీవాజ్ఞాపించినట్లు,వనంబున,ఋషులతోడంగూడఁ, బదునాలుగు సంవత్సరంబులుండి, నీయాజ్ఞను నెఱవేర్చెదను.

అని, తాత్పర్యము.

మావిమర్శో వసుమతీ భరతాయ ప్రదీయతామ్. ౪౪

టీక॥విమర్శః=విచారము;మా (అస్తు)=వలదు.వసుమతీ=భూమి;భరతాయ=భరతునికొఱకు; ప్రదీయతాం—ఇవ్వఁబడుఁగాక.

ఎంతమాత్రము సంశయింపకుము; భరతునకు రాజ్యము నొసంగుము.

అని, తాత్పర్యము.

నహి మే కాంక్షితం రాజ్యం సుఖ మాత్మని వా ప్రియమ్
యథా నిదేశం కర్తుం వై తవైవ రఘునందన. ౪౫

టీక॥రఘునందన—దశరథుఁడా! తవైవ=నీయొక్కయే; నిదేశం=ఆజ్ఞను; కర్తుం=చేయుటకు("వై"అనునది పాదపూరణార్థము);యథా=ఎట్లో; తథా(అధ్యాహృతము)=అట్లు; మే= నాకు,రాజ్యం = దొరతనముగాని;ఆత్మని=నానిమిత్తమయిన;ప్రియం= ఇష్టమయిన;సుఖం వా—సుఖముగాని; కాంక్షితం=కోరఁబడినది;న=కాదు.

దశరథుఁడా! నీయాజ్ఞ నెఱవేర్చుటయందు నాకుంగలంతటికోర్కి, రాజ్యమునందుఁగాని, మఱియేసుఖమునందుఁగాని, నాకెంతమాత్రము లేదు.

అని, తాత్పర్యము.

అపగచ్ఛతు తే దుఃఖం మాభూ ర్బాష్పపరిప్లుతః
నహి క్షుభ్యతి దుర్ధర్షః సముద్ర స్సరితాం పతిః. ౪౬

టీక॥ తే=నీయొక్క; దుఃఖం=దుఃఖము;అపగచ్ఛతు=పోవుఁగాక. బాష్పపరిప్లుతః=కన్నీళ్లచేఁ దడపఁబడినవాఁడవు;మాభూః=కావలదు. సరితాం= నదులయొక్క; పతిః=పెనిమిటియగు; దుర్ధర్షః=ఎదిరింపనలవిగాని ; స

ముద్రః=సముద్రుఁడు; నతఃభ్యాతిహ= కలంతనొందఁడుగదా!

ఈదుఃఖమునువిడువుము; ఇట్లుకన్నీళ్లుగాచుఁచుండవలదు; నదీపతియయి నసముద్రుండెప్పుడైనఁ గలంతనొందు నా? అట్టిసముద్రునివంటివాఁడవునీవుఁ ఇట్లింత దుఃఖించుచుండుటసరిగాదు.

అని, తాత్పర్యము.

నైవాహం రాజ్య మిచ్ఛామి నసుఖం నచ మైథిలీమ్
నైవ సర్వా నిమాన్ కామా న్న స్వర్గం నైవ జీవితమ్. ౪౭

టీక॥అహం=నేను; రాజ్యం=దొరతనమును; నైవేచ్ఛామి=కోరను. సుఖం=సుఖమును; న(ఇచ్ఛామి)= కోరను. మైథిలీంచ=సీతనుంగూడ; న(ఇచ్ఛామి)=కోరను. ఇమాన్= ఈ ; కామాన్=కోరఁబడువస్తువులను; నైవ=(ఇచ్ఛామి)=కోరను. స్వర్గం = స్వర్గమును; న(ఇచ్ఛామి)=కోరను. జీవితం=ప్రాణమును; నైవ(ఇచ్ఛామి)=కోరను.

నాకు, రాజ్యమునందుఁగాని, సుఖమునందుఁగాని , సీతయందుఁగాని; మఱియు, నీకామ్యపదార్థములయందుఁగాని, స్వర్గమునందుఁగాని, ప్రాణమునందుఁగాని, నాకెంతమాత్రమును గోర్కెలేదు. అని, తాత్పర్యము.

త్వా మహం సత్య మిచ్ఛామి నానృతం పురుషర్షభ
ప్రత్యక్షం తవ సత్యేన సుకృతేన చ తే శపే. ౪౮

టీక॥పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవగుదశరథుఁడా! అహం = నేను; త్వాం=నిన్నును; సత్యం=సత్యమును; ఇచ్ఛామి=కోరుచున్నాను . అనృతం=అబద్ధమును; న(ఇచ్ఛామి)=కోరను. తవ=నీయొక్క; ప్రత్యక్షం= ఎదుటను; సత్యేన= సత్యముచేతను ; సుకృతేన చ=పుణ్యముచేతను; తే=నీకొఱకు ; శపే=శపథముసేయుచున్నాను.

పురుషశ్రేష్ఠుండవగు దశరథుఁడా! నాకునీవునుసత్యమునైకావలసినది ; నీయెదుట, సత్యముతోను సుకృతంబుతో నుబాసచేయుచున్నాను.

అని, తాత్పర్యము,

నచ శక్యం మయా తాత స్థాతుంక్షణ మపిప్రభో
నశోకం ధారయస్వైనం నహిమే స్తి విపర్యయః. ౪౯

టీక॥ప్రభో=ఈశ్వరుండవగు; తాత=తండ్రి!క్షణమపి= క్షణకాలమయినను; స్థాతుంచ=ఉండుటకును ; మయా=నాచేత; నశక్యం = అలవిగాదు.ఏనం=ఈ;శోకం=దుఃఖమును; నధారయస్వ=ఉంచుకొనకుము . మే=నాకు;విపర్యయః=తిరుగుపాటు ; నాస్తిహి=లేదుగదా!

ప్రభుండవగుదశరథుఁడా ! ఇచ్చటక్షణకాలమయిననుండుటకు, నాకలవికాదు; నీవీదుఃఖముంచుకొనియుండకుము;నాసంకల్పము,మఱలం జలనమునొందదు. అని, తాత్పర్యము.

అర్థితోహ్యస్మి కైకేయ్యా వనం గచ్ఛేతి రాఘవ
మయాచోక్తం వ్రజామీతి తత్సత్య మను పాలయే. ౫౦

టీక॥రాఘవ=దశరథుఁడా! అహం (అధ్యాహృతము)=నేను;కైకేయ్యా=కైకేయిచేత;"వనం=అడవినిగూర్చి; గచ్ఛ=పొమ్ము."ఇతి=అని; అర్థితః=ప్రార్థింపఁబడినవాఁడను; అస్మిహి=అగుచున్నానుగదా! మయాచ=నాచేతను;"వ్రజామి=పోయెదను"ఇతి= అని;ఉక్తం=చెప్పఁబడినది.తత్ = ఆ;సత్యం=సత్యమును;అనుపాలయే=రక్షించుకొనెదను.

దశరథుఁడా!కైకేయినన్ను,"వనంబునకుఁబొమ్ము" అని,ప్రార్థించినది; అందుకు,నేనును, "అలాగే, వనంబునకుఁబోయెదను" అని.చెప్పినాను; కాఁబట్టి, నేనిప్పుడాసత్యమునురక్షించుకొనుచున్నాను. అని, తాత్పర్యము.

మాచోత్కంఠాం కృథా దేవ వనే రంస్యా మహేవయమ్
ప్రశాంత హారిణాకీర్ణే నానాశకుని నాదితే. ౫౧

టీక॥దేవ=దశరథమహారాజా! ఉత్కంఠాంచ=దుఃఖమును;మాకృథాః=చేయకుము.వయం=మేము; ప్రశాంతహరిణాకీర్ణే= క్రూరములుగానిజింక

లచే వ్యాపింపఁబడినదియును; నానాశకునినాదితే= నానావిధములయినపక్షులచే ధ్వనింపఁజేయఁబడినదియునగు; వనే=అడవియందు; రంస్యామహే = విహరింపఁగలము.

దశరథమహారాజా! నీవు మమ్ముగుఱించి దుఃఖింపుచుండకుము; మేము, శాంతములయిన మృగంబులతోఁగూడి, మనోహరంబులయిన నానావిధపక్షిధ్వనులతో నొప్పుచున్నయరణ్యంబున, సుఖంబుగా విహరింపుచుండెదము.

అని, తాత్పర్యము.

పితా హి దైవతం తాత దేవతానా మపి స్మృతమ్
తస్మా ద్దైవత మిత్యేవ కరిష్యామి పితు ర్వచః. ౫౨

టీక॥ తాత=తండ్రీ! దేవతానామపి=దేవతలకునుగూడ; పితా=తండ్రి; దైవతం=దేవత; ఇతి(అధ్యాహృతము)=అని; స్మృతంహి= చెప్పఁబడినదిగదా! తస్మాత్=అందువలన; దైవతమిత్యేవ=దేవతయనియే; పితుః= తండ్రియొక్క; వచః=మాటను; కరిష్యామి=చేసెదను.

తండ్రీ! దేవతలకునుంగూడ, దండ్రియే దైవతమని చెప్పఁబడి యున్నదిగదా! అందువలన తండ్రియే దైవమనియెంచియే, నేను దండ్రియాజ్ఞను నెఱవేర్చెదను. అని, తాత్పర్యము.

చతుర్దశసు వర్షేషు గతేషు నరసత్తమ
పునర్ద్రక్ష్యసి మాం ప్రాప్తం సంతాపోఽయం విముచ్యతామ్. ౫౩

టీక॥ నరసత్తమ= మనుష్యశ్రేష్ఠుండవగు దశరథుఁడా! చతుర్దశసు=పదునాలుగగు; వర్షేషు= సంవత్సరములు; గతేషు=గడువఁగా; ప్రాప్తం=వచ్చిన; మాం=నన్ను; పునః=మఱల; ద్రక్ష్యసి=చూచెదవు; అయం=ఈ; సంతాపః=దుఃఖము; విముచ్యతాం=విడువఁబడుఁగాక.

మనుష్యశ్రేష్ఠుండవగు దశరథుఁడా! పదునాలుగేఁడులు గడచిన పిమ్మట, వచ్చిన నన్ను మఱలఁజూచెదవు, ఈదుఃఖము విడువుము. అని, తాత్పర్యము.

యేన సంస్తంభనీయో యం సర్వో బాష్పగళో జనః
స త్వం పురుషశార్దూల కిమర్థం విక్రియాం గతః. ౫౪

టీక॥పురుషశార్దూల=పురుషశ్రేష్ఠుండవగు దశరథమహారాజా! యేన=ఎవ్వనిచేత; బాష్పగళః= కన్నీరుకంఠమునందుఁగల, డగ్గుత్తికతోఁగూడినయనుట; అయం=ఈ; జనః=జనము; సర్వః=అంతయు; సంస్తంభనీయః=అణఁగింపఁదగినదో; సః=అట్టి; త్వం=నీవు; కిమర్థం = ఎందుకొఱకు; విక్రియాం=వికారమును; గతః=పొందినావు?

పురుషశ్రేష్ఠుండవగు దశరథమహారాజా! ఇట్లుడగ్గుత్తికతోదుఃఖింపుచున్నయీజనులనందఱను దేర్పవలసినట్టి నీవును,ఇట్లుదుఃఖించుచున్నావేమి?

అని, తాత్పర్యము.

పురం చ రాష్ట్రంచ మహీ చ కేవలా
మయా నిసృష్టా భరతాయ దీయతామ్
అహం నిదేశం భవతో నుపాలయన్
వనం గమిష్యామి చిరాయ సేవితుమ్. ౫౫

టీక॥పురం=పట్టణమును;రాష్ట్రం చ=రాజ్యమును;మయా=నాచేత; నిసృష్టా=విడువఁబడిన; మహీ=భూమి; కేవలాచ=అంతయు; భరతాయ=భరతునికొఱకు; దీయతాం= ఇయ్యఁబడుఁగాక. అహం=నేను; భవతః=నీయొక్క; నిదేశం=ఆజ్ఞను; అనుపాలయన్=పాలించువాఁడనై;చిరాయ=బహుకాలము; సేవితుం= సేవించుటకు;వనం=అడవిని; గమిష్యామి=పొందెదను.

నేనుబరిత్యజించినపట్టణమును రాజ్యమును-ఈభూమినంతయుభరతునకొసంగుము;నేనునీవాజ్ఞాపించినట్లు, అరణ్యంబునకుఁబోయి,బహుకాలంబుండెదను. అని, తాత్పర్యము.

మయా నిసృష్టాం భరతో మహీ మిమాం
సశైలషండాం సపురాం సకాననామ్

శివాం సుసీమా మనుశాస్తు కేవలం
త్వయా యదుక్తం నృపతే తథా స్తు తత్. ౫౬

టీక॥నృపతే=మనుష్యులకుఁబ్రభువైనదశరథుఁడా;మయా= నాచేత;నిసృష్టాం=విడువబడినదియును; సశైలషండాం=పర్వతసమూహములతోఁగూడినదియును; సపురాం=పట్టణములతోఁగూడినదియును;సకాననాం= అడవులతోఁగూడినదియును; శివాం=మంగళకరమైనదియును; సుసీమాం=మంచియెల్లలుగలదియునగు; ఇమాం=ఈ; మహీం=భూమిని; భరతః కేవలం=భరతుఁడే; అనుశాస్తు=రక్షించుఁగాక.త్వయా = నీచేత;యత్=ఏది; ఉక్తం=చెప్పఁబడినదో;తత్=అది;తథా= అట్లు;అస్తు=అగుఁగాక.

దశరథమహారాజా! పర్వతంబులతోను బట్టణంబులతోను వనంబులతో నుబప్పుచుస్థిరములయినయెల్లలుగలుగుటంజేసిసుఖకరంబైయున్న నేను బరిత్యజించిన,యీభూమిని,భరతుండే పరిపాలింపుచుండుఁగాక; నీవెట్లుచెప్పితివోఅట్లేజరగవలయును.

అని, తాత్పర్యము.

న మే తథా పార్థివ ధీయతే మనో
మహత్సు కామేషు న చాత్మనః ప్రియే
యథా నిదేశే తవ శిష్టసమ్మతే
వ్యపైతు దుఃఖం తవ మత్కృతేఽనఘ. ౫౭

టీక॥అనఘ = పాపరహితుండవగు;పార్థివ = దశరథమహారాజా! మే=నాయొక్క;మనః = మనసు;యథా=ఎట్లు;శిష్టసమ్మతే=పెద్దలచేగౌరవింపఁబడిన;తవ=నీయొక్క; నిదేశే=ఆజ్ఞయందు; ధీయతే (అధ్యాహృతము)=ఉంచఁబడుచున్నదో;తథా=అట్లు;మహత్సు=శ్రేష్ఠములయిన; కామేషు=కోరఁబడినపదార్థములందు;నధీయతే=ఉంచఁబడదు.ఆత్మనః=నాయొక్క;ప్రియేచ=ఇష్టమునందును;న(ధీయతే)=ఉంచఁబడదు. మత్కృతే=నాకుఁగా;తవ=నీకు; దుఃఖం= దుఃఖము;వ్యపైతు=పోవుఁగాక.

పాపరహితుండవగు దశరథమహారాజా! నాకు, శిష్టసమ్మతంబగు నీయాజ్ఞఁబరిపాలించుటయందు త్సాహంబుండునట్లు, ఉత్కృష్టములయిన కోరుకలందుఁగాని నాకుఁబ్రియంబయిన దానియందుఁగానియు త్సాహంబు లేదు; కావున, నరణ్యంబునకుఁబోవుట నాకుఁగష్టమని నీ వెంతమాత్రము నాకుఁగాదుఃఖింపవలదు. అని, తాత్పర్యము.



త దద్య నైవా నఘ రాజ్య మవ్యయం
న సర్వకామా న్న సుఖం న మైథిలీమ్
న జీవితం త్వా మనృ తేన యోజయన్
వృణీయ సత్యం వ్రత మస్తు తే తథా. ౫౯

టీక॥అనఘ= పాపములేనివాఁడా! తత్=అందువలన;అద్య= ఇప్పుడు;అహం(అధ్యాహృతము)=నేను;త్వాం=నిన్ను; అనృ తేన=అబద్ధముతో; యోజయన్ = కూర్చువాఁడనై;అవ్యయం=నాశములేని; రాజ్యం=దొరతనమును; నైవవృణీయ=కోరనేకోరను. సర్వకామాన్ =సమస్తములయినకోరుకలను; న(వృణీయ)=కోరను.సుఖం = సౌఖ్యమును;న(వృణీయ) = కోరను. మైథిలీం=సీతను;న(వృణీయ)= కోరను.జీవితం=ప్రాణమును;న(వృణీయ)= కోరను. తే=నీయొక్క; వ్రతం=వ్రతము; తథా=అట్లు; సత్యం = సత్యముగా;

అస్తు=అగుఁగాక.

పాపరహితుఁడా! మహాత్ముండవగు నీకసత్యదోషంబు సంభవించునట్లగు నేని, సమస్తకామంబులనుసుఖంబును నీ తను మదకుఁబ్రాణంబునుంగూడఁగోరను; ఇంకనీరాజ్యంబుఁగోరనని చెప్పనేల? ఎల్లెనను నీసత్యవ్రతంబుచెడకుండవలయు.అని, తాత్పర్యము.

ఫలాని మూలానిచ భక్షయన్ వనే
గిరీంశ్చపశ్యన్ సరిత స్సరాంసిచ
వనం ప్రవిశ్యైవ విచిత్రపాదపం
సుఖీ భవిష్యామి తవాస్తు నిర్వృతిః. ౫౯

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;విచిత్రపాదపం = నానావిధములయినవృక్షములు గల; వనం= అడవిని; ప్రవిశ్యైవ=చొచ్చియే;వనే= అడవియందు; ఫలాని=పండ్లను; మూలానిచ=గడ్డలను; భక్షయన్=తినుచు;గిరీంశ్చ=పర్వతములను;సరితః= నదులను; సరాంసిచ= కొలఁకులను; పశ్యన్= చూచుచు; సుఖీ = సుఖముగలవాఁడను;భవిష్యామి=అయ్యెదను.తవ=నీకు; నిర్వృతిః=సుఖము;అస్తు= అగుఁగాక.

నేను,నానావిధంబులగు వృక్షంబులనొప్పచుండునడవికిఁబోయి,యచ్చటనే,ఫలంబులనుగడ్డలనుం దినుచుఁ బర్వతంబులనునదులను గొలంకులనుం జూచుచు, సుఖంబుగానుండెదను; నీవుదుఃఖంబువిడిచి,సుఖంబునొందుము. అని, రాముండు,దశరథునితోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఏవం స రాజా వ్యసనాభిపన్న
శ్శోకేన దుఃఖేనచ తామ్యమానః
ఆలింగ్య పుత్రం సువినష్టసంజ్ఞో
మోహం గతో నైవ చిచేష్ట కించిత్. ౬౦

టీక॥వ్యసనాభిపన్నః= దుఃఖముచేనాక్రమింపఁబడిన; సః=ఆ; రాజా= దశరథమహారాజు; ఏవం=ఇట్లు; శోకేన=తాపముచేతను ; దుఃఖేనచ= దుఃఖముచేతను; తామ్యమానః= బాధపడుచు; పుత్రం=కొడుకును ; ఆలిం

గ్య—కౌఁగిలించుకొని;సువినష్టసంజ్ఞః= మిక్కిలినశించినస్మృతిగలవాఁడై;మోహం=మూర్ఛను; గతః—పొందినవాఁడై;కించిత్ =కొంచెమయినను; నైవచి చేష్ట—చేష్టింపఁడయ్యె.

పరమదుఃఖితుండగు నాదశరథమహారాజు,ఇట్లుతాపంబునను దుఃఖంబుననుంబరితపించుచుఁ గొడుకుం గవుఁగిలించుకొని;తెల్విదప్పి మూర్ఛితుండై, చేష్టలుడిగియుండెను.

అని, తాత్పర్యము.

దేవ్యస్తత స్సంరురుదు స్సమేతా
స్తాం వర్జయిత్వా నరదేవపత్నీమ్
రుదన్ సుమన్త్రోపి జగామ మూర్ఛాం
హాహాకృతం తత్ర బభూవ సర్వమ్. ౬౧

టీక॥తతః=అటుపిమ్మట ; తాం= ఆ;నరదేవపత్నీం=రాజభార్యయగుకైకేయిని;వర్జయిత్వా= విడిచి ; దేవ్యః=రాజపత్నులు; సమేతాః= చేరినవారలై; సంరురుదుః=మిక్కిలియేడ్చిరి.సుమన్త్రోపి=సుమంత్రుండును; రుదన్=ఏడ్చుచు;మూర్ఛాం = మూర్ఛను;జగామ=పొందెను. తత్ర= అచ్చట;సర్వం=జనమంతయు; హాహాకృతం=హాహాకారములుగలది;బభూవ= అయ్యెను.

అంత,నాకైకయిదక్కఁ దక్కినరాజపత్నులందఱునొక్కటియయిమిక్కుటంబుగరోదనంబుచేసిరి;సుమంత్రుండునురోదనంబుసేయుచు మూర్ఛితుండయ్యె;అచ్చటిజనులందఱును హాహాకారంబులరోదనంబుచేసిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,చతుస్త్రింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ చతుస్త్రింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

పంచత్రింశస్సర్గప్రారంభః.

తతో నిధూయ సహసా శిరో నిశ్వస్య చాసకృత్
పాణౌ పాణిం వినిష్పిష్య దన్తాన్ కటకటాప్యచ. ౧
లోచనే కోపసంరక్తే వర్ణం పూర్వోచితం జహత్
కోపాభిభూత స్సహసా సంతాప మశుభం గతః. ౨
మన స్సమీక్షమాణశ్చ సూతో దశరథస్య సః
కంపయన్నివ కైకేయ్యా హృదయం వాక్శరై శ్శితైః. ౩
వాక్యవజ్రై రనుపమై ర్నిర్భిన్దన్నివచాశుగైః
కైకేయ్యా స్సర్వ మర్మాణి సుమంత్రః ప్రత్యభాషత. ౪

టీక॥ తతః=అటుపిమ్మట; సః= ఆ; సూతః=సారథియగు; సుమంత్రః= సుమంత్రుఁడు; సహసా= శీఘ్రముగా; శిరః=తలను; నిధూయ=విదిర్చి; అసకృత్=పలుమాఱు; నిశ్వస్యచ= నిట్టూర్పులువుచ్చియు; పాణౌ=చేతియందు; పాణిం=చేతిని; వినిష్పిష్య= నలుపుకొని; దంతాన్=పండ్లను; కటకటాప్యచ= కటకటయనికొఱికియు; లోచనే=కండ్లను; కోపసంరక్తే= కోపముచే నెఱ్ఱనివానిఁగా; కృత్వా(అధ్యాహృతము)= చేసి; పూర్వోచితం= ముందుగలిగిన; వర్ణం=రంగును; జహత్=విడుచుచు; సహసా=తటాలున; కోపాభిభూతః= కోపముచేఁదిరస్కరింపఁబడినవాఁడై; అశుభం= అమంగళకరమయిన, తీక్ష్ణమయినయనుట; సంతాపం=దుఃఖమును; గతః= పొందినవాఁడై; దశరథస్య= దశరథునియొక్క; మనః=హృదయమును; సమీక్షమాణశ్చ= చూచుచును; శితైః=తీక్ష్ణములయిన; వాక్శరైః= బాణములచేత; కైకేయ్యాః = కైకేయియొక్క; హృదయం=గుండెను; కంపయన్నివ(స్థితః)= వడంకఁజేయునట్లున్నవాఁడై; ఆశుగైరివ(స్థితైః)= బాణంబులవలెనున్న; అనుపమైః=సరిలేని; వాక్యవజ్రైః= మాటలసమూహములచేత; కైకేయ్యాః=కైకేయియొక్క; సర్వమర్మాణి=సమస్తజీవస్థానములనుసమస్తరహస్యములను; నిర్భిందన్=భేదించుచు, వెల్లడిసేయుచు; ప్రత్యభాషత=పలికెను.

అంత, సారథియగుసుమంత్రుండు

కోపాతిరేకంబునఁ,దలనువిదిర్చికొని, పలుమాఱు నిట్టూర్పులువుచ్చి, చేతిలోఁజేయియుంచినలుపుకొనుచు, దంతంబులుకటకటంగొఱుకుచుఁ, గోపంబునఁగండ్లనెఱ్ఱంజేసుకొని,దేహంబంతయుఁబూర్వవర్ణంబువిడిచి యెఱ్ఱదనంబునొంద,మహాసంతాపంబునొంది,దశరథుండు కైకేయిపైఁగోపంబునొంది యుండుటంజూచి,తీక్ష్ణంబులగు బాణంబులంబోలువాక్యంబులఁగైకేయి హృదయంబు గడగడ వడంకునట్లు సేయువాఁడువలె, బాణంబులచే మర్మస్థానంబులభేదించునట్లుమాటలచే నాబిడ గుట్టుబట్టబయలు సేయుచు,నిట్లని చెప్పెను.అని, తాత్పర్యము.

యస్యా స్తవ పతి స్త్యక్తో రాజా దశరథ స్స్వయమ్
భర్తా సర్వస్య జగతః స్థావరస్య చరస్యచ. ౫
న హ్యకార్యతమం కించి త్తవ దేవీ హ విద్యతే

టీక॥ దేవి=కైకేయీ! యస్యాః=ఏ;తవ=(తృతీయార్థమందుషష్ఠి) నీచేత;పతిః=పెనిమిటియును; రాజా=రాజును;స్థావరస్య=చలింపనివృక్షము మొదలగుదానియొక్కయు; చరస్యచ=చలించు మనుష్యులు మొదలగుదానియొక్కయు;సర్వస్య=సమస్తమయిన;జగతః = ప్రపంచముయొక్కయు ; భర్తా = పోషించువాఁడునగు;దశరథస్స్వయం=దశరథుఁడె; త్యక్తః=విడువఁబడినాఁడో; తస్యాః (అధ్యాహృతము)=అట్టి;తవ=నీకు; ఇహ=ఈలోకమునందు; అకార్యతమం= ఎంతమాత్రముచేయఁగూడనిది;నవిద్యతేహి=లేదుగదా!

కైకేయీ! పెనిమిటియును స్థావరజంగమాత్మకమయిన భూమికంతయుఁ బ్రభువునగుదశరథునేవిడిచినావే; అట్టి నీకు, ఈలోకంబునందంతయుఁ, జేయరాని, దేదియున్నది?నీవెట్టియకార్యము నైనంజేయఁగలవు!

అని, తాత్పర్యము.

పతిఘ్నీం త్వా మహం మన్యే కులఘ్నీమపి చాంతతః. ౬
య న్మహేంద్రమివా జయ్యం దుష్ప్రకంప్య మివా చలమ్

మహోదధిమివాక్షోభ్యం సంతాపయసి కర్మభిః. ౭

టీక॥అహం= నేను;త్వాం=నిన్ను; పతిఘ్నీం= పెనిమిటినిజంపు దానిఁగా; అంతతః = పర్యవసానంబునందు;కులఘ్నీమపిచ = కులమునునశింపఁజేయు దానిఁగాను;మన్యే= తలంచుచున్నాను. యత్ =ఏకారణమువలన;మహేంద్రమివ = దేవేంద్రుండునుంబోలె ; అజయ్యం=జయింపఁగూడనివాఁడును;అచలమివ=పర్వతమునుబోలె; దుష్ప్రకంప్యం = కదలింపఁగూడనివాఁడును;మహోదధిమివ = సముద్రమునువలె;అక్షోభ్యం=క్షోభమునొందఁజేయఁగూడనివాఁడునగు;రాజానం(అధ్యాహృతము)=దశరథమహారాజును;కర్మభిః= కార్యములచేత; సంతాపయసి= దుఃఖించునట్లు సేయుచున్నావో.

దేవేంద్రుండుంబోలె జయింపనలవిగానివాఁడునుబర్వతంబుంబోలెఁజలనంబు నొందఁజేయనలవిగాని వాఁడునుసముద్రంబుంబోలె క్షోభమునొందునట్లు సేయ నలవిగానివాఁడునగు దశరథమహారాజునకుంగూడ,దుఃఖంబుగల్గునట్లు సేయుచున్నావు, గావున, నీవు పెనిమిటింజంపు దానవు, చక్కఁగావిచారించినచోఁ, గులంబునంతయునశింపఁజేయు దానవనితలంచుచున్నాను.

అని, తాత్పర్యము.

మావమంస్థా దశరథం భర్తారం వరదం పతిమ్
భర్తు రిచ్ఛాహి నారీణాం పుత్రకోట్యా విశిష్యతే. ౮

టీక॥భర్తారం= పోషించువాఁడును;వరదం=వరంబులనిచ్చువాఁడును; పతిం=పెనిమిటియునగు; దశరథం= దశరథుని;మావమంస్థాః= తిరస్కరింపకుము. నారీణాం=స్త్రీలకు; భర్తుః= పెనిమిటియొక్క; ఇచ్ఛా=ప్రీతి; పుత్రకోట్యాం=కొడుకులయొక్క కోటికన్నను; విశిష్యతేహి= అధికమగుచున్నదిగదా!

అందఱనుబోషించువాఁడును వరంబులనిచ్చువాఁడును బెనిమిటయునగు దశరథునవమానింపకుము;స్త్రీలకుఁ, బెనిమిటి సంతోషించుటయె,కోటికొడుకులకన్ననధికము.

అని, తాత్పర్యము.

యథావయోహి రాజ్యాని ప్రాప్నువంతి నృపక్షయే
ఇక్ష్వాకుకులనాథేఽస్మిం స్తల్లోపయితు మిచ్ఛసి. ౯

టీక॥ నృపక్షయే=రాజుయొక్క నాశముకాఁగా; పుత్రాః(అధ్యాహృతము)=కొడుకులు; యథావయః=వయసునతిక్రమింపక; రాజ్యాని=రాజ్యములను; ప్రాప్నువంతిహి = పొందుదురుగదా! ఇక్ష్వాకుకులనాథే= ఇక్ష్వాకువంశంబునకుఁబ్రభువైన; అస్మిన్= ఈరామునివిషయమయి; తత్ =దానిని; లోపయితుం=లోపమునొందించుటకు; ఇచ్ఛసి=కోరుచున్నావు.

లోకంబున, రాజున కవసానకాలమువచ్చినప్పుడు, కొడుకులు, వారివయస్సననుసరించి, జ్యేష్ఠుఁడు రాజ్యంబునొందుటయు, నితరులతనిననుసరించుచుండుటయు, నిట్లు నడుచుకొనుచుందురుగదా! అట్లుజ్యేష్ఠుండగుటంజేసి యిక్ష్వాకువంశంబునకుఁబ్రభువు కాఁదగిన యీరామునివిషయమయి, యాధర్మమును జెఱుపఁదలంచితివేమి!

అని, తాత్పర్యము.

రాజా భవతు తే పుత్రో భరత శ్శాస్తు మేదినీమ్
వయం తత్ర గమిష్యామో యత్ర రామో గమిష్యతి. ౧౦

టీక॥ తే=నీయొక్క; పుత్రః= కొడుకైన; భరతః=భరతుఁడు; రాజా=రాజు; భవతు=అగుఁగాక, మేదినీం= భూమిని; శాస్తు=పాలించుఁగాక. రామః=రాముఁడు; యత్ర=ఎచ్చటికి; గమిష్యతి=పోవునో; తత్ర=అచ్చటికి; వయం= మేము; గమిష్యామః=పోయెదము.

నీకొడుకుభరతుండు రాజగుఁగాక; అతండెభూమిం బాలించుచుండుఁగాక; రాముండెచ్చటికిఁబోవునో, మేమందఱమునచ్చటికిఁబోయెదము.

అని, తాత్పర్యము.

న హి తే విషయే కశ్చి ద్బ్రాహ్మణో వస్తు మర్హతి
తాదృశం త్వ మమర్యాద మద్య కర్మ చికీర్షసి. ౧౧




టీక॥ తే=నీయొక్క; విషయే=దేశమునందు; బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు; కశ్చిత్=ఒకానొకఁడును; వస్తుం=ఉండుటకు; నార్హతిహి=తగఁడుగదా! త్వం=నీవు; అద్య=ఇప్పుడు; తాదృశం=అట్టి; అమర్యాదం=మర్యాదలేని; కర్మ=కార్యమును; చికీర్షసి=చేయఁదలంచుచున్నావు.

నీదేశమునందింకనొక బ్రాహ్మణుండైననుండఁడు; అట్లు, బ్రాహ్మణులందఱును లేచిపోవనట్లు, నీవిప్పుడెంతమాత్రము మర్యాదలేని కార్యము సేయఁదలంచియున్నావు.

అని, తాత్పర్యము.

ఆశ్చర్య మివ పశ్యామి యస్యాస్తే వృత్త మీదృశమ్
ఆచరంత్యా న విదృతా సద్యో భవతి మేదినీ. ౧౨

టీక॥ యస్యాః=ఏ; తే=నీవు; ఈదృశం=ఇట్టి; వృత్తం=ఆచారమును; ఆచరంత్యాః=చేయుచుండఁగా; మేదినీ=భూమి=సద్యః=అక్షణమే; విదృతా=పగిలినది; నభవతి=కాకున్నదో; ఇదం (అధ్యాహృతము)=దీనిని; ఆశ్చర్యమివ=ఆశ్చర్యమునుంబోలె; పశ్యామి=చూచుచున్నాను.

నీవిట్టి దూరమయిన యాచారమును జేయుచున్నను, తత్క్షణమె భూమిపగులకున్నదే! దీనింజూడఁగా నాకాశ్చర్యమగుచున్నది.

అని, తాత్పర్యము.

మహాబ్రహ్మర్షిజుష్టా వా జ్వలంతో భీమదర్శనాః
ధిగ్వాదండా న హింసంతి రామప్రవ్రాజనే స్థితామ్. ౧౩

టీక॥ మహాబ్రహ్మర్షిజుష్టాః=పూజ్యులయినబ్రహ్మర్షులచేతఁబ్రయోగింపఁబడినవియును; జ్వలంతః=ప్రకాశించుచున్నవియును, దీక్ష్ణములుననుట; భీమదర్శనాః=భయంకరమయినచూచుటగలవియునగు; ధిగ్వాదండాః="దహింపఁబడుఁగాక" యనువాగ్రూపములయినశిక్షలయినను; రామప్రవ్రా




జనే = రామునరణ్యమునకుఁబంపుట యందు; స్థితాం=ఉన్న కైకేయిని; న హింసంతి=బాధింపవు!

తీక్ష్ణంబులునుజూపరులకుభయంబుఁబు ట్టించునవియునగు, బ్రహ్మర్షులచేఁ గో పంబునంజెప్పఁబడు, "దహింపఁబడుఁ గాక" అనుశాపవాక్యంబులయినను, రామునరణ్యంబునకుఁబంపఁదలఁచియున్న యీకైకేయింగాఁజియపెట్టవేమి!

అని, తాత్పర్యము.

ఆమ్రం ఛిత్వా కుఠారేణ నింబం పరిచరేత్తు యః
యశ్చైనం పయసా సించే న్నైవాస్య మధురో భవేత్. ౧౪

టీక॥యః=ఎవ్వఁడు; ఆమ్రం=మామిడిచెట్టును;కుఠారేణ=గొడ్డలిచేత;ఛిత్వా=నఱికి;నింబంతు = వేఁపచెట్టును మాత్రము;పరిచరేత్ = సేవించునో; యశ్చ=ఎవ్వఁడును; ఏనం=ఈవేఁపచెట్టును;పయసా=పాలచేత; సించేత్= తడుపునో;అస్య=వీనికి;మధురః = తియ్యనిది;నైవభవేత్=కానేకాదు.

ఎవ్వఁడేని తియ్యనిపండ్లనొసంగున ట్టిమామిడిచెట్టునుగొడ్డలిచేనఱికి, వేఁపచెట్టుకుఁబాదులుగట్టి దానింబాలచేఁ దడుపుచువచ్చునేని, యీవేఁపచెట్టతని కిఁదియ్యనిపండ్లనొసంగక చేఁదుకాయ లనేయిచ్చునట్లు, రామునడవికిఁ బంపి కైకేయికిసంతోషముసేయుటచేతదశ రథునకుఁగష్టమేకానియెంతమాత్రము కైకేయివలనసుఖంబుగలుగదు.

అని, తాత్పర్యము.

ఆభిజాత్యంహి తే మన్యే యథా మాతు స్తథైవచ
నహి నింబా త్స్రవే త్క్షౌద్రం లోకే నిగదితం వచః. ౧౫

టీక॥తే=నీయొక్క; ఆభిజాత్యం=మంచితలితండ్రులకుఁ బుట్టుటవలనఁ గలుగుసదాచారము;మాతుః=తల్లికి; యథా=ఎట్లో;తథైవచ = అట్లె;మన్యేహి=తలంచుచున్నానుగదా! ఎటుంగుదునుగదా!యనుట;నింబాత్=వేఁపచెట్టువలన;క్షౌద్రం= తేనె;నస్రవేత్= కాఱదు.ఇతి(అధ్యాహృతము)=అను; వచః=మాట;లోకే=లోకమునందు;నిగదితంహి=ప్రసిద్ధికెక్కినదిగదా!

నీసత్స్వభావమును నాచుఁదెలియును;నీతల్లి స్వభావమెట్టిదో అట్టిదేనీస్వభావమును; వేఁపచెట్టునుండి తేనెస్రవింపదను సంగతిలోకంబునం బ్రసిద్ధముగదా! దుష్టురాలకుసుపుత్రి యెట్లుపుట్టును? అని, తాత్పర్యము.

తవ మాతు రసద్గ్రాహం విద్మః పూర్వం యథాశ్రుతమ్

టీక॥తవ=నీయొక్క; మాతుః= తల్లియొక్క; అసద్గ్రాహం= చెడుగునందలియభినివేశమును; పూర్వం=మున్ను; యథాశ్రుతం=వినఁబడినట్లు; విద్మః=ఏఱుంగుదుము.

నీతల్లి చేసిన దుశ్చేష్టలన్నియు మున్నువినియున్నాము; మాకుం దెలియును. అని, తాత్పర్యము.

పితుస్తే వరదః కశ్చి ద్దదౌ వర మనుత్తమమ్. ౧౮

టీక॥కశ్చిత్=ఒకానొక; వరదః=వరమునిచ్చువాఁడు; తే = నీయొక్క; పితుః=తండ్రికి; అనుత్తమం=తనకన్నశ్రేష్ఠములేని; వరం=వరమును; దదౌ = ఇచ్చెను.

వరంబుల నొసంగంజాలిన యొకానొకమహాత్ముండు, నీతండ్రికుత్తమంబగువరంబొకటియొసంగెను.

అని, తాత్పర్యము.

సర్వభూతరుతం తస్మా త్సంజజ్ఞే వసుధాధిపః

టీక॥తస్మాత్=అందువలన; వసుధాధిపః=భూమికిఁబ్రభువైననీతండ్రి; సర్వభూతరుతం= సమస్తప్రాణులమాటను; సంజజ్ఞే=తెలుసుకొనెను.

ఆవరమువలన, నతనికి, సమస్తప్రాణులు మాటలాడు కొనుమాటలు తెలియుచువచ్చెను. అని, తాత్పర్యము.

తేన తిర్యగ్గతానాంచ భూతానాం విదితం వచః. ౧౭

టీక॥ తేన=అట్టినీతండ్రిచేత ; తిర్యగ్గతానాం=అడ్డముగాగమనముగల

భూతానాం=ప్రాణులయొక్క; వచస్సు=మాటయును;విదితం = ఎఱుంగఁబడినవి.

అతనికిఁ,దిర్యగ్జంతువులు మాటలాడుకొనుమాటలను దెలియుచుండినవి.

అని, తాత్పర్యము.

తతో జృంభస్య శయనే విరుతా ద్భూరివర్చసః
పితు స్తే విదితో భావ స్స తత్ర బహుధాఽ హసత్. ౧౮

టీక॥తతః=అంత;శయనే = పాన్పుసమీపమునందు; జృంభస్య=ఒకవిధమయిన పిపీలికయొక్క;విరుతాత్=మాటవలన;భావః = అభిప్రాయము; తే=నీయొక్క; భూరివర్చసః= అధికమయినకాంతిగల; పితుః= తండ్రికి; విదితః=తెలిసినది. తత్ర= ఆవిషయమయి;సః=అతఁడు;బహుధా= పలుమాఱు;అహసత్=నవ్వెను.

అంత,నొకనాఁడు , కాంతిమంతుండగు నీతండ్రి , శయనసమీపంబున,జృంభమను నొకపిపీలిక పలికిన మాటవలన, దానియభిప్రాయం బెఱింగి, దానిందలంచుకొని, పలుమాఱు నవ్వెను. అని, తాత్పర్యము.

తత్ర తే జననీ క్రుద్ధా మృత్యుపాశ మభీప్సతీ
హాసం తే నృపతే సౌమ్య జిజ్ఞాసామీతి చాబ్రవీత్. ౧౯

టీక॥ తే=నీయొక్క; జననీ=తల్లి; మృత్యుపాశం=మృత్యువుత్రాటిని;అభీప్సతీ=కోరుచు ; తత్ర = ఆనవ్వువిషయమయి;క్రుద్ధా= కోపమునొందినదై ;సౌమ్య=శాంతుండవగు; నృపతే= మహారాజా! తే=నీయొక్క; హాసం= నవ్వును,నవ్వుకారణమును ; జిజ్ఞాసామి=తెలియఁగోరుచున్నాను. ఇతిచ= అనియు;అబ్రవీత్ =పలికెను.

అంత,నీతల్లి,పెనిమిటియట్లు నవ్వటంజూచి,తన్నుఁజూచి పరిహసించెననితలంచి,యవమానంబు సహింపంజాలకమరణంబుననైనం గోరునంతటికోపంబునొంది,పెనిమిటింజూచి"శాంతుండవగుమహారాజా!నీవిప్పుడునవ్వుటకుం గలకారణంబునునాకుఁ జెప్పవలయు" అని,యడిగెను.

అని, తాత్పర్యము.

నృప శ్చోవాచ తాం దేవీం దేవి శంసామి తే యది
తతో మే మరణం సద్యో భవిష్యతి న సంశయః. ౨౦

టీక॥ నృపశ్చ= కేకయమహారాజు ను; తాం=ఆ; దేవీం= భార్యనుగూర్చి; "దేవి=రాణీ! తే=నీకొఱకు; శంసామి యది=చెప్పుదునేని; తతః= అందువలన; సద్యః=తత్క్షణమె; మే=నాకు; మరణం=చావు; భవిష్యతి=కాఁగలదు. సంశయః=సందేహము; న=లేదు. ఇతి (అధ్యాహృతము)=అని; ఉవాచ = చెప్పెను.

కేకయ మహారాజును, భార్యంజూచి "నీకు నేనవ్విన కారణముం జెప్పితినేని, నాకుఁదత్క్షణంబె మరణంబుగలుగును; ఇందుకుసందేహములేదు." అని, చెప్పెను. అని, తాత్పర్యము.

మాతా తే పితరం దేవి తతః కేకయ మబ్రవీత్

టీక॥ దేవి=కైకేయీ; తతః= అటుపిమ్మట; తే=నీయొక్క; మాతా=తల్లి; పితరం=తండ్రియయిన; కేకయం= కేకయమహారాజుం గూర్చి; అబ్రవీత్= పలికెను.

కైకేయీ! అంతనీతల్లి, నీతండ్రియగు కేకయమహారాజుం జూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

శంస మే జీవవా మావా న మా మపహసిష్యసి. ౨౧

టీక॥ జీవవా= బ్రతికినను బ్రతుకుము; మావా=చచ్చినను చావుము; మే= నాకొఱకు; శంస=చెప్పుము; మాం=నన్ను; నాపహసిష్యసి=పరిహసింపవు; ఇతిజ్ఞాస్యామి(అధ్యాహృతము)= అని యెఱింగెదను.

నీవుబ్రతుకుము లేక చచ్చిపొమ్ము; నాకునక్కఱలేదు; నాకునీవు నవ్వినకారణముంజెప్పుము; నీవునన్నుఁ బరిహసించినావో లేదో తెలిసికొనవలయును. అని నీతల్లి నీతండ్రితోఁజెప్పినది.

అని, తాత్పర్యము.

ప్రియయా చ తథో క్తస్సన్ కేకయః పృథివీపతిః
తస్మై తం వరదాయాఽర్థం కథయామాస తత్త్వతః. ౨౨

టీక॥పృథివీపతిః=భూమికిఁబ్రభువైన; కేకయశ్చ = కేకయమహారాజును; ప్రియయా=భార్యచేత; తథా=అట్లు; ఉక్తస్సన్=చెప్పఁబడినవాఁడై;తస్మై=ఆ;వరదాయ=వరమునిచ్చినవానికొఱకు;తం=ఆ;అర్థం = సమాచారమును;తత్త్వతః = యథార్థముగా;కథయామాస=చెప్పెను.

భూమికిఁ బ్రభువైన కేకయమహారాజు,భార్యచెప్పినమాటను విని, ఆసమాచారము నంతయు యథార్థముగా,మున్నుతనకావరమునిచ్చినవానికిం జెప్పెను. అని, తాత్పర్యము.

తత స్సవరద స్సాధూ రాజానం ప్రత్యభాషత

టీక॥తతః=అటుపిమ్మట; సాధుః=యోగ్యుఁడైన; సః=ఆ;వరదః= వరమునిచ్చినవాఁడు; రాజానం= కేకయరాజునుగూర్చి;ప్రత్యభాషత= బదులుచెప్పెను.

అంతసత్పురుషుండగునావరంబు నిచ్చినవాఁడు, కేకయ మహారాజుంజూచి,యిట్లని,చెప్పెను.అని, తాత్పర్యము

మ్రియతాం ధ్వంసతాంవేయం మాకృథాస్త్వం మహీపతే. ౨౩

టీక॥మహీపతే=భూమికిఁబ్రభువైనకేకయ మహారాజా! ఇయం=ఈబిడ; మ్రియతాం=చచ్చుఁగాక. ధ్వంసతాంవా=చెడిపోయినను జెడిపోవుఁగాక.త్వం=నీవు; మాకృథాః= చేయకుము.

కేకయమహారాజా! ఈబిడచచ్చిననుఁ జచ్చుఁగాక, లేక చెడిపోయినను జెడిపోవుఁగాక;ఏమిచేసినను, నీవెంతమాత్రమును, జెప్పకుము. అని,వరమునిచ్చినవాఁడు కేకయమహారాజుతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

స తచ్ఛ్రుత్వా వచ స్తస్య ప్రసన్నమనసో నృపః
మాతరం తే నిరస్యాశు విజహార కుబేరవత్. ౨౪

టీక॥సః=ఆ; నృపః=కేకయమహారాజు; ప్రసన్నమనసః = నిర్మలమయినమనసుగల;తస్య=ఆవరమునిచ్చినవానియొక్క; వచః= మాటను; శ్రు

త్వా=విని; తే=నీయొక్క; మాతరం= తల్లిని; ఆశు=శీఘ్రముగా; నిరస్య=తిరస్కరించి; కుబేరవత్=కుబేరుండువలె; విజహార=క్రీడింపుచుండెను.

ఆకేకయమహారాజు, నిర్మలమానసుండగు నావరంబు నిచ్చినవాఁడు చెప్పినమాటను విని, శీఘ్రముగా నీతల్లిని దిరస్కరించి, కుబేరునిభంగి, సుఖముగా విహరింపుచుండెను. అని, తాత్పర్యము,

తథా త్వ మపి రాజానం దుర్జనాచరితే పథి
అస ద్గ్రాహ మిమం మోహా త్కురుషే పాపదర్శిని. ౨౫

టీక॥ పాపదర్శిని=పాపములనెచూచునట్టికైకేయీ! తథా = అట్లు; త్వమపి=నీవును; దుర్జనాచరితే=దుష్టస్త్రీలచేనాచరింపఁబడిన; పథి=మార్గమునందు; స్థితా(అధ్యాహృతము)=ఉన్నదానవై; మోహాత్ = అజ్ఞానమువలన; ఇమం=ఈ; రాజానం = దశరథమహారాజును; అసద్గ్రాహం = చెడుగునగ్రహించువానిఁగా; కురుషే= చేయుచున్నావు.

పాపములు మాత్రము సేయఁగోరునట్టికైకేయీ! నీవును, నీతల్లివలెనే, దుష్టస్త్రీల మార్గంబునవలంబించి, మోహంబున, దశరథునకుఁ జెడుపుగల్గునట్లు సేయుచున్నావు. అని, తాత్పర్యము.

సత్య శ్చా ద్య ప్రవాదోయం లౌకికః ప్రతిభాతి మా
పితౄ న్స మనుజాయంతే నరా మాతర మంగనాః. ౨౬

టీక॥ "నరాః=పురుషులు; పితౄన్= తండ్రులను; అంగనాః = స్త్రీలు; మాతరం=తల్లిని; సమనుజాయంతే= అనుసరించిపుట్టుదురు;" అయం=ఈ; లౌకికః= లోకంబునందుఁ జెప్పబడునట్టి; ప్రవాదః=వార్త; అద్య= ఇప్పుడు; మా=నన్నుగూర్చి; సత్యః=అబద్ధముగానిదిగా; ప్రతిభాతి=తోఁచుచున్నది.

"కొడుకులకుఁ దండ్రిగుణములు వచ్చును; కొమార్తెలకుఁ దల్లిగుణములు వచ్చును" అని లోకమునం జెప్పఁబడువార్త, ఇప్పుడు, నాకు, అబద్ధము కాదని తోఁచుచున్నది. అని, తాత్పర్యము.

నైవం భవ గృహాణేదం యదాహ వసుధాధిపః
"నేయాభవ" ఇతి పాఠాంతరం.

టీక॥ఏవం=ఇట్లు;నభవ= ఉండకుము.(పాఠాంతరపక్షమందు) నేయా= విధేయురాలవు;భవ = అగుము;వసుధాధిపః=భూమికిఁబ్రభువైనదశరథుఁడు;యత్=దేనిని; ఆహ = చెప్పుచున్నాఁడో;ఇదం = ఈమాటను;గృహాణ=గ్రహింపుము.

నీవిట్లుండకుము; (పాఠాంతరపక్షమందు; నీవు పెనిమిటియగుదశరథమహారాజునకువిధేయురాలవగుము) అతండుచెప్పినట్లువినుము.
అని, తాత్పర్యము.

భర్తు రిచ్ఛా ముపాస్స్వేహ జనస్యాస్య గతి ర్భవ. ౨౭

టీక॥భర్తుః= పెనిమిటియొక్క; ఇచ్ఛాం=కోర్కెని;ఉపాస్స్వ= సేవింపుము;ఇహ=ఇప్పుడు; అస్య= ఈ; జనస్య=జనమునకు; గతిః=శరణము; భవ= అగుము.

నీపెనిమిటికోర్కెచొప్పున,నీవును, రాముని పట్టాభిషేకంబున కొడంబడుము; ఇప్పుడు రాముని వనవాసమునుగుఱించి పరమదుఃఖంబు నొందియున్న యీపౌరజానపదాదిజనులంగాపాడుము.అని, తాత్పర్యము.

మా త్వం ప్రోత్సాహితా పాపై ర్దేవ రాజ సమప్రభమ్
భర్తారం లోకభర్తార మసద్ధర్మ ముపాదధాః. ౨౮

టీక॥త్వం=నీవు;పాపైః = దుష్టులచేత; ప్రోత్సాహితా=పురికొల్పంబడినదానవై; దేవరాజసమప్రభం= దేవేంద్రుని కాంతితో సరియయినకాంతి గలవాఁడును;లోకభర్తారం= భూలోకమునకుంబ్రభువునగు ; భర్తారం= పెనిమిటిని; అసద్ధర్మం= అధర్మమును; మోపాదధాః= పొందింపకుము.

నీవు పాపిష్ఠులుచెప్పుమాటలు విని, దేవేంద్రునకు సాటియయిన వాఁడును లోకనాయకుండునగు పెనిమిటికి,అధ

మర్మముగల్గునట్లు, సేయకుము. అని, తాత్పర్యము.

న హి మిథ్యా ప్రతిజ్ఞాతం కరిష్యతి తవా నఘః
శ్రీమాన్ దశరథో రాజా దేవి రాజీవలోచనః. ౨౯

టీక॥ దేవి=కైకేయీ! అనఘః=పాపరహితుండును; శ్రీమాన్= అందఱికన్ననధికుండును ; రాజీవలోచనః= తామరపూలవంటి కండ్లుగలవాఁడును; రాజా=రాజునగు; దశరథః= దశరథుఁడు; తవ=నీకు; ప్రతిజ్ఞాతం=వాగ్దత్తమయినదానిని; మిథ్యా= అబద్ధమునుగా; నకరిష్యతిహి=చేయఁడుగదా!

కైకేయీ! పాపరహితుండును శ్రీమంతుండును గమలంబులుంబోలె విశాలరమణీయంబులయిన నేత్రంబులు గలవాఁడునగు దశరథమహారాజు, నీకువాగ్దత్తముచేసిన దానినివ్వఁడనుసందియంబునీకువలదు; అతఁడు సత్యసంధుండుగావున, నేవిధమునన్నైన, నీవరంబులొసంగిసంతోషంబు సేయును. అని, తాత్పర్యము.

లేక; దేవి; అనఘః; శ్రీమాన్; రాజీవలోచనః; రాజా; దశరథః; తవ=నీకు; మిథ్యాప్రతిజ్ఞాతం=అబద్ధముగా వాగ్దత్తమయినదానిని, మోసముచేసిన్చెదనని చెప్పినదానినసుట; నకరిష్యతిహి=చేయఁడుగదా!

కైకేయీ! పాపరహితుండును శ్రీమంతుండును గమలంబులుంబోలెవిశాలసుందరంబులయిన నేత్రంబులు గలవాఁడునగుదశరథమహారాజు, నీకిప్పుడు మోసపోయివాగ్దత్తము చేసినదానిని, ఎంతమాత్రము చేయఁడు: నీవాయాశనుంచుకొనప్రయోజనములేదు. అని, తాత్పర్యము.

జ్యేష్ఠో వదాన్యః కర్మణ్య స్స్వధర్మ పరిరక్షితా
రక్షితా జీవలోకస్య బలీ రామోఽభిషిచ్యతామ్. ౩౦

టీక॥ జ్యేష్ఠః=సహోదరులలోఁ బెద్దవాఁడును; వదాన్యః=దాతయును; కర్మణ్యః=కర్మమువిషయమయి యోగ్యుండును, సదాచార సంపన్నుండుననుట; స్వధర్మపరిరక్షితా= తనధర్మముయొక్క రక్షించువాఁడును; జీవలోకస్య = ప్రాణి లోకము యొక్క; రక్షితా = రక్షించువాఁడు

నుఃబలీ= అధికమయిన బలముగలవాఁడునగు; రామః=రాముఁడు; అభిషిచ్యతాం=అభిషేకింపఁబడుఁగాక.

జ్యేష్ఠుండు మిక్కిలి యుదారుండు సదాచారసంపన్నుండుఁదనక్షత్రియధర్మంబుదప్పకనడుచుకొనువాఁడు జీవలోకంబునంతయుఁ గాపాడంజాలినవాఁడుబలవంతుఁడునిట్లు పట్టాభిషేకయోగ్యంబులగు సద్గుణంబులన్నియుంగలిగియొప్పుచున్న రామునకుఁ,బట్టాభిషేకముఘటిల్లునట్లు సేయుము.

అని, తాత్పర్యము.

పరివాదో హి తే దేవి మహాన్ లోకే చరిష్యతి
యది రామో వనం యాతి విహాయ పితరం నృపమ్. ౩౧

టీక॥దేవి=కైకేయీ! రామః=రాముఁడు;నృపం=రాజయిన ; పితరం=తండ్రిని;విహాయ=విడిచి;వనం=అడవిని;యాతియది=పొందునేని; తే= నీకు; లోకే=లోకమునందు;మహాన్= అధికమయిన;పరివాదః=అపవాదము ; చరిష్యతిహి=వ్యాపించునుగదా!

కైకేయీ! రాముండు మహారాజుగానుండుతండ్రింబాసియరణ్యంబునకుఁబోవునేని,నీకీలోకంబునందంతయు,గొప్పయపవాదముగలుగును.

అని, తాత్పర్యము.

స రాజ్యం రాఘవః పాతు భవ త్వం విగతజ్వరా
న హి తే రాఘవా దన్యః క్షమః పురవరే వసేత్. ౩౨

టీక॥సః=ఆ;రాఘవః = రాముఁడు;రాజ్యం=రాజ్యమును;పాతు=పాలించుఁగాక.త్వం=నీవు; విగతజ్వరా=పోయినపరితాపముగలది; భవ=అగుము. తే=నీయొక్క;పురవరే=పట్టణశ్రేష్ఠమయిన యయోధ్యయందు; రాఘవాత్=రామునివిడిచి; అన్యః=ఇతరుఁడు;క్షమః = యోగ్యుఁడు;నవసేద్ధి=ఉండఁడుగదా!

అట్టిసద్గుణసంపన్నుండగు రాముఁడె రాజ్యంబుఁబాలింపుచుండుఁగాక;నీవీపరితాపంబువిడువుము; రాముండడవికిఁబోయినచో,నీయయోధ్యయందు, మఱియోగ్యుం డెవ్వఁడును వాసంబుసేయఁడు. అని, తాత్పర్యము.

స ౩౫

రామే హి యౌవరాజ్యస్థే రాజా దశరథో వనమ్
ప్రవేక్ష్యతి మహేష్వాసః పూర్వవృత్తమనుస్మరన్. ౩౩

టీక॥ రామే=రాముఁడు; యౌవరాజ్యస్థే= యువరాజుదొరతనముననుండఁగా; మహేష్వాసః= పెద్దవిల్లుగల; రాజా=రాజయిన; దశరథః= దశరథమహారాజు; పూర్వవృత్తం=మునుపటివారియాచారమును; అనుస్మరన్ = తలంచుచు; వనం = అడవిని; ప్రవేక్ష్యతి హి=ప్రవేశింపఁగలఁడుగదా!

రాముండు యౌవరాజ్యంబువహించినపిమ్మట, మహాపరాక్రమశాలియగు దశరథమహారాజు, మున్నిక్ష్వాకువంశ్యులుగావించిన యాచారపద్ధతిననుసరించి, వనంబునకుఁబోవును; ఇది యేగదాయుక్తము! అని, సుమంత్రుండు కైకేయితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి సాంత్వైశ్చ తీక్ష్ణైశ్చ కైకేయీం రాజసంసది
సుమన్త్రః క్షోభయామాస భూయ ఏవ కృతాంజలిః. ౩౪

టీక॥ సుమంత్రః=సుమంత్రుఁడు; ఇతి=ఈప్రకారముగా; సాంత్వైశ్చ= తిన్ననిమాటలచేతను; తీక్ష్ణైశ్చ = కఠినములయిన మాటలచేతను; రాజసంసది=రాజసభయందు; కైకేయీం=కైకేయిని; క్షోభయామాస=కలఁగునట్లు చేసెను. భూయః=మరల; కృతాంజలిరేవ = చేయఁబడినచేమోడ్పుగలవాఁడై యే; ఆసీత్ (అధ్యాహృతము)= ఉండెను.

ఇట్లు, సుమంత్రుండు, రాజసభయందు, సాంత్వవాక్యంబులచేతను గఠినవాక్యంబులచేతను గైకేయిని క్షోభింపఁజేసి, యంతనెప్పటియట్ల, చేతులు మొగుడ్చుకొనియుండెను. అని, తాత్పర్యము.

నైవ సా క్షుభ్యతే దేవీ నచ స్మ పరిదూయతే
న చాస్యా ముఖవర్ణస్య విక్రియా లక్ష్యతే తదా. ౩౫

టీక॥ తదా=అప్పుడు; సా = ఆ; దేవీ=కైకేయి; నైవ క్షుభ్యతే=కలఁతపడ

నే లేదు. నపరిదూయతేచస్మ= దుఃఖింపను లేదు. అస్యాః = ఈకైకేయియొక్క; ముఖవర్ణస్య= ముఖముయొక్కరంగుయొక్క; విక్రియాచ= వికారమును; నలక్ష్యతే=చూడఁబడలేదు.

అప్పు,డట్లు, ఎంతకఠినంబుగామాటలాడినను,అక్కైకేయికి,క్షోభంబుగలుగదయ్యె; ఎంతసాంత్వవాక్యంబులాడినను మనంబు గరఁగి దుఃఖంబునొందదయ్యె; మఱియు, మొగంబుననుండుకూర్రవర్ణము, ఎంతమాత్రము మాఱదయ్యె. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, పంచత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ పంచత్రింశసర్గ టీక, ముగిసినది.

శ్రీ

షట్త్రింశసర్గప్రారంభః.

తత స్సుమంత్ర మైక్ష్వాకః పీడితోఽత్ర ప్రతిజ్ఞయా
సబాష్ప మతినిశ్శ్వస్య జగాదేదం పునః పునః. ౧

టీక॥ తతః= అటుపిమ్మట; ఇక్ష్వాకః=ఇక్ష్వాకువంశమునందుబుట్టిన దశరథమహారాజు; అత్ర=ఈవరదానము విషయమయి; ప్రతిజ్ఞయా=ప్రతిజ్ఞచేత; పీడితః= బాధింపఁబడినవాఁడై; సబాష్పం= ఉష్ణముతోఁగూడునట్లుగా; అతినిశ్శ్వస్య= మిక్కిలి నిట్టూర్పులువుచ్చి; సుమంత్రం= సుమంత్రునిఁగూర్చి; ఇదం=ఈమాటను; పునఃపునః= మాటిమాటికి; జగాద=చెప్పెను.

అంత,దశరథుండు, వరదానమును గుఱించితాను జేసిన ప్రతిజ్ఞనుదప్పించుకొనంజాలక,దుఃఖితుండై, వేఁడినిట్టూర్పులువుచ్చి,సుమంత్రుంజూచి, మాటిమాటికి,నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

సూత రత్నసుసంపూర్ణా చతుర్విధ బలా చమూః
రాఘవస్యాను యాత్రార్థం క్షిప్రం ప్రతివిధీయతామ్. ౨

టీక॥ సూత = సారథివగుసుమంత్రుఁడా! రత్నసుసంపూర్ణా = మణులచేనిండినదియును; చతుర్విధబలా = నాలుగువిధములయిన (రథముగజముగుఱ్ఱముపదాతిఅను) బలములు గలదియునగు; చమూః = సేన; రాఘవస్య = రామునియొక్క; అనుయాత్రార్థం = వెంబడించుటకొఱకు; క్షిప్రం = శీఘ్రముగా; ప్రతివిధీయతాం = పంపఁబడుఁగాక.

సుమంత్రుఁడా! అడవిలో రామునకు సేవసేయుచుండుటకై, రత్నరాశితోఁ గూడినచతురంగసేనను, శీఘ్రముగా, రాముని వెంటంబంపుము.

అని. తాత్పర్యము.

రూపాజీవాశ్చ వాళిన్యో వణిజశ్చ మహాధనాః
శోభయంతు కుమారస్య వాహినీం సుప్రసారితాః. ౩

టీక॥ వాళిన్యః = మాటలచేనితరుల మనంబు నాకర్షింప సమర్థలయిన; రూపాజీవాశ్చ = వేశ్యలును; సుప్రసారితాః = పదార్థములం బఱచుకొనియుండు; మహాధనాః = అధికమైనధనముగల; వణిజశ్చ = వైశ్యులును; కుమారస్య = రామునియొక్క; వాహినీం = సేనను; శోభయంతు = అలంకరింతురుగాక.

మాటలచేనితరచిత్తమునువశీకరింపంజాలినవేశ్యలును రాముని వెంటంబోదురుగాక; మఱియు ధనవంతులగు వైశ్యులు, అచ్చటచ్చటపదార్థములం బఱచుకొనివిక్రయించుచు, రాముని వెంటంబోవు సైన్యంబుల నలంకరింతురుగాక. అని, తాత్పర్యము.

యేచైన ముపజీవంతి రమతే యైశ్చ వీర్యతః
తేషాం బహుధనం దత్వా తా న ప్యత్ర నియోజయ. ౪

టీక॥ ఏనం = ఈరాముని; యేచ = ఎవ్వరును; ఉపజీవంతి = ఆశ్రయించుచుందురో; యైశ్చ = ఎవ్వరితోను; వీర్యతః = పరాక్రమంబుచే; రమతే = క్రీడించునో; తేషాం = వారలకు; బహు = అధికమయిన; ధనం = ధనమును; దత్వా = ఇచ్చి;

తానపి=వారలను;అత్ర=ఈసేనయం దు;నియోజయ=నియోగింపుము. ఎవ్వరురామునాశ్రయించి జీవించుచుందురో,మఱియునెవ్వరితో రాముండువీర్య పరీక్షార్థముక్రీడించుచుండునోవారలకందఱకుఅధికధనంబొసంగివారలనందఱను, ఈసేనతో రాముని వెంటంబంపుము. అని, తాత్పర్యము.

ఆయుధానిచ ముఖ్యాని నాగరా శ్శకటానిచ
అనుగచ్ఛంతు కాకుత్థ్సం వ్యాధా శ్చారణ్య గోచరాః. ౫

టీక॥ముఖ్యాని=శ్రేష్ఠములయిన; ఆయుధానిచ=ఆయుధములును, వానిధరించినవారలుననుట;నాగరాః=పట్టణవాసులును;శకటానిచ=బండ్లును; అరణ్యగోచరాః= అడవియందుండునట్టి; వ్యాధాశ్చ=బోయవాండ్రును; కాకుత్థ్సం=రాముని; అనుగచ్ఛంతు=వెంబడింతురుగాక.

ఉత్తమంబులగువాయుధంబులందాల్చినవారునుబట్టణవాసులును నూనెమొదలగువానిలంగొనిపోవుబండ్లునువనంబునమార్గంబుజూపుటకై వనచరులగు బోయవాండ్రును,రాముని వెంటం, బోదురుగాక. అని, తాత్పర్యము.

నిఘ్నన్ మృగాన్ కుంజరాంశ్చ పిబం శ్చారణ్యకం మధు
నదీశ్చ వివిధాః పశ్య న్నరాజ్యస్య స్మరిష్యతి. ౬

టీక॥ రామః(అధ్యాహృతము)= రాముండు;మృగాన్ = మృగములను; కుంజరాంశ్చ=ఏనుంగులను; నిఘ్నన్= చంపుచు;ఆరణ్యకం=అడవిలోఁబుట్టిన; మధు=తేనెను;పిబంశ్చ=త్రాఁగుచును; వివిధాః=నానావిధములయిన; నదీః= నదులను; పశ్యంశ్చ=చూచుచును; రాజ్యస్య=(ద్వితీయార్థమందుషష్ఠి) రాజ్యంబును; నస్మరిష్యతి = తలంచుకొనఁడు.

రాముండట్లు, సైన్యములంగూడి, యడవిలోనేనుంగులు మొదలగుమృగంబులంజంపుచు, వన్యంబగు తేనియంద్రావుచు,నానావిధంబులయిన నదులంజూచుచు, రాజ్యంబునుగూర్చిదలంచుకొనక,సుఖముగానుండును.

అని, తాత్పర్యము.

ధాన్యకోశశ్చ యః కశ్చి ద్ధనకోశశ్చ మామకః

తౌ రామ మనుగచ్ఛేతాం వసంతం నిర్జనే వనే. ౭

టీక॥మామకః=నాదైన; ధాన్యకోశశ్చ=ధాన్యంబుంచుబొక్కసమును; ధనకోశశ్చ=ధనంబుంచుబొక్కసమును; యఃకశ్చిత్(అస్తి)=ఏదేదిగలదో; తౌ=ఆ రెండును; నిర్జనే=జనులులేని; వనే=అడవియందు; వసంతం=ఉన్న; రామం=రాముని; అనుగచ్ఛేతాం=వెంబడించుఁగాక.

నాధాన్యకోశమను ధనకోశము నంతయు, వనంబులో నివసింపంబోవు రాముని వెంటంబంపుము.

అని, తాత్పర్యము.

యజన్ పుణ్యేషు దేశేషు విసృజం శ్చాప్త దక్షిణాః
ఋషిభిశ్చ సమాగమ్య ప్రవత్స్యతి సుఖం వనే. ౮

టీక॥రామః (అధ్యాహృతము)=రాముఁడు; పుణ్యేషు=పవిత్రములయిన; దేశేషు=ప్రదేశములందు; యజన్=యాగములు సేయుచు; ఆప్తదక్షిణాః=తగినదక్షిణలను; విసృజంశ్చ=ఇచ్చుచును; ఋషిభిశ్చ=ఋషులతోను; సమాగమ్య=చేరి; సుఖం=సుఖముగా; వనే=అడవియందు; ప్రవత్స్యతి=ఉండఁగలఁడు.

రాముఁడు, పుణ్యక్షేత్రంబుల యాగంబులు సేయుచుయథోక్తదక్షిణలొసంగుచుఁ, జతురంగసైన్యంబులనుఋషులనుంగూడి, వనంబున, సుఖముగా, వాసఁబు సేయఁగలఁడు.

అని, తాత్పర్యము.

భరతశ్చ మహాబాహు రయోధ్యాం పాలయిష్యతి
సర్వకామైః స్సహ శ్రీమాన్ రామ స్సంసాధ్య తామితి. ౯

టీక॥మహాబాహుః=పెద్దచేతులుగల; భరతశ్చ=భరతుఁడును; అయోధ్యాం=అయోధ్యాపట్టణమును; పాలయిష్యతి=పరిపాలింపఁగలఁడు. శ్రీమాన్=అందఱికన్ననధికుండగు; రామః=రాముఁడు; సర్వకామైస్సహ=సమస్తములయినకోరఁబడుపదార్థములతోఁగూడను; సంసాధ్యతాం=పంపఁబడుఁగాక. ఇతి=అని; ఉవాచ(అధ్యాహృతము)=చెప్పెను.

మహాబాహుండగు, భరతుండిచ్చట నుండి యయోధ్యం బాలింపుచుండఁగా శ్రీమంతుండగు రామునిసమస్తసంపదలతో నుంజేర్చి యడవికిం బయనము సేయుము; అని, దశరథుఁడు, సుమంత్రున కాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

ఏవం బ్రువతి కాకుత్స్థే కైకేయ్యా భయ మాగతమ్
ముఖం చాప్య గమ చ్ఛోషం స్వరశ్చాపి న్యరుధ్యత. ౧౦

టీక॥ కాకుత్స్థే = దశరథుఁడు; ఏవం = ఇట్లు; బ్రువతి = చెప్పుచుండఁగా; కైకేయ్యాః = కైకేయికి; భయం = భయము; ఆగతం = ప్రాప్తించినది. ముఖం చాపి = మొగమును; శోషం = ఎండుటను; అగమత్ = పొందినది; స్వరశ్చాపి = కంఠధ్వనియును; న్యరుధ్యత = నిరోధింపఁబడెను.

ఇట్లు దశరథుండు చెప్పఁగాఁ, గైకేయికి మిక్కిలి భయంబు గలిగినది; ఆబిడ ముఖము శోషిల్లినది; కంఠధ్వనియును డగ్గినది. అని, తాత్పర్యము.

సా విషణ్ణా చ సంత్రస్తా ముఖేన పరిశుష్యతా
రాజాన మేవా భిముఖీ కైకేయీ వాక్య మబ్రవీత్. ౧౧

టీక॥ సా = ఆ; కైకేయీ = కైకేయి; విషణ్ణా = దుఃఖమునొందినదై; సంత్రస్తాచ = భయమునొందినదియునై; పరిశుష్యతా = ఎండిన; ముఖేన = ముఖముతో; రాజానమేవ = దశరథమహారాజునుగూర్చియే; అభిముఖీ = ఎదురుమొగమైనదై; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

ఆకైకేయి, పరమదుఃఖమునొంది, భయపడినదై, ముఖము శోషిల్లఁగా, దశరథమహారాజునకభిముఖియయి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రాజ్యం గతజనం సాధో పీతమండాం సురామివ
నిరాస్వాద్యతమం శూన్యం భరతో నాభి పత్స్యతే. ౧౨

టీక॥ సాధో = సత్పురుషుఁడా! పీతమండాం = త్రాఁగఁబడినసారముగల;

సురామివ=మద్యమునుబోలె ; గతజనం=పోయినజనులుగలదియును; నిరాస్వాద్యతమం=అనుభవింపఁదగిన మంచి పదార్థములు లేనిదియును; శూన్యం= ఏమియులేనిదియునగు ; రాజ్యం=రాజ్యమును; భరతః=భరతుఁడు;నాభిపత్స్యతే=పొందఁడు.

సత్పురుషుండవగుదశరథుఁడా! జనులులేక, మంచిపదార్థములుపోయి శూన్యంబై మతియొకరిచేఁ ద్రావఁబడినసారముగలమద్యమువలెనుండు, నీరాజ్యమునుభరతుండు, సమ్మతింపఁడు.అని, కైకేయిదశరథునితోఁ జెప్పినది.

అని, తాత్పర్యము.

కైకేయ్యాం ముక్తలజ్జాయాం వదంత్యా మతిదారుణమ్
రాజా దశరథో వాక్య మువాచా యతలోచనామ్. ౧౩

టీక॥కైకేయ్యాం=కైకేయి;ముక్తలజ్జాయాం= విడువఁబడిన సిగ్గుగలదై; అతిదారుణం= మిక్కిలి భయంకరముగా;వదంత్యాం= చెప్పుచుండఁగా;రాజా=రాజైన;దశరథః= దశరథుండు; ఆయతలోచనాం = దీర్ఘములయిన కండ్లుగల కైకేయినిగూర్చి; వాక్యం=మాటను;ఉవాచ=చెప్పెను.

ఇట్లు, కైకేయిసిగ్గువిడిచి కఠినకఠోరంబగుమాటంజెప్పఁగా,దశరథమహారాజు, విశాలంబులగునేత్రంబులతోనొప్పుచుండు నాకైకేయింజూచి,యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

వహంతం కిం తుదసి మాం నియుజ్య ధురి మాహితే
అనార్యే కృత్య మారబ్ధం కిన్నపూర్వ ముపారుధః. ౧౪

టీక॥అహితే= శత్రువైనదానా; మాం= నన్ను;ధురి=భారమునందు;నియుజ్య=నియోగించి;వహంతం= మోయుచున్న;మాం=నన్ను;కిం=ఎందుకు; తుదసి=పీడించుచున్నావు; అనార్యే=దుష్టురాలా! ఆరబ్ధం=యత్నింపఁబడిన;కృత్యం=కార్యమును, రాముని వెంట సేనమొదలగువానిఁబంపుటనుట; పూర్వం=ముందు;కిం=ఎందుకు; నోపారుధః=నిరోధింపవైతివి?

కైకేయీ!నీవునాకుశత్రువవు; నన్నుగొప్పబరువుమోయుమనిచెప్పి,యు

ట్లు, నేను, మోయుచుండఁగా, నన్నేల యింకంబీడించెదవు? దుష్టురాలా! ఇప్పుడు నేను రాముని వెంట సేనలు మొదలగు వానిం బంపఁదలంచినానే; ఇట్లు పంపఁ గూడదనినీ వేల మున్నే యడుగుకొనవైతివి? అని, దశరథుండు కైకేయితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తస్యైత త్క్రోధసంయుక్త ముక్తం శ్రుత్వా వరాంగనా
కైకేయీ ద్విగుణం క్రుద్ధా రాజాన మిద మబ్రవీత్. ౧౫

టీక॥ వరాంగనా = శ్రేష్ఠయయిన స్త్రీయగు; కైకేయీ = కైకేయి; తస్య = ఆదశరథమహారాజుయొక్క; క్రోధసంయుక్తం = కోపముతోఁగూడిన; ఏతత్ = ఈ; ఉక్తం = మాటను; శ్రుత్వా = విని; ద్విగుణం = రెండింతలుగా; క్రుద్ధా = కోపమునొందినదై; రాజానం = దశరథమహారాజునుగూర్చి; ఇదం = ఈ మాటను; అబ్రవీత్ = పలికెను.

ఉత్తమస్త్రీయయినకైకేయి, దశరథమహారాజుకోపంబుతోఁ జెప్పినమాటను విని, ప్రకారాంతరంబునఁ దనయభీష్టంబుఁ జెఱుపఁదలంచెనని యినుమడికోపంబునొంది, దశరథమహారాజుంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తవైవ వంశే సగరో జ్యేష్ఠపుత్ర ముపారుధత్
అసమంజ ఇతి ఖ్యాతం తథా౽యం గంతు మర్హతి. ౧౬

టీక॥ తవ = నీయొక్క; వంశ ఏవ = వంశమునందే; సగరః = సగరచక్రవర్తి; అసమంజ ఇతి = అసమంజుఁడని; ఖ్యాతం = ప్రసిద్ధుఁడయిన; జ్యేష్ఠపుత్రం = పెద్దకొడుకును; ఉపారుధత్ = నిరోధించెను, వెడలఁగొట్టెననుట. తథా = అట్లు; అయం = ఈరాముఁడు; గంతుం = పోవుటకు; అర్హతి = తగును.

నీవంశమునందే సగరుండనువాఁడు తనజ్యేష్ఠపుత్రునసమంజుఁడనువానివనంబునకుఁబంపెఁగదా! అప్పుడాయసమంజుండు సేనాదులతోఁగూడి పోయినాఁడా? లేదు; కావున, అరణ్యంబునకుఁబంపవలెననుటచేతనే, "నిధనుండై పోవలె" ననియునర్థసిద్ధమగుచున్నది; ఆయసమంజుండెట్లరణ్యంబునకుఁబోయెనో,

అట్లు, ఈరాముండును నిర్జనుండై మె యరణ్యంబునకుఁబోవలయును. అని, కైకేయి, దశరథునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తో ధిగిత్యే వ రాజా దశరథో బ్రవీత్

టీక॥ రాజా=రాజయిన; దశరథః= దశరథుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తః = చెప్పఁబడినవాఁడై; "ధిక్ = దహింపఁబడుఁగాక." ఇత్యేవ = అనియే; అబ్రవీత్=చెప్పెను.

దశరథమహారాజిట్లు కైకేయిచెప్పిన మాటనువిని, "పూర్వముదానడుగని దానినింగూడ నిప్పుడుగోరుచున్నది! ఇదియెంతనీచురాలు! దహింపఁబడుఁగాక" అనిచెప్పి, యూరకుండెను.

అని, తాత్పర్యము,

వ్రీడిత శ్చ జన స్సర్వ స్సాచ తం నావబుధ్యత. ౧౭

టీక॥ జనః=జనము; సర్వశ్చ=అంతయు; వ్రీడితః = జుగుప్సనొందినది; సాచ=ఆకైకేయియు; తం=ఆజనమును; నావబుధ్యత = ఎఱుంగదయ్యె, సరకుసేయదయ్యెననుట.

అట్లు కైకేయి చెప్పుటంజూచి, యచ్చటిజనులందఱు, జుగుప్సనొందిరి; అట్లు వారుజుగుప్సనొందినను, కైకేయిదానినెంతమాత్రముసరకుసేయదయ్యె.

అని, తాత్పర్యము.

తత్ర వృద్ధో మహామాత్ర స్సిద్ధార్థో నామ నామతః
శుచి ర్బహుమతో రాజ్ఞః కైకేయీ మిద మబ్రవీత్. ౧౮

టీక॥ తత్ర=అచ్చట; వృద్ధః=ముసలివాఁడును; శుచిః = కుటిలుఁడు గానివాఁడును; రాజ్ఞః= దశరథమహారాజునకు; బహుమతః=మిక్కిలియునిష్టుండును; నామతః=పేరుచేత; సిద్ధార్థోనామ=సిద్ధార్థుఁడని ప్రసిద్ధుఁడునగు; మహామాత్రః= మంత్రి; కైకేయీం=కైకేయినిగూర్చి; ఇదం= ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

అప్పు, డచ్చట, వృద్ధుండును బరిశుద్ధుండును దశరథునకిష్టుండునగు సిద్ధార్థుండనునొక్కమంత్రి, కైకేయింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అసమంజో గృహీత్వా తు క్రీడతః పథి దారకాన్
సరయ్వాః ప్రక్షిప న్నప్సు రమతే తేన దుర్మతిః. ౧౯

టీక॥దుర్మతిః=దుష్టబుద్ధిగల; అసమంజస్తు= అసమంజుండైనచో; పథి=మార్గమునందు; క్రీడతః= ఆటలాడుకొనుచున్న; దారకాన్= పిల్లకాయలను; గృహీత్వా = పట్టుకొని; సరయ్వాః=సరయూనదియొక్క; అప్సు=నీళ్లయందు; ప్రక్షిపన్=పడవేయుచు; తేన=దానిచేత; రమతే= క్రీడింపుచుండెను.

దుర్బుద్ధియగునసమంజుండు, మార్గంబున నాటలాడుకొనుచుండుపిల్లకాయలఁబట్టి తెచ్చి, సరయూనదీజలంబులంబడవైచుచు, దానంగ్రీడింపుచుండెను. అని, తాత్పర్యము,

తం దృష్ట్వా నాగరా స్సర్వే క్రుద్ధా రాజాన మబ్రువన్

టీక॥నాగరాః=పట్టణవాసులు; సర్వే=అందఱును; తం=ఆయసమంజుని; దృష్ట్వా=చూచి; క్రుద్ధాః = కోపము నొందినవారలై; రాజానం = సగరచక్రవర్తినిగూర్చి; అబ్రువన్= పలికిరి.

అంతఁబట్టణవాసులందఱు , నసమంజునిక్రూరకృత్యముంజూచి , కోపంబు నొంది, సగరచక్రవర్తితో, నట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

అసమంజం వృణీ ష్వైక మస్మా న్వా రాష్ట్రవర్ధన. ౨౦

టీక॥రాష్ట్రవర్ధన= రాజ్యమును వృద్ధిఁబొందించునట్టి సగరచక్రవర్తీ! అసమంజం=అసమంజుని; ఏకం=ఒకనిఁగాని; అస్మాన్ వా= మమ్ములనుగాని; వృణీష్వ=కోరుకొనుము.

సగరచక్రవర్తీ! నీవురాజ్యంబును వృద్ధిఁబొందించువాఁడవు; నీవసమంజునినొకనినైన నుంచుకొనుము మేమూరువిడిచిపోయెదము; లేక, అతనివెడలఁగొట్టిమమ్ములనైననుంచుకొనుము. అని, పట్టణవాసులుసగరునితోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

తా నువాచ తతో రాజా కిన్నిమిత్త మిదం భయం

టీక॥ తతః=అటుపిమ్మట; రాజా=సగరచక్రవర్తి; ఇదం=ఈ; భయం=భయము; కిన్నిమిత్తం=ఏమి కారణముగాఁ గలది? ఇతి (అధ్యాహృతము)= అని; తాన్=ఆపట్టణవాసులనుగూర్చి; ఉవాచ=చెప్పెను.

అంత, సగరచక్రవర్తి, వారలం బిలిచి, "మీ కెందువలన నింతభయము గల్గినది?" అనియడిగెను.

అని, తాత్పర్యము.

తాశ్చాపి రాజ్ఞా సంపృష్టా వాక్యం ప్రకృత యోఽబ్రువన్. ౨౧

టీక॥ తాః=ఆ; ప్రకృతయశ్చాపి=ప్రజలును; రాజ్ఞా=సగరచక్రవర్తిచేత; సంపృష్టాః=అడుగఁబడినవారలై; వాక్యం=మాటను; అబ్రువన్=చెప్పిరి.

అట్లు సగరచక్రవర్తియడిగినపిమ్మట, నాపట్టణవాసిజనులును, అతనిం జూచి యిట్లని చెప్పిరి. అని, తాత్పర్యము.

క్రీడత స్త్వేష నః పుత్రాన్ బాలా నుద్భ్రాన్త చేతనః
సరయ్వాం ప్రక్షిప న్మౌర్ఖ్యా దతులాం ప్రీతి మశ్నుతే. ౨౨

టీక॥ ఏషః=ఈయసమంజుఁడు; ఉద్భ్రాన్తచేతనః=భ్రాంతిపొందిన బుద్ధిగలవాఁడై; క్రీడతః=ఆటలాడుకొనుచుండు; నః=మాయొక్క; పుత్రాన్=కొడుకులను; సరయ్వాం=సరయూనదియందు; ప్రక్షిపన్సు=పడవైచుచును; మౌర్ఖ్యాత్=అజ్ఞానంబువలన; అతులాం=సరిలేని; ప్రీతిం=సంతోషమును; అశ్నుతే=పొందుచున్నాఁడు.

ఈయసమంజుఁడు, బుద్ధిభ్రమంబున, నాటలాడుకొనుచుండుమాకొడుకులం బట్టి, సరయూనదిలోఁ బడవయిచి, మూర్ఖుఁ డగుటవలనఁ, బరమసంతోషంబు నొందుచున్నాఁడు. అని. జనులు సగరునకుఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

స తాసాం వచనం శ్రుత్వా ప్రకృతీనాం నరాధిపః
తం తత్యాజ హితం పుత్రం తేషాం ప్రియ చికీర్షయా. ౨౩

టీక॥ నరాధిపః=మనుష్యులకుఁ బ్రభువైన; సః = ఆసగరచక్రవర్తి; తా

షాం=ఆ; ప్రకృతీనాం=ప్రజలయొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; తేషాం=ఆజనులకు; ప్రియచికీర్షయా=సంతోషంబు సేయనిచ్చచేత; తం=ఆ; హితం=ఇష్టుఁడైన; పుత్రం=కొడుకున సమంజుని; తత్యాజ=విడిచెను.

ఆసగరచక్రవర్తి, ప్రజలుచెప్పిన మాటనువిని, వారలకుసంతోషంబు సేయఁగోరి, ప్రియపుత్రుండగు సమంజుని, విడిచెను. అని, తాత్పర్యము.

తం యానం శీఘ్రమారోప్య సభార్యం సపరిచ్ఛదమ్
యావజ్జీవం వివాస్యోయ మితి స్వా నన్వశా త్పితా. ౨౪

టీక॥ పితా=తండ్రియగుసగరుండు; సభార్యం=భార్యతోఁ గూడినట్టివాఁడును; సపరిచ్ఛదం=పైవస్త్రముతోఁగూడినవాఁడునగు; తం = ఆయసమంజుని; శీఘ్రం=శీఘ్రముగా; యానం = వాహనమును; ఆరోప్య=ఎక్కించి; "అయం=వీఁడు; యావజ్జీవం=బ్రతికియున్నంతవఱకు; వివాస్యః = ఊరువెడలఁగొట్టఁదగినవాఁడు." ఇతి = అని; స్వాన్=తనవారలను; అన్వశాత్= ఆజ్ఞాపించెను.

అంతసగరుండాయసమంజునిపైగుడ్డతోభార్యాసమేతంబుగ రథంబు నెక్కించి, "ఇతని, యావజ్జీవము, పట్టణమునకు రానీయవలదు; అరణ్యంబులో నేయుండునట్లు సేయుఁడు" అని, తన భృత్యులకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

సఫాల పిటకం గృహ్యా గిరి దుర్గా ణ్యాలోకయత్
దిశ స్సర్వా స్త్వను చరన్ స యథా పాపకర్మ కృత్. ౨౫

టీక॥ సః=ఆయసమంజుఁడు; ఫాలపిటకం=గుద్దలిని చిన్నగంపను; గృహ్యా (గృహీత్వా)=తీసికొని; పాపకృత్ యథా= పాపకార్యంబులు సేయువాఁడువలె; దిశః=దిక్కులను; సర్వాస్తు=అన్నింటిని; అనుచరన్=తిరుగుచు; సః=ఆయసమంజుఁడు; గిరిదుర్గాణి= పర్వతములయందలిచొరరాని ప్రదేశములను; అలోకయత్=త్రవ్వెను.

ఆయసమంజుం, డంత, గుద్దలినిచిన్నగంపనుందాల్చి, పాపిష్ఠుండుంబోలె, నన్నిదిక్కులందిరుగుచుఁ, బర్వతముల

యందలిగహనప్రదేశంబులంజేరి, కందమూలాదులుత్రవ్వుకొని,జీవించుచుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ మత్యజ ద్రాజా సగరో వై సు ధార్మికః

టీక॥సుధార్మికః=మిక్కిలిధర్మమునాచరించునట్టి, రాజా=రాజైన;సగరః=సగరచక్రవర్తి ("వై" అనునది పాదపూరణార్థము);ఇత్యేవం= ఈ ప్రకారముగా;అత్యజత్=విడిచెను.

ఇట్లుతనకొడుకు మహాపరాధంబుగావించుటంజేసి , పరమధార్మికుండగుసగరచక్రవర్తి యతనివిడిచినాఁడు.అని, తాత్పర్యము.

రామః కి మకరో త్పాపం యేనైవ ముపరుధ్యతే. ౨౬

టీక॥రామః=రాముఁడు;కిం=ఏమి;పాపం=పాపమును: అకరోత్=చేసెను?యేన=దేనిచేత;ఏవం=ఇట్లు; ఉపరుధ్యతే= వెడలఁగొట్టఁబడుచున్నాఁడో.

ఇప్పుడునీవురామునడవికిం బంపుమనుచున్నావే;అట్లురాముండంతటిపాపమేమిచేసినాఁడు?అని, తాత్పర్యము.

నహి కంచన పశ్యామో రాఘవస్యా గుణం వయం

టీక॥వయం=మేము; రాఘవస్య=రామునియొక్క;అగుణం = దుర్గుణమును; కంచన=ఒకానొకదానినైనను;నపశ్యామోహి=చూడముగదా!

రామునియందేదుర్గుణంబునుమాకగపడలేదు.అని, తాత్పర్యము.

దుర్లభో హ్యస్య నిరయ శ్శశాంక స్యేవ కల్మషం. ౨౭

టీక॥ శశాంకస్య = చంద్రునియొక్క;కల్మషమివ=మాలిన్యమువలె; అస్య=ఈరామునియొక్క; నిరయః=దోషము;దుర్లభోహి= దొరకదుగదా!

చంద్రునియందుమాలిన్యంబులేనట్లు, రామునియందెంతమాత్రముదోషములేదు. అని, తాత్పర్యము.

అథవా దేవి దోషం త్వం కంచి త్పశ్యసి రాఘవే
త మద్య బ్రూహి తత్త్వేన తదా రామో వివాస్యతాం. ౨౮

టీక॥ దేవి=కైకేయీ! అథవా= అటుగాదేని; త్వం= నీవు; రాఘవే= రామునియందు; కంచిత్ =ఒకానొక; దోషం=దోషమును; పశ్యసి(యది) చూతువేని; తం= ఆదోషమును; అద్య = ఇప్పుడు; తత్త్వేన= యాథార్థ్యముచేత; బ్రూహి = చెప్పుము. తతః= అటుపిమ్మట; రామః = రాముఁడు; వివాస్యతాం= వెడలఁగొట్టఁబడుఁగాక.

కైకేయీ! అటుగాక, నీవు రామునందేదైన దోషముగపడెనేని, దానినిప్పుడు యథార్థముగాఁజెప్పుము; అటుపిమ్మట రామునరణ్యంబునకుఁబంపవచ్చును. అని, తాత్పర్యము.

అదుష్టస్య హి సంత్యాగ స్సత్పథే నిరతస్యచ
నిర్దహే దపి శక్రస్య ద్యుతిం ధర్మ నిరోధనాత్. ౨౯

టీక॥ అదుష్టస్య = దుష్టుండుగానివాఁడును; సత్పథే= మంచిమార్గమునందు; నిరతస్యచ= ఆసక్తుండునగు వానియొక్క; సంత్యాగః=విడుచుట; ధర్మనిరోధనాత్ =ధర్మమునడ్డగించుటవలన; శక్రస్యాపి= ఇంద్రునియొక్కయు; ద్యుతిం=కాంతిని, సంపదననుట; నిర్దహేత్=దహించును.

దోషంబు లేనివాఁడును బరమధార్మికుండునగువాని వెడలఁగొట్టునేని, అట్టియధర్మంబు దేవేంద్రుని సంపదనయిననునశింపఁజేయును.

అని, తాత్పర్యము.

తదలం దేవి రామస్య శ్రియా విహతయా త్వయా
లోకతోపి హి తే రక్ష్యః పరివాద శ్శుభాననే. ౩౦

టీక॥ దేవి=కైకేయీ; తత్= అందువలన; త్వయా=నీచేత; విహతయా= చెడగొట్టఁబడిన; రామస్య= రామునియొక్క; శ్రియా= సంపదచేత; అలం= చాలును. శుభాననే=సుందరమయినముఖముగలదానా! తే= నీకు; లోకతః= లో

కమువలన; పరివాదోపి = నిందయయిన నుఃరక్ష్యోహి = రక్షింపదగినదిగదా! సుందరంబగుముఖముగలకైకేయీ! అందువలన, నింకనీవు, రామునిసంపదకు, విఘాతంబుసేయకుము; అధమతా దోషంబట్లుండఁగానీకులోకంబునసింద గలుగకుండు నట్లైనను జేసికొనవలయుంగదా! అని, సిద్ధార్థుండనుమంత్రి, కైకేయికిం జెప్పెను. అని, తాత్పర్యము.

శ్రుత్వాతు సిద్ధార్థవచో రాజాశ్రాంతతరస్వనః
శోకోపహతయా వాచా కైకేయీ మిద మబ్రవీత్. ౩౧

టీక॥ రాజా = దశరథమహారాజు; సిద్ధార్థవచః = సిద్ధార్థునియొక్క మాటను; శ్రుత్వాతు = వినినంతనె; శ్రాంతతరస్వనః = మిక్కిలియుహీనమయిన కంఠధ్వనిగలవాఁడై; శోకోపహతయా = దుఃఖముచేతఁగొట్టఁబడిన; వాచా = మాటచేత; కైకేయీం = కైకేయిని గూర్చి; ఇదం = ఈమాటను; అబ్రవీత్ = పలికెను.

దశరథుండు, సిద్ధార్థుండు చెప్పిన మాటలన్నియువిని, దుఃఖంబునమిక్కిలియుహీనంబగుస్వరంబున, డగ్గుత్తికకదురం, గైకేయిఁజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏత ద్వచో నేచ్ఛసి పాపవృత్తే
హితం న జానాసి మమాత్మనో వా
ఆస్థాయ మార్గం కృపణం కుచేష్టా
చేష్టా హి తే సాధుపథా దపేతా. ౩౨

టీక॥ పాపవృత్తే = పాపమయినయాచారముగలదానా! ఏతత్ = ఈ; వచః = మాటను; నేచ్ఛసి = ఇచ్ఛింపవా; కృపణం = కుత్సితమయిన; మార్గం = దారిని; ఆస్థాయ = అవలంబించి; కుచేష్టా = కుత్సితమయిన చేష్ట గలదానవై; మమ = నాయొక్కగాని; ఆత్మనోవా = నీయొక్కగాని; హితం = మేలును; నజానాసి = ఎఱుంగవు. తే = నీయొక్క; చేష్టా = కార్యము; సాధుపథాత్ = సన్మార్గమున నుండి; అపేతాహి = వదలినదిగదా!

పాపిష్ఠురాలా! ఈసిద్ధార్థుఁడు! చెప్పినమాటనంగీకరింపవుగదా! ఇట్లు కుత్సితమార్గంబునవలంబించి, కుచేష్టలు సేయుచు నీమేలునుగాని నామేలునుగాని యెఱుంగకున్నావు ; నీకార్యము, ఎంతమాత్రమును మంచిది గాదు.

అని, తాత్పర్యము.

అనువ్రజిష్యామ్యహ మద్య రామమ్
రాజ్యం పరిత్యజ్య సుఖం ధనంచ
సహైవ రాజ్ఞా భరతేనచ త్వమ్
యథాసుఖం భుఙ్క్ష్వ చిరాయ రాజ్యమ్. ౩౩

టీ॥ అహం=నేను; రాజ్యం = రాజ్యమును; సుఖం=సౌఖ్యమును; ధనంచ= ధనమును; పరిత్యజ్య=విడిచి; అద్య=ఇప్పుడు; రామం = రాముని; అనువ్రజిష్యామి=వెంబడించెదను. త్వం=నీవు; రాజ్ఞా= రాజయిన; భరతేనచసహైవ=భరతునితోనుంగూడనే; యథాసుఖం=సుఖమునతిక్రమింపక; చిరాయ= బహుకాలము; రాజ్యం=రాజ్యమును; భుఙ్క్ష్వ=అనుభవింపుము.

నే, నిప్పుడ, రాజ్యంబునుసుఖంబును ధనంబునుం బరిత్యజించి, రాముని వెంటంబోయెదను; నీవు, భరతుని రాజుగాఁ జేసికొని, యతనితోఁగూడ, సుఖంబుగా, రాజ్యంబుననుభవింపుచుండుము. అని, దశరథుఁడు, కైకేయితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, షట్త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ షట్త్రింశసర్గ టీక, ముగిసినది.



శ్రీ

సప్తత్రింశసర్గప్రారంభః.

మహామాత్రవచశ్శ్రుత్వా రామో దశరథం తదా
అభ్యభాషత వాక్యంతు వినయజ్ఞో వినీతవత్. ౧

టీక॥ మహామాత్రవచః = సిద్ధార్థుండనుమంత్రియొక్క-మాటను; శ్రుత్వా=విని; తదా = అప్పుడు; వినయజ్ఞః=వినయంబునెఱింగిన; రామః=రాముఁడు; వినీతవత్=వినయంబునొందినవాఁడై; దశరథం= దశరథునిగూర్చి; వాక్యంతు=మాటను; అభ్యభాషత=పలికెను.

సిద్ధార్థుండు చెప్పినదివిని, గురువులయెడ సవినయంబుగానుండ నేర్పరియైన రాముండు, సవినయంబుగా, దశరథుంజూచి. యీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

త్యక్తభోగస్య మే రాజన్ వనే వన్యేన జీవతః
కిం కార్య మనుయాత్రేణ త్యక్తసంగస్య సర్వతః. ౨

టీక॥ రాజన్=దశరథమహారాజా! త్యక్తభోగస్య= విడువఁబడినభోగము గలవాఁడను; వనే=అడవియందు; వన్యేన=కందమూలాదికముచేత; జీవతః=బ్రతుకుచున్నవాఁడను; సర్వతః=అన్నిటను; త్యక్తసంగస్య= విడువఁబడినసంబంధముగలవాఁడనగు; మే=నాకు; అనుయాత్రేణ=అనుచరజనముచేత; కిం=ఏమి; కార్యం=పని?

మహారాజా! సమస్తభోగంబులను విడిచి సమస్తసంగంబులనుంబరిత్యజించి వనంబునం గందమూలాదికంబుదిని జీవించునట్టినాకు, ఈసేన మొదలగుదానితోనేమి కార్యము? అని, తాత్పర్యము.

యోహి దత్వా ద్విపశ్రేష్ఠం కక్ష్యాయాం కురుతే మనః
రజ్జుస్నేహేన కిం తస్య త్యజతః కుంజరోత్తమం. ౩

టీక॥ యోహి=ఎవ్వఁడేని; ద్విజశ్రేష్ఠం=ఏనుఁగులలోనుత్తమమయినదాని

ని; ఉత్తమమయినయేనుంగుననుట; దత్వా=ఇచ్చి; కక్ష్యాయాం=నడుమునఁ గట్టెడు మోకునందు; మనః=మనసును; కురుతే = చేయునో; కుంజరోత్తమం = ఏనుంగులలో నుత్తమమయిన దానిని; త్యజతః= విడుచుచున్నట్టి; తస్య=అతనికి; రజ్జుస్నేహేన=మోకునందలి స్నేహముచేత; కిం=ఏమిప్రయోజనము?

ఉత్తమంబయిన గజంబునొసంగి, దానినడుమునఁ గట్టెడు మోకునందిచ్ఛ యుంచునేని, అట్లుత్తమగజమునే విడుచుచున్నాఁడే, అతనికిఁ త్రాటిచే నేమికార్యము? అని, తాత్పర్యము.

తథా మమ సతాం శ్రేష్ఠ కిం ధ్వజిన్యా జగత్పతే
సర్వాణ్యేవాను జానామి చీరాణ్యేవా నయంతు మే. ౪

టీక॥ సతాం=సత్పురుషులలో; శ్రేష్ఠం=ఉత్తముఁడవైన; జగత్పతే=దశరథమహారాజా! తథా=అట్లు; మమ=నాకు; ధ్వజిన్యా=సేనచేత; కిం=ఏమి ప్రయోజనము? సర్వాణ్యేవ= అన్నిటినే; అనుజానామి=అనుమతించుచున్నాను. మే=నాకొఱకు; చీరాణ్యేవ=నారచీరలనుమాత్రము ; ఆనయంతు = తెత్తురుగాక.

దశరథమహారాజా! నీవుసత్పురుషులలో శ్రేష్ఠుండవు ; మదపుటేనుంగునే విడిచినవానికిఁ దానినడుముత్రాటితో నేమియుఁ గార్యములేనట్లు, రాజ్యమును భోగములనుఅన్నిటినివిడిచిన నాకీసేన మొదలగువానితో నేమియుఁ బ్రయోజనంబులేదు; కావున, నిప్పుడు నీవునాకీఁదలంచినవానినన్నిటిని , సేనభరతునకీయనిశ్చయించినాను ; నాకు వల్కలంబులుమాత్రముదెచ్చి యివ్వవలయును. అని, తాత్పర్యము.

ఖనిత్ర పిటకే చోభే సమానయత గచ్ఛతః
చతుర్దశ వనే వాసం వర్షాణి వసతో మమ. ౫

టీక॥ గచ్ఛతః = పోవుచున్నవాఁడను; వనే=అడవియందు; చతుర్దశ= పదునాలుగు; వర్షాణి = ఏండ్లను; వాసం=ఉనికిని; వసతః=వసించువాఁడనగు, చేయువాఁడనగుననుట; మమ=నాకు; ఖనిత్రపిటకే=గుద్దలినిపుటికను;

ఉభేచ=రెంటిని;సమానయత=తెండు.
నేనింకంబో యి,వనంబునంబదునా
లుగుసంవత్సరంబులువాసంబు సేయవ
లయునుగావున,నంతవఱకుఁగందమూ
లాదులఁగొని తెచ్చుకొనుటకై, గుద్దలిని
పుటికను ఈరెంటిని, నాకుఁదెచ్చియి
వ్వవలయును. అని,రాముండుదశరథు
నితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

అథ చీరాణి కైకేయీ స్వయ మాహృత్య రాఘవం
ఉవాచ పరిధత్స్వేతి జనౌఘే నిరపత్రపా. ౬

టీ॥అథ=అటుపిమ్మట;కైకేయీ=
కైకేయి; జనౌఘే= జనసమూహ
మునందు,నిరపత్రపా=సిగ్గులేనిదై; స్వ
యం=తాను;చీరాణి= వల్కలంబుల
ను:ఆహృత్య=తెచ్చి; రాఘవం= రా
మునిఁగూర్చి;"పరిధత్స్వ = ధరింపు
ము." ఇతి=అని;ఉవాచ=చెప్పెను.

అంతఁ,గైకేయి, యందరి జనుల
యెదుట,సిగ్గులేనిదై, తానె వల్కలం
బులందెచ్చి , రామునింజూచి,"నీనిం
గట్టుకొమ్ము"అని, చెప్పినది.
అని, తాత్పర్యము.

స చీరే పురుష వ్యాఘ్రః కైకేయ్యాః ప్రతిగృహ్య తే
సూక్ష్మ వస్త్ర మవక్షిప్య ముని వస్త్రా ణ్యవ స్త్రహ. ౭

టీక॥పురుషవ్యాఘ్రః = పురుషశ్రే
ష్ఠుఁడయిన;సః=ఆరాముఁడు ; కైకే
య్యాః=కైకేయివలన;తే=ఆ; చీరే=
వల్కలంబులరెంటిని;ప్రతిగృహ్య= తీ
సికొని;సూక్ష్మవస్త్రం= సన్నవస్త్ర
మును;అవక్షిప్య=విచ్చి ; మునివస్త్రా
ణి=మునులుధరించువస్త్రములను;అవ
స్త=కట్టుకొనెను."హ" అనునదిపా
దపూరణార్థము.

పురుషశ్రేష్ఠుండగు నారాముండు ,
కైకేయియొద్దనుండి రెండునారచీరలం
బుచ్చుకొని , మునుపుగట్టుకొనియున్న
సూక్ష్మవస్త్రంబులవిచ్చి,మునులుంబో
లె,నారచీరలంగట్టుకొనెను.
అని, తాత్పర్యము.

లక్ష్మణ శ్చాపి తత్రైవ విహాయ వసనే శుభే

తాపసాచ్ఛాదనే చైవ జగ్రాహ పితు రగ్రతః. ౮

టీక॥తత్రైవ=అచ్చటనే; లక్ష్మణశ్చాపి=లక్ష్మణుండును; పితుః=తండ్రియొక్క; అగ్రతః=ఎదుట; శుభే=సుందరంబులైన; వసనే=వస్త్రములను; విహాయ=విడిచి; తాపసాచ్ఛాదనే=ఋషులవస్త్రములనే; జగ్రాహ=ధరించెను.

అచ్చటనే, లక్ష్మణుండును, దండ్రియెదుట, సుందరంబులగు వస్త్రంబులనువిచ్చి, ఋషులుగట్టుకొనువల్కలంబులం, దాల్చెను. అని, తాత్పర్యము.

అథాత్మ పరిధానార్థం సీతా కౌశేయవాసినీ
సమీక్ష్య చీరం సంత్రస్తా పృషతీ వాగురామివ. ౯

టీక॥అథ=అటుపిమ్మట; కౌశేయవాసినీ=పట్టువస్త్రమునుగట్టుకొనియున్న; సీతా=సీతాదేవి; ఆత్మపరిధానార్థం=తనకట్టుకొనుటకొఱకు; చీరం=వల్కలమును; పృషతీ=లేడి; వాగురామివ=వలనుబోలె; సమీక్ష్య=చూచి; సంత్రస్తా=భయంబునొందినది.

అంతఁబట్టువస్త్రమునుదాల్చియున్నసీతాదేవి, తాననుగట్టుకొనుటకై, వల్కలమునుజూచి, వలఁజూచినలేడిపగిదిభయంబునొందినది. అని, తాత్పర్యము.

సా వ్యపత్రపమాణైవ ప్రగృహ్యాచ సుదుర్మనాః
కైకేయీ కుశ చీరే తే జానకీ శుభ లక్షణా. ౧౦
అశ్రు సంపూర్ణ నేత్రా చ ధర్మజ్ఞా ధర్మ దర్శినీ
గంధర్వ రాజ ప్రతిమం భర్తార మిద మబ్రవీత్. ౧౧

టీక॥శుభలక్షణా=మంగళకరంబులగు లక్షణంబులుగలదియు; ధర్మజ్ఞా=ధర్మమునెఱింగినదియును; ధర్మదర్శినీ=ధర్మముఁజూపునదియును; సా=ఆ; జానకీ=జనకునికొమార్తెయగు సీతాదేవి; వ్యపత్రపమాణైవ=మిక్కిలియు సిగ్గుపడుచునే; సుదుర్మనాః=మిక్కిలియుదుఃఖమునొందినమనసుగలదై; తే=ఆ; కైకేయీకుశచీరే=కైకేయినారచీరలను; ప్రగృహ్య

చ=గ్రహించియు; అశ్రుసంపూర్ణనేత్రా చ = కన్నీళ్లచేనిండినకండ్లుగలదియునై; గంధర్వరాజప్రతిమం=గంధర్వరాజుతోఁబోలికగల; భర్తారం=పెనిమిటినిగూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

మంగళకరంబులగులక్షణంబులుగలదియు ధర్మంబునెఱింగి యితరులకునుం దెలియునట్లు ఆచరించునదియునగు సీతాదేవి, కైకేయియొసంగిననారచీరలను, మహాదుఃఖంబునంబుచ్చుకొని, కండ్లునిండఁగన్నీరుగాఱఁగా, గంధర్వరాజుంబోలుపెనిమిటిని రాముంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కథన్ను చీరం బధ్నంతి మునయో వన వాసినః

టీక॥ వనవాసినః=అరణ్యంబునందు నివసించునట్టి; మునయః=ఋషులు; చీరం=వల్కలమును; కథన్ను= ఎట్లు; బధ్నంతి=కట్టుకొనుచున్నారు?

అరణ్యంబుననివసించునట్టిమునులు, వల్కలము, నేవిధంబునం, గట్టుకొనుదురు? నాకుఁజెప్పుము. అని, సీత, రామునితోఁ, జెప్పినది. అని, తాత్పర్యము.

ఇతి హ్యకుశలా సీతా సా ముమోహ ముహు ర్ముహుః. ౧౨

టీక॥ ఇతి=ఇట్లు; సా=ఆ; సీతా=సీతాదేవి; అకుశలా=చేతఁగానిదై; ముహుర్ముహుః=పలుమాఱు; ముమోహహి=భ్రమింపుచుండెనుగదా!

ఆసీతాదేవి, నారచీరగట్టుకొనం దెలియక, యీప్రకారము, ఏమియుఁదోఁచక, భ్రాంతినొందియుండెను. అని, తాత్పర్యము.

కృత్వా కంఠేచ సా చీర మేక మాదాయ పాణినా
తస్థౌ హ్యకుశలా తత్ర వ్రీళితా జనకాత్మజా. ౧౩

టీక॥ తత్ర=అచ్చట; సా=ఆ; జనకాత్మజా=జనకునికొమార్తెయగుసీతాదేవి; ఏకం=ఒక; చీరం = నారచీరను; పాణినా=చేతిచే; ఆదాయ=గ్రహించి; కంఠే=మెడయందు; కృత్వాచ=చేసికొనియు, ఉంచుకొనియు ననుట;

అకుశలా=చేతఁగానిదై; వ్రీళితా=సిగ్గు నొందినదై; తస్థౌహి=ఉండెనుగదా!

అచ్చట, జనకపుత్రియగు నాసీతాదేవి, యావల్కలంబుల రెంటిని, ఒకటిఁజే తనుమఱియొకటి కంఠంబునను, ధరించి, కట్టుకొనంజాలక, సిగ్గునొంది, యుండెను. అని, తాత్పర్యము.

తస్యా స్తత్క్షిప్ర మాగమ్య రామో ధర్మభృతాం వరః
చీరం బబంధ సీతాయాః కౌశేయ స్యోపరి స్వయం. ౧౪

టీక॥ తత్=అందువలన; ధర్మభృతాం=ధర్మమును ధరించు వారలలో పల; వరః=శ్రేష్ఠుండగు; రామః=రాముండు; క్షిప్రం=శీఘ్రిముగా; అగమ్య=వచ్చి; స్వయం=తానే; తస్యాః=ఆ; సీతాయాః=సీతయొక్క; కౌశేయస్య=పట్టువస్త్రిమునకు; ఉపరి=మీఁద; చీరం=నారచీరను; బబంధ=కట్టెను

అదిచూచి, ధార్మికశ్రేష్ఠుండగు రాముండు, శీఘ్రిముగా సీతయొద్దకువచ్చి, సీతాదేవికట్టుకొనియున్న పట్టువస్త్రిముపైని, నారచీరంగట్టెను.

అని, తాత్పర్యము,

రామం ప్రేక్ష్యతు సీతాయా బధ్నంతం చీర ముత్తమం
అంతః పుర గతా నార్యో ముముచు ర్వారి నేత్రజం. ౧౫

టీక॥ సీతాయాః=సీతకు; చీరం=నారచీరను; బధ్నంతం=కట్టుచున్నవాఁడును; ఉత్తమం=శ్రేష్ఠుండునగు; రామం=రాముని; ప్రేక్ష్యతు=చూచినంతనే; అంతఃపురగతాః=అంతఃపురమునుబొందియున్న; నార్యః=స్త్రీలు; నేత్రజం=కండ్లఁబుట్టిన; వారి=నీటిని; ముముచుః=విడిచిరి.

అట్లుత్తముండగు రాముండు, సీతకు నారచీరఁగట్టుటంజూచి, యంతఃపురంబుననుండు స్త్రీలందఱు, గన్నీళ్లుగాఱ, రోదనంబుచేసిరి. అని, తాత్పర్యము.

ఊచుశ్చ పరమాయస్తా రామం జ్వలిత తేజసమ్

టీక॥ తాః(అధ్యాహృతము) = ఆయంతఃపురస్త్రీలు; పరమాయస్తాః=

మికిఁలియు నాయాసంబునొందినవా రలై; జ్వలిత తేజసం=ప్రకాశించుచున్న కాంతిగల; రామం=రామునిగూర్చిఁ; ఊచుశ్చ=చెప్పిరియు.

ఆయంతఃపుర స్త్రీలు, పరమాయాసంబునొంది, కాంతిచేఁ బ్రకాశించుచుండు రామునింజూచి, యిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

వత్స నైవం నియుక్తేయం వనవాసే మనస్వినీ. ౧౬

టీక॥వత్స=బిడ్డఁడా! మనస్వినీ=పతివ్రతయగు; ఇయం=ఈసీత; ఏవం=ఇట్లు; వనవాసే=అడవియందుండుట యందు; నియుక్తా= నియోగింపఁబడిన ది; న=కాదు.

రాముఁడా! ఇట్లువనంబునకుఁబోవలయునని నీకాజ్ఞాపింపఁబడియున్నదే కాని, సీతకట్లాజ్ఞలేదు. అని, తాత్పర్యము.

పితు ర్వాక్యానురోధేన గతస్య విజనం వనమ్
తావ ద్దర్శన మస్యా న్న స్సఫలం భవతు ప్రభో. ౧౭

టీక॥ప్రభో=నాయకుఁడవైన రాముఁడా; తవ (అధ్యాహృతము)=నీవు; పితుః=తండ్రియొక్కఁ ; వాక్యానురోధేన= మాటయొక్కఁయనుసరించుటచే త; విజనం=జనులులేని; వనం= అడవిని; గతస్య=పొందఁగా; తావత్=అంతవఱకు; నః=మాయొక్కఁ; దర్శనం=చూచుట; అస్యాం=ఈసీతయందు ; సఫలం=ఫలముగలది; భవతు=అగుఁగాక.

నాయకుఁడవగు రాముఁడా! నీవు, తండ్రిమాటననుసరించి, యరణ్యంబునకుంబోయినవెనుక , నీవువచ్చునఁతవఱకు, మేము, నిన్నుఁజూచుటకుఁబదులుగానీసీతంజూచుచు, సంతోషంబునొందెదము. అని, తాత్పర్యము.

లక్ష్మణేన సహాయేన వనం గచ్ఛస్వ పుత్రక

టీక॥పుత్రక=చిన్నికొడుకా! సహాయేన=తోడైన; లక్ష్మణేన (సహ) =లక్ష్మణునితోఁగూడ; వనం=అడవిని; గచ్ఛస్వ=పొందుము.

చిన్నికొడుకా! నీవు, లక్ష్మణుని దోడుగాఁజేసికొని, యరణ్యంబునకుఁ బొమ్ము. అని, తాత్పర్యము.

నేయ మర్హతి కల్యాణీ వస్తుం తాపసవ ద్వనే. ౧౮

టీక॥కల్యాణీ= మంగళస్వరూపిణి యగు;ఇయం=ఈసీత;వనే = అడవి యందు;తాపసవత్= ఋషియుంబోలె;వస్తుం= ఉండుటకు ; నార్హతి= తగదు.

ఈసీతమంగళస్వరూపిణి ; ఈబిడ,ఋషివలెనరణ్యంబుననివసింపం దగదు. అని, తాత్పర్యము.

కురు నో యాచనాం పుత్ర సీతా తిష్ఠతు భామినీ
ధర్మనిత్య స్స్వయం స్థాతుం నహీదానీం త్వ మిచ్ఛసి. ౧౯

టీక॥పుత్ర=కొడుకా!నః=మాయొక్క;యాచనాం=ప్రార్థనను;కురు=చేయుము.భామినీ=స్త్రీయగు;సీతా=సీత; తిష్ఠతు=ఉండుఁగాక. ధర్మనిత్యః=ధర్మమునందునిలుకడగలవాఁడవగు;త్వం=నీవు;స్వయం=నీవే; స్థాతుం=ఉండుటకు; ఇదానీం=ఇప్పుడు; నేచ్ఛసిహి=కోరవుగదా!

కొడుకా!నీవుధర్మమునందు నిలుకడగలవాఁడవు, గావున, నెంతవేఁడుకొన్నను,ఇప్పుడునీవిచ్చటనుండుట కొప్పుకొనవు;అట్లు నీవొప్పుకొనకున్నను, ఈసీతనైన,నిచ్చటనుంచిపొమ్ము ; మేము ప్రార్థించునట్లు సేయుము. అని, యంతఃపురస్త్రీలు. రామునితోఁజెప్పిరి. అని, తాత్పర్యము.

తాసా మేవం విధా వాచ శ్శృణ్వన్ దశరథాత్మజః
బబంధైవ తదా చీరం సీతయా తుల్యశీలయా. ౨౦

టీక॥ తదా=అప్పుడు; దశరథాత్మజః= దశరథునికొడుకైన రాముండు; తాసాం=ఆయంతఃపురస్త్రీలయొక్క; బహువిధాః= పెక్కువిధములైన; వాచః=మాటలను;శృణ్వన్= వినుచు;తుల్యశీలయా= సమానమయిన స్వభావముగల;సీతయా=(షష్ఠ్యర్థమందుఁద్రుతీయ) సీతకు;చీరం=నారచీరను;బబంధైవ=కట్టనేకట్టెను.

అప్పుడు,దశరథుని కొడుకైన రాముండు,ఆయంతఃపురస్త్రీలెన్నివిధంబులఁజెప్పినను,వారిమాటలవినుచునేతప్ప

క,తనవలెనేపరిశుద్ధస్వభావముగల,సీతకునారచీరంగట్టెను.అని,తాత్పర్యము.

చీరే గృహీతే తు తయా సమీక్ష్య నృపతే ర్గురుః
నివార్య సీతాం కైకేయీం వసిష్ఠో వాక్య మబ్రవీత్. ౨౧

టీక॥ నృపతేః=దశరథమహారాజుయొక్క; గురుః=ఆచార్యుఁడయిన; వసిష్ఠః=వసిష్ఠుఁడు; తయా=ఆసీతచేత; గృహీతే=కట్టుకొనంబడిన; చీరే=నారచీరలను; సమీక్ష్యతు=చూచినంతనే; సీతాం=సీతను; నివార్య=అడ్డగించి; కైకేయీం = కైకేయినిగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

దశరథమహారాజునకుగురుండైనవసిష్ఠుండు, ఆసీతాదేవి నారచీరలఁగట్టుకొనుటంజూచి,సీతాదేవినివారించి,కైకేయింజూచి.యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

అతిప్రవృత్తే దుర్మేధే కైకేయి కులపాంసని
వంచయిత్వాచ రాజానం న ప్రమాణే వతిష్ఠసే. ౨౨

టీక॥ అతిప్రవృత్తే= అతిక్రమించినదానవు; దుర్మేధే= దుష్టబుద్ధిగలదానవు; కులపాంసని=కులమునుచెఱుపుదానవగు; కైకేయి=కైకేయీ! రాజానం = దశరథమహారాజును; వంచయిత్వాచ=మోసపుచ్చియు; ప్రమాణే=మర్యాదయందు; నావతిష్ఠసే=ఉండవు.

కైకేయీ! నీవధికప్రసంగము సేయుదానవు; దుర్బుద్ధురాలవు; వంశమును జెఱుపంబుట్టినదానవు; నీవుమహారాజును మోసపుచ్చి వరంబులుగొనియు, దేనికివరంబుగొంటివో, అంతలోనిలువక, మఱియుం గ్రౌర్యముసేయుచున్నావు. అని, తాత్పర్యము.

న గంతవ్యం వనం దేవ్యా సీతయా శీలవర్జితే

టీక॥ శీలవర్జితే=సదాచారముచేవిడువఁబడినదానా! దేవ్యా=రాణియగు; సీతయా=సీతచేత; వనం=అడవికి; న గంతవ్యం=పొందఁబడవలసినదిలేదు.

సదాచారములేనిదానా! సీతాదేవి,యిప్పుడెంతమాత్రము వనంబునకుఁబోవలసినదిలేదు.

అని, తాత్పర్యము.

అనుష్ఠాస్యతి రామస్య సీతా ప్రకృత మాసనమ్. ౨౩

టీక॥సీతా=సీతాదేవి; రామస్య=రామునియొక్క; ప్రకృతం=ప్రస్తుతమయిన;ఆసనం= సింహాసనమును;అనుష్ఠాస్యతి=అధిష్ఠించియుండఁగలదు.

సీతాదేవి, యిప్పుడు రామునకుసిద్ధముగానుండుసింహాసనంబునధిష్ఠించి,రాజ్యంబుఁబాలింపుచుండఁగలదు.

అని, తాత్పర్యము.

ఆత్మాహి దారా స్సర్వేషాం దారసంగ్రహవర్తినామ్
ఆత్మే యమితి రామస్య పాలయిష్యతి మేదినీమ్. ౨౪

టీక॥ దారసంగ్రహ వర్తినాం=భార్యయొక్క సంగ్రహించుటయందున్నవారికి, గృహస్థులకనుట ; సర్వేషాం=అందఱకును;దారాః=భార్య;ఆత్మాహి=స్వరూపముగదా!ఇయం=ఈసీత; రామస్య=రామునియొక్క; ఆత్మేతి = ఆత్మయగుటవలన; మేదినీం = భూమిని;పాలయిష్యతి= పాలింపఁగలదు.

గృహస్థులకందఱకుభార్యస్వరూపమువంటిది, (అట్లు వేదమునందుఁజెప్పఁబడియున్నది)అట్లు, ఈసీత, రామునియాత్మ,గావున, నతనిచేఁబాలింపఁగగినభూమింబాలింపుచుండఁగలదు.

అని, తాత్పర్యము.

అథ యాస్యతి వైదేహీ వనం రామేణ సంగతా
వయమ ప్యనుయాస్యామః పురంచే దం గమిష్యతి. ౨౫

టీక॥అథ=ఇంక; వైదేహీ= సీతాదేవి; రామేణ=రామునితో; సంగతా=కూడినదై;వనం= అడవినిగూర్చి;యాస్యతి(యది)=పోవునేని; వయమపి=మేమును;అనుయాస్యామః= వెంబడింతుము.ఇదం=ఈ; పురంచ=పట్టణమును;

గమిష్యతి=పోఁగలదు.

ఇంక, సీతాదేవి, రామునితోఁగూడ నరణ్యంబునకుఁ బోవునేని, మేమునుం గూడఁబోయెదము; ఈపట్టణంబుననుం డువారలందఱునుంబోదురు.

అని, తాత్పర్యము.

అంతపాలాశ్చ యాస్యంతి సదారో యత్ర రాఘవః

టీక॥యత్ర = ఎచ్చటికి; సదారః= భార్యతోఁగూడిన; రాఘవః=రాముఁడు; యాస్యతి(అధ్యాహృతము)=పోవునో; తత్ర(అధ్యాహృతము)=అచ్చటికి; అంతపాలాశ్చ = ఎల్లలఁబాలించువారలును, సేనానాయకులునునుట; యాస్యంతి=పోవుదురు.

రాముండుభార్యతోఁగూడఁ బోవుచోటికి, సేనానాయకులునుంబోదురు.

అని, తాత్పర్యము.

స హోపజీవ్యం రాష్ట్రంచ పురంచ సపరిచ్ఛదమ్. ౨౮

టీక॥స హోపజీవ్యం= ఉపజీవింపఁదగిన దశరథునితోఁగూడిన ; రాష్ట్రంచ=దేశమును; సపరిచ్ఛదం=పరికరముతోఁగూడిన; పురంచ=పట్టణమును; యాస్యతి (అధ్యాహృతము)=పోవును దశరథుండును, దాసీదాసాదిసహితంబుగా నీపట్టణంబుననున్నవారు, నీదేశంబుననున్నవారు నందఱును, రాముని వెంబడించిపోవుదురు.

అని, తాత్పర్యము.

భరతశ్చ సశత్రుఘ్నశ్చీరవాసా వనేచరః
వనే వసంతం కాకుత్స్థ మనువత్స్యతి పూర్వజమ్. ౨౯

టీక॥ భరతశ్చ=భరతుఁడును; సశత్రుఘ్నః=శత్రుఘ్నునితోఁగూడినవాఁడై; చీరవాసాః=నారచీరలేవస్త్రములుగాఁగలవాఁడై; వనేచరః=అడవియందుఁదిరుగువాఁడై; పూర్వజం = అన్నయును; వనే=అడవియందు; వసంతం=వసించువాఁడునగు; కాకుత్స్థం=రామునిః అనువత్స్యతి= అనుసరించియుండును.

భరతుండునుశత్రుఘ్నుండును నారచీరలంగట్టుకొని, యడవికిఁబోయివనవాసియగు దమయన్నరామునకు శు

శ్రూష సేయుచుండఁగలరు. అని, తాత్పర్యము.

తత శ్శూన్యాం గతజనాం వసుధాం పాదపైస్సహ
త్వమేకా శాధి దుర్వృత్తా ప్రజానామహితే స్థితా. ౨౮

టీక॥ తతః=అటుపిమ్మట; దుర్వృత్తా = దురాచారముగలదానవు; ప్రజానాం=జనులయొక్క; అహితే=కీడునందు; స్థితా= ఉన్నదానవునగు; త్వం=నీవు; ఏకా=ఒకర్తెవై; గతజనాం=పోయినజనులుగలదియును; శూన్యాం= పాడుపడినదియునగు; వసుధాం=భూమిని; పాదపైస్సహ=వృక్షములతోఁగూడ; శాధి=పాలింపుము.
అంత, దురాచారవు ప్రజలకుఁగీడు సేయుదానవునగు నీవొకర్తెవై యిచ్చట నుండిజనులులేక పాడుపడియుండుభూమిని, వృక్షములతోఁగూడఁ, బాలింపుచుండుము. అని, తాత్పర్యము.

నహి తద్భవితా రాష్ట్రం యత్ర రామో నభూపతిః
తద్వనం భవితా రాష్ట్రం యత్ర రామో నివత్స్యతి. ౨౯

టీక॥యత్ర=ఎచ్చట; రామః=రాముఁడు; భూపతిః=రాజు; న=కాఁడో; తత్=అది; రాష్ట్రం=రాజ్యము; న భవితాహి=కాదుగదా! యత్ర=ఎచ్చట; రామః=రాముఁడు; నివత్స్యతి= నివసించునో; తత్=ఆ; వనం=అడవి; రాష్ట్రం=రాజ్యము; భవితా=కాఁగలదు.
రాముండెచ్చటరాజుగానుండఁడో అదియెంతమాత్రమురాజ్యముగానేరదు, వనముగానేయుండును; ఎచ్చటరాముండువాసముసేయునో, ఆయరణ్యమె రాజ్యమగును. అని, తాత్పర్యము.

నహ్యదత్తాం మహీంపిత్రా భరతశ్శాస్తుమర్హతి
త్వయివా పుత్రవద్వస్తుం యదిజాతో మహీపతేః. ౩౦

టీక॥భరతః=భరతుఁడు; మహీపతేః=భూమికిఁబ్రభువైన దశరథమహారాజునకు; జాతోయది=పుట్టినవాఁడగునేని; పిత్రా=తండ్రిచేత; అదత్తాం= ఇయ్యఁబడని; మహీం= భూమిని ; శాస్తుం=పాలించుటకుఁగాని; త్వయి= నీ

యందు; పుత్రవత్ = కొడుకువలె ; వస్తుంవా = ఉండుటకుఁగాని; నార్హతిహి = తగఁడుగదా!

భరతుండు, దశరథమహారాజునకుఁబుట్టినవాఁడెయగునేని, తనకుఁదండ్రిమనఃపూర్వకముగానియ్యనిధరామిందాలింపఁడు; తండ్రికివిరోధముచేసిననీయందుమాతృభక్తినుంచఁడు.

అని, తాత్పర్యము.

యద్యపి త్వం క్షితితలా ద్గగనం చోత్పతి ష్యసి
పితృవంశచరిత్రజ్ఞ స్సోన్యథా న కరిష్యతి. ౩౧

టీక॥ త్వం = నీవు; క్షితితలాత్ = భూతలముననుండి; గగనంచ = ఆకాశమునుగూర్చియు; ఉత్పతిష్యసియద్యపి = ఎగిరినను; పితృవంశచరిత్రజ్ఞః = తండ్రివంశముయొక్క చరిత్రము నెఱింగిన; సః = ఆభరతుఁడు; అన్యథా = వేఱువిధముగా; నకరిష్యతి = చేయఁడు.

నీవుభూమినుండి యాకాశమునకెగిరినను, దండ్రివంశమునంబుట్టినవారి సదాచారమునెఱింగియున్నట్టిభరతుండెంతమాత్రము, నీవుకోరినట్లు సేయఁడు. అని, తాత్పర్యము.

త త్త్వయా పుత్రగర్ధిన్యా పుత్రస్య కృత మప్రియమ్
లోకేహి స న విద్యేత యో న రామ మనువ్రతః. ౩౨

టీక॥ తత్ = అందువలన; పుత్రగర్ధిన్యా = కొడుకునందుస్నేహముగల; త్వయా = నీచేత; పుత్రస్య = కొడుకునకు; అప్రియం = కీడు; కృతం = చేయఁబడినది. యః = ఎవ్వఁడు; రామం = రాముని; అనువ్రతః = అనుసరించినవాఁడు; న = కాఁడో; సః = అట్టివాఁడు; లోకే = లోకమునందు; నవిద్యేతహి = ఉండఁడుగదా!

రాముననుసరింపకుండువాఁడు ప్రపంచంబుననె యుండఁడు; అట్లుండఁగాఁ, దమ్ముండగుభరతునకు, రామునియందుస్నేహం బధికంబుగానుండునని చెప్పనేల? అట్లు, నీవురాజ్యంబునొసంగినను, భరతుండు, రామునందలిస్నేహంబున, నిన్నుశత్రువునుగానేమెందును; కావున, నీవుభరతునియందలిస్నేహంబుననింతదూరముచేసినను, ఇదియంతయునతనికపకారముచేసినట్లెపర్యవసన్నమగును. అని, తాత్పర్యము.

ద్రక్ష్య స్యద్యైవ కైకేయి పశువ్యాళమృగద్విజాన్
గచ్ఛత స్సహ రామేణ పాదపాంశ్చ తదున్ముఖాన్. ౩౩

టీక॥ కైకేయి=కైకేయీ; రామేణ సహ=రామునితోఁగూడ; గచ్ఛతః=పోవుచున్న; పశువ్యాళమృగద్విజాన్= పశువులనుఏనుఁగులనుజింకలనుబత్తులను; తదున్ముఖాన్=అతనితట్టుముఖముగలిగియుండు; పాదపాంశ్చ= వృక్షములను; అద్యైవ=ఇప్పుడే; ద్రక్ష్యసి= చూడఁగలవు.

కైకేయీ!నీవింకశీఘ్రింబుననే,రాముని వెంబడింబోవు పశువుల నేనుంగుల జింకలనుబత్తులను,అతనితోఁబోవంగోరుచున్నట్లుండు వృక్షంబులనుం, జూడఁగలవు.అని, తాత్పర్యము.

అథోత్తమా న్యాభరణాని దేవి
దేహి స్నుషాయై వ్యపనీయ చీరమ్
న చీర మస్యాః ప్రవిధీయ తేతి
న్యవారయ త్తద్వసనం వసిష్ఠః. ౩౪

టీక॥ దేవి=కైకేయీ!అథ=ఇఁక; స్నుషాయై = కోడలగుసీతకొఱకు; చీరం=నారచీరను;వ్యపనీయ= విచ్చి; ఉత్తమాని= శ్రేష్ఠములయిన; ఆభరణాని=సొమ్ములను; దేహి= ఇమ్ము. అస్యాః=ఈబిడకు;చీరం=నారచీర; న ప్రవిధీయతే = విధింపఁబడదు; ఇతి (సంధియార్షము)= అని; ఉక్త్వా(అధ్యాహృతము)= చెప్పి; వసిష్ఠః=వసిష్ఠుఁడు;తద్వసనం= దానికట్టుకొనుటను;న్యవారయత్=అడ్డగించెను.

కైకేయీ!ఇంకనీవు, నీకోడలయిన సీతకు, మంచిసొమ్ములనిమ్ము; ఈబిడకీ నారచీరయెంతమాత్రముదగియుండలేదు;అనిచెప్పి,వసిష్ఠుండు,సీతాదేవి, నారచీరంగట్టుకొనుచుండఁగా, దానినివారించెను.అని,తాత్పర్యము.

ఏకస్య రామస్య వనే నివాస
స్త్వయా వృతః కేకయరాజపుత్రి

విభూషితే యం ప్రతికర్మనిత్యా
వసత్వరణ్యే సహ రాఘవేణ. ౩౫

టీక॥ కేకయరాజపుత్రి=కేకయరాజకొమార్తెవయిన కైకేయీ! ఏకస్య=ఒకఁడైన; రామస్య= రాముని యొక్క; వనే = అడవియందు; నివాసః=ఉండుట; త్వయా=నీచేత; వృతః= కోరఁబడినది. ప్రతికర్మనిత్యా= అలంకారమునందు నిత్యురాలయిన, ఎల్లప్పుడు సలంకారముననుఁ దగియుండునట్టి యనుట; ఇయం = ఈసీత; విభూషితా=అలంకరింపఁబడినదై; రాఘవేణ సహ=రామునితోఁగూడ; అరణ్యే=అడవియందు; వసతు=ఉండునుగాక.

కైకేయీ! నీవు, ఒకఁడు రాముండడవిలో వాసము సేయుట నే కోరినావు; ఈసీత యడవిలో నుండవలెనని, కోరవైతివి; కావున, ఎల్లప్పుడు నలంకారముననుఁ దగినట్టిసుందరాంగియగు సీతాదేవి, భూషణంబులనలంకృతయయి, యరణ్యంబున రామునితోఁగూడ, వాసంబు సేయుఁగాక; దీక్షియ్యకొనుము.

అని, తాత్పర్యము.

యానైశ్చ ముఖ్యైః పరిచారకైశ్చ
సుసంవృతా గచ్ఛతు రాజపుత్రీ
వస్త్రైశ్చ సర్వైస్సహితైర్విధానై
ర్నేయం వృతా తే వరసంప్రదానే. ౩౬

టీక॥ రాజపుత్రీ= రాచకొమార్తెయగు సీతాదేవి; ముఖ్యైః= శ్రేష్ఠములయిన; యానైశ్చ= వాహనములచేతను; పరిచారకైశ్చ = పరిచారకులచేతను; సర్వైః=సమస్తములయిన; విధానైః=ఉపకరణములతో ; సహితైః= కూడిన; వస్త్రైశ్చ= వస్త్రములచేతను; సుసంవృతా = పరివారింపఁబడినదై; గచ్ఛతు=పోవుఁగాక. తే = నీయొక్క; వరసంప్రదానే=వరములయిచ్చుటయందు; ఇయం=ఈబిడ; నవృతా= కోరఁబడలేదు.

రాచకొమార్తెయగుసీతాదేవి, యుత్తమంబులగు వాహనంబులతోను

బరిచారకులతోను నానా విధములయి నవస్త్రములతోను సమస్తము లయినయుపకరణములతోనుంగూడి, పోనిమ్ము; నీవువరంబులడుగునప్పుడు, "ఈబిడవనంబులోనుండవలయు" ననియడుగలేదు. అనివసిష్ఠుండు, కైకేయితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తస్మిం స్తథా జల్పతి విప్రముఖ్యే
గురౌ నృపస్యా ప్రతిమప్రభావే
నైవ స్మ సీతా వినివృత్తభావా
ప్రియస్య భర్తుః ప్రతికారకామా. ౩౭

టీక॥ విప్రముఖ్యే = బ్రాహ్మణశ్రేష్ఠుండును; నృపస్య = దశరథమహారాజుయొక్క; గురౌ = ఆచార్యుండును; అప్రతిమప్రభావే = సరిలేని ప్రభావముగలవాఁడునగు; తస్మిన్ = ఆవసిష్ఠుఁడు; తథా = అట్లు; జల్పతి = చెప్పుచుండఁగా; భర్తుః = పెనిమిటికి; ప్రతికారకామా = సరియయినకార్యము సేయఁగోరినట్టి; సీతా = సీతాదేవి; వినివృత్తభావా = మఱలినయభిప్రాయముగలది; నైవస్మ = కానేలేదు.

బ్రాహ్మణశ్రేష్ఠుండును దశరథమహారాజు కులగురుండును మహాప్రభావుండునగువసిష్ఠమహర్షి, యావిధంబునం జెప్పుచున్నను, భర్తనువెంబడించి యరణ్యంబునకుఁబోనిశ్చయించినసీతాదేవియభిప్రాయ.ము, ఎంతమాత్రము, దిరుగదయ్యె. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాండే, సప్తత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండ సప్తత్రింశసర్గటీక, ముగిసినది.



౩౭

అష్టత్రింశసర్గప్రారంభః.

తస్యాం చీరం వసానాయాం నాథవత్యా మనాథవత్
ప్రచుక్రోశ జన స్సర్వో ధిక్త్వాం దశరథం త్వితి. ౧

టీక॥ నాథవత్యాం=నాథుండుగల; తస్యాం=ఆసీత; అనాథవత్= నాథుండులేనిదివలెె; చీరం = వల్కలమును; వసానాయాం=కట్టుకొనుచుండఁగా; జనః = జనము; సర్వః = అంతయు; "త్వాం=నిన్నుఁగూర్చి; ధిక్=దహింపఁబడుటయగుఁగాక." ఇతి=అని; దశరథం=దశరథునిగూర్చి; ప్రచుక్రోశ=అఱచెను.

లోకనాథుండగు రాముండు నాథుండుగానున్నను, ఆసీతాదేవి, యనాథయుంబోలె, వల్కలంబుఁగట్టుకొనుటం జూచి, యచ్చటిజనులందఱు, దశరథునిం జూచి, "నీవుదహింపఁబడుదువుగాక" అని, నిందించిరి. అని, తాత్పర్యము.

తేన తత్ర ప్రణాదేన దుఃఖిత స్స మహీపతిః
చిచ్ఛేద జీవితే శ్రద్ధాం ధర్మే యశసి చాత్మనః. ౨

టీక॥ మహీపతిః=భూమికిఁబ్రభువైన; సః=ఆదశరథమహారాజు; తత్ర=అచ్చట; తేన=ఆ; ప్రణాదేన=శబ్దముచేత; దుఃఖితః = దుఃఖంబునొందినవాఁడై; ఆత్మనః=తనయొక్క; జీవితే=బ్రతుకునందును; ధర్మే= ధర్మమునందును; యశసిచ=కీర్తియందును; శ్రద్ధాం=ఆదరమును; చిచ్ఛేద=ఛేదించెను, విడిచెననుట.

దశరథుండట్లు దన్ను జనులందఱు నిందించుటంజూచి, పరమదుఃఖంబునొంది, తనప్రాణమునందును ధర్మమునందునుకీర్తియందును ప్రియములేనివాఁడయ్యె. అని, తాత్పర్యము.

స నిశ్శ్వస్యోష్ణ మైక్ష్వాక స్తాం భార్యా మిద మబ్రవీత్

టీక ॥ ఐక్ష్వాకః=ఇక్ష్వాకువంశంబునంబుట్టిన; సః=ఆదశరథమహారాజు;

ఉష్ణం=వేడిగా; నిశ్శ్వస్య=నిట్టూర్పు లువుచ్చి; తాం=ఆ; భార్యాం=భార్య యయినకైకేయింగూర్చి; ఇదం=ఈ మాటను; అబ్రవీత్=పలికెను.

ఆదశరథమహారాజు, వేఁడినిట్టూర్పులువుచ్చి, ఆకైకేయింజూచియిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

కైకేయి కుశచీరేణ న సీతా గంతు మర్హతి. ౩

టీక॥ కైకేయి=కైకేయీ! సీతా=సీతాదేవి; కుశచీరేణ=నారచీరతో; గంతుం=పోవుటకు; నార్హతి = తగదు.

కైకేయీ ! సీతాదేవినారచీరంగట్టుకొనిపోఁదగదు. అని, తాత్పర్యము.

సుకుమారీచ బాలాచ సతతంచ సుఖోచితా
నేయం వనస్య యోగ్యేతి సత్య మాహ గురు ర్మమ. ౪

టీక॥సుకుమారీ=కోమలమయినదేహముగలదియును; బాలాచ = పిన్నవయసుగలదియును; సతతం=ఎల్లప్పుడును; సుఖోచితాచ=సుఖమునకుఁదగినదియునగు; ఇయం=ఈసీత; వనస్య=అడవికి; యోగ్యా=తగినది; న=కాదు. ఇతి=అని; మమ=నాయొక్క; గురుః=ఆచార్యుఁడయినవసిష్ఠుఁడు; సత్యం = సత్యమును; ఆహ=చెప్పుచున్నాఁడు.

"ఈసీత, కోమలదేహముగలది, పిన్నది, యెల్లప్పుడును, సుఖముగానుండఁదగినది. ఎంతమాత్రమువనంబులోనుండఁదగినదిగాదు." అని, నాగురుండగువసిష్ఠుండు చెప్పినది, సత్యము. అని, తాత్పర్యము.

ఇయంహి కస్యాపకరోతి కించి
త్తపస్వినీ రాజవరస్య కన్యా
యా చీర మాసాద్య జనస్య మధ్యే
స్థితా విసంజ్ఞా శ్రమణీవ కాచిత్. ౫

టీక॥తపస్వినీ=కరుణింపఁదగినదియును; రాజవరస్య=రాజశ్రేష్ఠుండగు

జనకమహారాజుయొక్క; కన్యా=కూఁతురనగు; ఇయంహి = ఈసీతయును; కించిత్=కొంచెమయిన; కస్య=ఎవ్వనికి; అపకరోతి= అపకారముసేయుచున్నది? యా=ఏసీత; చీరం= వల్కలమును; ఆసాద్య=పొంది; జనస్య = జనముయొక్క; మధ్యే= నడుమునందు; విసంజ్ఞా=మూర్ఛితురాలై; కాచిత్ =ఒకానొక; శ్రమణీవ= తాపసస్త్రీయుంబోలె; స్థితా=ఉన్నదో.

ఈసీతాదేవి, వల్కలంబుగట్టుకొని, జనులనడుమ, మైమఱచి, యొకానొక తాపసస్త్రీవలె, నున్నదే! శోచనీయయు రాజశ్రేష్ఠుండగు జనకునికొమార్తెయునగుసీసీత, యెవ్వరికేమియపకారముచేసినది? అని, తాత్పర్యము.

చీరాణ్యపాస్యా జ్జనకస్య కన్యా
నేయం ప్రతిజ్ఞా మమ దత్తపూర్వా
యథా సుఖం గచ్ఛతు రాజపుత్రీ
వనం సమగ్రా సహ సర్వరత్నైః. ౬

టీక॥ జనకస్య=జనకమహారాజుయొక్క; కన్యా=కూఁతురయినసీత; చీరాణి=వల్కలములను; అపాస్యాత్=విడుచుఁగాక. ఇయం=ఇది; మమ=నాయొక్క; దత్తపూర్వా=మున్నియ్యఁబడిన; ప్రతిజ్ఞా=ప్రతిన; న=కాదు. రాజపుత్రీ=రాచకొమార్తెయగుసీతాదేవి; సమగ్రా=సంపూర్ణమై; సర్వరత్నైస్సహ= సమస్తములైనమణులతోఁగూడ; యథాసుఖం=సుఖమునతిక్రమింపక; వనం= అడవినిగూర్చి; గచ్ఛతు=పోవుఁగాక.

జనకమహారాజపుత్రియగు నీసీత, యిప్పుడువల్కలంబులవిచ్చి వేయుఁగాక; ఈప్రకారము, సీతయునువల్కలములంగట్టుకొనునని మున్ను నేనుసీకువరంబొసంగియుండలేదు; కావున, రాచకొమార్తెయగుసీత, సమస్తాభరణంబులందాల్చి, సమస్తరత్నంబులంగూడి, సుఖంబుగానడవికింబోవుఁగాక.

అని, తాత్పర్యము.

అజీవనార్హేణ మయా నృశంసా
కృతా ప్రతిజ్ఞా నియమేన తావత్

త్వయాహి బాల్యాత్ప్రతిపన్న మేత
త్తన్మాం దహే ద్వేణుమివాత్మ పుష్పమ్. ౩

టీక॥ఆజీవనాహేతుణా= బ్రతుకుకట కహేతువు(డనుగాని; మయా=నాచేత; నృశంసా=క్రూరమయిన ; ప్రతిజ్ఞా= ప్రతిన;నియమేన తావత్ =నిశ్చయము తోను;కృతా= చేయఁబడినది . త్వయా=నీచేత; బాల్యాత్= అజ్ఞానము వలన;ఏతత్=ఇది;ప్రతిపన్నంహి= నిశ్చయింపఁబడినదిగదా ! తత్=అది; మాం=నన్ను; ఆత్మపుష్పం= తనపుష్పము;వేణుమివ=వెదురునుంబోలె; దహేత్=దహించును.

నాకింకమరణకాలంబు సమీపించిన దికావున,నేను, "నీవడిగినదానిందప్పకచేసెద" నని, శపథపూర్వకముగాఁ బ్రతిజ్ఞఁజేసితిని; అంత, నీవజ్ఞానంబున,రామునరణ్యంబునకుఁ బంపుటయు భరతునభిషేకించుటయు నేకావలయునని,నిశ్చయించినావు; ఏమిసేయవచ్చును! వెదురునుదానిపుష్పమె దహించునట్లు,నేనుజేసినప్రతిజ్ఞయే నన్నుదహించుచున్నది.అని, తాత్పర్యము.

రామేణ యది తే పాపే కించి త్కృత మశోభనమ్
అపకారః క ఇహ తే వైదేహ్యా దర్శితో ధమే.

టీక॥పాపే = పాపముసేయుస్వభావముగలదానవు; అధమే=నీచురాలవునగుకైకేయీ! రామేణ= రామునిచేత;తే=నీకు; అశోభనం= కష్టము; కించిత్=కొంచెము; కృతంయది=చేయఁబడినదగునేని, వైదేహ్యా= సీతచేత;ఇహ=ఇచ్చట ; తే=నీకు;కః= ఏ;అపకారః=అపకారము; దర్శితః= చూపఁబడినది?

పాపిష్ఠురాలవు నీచురాలవునగుకైకేయీ!ఒకవేళరాముండేమైనఁగొంచెముకష్టమునీకుఁజేసియుండునేని,యీసీతనీకేమి యపకారముచేసినది?
అని, తాత్పర్యము.

మృగీవో త్ఫుల్లనయనా మృదుశీలా తపస్వినీ
అపకారం క మిహ తే కరోతి జనకాత్మజా. ౯

టీక॥మృగీవ=లేడివలె ; ఉత్ఫుల్లనయనా=వికసించినకండ్లు గలదియును; మృదుశీలా=తిన్ననిస్వభావము గలదియును; తపస్వినీ=కరుణింపఁదగినదియనగు; జనకాత్మజా= జనకునికొమార్తెయయినసీతాదేవి; ఇహ=ఇచ్చట; తే=నీకొఱకు;కం=ఏ ; అపకారం=అపకారమును, కరోతి=చేయుచున్నదిః

లేడివలెసుందరంబులయిన కండ్లుగలదియుఁ దిన్ననిస్వభావము గలదియు శోచనీయయునగు నీసీత, నీకేమియపకారము సేయుచున్నది?

అని, తాత్పర్యము.

నను పర్యాప్త మేతత్తే పాపే రామ వివాసనమ్
కి మేభిః కృపణై ర్భూయః పాతకై రపి తే కృతైః. ౧౦

టీక॥పాపే=పాపిష్ఠురాలవగు కైకేయీ! తే=నీకు;ఏతత్=ఈ; రామవివాసనంనను= రామునివనంబునకుఁ బంపుటయే ; పర్యాప్తం=చాలును! తే=నీకు; భూయః=ఇంకను;కృతైః=చేయఁబడిన; కృపణైః= కుత్సితములయిన; ఏభిః=ఈ;పాతకైరపి= పాపములచేతను;కిం=ఏమిప్రయోజనము?

పాపిష్ఠురాలా?నీకు,రామునడవికిఁ బంపుటచాలదా? ఇంకనట్లు కుత్సితముగాఁబాపములు సేయుటచేఁబ్రయోజనమేమి? అని, తాత్పర్యము.

ప్రతిజ్ఞాతం మయా తావ త్త్వయో క్తం దేవి శృణ్వతా
రామం య దభిషేకాయ త్వ మిహాగత మబ్రవీః. ౧౧

టీక॥దేవి=కైకేయీ!త్వం=నీవు;అభిషేకాయ= పట్టాభిషేకముకొఱకు; ఇహ=ఇచ్చటికి ; ఆగతం = వచ్చిన; రామం=రామునిగూర్చి;యత్=ఏమాటను;అబ్రవీః = చెప్పితివో?త్వయా=నీచేత; ఉక్తం=చెప్పఁబడిన; తత్(అధ్యాహృతము)=ఆమాటను; శృణ్వతా=వినుచున్న; మయా=నాచేత తావత్=అంత;ప్రతిజ్ఞాతం= ప్రతిజ్ఞ చేయఁబడినది.

కైకేయీ!నీవిచ్చటికిఁ బట్టాభిషేకమునకైవచ్చిన రామునింబూచి "నీవు నారచీరలుగట్టుకొనియరణ్యంబునఁబదునాలుగుసంవత్సరంబులుండుము" అనిచెప్పి

టి వే॥ నేనామాటనువిని, యట్లు రామునరణ్యంబునకుఁబోవుటకే యొప్పుకొంటినిగాని; సీతవనంబునకుంబోవుటనుగుణించి, నే నెంతమాత్రము ప్రతిజ్ఞ చేయలేదు. అని, తాత్పర్యము.

తత్త్వేవ తత్సమతిక్రమ్య నిరయం గంతు మిచ్ఛసి
మైథిలీ మపి యాహి త్వ మీక్షసే చీరవాసినీం ౧౨

టీక॥ తత్ = అట్టి; ఏతత్తు = దీనినింగూడ; సమతిక్రమ్య = అతిక్రమించి; నిరయం = నరకమును; గంతుం = పొందుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావు. హి = ఏకారణమువలన; యా = ఏ; త్వం = నీవు; మైథిలీమపి = సీతనుంగూడ; చీరవాసినీం = నారచీరలందాల్చినదానిఁగా; ఈక్షసే = చూచుచున్నావో, కోరుచున్నావో యనుట.

నీవు, ఎట్టిదానవో! సీతగూడనారచీరలంగట్టుకొనియుండఁగాఁ జూడఁగోరుచున్నావు! అట్లు నేనెంతవఱకుఁ బ్రతిజ్ఞ చేసినానో, అంతవఱకునిలువక నరకంబునొందఁగోరియున్నావు. అని, దశరథుండు, కైకేయితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతీవ రాజా విలప న్మహాత్మా
శోకస్య నాంతం స దదర్శ కించిత్
భృశాతురత్వా చ్చ పపాత భూమౌ
తేనైవ పుత్రవ్యసనేన మగ్నః ౧౩

టీక॥ మహాత్మా = అధికమయినధైర్యముగల; సః = ఆ; రాజా = దశరథమహారాజు; ఇతీవ = ఇట్లు; విలపన్ = ఏడ్చుచు; శోకస్య = దుఃఖముయొక్క; అంతం = తుదను; కించిత్ = కొంచెమయినను; నదదర్శ = చూడఁడయ్యె. తేన = ఆ; పుత్రవ్యసనేనైవ = పుత్రదుఃఖముచేతనే; మగ్నః = మునింగినవాఁడై; భృశాతురత్వాత్ = మిక్కిలియుదుఃఖితుఁడగుటవలన; భూమౌ = నేలయందు; పపాత = పడెను.

మహాధైర్యశాలియగు నాదశరథమహారాజు, ఈప్రకారము, దుఃఖమునకుఁ గొంచెమయినఁ దుదం గానక, ఆపుత్ర

దుఃఖంబున నేమునింగి, పరమదుఃఖితుండగుటవలన, నేలపైఁబడెను. అని, తాత్పర్యము.

ఏవం బ్రువంతం పితరం రామ స్సంప్రస్థితో వనమ్

అవాక్ఛిరస మాసీన మిదం వచన మబ్రవీత్. ౧౪

టీక॥ రామః=రాముఁడు; వనం=అడవినిగూర్చి; సంప్రస్థితః=పయనమయినవాఁడై; ఏవం=ఇట్లు; బ్రువంతం=చెప్పుచున్నవాఁడును; అవాక్ఛిరసం=వంగినముఖముఁగలవాఁడును; ఆసీనం=కూర్చున్నవాఁడునగు; పితరం=తండ్రినిగూర్చి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

ఇట్లు చెప్పుచుఁ, దలవంచుకొనికూర్చుండియున్నతండ్రింజూచి, రాముండు వనంబునకుఁబయనంబై, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇయం ధార్మిక కౌసల్యా మమ మాతా యశస్వినీ

వృద్ధా చాక్షుద్రశీలా చ నచ త్వాం దేవ గర్హతే. ౧౫

టీక॥ ధార్మిక=ధర్మమునాచరించునట్టి; దేవ=దశరథమహారాజా! మమ=నాయొక్క; మాతా=తల్లియయిన; ఇయం=ఈ; కౌసల్యా=కౌసల్య; యశస్వినీ=అధికమయినకీర్తిఁగలది. వృద్ధా చ=ముదుసలియును. అక్షుద్రశీలా చ=కుటిలముగాని స్వభావముగలదియును. త్వాం=నిన్ను; నగర్హతే చ=నిందింపకయున్నది.

ధార్మికుఁడవగు దశరథమహారాజా! నాతల్లియయినయీకౌసల్య, కీర్తిమంతురాలు; ముసలిది; మఱియునుత్తమంబగుస్వభావంబుగలది; నీప్రియపుత్రుండనైననన్ను వనంబునకుఁ బంపుచున్నను, నిన్నేమియునిందింపక చూచుచున్నది. అని, తాత్పర్యము.

మయా విహీనాం వరద ప్రపన్నాం శోక సాగరమ్

అదృష్టపూర్వవ్యసనాం భూయ స్సమ్మంతు మర్హసి. ౧౬

టీక॥ వరద=వరంబులనిచ్చునట్టి దశరథుఁడా! మయా=నాచేత ; విహీ

నాం=విడువఁబడినదియును; శోకసాగరం=సముద్రమువంటిదుఃఖమును; ప్రపన్నాం=పొందినదియును; అదృష్టపూర్వ్వవ్యసనాం=మున్నుచూడఁబడని దుఃఖముగలదియునగుకౌసల్యను ; భూయః=మిక్కిలియు; సమ్మంతుం = సమ్మానించుటను; అర్హసి= తగుదువు.

దశరథుఁడా ! నీవువరంబులనిచ్చువాఁడవు; నేనుబోయినవెనుక నన్నుఁబాసిదుఃఖసముద్రంబునం బడియున్న, యిదివఱకెన్నఁడును దుఃఖంబునను భవించియెఱుంగని, నాతల్లినిగౌసల్యను, నీవు, మిక్కిలియు సమ్మానింపు చుండుము. అని, తాత్పర్యము.

పుత్రశోకం యథా నచ్ఛేత్ త్వయా పూజ్యేన పూజితా
మాం హి సంచింతయంతీ సా త్వయి జీవే త్తపస్వినీ. ౧౭

టీక॥ తపస్వినీ=కరుణింపఁదగిన; సా= ఆకౌసల్య; పుత్రశోకం=పుత్రదుఃఖమును; యథా=ఎట్లు; నర్ఛేత్=పొందదో; తథా(అధ్యాహృతము)= అట్లు; పూజ్యేన=పూజింపఁదగిన; త్వయా=నీచేత; పూజితా = పూజింపఁబడినదై; మాం=నన్ను; సంచింతయంతీ= తలంచుకొనుచు; త్వయి=నీయందు; జీవేత్= జీవించియుండును.

శోచనీయయగుకౌసల్య, పుత్రదుఃఖమునొందకుండు నట్లు పూజ్యుండవగు నీవు, పూజింపుచుండుదువేని, యీబిడ, యెట్లయిన, నన్నుఁదలంచుకొనుచు, నీప్రాపున, బ్రతికియుండును.

అని, తాత్పర్యము.

ఇమాం మహేంద్రోపమ జాతగర్ధినీం
తథా విధాతుం జననీం మమా హర్సి
యథా వనస్థే మయి శోకకర్శితా
న జీవితం న్యస్య యమక్షయం వ్రజేత్. ౧౮

టీక॥ మహేంద్రోపమ=దేవేంద్రునితోఁబోల్కిగలదశరథుఁడా! యథా= ఎట్లు; మయి=నేను; వనస్థే=అడవినుండఁగా; శోకకర్శితా=దుఃఖముచేఁగృశింపఁజేయఁబడినదై; జీవితం=ప్రాణమును; న్యస్య=విడిచి; యమక్షయం=

యమునింటెని; నప్రజేత్=పొందకుండు నో; తథా=అట్లు; మమ=నాయొక్క; జననీం=తల్లియయిన; జాతగర్ధినీం=పుత్రునియందధికప్రేమగల; ఇమాం=ఈకౌసల్యను; విధాతుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

దేవేంద్రునకు సాటియయిన వాఁడా! పుత్రునియందధికస్నేహంబుగల నాతల్లికౌసల్య నేనరణ్యంబునకుఁ బోయినపిమ్మట, దుఃఖంబునంగృశించి, ప్రాణంబులు విడువకుండునట్లు, నీవాలిడ యందాదరంబుసూపుచుండవలయును. అని, రాముండు, దశరథునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము,

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, అష్టత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండాష్టత్రింశసర్గటీక
ముగిసినది.

---

ఏకోనచత్వారింశసర్గప్రారంభః.

రామస్యతు వచ శ్ర్శుత్వా మునివేషధరంచ తమ్
సమీక్ష్య సహభార్యాభీ రాజా విగతచేతనః. ౧

టీక॥ రాజా=దశరథమహారాజు; రామస్య=రామునియొక్క; వచః=మాటను; శ్రుత్వాతు=వినినంతనే; భార్యాభిస్సహ=భార్యలతోఁగూడ; మునివేషధరం = మునివేషమునుదాల్చిన; తం=ఆరాముని; సమీక్ష్య=చూచి; విగతచేతనః=పోయినతెలివిగలవాఁడు; అభవత్ (అధ్యాహృతము)=ఆయెను.

దశరథమహారాజు, రాముండు చెప్పినమాటనువిని, భార్యలతోఁగూడ, నతండు మునివేషంబుదాల్చియుండుటంజూచి పరమ దుఃఖంబునొంది, మూర్ఛపోయెను. అని, తాత్పర్యము.

నైనం దుఃఖేన సంతప్తః ప్రత్యవైక్షత రాఘవమ్
న చైన మభిసంప్రేక్ష్య ప్రత్యభాషత దుర్మనాః. ౨

టీక॥దుఃఖేన=దుఃఖముచేత; సంతప్తః=మిక్కిలియుఁదపింపఁజేయఁబడిన దశరథుఁడు;ఏనం=ఈః రాఘవం=రాముని;నప్రత్యవైక్షత=చూడనేలేదు. దుర్మనాః=దుఃఖమునొందినమనసుగలదశరథుఁడు;ఏనం= ఈరాముని;అభిసంప్రేక్ష్యచ = చూచియు;నప్రత్యభాషత=మాటలాడలేదు.

పరమదుఃఖితుండగు నాదశరథుండు,మునివేషధరుండగు రాముంజూడనే లేకపోయెను;చూచియు, దుఃఖంబున, నేమియుఁబలుకంజాలకుండెను.

అని, తాత్పర్యము.

స ముహూర్త మివాసంజ్ఞో దుఃఖిత శ్చ మహీపతిః
విలలాప మహాబాహూ రామమేవా నుచింతయన్. ౩

టీక॥ దుఃఖితః= దుఃఖమునొందిన; మహీపతిః=భూమికిఁబ్రభువైన; మహాబాహుః=పెద్దచేతులుగల; సః=ఆదశరథుఁడు;ముహూర్తం=కొంచెముసేపు;అసంజ్ఞఇవ(స్థితః)చ = తెల్విలేనివాఁడువలెనున్నవాఁడునై ; రామమేవ=రామునే;అనుచింతయన్ = ధ్యానించుచు;విలలాప=ఏడ్చెను.

మహాబాహుండగుదశరథుండు,దుఃఖితుండై,కొంతసేపు, మూర్ఛవోయినట్లుండి,రామునేతలంచుకొనుచు, రోదనంబుచేసెను.అని, తాత్పర్యము.

మన్యేఖలు మయా పూర్వం వివత్సా బహవః కృతాః
ప్రాణినో హింసితా వాపి తస్మా దిద ముపస్థితమ్. ౪

టీక॥మయా= నాచేత;పూర్వం=మునుపు;బహవః = అనేకులు; వివత్సాః = బిడ్డలవిడిచినవారలుగా;కృతాః = చేయఁబడిరి.ప్రాణినోవాపి=జంతువులయినను; హింసితాః=చంపఁబడినవి.తస్మాత్=అందువలన;ఇదం=ఇది;ఉపస్థితం=సంభవించినది. ఇతి (అధ్యాహృతము)=అని;మన్యేఖలు = త

లంచెదనుగదా!

నేను, మున్ననేకుల బిడ్డలం జంపి యుందును; లేక, ప్రాణిహింసనయినం జేసియుందును; కావున నే, నాకిట్టిపుత్ర దుఃఖముసంభవించినది.

అని, తాత్పర్యము.

న త్వేవా నాగతే కాలే దేహా చ్చ్యవతి జీవితమ్

టీక॥ కాలే= కాలము; అనాగతే= రా కుండఁగా; జీవితం= ప్రాణము; దేహాత్ = దేహముననుండి; న త్వేవచ్యవతి= జారదు.

అవసానకాలమురానిచో, నెవ్వనికిని, దేహముననుండి ప్రాణంబు పోనేపోదు. అని, తాత్పర్యము.

కైకేయ్యా క్లిశ్యమానస్య మృత్యు ర్మమ న విద్యతే. ౫
యో౽హం పావకసంకాశం పశ్యామి పురత స్స్థితమ్
విహాయ వసనే సూక్ష్మే తాపసాచ్ఛాద మాత్మజమ్. ౬

టీక॥ యః= ఏ; అహం= నేను; పావకసంకాశం= అగ్నిహోత్రునితో సమానుండును; సూక్ష్మే= సన్నములైన; వసనే= వస్త్రములను; విహాయ= విడిచి; తాపసాచ్ఛాదం = ఋషులవస్త్రంబులుగలవాఁడును; పురతః= ముందట; స్థితం= ఉన్నవాఁడునగు; ఆత్మజం= కొడుకును; పశ్యామి= చూచుచున్నానో; తస్య (అధ్యాహృతము)= అట్టివాఁడును; కైకేయ్యా= కైకేయిచేత; క్లిశ్యమానస్య= దుఃఖించుచున్నవాఁడనగు; మమ= నాకు; మృత్యుః= మరణము; నవిద్యతే= లేదు.

నేను, అగ్నిహోత్రునకుసాటియగునాకుమారుండు, సూక్ష్మవస్త్రంబులంబరిత్యజించి, మునులుగట్టుకొను నారచీరలం దాల్చి నాముందట నుండఁగాంజూచుచు, నిట్లు, కైకేయిచే బాధింపఁబడుచున్నను, నాకుమరణంబుగలుగకున్నది. అని, తాత్పర్యము.

ఏకస్యాః ఖలు కైకేయ్యాః కృతే౽యం క్లిశ్యతే జనః
స్వార్థే ప్రయతమానాయా స్సంశ్రిత్య నికృతిం త్విమామ్. ౭

టీక॥ఇమాం=ఈ;నికృతిం= కుట్రను;సంశ్రిత్య=పొందియె;స్వార్థే= తనకార్యమునిమిత్తమయి;ప్రియతమానాయాః= ప్రయత్నించుచున్న; ఏకస్యాః=ఒకర్తెయగుచున్న; కైకేయ్యాః కృతే=కైకేయికిఁగా;అయం=ఈ; జనః=జనము;క్లిశ్యతేఖలు=దుఃఖించుచున్నదిగదా!

ఇట్లుకుట్రనవలంబించి తనకార్యంబు చక్కఁబెట్టుకొనుటకైయే ప్రయత్నించుచున్నయొక్క కైకేయికిఁగా, నీజనులందఱును దుఃఖపడుచున్నారు గదా! దైవగతికేమిసేయవచ్చును!అని, దశరథుఁడేడ్చెను.. అని,తాత్పర్యము.

ఏవ ముక్త్వాతు వచనం బాష్పేణ పిహితేంద్రియః
రామేతి సకృదేవోక్త్వా వ్యాహర్తుం నశశాకహ. ౮

టీక॥సః (అధ్యాహృతము)=ఆదశరథుఁడు;ఏవం=ఇట్లు ; ఉక్త్వాతు= చెప్పినంతనె;బాష్పేణ= కన్నీటిచేత; పిహితేంద్రియః= కప్పఁబడిన యింద్రియములుగలవాఁడై; రామేతి = రాముఁడాయని; సకృదేవ= ఒక్కమాటే;ఉక్త్వా=చెప్పి;వ్యాహర్తుం= చెప్పుటకు;నశశాకహ=చాలఁడయ్యె.

ఆదశరథుఁడు,ఇట్లువిలపించి, కన్నీటందోఁగుకండ్లతో,"రాముఁడా" యనియొక్కమాటుమాత్రము చెప్పి, యాపైని, మాటలాడంజాలకుండెను.

అని,తాత్పర్యము.

సంజ్ఞాంతు ప్రతిలభ్యైవ ముహూర్తాత్స మహీపతిః
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం సుమంత్ర మిద మబ్రవీత్. ౯

టీక॥సః=ఆ;మహీపతిః = దశరథమహారాజు;ముహూర్తాత్=అల్పకాలమువలన; సంజ్ఞాంతు=తెలివిని; ప్రతిలభ్యైవతు=పొందినంతనె; అశ్రుపూర్ణాభ్యాం = కన్నీళ్లనిండిన;నేత్రాభ్యాం=కండ్లతో;సుమంత్రం = సుమంత్రునిగూర్చి;ఇదం=ఈమాటను; అబ్రవీత్=చెప్పెను.

దశరథుం, డంతఁగొంతసేపునకుఁదెలివొంది, కండ్లనిండఁ గన్నీరుగాఱఁగా,సుమంత్రుంజూచి, యిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

ఔపవాహ్యం రథం యుక్త్వా త్వ మాయాహి హయోత్తమైః
ప్రాపయ్యైనం మహాభాగ మితో జనపదా త్పరమ్. ౧౦

టీక॥త్వం=నీవు;ఔపవాహ్యం=మనుష్యులెక్కుటకుఁదగిన;రథం=రథమును; హయోత్తమైః = అశ్వశ్రేష్ఠములతోఁ; యుక్త్వా=కూర్చి; ఆయాహి=రమ్ము. మహాభాగం=పూజ్యమైన భాగ్యముగలఁ;ఏనం=ఈరాముని;ఇతః=ఇచ్చటనుండి;జనపదాత్=దేశమునకన్న;పరం=అవ్వల; ప్రాపయ=పొందింపుము.

నీవుపోయి, విలాసార్థమగానెక్కఁదగిన రథంబొకటిమంచిగుఱ్ఱంబులుగట్టి,యిచ్చటికిఁదెచ్చి, మహాభాగుండగునీరామునెక్కించుకొనిపోయి,యీదేశంబునకవ్వలనరణ్యంబునవదలిపెట్టిరమ్ము. అని, తాత్పర్యము.

ఏవం మన్యే గుణవతాం గుణానాం ఫల ముచ్యతే
పిత్రా మాత్రా చ య త్సాధు ర్వీరో నిర్వాస్యతే వనమ్. ౧౧

టీక॥గుణవతాం= గుణంబులు గలవారలయొక్క ; గుణానాం= గుణంబులయొక్క;ఫలం=ఫలము; ఏవం= ఇట్టిదిగా;ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. ఇతి(అధ్యాహృతము)= అని ; మన్యే= తలంచెదను.యత్ = ఎందువలన ; పిత్రా చ=తండ్రిచేతను;మాత్రా చ= తల్లిచేతను;సాధుః=సత్పురుషుండును;వీరః=పరాక్రమశాలియునగు కొడుకు; వనం=అడవినిగూర్చి;నిర్వాస్యతే= వెడలఁగొట్టఁబడుచున్నాఁడో.

తండ్రియుతల్లియుంజేసి, సత్పురుషుండునువీర్యవంతుండునగు కొడుకునరణ్యంబునకుఁబంపుచున్నారే, గుణవంతులకుగుణంబులుగలుగుటకిదియే ఫలమనితోఁచిందుచున్నది; నాకు సత్యాదిగుణములులేకున్న, నేనిట్లు, రామునరణ్యంబునకుఁబంపనుగదా! కావున , గుణంబులునుగొన్నిసమయంబులఁగష్టంబునిచ్చును. అనిదశరథుండు, సుమంత్రునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

రాజ్ఞో వచన మాజ్ఞాయ సుమంత్ర శ్శీఘ్రవిక్రమః
యోజయిత్వా యయౌ తత్ర రథ మశ్వై రలంకృతమ్. ౧౨

టీక॥సుమంత్రః = సుమంత్రుఁడు; రాజ్ఞః=దశరథమహారాజుయొక్క; వచనం=మాటను; ఆజ్ఞాయ=అంగీకరించి;శీఘ్రవిక్రమైః= శీఘ్రమయిననడకగలవాఁడై;అలంకృతం= అలంకరింపఁబడిన;రథం=రథమును; అశ్వైః=గుఱ్ఱములతో;యోజయిత్వా=కూర్చి; తత్ర=అచ్చటికి;ఆయయౌ=వచ్చెను.

సుమంత్రుండంత, రాజాజ్ఞనుశిరసావహించి, శీఘ్రంబుగాఁబోయి, రథంబునలంకరించి, గుఱ్ఱంబులుగట్టి యచ్చటికిఁదీసికొనివచ్చెను.

అని, తాత్పర్యము.

తం రథం రాజపుత్రాయ సూతః కనకభూషితమ్
ఆచచక్షేం జలిం కృత్వా యుక్తం పరమవాజిభిః. ౧౩

టీక॥సూతః= సారథియగుసుమంత్రుండు;అంజలిం= చేమోడ్పును;కృత్వా=చేసి;కనకభూషితం= బంగారముచేనలంకరింపఁబడినదియును;పరమవాజిభిః= ఉత్తమములయినగుఱ్ఱములతో;యుక్తం=కూడినదియునగు;తం=ఆ;రథం=రథమును; రాజపుత్రాయ=రాచకొమరుండగురామునికొఱకు;ఆచచక్షే=చెప్పెను.

సుమంత్రుండు,"బంగారముచేనలంకరింపఁబడినదియు నుత్తమాశ్వంబులుగట్టినదియునగు, రథంబాయత్తంబుగానున్న"దని, చేతులుమొగుడ్చుకొని, రాచకొమరుండగురామునకుం, జెప్పెను.

అని, తాత్పర్యము.

రాజా సత్వర మాహూయ వ్యాపృతం విత్తసంచయే
ఉవాచ దేశకాలజ్ఞం నిశ్చితం సర్వత శ్శుచిమ్. ౧౪

టీక॥రాజా= దశరథమహారాజు; దేశకాలజ్ఞం=దేశమునుగాలమునెఱింగినవాఁడును;నిశ్చితం= నిశ్చయముగలవాఁడును;సర్వతః=అన్నిటను;శుచిం=పరిశుద్ధుండునగు;విత్తసంచయే=కోశగృహమునందు;వ్యాపృతం=వ్యాపారముగలధనాధ్యక్షుని; సత్వరం=వేగముగలుగునట్లుగా;ఆహూయ=పిలిచి; ఉవాచ=చెప్పెను.

అంత,దశరథమహారాజు,ఏదేశంబు

ననేకాలంబుననేదిసేయవలయునో అవి యంతయుం దెలిసినవాఁడును నిశ్చయవంతుండును బాహ్యాభ్యంతరంబులనుం బరిశుద్ధుండునగుధనాధ్యక్షుని, సత్వరంబుగాఁబిలిచియిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

వాసాంసిచ మహార్హాణి భూషణాని వరాణి చ
వర్షాణ్యే తాని సంఖ్యాయ వైదేహ్యై క్షిప్ర మానయ. ౧౫

టీక॥ఏతాని=ఈ; వర్షాణి=సంవత్సరములను; సంఖ్యాయ=ఎంచుకొని; వైదేహ్యై=సీతకు; మహార్హాణి=శ్రేష్ఠములయిన; వాసాంసిచ= వస్త్రములను; వరాణి=శ్రేష్ఠములయిన; భూషణానిచ=సొమ్ములను; క్షిప్రం = శీఘ్రము గా; ఆనయ=తెమ్ము.

ఇప్పుడు, సీత యరణ్యంబున నుండవలసిన సంవత్సరంబులు లెక్కపెట్టుకొని, ఈపదునాలుగుసంవత్సరములకును జాలునట్లు, ఉత్తమంబులగు వస్త్రంబులును, మంచిసొమ్ములును, శీఘ్రముగాఁదెచ్చి, సీతకిమ్ము. అని, దశరథుండు, ధనాధ్యక్షునకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

నరేంద్రేణైవ ముక్తస్తు గత్వా కోశగృహం తతః
ప్రాయచ్ఛత్సర్వ మాహృత్య సీతాయై సమమేవ తత్. ౧౬

టీక॥సః(అధ్యాహృతము)తు=ఆధనాధ్యక్షుఁడును; నరేంద్రేణ= మనుష్యులకుఁబ్రభువైనదశరథునిచేత ; ఏవం= ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై ; తతః=అంత; కోశగృహం = బొక్కసముండుగృహమును; గత్వా= పొంది; తత్=అది; సర్వం=అంతయు; ఆహృత్య=తెచ్చి; సీతాయై= సీతకొఱకు; సమమేవ=సరిగానే ; ప్రాయచ్ఛత్= ఇచ్చెను.

అంత దశరథుండుచెప్పినట్లు, ధనాధ్యక్షుండు, కోశగృహమునకుఁబోయి, దశరథుండుచెప్పినవన్నియుఁదీసికొనివచ్చి, పదునాలుగు సంవత్సరములకునుం జాలునట్లు, సీతకొసంగెను.

అని, తాత్పర్యము.

సా సుజాతా సుజాతాని వైదేహీ ప్రస్థితా వనమ్

భూషయామాస గాత్రాణి తై ర్విచిత్రై ర్విభూషణైః. ౧౭

టీక॥సుజాతా= సుందరియయిన; సా=ఆ; వైదేహీ=సీతాదేవి; వనం=అడవినిగూర్చి; ప్రస్థితా=పయనమయినదై; సుజాతాని = సుందరములయిన; గాత్రాణి= అవయవములను ; విచిత్రైః=నానావిధములయిన; తైః= ఆ; విభూషణైః=సొమ్ములచేత ; భూషయామాస=అలంకరించుకొనెను.

సుందరియయినయాసీతాదేవి, యరణ్యంబునకుఁబయనంబయి , నానావిధంబులగునాభూషణంబులను , సుందరంబులయిన యవయవంబుల ధరించుకొని,యలంకరించుకొనెను.

అని, తాత్పర్యము.

వ్యరాజయత వైదేహీ వేశ్మ తత్సువిభూషితా
ఉద్యతోంశుమతః కాలే ఖం ప్రభేవ వివస్వతః. ౧౮

టీక॥సువిభూషితా=చక్కఁగా నలంకరింపఁబడిన; వైదేహీ= సీతాదేవి; తత్ =ఆ; వేశ్మ=ఇంటిని ; కాలే= ప్రాతఃకాలమునందు; ఉద్యతః= ఉదయించువాఁడును; అంశుమతః = కిరణంబులుగలవాఁడునగు ; వివస్వతః= సూర్యునియొక్క; ప్రభా=కాంతి; ఖమివ=ఆకాశమునుంబోలె; వ్యరాజయత=ప్రకాశింపఁజేసెను.

ప్రాతఃకాలంబున నూతన కిరణంబులతోనుదయించుచున్న సూర్యుని కాంతిచేనాకాశంబు ప్రకాశించునట్లు, అప్పుడు భూషణంబులం జక్కఁగానలంకృతయయియున్నసీతచే, నాగృహంబంతయుఁబ్రకాశించినది.

అని, తాత్పర్యము.

తాం భుజాభ్యాం పరిష్వజ్య శ్వశ్రూ ర్వచన మబ్రవీత్
అనాచరంతీం కృపణం మూర్ధ్న్యుపాఘ్రాయ మైథిలీమ్. ౧౯

టీక॥శ్వశ్రూః = అత్తయయినకౌసల్య; కృపణం=తుచ్ఛమయిన యాచారమును; అనాచరంతీం= చేయనిది యగు; తాం=ఆ; మైథిలీం=సీతను; బాహుభ్యాం=చేతులచేత; పరిష్వజ్య=కవుఁగిలించికొని; మూర్ధ్ని= తలయందు; ఉ

ప్రాఘాయ=మూర్ధానియందు; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంతనత్తయయినకౌసల్య, శుద్ధాచారంబులంజేయనట్టియాసీతను జేతులంగ్రుచ్చికౌగిలించికొని, శిరంబుమూర్కొనియిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

అసత్య స్సర్వలోకేఽస్మిన్ సతతం సత్కృతాః ప్రియైః
భర్తారం నానుమన్యంతే వినిపాత గతం స్త్రియః. ౨౦

టీక॥అస్మిన్=ఈ; సర్వలోకే= సమస్తలోకమునందు; అసత్యః= పతివ్రతలుగాని; స్త్రియః=స్త్రీలు; సతతం=ఎల్లప్పుడును; ప్రియైః=సంతోషకరంబులగువానిచేత; సత్కృతాః= సత్కరింపఁబడినవారలయ్యు; వినిపాతగతం=భ్రంశమునొందినట్టి; భర్తారం=పెనిమిటిని; నానుమన్యంతే=లెక్కింపరు.

ఈలోకమునందంతయు, దుష్టస్త్రీలు, తమకుఁబెనిమిటియెల్లప్పుడునుగౌరవదానినాసంగిసంతోషంబు సేయుచుండినను, అతనికిఁగొంచముకష్టదశ గల్గినప్పుడు, అతనినెంతమాత్రము లెక్కింపకుందురు. అని, తాత్పర్యము.

ఏష స్వభావో నారీణా మనుభూయ పురా సుఖమ్
అల్పా మప్యాపదం ప్రాప్య దుష్యంతి ప్రజహత్యపి. ౨౧

టీక॥పురా=మొదట; సుఖం=సౌఖ్యమును; అనుభూయ=అనుభవించి; అల్పామపి = కొంచెమునైనను; ఆపదం=ఆపదను; ప్రాప్య=పొంది; దుష్యంతి=దుష్టలగుచున్నారు. ప్రజహత్యపి=భర్తనువిడుతురు. ఏషః=ఇది; నారీణాం=స్త్రీలకు; స్వభావః = స్వభావము.

మొదట సుఖంబనుభవించునప్పుడు మంచివారలుగానుండి, యెంతోసుఖంబుననుభవించి, పిమ్మటభర్తకు దారిద్ర్యము మొదలగు నాపద గొంచెమువచ్చినను, దుష్టలయి, భర్తనువిడువంజూతురు ; ఇదిస్త్రీలకు స్వభావము. అని, తాత్పర్యము.

అసత్యశీలా వికృతా దుర్గాహ్యహృదయా స్తథా

యువత్యః పాపసంకల్పాః క్షణమాత్రా ద్విరాగిణః. ౨౨

టీక॥యువత్యః=స్త్రీలు; అసత్యశీలాః= అబద్ధమునాడుస్వభావముగలవారలు. వికృతాః=వికారముగలవారలు.తథా=అట్లు; దుర్గ్రాహ్యహృదయాః= ఎఱుంగరానిహృదయముగలవారలు.పాపసంకల్పాః= పాపమునే యటకైనసంకల్పముగలవారలు. క్షణమాత్రాత్ = క్షణకాలమువలననె;విరాగిణః(విరాగిణ్యః)=ప్రేమదప్పువారలు.

స్త్రీలు, ఎప్పుడునబద్ధమునెయాడుచుందురు; వికారముగలిగిప్రవర్తింతురు; వారిమనంబునెఱుంగరాదు; మఱియువారలు పాపమునే సేయఁగోరుచుందురు; స్వల్పమప్రియముగావించినను,అదివఱకున్నప్రేమనంతయువిడుతురు;కావునవారినమ్మరాదు.

అని, తాత్పర్యము.

నకులం నకృతం విద్యాం నదత్తం నాపిసంగ్రహమ్
స్త్రీణాం గృహ్ణాతి హృదయ మనిత్యహృదయాహి తాః. ౨౩

టీక॥స్త్రీణాం = స్త్రీలయొక్క; హృదయం=మనసు; కులం=మంచివంశమును;నగృహ్ణాతి = గ్రహింపదు.కృతం=చేయఁబడినయుపకారమును; న(గృహ్ణాతి) = గ్రహింపదు.విద్యాం=మంచివిద్యను;నగృహ్ణాతి (అధ్యాహృతము)=గ్రహింపదు;దత్తం= ఇయ్యఁబడినదానిని;న(గృహ్ణాతి)=గ్రహింపదు. సంగ్రహమపి= మన్నననైనను;న(గృహ్ణాతి) = గ్రహింపదు. తాః= ఆస్త్రీలు;అనిత్యహృదయాహి= చపలమయినమనసుగలవారలుగదా!

స్త్రీలమనసు, సత్కులమును గాని యుపకారమును గాని విద్యను గాని ధనాదులను గాని లోకమర్యాదను గాని దేనిని లెక్కింపదు; వారలమనసు మిక్కిలి యుఁజపలముగానుండును; కావునవారలనమ్మఁగరాదు. (అని,కౌసల్యకపటముగాఁ,గైకేయినినిందించినది).

అని, తాత్పర్యము.

సాధ్వీనాం హి స్థితానాం తు శీలే సత్యే శ్రుతే శమే

స్త్రీణాం పవిత్రం పరమం పతిరేకో విశిష్యతే. ౨౪

టీక॥ శీలే = సదాచారమునందును; సత్యే = సత్యమునందును; శ్రుతే = వినఁబడినదానియందును, గురుజనులుతమకుఁజేసినయుపదేశమునందును; శమే = శాంతియందును; స్థితానాం = ఉన్నట్టి; సాధ్వీనాం = పతివ్రతలయిన; స్త్రీణాంతు = స్త్రీలకుమాత్రము; పరమం = అన్నిటికన్ననధికమయిన; పవిత్రం = పరిశుద్ధముసేయునట్టి; పతిః = పెనిమిటి; ఏకః = ఒక్కఁడె; విశిష్యతేహి = అధికుఁడగుచున్నాఁడుగదా!

సదాచారము నవలంబించి సత్యాంబుదప్పక గురుజనులుపదేశించినట్లు కోపంబెంతమాత్రములేక ప్రవర్తించుచున్నట్టిపతివ్రతలగువారలకుఁ, బరమపావనరూపుఁడయినపెనిమిటియొక్కఁడే, యధికుఁడు; మఱేదియుఁగాదు.

అని, తాత్పర్యము.

స త్వయా నావమంతవ్యః పుత్రః ప్రవ్రాజితో మమ
తవ దైవత మస్త్వేష నిర్ధన స్సధనోపివా. ౨౫

టీక॥ ప్రవ్రాజితః = వనంబునకుఁబంపఁబడిన; మమ = నాయొక్క; సః = ఆ; పుత్రః = కొడుకైనరాముఁడు; త్వయా = నీచేత; నావమంతవ్యః = అవమానింపఁబడఁగూడదు. ఏషః = ఈరాముఁడు; నిర్ధనః = ధనములేనివాఁడుగాని; సధనోపివా = ధనముతోఁ గూడినవాఁడుగాని; తవ = నీయొక్క; దైవతం = దేవతగా; అస్తు = అగుఁగాక.

అట్లు, దుష్టస్త్రీస్వభావంబు నవలంబించి, నీవు, వనంబునకుఁబంపఁబడినాఁడని, నాకొడుకునవమానింపవలదు; ఇతండుదరిద్రుండైనను ధనికుండైననేమి! నీవితని దేవతగాఁ జూచుకొనుచుండుము. అని, కౌసల్యసీతకుఁజెప్పినది.

అని, తాత్పర్యము.

విజ్ఞాయ వచనం సీతా తస్యా ధర్మార్థసంహితమ్
కృతాంజలి రువాచేదం శ్వశ్రూ మభిముఖే స్థితామ్. ౨౬

టీక॥ సీతా = సీతాదేవి; తస్యాః = ఆకౌసల్య యొక్క; ధర్మార్థసంహితం = ధర్మమను ప్రయోజనముతోఁగూడిన; వచనం = మాటను; విజ్ఞాయ =

తెలుసుకొని; కృతాంజలిః=చేయఁబడినచేమోడ్పుగలదై; అభిముఖే=ఎదుటనున్న; స్థితాం=ఉన్న; శ్వశ్రూం=అత్తను గూర్చి; ఇదం=ఈమాటను; ఉవాచ=చెప్పెను.

సీతాదేవి, కౌసల్య చెప్పినమాట ధర్మిష్ఠముగానున్నదని తెలిసికొని, తన యెదుటనున్న కౌసల్యఁజూచి, చేమోడ్పుగీలించి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కరిష్యే సర్వమేవాహ మార్యా య దనుశాస్తి మామ్
అభిజ్ఞాస్మి యథాభర్తు ర్వర్తితవ్యం శ్రుతంచ మే. ౨౭

టీక ॥ ఆర్యా=పూజ్యురాలవగునీవు; మాం=నన్నుఁగూర్చి; యత్=దేనిని; అనుశాస్తి=ఆజ్ఞాపించుచున్నావో; తత్ (అధ్యాహృతము)=దానిని; సర్వమేవ=అంతనే; కరిష్యే=చేసెదను. యథా=ఎట్లు; భర్తుః=(సప్తమ్యర్థమందు షష్ఠి) పెనిమిటివిషయమై; వర్తితవ్యం=ఉండవలయునో; అభిజ్ఞా=తెలిసినదానను; అస్మి=అగుచున్నాను. మే=నాకు; శ్రుతంచ=వినఁబడినదియు.

పూజ్యురాలవగు నీవు నాకేదియాజ్ఞాపించుచున్నావో, అదంతయునట్లె చేసెదను; పెనిమిటివిషయమైనేనెట్లుండవలయునో, అదినాకుం దెలియును; నేనువినియున్నాను. అని, తాత్పర్యము.

న మా మసజ్జనే నార్యా సమానయితు మర్హతి
ధర్మా ద్విచలితుం నాహ మలం చంద్రా దివ ప్రభా. ౨౮

టీక ॥ ఆర్యా=పూజ్యురాలవగునీవు; మాం=నన్ను; అసజ్జనేన=దుష్టజనముతో; సమానయితుం=సాటిసేయుటకు; నార్హతి=తగవు. అహం=నేను; ధర్మాత్=ధర్మముననుండి; చంద్రాత్=చంద్రునియందుండి; ప్రభేవ=కాంతివలె; విచలితుం=చలించుటకు; నాలం=సమర్థురాలనుగాను.

పూజ్యురాలవగునీవు, నన్ను దుష్టస్త్రీలతో సాటిసేయవలదు; కాంతి, చంద్రునివిడువఁజాలనట్లు, నేను, ధర్మంబునెంతమాత్రమును, విడువఁజాలను.

అని, తాత్పర్యము.

నా తంత్రీ వాద్యతే వీణా నా చక్రో వర్తతే రథః
నా పతి స్సుఖ మేధేత యా స్యాదపి శతాత్మజా. ౨౯

టీక॥ అతంత్రీ = తంత్రులులేని; వీణా = వీణె; నవాద్యతే = వాయింపఁబడదు. అచక్రః = చక్రములులేని; రథః = రథము; నవర్తతే = ఉండదు. యా = ఎవ్వతె; శతాత్మజా = నూఱుకొడుకులుగలది; స్యాదపి = అయినను; అపతిః = పెనిమిటిలేనిది; సుఖం = సుఖముగా; నైధేత = వృద్ధినొందదు.

వీణెకుఁదంత్రులులేనిచో, వాయింపరాదు; రథమునకుఁజక్రంబులులేనిచో నడవదు; అట్లునూఱుకొడుకులు గలదయ్యును, స్త్రీకిం బెనిమిటలేనిచో, సదిసుఖంబునొందంజాలదు.

అని, తాత్పర్యము.

మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః
అమితస్య హి దాతారం భర్తారం కా నపూజయేత్. ౩౦

టీక॥ పితా = తండ్రి; మితం = కొలందిగలదానిని; దదాతిహి = ఇచ్చుచున్నాఁడుగదా; మాతా = తల్లి; మితం = కొలఁదిగలదానిని; దదాతి (అధ్యాహృతము) = ఇచ్చుచున్నది; సుతః = కొడుకు; మితం = కొలఁదిగలవానిని; దదాతి (అధ్యాహృతము) = ఇచ్చుచున్నాఁడు; అమితస్య = కొలందిలేనిదానియొక్క; దాతారం = ఇచ్చునట్టి; భర్తారంహి = పెనిమిటినిగూడ; కా = ఎవ్వతె; నపూజయేత్ = పూజింపదు.

స్త్రీకిఁదండ్రిపరిమితిగానేయిచ్చును, తల్లియుఁబరిమితిగానేయిచ్చును, కొడుకునుబరిమితిగానేయిచ్చును; పెనిమిటియిచ్చుదానికి మాత్రము పరిమితిలేదు, అట్టిపెనిమిటి నెవ్వతె పూజింపకుండును? అట్లుపూజింపనిది దుష్టురాలని చెప్పవలయును. అని, తాత్పర్యము,

సాహ మేవం గతా శ్రేష్ఠా శ్రుతధర్మపరావరా
ఆర్యే కి మవమన్యే హం స్త్రీణాం భర్తా హి దైవతమ్. ౩౧

టీ॥ ఆర్యే = పూజ్యురాలవగు కౌసల్యా; ఏవంగతా = ఇట్లు పాతివ్రత్యముఁబొందిన

దానను ; శ్రేష్ఠాః శ్రుత ధర్మాః పరావ రాః=ఉత్తమలగువారలవలన వినఁబడిన ధర్మములయొక్క సామాన్యవిశేషము లుగలదానను; సా=అట్టి ; అహం= నేను; కిం=ఎందువలన; అవమన్యే=అవ మానింతును; స్త్రీణాం=స్త్రీలకు; భర్తా=పెనిమిటి; దైవతంహి= దేవత కదా.

ఇట్లు పాతివ్రత్యంబవలంబించి యున్నదానను, మహాపతివ్రతలయినవారివలన, ధర్మంబులసంగతియంతయు వినియున్నదాననగునట్టి నేనేల పెనిమిటిన వమానింతును, ఎంతమాత్రమునవమానింపను; స్త్రీలకుఁ బెనిమిటి దేవతగదా! అని, సీత కౌసల్యతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సీతాయా వచనం శ్రుత్వా కౌసల్యా హృదయంగమమ్
శుద్ధసత్త్వా ముమోచాశ్రు సహసా దుఃఖహర్షజమ్. ౩౨

టీక॥ శుద్ధసత్త్వా=శుద్ధమయిన సత్త్వగుణముగల; కౌసల్యా=కౌసల్య; హృదయంగమం= మనోహరమయిన; సీతాయాః=సీతయొక్క; వచనం = మాటను; శ్రుత్వా=విని; సహసా =శీఘ్రముగా; దుఃఖహర్షజం=దుఃఖమువలనను సంతోషమువలనను బుట్టిన; అశ్రు=కన్నీటిని; ముమోచ=విడిచెను.

పరిశుద్ధంబగు సత్త్వగుణముగల కౌసల్యాదేవి, సీతాదేవి చెప్పిన సంతోషకరంబగుమాటను విని, అప్పుడే, రాముం డరణ్యంబునకుఁ బోనున్నాఁడే యని దుఃఖంబును సీత యింత పతివ్రతగా నున్నదని సంతోషంబునం బెనంగొనఁ, గండ్లనిండఁగన్నీరు గార్చెను. అని, తాత్పర్యము.

తాం ప్రాంజలి రభిక్రమ్య మాతృమధ్యే ఽతిసత్కృతామ్
రామః పరమధర్మాత్మా మాతరం వాక్య మబ్రవీత్. ౩౩

టీక॥ పరమధర్మాత్మా=మిక్కిలి యుధర్మబుద్ధిగల; రామః= రాముఁడు; మాతృమధ్యే=తల్లులనడుమ; అతిసత్కృతాం=మిక్కిలియుఁ బూజింపఁబడిన; మాతరం=తల్లియయిన; తాం= ఆకౌసల్యను; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై; అభిక్రమ్య=ప్రదక్షిణించి; వాక్యం=మాటను; అబ్రవీత్=

చెప్పెను.

పరమధార్మికుండగు రాముండు, తల్లులందఱిచేతనుమిక్కిలియుఁబూజింపఁబడినతల్లికౌసల్యకుఁ, జేమోడ్పుగిలించి,ప్రదక్షిణముచేసి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అంబ మా దుఃఖితా భూస్త్వం పశ్య త్వం పితరం మమ
క్షయోహి వనవాసస్య క్షిప్రమేవ భవిష్యతి. ౩౮

టీక॥అంబ=తల్లీ! త్వం=నీవు; దుఃఖితా = దుఃఖముగలదానవు; మా భూః=కావలదు. త్వం=నీవు;మమ=నాయొక్క; పితరం=తండ్రిని;పశ్య=చూడుము. వనవాసస్య=అరణ్యమున నుండుటయొక్క; క్షయః=తీఱుఁగుట; క్షిప్రమేవ=శీఘ్రముగానే; భవిష్యతి=కాఁగలదు.

తల్లీ! నేనువనంబుననుండవలసిన పదనాలుగుసంవత్సరములు శీఘ్రముగా నేగడచిపోవును; కావున; నీవుదుఃఖింపకుము; నాతండ్రిని జూచుకొనుచుండుము. అని, తాత్పర్యము.

సుప్తాయా స్తే గమిష్యంతి నవవర్షాణి పంచచ
సా సమగ్ర మిహ ప్రాప్తం మాం ద్రక్ష్యసి సుహృద్వృతమ్. ౩౯

టీక॥ తే=నీవు; సుప్తాయాః=నిదురపోవుచుండఁగా;వర్షాణి=సంవత్సరములు;నవ=తొమ్మిదియు; పంచచ=ఐదును,పదునాలుగనుట; గమిష్యంతి=కడచును. సా=అట్టినీవు; ఇహ=ఇచ్చటికి;ప్రాప్తం =వచ్చినవాఁడును; సమగ్రం=సంపూర్ణుఁడును; సుహృద్వృతం=స్నేహితులచేఁ జుట్టఁబడినవాఁడునగు;మాం=నన్ను ; ద్రక్ష్యసి=చూడఁగలవు.

నీవు,కొంచెముసేపు కండ్లుమూసుకొనినిద్రపొమ్ము; ఇంతలోఁబదునాలుగుసంవత్సరంబులుగడచిపోవును; అంత,నిచ్చటికివచ్చి స్నేహితులంగూడి సంపూర్ణకాముండనైయున్న నన్నుం, జూడఁగలవు. అని, రాముండు, తల్లితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఏతావ దభినీతార్థ ముక్త్వా స జననీం వచః

త్రయశ్శత శతార్ధాశ్చ దదర్శా వేక్ష్య మాతరః. ౩౬

టీక॥సః=ఆరాముఁడు;జననీం=తల్లియగు కౌసల్యనుగూర్చి; అభినీతార్థం = వినయముతోఁగూడినయర్థముగలుగునట్లు;ఏతావత్=ఇంతవఱకు; ఉక్త్వా=చెప్పి; అవేక్ష్య=చూచి, విమర్శించియనుట ; త్రయశ్శతశతార్ధాః=మున్నూఱునునూటిలోసగమును (ఏఁబదియనుట) ప్రమాణముగాఁగల, మున్నూట యేఁబదిమందియనుట; మాతరః=తల్లులను;దదర్శ=చూచెను.

రాముండు,తల్లికిసవినయముగానింతమట్టుకుఁజెప్పి, యంత, తనతల్లులను మున్నూటయేఁబదిమందిని , విమర్శించి,చూచెను.అని, తాత్పర్యము.

తాశ్చాపి స తథైవార్తా మాతౄ ర్దశరథాత్మజః
ధర్మయుక్త మిదం వాక్యం నిజగాద కృతాంజలిః. ౩౭

టీక॥ దశరథాత్మజః = దశరథునికొడుకైనరాముండు; తథైవ=అట్లే, ఆర్తాః=దుఃఖితులయిన; తాః=ఆ; మాతరశ్చాపి = తల్లులనుంగూర్చి; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; ధర్మయుక్తం=ధర్మముతోఁగూడిన;ఇదం=ఈ;వాక్యం=మాటను;నిజగాద=చెప్పెను.

దశరథపుత్రుండగు రాముండు, ఆలాగే, దుఃఖితలయియున్నయాతల్లులంజూచి చేమోడ్పుగీలించి. ధార్మికంబగునీమాటం జెప్పెను. అని, తాత్పర్యము.

సంవాసా త్పరుషం కించి దజ్ఞానా ద్వాపి యత్కృతమ్
త న్మే సమనుజానీత సర్వా శ్చామంత్రయామి వః. ౩౮

టీక॥ సంవాసాత్=చిరపరిచయమువలననైనను; అజ్ఞానాద్వాపి=అజ్ఞానమువల్లనైనను; యత్=ఏ;పరుషం= అపరాధము;కించిత్=కొంచెము;కృతం=చేయఁబడినదో; మే = నాయొక్క; తత్=ఆయపరాధమును; సమనుజానీత=క్షమింపుఁడు. వః=మిమ్ములను; సర్వాశ్చాపి= అందఱునుంగూడ; ఆమం

త్రయామి=వీడుకొనెదను.

చిరపరిచయదోషంబునంగాని యజ్ఞానంబునంగాని; నేనేమైన నపరాధంబుచేసియుండునేని దానిని మీరుక్షమించుఁడు; మిమ్ములనందఱను వీడ్కొనియెదను. అని రాముండు ఆతల్లులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

వచనం రాఘవస్యైత ద్ధర్మయుక్తం సమాహితమ్
శుశ్రువు స్తా స్త్రియ స్సర్వా శ్శోకోపహతచేతసః. ౩౯

టీక॥ తాః=ఆ; స్త్రియః=స్త్రీలు; సర్వాః=అందఱును; శోకోపహతచేతసః=దుఃఖముచేఁ గొట్టఁబడినమనసుగలవారలై; ధర్మయుక్తం=ధర్మముతోఁగూడినదియును; సమాహితం=మంచియర్థముగలదియునగు; రాఘవస్య=రామునియొక్క; ఏతత్=ఈ; వచనం=మాటను; శుశ్రువుః=వినిరి.

ఆదశరథభార్యలందఱు మహాదుఃఖంబున ధర్మయుక్తంబును మంచియర్థంబుగలదియునగు రాముని మాటను వినిరి,

అని, తాత్పర్యము.

జజ్ఞే థ తాసాం సన్నాదః క్రౌంచీనా మివ నిస్స్వనః
మానవేంద్రస్య భార్యాణా మేవం వదతి రాఘవే. ౪౦

టీక॥ రాఘవే=రాముఁడు; ఏవం=ఇట్లు; వదతి=చెప్పుచుండగా; క్రౌంచీనాం=ఆఁడక్రౌంచపక్షులయొక్క; నిస్స్వనఇవ=ధ్వనివలె; తాసాం=ఆ; మానవేంద్రస్య=మనుష్యులకుఁ బ్రభువైన దశరథ మహారాజుయొక్క; భార్యాణాం=భార్యలయొక్క; సన్నాదః=ధ్వని; జజ్ఞే=కలిగినది.

రాముండిట్లు సెప్పుటనువిని, యాదశరథభార్యలు, ఆఁడక్రౌంచపక్షులంబోలె, మనోహరంబగుకంఠస్వరంబున, రోదనంబుచేసిరి. అని, తాత్పర్యము.

మురజపణవమేఘఘోషవ
ద్దశరథవేశ్మ బభూవ యత్పురా

విలపితపరిదేవ నాకులం
వ్యసనగతం తదాభూత్సుదుఃఖితమ్. ౪౧

టీక॥పురా=మునుపు;యత్=ఏ;దశరథవేశ్మ=దశరథునిఇల్లు;మురజ పణవ మేఘ ఘోషవత్= మృదంగములయొక్కయు నుదుకలయొక్కయు మేఘమనువాద్యముయొక్కయుధ్వనులు గలది; బభూవ=ఆయెనో;తత్=అది; వ్యసనగతం=ఆపదనుబొందినదయి ,ఆపదనుబొందినజనముగలదియునుట; సుదుఃఖితం=మిక్కిలియు దుఃఖమునొందినదియు,మిక్కిలియు దుఃఖమునొందిన జనులుగలదియుననుట;విలపితపరిదేవనాకులం=నానావిధములయిన మాటలచేతను ఏడ్పులచేతను వ్యాకులమయినదియు నై; అభూత్=అయినది.

మున్ను,నిత్యంబును వాయింపఁ బడుచుండు మృదంగంబులయు నుదుకలయు మేఘంబులనువాద్యవిశేషంబులయు ధ్వనులనొప్పుచుండిన, దశరథునిల్లు అప్పుడు, అందలిజనులందఱు నాపదనొందిమిక్కిలియు దుఃఖింపుచు కైకేయిని నిందింపుచు రామునిం బ్రస్తుతించుచునిట్లు నానావిధ వాక్యంబులాడుకొనుచుండ, నామాటలచేతను,వారలరోదనధ్వనులచేతను,వ్యాకులంబై యుండినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,ఏకోనచత్వారింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండఏకోనచత్వారింశసర్గటీక
ముగిసినది.

---

చత్వారింశసర్గప్రారంభః.

అథ రామశ్చ సీతాచ లక్ష్మణశ్చ కృతాంజలిః
ఉపసంగృహ్య రాజానం చక్రు దీనాః ప్రదక్షిణమ్. ౧

టీక॥అథ=అటుపిమ్మట; రామశ్చ=రాముఁడును; సీతాచ=సీతయును; లక్ష్మణశ్చ=లక్ష్మణుండును ; కృతాంజలిః (కృతాంజలయః) = చేయఁబడినచేమోడ్పుగలవారలై; రాజానం=దశరథమహారాజును; ఉపసంగృహ్య=నమస్కరించి; దీనాః=దుఃఖితులయి, ప్రదక్షిణం = ప్రదక్షిణమును ; చక్రుః=చేసిరి.

అంత, రాముండును, సీతయును, లక్ష్మణుండును, మువ్వురును, చేతులు మొగుడ్చుకొని, దశరథునకు నమస్కరించి, వృద్ధులగు తలిదండ్రులను విడిచిపోవలయునే అనిదుఃఖితులయి, ప్రదక్షిణము చేసిరి. అని, తాత్పర్యము.

తం చాపి సమనుజ్ఞాప్య ధర్మజ్ఞ స్సీతయాసహ
రాఘవ శ్శోకసమ్మూఢో జననీ మభ్యవాదయత్. ౨

టీక॥ధర్మజ్ఞః=ధర్మము నెఱింగిన; రాఘవః=రాముండు; తంచాపి= ఆలక్ష్మణునింగూడ , సీతయాసహ= సీతతోఁగూడ; సమనుజ్ఞాప్య = అనుమతింపఁజేసి; శోకసమ్మూఢః = దుఃఖముచే మోహమునొందినవాఁడై; జననీం=తల్లిని; అభ్యవాదయత్ = నమస్కరించెను.

రాముండు , ధర్మంబు నెఱింగినవాఁడు గావున, దశరథుని యనుమతిలేకసీతాలక్ష్మణులుతన వెంటరాఁగూడదని తెలిసికొని, వారలకునుదశరథునిచే ననుజ్ఞనిప్పించి, "తల్లిని విడిచిపోవలయునే" యనిమిక్కిలియుదుఃఖితుండై, తల్లియగుకౌసల్యనునమస్కారముచేసెను.
అని, తాత్పర్యము.

అన్వక్షం లక్ష్మణో భ్రాతుః కౌసల్యా మభ్యవాదయత్

టీక॥లక్ష్మణః=లక్ష్మణుఁడు; భ్రాతుః=అన్నకు; అన్వక్షం=వెంటనే, కౌసల్యాం=కౌసల్యను ; అభ్యవాదయత్=నమస్కరించెను.

తనయన్న రాముండు కౌసల్యకునమస్కారము జేసిన వెంటనే, లక్ష్మణుండు, కౌసల్యకునమస్కారము జేసెను,
అని, తాత్పర్యము.

అథ మాతు స్సుమిత్రాయా జగ్రాహ చరణౌ పునః. ౩

టీక॥లక్ష్మణః(అధ్యాహృతము)=లక్ష్మణుండు; అథ=అటుపిమ్మట; పునః=మరల; మాతుః=తల్లియయిన; సుమిత్రాయాః=సుమిత్రయొక్క; చరణౌ=పాదములను; జగ్రాహ = పట్టుకొనెను.

లక్ష్మణుండట్లుకౌసల్యకు నమస్కరించినపిమ్మట, దనతల్లియయిన సుమిత్రపాదంబులకు నమస్కారముచేసెను. అని, తాత్పర్యము.

తం వందమానం రుదతీ మాతా సౌమిత్రి మబ్రవీత్
హితకామా మహాబాహుం మూర్ధ్న్యుపాఘ్రాయలక్ష్మణమ్.౪

టీక॥మాతా = తల్లియయినసుమిత్ర;హితకామా=మేలుగోరుచున్నదై; రుదతీ=ఏడ్చుచు;వందమానం = నమస్కరించువాడును; మహాబాహుం=పెద్దచేతులుగలవాడును; సౌమిత్రిం=సుమిత్రకొడుకునగు;తం = ఆ;లక్ష్మణం=లక్ష్మణుని;మూర్ధ్ని= తలయందు;ఉపాఘ్రాయ=మూర్కొని; అబ్రవీత్ =పలికెను.

తల్లియగుసుమిత్ర, రోదనంబు సేయుచు,లక్ష్మణునిహితంబుఁగోరి, తనకునమస్కరించుచున్న మహాబాహుండగులక్ష్మణునెత్తి, శిరంబుమూర్కొని, యిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

సృష్ట స్త్వం వనవాసాయ స్వనురక్త స్సుహృజ్జనే
రామే ప్రమాదం మాకార్షీః పుత్ర భ్రాతరి గచ్ఛతి.౫

టీక॥పుత్ర=కొడుకా! త్వం=నీవు; సుహృజ్జనే = స్నేహితజనమునందు; స్వనురక్తః= మిక్కిలియనురాగముగలవాఁడవై;వనవాసాయ= అరణ్యంబుననుండుటకొఱకు;సృష్టః= సృజింపఁబడినావు.భ్రాతరి=అన్నయగు; రామే= రాముఁడు;గచ్ఛతి = పోవుచుండగా, ప్రమాదం=ఏమఱుపాటును; మాకార్షీః=చేయకుము.

కొడుకా!నిన్ను, అడవిలోనుండుటకై యిట్లు, స్నేహితుఁడగు రామునియందనురక్తునిఁ గాదైవము సృజించినది;నీయన్నరాముండు భార్యతోఁగూడ వనంబునందలివైచిత్రిం జూచుచుఁబరవశుండై పోవుచుండునప్పుడు, నీవేమఱియుండవలదు.అని,తాత్పర్యము.

లేక;కొడుకా!కౌసల్యయెట్లు లోకసంరక్షణార్థము రామునింగన్నదో,

అట్లు నేనును, రామునియందు మిక్కిలి యనురాగంబుగలనిన్ను, వనంబులో రామునకుఁబరిచర్య సేయుటకై, కంటి ని,కావున, రాముండడవికిఁబోవుచుండఁ గా,నీవేమఱకయతనినిరీక్షించుచుము.

అని తాత్పర్యము.

లేక;పుత్ర=కొడుకా!సుహృజ్జనే= స్నేహితజనమునందు ; స్వనురక్తః= మిక్కిలియను రాగంబుగల ; త్వం=నీ వు;వనవాసాయ=అడవిలో నుండుట కొఱకు;మయా (అధ్యాహృతము) = నాచేత;సృష్టః=విడువఁబడినావు;భ్రాతరి=అన్నయగు;రామే= రాముఁడు; గచ్ఛతి=పోవుచుండఁగా;ప్రమాదం=ఏ మఱుపాటును; మాకార్షీః= చేయ వలదు.

కొడుకా!నీవిచ్చటనుండు నీస్నేహి తులయందుమిక్కిలియనురాగంబు గల వాఁడ వయినను రాముండడవికిఁబోవు చున్నాఁడుగావున నీవు సరణ్యంబునకు, బోవలయునని నాయభిప్రాయము; కా వున రాముండడవికిఁ బోవుచుండఁగా, నీవిచ్చట నేయుండరాదు; నీవునతనివెం టంబొమ్ము.అని, తాత్పర్యము.

వ్యసనీవా సమృద్ధోవా గతిరేష తవానఘ
ఏష లోకే సతాంధర్మో యజ్జ్యేష్ఠవశగోభవేత్. ౬

టీక॥అనఘ= పాపరహితుండవగు లక్ష్మణుఁడా;వ్యసనీవా= దుఃఖముగల వాఁడుగాని;సమృద్ధోవా= సంపదగల వాఁడుగాని;ఏషః=ఈరాముఁడు;తవ= నీకు;గతిః=శరణము; జ్యేష్ఠవశానుగః= అన్నయధీనతనుబొందువాఁడు ;భవేత్ (ఇతి)యత్( అస్తి )అనునది యేదిగల దో;ఏషః=ఇది;లోకే=లోకమునందు; సతాం=పెద్దలయొక్క; ధర్మః= ధర్మము.

పాపరహితుండవగులక్ష్మణుఁడా ఈరాముఁడునిర్ధనుండై యుండినను, రాజ్యంబునొందియుండిననేమి? యతం డేనీకుశరణము;ఏలయనగాఁ, గనిష్ఠుం డుజ్యేష్ఠునకు,లోఁబడియుండుట , లో కంబునందంతయు , పెద్దలాచరించుధ ర్మము.అని, తాత్పర్యము.

ఇదంహి వృత్తముచితం కులస్యాస్య సనాతనమ్
దానం దీక్షాచ యజ్ఞేషు తనుత్యాగో మృధేషుచ. ౭

టీక॥ఇదం= ఈ జ్యేష్ఠననుసరించుట యు; దానం=ఈవియు; యజ్ఞేషు=యాగమునందు; దీక్షా చ=దీక్షయును ; మృధేషు=యుద్ధములందు; తనుత్యాగశ్చ= దేహంబువిడుచుటయును; అస్య=ఈ; కులస్య=వంశమునకు; ఉచితం=తగినది యును; సనాతనం =సత్యమునగు; వృత్తంహి=ఆచారముగదా!

ఇట్లు, జ్యేష్ఠననుసరించుటయు, దానంబు సేయుటయు, యాగంబులందుదీక్ష వహించుటయు, యుద్ధంబున దేహంబు విడుచుటయు, ఇవన్నియు మీవంశంబు నకుఁదగినవియు సనాతనంబులునగుధర్మములు అని, సుమిత్రలక్ష్మణునితోఁ జెప్పెను. అని తాత్పర్యము.

లక్ష్మణం త్వేవ ముక్త్వాసా సంసిద్ధం ప్రియ రాఘవమ్
సుమిత్రా గచ్ఛగచ్ఛేతి పునఃపున రువాచ తమ్. ౮

టీక॥ సా=ఆ; సుమిత్రా=సుమిత్ర; సంసిద్ధం=పోవనిశ్చయించినవాఁడును; ప్రియ రాఘవం=ఇష్టుఁడయిన రాముఁడుగల వాఁడునగు; లక్ష్మణంతు = లక్ష్మణుని గూర్చియె; ఏవం=ఇట్లు; ఉక్త్వా= చెప్పి; గచ్ఛ గచ్ఛేతి = పొమ్ము పొమ్మని; తం = అతనిఁగూర్చి; పునఃపునః= మాటిమాటికి; ఉవాచ=చెప్పెను.

సుమిత్ర, రామునితో సరణ్యంబున కుఁబోవనుద్యుక్తుఁడయి, రాముండుద క్క్రమతేదియుఁ బ్రియపదార్థములే కుండునట్టిలక్ష్మణున,కీప్రకారముచెప్పి, మాటిమాటికి,నీవువనంబునకుఁ బొమ్మ నిచెప్పెను. అని, తాత్పర్యము.

రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్. ౯

టీక॥ రామం = రామునిదశరథం=దశరథునిఁగా; తండ్రినిగాననుట; విద్ధి=ఎఱుంగుము. జనకాత్మజాం= జనకమహారాజుకూఁతురయిన సీతను ; మాం=నన్నుఁగా,తల్లినిగాననుట; విద్ధి=ఎఱుంగుము. అటవీం=అడవిని ; అయోధ్యాం= అయోధ్యాపట్టణమును గా; విద్ధి=ఎఱుంగుము. తాత = నాయనా! యథాసుఖం=సుఖమగునట్లు ; గచ్ఛ=పొమ్ము.

స ౪౦

రామునిఁదండ్రిగాఁదలంపుము; సీతను తల్లిగాఁదలంపుము; అడవినే యయోధ్యగాఁదలంపుము; ఇంక, సుఖంబుగా, వనంబునకుఁబొమ్ము.

అని, తాత్పర్యము.

విశేషార్థము.—రామం = రాముని; దశరథం = పక్షిమెరథముగాఁ గలవానిఁగా, విష్ణుదేవునిగాననుట; విద్ధి = ఎఱుంగుము. జనకాత్మజాం = సీతను; మాం = లక్ష్మీదేవినిగా; విద్ధి = ఎఱుంగుము. అటవీం = అడవిని; అయోధ్యాం = ఎదిరింపరానివైకుంఠపురినిగా; విద్ధి = ఎఱుంగుము. తాత = నాయనా! యథాసుఖం = సుఖమగునట్లుగా; గచ్ఛ = పొమ్ము.

రామునిసాక్షాద్విష్ణుదేవునిఁగా నెఱుంగుము; సీతనులక్ష్మిగా నెఱుంగుము; అడవివైకుంఠముగాని వేఱుకాదు; కావున, సుఖముగాఁబొమ్ము.

అని, తాత్పర్యము.

రామం = రాముని; దశరథం = దశరథుని; విద్ధి = ఎఱుంగుము. మాం = నన్ను; జనకాత్మజాం = సీతను; విద్ధి = ఎఱుంగుము. అయోధ్యాం = అయోధ్యానగరమును; అటవీం = అడవిని; విద్ధి = ఎఱుంగుము. తాత = నాయనా! యథాసుఖం = సుఖమగునట్లు; గచ్ఛ = పొమ్ము.

రామునకునుదశరథునకునుండు తారతమ్యంబుఁదెలిసికొనుము; సీతదశరథుండును రాముండును గురుత్వంబున సమానులే; అయినను, ఇచ్చట, దశరథునకనేకులు పరిచారకులున్నారు; రామునకరణ్యంబున నెవ్వరును లేరు; కావున, నీవు రామునితోఁగూడనే పోవలయుననితెలుంగుము; అట్లు, నేనును సీతయును నీకు సమానలెయయ్యును, నాకిక్కడశతుర్ఘ్నుండుమఱియొకఁడుకొడుకున్నాఁడు; సీతకెవ్వఁడును లేఁడు; కావున సీతకుఁబరిచర్యసేయుటకై నీవుపోవలయు నని యెఱుంగుము; అయోధ్యకునువనంబునకునుండు తారతమ్యంబు దెలిసికొనుము; అయోధ్యలోఁగలుగు నైహికసుఖంబధికమో, వనంబునందు శ్యేష్ఠానువర్తనంబునంగలుగు పారలౌకిక సుఖంబధికమో, దెలిసికొనుము; ఇంకసుఖంబుగాఁబొమ్ము. అని, తాత్పర్యము.

దశరథం = దశరథుని; రామం = మృతునిఁగా; విద్ధి = ఎఱుంగుము. మాం = నన్ను; జనకాత్మజాం = తండ్రియొక్కకొమార్తెనుగా, తండ్రియింటనున్నదానిఁగాననుట; విద్ధి = ఎఱుంగుము. అయోధ్యాం = అయోధ్యాపట్టణమును; అటవీం = అడవినిగా; విద్ధి = ఎఱుంగుము. తాత = నాయనా! యథాసుఖం = సుఖమగునట్లు; గచ్ఛ = పొమ్ము.

నీవును రాముండునుబోయిన పిమ్మట, దశరథుండు బ్రతుకఁడు; మృతిఁబొందునని యెఱుంగుము; మీరువనంబునకుఁ బోయిదశరథుండు మృతుండయిన పిమ్మట, నేనున్నై కేయీబాధనోర్వఁజాలక, నాపుట్టింటికిఁబోయి యుందునని యెఱుంగుము; మీవెంట నౌజనులందఱును వత్తురుకావున, నీయయోధ్యయడవియగునని యెఱుంగుము;నీవుసుఖంబుగాఁ, బొమ్ము. అని, సుమిత్ర, లక్ష్మణునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

తత స్సుమంత్రః కాకుత్థ్సం ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్
వినీతో వినయజ్ఞశ్చ మాతలి ర్వాసవంయథా. ౧౧

టీక॥తతః= అటుపిమ్మట; వినయజ్ఞః=వినయంబునెఱింగినట్టి; "చ" అనునది పాదపూరణార్థము) ; సుమంత్రః=సుమంత్రుఁడు;వినీతః=వినయముతోఁగూడినవాఁడై; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడై; కాకుత్థ్సం= రామునిగూర్చి; మాతలిః=మాతలి ; వాసవంయథా—ఇంద్రునిగూర్చినవలె; వాక్యం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

అంత, వినయాచారంబులెఱింగినసుమంత్రుండు, వినయంబునఁ, జేమోడ్పుగీలించి, మాతలి యింద్రునితోఁజెప్పినట్లు, రామునింజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రథ మారోహ భద్రం తే రాజపుత్ర మహాయశః
క్షిప్రం త్వాం ప్రాపయిష్యామి యత్ర మాం రామ వక్ష్యసి. ౧౧

టీక॥మహాయశః — కధికమయినకీర్తిఁగల;రాజపుత్ర — రాచకొమరుఁడవైనరాముఁడా!రథం=రథమును;ఆరోహ=ఎక్కుము. తే= నీకు;భద్రం=మంగళము;అస్తు (అధ్యాహృతము)= అగుఁగాక. రామ=రాముఁడా!యత్ర=ఎచ్చటికిఁదీసికొనిపోవుటయందు;మాం= నన్నుఁగూర్చి;వక్ష్యసి= చెప్పుదువో; తం(అధ్యాహృతము) = ఆప్రదేశమును; త్వాం=నిన్ను; క్షిప్రం = శీఘ్రముగా;ప్రాపయిష్యామి—పొందించెదను.

అధికమయినకీర్తిఁగలవాఁడవగురాముఁడా!నీవురథంబెక్కుము; నీకుమంగళంబులుగలుగుఁగాక;నీవెచ్చటికిఁ గొని

బ్రాహ్మణుడవై, అచ్చటికి శీఘ్రముగాఁ గొనిపోయెదను. అని, తాత్పర్యము.

చతుర్దశ హి వర్షాణి వస్తవ్యాని వనే త్వయా
తా న్యుపక్రమితవ్యాని యాని దేవ్యాఽసి చోదితః. ౧౨

టీక॥ త్వయా=నీచేత, వనే= అడవియందు; చతుర్దశ= పదునాలుగయిన; వర్షాణి = సంవత్సరములు; వస్తవ్యానిహి=ఉండవలసినదిగదా ! యాని=ఏసంవత్సరములను; దేవ్యా= కైకేయిచేత; చోదితః = ఆజ్ఞాపింపఁబడినవాఁడవు; అసి = అగుచున్నావో; తాని=ఆసంవత్సరములు; ఉపక్రమితవ్యాని=ఆరంభింపఁబడవలసినది,

నీవు, వనంబునందుఁ, బదునాలుగు సంవత్సరంబులుండ వలయుఁగదా! కైకేయి నీ కాజ్ఞాపించినట్లు, నీవా పదునాలుగు సంవత్సరంబులు వనంబున నుండ నారంభింపవలసినది. అని, సుమంత్రుండు, రామునితోఁ జెప్పెను.
అని, తాత్పర్యము.

తం రథం సూర్యసంకాశం సీతా హృష్టేన చేతసా
ఆరురోహ వరారోహా కృత్వాలంకార మాత్మనః. ౧౩

టీక॥ వరారోహా=సుందరములయిన పిఱుఁదులుగల; సీతా=సీతాదేవి ; ఆత్మనః=తనకు; అలంకారం=అలంకారమును; కృత్వా=చేసికొని; హృష్టేన= సంతసించిన; చేతసా=మనసుతో; సూర్యసంకాశం= సూర్యునితో సమానమయిన; తం=ఆ; రథం=రథమును ; ఆరురోహ=ఎక్కెను.

సుందరములయిన పిఱుఁదులుగల సీతాదేవి , చక్కఁగా నలంకారంబు చేసికొని, సంతుష్టంబగు మనంబున, సూర్యునిభంగిఁ దేజరిల్లుచున్న యారథంబు నెక్కెను. అని, తాత్పర్యము.

అథో జ్వలనసంకాశం చామీకరవిభూషితమ్
త మారురుహతు స్తూర్ణం భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౧౪

టీక॥ అథ=అటుపిమ్మట ; భ్రాతరౌ=అన్నదమ్ములయిన , రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు; చామీకరవిభూషితం = బంగారముచేనలంకరిం

పఁబడినదియును; ఉజ్జ్వలనసంకాశం= అగ్నిహోత్రముతో సమానమయిన దియునగు;తం = ఆరథమును; తూర్ణం=శీఘ్రముగా;ఆరురుహతుః= ఎక్కిరి.

అంత,బంగారములతోనలంకరింపఁబడియగ్నిహోత్రమువలె వెలుఁగుచున్నయారథంబును అన్నదమ్ములు రామలక్ష్మణులు శీఘ్రముగా, నారోహించిరి.అని, తాత్పర్యము.

వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణానిచ
భర్తారమనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ. ౧౫
తథైవాయుధజాలాని భ్రాతృభ్యాం కవచానిచ

టీక॥ శ్వశురః=మామయయినదశరథుండు;వనవాసం = వనంబుననుండవలసినకాలమును; సంఖ్యాయ=లెక్కపెట్టి;వాసాంసి= వస్త్రములను; ఆభరణానిచ=సొమ్ములను;భర్తారం= పెనిమిటని;అనుగచ్ఛంత్యై = వెంబడించుచున్న;సీతాయై = సీతకొఱకు;దదౌ హి=ఇచ్చెనుగదా!తథైవ=అట్లే; భ్రాతృభ్యాం = అన్నదమ్ములయినరామలక్ష్మణులకొఱకు; ఆయుధజాలాని = ఆయుధసమూహములను ; కవచాని చ = కవచంబులను;దదౌహి(అధ్యాహృతము)=ఇచ్చెనుగదా!

దశరథుఁడు, వనంబుననుండవలసినకాలమునులెక్కపెట్టి,సీతాదేవికి వస్త్రములనుసొమ్ములను, రామలక్ష్మణులకు, ఆయుధంబులను గవచంబులను,ఇచ్చెనుగదా!అని, తాత్పర్యము.

రథోపస్థే ప్రతిన్యస్య సచర్మ కఠినం చ తత్. ౧౬
సీతాతృతీయానారూఢాన్ దృష్ట్వా ధృష్టమచోదయత్
సుమంత్ర స్సమ్మతానశ్వాన్ వాయువేగసమాన్ జవే. ౧౭

టీక॥సుమంత్రః=సుమంత్రుఁడు; తత్=దానిని;సచర్మ= తోలుతోఁగూడినదానిని,బుటికననుట;కఠినంచ=గుద్దలిని;రథోపస్థే= రథంబునడుమను;ప్రతిన్యస్య=ఉంచి; ఆరూఢాన్=ఎక్కినన; సీతాతృతీయాన్= సీతచేముగ్గురయిన రామలక్ష్మణులను;దృష్ట్వా = చూచి; సమ్మతాన్=గారవింపఁబడినవియును,

శుభలక్షణంబులు గలవియుననుట; జవే = వేగమునందు; వాయువేగసమాన్ = వాయువేగముతోసమానము లయినవియునగు; అశ్వాన్ = గుఱ్ఱములను; ధృష్టం = వడిగా; అచోదయత్ = తోలెను.

అసుమంత్రుండు, దశరథుండాసీతారామలక్ష్మణుల కొసంగిన వస్త్రభూషణంబుల నాయుధ కవచంబులను చిన్నపెట్టెకనుగుద్దలిని, రథంబునందునుంచి, యంతసీతారామ లక్ష్మణులు ముగ్గురును రథంబునెక్కి యుండుటం జూచి, శుభలక్షణయుక్తంబులును వాయువునకుంబోలె మహావేగంబు గలవియునగుగుఱ్ఱంబులను వడిగాఁదోలెను.

అని, తాత్పర్యము.

ప్రతియాతే మహారణ్యం చిరరాత్రాయ రాఘవే
బభూవ నగరే మూర్ఛా బలమూర్ఛా జనస్యచ. ౧౮

టీక॥ రాఘవే = రాముఁడు; చిరరాత్రాయ = బహుకాలముండుటకొఱకు; మహారణ్యం = గొప్పయడవినిగూర్చి; ప్రతియాతే = పోఁగా; నగరే = పట్టణమునందు; మూర్ఛా = మైమఱపును; బలమూర్ఛా = సైన్యమునకుమైమఱపును; జనస్యచ = జనమునకును; మూర్ఛా (అధ్యాహృతము) = మైమఱపును; బభూవ = అయినది.

రాముఁడు, బహుకాలమునివసించుటకై; వనంబునకుంబోఁగానే, పట్టణంబునందలిసమస్తజనులుఁను మూర్ఛఁబొందిరి; మఱియుగుఱ్ఱములు గజములు మొదలగునవియుమూర్ఛఁబొందినవి; రామునియుత్సవంబుఁజూడ గ్రామంబులనుండివచ్చినజనులునుమూర్ఛనొందిరి.

అని, తాత్పర్యము.

తత్సమాకులసంభ్రాంతం మత్తసంకుపితద్విపమ్
హయశింజితనిర్ఘోషం పుర మాసీ న్మహాస్వనమ్. ౧౯

టీక॥ తత్ = ఆ; పురం = అయోధ్యాపట్టణము; సమాకులసంభ్రాంతం = కలతనొందిన వారలును తొట్రుపాటునొందినవారలునగు జనులుఁగలదై; మత్తసంకుపితద్విపం = మదించినవియుఁగోపంబునొందినవియునగు యేనుఁగులు

గలదై; హయశింజితనిర్ఘోషం = గుఱ్ఱములసొమ్ముల ధ్వనిగలదై; మహాస్వనం = అధికమయినధ్వనిగలది; ఆసీత్ = అయినది.

అంత, నాయయోధ్యాపట్టణంబున, జనులుదుఃఖంబునఁగలఁతనొంది దొట్రుపాటునసేమియుఁదోఁచక దిరుగుచుండిరి; ఏనుఁగులును, దుఃఖాతిశయంబుకోపరూపంబునంబరిణమింప మదించికేకలువేయుచుండినవి; గుఱ్ఱంబులు భూషణధ్వనిసెలంగనిట్టట్టుపరులెత్తినవి; ఇట్లుఅయోధ్యా పట్టణంబంతయు, మహాధ్వనినిండియుండినది.

అని, తాత్పర్యము.

తత స్సబాలవృద్ధా సా పురీ పరమపీడితా
రామ మేవా భిదుద్రావ ఘర్మార్తా సలిలం యథా. ౩౦

టీక॥ తతః = అటుపిమ్మట; సబాలవృద్ధా = బాలురతోడనువృద్ధులతోనుంగూడిన; సా = ఆ; పురీ = అయోధ్యాపట్టణము; పరమపీడితా = మిక్కిలియుఁబీడింపఁబడినదై; రామమేవ = రామునే; ఘర్మార్తా = ఎండచేఁబీడింపఁబడినది; సలిలంయథా = జలమునుంబోలె; అభిదుద్రావ = వెంబడించిపరుగెత్తినది.

అంత, బాలురునువృద్ధులునుమున్నగునాపట్టణంబుననున్నజనులందఱు, మహాదుఃఖంబునొంది, దప్పిగొన్నవారుజలంబువెంటంబోవునట్లు, రామువెంటనే పరుగెత్తుచుఁబోయిరి.

అని, తాత్పర్యము.

పార్శ్వతః పృష్ఠత శ్చైవ లంబమానా స్తదున్ముఖాః
బాష్పపూర్ణముఖా స్సర్వే త మూచు ర్భృశనిస్స్వనాః. ౩౧

టీక॥ సర్వే = అందఱును; పార్శ్వతః = ప్రక్కలను; పృష్ఠతశ్చైవ = వెనుకను; లంబమానాః = వంగుచు; తదున్ముఖాః = అతనింగూర్చిపైకెత్తఁబడినముఖముగలవారలై; బాష్పపూర్ణముఖాః = కన్నీళ్లచేనిండినముఖముగలవారలై; భృశనిస్స్వనాః = అధికమయినధ్వనిగలవారలై; తం = ఆరామునిగూర్చి; ఊచుః = చెప్పిరి.

ఆజనులందఱును, ఆరామునిరథంబునకుఁబార్శ్వభాగంబులనుగొందఱును, పృష్ఠభాగంబునుగొందఱును బట్టుకొని

వంగితలయెత్తి రాముని ముఖంబుతట్టు చూచుచు, ముఖంబునిండఁగన్నీళ్లుగాఁ బెద్దయెలుంగున, నిట్లని, చెప్పిరి.

అని, తాత్పర్యము.

సంయచ్ఛ వాజినాం రశ్మీన్ సూత యాహి శనైశ్శనైః
ముఖం ద్రక్ష్యామ రామస్య దుర్దర్శం నో భవిష్యతి. ౨౨

టీక॥ సూత=సారథివగుసుమంత్రుఁడా! వాజినాం= గుఱ్ఱములయొక్క; రశ్మీన్=పగ్గములను; సంయచ్ఛ = ఈడ్వుము. శనైశ్శనైః=మెల్ల మెల్లఁగా; యాహి=పొమ్ము. రామస్య= రాముని యొక్క; ముఖం = మొగమును; ద్రక్ష్యామ (ద్రక్ష్యామః)= చూచెదము- నః=మాకు; దుర్దర్శం= చూడనలవిగానిది; భవిష్యతి=కాఁగలదు!

సారథివగు సుమంత్రుఁడా ! గుఱ్ఱములపగ్గములనీడ్చి పట్టుకొనిమెల్ల మెల్లఁగాఁబోనిమ్ము; మేము రాముని ముఖంబుఁ జూచెదము; ఇంక దానింజూచుటకుమాకవకాశముండదు.

అని, తాత్పర్యము.

ఆయసం హృదయం నూనం రామమాతు రసంశయమ్
య ద్దేవగర్భప్రతిమే వనం యాతి నభిద్యతే. ౨౩

టీక॥ యత్=ఎందువలన; దేవగర్భప్రతిమే= దేవకుమారునితోఁబోలిక గల రాముఁడు; వనం=అడవినిగూర్చి; యాతి=పోవుచుండఁగా; నభిద్యతే=పగులకున్నదో; తత్ (అధ్యాహృతము)= అందువలన; రామమాతుః = రాముని తల్లి యొక్క; హృదయం=మనసు; నూనం=నిశ్చయముగా; అసంశయం= సందేహములేనట్లు; ఆయసం = ఇనుముతోఁ జేయఁబడినది.

దేవకుమారునింబోలినకొడుకు రాముండడవికిఁబోవుచుండఁగా, కౌసల్య మనసుపగులకున్నదే; ఇనుముతోఁ జేయఁబడినదికాఁబోలు; ఇందుసందేహము లేదు. అని, తాత్పర్యము.

కృతకృత్యాహి వైదేహీ ఛాయే వానుగతా పతిమ్
న జహాతి రతా ధర్మే మేరు మర్కప్రభాయథా. ౨౪

టీక॥వైదేహీ=సీతాదేవి; ఛాయే వ=నీడవలెఁ; పతిం=పెనిమిటిని ; అనుగతా = వెంబడించినది. కృతకృత్యాహి=కృతార్థురాలుగదా! ధర్మే=ధర్మమునందు; రతా=ఆసక్తురాలై; ధర్మం(అధ్యాహృతము)=ధర్మము ను; మేరుం=మేరుపర్వతమును; అర్కప్రభా యథా=సూర్యునికాంతివలెఁ;న జహాతి=విడువదు.

సీతాదేవి, ఛాయవలెఁ పెనిమిటిని వెంబడించినది,కావునఁ,కృతార్థురాలైనది;ధర్మమునాశ్రయించి, మేరుపర్వతమునుసూర్యకాంతి వదలకుండునట్లు,వదలకున్నది. అని,తాత్పర్యము.

అహో లక్ష్మణ సిద్ధార్థ స్సతతం ప్రియవాదినమ్
భ్రాతరం దేవసంకాశం య స్త్వం పరిచరిష్యసి. ౨౫

టీక॥లక్ష్మణ=లక్ష్మణుఁడా! యః=ఏ;త్వం=నీవు; ప్రియవాదినం= ప్రియవార్తలెచెప్పునట్టి;దేవసంకాశం=దేవతతోసమానుఁడైన;భ్రాతరం= అన్నను;సతతం=ఎల్లప్పుడు; పరిచరిష్యసి= సేవింపఁగలవో; సః (త్వం)=అట్టినీవు;సిద్ధార్థః= కృతార్థుఁడవు. అహో=ఆశ్చర్యము!

లక్ష్మణుఁడా!నీవుప్రియవాదియుదేవసమానుండునగు నన్నకెల్లప్పుడునుపరిచర్యసేయనిశ్చయించితివికావున, నీవుకృతార్థుఁడవు.అని, తాత్పర్యము.

మహ త్యేషా హి తే సిద్ధి రేష చాభ్యుదయో మహా౯
ఏష స్వర్గస్య మార్గశ్చ య దేన మనుగచ్ఛసి. ౨౬

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు;ఏనం=ఈరాముని;అనుగచ్ఛసి(ఇతి) యత్=వెంబడించుచున్నావనునదియేది గలదో;ఏషః=ఇది; తే=నీకు;మహతీ=గొప్పదైన;సిద్ధిః=తపస్సిద్ధిగదా! ఏషః=ఇదియే;మహా౯=గొప్పదైన ; అభ్యుదయశ్చ=వృద్ధియు.ఏషః=ఇదియె ; స్వర్గస్య=స్వర్గమునకు; మార్గశ్చ=మార్గమును.

నీకీరామునివెంబడించుటయె,గొప్పతపస్సిద్ధి;ఇదియెనీకభ్యుదయము ; ఇదియెనీకుస్వర్గముగలిగించునదియు. అని,జనులందఱుఁ,జెప్పిరి.

అని, తాత్పర్యము.

ఏవం వదంత స్తే సోఢుం న శేకు ర్బాష్ప మాగతమ్
నరా స్త మనుగచ్ఛంతః ప్రియ మిక్ష్వాకునందనమ్. ౨౭

టీక॥ప్రియం= సంతోషంబుగలిగించునట్టి;ఇక్ష్వాకునందనం=రామునిఁ; అనుగచ్ఛంతః=వెంబడించుచున్న; తే=ఆ; నరాః=జనులు;ఏవం=ఇట్లు;వదంతః=చెప్పుచు;ఆగతం=వచ్చిన; బాష్పం=కన్నీటిని;సోఢుం=ఓర్చుటకు ; న శేకుః=చాలరైరి.

ప్రియుండగు నా రాముని వెంబడించునట్టియాజనులు , ఈప్రకారము చెప్పుచుఁ, గన్నీళ్ల నణంచుకొనం జాలరైరి. అని, తాత్పర్యము.

అథ రాజా వృత స్త్రీభి ర్దీనాభి ర్దీనచేతనః
నిర్జగామ ప్రియం పుత్రం ద్రక్ష్యామీతి బ్రువన్ గృహాత్. ౨౮

టీక॥అథ = అటుపిమ్మట;దీనచేతనః = దుఃఖమునొందినమనసుగల;రాజా=దశరథమహారాజు;దీనాభిః= దుఃఖితలయిన;స్త్రీభిః = స్త్రీలచేత;వృతః=చుట్టఁబడినవాఁడై;ప్రియం=ఇష్టుండగు;పుత్రం=కొడుకును; ద్రక్ష్యామి=చూచెదను.ఇతి=అని;బ్రువన్= చెప్పుచు;గృహాత్=ఇంటినుండి;నిర్జగామ=వెడలెను.

అంత,దశరథమహారాజు,దుఃఖించున,దుఃఖితలగు భార్యలఁగూడి , "ప్రియపుత్రుంజూచెదను" అని, చెప్పుచు,నింటనుండి వెడలెను. అని, తాత్పర్యము.

శుశ్రువే చాగ్రత స్త్రీణాం రుదంతీనాం మహాస్వనః
యథా నాదః కరేణూనాం బద్ధే మహతి కుంజరే. ౨౯

టీక॥అగ్రతః = ముందట;రుదంతీనాం=ఏడ్చుచున్న;స్త్రీణాం = స్త్రీలయొక్క;మహాస్వనశ్చ = మహాధ్వనియు;మహతి=గొప్పదైన;కుంజరే= ఏనుగు;బద్ధే=కట్టఁబడఁగా ; కరేణూనాం=ఆఁడేనుంగులయొక్క; నాదో యథా=ధ్వనివలె;శుశ్రువే=వినఁబడెను.

అంత,ముందట, స్త్రీలంతయు...

గజముబంధింపఁబడఁగా నాఁడేనుంగు లుదుఃఖించునట్లు, రోదనంబుగావించి రి; అందువలనమహాధ్వనిగలిగినది.

అని, తాత్పర్యము.

పితా హి రాజా కాకుత్స్థ శ్శ్రీమా న్సన్న స్తదా భవత్
పరిపూర్ణశశీ కాలే గ్రహేణో పప్లుతో యథా. ౩౦

టీక॥తదా=అప్పుడు; పితా=తండ్రి యును; రాజా=రాజును; శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడునగు; కాకుత్స్థః=దశరథమహారాజు; కాలే=కాలమునందు; గ్రహేణ=రాహుగ్రహముచేత; ఉపప్లుతః=గ్రసింపఁబడిన; పరిపూర్ణశశీయథా=నిండుచంద్రుండువలె; సన్నః=క్షీణించినవాఁడు; అభవత్=అయెను.

అప్పుడు,తండ్రియును శ్రీమంతుండును గుదశరథుండు , రామదుఃఖంబున , గ్రహణకాలమునందు రాహువుచే గ్రసింపఁబడినచంద్రుండువలె,క్షీణతనొందెను. అని,తాత్పర్యము.

స చ శ్రీమా నచింత్యాత్మా రామో దశరథాత్మజః
సూతం సంచోదయామాస త్వరితం వాహ్యతా మితి. ౩౧

టీక॥ శ్రీమాన్=అందఱికన్న సిరికుండును; అచింత్యాత్మా=ఎన్నరానిస్థైర్యముగలవాఁడును; దశరథాత్మజః=దశరథునికొడుకునగు; సః=ఆ ; రామశ్చ= రాముండును; "త్వరితం= శీఘ్రముగా;వాహ్యతాం= తోలఁబడుఁగాక"ఇతి=అని; సూతం=సారథిని; సంచోదయామాస=ఆజ్ఞాపించెను.

శ్రీమంతుండును ఇంతమాత్రమని తెలియరాని మహాధైర్యము గలవాఁడునగుదశరథపుత్రుండగు రాముండు; జనులట్లుతన్ను వెంబడించుటంజూచి , "శీఘ్రముగాఁదోలుము" అని,సారథి యయినసుమంత్రున కాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

రామో యాహీ తి సూతం తం తిష్ఠేతి స జన స్తదా
ఉభయం నాశక చ్ఛూతః కర్తు మధ్వని చోదితః. ౩౨

టీక॥తదా=అప్పుడు; తం=ఆ; సూతం=సారథియగుసుమంత్రునిగూర్చి;

రామః=రాముఁడు; యాహి=పొమ్ము, ఇతి=అని; అబ్రవీత్ (అధ్యాహృతము) చెప్పెను. సః=ఆ; జనః=జనము; తిష్ఠేతి=నిలువుమని; అబ్రవీత్ (అధ్యాహృతము)=చెప్పెను. అధ్వని=మార్గమునందు; చోదితః=ఆజ్ఞాపింపఁబడిన; సూతః=సారథి; ఉభయం=రెంటిని; కర్తుం=చేయుటకు; నాశకత్=చాలఁడయ్యె.

అప్పుడు, రాముండా సుమంత్రుని, శీఘ్రముగాఁదోలుమని యాజ్ఞాపించెను; ఆజనులు, నిలుపుమని చెప్పిరి; ఇట్లు రెండు విధములగుటవలన, సుమంత్రుండు రెంటిని జేయఁజాలఁడయ్యె.

అని, తాత్పర్యము.

నిర్గచ్ఛతి మహాబాహౌ రామే పౌరజనాశ్రుభిః
పతితైరభ్యవహితం ప్రశశామ మహీరజః. ౩౩

టీక॥ మహాబాహౌ=పెద్దచేతులుగల; రామే=రాముఁడు; నిర్గచ్ఛతి=వెడలుచుండఁగా; అభ్యవహితం=రేఁగిన, మహీరజః=నేలదుమ్ము; పతితైః=పడిన; పౌరజనాశ్రుభిః=పట్టణవాసులగుజనులయొక్క కన్నీళ్లచేత; ప్రశశామ=అణఁగెను.

మహాబాహుండగు రాముండు వనంబునకు వెడలఁగానే, జనసమ్మర్దంబున రేఁగినదుమ్మంతయు, నాజనుల కన్నీళ్లు పడుటవలన నడంగినది.

అని, తాత్పర్యము.

రుదితాశ్రుపరిద్యూనం హాహాకృత మచేతనమ్
ప్రయాణే రాఘవస్యాసీ త్పురం పరమపీడితమ్. ౩౪

టీక॥ రాఘవస్య=రామునియొక్క; ప్రయాణే=ప్రయాణకాలమునందు; పురం=అయోధ్యాపట్టణము; రుదితాశ్రుపరిద్యూనం=ఏడ్పులచేఁగలిగినకన్నీళ్లచేఁ దడుపఁబడినదై; హాహాకృతం=హాహాకారంబులుగలదై; అచేతనం=తెల్విలేనిదై; పరమపీడితం=మిక్కిలి యుఁబీడింపఁబడినది; ఆసీత్=అయ్యెను.

రామునిప్రయాణకాలమునందు, ఆయయోధ్యలోనిజనులందఱు, రోదనంబు సేయుచు, విశేషంబుగాఁగన్నీళ్లుగార్చు

దు,హాహాకారంబులు సేయుచు, మూర్ఛనొందుచు,నిట్లు పరమ పీడితులయిరి. అని, తాత్పర్యము.

సుస్రావ నయనై స్త్రీణా మాస్ర మాయాససంభవమ్
మీనసంక్షోభ చలితై స్సలిలం పంకజై రివ. ౩౫

టీక॥ స్త్రీణాం= స్త్రీలయొక్క;నయనైః = (పంచమ్యర్థమందుతృతీయ)=కండ్లనుండి; ఆయాససంభవం= దుఃఖమువలనంబుట్టిన;ఆస్రం=కన్నీరు; మీనసంక్షోభచలితైః = మత్స్యముల యొక్క కదలుటచేతఁగదలిన; పంకజైః= (పంచమ్యర్థమందుతృతీయ) కమలములనుండి; సలిలమివ=జలమువలెఁ;సుస్రావ=కాఱెను.

అప్పుడు,మత్స్యంబులుకదలుటచేఁ గదలినకమలంబులనుండి జలముకాఱునట్లు,స్త్రీలనేత్రములనుండి,దుఃఖంబునఁ, గన్నీరుకాఱినది.

అని, తాత్పర్యము.

దృష్ట్వాతు నృపతి శ్శ్రీమా నేకచిత్తగతం పురమ్
నిపపాతైవ దుఃఖేన హతమూల ఇవ ద్రుమః. ౩౬

టీక॥ శ్రీమాన్=అధికమయినకాంతిగల;నృపతిః= మనుష్యులకుఁబ్రభువైన దశరథుఁడు;ఏకచిత్తగతం= ఒకమనసునుబొందిన;పురం=పట్టణమును;దృష్ట్వాతు=చూచినంతనె;దుఃఖేన= దుఃఖముచేత;హతమూలః= కొట్టఁబడినవేళ్ళుగల;ద్రుమఇవ=చెట్టువలె; నిపపాతైవ= పడెనే.

శ్రీమంతుండగుదశరథమహారాజు, అప్పుడప్పట్టణంబుననుండుజనులందఱు,ఒక్కటేవిధంబున,మహాదుఃఖంబునొంది యుండుటంజూచినంతనె,దుఃఖంబినుమడింప, వేళ్ళుననుక్కఁగానేవృక్షంబుగూలునట్లు, నేలంబడెను.అని, తాత్పర్యము.

తతో హలహలాశబ్దో జజ్ఞే రామస్య పృష్ఠతః
నరాణాం ప్రేక్ష్య రాజానం సీదంతం భృశదుఃఖితమ్. ౩౭

టీక॥ తతః = అటుపిమ్మట; సీదంతం= కృశించుచున్నవాఁడును ; భృశ

దుఃఖితం=మిక్కిలియు దుఃఖంబునొం దినవాఁడునగు; రాజానం=దశరథ మహారాజును; ప్రేక్ష్య=చూచి ; స్థితానాం (అధ్యాహృతము)=ఉన్నట్టి; నరాణాం=జనులయొక్క ; హాలహాలాశబ్దః= హాలహాయనుమహాధ్వని; రామస్య=రామునియొక్క; పృష్ఠతః= వెనుకను; జజ్ఞే=పుట్టినది.

అంత, రామునివెనుకంబోవుచుఁ గృశించిపరమదుఃఖితుండైయున్న దశరథమహారాజునుజూచి, జనులందఱు,రోదనంబుగావించిరి. అని, తాత్పర్యము.

హా రామేతి జనాః కేచి ద్రామమాతేతి చాపరే
అన్తఃపురం సమృద్ధంచ క్రోశన్తః పర్యదేవయన్. ౩౮

కేచిత్ = కొందఱు;జనాః = జనులు;హా రామేతి=అయ్యో రాముఁడా!అనియు;అపరే=ఇతరులు; రామమాతేః (సంధియార్షము)= రామునితల్లివగు కౌసల్యా!ఇతి=అనియు; క్రోశంతః=అఱచుచు;పర్యదేవయన్=ఏడ్చిరి.సమృద్ధం=సమస్తమయిన; అంతఃపురంచ=అంతఃపురజనమును ; పర్యదేవయత్ (అధ్యాహృతము)=ఏడ్చెను.

కొందఱుజనులురామునింజేరొకొనుచును,మఱికొందఱుకౌసల్యం జేరొకొనుచును, రోదనంబుగావించిరి; అట్లంతఃపురస్త్రీలందఱురోదనంబు గావించిరి. అని, తాత్పర్యము.

అన్వీక్షమాణో రామస్తు విషణ్ణం భ్రాన్తచేతసమ్
రాజానం మాతరం చైవ దదర్శానుగతౌ పథి. ౩౯

టీక॥ రామస్తు = రాముండును;అను=వెనుకతట్టు;ఈక్షమాణః= చూచుచు; విషణ్ణం=దుఃఖితుండును; భ్రాంతచేతసం=తిరుగుడుపడినమనసుగలవాఁడునగు;రాజానం= దశరథమహారాజును; మాతరంచైవ=తల్లిని;పథి = మాఁగమునందు;అనుగతౌ=వెంబడించినవారలనుగా;దదర్శ=చూచెను.

రాముం,డారోదనధ్వనినివిని, వెనుకతట్టుతిరిగిచూచి, పరమదుఃఖితులగుతలిదండ్రులు తన్ను వెంబడించి వచ్చుటం జూచెను.అని, తాత్పర్యము.

స బద్ధ ఇవ పాశేన కిశోరో మాతరం యథా

ధర్మపాశేన సంక్షిప్తః ప్రకాశం నాభ్యుదైక్షత. ౪౨

టీక॥ సః=ఆరాముఁడు ; పాశేన=త్రాటిచేతఁగట్టఁబడిన;కిశోర ఇవ=గుఱ్ఱపుపిల్లవలె;ధర్మపాశేన= ధర్మమను త్రాటిచేత; సంక్షిప్తః=కట్టఁబడినవాఁడై; మాతరం యథా= తల్లినివలె; తౌ (అధ్యాహృతము)=ఆతలిదండ్రులను; ప్రకాశం=వెల్లడిగా; నాభ్యుదైక్షత=చూడఁడయ్యె-

ఆరాముండు, త్రాటంగట్టఁబడినగుఱ్ఱపుపిల్లతనతల్లిం జూచుచందంబున, ధర్మపాశంబుచేబద్ధుండుకావునఁ; దలిదండ్రులవెల్లడిగాఁజూడక, యోరచూపులం జూచుచుండెను-

అని, తాత్పర్యము.

పదాతినౌచ యానార్హా వదుఃఖార్హా సుఖోచితౌ
దృష్ట్వా సంచోదయామాస శీఘ్రం యాహీతి సారథిమ్. ౪౩

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముఁడు; యానార్హౌ=వాహనంబులకుఁదగినవారలును; పదాతినౌచ=కాలినడకనవలంబించినవారలును ; అదుఃఖార్హౌ= దుఃఖమునకుఁదగనివారలును; సుఖోచితౌ=సుఖంబునకుఁదగినవారలునగు ; పితరౌ (అధ్యాహృతము)=తలిదండ్రులను; దృష్ట్వా= చూచి; "శీఘ్రం=శీఘ్రముగా; యాహి=పొమ్ము" ఇతి=అని; సారథిం=సుమంతునిః సంచోదయామాస= ఆజ్ఞాపించెను.

రాముండు, వాహనార్హులయ్యును గాలినడకను వచ్చుచున్న వారలును దుఃఖంబునకుఁదగినవారలుగా కున్నను బరమదుఃఖంబునొందియున్న వారలును సుఖోచితులయినను సుఖంలేకున్నవారలునగుతలిదండ్రులంజూచి, "శీఘ్రంబుగారథంబునుబోనిమ్ము" అని సుమంత్రునకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

నహి తత్పురుషవ్యాఘ్రో దుఃఖదం దర్శనం పితుః
మాతుశ్చ సహితుం శక్త స్తోత్త్రా దిత ఇవ ద్విపః. ౪౪

టీక॥పురుషవ్యాఘ్రః= పురుషశ్రేష్ఠుండగు రాముండు;పితుః = తండ్రియొ

కర-యు; మాతుశ్చ = తల్లియొక్క-యు; దుఃఖదం=దుఃఖమునిచ్చునట్టి; తత్=ఆ; దర్శనం=చూచుటను; సహితుం=ఓర్చుటకు; శక్తః= చాలినవాఁడు; నహి=కాఁడుగదా! తోత్త్రార్దితః=ఏనుంగులంబొడిచెడు బరిగోలచేఁ బీడింపఁబడిన; ద్విపఇవ=ఏనుఁగువలె; ఆసీత్ (అధ్యాహృతము)=ఉండెను.

పురుషశ్రేష్ఠుండగు రాముండు, అట్లు పరమదుఃఖితులయియున్న తలిదండ్రులంజూచి, బరిగోలచేఁబొడువఁబడిన యేనుంగుభంగిఁబరమపీడితుండై, మఱల వారలంజూడఁజాలకుండెను- అని, తాత్పర్యము-

ప్రత్యగారమివా యాంతీ వత్సలా వత్సకారణాత్
బద్ధవత్సా యథా ధేనూ రామమాతా భ్యధావత. ౪౩

టీక॥బద్ధవత్సా=కట్టఁబడినదూడగలదియును; వత్సలా= దూడయందతిప్రేమగలదియును; వత్సకారణాత్=దూడయనుకారణమువలన; అగారం ప్రతి = ఇంటిఁగూర్చి; ఆయాంతీ= వచ్చుచున్నదియునగు; ధేనుర్యథా= ఆవువలె; రామమాతా=రామునితల్లియగు కౌసల్య; అభ్యధావత= పరుగెత్తినది.

దూడయింటఁగట్టఁబడియుండుటం జేసి, దూడయందతిప్రేమగలదికావున, దూడంజేరుటకొఱకై, యతివేగంబునసింటికిం బోవుగోవుకైవడి, రామునితల్లియయినకౌసల్యరథంబుఁజేరంబరుగెత్తినది- అని, తాత్పర్యము-

తథా రుదంతీం కౌసల్యాం రథం త మనుధావతీమ్
క్రోశంతీం రామరామేతి హాసీతే లక్ష్మణే తిచ. ౪౪
రామలక్ష్మణ సీతార్థం స్రవంతీం వారినేత్రజమ్
అసకృ త్త్రైక్షత సతాం నృత్యంతీమివ మాతరమ్- ౪౫

టీక॥సః=ఆరాముఁడు; తథా=అట్లు; రుదంతీం = ఏడ్చుచున్నదియు; రథం = రథమునుగూర్చి; అనుధావంతీం=పరుగెత్తుచున్నదియును; రామరామేతి=రాముఁడా! రాముఁడా! అనియు; హాసీతే=అయ్యోసీతా! లక్ష్మణ=లక్ష్మణుఁడా! ఇతిచ=అనియు; క్రోశంతీం= అఱచుచున్నదియును; రామలక్ష్మణసీతా

థం= రామునికొఱకునులక్ష్మణునికొఱకునుసీతకొఱకును; నేత్రజం= కన్నులంబుట్టిన;వారి=నీటిని;స్రవంతీం= కార్చుచున్నదియు ; నృత్యంతీమివ (స్థితాం)= నర్తనముసేయుచున్నట్లున్నదియునగు;మాతరం = తల్లియయిన; తాం=ఆ;కౌసల్యాం=కౌసల్యను; అసకృత్=పలుమాఱు;ప్రైక్షత=చూచెను.

అట్లు రోదనంబుసేయుచు రథంబువెంబడిఁబరుగెత్తుచు "అయ్యో రాముఁడా!సీతా!లక్ష్మణుఁడా!" అనియాక్రోశించుచు,సీతారామలక్ష్మణులదుఃఖంబునఁగన్నీళ్లుగార్చుచు,దుఃఖాతిశయంబుననొడలుతెలియక, నర్తనంబుసేయుచున్నట్లున్న, తల్లియగుకౌసల్యను, రాముండు,మాటిమాటికిం,జూచెను.

అని, తాత్పర్యము.

తిష్ఠేతి రాజా చుక్రోశ యాహియాహీతి రాఘవః

సుమంత్రస్య బభూవాత్మా చక్రయో రివ చాంతరా. ౪౮

టీక॥ రాజా=దశరథమహారాజు; తిష్ఠేతి=నిలువుమని;చుక్రోశ =అఱచెను. రాఘవః=రాముఁడు; యాహియాహీతి=పొమ్ముపొమ్మని;చుక్రోశ=(అధ్యాహృతము)అఱచెను.సుమంత్రస్య= సుమంత్రునియొక్క;ఆత్మాచ= మనసును; చక్రయోః=చక్రములయొక్క; అంతరా చ=నడుమను ; ఆసీదివ= ఉండినట్లుండెను.

దశరథమహారాజు, నిలునిలుమనియఱచెను; రాముండు "శీఘ్రంబుగాఁదోలు"మనిచెప్పెను; అందువలన, సుమంత్రుండు,నిలుచుటకునుబోవుటకునుందోఁచక,చక్రంబులనడుమనుండినట్లు,డోలాయమానమానసుండై,యుండెను.

అని, తాత్పర్యము.

నాశ్రౌష మితి రాజాన ముపాలబ్ధోపి వక్ష్యసి

చిరం దుఃఖస్య పాపిష్ఠ మితి రామ స్త మబ్రవీత్. ౪౯

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; ఉపాలబ్ధోపి=నిందింపఁబడినవాఁడవైనను; నాశ్రౌషం=విననైతిని; ఇతి=అని; రాజానం=రాజునుగూర్చి;వక్ష్యసి=చెప్పఁగలవు.దుఃఖస్య=దుఃఖముయొక్క; చిరం=బహుకాలము;పాపిష్ఠం = స

హింపఁగూడనిది" ఇతి=అని ; రామః=రాముఁడు; తం=ఆసుమంత్రునిగూర్చి; అబ్రవీత్=చెప్పెను.

"దశరథుండునిన్ను నామాటయేల వినవైతివనినిందించునేని, నీవుదానికి, అగుంభులో నాకునీవుచెప్పినది వినరాలేద నిబదులుచెప్పవచ్చును; ఇట్లువారలు బహుకాలంబుదుఃఖంబనుభవించుచుండుటంజూడనలవిగాదు." అని, రాముండుసుమంత్రునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రామస్య చ వచః కుర్వ న్ననుజ్ఞాప్య చ తం జనమ్
వ్రజతోఽపి హయాన్ శీఘ్రం చోదయామాస సారథిః. ౪౮

టీక॥ సః=ఆ; సారథిః= సారథియగుసుమంత్రుండు; రామస్య= రామునియొక్క; వచః=మాటను; కుర్వన్= చేయువాఁడై; తం=ఆ; జనం = జనమును; అనుజ్ఞాప్య చ = అనుమతినొందించియు; వ్రజతోఽపి=పోవుచున్నవైనను; హయాన్=గుఱ్ఱములను; శీఘ్రం= శీఘ్రముగా; చోదయామాస=తోలెను.

ఆసుమంత్రుండు, రామునిమాటప్రకారముసేయనిశ్చయించి, రామునివెంబడివచ్చుచున్నయంతఃపుర జనమునకు రామునివలననను జ్ఞయిప్పించి, గుఱ్ఱంబులు తమంత నే వేగంబుగాఁ బోవుచున్నను, వానినిమఱియు వేగంబుగాఁ దోలెను. అని, తాత్పర్యము.

న్యవర్తత జనో రాజ్ఞో రామం కృత్వా ప్రదక్షిణమ్
మనసా ప్యశ్రువేగైశ్చ న న్యవర్తత మానుషమ్. ౪౯

టీక॥ రాజ్ఞః= రాజుయొక్క; జనః=జనము; రామం= రామునిగూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; కృత్వా= చేసి; న్యవర్తత=మఱలినది. మానుషం=మనుష్యసమూహము; మనసా= మనసుచేతను; అశ్రువేగైశ్చ=కన్నీళ్లవేగములచేతను; నన్యవర్తత = మఱల లేదు.

రాజసంబంధిజనులు, రామునకుం బ్రదక్షిణంబుచేసి , వెనుకకుమఱిరి; అట్లు, మఱియుఁగొందఱు మఱిరిగాని, మనుష్యమాత్రులుగానుండువారల చే

వ్వరికిని, మనంబుననుండుదుఃఖంబును గ్నులంగాటుకన్నీళ్లును, ఎంతమాత్రము దగ్గలేదు. అని, తాత్పర్యము.

యమిచ్ఛేత్పున రాయాంతం నైనం దూర మనువ్రజేత్
ఇత్యమాత్యా మహారాజ మూచు ర్దశరథం వచః. ౫౦

టీక॥ "యం=ఎవ్వని; పునః=మఱల, ఆయాంతం=వచ్చువానింగా; ఇచ్ఛేత్=కోరునో; ఏనం=ఇతని; దూరం=దూరముగా; నానువ్రజేత్=వెంబడింపఁగూడదు" ఇతి=అని; వచనం=మాటను; అమాత్యాః=మంత్రులు; మహారాజం=పూజ్యుండగురాజైన; దశరథం=దశరథునిగూర్చి; ఊచుః=చెప్పిరి.

"ఎవ్వండుశీఘ్రముగామఱలరావలెననికోరికియున్నదో, అతనిదూరము వెంబడింపరాదు" అని, మంత్రులు, దశరథమహారాజునకుం జెప్పిరి.

అని, తాత్పర్యము.

తేషాం వచ స్సర్వగుణోపపన్నం
ప్రస్విన్నగాత్రః ప్రవిషణ్ణరూపః
నిశమ్య రాజా కృపణ స్సభార్యో
వ్యవస్థిత స్తం సుత మీక్షమాణః. ౫౧

టీక॥ ప్రస్విన్నగాత్రః=చెమటపోసిన దేహముగలవాఁడును; ప్రవిషణ్ణరూపః=మిక్కిలియుదుఃఖమునొందిన రూపముగలవాఁడును; కృపణః=దుఃఖితుండును; సభార్యః=భార్యతోఁగూడినవాఁడునగు; రాజా=దశరథమహారాజు; తేషాం=ఆమంత్రులయొక్క; సర్వగుణోపపన్నం=సమస్తగుణంబులతోఁగూడిన; వచః=మాటను; నిశమ్య=విని; తం=ఆ; సుతం=కొడుకును; ఈక్షమాణః=చూచుచు; వ్యవస్థితః=నిలిచినాఁడు.

దేహంబంతయుఁజెమటతోఁదడిసి, మహాదుఃఖంబునొందియున్న, దశరథమహారాజు, భార్యతోఁగూడినవాఁడై, ఆ మంత్రులుచెప్పినసుగుణయుక్తంబయిన మాటనువిని, యంత రాముని వెంబడింపకనిలిచి, ప్రియపుత్రుండగు రామునింజూ

దుచుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకచత్వారింశసర్గప్రారంభః.

తస్మింస్తు పురుషవ్యాఘ్రే వినిర్యాతి కృతాంజలౌ
ఆర్తశబ్దో థ సంజజ్ఞే స్త్రీణా మంతఃపురే తదా. ౧

టీక॥ పురుషవ్యాఘ్రే = పురుషశ్రేష్ఠుండగు; తస్మిన్ = ఆ రాముండు; కృతాంజలౌ = చేయఁబడిన చేమోడ్పుగలవాఁడై; వినిర్యాతితు = పోవుచుండఁగానే; అథ = అటుపిమ్మట; తదా = అప్పుడు; అంతఃపురే = అంతఃపురమునందు; స్త్రీణాం = స్త్రీలయొక్క; ఆర్తశబ్దః = ఏడ్పుధ్వని; సంజజ్ఞే = పుట్టెను.

పురుషశ్రేష్ఠుండగు నా రాముండు, చేమోడ్పుగిలించి, వనంబునకు వెడలఁగానే, యప్పుడంతఃపురమునందలి స్త్రీలు, మహాధ్వనిగలుగునట్లు రోదనంబు చేసిరి. అని, తాత్పర్యము.

అనాథస్య జనస్యాస్య దుర్బలస్య తపస్వినః
యో గతిశ్శరణంచాసీత్స నాథః క్వను గచ్ఛతి.

టీక॥ అనాథస్య = నాథుఁడు లేనిదియు; దుర్బలస్య = బలంబు లేనిదియు; తపస్వినః = శోచింపఁదగినదియునగు; అస్య = ఈ; జనస్య = జనమునకు; యః = ౨

వ్వఁడు; గతిః = పాశ్చస్థానమో; శరణంచ=రక్షకుండునో; సః = అట్టి; నాథః=ప్రభువు; క్వను=ఎచ్చటికి; గచ్ఛతి= పోవుచున్నాఁడు?

అనాథులునశక్తులుఁ గరుణింపఁదగినవారలునగునీజనుల కెవ్వండు ప్రాప్తిస్థానమై రక్షకుండుగానుండునో; అట్టి నాథుండు రాముండిప్పుడెచ్చటికిఁ బోవుచున్నాఁడు? అని, తాత్పర్యము.

న క్రుధ్య త్యభిశప్తోపి క్రోధనీయాని వర్జయన్
క్రుద్ధాన్ ప్రసాదయన్ సర్వాన్ సమదుఃఖః క్వచి ద్గతః. ౩

టీక॥ యః=ఎవ్వఁడు; అభిశప్తోపి= నిందింపఁబడినవాఁడైనను; క్రోధనీయాని = కోపముగల్గించువానిని; వర్జయన్=విడుచుచు; క్రుద్ధాన్= కోపమునొందినవారలను; సర్వాన్=అందఱను; ప్రసాదయన్=ఊఱడింపుచు; నక్రుధ్యతి=కోపంబునొందఁడో. సః (అధ్యాహృతము)=అట్టి; సమదుఃఖః= సమానమయినదుఃఖముగల రాముఁడు; క్వచిత్=ఎచ్చటికి; గతః= పోయినాఁడు?

ఎవ్వఁడు, తనపైనితరులు లేనిదోషమునారోపించినప్పటికిని, కోపంబుగలిగించువానిని విడిచి, తానుగోపంబునొందకుండుటయె గాక, కోపంబునొందినవారలనూఱడించుచుండునో; మఱియు, నితరులుదుఃఖపడుచు లేని తానునుదుఃఖపడునో; అట్టి రాముండిప్పుడెచ్చటికిఁబోవుచున్నాఁడు? అని, తాత్పర్యము.

కౌసల్యాయాం మహాతేజా యథా మాతరి వర్తతే
తథా యో వర్తతేఽస్మాసు మహాత్మా క్వను గచ్ఛతి. ౪

టీక॥ యః=ఎవ్వఁడు; మాతరి=తల్లియయిన; కౌసల్యాయాం=కౌసల్యయందు; యథా=ఎట్లు; వర్తతే=ఉండునో; తథా=అట్లు; అస్మాసు=మాయందు; వర్తతే=ఉన్నాఁడో; సః(అధ్యాహృతము)=అట్టి; మహాతేజాః= అధికమయిన కాంతిగలవాఁడును; మహాత్మా=పూజ్యమయినస్వభావముగలవాఁడునగు రాముండు; క్వను= ఎచ్చటికి; గచ్ఛతి=పోవుచున్నాఁడు?

ఎవ్వండు, తనతల్లియయినకౌసల్యయందుఁబ్రవర్తించినట్లె, చవతితల్లు

లమయిన మాయయందును బ్రవర్తించు నో, అట్టిమహాతేజుండును మహాత్ముం డునగు రాముండిప్పుడెచ్చటికిఁ బోవు చున్నాడుః అని, తాత్పర్యము.

కైకేయ్యా క్లిశ్యమానేన రాజ్ఞా సంచోదితో వనమ్
పరిత్రాతా జనస్యాస్య జగతః క్వను గచ్ఛతి. ౫

టీక॥ అస్య=ఈ;జనస్య= జనమున కును; జగతః= ప్రపంచమునకును; ప రిత్రాతా = రక్షకుండగు రాముండు; కైకేయ్యా=కైకేయిచేత ; క్లిశ్యమా నేన=బాధింపఁబడుచున్న; రాజ్ఞా=ద శరథమహారాజుచేత; వనం=అడవిని; గంతుం (అధ్యాహృతము)=పోంగుట కు;సంచోదితః= ఆజ్ఞాపింపఁబడినవాఁడై; క్వను=ఎచ్చటికి; గచ్ఛతి=పోవుచు న్నాఁడుః

ఈజనులకును బ్రపంచమునకును ర క్షకుండైనరాముండు,దశరథుండుకైకే యిబాధపడఁజాలక వనంబునకుఁ బొ మ్మనియాజ్ఞాపింపఁగా, దానికిలోఁబడి, యిప్పుడెచ్చటికిఁ బోవుచున్నాఁడుః అని, తాత్పర్యము.

అహో నిశ్చేతనో రాజా జీవలోకస్య సంప్రియమ్
ధర్మ్యం సత్యవ్రతం రామం వనవాసే ప్రవత్స్యతి. ౬

టీక॥ రాజా= దశరథమహారాజు; నిశ్చేతనః=బుద్ధిలేనివాఁడు! అహో= ఆశ్చర్యము! జీవలోకస్య=ప్రాణివర్గ మునకు; సంప్రియం=మిక్కిలియునిష్టం డును; ధర్మ్యం=ధర్మముతోఁ గూడి నవాఁడును; సత్యవ్రతం=సత్యమువ్రత ముగాఁగలవాఁడునగు; రామం= రా ముని; వనవాసే= అడవియుండుటనిమిత్తమై;ప్రవత్స్యతి=ఊరువెడలఁగొట్టుచు న్నాఁడే!

దశరథమహారాజు , ఎంతబుద్ధిలేని వాఁడు!ప్రాణివర్గమునకంతయుఁబ్రి యుండును ధార్మికుండును సత్యవ్ర తుండునగు రాముని,వనంబునకుఁ బంపు చున్నాఁడే!అని,యంతఃపురస్త్రీలు వి లపించిరి. అని, తాత్పర్యము.

ఇతి సర్వా మహిష్య స్తా వివత్సా ఇవ ధేనవః
రురుదు శ్చైవ దుఃఖార్తా స్సస్వరంచ విచుక్రుశుః. ౭

టీక॥ తాః=ఆ; మహిష్యః=రాజభార్యలు ; సర్వాః=అందఱును; ఇతి=ఈప్రకారముగా; వివత్సాః=దూడలులేని; ధేనవఇవ= ఆవులువలె; దుఃఖార్తాః = దుఃఖముచేతఁబీడింపఁబడినవారలై;రురుదుశ్చైవ=ఏడ్చిరియు. సస్వరంచ= ధ్వనితోఁగూడునట్లుగాను; విచుక్రుశుః=ఆఱచిరి.

ఆరాజభార్యలందఱు, దూడనువిడిచినయావులచందంబునదుఃఖంబునరోదనంబుసేయుచు, మహాధ్వనిగల్గునట్లు,అఱచిరి.అని,తాత్పర్యము.

స త మంతఃపురే ఘోర మార్తశబ్దం మహీపతిః
పుత్రశోకాభిసంతప్త శ్శ్రుత్వా చా సీ త్సుదుఃఖితః. ౮

టీక॥పుత్రశోకాభిసంతప్తః= పుత్రదుఃఖముచే మిక్కిలితపింపఁజేయఁబడిన;సః=ఆ;మహీపతిః= భూమికిఁబ్రభువైనదశరథమహారాజు; అంతఃపురే= అంతఃపురమునందు; ఘోరం=భయంకరమయిన;తం=ఆ;ఆర్తశబ్దం= దుఃఖధ్వనిని;శ్రుత్వాచ = వినియు;సుదుఃఖితః= మిక్కిలియుదుఃఖమునొందినవాఁడు;ఆసీత్=ఆయెను.

పుత్రదుఃఖంబునంబరితపించుచుండునాదశరథమహారాజు,అంతఃపురమునందుండి భయంకరంబై వినఁబడుచుండురోదనశబ్దంబునువిని, యినుమడిదుఃఖంబునొందెను.అని,తాత్పర్యము.

నాగ్నిహోత్రాణ్య హూయంత నాపచన్ గృహమేధినః
అకుర్వ న్న ప్రజాః కార్యం సూర్యశ్చాం తరధీయత. ౯

టీక॥అగ్నిహోత్రాణి=అగ్నిహోత్రములు;నాహూయంత= వేల్వఁబడవయ్యె. గృహమేధినః=గృహస్థులు;నాపచన్=వండరైరి.ప్రజాః = జనులు; కార్యం=పనిని;నాకుర్వన్= చేయరైరి.సూర్యశ్చ=సూర్యుఁడును; అంతరధీయత= కనుపడకుండెను.

రాముండువనంబునకుఁబోయెనను దుఃఖంబున, నాహితాగ్నులగ్నిహోత్రంబులందు హోమము సేయరైరి; గృహస్థులెవ్వరును దమయిండ్లయందు వండుకొనరైరి;జనులన్నిపనులను విడిచిపెట్టియుండిరి; సూర్యుండునంతర్ధానంబునొందియుండెను. అని,తాత్పర్యము.

వ్యసృజన్ కబళాన్నాగా గావో వత్సాన్న పాయయన్
పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనందత. ౧౦

టీక॥ నాగాః= ఏనుఁగులు ; కబళాన్=గ్రాసములను; వ్యసృజన్= విడిచినవి. గావః=ఆవులు ; వత్సాన్= దూడలను; నపాయయన్ (నాపాయయన్)=త్రాఁగింపలేదు. జననీ=తల్లి; ప్రథమజం=మొదటఁబుట్టిన; పుత్రం= కొమరును; లబ్ధ్వా=పొంది; నాభ్యనందత=సంతోషింపలేదు.

ఏనుంగులాహారమునుదినలేదు; ఆవులుతమదూడలకుఁబాలివ్వలేదు; తల్లి తనయొద్దకు మొదటికొడుకు వచ్చినప్పుడు,ఎంతమాత్రము సంతోషింపకుండినది. అని, తాత్పర్యము.

త్రిశంకు ర్లోహితాంగశ్చ బృహస్పతిబుధావపి
దారుణా స్సోమ మభ్యేత్య గ్రహా స్సర్వే వ్యవస్థితాః. ౧౧

టీక॥ త్రిశంకుః=త్రిశంకువును; లోహితాంగశ్చ=అంగారకుండును; బృహస్పతిబుధావపి=బృహస్పతియును బుధుడును; దారుణాః= భయంకరంబులయిన; గ్రహాః=గ్రహంబులు; సర్వే = అన్నియు; సోమం=చంద్రుని; అభ్యేత్య=పొంది; వ్యవస్థితాః=ఉండినవి.

ఇక్ష్వాకుకులంబునకుఁ గూటస్థుండును ఆకాశంబుననక్షత్రరూపంబున నున్నవాఁడునగు త్రిశంకువును, అంగారకుండును బృహస్పతియును బుధుండును, ఇంకనితరములయిన క్రూరగ్రహములును, కొన్నిసంగమంబుచేతను గొన్ని దృష్టిచేతను గొన్నివక్రగతిచేతను, చంద్రునింబొందియుండినవి.

అని, తాత్పర్యము.

నక్షత్రాణి గతార్చీంషి గ్రహాశ్చ గతతేజసః
విశాఖాస్తు సధూమాశ్చ నభసి ప్రచకాశిరే. ౧౨

టీక॥ నక్షత్రాణి=నక్షత్రములు; గతార్చీంషి= పోయినప్రకాశముగలవై యును ; గ్రహాశ్చ=గ్రహములును; గతతేజసః = పోయిన కాంతి గలవయ్యెను; విశాఖాస్తు= విశాఖానక్షత్రమును ; సధూమాశ్చ= పొగతోఁగూడి

నదియు నై; నభసి= ఆకాశమునందు; ప్రచకాశిరే=ప్రకాశించినవి.

ఆకాశంబుననక్షత్రంబులు కాంతిలే కుండినవి;గ్రహంబులును నిష్ప్రభంబులై యుండినవి; కోసలదేశ నక్షత్రమయినవిశాఖానక్షత్రము, పొగతోఁగూడినట్లు,మలినంబై చూపట్టుచుండినది.

అని, తాత్పర్యము.

కాళికానిలవేగేన మహోదధి రివోత్థితః
రామే వనం ప్రవ్రజితే నగరం ప్రచచాల తత్. ౧౩

టీక॥రామే=రాముఁడు;వనం= అడవినిగూర్చి;ప్రవ్రజితే=పోఁగా; కాళికానిలవేగేన=మేఘసమూహముతోఁ గూడినగాలియొక్క వేగముచేత ; ఉత్థితః=లేచిన; మహోదధిరివ= మహాసముద్రమువలె; తత్=ఆ;నగరం= పట్టణము;ప్రచచాల=చలించినది.

వర్షాకాలమునందు,మేఘసమూహముతోఁగూడినమహా వాయువేగంబుననముద్రంబుపొంగునట్లు, రాముండడవికిఁబోగానే,ఆయయోధ్యా పట్టణంబంతయుఁజలనంబునొందినది.

అని, తాత్పర్యము.

దిశః పర్యాకులా స్సర్వా స్తిమిరేణే వ సంవృతాః
న గ్రహో నా పి నక్షత్రం ప్రచకాశే న కించన. ౧౪

టీక॥దిశః=దిక్కులు;సర్వాః= అన్నియు; పర్యాకులాః = కలఁతపడినవై, తిమిరేణ=చీఁకటిచేత; సంవృతాఇవ(స్థితాః)= కప్పఁబడినట్లుండినవి.గ్రహః=గ్రహము;నప్రచకాశే=ప్రకాశింపలేదు. నక్షత్రమపి= నక్షత్రముకూడ(ప్రచకాశే) = ప్రకాశింపలేదు. కించన=ఏదియును;న(ప్రచకాశే)=ప్రకాశింపలేదు.

సమస్తములయినదిక్కులును, వ్యాకులంబులయిచీఁకట్లుక్రమ్మినట్లుండినవి; గ్రహములుగానినక్షత్రంబులుగాని, సమస్తమునుప్రకాశములేకుండినది.

అని, తాత్పర్యము.

అకస్మా న్నాగర స్సర్వో జనో దైన్య ముపాగమత్

ఆహారే వా విహారే వా న కశ్చి దకరో న్మనః. ౧౫

టీక॥నాగరః=పట్టణమునందున్న; జనః=జనము;సర్వః=అంతయును;అకస్మాత్=కారణంబులేకయె;దైన్యం=దుఃఖమును;ఉపాగమత్=పొందెను. కశ్చిత్=ఒకానొకఁడును;ఆహారేవా=భుజించుటయందుఁగాని;విహారేవా=క్రీడించుటయందుఁగాని;మనః=మనసును; నాకరోత్=చేయఁడయ్యె.

పట్టణమునందున్న జనులందఱును, రాముండరణ్యంబునకుఁబోవుటకన్ననితరకారణంబులేకయె, మహాదుఃఖంబు నొందినది;ఆహారమునందుఁగానివిహారమునందుఁగాని, యెవ్వనికిని,రుచిగలుగకుండినది. అని,తాత్పర్యము.

శోకపర్యాయసంతప్త స్సతతం దీర్ఘ ముచ్ఛ్వసన్
అయోధ్యాయాం జన స్సర్వ శ్శుశోచ జగతీపతిమ్. ౧౬

టీక॥అయోధ్యాయాం=అయోధ్యయందు;జనః=జనము; సర్వః=అంతయును;శోకపర్యాయసంతప్తః=దుఃఖపరంపరచేఁదపింపఁ జేయఁబడినదై ; సతతం=ఎల్లప్పుడును;దీర్ఘం= అధికముగా;ఉచ్ఛ్వసన్=నిట్టూర్పు వుచ్చుచు;జగతీపతిం=భూమికిఁబ్రభువైనదశరథమహారాజునుగూర్చి ; శుశోచ=దుఃఖించుచుండినదియు.

అయోధ్యయందలిజనులందఱు, మహాదుఃఖంబునొంది, యెల్లప్పుడునువిడువకనిట్టూర్పులువుచ్చుచు,దశరథమహారాజుంబేర్కొనిదుఃఖించుచుండిరి.

అని, తాత్పర్యము.

బాష్పపర్యాకులముఖో రాజమార్గగతో జనః
న హృష్టో లక్ష్యతే కశ్చి త్సర్వ శ్శోకపరాయణః. ౧౭

టీక॥జనః=జనము; బాష్పపర్యాకులముఖః= కన్నీటిచేఁగలఁగినముఖముగలదిగాను;రాజమార్గగతః = రాజమార్గమును బొందినదిగాను; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది. కశ్చిత్=ఒకానొకఁడును;హృష్టః=సంతసించినవాఁడుగాను;నలక్ష్యతే=చూడఁబడలేదు. సర్వః = అంతయును ; శోకపరాయ

ణః = దుఃఖమేముఖ్యమయినగతిగాఁగ లదిగా; ఆసీత్ (అధ్యాహృతము) = అయినది.

జనులందఱు, ముఖంబునిండఁ గన్నీళ్లుగాఱ గృహంబులకుఁ బోవక రాజమార్గంబునం దిరుగుచుండిరి; ఒకఁడును సంతోషంబునొందియుండలేదు; అందఱును బరమదుఃఖంబునొందిరి.

అని, తాత్పర్యము.

న వాతి పవన శ్శీతో న శశీ సౌమ్యదర్శనః
న సూర్య స్తపతే లోకం సర్వం పర్యాకులం జగత్. ౧౮

టీక॥పవనః=గాలి; శీతః=చల్లగా; నవాతి=వీవలేదు. శశీ=చంద్రుఁడు, సౌమ్యదర్శనః= సుందరమయినచూడుటగలవాఁడుగా; న=ఉండలేదు. సూర్యః=సూర్యుఁడు; లోకం = లోకమును; నతపతే= తపింపఁజేయలేదు. సర్వం=సమస్తమయిన; జగత్= లోకము; పర్యాకులం=కలఁతనొందినది; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది.

వాయువు, చల్లఁగావీవఁడయ్యె; చంద్రుండుభయంకరంబుగాఁజూపట్టె; సూర్యుండెండగాయఁడయ్యె; ఇట్లు ప్రపంచమంతయు, గలఁతనొందియుండినది. అని, తాత్పర్యము.

అనర్థిన స్సుతా స్స్త్రీణాం భర్తారో భ్రాతర స్తథా
సర్వే సర్వం పరిత్యజ్య రామ మేవా న్వచింతయన్. ౧౯

టీక॥ సుతాః=కొడుకులు; స్త్రీణాం=స్త్రీలవిషయమయ్యును, తల్లులవిషయమయ్యునను టః; భర్తారః= పెనిమిటులు; స్త్రీణాం=భార్యల విషయమయ్యును; తథా=అట్లు; భ్రాతరః=తోఁబుట్టువులు; అన్యోన్యం (అధ్యాహృతము)= ఒండొరులవిషయమయ్యును; అనర్థినః= కోర్కిలేనివారలు; అభవన్ (అధ్యాహృతము)= అయిరి; సర్వే=అందఱును; సర్వం=అన్నిటిని; పరిత్యజ్య = విడిచి; రామమేవ = రామునే; అన్వచింతయన్ = తలంపుచుండిరి.

కొడుకులకు, తల్లులపైమమతలేకుండినది; భర్తలకుభార్యలపై ప్రేమదప్పినది; తోఁబుట్టువులు, ఒండొరులపైనే

హంబువదలిరి;అందఱును, అన్నిటినివిడిచి,రామునేచింతింపుచుండిరి.

అని, తాత్పర్యము.

యే తు రామస్య సుహృద స్సర్వే తే మూఢచేతసః
శోకభారేణ చాక్రాంతా శ్శయనం నజహు స్తదా. ౨౦

టీక॥ రామస్య = రామునియొక్క; సుహృదః=స్నేహితులు; యే = ఎవ్వరు; సంతి(అధ్యాహృతము)= కలరో; తే=వారలు; సర్వేతు = అందఱును; తదా=అప్పుడు; మూఢచేతసః= భ్రాంతినొందినమనసుగలవారలై; శోకభారేణ=దుఃఖాతిశయముచేత; ఆక్రాంతాః=అక్రమింపఁబడినవారలునై; శయనం=పడకను; నజహుః=విడువరైరి.

రాముని స్నేహితులందఱును, మహాదుఃఖంబున నేమియుం దోఁచక, భ్రాంతినొంది, నేలంబడియుండి, లేవరైరి.

అని, తాత్పర్యము.

తత స్త్వయోధ్యా రహితా మహాత్మనా
పురందరేణేవ మహీ సపర్వతా
చచాల ఘోరం భయశోకపీడితా
సనాగయోధాశ్వగణా ననాద చ. ౨౧

టీక॥ తతస్తు=అటుపిమ్మటను; మహాత్మనా=పూజ్యమయినస్వభావముగల రామునిచేత; రహితా = విడువఁబడినదియు; సనాగయోధాశ్వగణా= ఏనుగులయొక్కయు భటులయొక్కయు గుఱ్ఱములయొక్కయు సమూహములతోఁగూడినదియునగు; అయోధ్యా =అయోధ్యాపట్టణము; పురందరేణ= ఇంద్రునిచేత; రహితా(అధ్యాహృతము)= విడువఁబడిన; సపర్వతా = పర్వతములతోఁగూడిన; మహీవ = భూమివలెను; భయశోకపీడితా= భయముచేతను దుఃఖముచేతను బీడింపఁబడినదై; ఘోరం= భయంకరముగా; చచాల=చలించెను. ననాదచ = అఱచెను.

అంత, దేవేంద్రుండు లేనిచో, భూమండలము వ్యాకులంబగునట్లు, రాముండు లేకుండుటం జేసి, యయోధ్యాపట్ట

ణంబంతయు,వ్యాకులంబై, గజంబులు సుభటులునుగుఱ్ఱంబులును దుఃఖంబును భయంబునొందినాదంబులు సేయఁ, జలనంబునొంది,మహాధ్వనిగల్గియుండినది. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే,ఏకచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,అయోధ్యాకాండైకచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

౪౨

ద్విచత్వారింశసర్గప్రారంభః.

యావత్తు నిర్యత స్తస్య రజోరూప మదృశ్యత
నైవేక్ష్వాకువర స్తావ త్సంజహారా త్మచక్షుషీ. ౧

టీక॥నిర్యతః=పోవుచున్న;తస్య=ఆ రామునియొక్క;రజోరూపం=పరాగ మునియొక్క-రూపము;యావత్=ఎంతవ ఱకు;అదృశ్యత=చూడఁబడెనో; తావ త్తు=అంతవఱకును; ఇక్ష్వాకువరః=ఇ క్ష్వాకువంశమునఁ బుట్టినవారలలో శ్రే ష్ఠుండగుదశరథమహారాజు; ఆత్మచక్షు షీ=తనకన్నులను;నసంజహారైవ=మఱలింపనేలేదు.

ఆరాముండు పోవుచుండఁగా మార్గంబున,రథసంచారమువలనఁగలిగిన దుమ్ము, ఎంతవఱకగపడు చుండెనో, అంతవఱకును , దశరథమహారాజు, విడువక రామునింజూచుచు నేయుండెను.

అని, తాత్పర్యము.

యావద్రాజా ప్రియం పుత్రం పశ్య త్యత్యంతధార్మికమ్
తావ ద్వ్యవర్థతేవా స్య ధరణ్యాం పుత్రదర్శనే. ౨

టీక॥యావత్ = ఎంతవఱకు;రాజా=దశరథమహారాజు;ప్రియం = ఇష్టుండును;అత్యంతధార్మికం= మిక్కిలియుధర్మము నాచరించువాఁడునగు; పుత్రం=కొడుకును; పశ్యతి=చూచుచున్నాఁడో;తావత్ = అంతవఱకు;అస్య=ఈదశరథమహారాజుయొక్క; పుత్రదర్శనే= కొడుకుయొక్కచూచుటనిమిత్తమయి;ధరణ్యాం = భూమియందు; రజః(అధ్యాహృతము)= పరాగము;వ్యవర్ధతేవ= వృద్ధిఁబొందినట్లుండెను.

దశరథమహారాజు,ప్రియుండును బరమధార్మికుండునగు తనకొడుకును రాముని జూచునంతవఱకు, ఆరాముండెంతదూరముపోయినను , పరాగము గపడుచుండుటంజేసి,యాదశరథమహారాజును గొడుకునుజూడవలెననియే , భూమియందుఁ బరాగమవ్విధమునవృద్ధిఁబొందుచుండినట్లుదోఁచుచుండినది.

అని,తాత్పర్యము.

నపశ్యతి రజోప్యస్య యదా రామస్య భూమిపః
తదార్తశ్చ విషణ్ణశ్చ పపాత ధరణీతలే. 3

టీక॥భూమిపః=భూమిం బాలించునట్టిదశరథమహారాజు;యదా = ఎప్పుడు;అస్య=ఈరామునియొక్క ; రజోఽపి=పరాగమునుగూడ ; నపశ్యతి= చూడఁడయ్యెనో;తదా=అప్పుడు; ఆర్తశ్చ=పీడుఁడును;విషణ్ణశ్చ= దుఃఖితుఁడునై;ధరణీతలే = భూతలమునందు;పపాత=పడెను.

దశరథమహారాజంత రాముని రథపరాగముఁగూడఁగనుపడఁగపోఁగానే, పీడుండునుబరమదుఃఖితుండునై, నేలంబడెను. అని,తాత్పర్యము.

తస్య దక్షిణ మన్వాగా త్కౌసల్యా బాహు మంగనా
వామం చాస్యాన్వగాత్పార్శ్వం కైకేయీ భరతప్రియా. 4

టీక॥అంగనా=భార్యయయిన; కౌసల్యా=కౌసల్యాదేవి; తస్య=ఆదశరథునియొక్క;దక్షిణం=కుడిదైన ; బాహుం=చేతిని;అన్వాగాత్ =పొందినది. భరతప్రియా= భరతునియందుఁబ్రేమకల;కైకేయీచ = కైకేయియును ,

వామం=ఎడమదైన ; పార్శ్వం=ప్రక్కను;అన్వగాత్=పొందినది.

దశరథుండు నేలంబడఁగానే, కౌసల్యాదేవ నెత్తుటకై యుతని కుడిచేతింబట్టుకొనినది;భరతునియందుమాత్ర మధికప్రీతిగలకైకేయియు , వతనివామపార్శ్వంబుననుండినది.

అని.తాత్పర్యము.

తాం నయేనచ సంపన్నో ధర్మేణ వినయేనచ
ఉవాచ రాజా కైకేయీం సమీక్ష్య వ్యథితేంద్రియః. ౫

టీక॥నయేనచ= నీతితోను;ధర్మేణ=ధర్మముతోను;వినయేనచ= వినయముతోను;సంపన్నః=కూడినట్టి; రాజా=దశరథమహారాజు;తాం=ఆ; కైకేయీం=కైకేయిని;సమీక్ష్య= చూచి; వ్యథితేంద్రియః = పీడింపఁబడిన యింద్రియములుగలవాఁడై; ఉవాచ=చెప్పెను.

నీతియుధర్మమును వినయంబునుం గలదశరథమహారాజు, తనయెడమప్రక్కనున్నయాకైకేయింజూచి,పరమపీడితుండై,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కైకేయి మా మమాంగాని స్ప్రాక్షీ స్త్వం దుష్టచారిణీ
నహి త్వాం ద్రష్టుమిచ్ఛామి నభార్యా నచబాంధవీ. ౬

టీక॥కైకేయి=కైకేయీ! దుష్టచారిణీ=దుష్టురాలవగు;త్వం = నీవు;మమ=నాయొక్క;అంగాని= అవయవములను;మాస్ప్రాక్షీః= తాఁకకుము. త్వాం=నిన్ను;ద్రష్టుం=చూచుటకు; నేచ్ఛామిహి=కోరనుఁగదా!త్వం(అధ్యాహృతము)=నీవు;భార్యా= భార్యవు; న=కావు.బాంధవీచ=బంధువురాలును=కావు.

కైకేయీ! నీవుదుష్టురాలవు; నీవు నాయవయవంబులందాఁకవలదు;నిన్నుఁజూచుటకునాకిచ్ఛ లేదు;నీవుభార్యవుకావు; నీకును నాకును సాధారణబంధుత్వము లేదు. అని, తాత్పర్యము.

యేచ త్వా మనుజీవంతి నాహం తేషాం న తే మమ

కేవలార్థపరాం హి త్వాం త్యక్తధర్మాం త్యజామ్యహమ్. ౭

టీక॥ యేచ = ఎవ్వరును; త్వాం= నిన్ను; అనుజీవంతి=ఆశ్రయించిజీవింతురో; తేషాం=వారలకు; అహం= నేను; ప్రభుః(అధ్యాహృతము) = రాజును; న=కాను- తే= వారలు; మమ= నాకు; న (భృత్యాః)=భృత్యులు గారు- అహం= నేను; కేవలార్థపరాం= అర్థమునందుమాత్రమె యాసక్తురాలవును; త్యక్తధర్మాం= విడువఁబడినధర్మముగలదానవునగు; త్వాం = నిన్ను; త్యజామి హి=విడిచెదనుగదా!

మఱియు నిన్నెవ్వ రాశ్రయించి యున్నారో, వారలకు నేను రాజును గాను, నాకు వారలు భృత్యులు గారు; నీవు అర్థమునందుమాత్రమె యాసక్తిగలదానవు; నీకు ధర్మంబు గావలసినది లేదు; కావున, నిన్ను విడిచెదను-

అని, తాత్పర్యము.

అగృహ్ణాం యచ్చ తే పాణి మగ్నిం పర్యణయంచ యత్
అనుజానామి తత్సర్వ మస్మిఁల్లోకే పరత్రచ. ౮

టీక॥ తే=నీయొక్క; పాణిం=హస్తమును; అగృహ్ణాం (ఇతి) యచ్చ= గ్రహించితిననుట యేదియుఁగలదో; అగ్నిం=అగ్నిహోత్రమును; పర్యణయం (ఇతి) యచ్చ=ప్రదక్షిణింపఁజేసితిననుట యేదిగలదో; తత్ =దానిని; సర్వం=అంతను; అస్మిన్ = ఈ; లోకే=లోకమునందును; పరత్రచ= పరలోకమునందును; అనుజానామి= అనుమతించుచున్నాను, విడుచుచున్నాననుట.

నేనగ్నిసాక్షికంబుగా నీహస్తము నగ్రహించుటయు, నీతోఁగూడ నగ్నికిం బ్రదక్షిణంబు సేసియుండుటయు, ఈ రెంటివలన నీతో నాకుంగలిగిన సంబంధమును, ఐహికసంబంధముగాని పరలోకసంబంధముగాని, యంతయును, నిప్పుడు విడుచుచున్నాను.

అని, తాత్పర్యము.

భరతశ్చేత్ప్రతీత స్స్యాద్రాజ్యం ప్రాప్యైత దవ్యయమ్
యన్మే స దద్యా త్పిత్రర్థం మాం మా తద్దత్త మాగమత్. ౯

టీక॥ భరతః=భరతుఁడు; అవ్యయం =నాశములేని; ఇదం= ఈ; రాజ్యం=

దౌరతనమును; ప్రాప్య=పొంది; ప్రతీతః=సంతసించినవాఁడు; స్యాచ్చేత్ = అగునేని; సః=ఆభరతుఁడు; మే=నాకొఱకు; పిత్రర్థం= పితృదేవతలకొఱకు; యత్=ఏది; దద్యాత్ = ఇచ్చునో; తత్=అ; దత్తం= ఇవ్వఁబడినది; మాం=నన్ను; మాగమత్=పొందకుండుఁగాక.

భరతుండక్షయంబగు నీరాజ్యంబునొంది, సంతోషించునేని, యతండు, నన్నుద్దేశించి యొసంగు జలతర్పణాదులు, నాకుఁజేరకుండుఁగాక.

అని, తాత్పర్యము-

అథ రేణుసముధ్వస్తం సముత్థాప్య నరాధిపమ్
న్యవర్తత తదా దేవీ కౌసల్యా శోకకర్శితా. ౧౧

టీక॥అథ=అటుపిమ్మట; శోకకర్శితా=దుఃఖముచేఁ గృశింపఁజేయఁబడిన; దేవీ=రాణియగు; కౌసల్యా= కౌసల్య; తదా=అప్పుడు ; రేణుసముధ్వస్తం=దుమ్ముచేఁజెఱపఁబడిన; నరాధిపం=మనుష్యులకుఁబ్రభువైన దశరథుని; సముత్థాప్య=లేపి; న్యవర్తత=మఱలెను.

అంత, దుఃఖముసంగ్కృశించియున్న కౌసల్యాదేవి, దుమ్ముతోనిండియున్న దశరథమహారాజునులేవనెత్తి, యతనిం దీసికొని, మఱలిపోయెను.

అని, తాత్పర్యము.

హత్వేవ బ్రాహ్మణం కామాత్ స్పృష్ట్వాగ్నిమివ పాణినా
అన్వతప్యత ధర్మాత్మా పుత్రం సంచింత్య తాపసమ్. ౧౧

టీక॥ధర్మాత్మా = ధర్మస్వభావుండగు దశరథుండు; తాపసం=ఋషియయిన, తాపసవేషమును ధరించినయనుటః పుత్రం=కొడుకును ; సంచింత్య=తలంచుకొని; కామాత్= కోర్కివలన; బ్రాహ్మణం = బ్రాహ్మణుని; హత్వేవ=చంపినవలె; పాణినా= చేతిచేత; అగ్నిం=నిప్పును; స్పృష్ట్వేవ=తాఁకినవలె; అన్వతప్యత=పరితపించెను.

ధార్మికుండగు దశరథ మహారాజు, తాపసవేషమును దాల్చిన తనకొడుకుందలంచుకొని, కావలెనని బ్రాహ్మణు

| | |
|---|---|
| నించఁబడినవానికైవడి, హస్తంబుననగ్నిం దాఁకినవానిభంగి, మిక్కిలియు, ననుతా | పంబునొందుచుండెను. అని, తాత్పర్యము. |

నివృత్తైవ నివృత్తైవ సీదతో రథవర్త్మసు
రాజ్ఞో నాతిబభౌ రూపం గ్రస్తస్యాంశుమతో యథా. ౧౨

| | |
|---|---|
| టీక॥అథ = అటుపిమ్మట; వర్త్మసు = మార్గములందు; నివృత్తైవనివృత్తైవ = మరలిమరలియే; సీదతః = దుఃఖించుచున్న; రాజ్ఞః = కౌసల్యాదశరథులయొక్క; రూపం = దేహము; గ్రస్తస్య = రాహువుచేమ్రింగఁబడిన; అంశుమతః యథా = సూర్యునియొక్కవలె; | నాతిబభౌ = ప్రకాశింపలేదు. అంత, నమగడుగుసకును, మార్గములందు, మఱలిమఱలిచూచుచుఁ, బరమదుఃఖంబునొందుచున్న యాకౌసల్యాదశరథులు, రాహుగ్రస్తుఁడగుసూర్యునికైవడిఁ, బ్రకాశములేకుండిరి. అని, తాత్పర్యము. |

విలలాప చ దుఃఖార్తః ప్రియం పుత్ర మనుస్మరన్

| | |
|---|---|
| టీక॥సః(అధ్యాహృతము) = ఆదశరథుఁడు; ప్రియం = ఇష్టుండగు; పుత్రం = కొడుకును; అనుస్మరన్ = తలంచుచు, దుఃఖార్తః = దుఃఖముచేఁబీడింపఁబడినవాఁడై; విలలాప చ = రోదనంబుసే | సెను. ఆదశరథుఁడు, ప్రియపుత్రుండగు రాముండలంచుకొని, పరమదుఃఖితుండై, రోదనంబుసేయుచుండెను. అని, తాత్పర్యము. |

నగరాంత మనుప్రాప్తం బుద్ధ్వా పుత్ర మథాబ్రవీత్. ౧౩

| | |
|---|---|
| టీక॥సః(అధ్యాహృతము) = ఆదశరథమహారాజు; పుత్రం = కొడుకును; నగరాంతం = పట్టణముయొక్కకొనను; అనుప్రాప్తం = పొందినవానిఁగా; బుద్ధ్వా = తెలిసికొని; అథ = అటుపిమ్మట; | అబ్రవీత్ = చెప్పెను. ఆదశరథమహారాజంత, రాముండు పట్టణంబుదాఁటెనని తెలిసికొని, దుఃఖంబున, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము. |

వాహనానాంచ ముఖ్యానాం వహతాం తం మమాత్మజమ్
పదాని పథి దృశ్యంతే స మహాత్మా న దృశ్యతే. ౧౪

టీక॥ మమ=నాయొక్క; తం=ఆ; ఆత్మజం=కొడుకును; వహతాం= మోయుచున్న; ముఖ్యానాం=శ్రేష్ఠములయిన; వాహనానాంచ=గుఱ్ఱములయొక్కయు; పదాని=అడుగులు; పథి=మార్గమునందు; దృశ్యంతే=చూడఁబడుచున్నవి. సః=ఆ; మహాత్మా=పూజ్యస్వభావంబుగల రాముండు; నదృశ్యతే=చూడఁబడలేదు.

నాకొడుకయిన రామునిం దీసికొని పోయినయుత్తమాశ్వంబులయడుగులు నుమార్గంబునఁగపడుచున్నవి; ఆమహాత్ముండుమాత్రమగపడలేదు.

అని, తాత్పర్యము.

యః సుఖేషూపధానేషు శేతే చందనరూషితః
వీజ్యమానో మహార్హాభి స్త్రీభి ర్మమ సుతోత్తమః. ౧౫
స నూనం క్వచి దేవాద్య వృక్షమూల ముపాశ్రితః
కాష్ఠంవా యదివాశ్మాన ముపధాయ శయిష్యతే. ౧౬

టీక॥ మమ=నాయొక్క; సుతోత్తమః=కొడుకులలో శ్రేష్ఠుండగు; యః=ఎవ్వఁడు; చందనరూషితః=చందనముచేఁగప్పఁబడినవాఁడై; మహార్హాభిః=ఉత్తమలయిన; స్త్రీభిః=స్త్రీలచేత; వీజ్యమానః=వీవఁబడినవాఁడై; సుఖేషు=సుఖకరములయిన; ఉపధానేషు= తలగడలయందు; శేతే = పరుండునో; సః=అట్టివాఁడు; అద్య=ఇప్పుడు; క్వచిదేవ=ఒకానొకచోటనె; వృక్షమూలం=చెట్టుక్రిందను; ఉపాశ్రితః= పొందినవాఁడై; కాష్ఠంవా=కొయ్యనుగాని; అశ్మానంయదివా=ఱాతినిగాని; ఉపధాయ=తలగడగాఁజేసికొని; శయిష్యతే=పరుండఁగలఁడు. నూనం = నిశ్చయము.

సుగంధిచందనంబుఁబూసికొని, యుత్తమస్త్రీలు వీవఁగా, సుఖకరంబులయిన తలగడలందుఁబరుండునట్టి, నాప్రియపుత్రుం, డిప్పుడు, ఎచ్చటనో యొక్కచోట, నొక్కచెట్టుక్రింద, కొయ్యనుగాని ఱాతినిగాని తలగడగాఁజేసికొని, పరుండియుండును; ఇది, నిశ్చయము.

అని, తాత్పర్యము.

ఉత్థాస్యతిచ మేదిన్యాః కృపణః పాంసుకుంఠితః
వినిశ్వసన్ ప్రస్రవణాత్ కరేణూనామివ ర్షభః. ౧౬

టీ॥ సః (అధ్యాహృతము)=అట్టి; ఉత్థాస్యతిచ=లేవనుంగలఁడు. రాముఁడు; కృపణః = దుఃఖితుండై; పాంసుకుంఠితః=దుమ్ముతోఁగప్పఁబడినవాఁడై; వినిశ్వసన్=నిట్టూర్పు విడుచుచు; మేదిన్యాః = నేలనుండి; ప్రస్రవణాత్ = సెలయేటినుండి ; కరేణూనాం=ఆఁడేనుంగులయొక్క; ఋషభ ఇవ=ప్రధానమైన మగయేనుఁగువలె; ఉ

అట్టివాఁడగు రాముండింక, దుఃఖితుండై, దేహంబంతయు దుమ్మునిండియుండఁగా, నిట్టూర్పు విడుచుచు, సెలయేటిసమీపంబుననుండి యేనుంగు లేచునట్లు, నేలమీఁదనుండి లేవఁగలఁడు. అని, తాత్పర్యము.

ద్రక్ష్యంతి నూనం పురుషా దీర్ఘబాహుం వనేచరాః
రామ ముత్థాయ గచ్ఛంతం లోకనాథ మనాథవత్. ౧౭

టీ॥ వనేచరాః=వనంబునందిరుగుచుండునట్టి; పురుషాః=పురుషులు ; దీర్ఘబాహుం = నిడుపైనచేతులుగలవాఁడును; లోకనాథం=లోకంబునకుఁ బ్రభువును; అనాథవత్= నాథుండు లేనివాఁడువలె; ఉత్థాయ=లేచి ; గచ్ఛంతం=పోవుచున్నవాఁడునగు; రామం=రాముని; ద్రక్ష్యంతి=చూడఁగలరు. నూనం=నిశ్చయము.

వనవాసులగుపురుషులు, మహాబాహుండును లోకనాథుండునగు రాముం డనాథయుంబోలె నేలమీఁదనుండి లేచిపోవుచుండఁగాఁజూడఁగలరు; ఇదినిశ్చయము. అని, తాత్పర్యము.

సా నూనం జనకస్యేష్టా సుతా సుఖసహోచితా
కంటకాక్రమణాక్రాంతా వనమద్య గమిష్యతి. ౧౮

టీ॥ జనకస్య — జనకమహారాజుయొక్క; ఇష్టా = ప్రియయయిన; సుతా—కూఁతురును; సుఖసహోచితా = సుఖంబునకెల్లప్పుడునుదగినదియునగు; సా=అట్టిసీతాదేవి; అద్య= ఇప్పుడు; కంటకాక్రమణాక్రాంతా =

ముండ్లయం దడుగుండుటచే నాక్రమింపఁబడినదై; వనం=అడవిని; గమిష్యతి=పొందఁగలదు. నూనం=నిశ్చయము.

జనకమహారాజప్రియపుత్త్రియు, నెల్లప్పుడును సుఖంబనుభవించుటకే తగినదియునగు నాసీత, యిప్పుడు, ముండ్లపై నడుగులు పెట్టి, పాదంబులయందు ముండ్లుగ్రుచ్చుకొనఁగా, బాధపడుచు, నడవి లోఁబోఁగలఁదు; నిశ్చయము.

అని, తాత్పర్యము.

అనభిజ్ఞా వనానాం సా నూనం భయ ముపైష్యతి
శ్వాపదా నర్దితం శ్రుత్వా గంభీరం రోమహర్షణమ్. ౨౦

టీక॥ వనానాం=అడవులకు; అనభిజ్ఞా=పరిచితురాలు కానట్టి; సా=ఆసీత; గంభీరం = భయంకరంబును; రోమహర్షణం=వెండ్రుకలగగుర్పొడుచునట్లు సేయునదియునగు; శ్వాపదానర్దితం= క్రూరజంతువులయొక్క ధ్వనిని; శ్రుత్వా=విని; భయం=వెఱపును; ఉపైష్యతి=పొందఁగలదు. నిశ్చయం=నిశ్చయము.

ఆసీత, యెప్పుడు నడవుల నెఱుంగనిది కావున, భయంకరంబును గగుర్పాటు గలిగించునదియునగు క్రూరజంతువుల ధ్వనిని విని, భయంబునొందును; ఇది నిశ్చయము. అని, తాత్పర్యము.

సకామా భవ కైకేయి విధవా రాజ్య మావస
న హి తం పురుషవ్యాఘ్రం వినా జీవితు ముత్సహే. ౨౧

టీక॥ కైకేయి=కైకేయీ! సకామా = కోర్కులతోఁగూడినదానవు ; భవ=అగుము. విధవా= ముండమోపివై ; రాజ్యం=దొరతనమును; ఆవస= అధిష్ఠింపుము. అహం (అధ్యాహృతము)=నేను, పురుషవ్యాఘ్రం= పురుషశ్రేష్ఠుండగు; తంవినా= ఆరాముని విడిచి; జీవితుం=బ్రతుకుటకు ; నోత్సహే=కోరనుగదా!

కైకేయీ! నీకోరిక నెఱవేఱినది; ఇంక విధవవై దొరతనము సేయుము; నేను మాత్రము, పురుషశ్రేష్ఠుండగు నారాముని విడిచి, యెంతమాత్రము జీవింపఁజాలను. అని, దశరథుండు, విలపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవం విలప న్రాజా జనౌఘేనా భిసంవృతః
అపస్నాత ఇవారిష్టం ప్రవివేశ పురోత్తమమ్. ౨౨

టీక॥ రాజా=దశరథమహారాజు; ఇతి=అని; ఏవం=ఈప్రకారముగా; విలపన్=రోదనంబుసేయుచు; జనౌఘేన=జనసమూహముచేత; అభిసంవృతః=చుట్టఁబడినవాఁడై; అపస్నాత ఇవ=ఎవ్వరైననుజనిపోఁగా, సందుకై స్నానముచేసినవాఁడువలె; అరిష్టం=అమంగళకరంబయిన; పురోత్తమం=పట్టణంబులలోఁశ్రేష్ఠమయినయయోధ్యను; ప్రవివేశ=చొచ్చెను.

దశరథమహారాజు, ఈప్రకారము రోదనము సేయుచు జనసమూహము చేఁబరివేష్టితుండై, బంధువృమృతుఁడగునేనిస్నానముచేసినవాఁడువలెఁ, బరమఁటునుండై; యయోధ్యంబ్రవేశించెను.

అని, తాత్పర్యము.

శూన్యచత్వరవేశ్మాంతాం సంవృతాపణదేవతామ్
క్లాంతదుర్బలదుఃఖార్తాం నాత్యాకీర్ణమహాపథామ్. ౨౩
తా మవేక్ష్య పురీం సర్వాం రామమేవా నుచింతయన్
విలప న్ప్రావిశద్రాజా గృహం సూర్య ఇవాంబుదమ్. ౨౪

టీక॥ రాజా= దశరథమహారాజు; శూన్యచత్వరవేశ్మాంతాం= జనులులేని చదుకములును ఇంటివాకిళ్లునుగలదియును; సంవృతాపణదేవతాం= మూయఁబడినయంగడివీధియందలి దేవతలుగలదియును; క్లాంతదుర్బలదుఃఖార్తాం= బడలినవారలును బలములేని వారలును దుఃఖముచేఁ బీడింపఁబడినవారలునగు జనులుగలదియు; నాత్యాకీర్ణమహాపథాం=అధికముగావ్యాపింపఁబడనిరాజమార్గములు గలదియునగు, కొంచెముగ జనులుగల రాజమార్గము గలదియునగు నసుట; తాం=ఆ; పురీం = అయోధ్యా పట్టణమును; సర్వాం = అంతను; అవేక్ష్య= చూచి; రామమేవ=రామునే; అనుచింతయన్=తలంచుచు; విలపన్=దుఃఖించుచు; గృహం=ఇంటిని; సూర్యః= సూర్యుఁడు; అంబుదమివ= మేఘమునువలెఁ; ప్రావిశత్=చొచ్చెను.

దశరథమహారాజు, చతుష్పథంబులందును గృహద్వారంబులందును జనులు లేనిదియు, మూయఁబడినయంగడివీధియందలి దేవాలయములుగలదియు, [illegible]

హంబుననడువశక్తిగల జనులందఱురా మునివెంబడించిపోయిరికావున, బడలి యున్మర్త్యులై దుఃఖాతురులయిన జను లుమాత్రమె గలదియు, రాజమార్గ మునందునుగూడఁ గొంచెముగానే జను లుగలదియునగు, నయోధ్యాపట్టణ ముంజూచి, రామునేతలంచుచు, రోద నంబుసేయుచు, సూర్యుండు మేఘమును బ్రవేశించునట్లు, గృహంబునుబ్రవేశించె ను. అని, తాత్పర్యము.

మహాహ్రద మివాక్షోభ్యం సుపర్ణేన హృతోరగమ్
రామేణ రహితం వేశ్మ వైదేహ్యా లక్ష్మణేనచ. ౩౫

టీక॥సః(అధ్యాహృతము) = ఆద శరథుఁడు ; అక్షోభ్యాం — కలఁతపెట్టఁగూడనిదియును;సుపర్ణేన — గరుత్మంతునిచేత;హృతోరగం=అపహరింపఁబడినసర్పముగలదియునగు; మహాహ్రదమివ(స్థితం)— పెద్దమడుగువలెనున్నదియు; రామేణ= రామునిచేతను;వైదేహ్యా=సీతచేతను ; లక్ష్మణేనచ=లక్ష్మణునిచేతను; రహితం=విడువఁబడినదియునగు;వేశ్మ=గృహమును; ప్రవివేశ(అధ్యాహృతము)=చొచ్చెను.

రాముఁడునుసీతయును లక్ష్మణుండునులేకుండుటంజేసి, మహాసర్పంబు గలదగుటవలనఁజొరరానిదై గరుత్మంతుండాసర్పంబునపహరించుట వలన సుఖసాధ్యంబై యుండు పెద్దమడుగువలెనున్న,గృహమును, దశరథమహారాజుప్రవేశించెను. అని, తాత్పర్యము.

అథ గద్గదశబ్దస్తు విలప న్మనుజాధిపః
ఉవాచ మృదు మందార్థం వచనం దీన మస్వరమ్. ౩౬

టీక॥అథ=అటుపిమ్మట; మనుజాధిపః=మనుష్యులకుఁ బ్రభువైనదశరథమహారాజు;గద్గదశబ్దస్తు= డగ్గుత్తికతోఁగూడినధ్వనిగలవాఁడై;విలపన్= రోదనంబుసేయుచు;మృదు— మెత్తనిదియు; మందార్థం— చిన్నదియర్థముగలదియు;దీనం—దుఃఖముతోఁగూడినదియు; అస్వరం=ధ్వనిలేనిదియునగు;వచనం= మాటను;ఉవాచ=చెప్పెను.

అంత, దశరథమహారాజు,రోదనంబుసేయుచు,డగ్గుత్తికతోదుఃఖంబునందిన్నఁగా, నితరులకుసులభముగాఁ దెలి

యాఁదగినంతటిధ్వనిలేకుండునట్లు, ఈమాటం, జెప్పెను. అని, తాత్పర్యము.

కౌసల్యాయా గృహం శీఘ్రం రామమాతు ర్నయంతు మామ్
న హ్యా న్యత్ర మమాశ్వాసో హృదయస్య భవిష్యతి. ౨౮

టీక॥ రామమాతుః = రామునితల్లి యయ్యున; కౌసల్యాయాః = కౌసల్యయొక్క; గృహం = ఇంటిని; మాం = నన్ను; శీఘ్రం = శీఘ్రముగా; నయంతు = పొందింతురుగాక. అన్యత్ర = ఇతరమ యినస్థలమునందు; మమ = నాయొక్క; హృదయస్య = మనసునకు; ఆశ్వాసః = ఊఱట; నభవిష్యతిహి = కలుగదుగదా!

నన్ను, శీఘ్రముగా, రామునితల్లియయినకౌసల్యయింటికిఁ దీసికొనిపోవుదురుగాక; ఇంక నెచ్చటను, నామనసునకూఱటగలుగదు. అని, దశరథమహారాజు, చెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి బ్రువంతం రాజాన మనయ న్ద్వారదర్శినః
కౌసల్యాయా గృహం తత్ర న్యవేశ్యత వినీతవత్. ౨౯

టీక॥ ద్వారదర్శినః = దారిచూపునట్టివారలు; ఇతి = ఇట్లు; బ్రువంతం = చెప్పుచున్న; రాజానం = దశరథమహారాజును; కౌసల్యాయాః = కౌసల్యయొక్క; గృహం = ఇంటిని; అనయన్ = పొందించిరి. తత్ర = అచ్చట; సః (అధ్యాహృతము) = ఆదశరథమహారాజు; వినీతవత్ = వినయంబుగలవాఁడువలె; న్యవేశ్యత = ఉంచఁబడెను.

దశరథుండీప్రకారముచెప్పఁగానే, దారిచూపునట్టివారలతనిఁ గౌసల్యాగృహముచేర్చిరి; అంతనతండచ్చట దీనుండైయుండెను. అని, తాత్పర్యము.

తత స్తస్య ప్రవిష్టస్య కౌసల్యాయా నివేశనమ్
అధిరుహ్యాపి శయనం బభూవ లులితం మనః. ౩౦

టీక॥ తతః = అటుపిమ్మట; కౌసల్యాయాః = కౌసల్యయొక్క; నివేశనం = ఇంటిని; ప్రవిష్టస్య = చొచ్చిన; తస్య = ఆదశరథమహారాజుయొక్క; మనః = మనసు;

శయనం=పాన్పునందు;అధిరుహ్యాపి = ఎక్కియు;ఆలుళితం=చలించినది, బభూవ=అయినది.

అంత,నాదశరథమహారాజు, కౌసల్యాగృహమునుబ్రవేశించి, శయనంబునొందియు, పరమదుఃఖంబునొందెను.

అని, తాత్పర్యము.

పుత్ర ద్వయవిహీనంచ స్నుషయాపి వివర్జితమ్
అపశ్య ద్భవనం రాజా నష్టచంద్ర మివాంబరమ్. ౩౦

టీక॥రాజా=దశరథ మహారాజు; పుత్రద్వయవిహీనంచ=కొడుకుల రెండిటిచేవిడువఁబడినదియును ; స్నుషయాపి=కోడలిచేతను; వివర్జితం=విడువఁబడినదియునగు;భవనం= గృహమును; నష్టచంద్రం= నశించినచంద్రుఁడుగల; అంబరమివ=ఆకాశమునువలె ; అపశ్యత్=చూచెను.

రాముఁడునులక్ష్మణుఁడునుసీతయునులేకుండుటంజేసి,యాగృహంబు, చంద్రుండులేనియాకాశంబువలె,దశరథమహారాజునకుఁ,జూపట్టుచుండెను.

అని, తాత్పర్యము.

తచ్చ దృష్ట్వా మహారాజో భుజ ముద్యమ్య వీర్యవాన్
ఉచ్చైః స్స్వరేణ చుక్రోశ హారాఘవ జహాసి మామ్. ౩౧

టీక॥వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల;మహారాజః= దశరథమహారాజు;తత్ = ఆయింటిని;దృష్ట్వాచ=చూచియు;భుజం = చేతిని;ఉద్యమ్య=ఎత్తి;"హారాఘవ= అయ్యోరాముఁడా!మాం=నన్ను;జహాసి= విడుచుచున్నావు!"ఇతి(అధ్యాహృతము)= అని;ఉచ్చైస్స్వరేణ= ఉన్నతధ్వనిచేత; చుక్రోశ=అఱచెను.

పరాక్రమవంతుండగు, నాదశరథమహారాజు,ఆయింటినింజూచి, పరమదుఃఖంబునొందిచేయియెత్తి, గట్టిగా, "అయ్యోరాముఁడా! నన్నువిడిచిపోవుచున్నావే!"అని,యాక్రోశించెను.

అని, తాత్పర్యము.

సుఖితా బత తం కాలం జీవిష్యంతి నరోత్తమాః

పరిష్వజంతో యే రామం ద్రక్ష్యంతి పున రాగతమ్. ౩౨

టీక॥యే=ఏ;నరోత్తమాః=పురుష శ్రేష్ఠులు;తం=ఆ; కాలం=కాలమును; ద్రక్ష్యంతి=చూడంగలరో; తే(అధ్యాహృతము)=వారలు;సుఖితాః= సుఖమునొందినవారలై;పరిష్వజంతః=కౌఁగిలించుకొనుచు,పునరాగతం = మరల వచ్చిన;రామం=రాముని;ద్రక్ష్యంతి = చూడఁగలరు.

రాముండు మరలవచ్చుసమయమును జీవించియుండు పురుషశ్రేష్ఠులందరును, సుఖంబునొంది, పరమసంతోషంబున, నొండొరులంగవుఁగిలించుకొనుచు, మరలనిచ్చటికివచ్చినరాముం, జూడఁగలరు.అని,దశరథుండు,విలపించెను.

అని, తాత్పర్యము.

అథ రాత్ర్యాం ప్రపన్నాయాం కాళరాత్ర్యా మివాత్మనః
అర్ధరాత్రే దశరథః కౌసల్యా మిద మబ్రవీత్. ౩౩

టీక॥అథ=అటుపిమ్మట; దశరథః= దశరథుఁడు;ఆత్మనః=తనకు; కాళరాత్ర్యామివ(స్థితాయాం)=ప్రళయకాలరాత్రివలెనుండు;రాత్ర్యాం= రాత్రి;ప్రపన్నాయాం=రాఁగానే;అర్ధరాత్రే=సగమురాత్రియందు ; కౌసల్యాం=కౌసల్యనుగూర్చి;ఇదం = ఈ మాటను;అబ్రవీత్=చెప్పెను.

అంతఁ,దనకుఁబ్రళయకాలరాత్రివలెనతిభయంకరంబై తోఁచుచున్నరాత్రి రాఁగానే , దశరథుండర్ధరాత్రిసమయంబునఁ,గౌసల్యంజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

రామం మేఽనుగతా దృష్టి రద్యాపి న నివర్తతే
న త్వా పశ్యామి కౌసల్యే సాధు మాం పాణినా స్పృశ. ౩౪

టీక॥కౌసల్యే=కౌసల్యా! రామం= రాముని; అనుగతా = వెంబడించిన; మే=నాయొక్క;దృష్టిః=చూపు ; అద్యాపి=ఇప్పటికిని;ననివర్తతే= మరలకున్నది. త్వా=నిన్ను; నపశ్యామి=చూడకున్నాను.మాం=నన్ను;సాధు= చక్కఁగా; పాణినా=చేతిచేత;స్పృశ= తాఁకుము.

కౌసల్యా! నాదృష్టి, ఇంకను రాముని పైననేయున్నది ; ఇప్పుడును స్వాధీనము గాకున్నది; కావున, నేనునిన్నుం జూడంజాలకున్నాను; నీవు నాయందు దయయుంచి, "కైకేయిమాటవిని యింతదూరము చేసినాం" డనుకోపంబువిడిచి, "యేమియు తెలియక చేసినాం" డనిమన్నించి, నీహస్తముచేత, నన్నుంజక్కంగా; స్పృశింపుము; అప్పటికి, నాసంతాపము కొంతవఱకు, అణంగును, అని, దశరథుండు, కౌసల్యతోం జెప్పెను.

అని, తాత్పర్యము.

తం రామ మే వానువిచింతయంతం
సమీక్ష్య దేవీ శయనే నరేంద్రమ్
ఉపోపవిశ్యా ధిక మార్తరూపా
వినిశ్వసంతీ విలలాప కృచ్ఛ్రమ్. ౩౪

టీక॥ దేవీ = రాణియగుకౌసల్య; శయనే = పాన్పునందు ; రామమేవ = రామునే ; అనువిచింతయంతం = తలంచుచున్న ; తం = ఆ ; నరేంద్రం = మనుష్యులకుంబ్రభువైన దశరథుని ; సమీక్ష్య = చూచి; ఉపోపవిశ్య = సమీపమునందుంగూర్చుండి; అధికం = మిక్కిలియు; ఆర్తరూపా = దుఃఖము పొందినరూపముగలదై ; వినిశ్వసంతీ = నిట్టూర్పులువుచ్చుచు; కృచ్ఛ్రం = కష్టముగా; విలలాప = రోదనము చేసెను.

అంతం, కౌసల్యాదేవి, పాన్పుపై నుండి రామునే తలంచుకొనుచు దుఃఖించుచున్న యాదశరథమహారాజుంజూచి, యతని సమీపంబునం గూర్చుండి పరమదుఃఖంబునొంది, నిట్టూర్పులు వుచ్చుచు, రోదనంబు చేసెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, ద్విచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికావ్యాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, అయోధ్యాకాండద్విచత్వారింశసర్గటీక, ముగిసినది.

శ్రీః

## త్రిచత్వారింశసర్గప్రారంభః.

తత స్సమీక్ష్య శయనే సన్నం శోకేన పార్థివమ్
కౌసల్యా పుత్రశోకార్తా తమువాచ మహీపతిమ్. ౧

టీక॥తతః=అటుపిమ్మట; పుత్రశోకార్తా=పుత్రదుఃఖముచేతఁ బీడింపఁబడిన; కౌసల్యా=కౌసల్య; శయనే=పాన్పునందు; శోకేన=దుఃఖముచేత; సన్నం=కృశించిన; పార్థివం= దశరథమహారాజును; సమీక్ష్య=చూచి; తం=ఆ; మహీపతిం=భూమికిఁ బ్రభువైన; దశరథమహారాజునుగూర్చి; ఉవాచ = చెప్పెను.

అంతఁ, బుత్రదుఃఖంబునఁ బీడింపఁబడుచున్న కౌసల్య, శయనంబునందు దుఃఖముచేఁ గృశించియున్న దశరథమహారాజుం జూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

రాఘవే నరశార్దూలే విష ముప్త్వా విజిహ్వతామ్
విచరిష్యతి కైకేయీ నిర్ముక్తేవ హి పన్నగీ. ౨

టీక॥కైకేయీ=కైకేయి; నరశార్దూలే=పురుషశ్రేష్ఠుండగు; రాఘవే=రామునందు; విజిహ్వతాం= కౌటిల్యమనెడు; విషం=విషమును; ఉప్త్వా=ఉంచి; నిర్ముక్తా=కుబుసమువిడిచిన; పన్నగీవ=పామువలె; విచరిష్యతిహి = తిరుగఁగలదుగదా!

కైకేయి, పురుషశ్రేష్ఠుండగు రామునకుఁ గుటిలముగా విషంబు వంటియపకారముగావించినది; ఇంక, సుఖముగాఁ, గుబుసమువిడిచిన పామువలె, సంతోషంబున విహరింపఁగలదు.

అని, తాత్పర్యము.

వివాస్య రామం సుభగా లబ్ధకామా సమాహితా
త్రాసయిష్యతి మాం భూయో దుష్టాహి రివ వేశ్మని. ౩

టీక॥సుభగా = సుందరియగు కైకేయి; రామం=రాముని; వివాస్య= ఊరు వెడలఁగొట్టి; లబ్ధకామా= పొందఁబడిన కోరికగలదై; సమాహితా=సమాధా

నముగలదై; వేశ్మని=ఇంటియందు; దుష్టాహిరివ=దుష్టసర్పమువలె; మాం=నన్ను; భూయః= ఇంకనధికముగా; త్రాసయిష్యతి=భయపఱుపఁగలదు.

సుందరాంగియగు కైకేయి, రాముని వనంబునకుఁ బోవునట్లుచేసి, తనకోర్కులం దీర్చుకొన్నదై, మనస్సమాధానంబునొంది, యింటం జేరినదుష్టసర్పమువలె, నన్నింకమఱియునధికముగా భయపఱచును. అని, తాత్పర్యము.

అథ స్మ నగరే రామ శ్చరన్ భైక్షం గృహే వసేత్
కామకారో వరం దాతు మపి దాసం మమాత్మజమ్. ౪

టీక॥ అథ=ఇంక; మమ = నాయొక్క; ఆత్మజం=కొడుకును ; దాసం= దాసునిఁగా; దాతుం = ఇచ్చుటకు ; కామకారోపి= కోర్కెసేయుటయును; వరం=శ్రేష్ఠము. రామః= రాముడు; నగరే=పట్టనమునందు; భైక్షం= భిక్షాచరణమును ; చరన్ =చేయుచు ; గృహే=ఇంటియందు ; వసేత్ స్మ = ఉండునుగదా!

ఇంతకన్న, రామునకన్నమునుంబెట్టక, భరతునకతనిదాసునిగాఁగోరుటయు యిననాకుమంచిదే; ఆపక్షమున , రాముండు, పట్టణంబునబిచ్చమెత్తితినుచు, భరతునకు సేవసేయుచు, గృహంబున నాయెదుట నెయుండును.

అని, తాత్పర్యము.

పాతయిత్వా తు కైకేయ్యా రామం స్థానా ద్యథేష్టతః
ప్రవిష్టో రక్షసాం భాగః పర్వణీ వాహితాగ్నినా. ౫

టీక॥ త్వయాతు(అధ్యాహృతము)= నీచేతను; యథేష్టతః= స్వేచ్ఛవలన ; రామం= రాముని ; స్థానాత్ =స్వస్థానమునుండి; పాతయిత్వా= పడఁద్రోసి ; భాగః = రాజ్యభాగము ; కైకేయ్యాః=కైకేయికి; అహితాగ్నినా= అగ్న్యాధానముచేసినవానిచేత ; భాగః (అధ్యాహృతము) = హవిర్భాగము; పర్వణి = పర్వకాలమునందు ; రక్షసామివ = రాక్షసులకువలె ప్రవిష్టః=ఇయ్యఁబడినది.

నీవు, స్వేచ్ఛగా, రాముని , నతనిస్థానంబునుండి, పడఁద్రోసి, "యాహితాగ్నియగువాఁడు పర్వకాలంబున, కేవ

తలకిచ్చెఁదగినసహవిభాగమును, మోహంబునరాక్షసులకిచ్చునట్లు, రామునకీవలసిన రాజ్యభాగమును గైకేయి కిచ్చినావు. అని, తాత్పర్యము.

గజరాజ గతి ర్వీరో మహాబాహు ర్ధనుర్ధరః
వనమావిశతే నూనం సభార్య స్సహలక్ష్మణః. ౬

టీక॥గజరాజగతిః= ఏనుంగులలో శ్రేష్ఠమయిన యేనుంగుయొక్క నడకవంటినడకగలవాఁడును;వీరః=పరాక్రమశాలియును;మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడును; ధనుర్ధరః=విల్లుదాల్చినవాఁడునగు రాముఁడు ; సభార్యః=భార్యతోఁగూడినవాఁడై; సహలక్ష్మణః=లక్ష్మణునితోఁ గూడినవాఁడై; వనం=అడవిని; ఆవిశతే= ప్రవేశించుచున్నాఁడు. నూనం=నిశ్చయము.

మహాగజంబునకుంబోలెగంభీరంబగునడకగలవాఁడును,పరాక్రమశాలియునుమహాబాహుండును ధనుర్ధరుండునగు రాముండు,భార్యనులక్ష్మణునింగూడి , వనంబునకుబోవుచున్నాఁడు!

అని, తాత్పర్యము.

వనే త్వదృష్టదుఃఖానాం కైకేయ్యా నుమతే త్వయా
త్యక్తానాం వనవాసాయ కాన్వవస్థా భవిష్యతి. ౭

టీక॥వనే=అడవియందు ; అదృష్టదుఃఖానాం=చూడఁబడని దుఃఖముగలవారలును; త్వయా=నీచేత ; కైకేయ్యాః(సంధియార్షము) = కైకేయియొక్క;అనుమతే=అజ్ఞయందు; వనవాసాయ = అడవియందుండుటకొఱకు;త్యక్తానాం=విడువఁబడినవారలునగువారలకును; కా=ఏ;అవస్థా= అవస్థ;భవిష్యతి=కాఁగలదు.

నీవుకైకేయిమాటనువిని , ఎప్పుడునువనవాసదుఃఖంబు ననుభవించి యెఱుంగనట్టి యీసీతారామలక్ష్మణులు, వనంబునవసింపనాజ్ఞాపించితివే ; వారలువనంబున నెట్లుండురో!

అని, తాత్పర్యము.

తే రత్నహీనా స్తరుణాః ఫలకాలే వివాసితాః
కథంవత్స్యంతి కృపణాః ఫలమూలైః కృతాశనాః. ౮

టీక॥ తరుణౌ = యౌవనంబుగల; తౌ = ఆ సీతారామలక్ష్మణులు; రత్నహీనా = శ్రేష్ఠవస్తువులచే విడువఁబడినవారలై; ఫలకాలే = భోగకాలమునందు; వివాసితౌ = వెడలఁగొట్టఁబడినవారలై; కృపణౌ = దరిద్రులై; ఫలమూలై = పండ్ల చేతను గడ్డల చేతను; కృతాశనా = చేయఁబడిన యాహారముగలవారలై; కథం = ఎట్లు, వత్స్యంతి = ఉండఁగలరు?

సీతారామలక్ష్మణులు, మంచియౌవనకాలంబున, భోగంబులనుభవింపవలసినప్పుడు, శ్రేష్ఠవస్తువులంబాసి, నీయాజ్ఞవలన, నరణ్యంబునకుఁబోయి, దరిద్రులయి, ఫలమూలంబులందినుచు, నెట్లుండఁగలరు? అని, తాత్పర్యము.

అపీదానీం సకాలస్స్యాన్మమ శోకక్షయ శ్శివః
సభార్యం యత్సహభ్రాత్రా పశ్యేయ మిహ రాఘవమ్. ౯

టీక॥ యత్ = ఏకాలమునందు; సభార్యం = భార్యతోఁగూడిన; రాఘవం = రాముని; భ్రాత్రాసహ = తమ్మునితోఁగూడ; ఇహ = ఇచ్చట; పశ్యేయం = చూతునో; సః = అట్టి; మమ = నాయొక్క; శోకక్షయః = దుఃఖముయొక్క నాశముగలిగించునట్టిదియు; శివః = మంగళకరంబునగు; కాలః = కాలము; ఇదానీం = ఇప్పుడు; స్యాదపి = అగునా? ఏమి!

ఇప్పుడీయాపదునాలుగు సంవత్సరంబులనుగడిచి, రాముండు సుసీతయు లక్ష్మణుండును, ఇచ్చటికిరాఁగా, నేనుజూచి, నాదుఃఖంబునశించునంతటికాలము గల్గునా? ఏమి!

అని, తాత్పర్యము.

శ్రుత్వైవోపస్థితా వీరౌ కదాఽయోధ్యా గమిష్యతి
యశస్వినీ హృష్టజనా సూచ్ఛ్రితధ్వజమాలినీ. ౧౦

టీక॥ వీరౌ = పరాక్రమశాలులగు రామలక్ష్మణులు; శ్రుత్వైవ = నిద్రించిన; ఉపస్థితౌ = సమీపించినవారలై; యా = (అయోధ్యానగరము) = ఏది; యశస్వినీ = అధికయశముగల కీర్తిగలదియై; హృష్టజనా = సంతోషించినజనులుగలదై; సూచ్ఛ్రితధ్వజమాలినీ = ఎత్తికట్టఁబడినధ్వజంబులపఙ్క్తిగలదై; సా = (అయో

న, నీయయోధ్యాపట్టణమున కెప్పుడు వత్తురో? అని, తాత్పర్యము.

కదా ప్రాంజలిసహస్రాణి రాజమార్గే మమాత్మజౌ
లాజైరవకిరిష్యంతి ప్రవిశంతావరిందమౌ. ౧౩

టీ॥ కదా=ఎప్పుడు; ప్రవిశంతౌ=ప్రవేశించుచున్న; అరిందమౌ=శత్రువులనడంగఁద్రొక్కు-నట్టి; మమ=నా యొక్క; ఆత్మజౌ=కొడుకులను; ప్రాంజలిసహస్రాణి=జనులయొక్క-వేలు; రాజమార్గే=రాజమార్గమందు; లాజైః=పేలాలచేత; అవకిరిష్యంతి=చల్లుదురు?

శత్రువులనడంగఁద్రొక్క-ంజాలినట్టి నాకొడుకులు పట్టణప్రవేశముసేయుచుండఁగా, రాజమార్గంబున, వారలపైఁ వేనవేలజను లెప్పుడు పేలాలు చల్లుదురో? అని, తాత్పర్యము.

ప్రవిశంతౌ కదాఽయోధ్యాం ద్రక్ష్యామి శుభకుండలౌ
ఉదగ్రాయుధనిస్త్రింశౌ సశృంగావివ పర్వతౌ. ౧౪

టీ॥ కదా = ఎప్పుడు; అయోధ్యాం=అయోధ్యాపట్టణంబును; ప్రవిశంతౌ=ప్రవేశించుచున్నవారలను; శుభకుండలౌ= సుందరములయినపోఁగులుగలవారలును; ఉదగ్రాయుధనిస్త్రింశౌ= ఉన్నతములయినధనుస్సులు ఖడ్గములుగలవారలును, కాఁబట్టి; సశృంగౌ=శిఖరములతోఁగూడిన; పర్వతావివ, (స్థితౌ)=పర్వతములవలెనున్నవారలను; తౌ (అధ్యాహృతము)= ఆ రామలక్ష్మణులను; ద్రక్ష్యామి=చూచెదను.

రామలక్ష్మణులు మఱల నిచ్చటికి వచ్చి, సుందరములగు కుండలంబులతోఁ నొప్పుచు, సున్నతంబులగు ధనుఃఖడ్గంబులు ధరించినవారలు గావున, శిఖరవంతంబులగు పర్వతంబులకరణిం జెలరేఁగుచు, నయోధ్యాపట్టణంబుఁ బ్రవేశించుచుండఁగా, నేనెప్పుడు చూడఁగలను. అని, తాత్పర్యము.

కదా సుమనసః కన్యా ద్విజాతీనాం ఫలాని చ
ప్రదిశంత్యః పురీం హృష్టాః కరిష్యంతి ప్రదక్షిణం. ౧౫

పరాక్రమశాలివగుదశరథుఁడా! నేను, బూర్వజన్మమునందు, బిడ్డలుదల్లుల యొద్దఁబాలుద్రాఁగుటకుండఁగా, ఆతల్లుల స్తనములనుభేదించియుందును; ఇంగుసంశయములేదు. అని, తలంచెదను. అని, తాత్పర్యము.

సాహం గౌరివ సింహేన వివత్సా వత్సలాకృతా
కైకేయ్యా పురుషవ్యాఘ్ర బాలవత్సేవ గౌర్బలాత్. ౧౮

టీ॥ పురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవగుదశరథుఁడా! బాలవత్సా=లేఁతదూడగల; గౌరివ=ఆవువలె; వత్సలా= కొడుకునందత్రిప్రేమగల; సా = అట్టి; అహం=నేను; సింహేన=సింహముచేత; గౌరివ=ఆవువలె; కైకేయ్యా = కైకేయిచేత; బలాత్ = బలాత్కారమువలన; వివత్సా=బిడ్డలేనిదానిగాను ; కృతా=చేయఁబడినాను.

పురుషశ్రేష్ఠుండవగు దశరథుఁడా! లేఁతదూడగలయావువలె బిడ్డయందతిప్రేమగలనన్నును, సింహముదూడనుజంపి, ఆవునుదూడలేనిదానిఁగాఁ జేయునట్లు, కైకేయిబలాత్కారమువలన, బిడ్డలేనిదానిఁగాఁజేసినది. అని, తాత్పర్యము

నహి తావద్గుణైర్జుష్టం సర్వశాస్త్రవిశారదమ్
ఏకపుత్రా వినా పుత్ర మహం జీవితు ముత్సహే. ౧౯

టీ॥ ఏకపుత్రా= ఒక్కఁడేకొడుకుగల; అహం= నేను; తావద్గుణైః = అన్నిగుణంబులతోను; జుష్టం= కూడినవాఁడును; సర్వశాస్త్రవిశారదం=సమస్తశాస్త్రంబులందును బండితుండునగు; పుత్రంవినా=కొడుకునువిడిచి ; జీవితుం = బ్రతుకుటకు; నోత్సహే=కోరఁజాలను! నేను, లేకలేక, యొక్కకొడుకునుబెట్టుకొనియున్నాను, లోకంబునఁగల్యాణగుణంబులెన్నిగలవో, వానియన్నిటితోఁ గూడినవాఁడునుసమస్తశాస్త్రంబులందును బండితుండునగు; నాకొడుకునుంగూడవిడిచి, నేనుబ్రతుకంజాలను. అని, తాత్పర్యము.

నహి మే జీవితే కించి త్సామర్థ్య మిహ కల్ప్యతే

("కల్పతే" ఇతి పాఠాంతరం)

అపశ్యంత్యాః ప్రియం పుత్రం మహాబాహుం మహాబలమ్. ౨౦

టీక॥ మహాబాహుం = పెద్దచేతులు గలవాఁడును; మహాబలం = అధికమయినబలముగలవాఁడును; ప్రియం = సంతోషకరుండునగు; పుత్రం = కొడుకును; అపశ్యంత్యాః = చూడకున్న; మే = నాకు; ఇహ = ఇప్పుడు; జీవితే = బ్రతుకుటయందు; సామర్థ్యం = శక్తి; కించిత్ = కొంచెమయినను; న కల్ప్యతే హి = చేయఁబడదుగదా! న కల్పతే హి (పాఠాంతరం) = లేదుగదా!

మహాబాహుండును మహాబలుండునగు ప్రియపుత్రుంజూడకున్న నాకిప్పుడు జీవించుటకేయుపాయమును లేదు.

అని, తాత్పర్యము.

అయం హి మాం దీపయతే సముత్థిత
స్తనూజశోకప్రభవో హుతాశనః
మహీ మిమాం రశ్మిభి రుద్ధతప్రభో
యథా నిదాఘే భగవాన్ దివాకరః. ౨౧

టీక॥ తనూజశోకప్రభవః = పుత్రదుఃఖము కారణముగాఁగల; అయం = ఈ; హుతాశనః = నిప్పు; సముత్థితః = లేచినదై; నిదాఘే = ఎండకాలమునందు; రశ్మిభిః = కిరణములచేత; మహీం = భూమిని; ఉద్ధతప్రభః = అతిశయించినకాంతిగల; భగవాన్ = మాహాత్మ్యముగల; దివాకరో యథా = సూర్యుఁడువలె; మాం = నన్ను; దీపయతే హి = తపింపఁజేయుచున్నదిగదా!

ఎండకాలంబున, నినుమడికాంతిగల భగవంతుండగు సూర్యుండు, కిరణంబుల, భూమినిందపింపఁజేయునట్లు, ఈ పుత్రదుఃఖమునంబుట్టిన యగ్నిహోత్రము ప్రజ్వరిల్లి నన్నుఁ దపింపఁజేయుచున్నది. అని, కౌసల్యవిలపించినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
అయోధ్యాకాండే, త్రిచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.